# ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర




ఈ పటములో 1 మొదలు 25 వరకు కనబడు అంకెలు వీరాస్వామయ్యగారు ౧౮౩౦ – ౧౮౩౧ మధ్య చేసి వచ్చిన యాత్రామార్గమును సూచించుచున్నవి. ఈ అంకెల మధ్య గల ముఖ్యమైన వూళ్లు వజీ వూళ్ళ పట్టికవల్ల తెలియగలవు.

# ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర




నదులు; పర్వతములు.

# ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర

## మజిలీ వూళ్ళ పట్టిక

హిందూదేశ పటములో

| మజిలీ సంఖ్య | నడిమి వూళ్లు. | పుట |
|---|---|---|
| | ౧౮30 సం॥ ౧౦॥ మే నెల ౧౮ | |
| 1. | చెన్నపట్టణము | ౧ |
| | మాధవరము | ౧ |
| | పాలవాయి సత్రం | ౧ |
| | వెంకటేశ నాయిడి సత్రము (పెదపాళెము) | ౧ |
| | తిరువళ్ళూరు (వెంగలి, రామంజేరి) | ౨ |
| | కనకమ్మ సత్రము (కార్వేటి నగరం) | ౨ |
| | బుగ్గగుడి | ౨ |
| | పుత్తూరు | ౨ |
| | వడమాలపేట సత్రం | 3 |
| | అలమేలు మంగాపురం | 3 |
| | మే ౨3. | |
| 2. | దిగువ తిరుపతి | 3 |
| | తిరుపతికొండ | ౪ |
| | మే 30. | |
| | కరకరంబాడు | ౫ |
| | శెట్టిగుంట | ౬ |
| | బాలపల్లె | ౬ |
| | కోడూరు | ౬ |
| | వోగంబాడు | ౭ |
| | పుల్లంపేట | ౭ |
| | నందలూరు | ౭ |
| | అత్తిరాల | ౭ |
| | భాకరాపేట | ౭ |
| | వోంటిమిట్ట | ౭ |
| 3. | కడప | ౮ |
| | పుష్పగిరి | ౮ |

| మజిలీ సంఖ్య | నడిమి వూళ్ళు. | పుట |
|---|---|---|
| | కాజీపేట | ౮ |
| | దువ్వూరు | ౮ |
| | వంగలి | ౯ |
| | జూన్ ౯. | |
| | అహోబళము | ౯-౧౦ |
| | శ్రీరంగాపురం | ౧౦ |
| | రుద్రవరము | ౧౦ |
| | మహానంది | ౧౦ |
| | బండాతుకూరు | ౧౧ |
| | వెలపనూరు | ౧౧ |
| | ఓంకారము | ౧౧ |
| | వెంపెంట | ౧౨ |
| | ఆత్మకూరు | ౧౨ |
| | నాగులోటి | ౧౫ |
| | పెద్ద చెరువు | ౧౫ |
| | జూన్ ౧౬. | |
| 4. | శ్రీశైలము | ౧౩-౨౦ |
| | భీముని కొల్లము | ౨౧ |
| | పెద్ద చెరువు | ౨౧ |
| | జూన్ ౨౦. | |
| | నివృత్తి సంగమం (కృష్ణ దాటడం) | ౨౧ |
| | ముసలిమడుగు | ౨౨ |
| | జూన్ ౨౧. | |
| | సిద్ధేశ్వరం ఘాటు | ౨౩ |
| | పెంటపల్లి | ౨౪ |
| | పానగల్లు | ౨౫ |
| | చిన్నమంది | ౨౫ |
| | వనపర్తి | ౨౬ |
| | గణపురం | ౨౭ |

| మజిలీ సంఖ్య | నడిమి వూళ్ళు. | పుట |
|---|---|---|
| | చోళీపురము | ౨౬ |
| | మనోజీపేట | ౨౬ |
| | జడచర్ల | ౨౭ |
| | నాగనపల్లె లేక బాలనగరం | ౨౮ |
| | జానంపేట లేక భరక్కనగరం | ౨౯ |
| | షాపురం | ౨౯ |
| | **జూన్ ౨౯.** | |
| 5. | హయిదరాబాదు | ౩౨-౪౦ |
| | బేగంబజారు | ౩౩ |
| | **జూలై ౮.** | |
| | శికిందరాబాదు | ౩౫ |
| | గోలకొండ | ౩౬ |
| | **జూలై ౨౦.** | |
| | మేడిచలక | ౩౮ |
| | మాసాపేట | ౪౦ |
| | బిక్కనూరుపేట | ౪౧ |
| | కామారెడ్డిపేట | ౪౨ |
| | మల్లుపేట | ౪౨ |
| | యీదలవాయి | ౪౩ |
| | జగనంపల్లె | ౪౪ |
| | వేములవాడ | ౪౫ |
| | దూదుగాం | ౪౫ |
| | స్వర్ణ | ౪౫ |
| | ఆర్మూరు | ౪౫ |
| | రామనపేట | ౪౬ |
| | **జూలై ౩౧.** | |
| | (గోదావరి దాటడం) | |
| 6. | నిర్మల | ౪౬-౫౦ |
| | (కుశదర్పణము) | |
| | **ఆగస్టు ౨.** | |
| | వొడ్డూరు | ౫౧ |
| | ఇచ్చోడా | ౫౨ |

| మజిలీ సంఖ్య | నడిమి వూళ్ళు. | పుట |
|---|---|---|
| | యేదులాబాదు | ౫౨ |
| | (పిన్నగంగ దాటడం ౫౪) | |
| | ధనోరా | ౫౩ |
| | కాయరా | ౫౪ |
| | వోణి | ౫౫ |
| | వరోడా | ౫౬ |
| | నాగిరి | ౫౭ |
| | మాండుగాం | ౫౮ |
| | చింది | ౫౮ |
| | గూంగాం | ౫౯ |
| | తాకిలిఘాటు | ౫౯ |
| | **ఆగస్టు ౧౪.** | |
| 7. | నాగపూరు | ౬౦-౭౩ |
| | **ఆగస్టు ౨౧.** | |
| | కామిటి | ౬౩ |
| | **ఆగస్టు ౨౬.** | |
| | రామటెంకి* | ౭౪-౭౫ |
| | దొంగలతళావు | ౭౬-౭౮ |
| | కురాయి* | ౭౮ |
| | గర్ర | ౭౮ |
| | చావిడి* | ౭౯ |
| | శిమినీ | ౮౦ |
| | నారాయణగంజు* | ౮౦ |
| | గణేశగంజు* | ౮౦ |
| | చప్పారా | ౮౦ |
| | ధూమా* | ౮౧ |
| | లక్కనాడాన్ | ౮౧ |
| | రాయచాడు* | ౮౪ |
| | జాబానది | ౮౫ |
| | పిప్పర* | ౮౬ |
| | **సెప్టెంబరు ౬.** | |
| | (నర్మదానది దాటడం) | |

*దారిలోవున్న చిన్నవూళ్ళ జాబితాలు ఆయా పుటలలో వున్నాయి.

| మజిలీ సంఖ్య | నడిమి వూళ్ళు | పుట |
|---|---|---|
| | తిలవారా | ౮౭-౯౦ |
| | సుమతి | ౮౭ |
| | **సెప్టెంబరు ౮.** | |
| 8. | జబ్బల్పూరు | ౯౧-౯౪ |
| | **సెప్టెంబరు ౧౩.** | |
| | గోసలపూరు* | ౯౪ |
| | పెన్నగరు | ౯౫ |
| | సలమాబాదు* | ౯౬ |
| | మురువారా* | ౯౮ |
| | డెవురి | ౯౮ |
| | సభాగంజు | ౯౯ |
| | గుణవారా * | ౯౯ |
| | మైహారు* | ౧౦౦ |
| | అమరాపాటన్* | ౧౦౮ |
| | పల్నా | ౧౦౮ |
| | **సెప్టెంబరు ౨౨.** | |
| 9. | రీమా* | ౧౦౯-౧౧౪ |
| | రాయపూరు | ౧౧౪ |
| | సత్తిని* | ౧౧౫ |
| | మనగాం | ౧౧౫ |
| | మౌగంజు* | ౧౧౫ |
| | హనుమానా* | ౧౧౬ |
| | కటుకరి | ౧౧౬ |
| | కట్రా (డ్రమన్గంజు) | ౧౧౭ |
| | లాలుగంజు | ౧౧౮ |
| | **సెప్టెంబరు ౨౯.** | |
| 10. | మిరిజాపూరు | ౧౧౯-౧౨౨ |
| | **అక్టోబరు ౯.** | |
| | వింధ్యవాశిని | ౧౨౨-౧౨౫ |
| | గోపీగంజు | ౧౨౫ |
| | అండ్యాసరాయి | ౧౨౬ |
| | జానీసరాయి | ౧౨౭ |
| | **అక్టోబరు ౧౨.** | |
| 11. | ప్రయాగ (అలహాబాదు) | ౧౨౮-౧౫౫ |
| | **అక్టోబరు ౨౩.** | |
| | గంగానదిమీద ప్రయాణం * | ౧౫౩ |
| | **అక్టోబరు ౨౭.** | |
| 12. | కాశీ (హరిద్వారము, గంగోత్రి బదరీనారాయణం, బదరీకేదారము ౧౭౬ కాశ్మీరము ౧౭౭) | ౧౫౫-౧౭౮ |
| | **డిసంబరు ౧౭.** | |
| | గయకు ప్రయాణం | |
| | గాజీపూరు | ౧౭౯-౧౮౦ |
| | చప్రా, బకుసరు, ఆరా, దానాపూరు, బాకీపూరు | ౧౮౦ |
| | **డిసంబరు ౨౮.** | |
| 13. | పట్నా ౧౭౮,౧౮౧,౧౮౩-౧౮౫, ౨౦౩, (జ్వాలాముఖి ౧౮౬-౭, దేవప్రయాగ ౧౮౭) | |
| | **౧౮౩౧ వ సం॥ రం॥ జనవరి ౧.** | |
| | పునః పునః నది | ౨౦౩ |
| | నీమా నదామా | ౨౦౩ |
| | జానా | ౨౦౩ |
| | చెలా | ౨౦౪ |
| | **జనవరి ౪.** | |
| 14. | గయ | ౨౦౪-౨౩౧ |
| | సాహెబు గంజు | ౨౦౫ |
| | (మగధదేశంలో మహాస్థలాలు* ౨౨౪ కాశీనుంచి గయకు దారి * ౨౨౪) | |
| | **ఫిబ్రవరి ౧౭.** | |
| 15. | పట్నా మళ్ళీచేరుట | ౨౩౧ |


*దారిలోవున్న చిన్నవూళ్ళ జాబితాలు ఆయా పుటలలో వున్నాయి

| మజిలీ సంఖ్య | నడిమి వూళ్ళు. | పుట |
|---|---|---|
| | **మార్చి ౫** | |
| | గంగానదిపైన ప్రయాణం | ౨౩౨ |
| 16. | మూంగేరి (మాంఘీరు) | ౨౩౪ |
| | సీతాగుండం | ౨౩౪ |
| | జాంగీరు (జాంగీరాబాదు) | ౨౩౬ |
| | (బాతా వైద్యనాథం ౨౩౭-౨౩౮) | |
| | కహాలుగాం | ౨౩౯ |
| | భాగల్పూరు | ౨౪౦ |
| | **మార్చి ౧౭.** | |
| 17. | రాజామహాలు | ౨౪౦ |
| | బదరుగంజు | ౨౬౨ |
| | పటకాబాడి | ౨౬౩ |
| | **ఏప్రిల్ ౧** | |
| 18. | కృష్ణనగరు | ౨౬౬ |
| | నదియ్యా, నద్యా, నవద్వీపము | ౨౬౭ |
| | శాంతిపూరు (సమతిపూరు) | ౨౬౭ |
| | హుగ్గలి | ౨౬౮ |
| | అచానకు (బారకపూరు) | ౨౬౮ |
| | శ్రీరాంపూరు | ౨౬౮ |
| | **ఏప్రిల్ ౯.** | |
| 19. | కలకత్తా | ౨౬౯-౨౮౦ |
| | (ఆగ్రా, లేక అగరా ౨౭౪) | |
| | (మూర్షిదాబాదు లేక మక్సూదాబాదు ౨౬౭, ౨౭౫, ౨౭౬) | |
| | **జూన్ 3.** | |
| | వుడుబడియా | ౨౮౦ |
| | బాగునా | ౨౮౨ |
| | సీదావాట్లు | ౨౮౨ |
| | డబరా | ౨౮౨ |
| | భద్రికాళి | ౨౮౩ |
| | రాణీసరాయి | ౨౮౪ |
| | జైలేశ్వరం-పట్టణా | ౨౮౪ |

| మజిలీ సంఖ్య | నడిమి వూళ్ళు. | పుట |
|---|---|---|
| | బస్తా | ౨౮౪ |
| | బాలేశ్వరం | ౨౮౫-౨౮౭ |
| | సూరంగు | ౨౮౮ |
| | భద్రిక | ౨౮౯ |
| | అకులాపదా | ౨౯౦ |
| | మూడియాపాడు | ౨౯౦ |
| | జాజిపురం (నాభిగయ) | ౨౯౦ |
| | గోపాలపూరు | ౨౯౧ |
| | చత్రియా | ౨౯౨ |
| | **జూన్ ౧౮.** | |
| | (మహానది దాటడం) | |
| | కటకం | ౨౯౪ |
| | గోపాలపూరు | 300 |
| | పిప్పిలి | 300 |
| | సత్యవాది | 300 |
| | **జూన్ ౨౧.** | |
| | జగన్నాథము | 3౦౧-3౧౪ |
| | (భువనేశ్వరము 3౦౯) | |
| | **జూన్ ౨౭.** | |
| | నరసింగఘాటు | 3౧౪ |
| | **జూన్ ౨౮.** | |
| | మాణిక్యపట్టణము | 3౧౫ |
| | చిలకసముద్రం (దాటడం) | 3౧౫ |
| | మిరాగుహ్వ | 3౧౫ |
| | మాలుఝా | 3౧౬ |
| | ప్రయాగ | 3౧౭ |
| | **జూన్ 30.** | |
| | గంజాం | 3౧౭-౧౮ |
| | (ఋషికుల్యనది) | |
| | **జూలై ౧.** | |
| | నాయుడిపేట | 3౧౯ |
| 20. | ఛత్రపురం | 3౧౯ |
| | బురంపురం | 3౧౯-౨౦ |

| మజిలీ సంఖ్య నడిమి వూళ్ళు. | పుట |
|---|---|
| **జూలై ౩.** | |
| యిచ్ఛాపురం | ౩౨౧ |
| (గంజాంజిల్లాలోని రేవులు ౩౨౧) | |
| కంచర్ల | ౩౨౨ |
| పలాశీ | ౩౨౩ |
| రఘునాధపురం | ౩౨౫ |
| హరిశ్చంద్రపురం | ౩౨౫ |
| నరసన్నపేట | ౩౨౫ |
| రావులవలస | ౩౨౫ |
| **జూలై ౮.** | |
| 21. శ్రీకాకుళము | ౩౨౮-౩౨౯ |
| (శ్రీకూర్మము ౩౨౮) | |
| **జూలై ౯.** | |
| జెజ్జపురం | ౩౨౯ |
| గిరివాడిపాళెం | ౩౨౯ |
| (గంజాం, విజయనగరము తాలూకాలలోని అగ్రహారాలు, మహాస్థలాలు ౩౨౯) | |
| **జూలై ౧౦.** | |
| విజయనగరం | ౩౨౯-౩౩౧ |
| అలమంద | ౩౩౧ |
| సుబ్బవరం | ౩౩౨ |
| సింహాచలము | ౩౩౨ |
| కసంకోట | ౩౩౨ |
| అనకాపల్లి | ౩౩౩ |
| యలమంచిలి | ౩౩౪ |
| దివ్వల | ౩౩౪ |
| నక్కపల్లి | ౩౩౪ |
| వుపమాకా | ౩౩౪ |
| తుని | ౩౩౫ |
| నాగలాపల్లె | ౩౩౬-౩౩౮ |
| (యానాం, నీలపల్లి, యింజరము, మాదయపాళెము, వుప్పాడా ౩౩౮) | |

| మజిలీ సంఖ్య నడిమి వూళ్ళు. | పుట |
|---|---|
| **జూలై ౨౦.** | |
| పితాపురము | ౩౩౯-౩౪౦ |
| పెద్దాపురము | ౩౪౦-౩౪౧ |
| **జూలై ౨౧.** | |
| రాజానగరము | ౩౪౧ |
| 22. రాజమహేంద్రవరము | ౩౪౨-౩౪౫ |
| (కాకినాడ, కోనసీమ, ధవళేశ్వరం, భద్రాద్రి, కోరంగి ౩౪౩, ౩౪౫) | |
| **జూలై ౨౯.** | |
| (గోదావరి దాటడం) | |
| వాడపల్లి | ౩౪౬ |
| రాల (ర్యాలి) | ౩౪౭ |
| ఆచంట | ౩౪౬ |
| శింగవృక్షము | ౩౪౮ |
| బొండాడ | ౩౪౮ |
| యేలూరిపాడు | ౩౪౮ |
| కలిదండి | ౩౪౯ |
| తుమ్మిడి | ౩౪౯ |
| **ఆగస్టు ౨.** | |
| 23. మచిలీబందరు | ౩౪౯-౩౫౨ |
| **ఆగస్టు ౧౭.** | |
| కొత్తపాళెం | ౩౫౦ |
| (చల్లపల్లి, కళ్లేపల్లి ౩౫౦, ౩౫౨) | |
| **ఆగస్టు ౧౯.** | |
| (కృష్ణానదిదాటడం) | |
| కనగాల | ౩౫౨ |
| (భట్టుపోలు, లంజదిబ్బ | ౩౫౪) |
| చందవోలు | ౩౫౪ |
| బాపట్ల | ౩౫౫ |
| వేటపాళెం | ౩౫౫ |
| చినగంజాం | ౩౫౬ |
| అమ్మనబోలు | ౩౫౭ |

| మజిలీ సంఖ్య నడిమి వూళ్ళు. | పుట |
|---|---|
| అకులల్లూరు | 3౫౬ |
| తెలగపూడి సత్రము | 3౫౭ |
| కరేడు | 3౫౭ |
| కొత్తసత్రము | 3౫౭ |
| బూవ్వుల దిన్నె | 3౫౮ |
| పంటల్లూరు | 3౫౮ |
| కొనేవలూరిసత్రం | 3౫౮ |
| **అగష్టు ౨౫.** | |
| (పినాకినీనది దాటడం) | |
| 24. నెల్లూరు | 3౫౯ |
| **అగష్టు ౨౭.** | |
| మనుబోలు | 3౬౦ |
| గూడూరు | 3౬౦ |
| నాయుడిపేట | 3౬౦ |
| బ్రాహ్మణపుదూరు | 3౬౦ |
| దొరవారి కోనేరు | 3౬౧ |
| మన్నారు పోలూరు | 3౬౨ |
| (కోటపోలూరు) | ,, |
| చిలకలపూడిరామస్వామిసత్రం | 3౬౨ |
| సుళూరుపేట | 3౬౨ |
| గుమ్మడిపూడి | 3౬3 |
| **సెప్టెంబరు ౧.** | |
| పొన్నేరి | 3౬౪ |
| విచ్చూరు | 3౬౫ |
| **సెప్టెంబరు ౨.** | |
| 25. తిరువట్టూరు | 3౬౬-3౬౮ |
| **౧౮3౧ సం॥ సెప్టెంబరు 3.** | |
| చెన్నపట్టణము | 3౬౮-3౭౪ |

సరా:— బ్రాకెట్లలోనివి మజిలీవూళ్ళు కావు. అవి సందర్భానుసారంగా వర్ణింపబడ్డ వూళ్లు.

## సవరణ:

17 వ పుట, 2 వ కాలము, 1–3 పంక్తులలో కర్ణాటకము, ఆర్కాటు నవాబు, రాయజీలను గూర్చిన ఫుట్‌నోట్ వివరణల పుట, ౨౨౦ అని తప్పుపడింది. ౨౦౨ అని దిద్దుకోవలెను.

చెన్నపట్టణ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో నున్న కాశీయాత్ర చరిత్ర
వ్రాత ప్రతిని గురించి వారిపుస్తకాల పట్టీలో వ్రాయబడిన వివరము.

A DESCRIPTIVE CATALOGUE
OF THE
TELUGU MANUSCRIPTS IN THE GOVERNMENT
ORIENTAL MANUSCRIPTS LIBRARY,
MADRAS.

*Vol. VI. Vacanakavyas, Pages 1727–1728.*

No. 1407. కాశీయాత్ర చరిత్ర.

KASIYATRA CARITRA.

Substance, paper. Size, 12½ × 8¾ inches. Pages, 490. Lines, 21 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair and free from mistakes.

Complete.

The following note appears in the beginning of the work:-

"*N. B.*—The printed copy is somewhat abridged from the present one; which was presented to me by the author. This manuscript is given at full length; another copy in my library No. 247 is the abridged one—and the printed edition is yet more retrenched. The present Volume is the best of the three; the alterations afterwards made being not always improvements."

"C. P. Brown 1839"

At the close of the work is made the following note in pencil. "Examined by Appiah and Vencatrow, Reader."

At the end of the MS is pasted a private letter of the Author, Enugula Viraswamí dated 15th December 1831, and addressed to Mr. C. P. Brown. In this letter the Author describes the work as follows:-

"During my last travel to Benares, I took my route in going thro' Cuddapah, Hyderabad, Nagpore, Jabalpore, Mirjapore and Allahabad. In return I came by Gazpore, (Chaprah), Patna, Gyah, Calcutta, Pooree, Ganjam and all the Northern districts, and kept a correct journal of the same. I beg also to inform you that in that journal, I have been giving a correct brief histories of all the Hindoo holy places, rivers, etc., and made several observations upon Hindooism, Mahamadism and Christianity, also upon Hindoo Mitheology and Astronomy. I have also commented shortly upon customs, manners, castes, laws and late Governments of the several places."

# శ్రీ ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర



శ్రీ వీరాస్వామయ్యగారీ పటములో కుడిచేతి ప్రక్క ముందు కుర్చీలో కూర్చుని యున్నారు. వీరి వెనుక కూర్చున్నవారు శ్రీ కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్లగారు. వీరు వీరాస్వామయ్యగారి జీవితమును, కాశీయాత్ర చరిత్రమును 1838 లో అచ్చు వేయించిరి. ఎడమప్రక్క కూర్చున్నవారు శ్రీమాన్ పెంబాకం రాఘవాచార్యులుగారు. వీరందరి వెనుక నిలిచియున్నవారు 1827 మొదలు 1853 వ సంవత్సరము వరకు మద్రాసు సుప్రీము కోర్టులో అడ్వొకేటు జనరలుగా నుండిన శ్రీ జార్జి నార్టన్ గారు. వీరందరును కలిసి 1833 లో చెన్నపట్టణమున హిందూ లిటరరీ సొసైటీని స్థాపించి ప్రజాసేవ చేసి పాశ్చాత్య విద్యాభివృద్ధికి జనకులైరి. ఈపటమును దయతో నొసగిన మద్రాసులోని శ్రీ పచ్చయ్యప్ప కళాశాల ధర్మాధికారులకు వందనములు.

— దిగవల్లి వేంకట శివరావు.

# కాశీయాత్రచరిత్ర



ఏనుగుల వీరాస్వామయ్యవారి

చేత వ్రాయబడి,

కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళగారి

ఉత్తరువు ప్రకారం

## పు.దూరి నారాయణశాస్త్రి చేత

లేఖక [illegible] దిద్దబడి



౧౮౩౮ సం॥ ఏప్రిల్ నెలలో

అచ్చువేయబడిన యీపుస్తకము గవరన్మెంటువారి ఉత్తరవు ప్రకారము

వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాలయందు

పువ్వాడ వెంకటరావుగారి వలన

రెండవ తూరి

ముద్రింపబడినది.

౧౮౬౯ వ సం॥ డిసెంబరునెల

# పీఠిక.



ఇందువల్ల ఈతని విషయములో తెలియపరచుట యేమంటే యేనుగల వీరాస్వామి అయ్యవారలంగారు కాశీయాత్రకు పోవునప్పుడు-యాత్ర సంగతులున్ను ఆయా ప్రదేశముల వినోద సంగతులున్ను వ్రాయించి పంపించవలెనని యడిగినందున వారు ఆలాగే అప్పుడప్పుడు వ్రాయించి పంపగా ఆ సంగతులను పుస్తకముగా చేర్చినాను. అది కరకరంబాటి తహాలా [illegible]-పసలయూరు వెంకట మొదలారి అరవభాషతో తర్జుమా చేయించగా అచ్చు వేయించి ప్రచురము చేయబడియున్నది. అనేక గొప్ప ప్రభువులు తెనుగుభాషతో నావద్దనున్న యీ పుస్తకము ప్రచురము చేయబడితే బహుజనోపయుక్తముగా నుండునని కోరినందున [illegible] చెప్పిన పుస్తకము కాశీయాత్రచరిత్ర యనే పేరుతో అచ్చుమూలకముగా ప్రచురపరచడమైనది.

ఇందులో యాత్ర పోవువారికి వుపయోగించేలాగు మార్గములు, మజిలీలు అచ్చట దొరికే వస్తువులున్ను వ్రాసియుండుట మాత్రమేగాక మార్గముల కిరుపక్కలనుండే అడవులు, కొండలు, పాలాలు, గుంటలు, తోపులు, వూళ్లు మొదలైన వాటి వివరములున్ను మజిలీలలో నుండే స్థలవసతి, గృహవసతి, జలవసతులున్ను మజిలీల సమీప గ్రామముల సంగతులున్ను, కడపల్లూరు, తిరుపతి, అహోబిలము, శ్రీశైలము, కాశి, గయ, జగన్నాథము, శ్రీ కూర్మము, దాక్షా వైద్యనాథము, సింహాచలము, కట్టెపల్లి, శ్రీకాకోళము మొదలైనదివ్య దేశముల మహిమలున్ను, గంగ, యమున, సరస్వతి, ప్రయాగ, గోదావరి, కృష్ణ, సరయు, శోణభద్ర, కర్మనాశిని, గండకి, ఫల్గుని, పునఃపునః నది, సీతాగుండము, బ్రహ్మగుండము, పినాకిని మొదలైన నదుల మహిమలున్ను, హాయిదరాబాదు, నాగపూరు, కటకం, కలకత్తా, రాజమహేంద్రవరం, పట్నా, గంజాం, విశాఖపట్నం, విజయనగరం, మచిలీబందరు, నెల్లూరు, చెన్నపట్నం వగైరా షహరుల సంగతులున్ను, మరిన్ని ఆయా ప్రస్తావములలో అద్వైత ద్వైత విశిష్టాద్వైత మతములు, క్రిస్తు మహమ్మదు మతములు దక్షిణదేశస్థులకున్ను, ఉత్తర

దేశస్థులకున్ను వుండే ఆచారాది భేదములు గౌడ ద్రావిడాది బ్రాహ్మణ జాతి విభజనలు, భూగోళ ఖగోళస్థితి క్రమములు మొదలైన యనేక విచిత్రసంగతులు బహుజనోపకారబుద్ధితో వ్రాయబడి యున్న వాటిలో యీ కొన్ని విషయములను యీ పుస్తకము అచ్చువేసి ప్రచురము చేయపూనుకొన్నందున నా బుద్ధి శక్తి స్వల్పమయినా విధిలేక యథా శక్తిగా వ్రాయడమైనది.

కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళ.

---

## రా మ జ యం

---

రాజశ్రీ యేనుగల వీరాస్వామి అయ్యవాలజాగారు లోకోపకారబుద్ధితో యాత్రసంగతులను వ్రాయునప్పుడు ప్రస్తావములలో అనేకులకు సందేహాస్పదములైన విషయములను గురించి తమసూక్ష్మమయిన బుద్ధిబలముచేత నిష్పక్షపాతముగా ప్రసంగింపుచు తమ చాతుర్యములను బయిలుపరచి యున్నారుగనుక వాటిని చదివేవారు సులభముగా తెలుసుకునేకొరకు ఆ ప్రసంగములకు మొదటనున్ను తుదనున్ను పుష్పములు వుంచి మరిన్ని స్పష్టముగా తెలిసేకొరకయి ఆ ప్రసంగ గ్రంథపంక్తులయొక్క మొదళ్ళనున్ను పుష్పములు వుంచియున్నవి. *అవి అతిసులభముగా చదివేవారికి తెలియుటకై ఆ యా ప్రసంగములు వుండే పుటల లెక్కయున్ను ఆ యా ప్రసంగములయొక్క తాత్పర్య సంగ్రహములున్ను ఈ యడుగున వ్రాయంబడుచున్నవి.

---

* ఈ పుష్పము గుఱుతు ఈ ముద్రణమున వుంచలేదు.

# ప్రసంగతాత్పర్యము



| పూర్వముద్రణమున పుట | | ఈ ముద్రణములోని పుటలు |
|---|---|---|

౫౬. ఇందులో ఆచారాలంకారాహారభేదములు దేశానుసారముగా స్మృతికర్తలు కలుగ చేసినందున వొక దేశస్థుడు మరియొక దేశస్థుని నిందించరాదని చెప్పి అందుకు కాశీదేశమందు భోజనానకు దృష్టిదోషము పరిషేచనము చేసుటవల్ల పనిలేదనుచున్నారనిన్ని, ఉదకము పంచభూతములతో చేరినది గనుక అగ్ని మొదలయిన యితర భూతములకు స్పర్శదోషము లేనట్టు ఉదకానకున్ను పనిలేదనుచున్నారనిన్ని, పర్యుషితాన్న భక్షణము దక్షిణదేశమందు అనుకూలమని అంగీకరింపబడియున్నా వుత్తరదేశస్థులు అంగీకరించలేదనిన్ని దృష్టాంతములు చెప్పబడియున్నవి. ౬౫-౬౭

౫౯. ఇందులో ప్రపంచమందు యే కార్యమున్ను మంచి చెడు కలిసి యుంచున్నదని చెప్పి అందుకు దృష్టాంతముగా హిందువులు మూఢులకున్ను బాలులకున్ను దైవభక్తి కలగవలెనని బింబములయందు దైవత్వమును ఆరోపించితే పరిపాకమందుకూడా ఆ నమ్మికపట్టుబడి దైవముయొక్క అఖండ స్వరూపము తెలియకుండా చేయుచున్నదనిన్ని క్రీస్తుమతస్థులు ఆదిలోనే దైవము సర్వభూతాత్మకమని బోధ చేసుటవల్ల మూఢులున్ను, బాలులున్ను, దైవము కలదనే జ్ఞానమే లేక మునిగిపోతారనిన్ని విధవలకు వివాహము కూడదంటే బాల విధవలు దుఃఖపడుతారనిన్ని, విధవలకు వివాహము కూడునంటే మొగుణ్ని చంపి మరివొకణ్ని పెండ్లాడుతారనిన్ని దృష్టాంతములు చెప్పబడియున్నవి. ౬౮-౭౦

౭౧. ఇందులో పరమాత్ముడు వొక్కడయినా అనేక మూర్తి భేదములుగా పూజించడము బాధకము గాదనిన్ని, సృష్టిసంహారములు చేసే బ్రహ్మరుద్రులకు అవతారము నిమిత్తము

లేకపోయినా స్థితికర్త అయిన విష్ణువుకు రక్షణార్థమై అనేక అవతారములు యెత్తవలసి వచ్చినందున అనేక మూర్తిభేదములు కలిగి ఆ మూర్తులు పూజ్యములయినవనిన్ని వొక విందులో అనేకవిధము లయిన భక్ష్యశాకాదులు చేస్తే భుజించే వారికి వొక్కొక్కదానిమీద రుచికలిగినట్టు భక్తులకు వొక్కొక్క మూర్తిమీద భక్తి కుదురుననిన్ని చెప్పబడియున్నది. ౮-౨-౮౪

౭౪. యిందులో యెట్టివానికిన్ని సరివారిలో తానుగొప్ప పడవలెననే కోరికె కలిగి యుంచున్న దనేటందుకు బోయీలు సవారీ మోసుట ప్రయాసమైనా తమజతలో తాము గౌరవపడవలెనని ప్రియాసపడుట దృష్టాంతముగా చెప్పబడియున్నది. ౮౫-౮౬

౮౮. ఇందులో దాక్షిణాత్యులకున్ను, ఔత్తరీయులకున్ను ఆచారభేదమున్ను ధైర్యస్థైర్య భేదములున్ను కలిగియున్నదనిన్ని దక్షిణదేశము వుష్ణభూమి గనుక అచ్చటివారికి జఠరాగ్నిమందించి అల్పాహారములు భుజించుటవల్ల హృదయకమలము దృఢముతప్పుటవల్ల ధైర్యములేక చాంచల్యము కలిగి వుండుటవల్లనే వారు కడతేరడానకు పెద్దలగుండా రాజోపచారములతో అనేక దివ్యదేశములు కల్పించబడినవనిన్ని ఉత్తరదేశము శీతభూమియైనందున అచ్చటి వారికి అగ్నివృష్టి కలిగి గురువైన వస్తువులను భుజించుటవల్ల ధైర్యస్థైర్యములు గలిగి చిత్తచాంచల్యము లేక జ్ఞానద్వారా కడతేర గలరనే తాత్పర్యముతో విశ్లేషించి దివ్యదేశములు కల్పించబడలేదనిన్ని సయుక్తికముగా చెప్పబడి యున్నది. ౧౦౧౦-౧౭

౯౭. యిందులో సుఖదుఃఖములు కర్మాధీనము లయితే యీశ్వరారాధనవల్ల దుఃఖములు తప్పిపోవునా, పోవా? అని శంకించుకుని కర్మమే ప్రబలమనే టందుకున్ను, యీశ్వరకృపవల్ల ఆపత్తులు నివర్తించు ననేటందుకున్ను శాస్త్ర ప్రమాణములు వున్నందున కర్మము తల్లివంటిదనిన్ని యీశ్వరుడు తండ్రివంటి వాడనిన్ని తల్లి, శిశువు తప్పుచేస్తే వాణ్ని శిక్షించు

పుటలు

నప్పుడు దండ్రి కరుణతో చినట్టయితే ఆ తల్లి శిక్షను తప్పించే
లాగు యీశ్వరుడు కర్మానుభవములను తప్పించుననిన్ని,
మరిన్ని తల్లి శిశువును సకలవిధాలా రక్షించి వాని మంచినడత
లను చెప్పి వానియెడల తండ్రికి మిక్కిలి విశ్వాసము కలగచేసే
లాగున సత్కర్మము యీశ్వరకటాక్షానకు కారణమయినది
గనుక జ్ఞానోదయ మయ్యేవరకు కర్మములను విడవకూడదనిన్ని
చెప్పబడియున్నది. ౧౧౦-౧౧౪

౧౨౧. యిందులో శైవవైష్ణవమతములలో పెద్ద పామరు
లను కూడా తరింపచేయవలెనని వారి నడతలకు అనుకూల
ముగా మీరు సారాయి తాగినా యీశ్వరార్పితము చేసి
తాగండని శాక్తరామానుజ కూట పూజలను కలగజేసినట్టు
ఆత్మహత్య చేయవలెనన్న వారికి యీశ్వరార్పితముగా త్రివేణి
లో దేహత్యాగము విధింపబడినదని చెప్పియున్నది. ౧౩౭-౧౩౯

౧౨౪. ఇందులో స్వామియెడల భృత్యుని న్యాయముగా
నటించుట ఇహపరసాధకమని చెప్పియున్నది. ౧౪౦

౧౨౭. ఇందులో జ్ఞానమే మోక్షమునకు ముఖ్యసాధన
మయినా కర్మద్వారా సాధింపబడిన జ్ఞానమే నిర్విఘ్నముగా
మోక్షమును పొందించుగాని శుద్ధజ్ఞానము బలముకలదిగాదని
సదృష్టాంతముగా చెప్పియున్నది. ౧౪౩-౧౪౪

౧౩౦. ఇందులో సౌరశాక్తాది మతాలు అద్వైత విశిష్టా
ద్వైతద్వైత మతములలో చేరినవనిన్ని దీపదీపికాన్యాయముగా
జగదీశ్వరులకు భేదములేదనుట అద్వైతమనిన్ని, పాలతో కలిసి
యున్న నెయ్యివలె కించిత్తు భేదముకలది విశిష్టాద్వైతమనిన్ని
పాలు పెరుగు మజ్జిగలవలె భేదము కలదనుట ద్వైత
మనిన్ని, క్రీస్తు మహమ్మదు మతస్వరూపమున్ను స్త్రీలకు అధో
భాగమందున్న హృదయగ్రంధి విడి ఊర్ధ్వభాగమందున్న
హృదయగ్రంధి విడనందున మోక్షహేతువైన జ్ఞానము పుట్ట
నందున వారికి మోక్షములేదనిన్ని యితర జంతువులవలె స్త్రీలు
పురుషులకు భోగార్హలేననిన్ని చెప్పబడియున్నది. ౧౪౫-౧౫౦

౧౪౬ యందులో బ్రాహ్మణులు శూద్రజాతిని మిక్కిలి తక్కువ పరచుట యితర మతము వృద్ధిబొందుటకు హేతువాయెన దనిన్ని, పెద్దలు పామర జనులను కడతేర్చవలెనని విగ్రహారాధ నను విధించితే భగవంతునికి హేయములైన వికారపు ఉపచార ములను లోకులు చేయసాగినందుననున్ను బ్రాహ్మణులు మేము శ్రేష్ఠులమని ఇతరవర్ణాలను ధిక్కరించడము వల్లనున్ను వీరి దురాచారములవల్లనున్ను వీరిమొదల భగవంతునికి కటాక్షము తప్పి సత్యము మొదలయిన సుగుణసంపత్తుగల యింగిలీషువారు హిందు దేశము యేలేటట్టు దేవుని కృపకు పాత్రులైనారనిన్ని చెప్పియున్నది. ౧౫౭-౧౫౮

౧౬౬ యందులో గౌడులు సాత్విక దేశమందు నివసించుటవల్ల సత్వగుణము గలిగి మతద్వేషములు లేక అన్యోన్య ముగా వున్నారనిన్ని దాక్షిణాత్యులైన ద్రావిడ్లు మిక్కిలి కర్మశ్రద్ధగలవారయినందున వీరికి మతద్వేషములు హెచ్చయి అన్యోన్యము లేకయున్నారనిన్ని గౌడద్రావిడ్ల విభజన క్రమ మున్ను కేరళస్థులు, చిత్పావనులు, కరాడీలు, గయావళీలు గంగాపుత్రులు శాకద్వీపబ్రాహ్మణులు విశ్వకర్మబ్రాహ్మణులు వీరి సంగతిన్ని బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర జాతి భేద ములు యీశ్వర కల్పితములయితే సకల దేశములయందున్ను యీ జాతిభేదములు వుండవలసినది; అలాగు లేక కర్మభూమి యందు మాత్రమే కలిగియుండుటవల్ల జాతిభేదములు మనుష్య కల్పితములనిన్ని స్మృతులయొక్క విభజన క్రమమును వ్రాసి యున్నది. ౧౯౦-౨౦౨

౧౯౪ యందులో గంగాదితీర్థములనున్ను కాశీ మొద లయిన పుణ్యక్షేత్రములనున్ను పురాణములగుండా సకల పాప నాశకములనిన్ని, ముక్తిప్రదములనిన్ని యేర్పరచి నందుకు కారణమేమంటే పెద్దలు మంచి యోచనగలవారై ప్రపంచ వ్యాపారములలో మునిగియుండే జనులకు తాముచేసిన పాపములు పుణ్యతీర్థములలో స్నానముచేస్తే నివర్తించు ననే ధైర్య

పుటలు

ముతో తీర్థస్నానము చేసి సెమ్మది పడుదురనిన్ని, విరామ దశను పొందదలచిన మనుష్యులు వొక్కచోటనే వుండి మోక్షమును పొందుదురనిన్ని, పురాణములద్వారా తీర్థములకున్ను, క్షేత్రములకున్ను మహిమలు కలగచేసినారనిన్ని పుత్రాదులకు తల్లితండ్రిదులు వున్నట్టుండి చనిపోతే వారి ఋణము తీర్చుకోక పోతిమిగదా అనే పశ్చాత్తాపము తీర్చేకొరకు గయా ప్రజనాదులకు మహిమలు కల్పించినారనిన్ని చెప్పబడియున్నది.

౨౨౧-౨౨౨

౨౦౫ యిందులో క్రీస్తుమతస్థులు దేవుడు వొక్కడయి యుండగా మీ మతములో అనేక దేవతలు గలరని యేలాగు చెప్పుచున్నారని ప్రశ్న చేయగా మాలోనున్న దేవుడు వొక్కడేను. అయితే మీలో సేయింట్సు అనే దేవ సమానులైన పురుషులను ఆరాధించేలాగు మాలోనున్న శివ విష్ణు గణపతి మొదలైన దివ్యపురుషులను ఆరాధింపుచున్నాము గాని దేవుడు వొక్కడే ననేటందుకు సందేహము లేదని చెప్పియున్నది.

౨౩౫-౨౩౮

౨౦౬ యిందులో కొన్ని చోట్ల జలము బియ్యము వుడికే పాటి వేడికలిగి వుండుటకు కారణమేమంటే గంధకములో అగ్ని త్వరగా ఉత్పత్తి కావడము సహజము గనుక ఆ చోట్లు గంధకమయమైనందున జలము ఉష్ణముగా వుంచున్నదని చెప్పబడియున్నది.

౨౩౯-౨౩౬

౨౦౭ యిందులో జగదీశ్వర కటాక్షముగలవారికే అణిమాద్యష్ట సిద్ధులు కలగడానకు హేతువు లయిన మూలికలు సిద్ధించుగాని ఇతరులకు సిద్ధించనేరవని చెప్పబడియున్నది. ౨౩౭-౨౩౯

౨౦౮ యీ గొప్ప ప్రసంగములో మధ్వమతము గయలో వ్యాపించినందుకు కారణమున్ను గయావళీలను నిమంత్రణ చెప్పుటకు హేతువున్ను ఛప్పన్న దేశస్థితిన్ని భూగోళ స్థితిన్ని చతుర్దశ భువనస్థితిన్ని ధ్రువద్వయ స్థితిన్ని దేవరాక్షస స్థితిక్రమమున్ను వైకుంఠాది లోకస్థితిన్ని సముద్రముల

పుటలు.

స్థితిన్ని ద్వీపముల స్థితిన్ని పంచభూత సృష్టిక్రమమున్ను చరా
చర స్థితిగతులున్ను జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థా స్వరూపమున్ను
స్థూలదేహ సృష్టిక్రమమున్ను పంచభూతాల వ్యాప్తిక్రమ
మున్ను బాల్యాద్యవస్థాహేతువులున్ను సత్వరజస్తమోగుణ
కార్యములున్ను స్త్రీలింగ పుల్లింగ నపుంసకలింగ శబ్దముల
విభజనమున్ను శాక్తాదిమత సంకేతస్వరూపమున్ను దేవరాక్ష
సాది సృష్టిభేద హేతువున్ను భగోళస్థితిక్రమమున్ను ప్రతి
దేశానకున్ను అహఃప్రమాణ భేదములున్ను భూమికి చలనము
కలదనేటందుకు హేతువులున్ను చెప్పబడియున్నవి. ౨౪౪-౨౬౨

౨౩౩ యిందులో నాస్తికులు ఈశ్వరుడు లేడు స్వభావము
చేతనే ప్రపంచము జరుగుచున్నదని చెప్పినా వారు జ్ఞానులకు
దూష్యులు కారనిన్ని జ్ఞానులున్ను పరతత్వమనే వస్తువు ఈశ్వరు
డనిగాని ఈశ్వరి అనిగాని స్త్రీలింగ పుల్లింగ ధర్మములు
కలదికాదని చెప్పుచున్నారు గనుక యీ వుభయులకున్ను
పరతత్వమనిన్ని స్వభావమనిన్ని శబ్దభేదమేగాని అర్థభేదము
లేదని చెప్పబడియున్నది. ౨౬౫-౨౬౬

౨౬౦ ఇందులో యీశ్వరుడు పరులకు యీ హిందూ
దేశమును స్వాధీనపరచినందుకు కారణమేమంటే అందరున్ను
అహింస సత్యము మొదలైన సద్గుణములతోనే నటిస్తే తన
చిద్విలాసానకు వ్యతిరిక్తమని యెంచి యిచ్చటి వారికి కామ
క్రోధాదులను వృద్ధిబొందించి తద్వారా బ్రాహ్మణులగుండా
యిచ్చటి క్షత్రజాతిని బొత్తిగా నశింపచేసి వెనక బ్రాహ్మ
ణుల గర్వభంగముకొరకు తురకలను కొన్నాళ్లు వృద్ధిపరచి మళ్లీ
కరుణతో సాత్వికులయిన యింగిలీషువారికి యీ దేశాధికార
మును యిచ్చినాడని చెప్పియున్నది. ౨౭౫-౨౭౬

౨౬౩ ఇందులో మహమ్మదు మతస్థులు బలాత్కార
ముగా యితరులను తమ శాస్త్ర ప్రకారము తమ మతములో
కలుపుకొనుచు క్రీస్తువులనున్ను హిందువులనున్ను నపుంసకులను
చున్నారు. మరిన్ని క్రీస్తువులు తురకలను క్రూరులనిన్ని హిం

పుటలు

మవులను స్థావరములనిన్ని చెప్పి తాము సాత్వికముగా తమ మత బోధన చేయుచున్నారు. హిందువులు తమ మతము శ్రేష్ఠ మయినందున పరులకు బోధించితే వారు గ్రహించచాలరు గనుక వారికి చెప్పమనిన్ని నిజమును కానని వారు పరులకుం బోధింతురనిన్ని అనుచున్నారనే కథనున్ను పుల్లమామిడిపండుకున్ను తీయమామిడిపండుకున్ను భేదమున్నట్టు బ్రాహ్మణునికిన్ని యితర వర్ణాలకున్ను భేదము యీశ్వర కల్పితమనిన్ని వ్రాసియున్నది. ౨౯౭- ౨౯౯

౨౭౬ యిందులో జీవాత్మ ఆత్మ అంతరాత్మ పరమాత్మలయొక్క స్వరూపములను బలభద్రుడు సుభద్ర జగన్నాథస్వామి సుదర్శనమూర్తి అనే నాలుగు బింబాలుగా ఏర్పరచియున్నదనిన్ని అన్నము బ్రహ్మస్వరూపమయినదని లోకులకు తెలిసేకొరకు యిచ్చట జాతి నియమాలు లేకుండా ప్రసాద స్వీకారము విధింపబడియున్నదనిన్ని చెప్పియున్నది. ౩౧౨-౩౧౪

౨౮౨ యిందులో అథర్వణవేదము తక్కిన మూడు వేదములవల్లపుట్టినదే గాని స్వతంత్రము కాదని చెప్పియున్నది. ౩౨౦

౨౯౮ యిందులో మనసుకు దుఃఖములు నివృత్తించి సుఖము కలగవలెనని చేయ నారంభింపబడిన సురాపానము సొచ్చెవున్న బుద్ధిన్ని నశించేటందుకు హేతువైనదనిన్ని స్త్రీలకు పురుషులపై మోహము జనించుటకు పరిచయమే కారణమనిన్ని యిందుకు దృష్టాంతముగా వాడుక అన్ని వస్తువులతోనున్ను సంబంధింప చేయుచున్నదని యింగిలీషు వారు చెప్పిన నీతివాక్యమున్ను వ్రాయబడియున్నది. ౩౩౮

౩౦౯ యిందులో వాంతిభేది మొదలయిన రోగములు వొక యింట అనేకులకు సంభవించుటకు కారణమేమంటే వొకనికి ఆ వుపద్రవము ప్రాప్తించగానే సన్నిహితులు దిగులు పడుటవల్ల వారికిన్ని ఆ వుపద్రవము సంభవింపుచున్నదని చెప్పియున్నది. ౩౫౧

౩౨౨ యిందులో ఈశ్వరుడు తల్లిదండ్రులవలె ప్రత్యక్షముగా రక్షింపుచునున్నా ప్రత్యక్షము కావలెనని తపస్సులు చేయడము పొరపాటు మని చెప్పియున్నది. ౩౬౬

## యీ దిగువ వ్రాయబడిన షహరుల సంగతులు

వివరముగా వ్రాయబడి యున్నవి.


| పాతముద్రణం పుటసంఖ్య | గొప్పషహరులు | ఈ ముద్రణం పుట | పాతముద్రణం పుటసంఖ్య | గొప్పషహరులు | ఈ ముద్రణం పుట |
|---|---|---|---|---|---|
| ౨ | దిగువ తిరుపతి | ౩ | ౨౫౯ | కటకం | ౨౯౪ |
| ౨౭ | హాయిదరాబాదు | ౩౨ | ౨౬౫ | జగన్నాథము | ౩౦౧ |
| ౫౨ | నాగపూరు | ౬౧ | ౨౮౦ | గంజాం | ౩౧౭ |
| ౭౯ | జబ్బల్‌పూరు | ౮౭ | ౨౯౦ | విజయనగరము | ౩౨౯ |
| ౮౮ | మైహారు | ౧౦౦ | ౨౯౯ | పిఠాపురం | ౩౩౯ |
| ౧౦౫ | మిరిజాపూరు | ౧౧౯ | ౩౦౧ | రాజానగరం | ౩౪౧ |
| ౧౧౩ | ప్రియాగ | ౧౨౮ | ౩౦౧ | రాజమహేంద్రవరం | ౩౪౨ |
| ౧౩౭ | కాశి | ౧౫౫ | ౩౦౭ | మచిలిబందరు | ౩౪౮ |
| ౧౫౭ | పట్నా | ౨౩౧ | ౩౧౨ | బాపట్ల | ౩౫౫ |
| ౧౬౪ | మూంగేరి | ౨౩౪ | ౩౧౩ | వేటపాలెము | ౩౫౫ |
| ౧౭౯ | గయ | ౨౦౪ | ౩౧౩ | చినగంజాం | ౩౫౬ |
| ౨౩౭ | కలకత్తా | ౨౬౯ | ౩౧౬ | నెల్లూరు | ౩౫౯ |
| | | | (౩౨౪ | చెన్నపట్టణము | ౩౭౪) |


Specimen page of
Mss in Govt. Oriental Manuscripts Library
No. 1407

యిది ఏనుగుల వీరాస్వామి అల్లించిన కాశీయాత్ర చరిత్ర
18 May 1830 ప్రతి నెంబరు ౧

౧౮౩౦ సంవత్సరం మేనెల ౧౮ ది కుజవారం రాత్రి ౯ ఘంటలకు చంన్నపట్నం వదిలి ప్రయాణమయి మాధవరం అనె గ్రామములో రాత్రి నిలిచినాను. మాధవరం తండయారువేడులో వుండే నా తోటకు మూడు ఘడియల దూరం కీనీరుభూమి. మాధుర్యమయిన వుదక సమృద్ధి కలదు. ద్రావిడ వైష్ణవులు కాపురం. క్రిషిమీద లక్ష్యంలేదు. సమిధలు వగయిరా పట్నంలో అమ్ముకుని జీవనం చేసేవారు. దోవలో వుప్పుకయ్య వుంన్నది. ఆ వుప్పుకాలువకు వారధి కట్టివుంన్నది. దాటి తావలశ్నిది.

22/12/1969

# ఏనుగుల వీరాస్వామయ్యవారి జీవిత చరిత్ర *

రచయిత: శ్రీ కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్ళగారు

ఈ చెన్నపట్టణపు కాపురస్థుడయిన శ్రీవత్స గోత్రోద్భవుడైన యేనుగుల సామయమంత్రి మూర్ధన్యునకు పుత్రుండగు యేనుగుల వీరాస్వామయ్యవారితోను బహుదినములు సహవాసము చేసి స్నేహితుడనై యుండిన నేను, ఆయన చేసిన కాశీయాత్ర చరిత్రలోని సంగతులను వ్రాసేటందుకు ముందుగా ఆ పురుషుని చర్యలను తెలిసిన మట్టుకు చెప్పక పోదునేని ఆయన విషయమై న్యాయము నడిపించిన వాడను కాకపోదు నన్న భయముచేత వాటిని పూర్తిగా వర్ణింపను శక్తి యోగ్యతలు లేని వాడనైనా పూనుకోవలసి వచ్చినందున వాటిలో కొన్నింటిని సంగ్రహముగా వర్ణించినవాడ నౌచున్నాను.

యేనుగుల వీరాస్వామయ్యగారికి తొమ్మిదవ యేట పితృవియోగము సంభవించెను. అప్పుడు ఆయనకు తల్లివినాగా వేరే పోషకులు లేక యుండిరి. తండ్రి వుంచిన ఆస్తిన్ని మితముగానే యుండెను. పండ్రెండవ యేట యింగిలీషు బహు వేగముగా చదవ శక్తిగలిగి యుండినందున అప్పుడు ఆయన వాలంటీరుగా వుండిన బోర్డు ఆఫు త్రేడు అనే ఆఫీసులో నుండే యగ్జామినరులు యిద్దరున్ను ఆయనను రీడరుగా వుంచుకోవలెనని వివాదపడుచు వచ్చిరి. దానివల్ల ఆ వయస్సులో ఆయనకు కలిగియుండిన సామర్థ్యము తెలియవచ్చుచున్నది. పదమూడవ యేట తిర్నవల్లి కలక్టరు కచ్చేరీలో యింటరు ప్రీటరుగా నున్ను ట్రాన్సులేటరుగానున్ను రెండు సంవత్సరములు వుండి పదియేనవయేట పట్టణమునకు వచ్చి చేరెను. అటు తర్వాతను కొన్ని సంవత్సరములవరకున్ను యింగిలీషు హావు

---

* ఈ జీవిత చరిత్రను శ్రీ కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్ళగారు రచియించి కాశీయాత్ర చరిత్రలో చేర్చి 1838 లో అచ్చు వేయించారు. ఇంకా ఇతర వివరాలకు పీఠిక చూడండి.

(సులు) *యేజన్సీలు గొప్ప జమీందారులు వీరితోవర్తకసరళిగా వ్యా(సంగము)*చేయుచువచ్చి †వాయర్ హావుసులో బొక్కీ-పకీరుగావుండి హెడు కౌంటాంటు అయి తర్వాత సుప్రీంకోర్టు § యింటేరు ప్రీటరు పనిలో ప్రవేశించినారు. అప్పుడు బోర్డు ఆఫు త్రేడు ఆఫీసువారు ఆయన యెడల తమకు కలిగియుండే విశ్వాసమునకు గురుతుగా ముక్కుపొడి వేశే బంగారుడబ్బి యొకటి బోర్డు శక్రేటరి మూలముగా సుప్రీంకోర్టు జడ్జీగారి శెలవుమీద ఆయనకు యిప్పించినారు.

ఆయన తనకు పరులు స్వల్పోపకారము చేసినా వారియెడల జరిగించిన మేలు చెప్ప నలవిగాదనుటకు ఆయన తిరుణామలకు వెళ్ళినప్పుడు ఆ గుడిలో తనవలెనే స్వామి దర్శనమునకు వచ్చిన ప్రజలకు సహాయముగా నుండే యొక బంట్రోతు తనకు జాగ్రతగా స్వామి దర్శనము చేయించినందుకు వాని మంచి నడతలను

---

* నాకు దొరికిన ప్రతిలో బ్రాకెట్లలోని అక్షరాలు చిరిగిపున్నాయి.

† మనదేశంలో వర్తకం చేయడానికి వచ్చి ప్రభువులైన ఇంగ్లీషు వర్తక సంఘంవారు చాలా కాలం వరకూ దేశపరిపాలనతో పాటు తమ వ్యాపారం కూడా జరుపుతూనే వుండేవారు. అందువల్ల ప్రభుత్వ కచ్చేరీలతో పాటు వ్యాపార కార్యాలయాలుకూడా వుండేవి. బోర్డుఆఫ్ త్రేడు కుంపినీవారి వర్తక శాఖకు సంబంధించిన కార్యాలయము. వాయర్ హావుసు అనగా సరకులకొట్టు.

§ ప్రస్తుతం చెన్నపట్నంలో వున్న హైకోర్టు 1862 లో స్థాపింపబడింది. అంతకుపూర్వం దీని స్థానే రెండు ఉన్నతకోర్టు లుండేవి. ఒకటి ఇంగ్లీషురాజు అధికారంక్రింద స్థాపింపబడి ఇంగ్లీషు న్యాయశాస్త్రం ప్రకారం కేసులు విచారించే పరమోన్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టు. రెండవది ఇంగ్లీషుకంపెనీవారి అధికారంక్రింద స్థాపింపబడి మనదేశంలో హిందూ మహమ్మదీయుల ధర్మశాస్త్రాల ప్రకారం కేసులు పరిష్కరించే జిల్లాకోర్టులపైన అధికారం గలిగిన సదరు అదాలతు కోర్టు. ఈ రెండు కోర్టులలోను ఒక్కొక్క ప్రధాన న్యాయమూర్తి, ఇద్దరేసి సాధారణ న్యాయమూర్తులు వుండేవారు. రెండు కోర్టులలోను ఇంగ్లీషును అరవము తెనుగు మొదలైన భాషలలో తర్జుమా చేసే ఉద్యోగు లుండేవారు. వారినే 'ఇంటర్ ప్రిటర్'లు అనేవారు. వీరాస్వామయ్యగారీ పనిలో 1819 లో ప్రవేశించారు.

యిచ్చటి రివిన్యూబోర్డువారికి శుశ్రుతపరచి వానికి వెండిబిళ్ళయున్ను ఒక వరహాయెక్కువ జీతమున్ను కలిగేలాగు చేసినది సాక్షిభూతముగా నున్నది. ఆస్థలమునకు అష్టబంధనము చేయించి గజదానము చేసినారు. యిది వారి శక్తికి మెచ్చయిన కార్యముగా అందరికిన్ని తెలియవలశినది. అక్కడి కలకటరు ఆయననున్ను ఆయనతో కూడా వచ్చిన మరికొందరు ప్రభువులనున్ను చూచి మీరందరున్ను కూడి యిక్కడి దేవునికి రథముకట్టిస్తే బాగా వుండునని చెప్పగా అప్పట్లో ఆ ప్రభువులందరున్ను అలాగే చేయుచున్నామని ఆయనగుండా అనిపించి అక్కడినుంచి పట్టణమునకు వచ్చిన తర్వాత ఆ ప్రభువులు ఆ కార్యమును గూర్చి సదరహీ అయ్యవారితో మెచ్చరించడమే మానుకొనిరి. అయ్యవారు తాను మంచిదని చెప్పినందున ఆకార్యము తన శక్తికి మించినదైనా అపరిమితమైన ధనవ్రయము చేసి రథము కట్టించి తన మాటను కాపాడు కొన్నారు. యిందువల్ల ఆడినమాట కాపాడుటకై శక్తికి మించిన కార్యములను సాధింపుచు వచ్చినారని స్పష్టముగా తెలియు చున్నది. వారు కాశీయాత్రి వెళ్ళినప్పుడు నేను ఆ రథానకు యిసన గొలుసులు జాగ్రిత పెట్టి గవరన్మెంటు వారిగుండా వాటికి రంగువూయించిన సంగతి స్వల్ప సహాయమైనా దాన్ని అనేక ప్రికరణములలో నుదాహరించి గొప్పగా కొనియాడిరి. యీలాగు స్వల్పోపకారములను గొప్పగా కొనియాడుచూ వచ్చినందున యితరులకు విశేష కార్యముల యెడల ప్రవృత్తి కలుగుచూవచ్చెను.

ఒక్క సంవత్సరమునకు అధికముగానే వారు ప్రతి ద్వాదశిన్ని భక్ష్యభోజ్య ఫలాజ్య దధి ప్రాజ్యములయిన బ్రాంహ్మణారాధనలు చేసి తర్వాత తాను ద్వాదశి పారణ చేయుచు వచ్చినారు. ఆ సంతర్పణలు యీ పురమందు మహోత్సవములుగా నుండినవి. అన్నప్రదానమందు వారి చాతుర్యమున్ను జాగ్రితయున్ను వర్ణింప శక్యంబులు గావు. వొక్క స్థలమందు ఏక పాకములో ఏకాపోశనముగా వొక్క లోపమున్ను లేకుండా మూడు

నాలుగు వేల బ్రాహ్మణులు భుజించునప్పుడు తా నొక పరిచారకుని కంటే సులభుడుగా నటించెను. అందరికిన్ని అనేక విషయములలో కాలయాపన మాచున్నది. ఆ పురుషుడు ఇట్టి సద్విషయమందు, శ్రమను యెంచక స్వల్పకాలమును వ్రియపరచినది పరలోకగతు డైనా వున్నట్టే కొనియాడబడేలాగు చేయుచున్నది. ఇట్టి సత్కార్యము చేసినవారికి అది కీర్తి హేతువు కావడము మాత్రమేగాక యితరులకున్ను ఆలాటి కీర్తి యెడల సుబుద్ధి కలుగుటకు కారణ మవుచున్నది.

యీ పురమందు క్షయమాస *విషయ మయి మహాసభ కూడినప్పుడు అయ్యవారు తన పక్షమును శ్రుతి స్మృతి ప్రమాణములతో స్థాపన చేయగా ఆ సభవారు మిక్కిలి సంతోషపడి అందుకు చిహ్నగా అయ్యవారికి రత్నహారమును బహుమతిచేసి వారి సద్గుణములను వొక పత్రికలో వ్రాసి ఆయనకు పంపిరి.

---

* దక్షిణదేశములో చాంద్రమానము సౌరమానము కూడా వ్యవహారంలో వున్నాయి. ఉత్తరదేశంలో బార్హస్పత్యమానము మాత్రం వ్యవహారంలో వుంది. సౌరమాన సంవత్సరానికి 365 దినముల 15 గడియల 31 విగడియలు ఉంటాయి. చాంద్రమాన సంవత్సరములో 360 దినములున్ను, బార్హస్పత్యమాన సంవత్సరానికి 361 దినముల 11 గడియలున్నూ వుంటాయి. అందువల్ల ఈ మూడు మానముల ప్రకారం గుణించబడే పంచాంగాలకు తేడా ఉండితీరాలి. అయితే దక్షిణదేశంలోని దైవజ్ఞులు చాంద్రమానాన్ని సౌరమానంతో సరిపుచ్చడానికి మనపంచాంగాలలోని అధిక క్షయ తిథులలాగనే అధిక క్షయ మాసాలు కల్పించారు. ఒకొక్క సంవత్సరంలో అధికమాసం అని పేరుపెట్టి ఒక మాసాన్ని చేర్చి సంవత్సరానికి 13 నెలలు చేస్తారు. ఇలాగ సరిపుచ్చుకుంటూ వస్తూంటే కొన్ని సంవత్సరా లయ్యేటప్పటికి చాంద్రమాన సంవత్సరంలో ఒక నెల తగ్గిస్తేనేగాని సౌరమాన సంవత్సరానికి సరిపోవని పరిస్థితి తటస్థిస్తుంది. అంతట మన దైవజ్ఞులు, పండితులు, సభచేసి ఏ నెలను లెక్కలోనుంచి తీసివేయవలెనో నిర్ణయిస్తారు. అట్టిమాసానికే అనహస్పతి క్షయమాస మంటారు. అంతట ఆ క్షయమాసం లెక్కలోకిరాక తరువాత వచ్చేమాసంలో కలిసిపోగా ఆ సంవత్సరంలో 11 నెలలే వుంటాయి. శాలివాహనశక 1744 చిత్రభాను సం॥లో పుష్యమాసము క్షయ మాసముగా నిర్ణయించబడింది. అది క్రీస్తుశకము 14-12-1822 కును 11-1-1823 కును మధ్య కాలమున వచ్చిన మార్గశీర్ష మాసమునకు సరిపోతున్నది. (స్వామి కణ్ణు పిళ్ళగారి ఎఫిమిరిస్ చూడండి.)

ఆయన వుద్యోగములో నుండిన కాలము వరకు ఆ కోర్టు జడ్జీలకు తృప్తిగా నడుచుకొన్నారనే టందుకు దృష్టాంతముగా పెద్ద జడ్జీ యయిన సర్ రాల్ఫు పాల్మరు దొరగారు * ఆయనకు వ్రాసి యిచ్చిన టెష్టిమోనియాల్ అనే యోగ్యతాపత్రికలో విశేష ముగా ఆయన కోటుజాలోనున్ను, చేంబరులోనున్ను అలసట లేక బహు నెమ్మదితో పనులు నడుపుచు వచ్చె ననిన్ని, ఆయన తన గొప్ప వుద్యోగపు పనులను మిక్కిలీ నమ్మకముగా జరిపించె ననిన్ని మరిన్ని ప్రజల మేలును కోరి స్మృతిచంద్రిక మొదలైన కొన్ని పుస్తకములకు తాంర్జుమా చేసెననిన్ని నే నెరిగినంతలో గవరణమెంటువారి విశేషకృపకు యీ పురుషుడు పాత్రుడయి నట్టు హిందు పెద్ద మనుష్యులలో మరి ఎవరున్ను యెక్కువైన వారు లేరని దృఢముగా నాకు తోచి యున్నదనిన్ని వ్రాయబడి యున్నది.

లోకములో గంగాస్నానమునకు వెళ్ళిన పురుషుడు తన తల్లి దండ్రులకు గంగ తెచ్చి యివ్వడము వాడికె బడియున్నది. యీ మహాపురుషుడు గంగను పడవలు బండ్లు కావళ్ళు వగయిరాల మీాద తెచ్చి యీ దేశములో నుండే నాలుగు వర్ణాల వారిలో నున్నుంచే గొప్పమనుష్యులగుండా ఆ యా వర్ణాములలోని ముఖ్యుల పేళ్ళు తెలుసుకొని వారి కందరికి గంగనున్ను జగన్నాథ పట ప్రసాదములనున్ను యిప్పించెను. అందువల్ల అందరినిన్ని తన బంధుసమానులుగా చూచే వారని స్ఫుటముగా తెలియుచున్నది. ఆయన యాత్ర బోవునప్పుడు ♦ నేను సకృదావృత్తి అక్కడి వినో దములను వ్రాయించి పంపించవలె నని అడుగు కొన్నందుకు

* సర్ రాల్ఫ పాల్మర్ గారు మద్రాసుసుప్రీము కోర్టులో 18-7-1824 తేదీన న్యాయమూర్తులలో నొకడుగ నియమింపబడినారు. 28-1-1825 వ తేదీనప్రధాన న్యాయమూర్తి యైనారు. ఈయన 25-10-1835 వ తేదీన పని చాలించు కొన్నారు.

♦ వీరాస్వామయ్యగారు మద్రాసునుండి 18-5 1830 వ తేదీన యాత్రకు బయలుదేరి 3-9-1831 వ తేదీన తిరిగి వచ్చినారు.

యాత్రలో ప్రతిదినచర్యలనున్ను ఆయా ప్రస్తావములలో జగదీశ్వరుడు తనకు తోపచేసిన తాత్పర్యములనున్ను మార్గమందు పరుల వల్ల తాను చెందిన సహాయములనున్ను, తనవలె యాత్రకు పోవువారు మార్గములో పూర్వముగానే జాగ్రత పెట్టుకొనవలసిన విషయములనున్ను క్రమముగా అప్పుడప్పుడు వ్రాసి పంపుచు వచ్చిరి. ఆ పుస్తకమును చూచుటవల్ల యాత్రకుబోయి చూచి తెలియవలసిన సంగతులన్నీ తెలియుచున్నవి. ఆ పుస్తకము పనయూరి వెంకు మొదలారిగుండా అరవములో తర్జమా చేయించబడి అచ్చువేయించబడి యున్నది. నాగపూరి వీరాస్వామి మొదలారి మహారాష్ట్రముతో భాషాంతరము చేయించినాడు. ఆ మహారాష్ట్ర పుస్తకమును నాగపూరి రిసైడెంటుగారు తాను యింగ్లీషుతో త్రాన్సులేషన్ చేసి ప్రసిద్ధి పరచ తలచి అయ్యవారిని సెలవు అడిగినందుకు వీరు నేనే భాషాంతరము చేయించి పంపుచున్నానని తెలియజేసి కొంత భాషాంతరము చేయించినారు. భగవంతుని కృపవల్ల కొదవయున్న యే పుణ్యాత్ముల గుండానయినా పూర్తి కావచ్చును.

నందనసంవత్సరపు క్షామము * లో నేను కొంత ధాన్య సంగ్రహము చేసి వుంచడము మేలని చెప్పినందుకు అయ్యవారు మనము ధాన్యము సంగ్రహించి మనము మట్టుకు భుజించి అన్నాతురులై దుఃఖపడే పేదలను చూచుచు జీవించుట అప్రయోజకము గనుక తనప్రయోజనమునకు గాను విస్తరించి జాగ్రత పెట్టుకొన రాదని చెప్పి ఆ దుర్భిక్షములో శక్తి వంచన లేకుండా తాను అన్నప్రదానము చేయుచు యితరులను స్వప్రయోజనమునకు అనుసరించేలాగు అనుసరించి వారినిన్ని పేదల పోషణ విషయమై ప్రవర్తింపజేయుచు ఆ లాగు ప్రవర్తించిన వారిని తాను మిక్కిలీ కొనియాడి సంతోషపెట్టుచు వచ్చిరి.

---

*నందననామ సంవత్సరపు కరవు 1832-3 మధ్య వచ్చింది. దీనికి గుంటూరు కరవు అనికూడా పేరు.

అందువల్ల మరికొందరున్ను అన్నదానమందు ప్రవర్తించుచు వచ్చిరి. మరిన్ని గంజిదొడ్డి యనే అన్నసత్రములో గవరన్మెంటు వారు అపార ద్రవ్యమును బదల అన్నప్రదాన విషయమై ఖర్చుచేసినప్పుడు అయ్యవారు ఆ ధర్మవిచారణ ప్రభువులలో తాను వొకడుగానుండి పేదలకు కాలములో విమర్శగా అన్నమును అందచేసేకొరకై పడిన శ్రమ చెప్ప శక్యముకాదు. అది యేలాగంటే ౧౦౦౦ ౨౦౦౦ తూముల బియ్యమును ప్రతిదినమున్ను పాకము చేయించి తన దృష్టిపథములో పేదలను శ్రమపడనీయకుండా రెండుజాములకు లోగానే అన్న మంతయు వినియోగపరచుచు వచ్చిరి. మరిన్ని తన బుద్ధి శక్తిని యావత్తున్ను రాత్రిన్ని పగలున్ను ఆ కార్యము విషయమై వాడుచు వచ్చిరి.

ఇదిగాక అయ్యవారు నాతో ఒక ప్రస్తానములో చెప్పియుండే యొక సంగతి మిక్కిలి ప్రయోజనకారిగా తోచినందున యీ అడుగున వ్రాయుచున్నాను. వొక పురుషుడు విస్తరించి ద్రవ్యము నార్జించిపెట్టి తాను సద్వ్రియము చేయకుండా చనిపోవుట నిష్ఫలమని యున్ను చనిపోవువారు తమకు పిమ్మట జరగవలసిన కార్యములను వ్రాసే మరణశాసనములు అనేకముగా తన వుద్యోగమును పట్టి త్రాన్సులేషన్ చేయవలసి వచ్చి నందున ఆ వ్రాసినవారి తాత్పర్యములనున్ను వారు జీవించి యుండగా చేయుచు వచ్చిన కృత్యములనున్ను వారికి యీ లోకవిషయమై యుండిన తాత్పర్యములనున్ను వారు వ్రాసిన మరణశాసనములు వారి మరణాంతరము ఆ తాత్పర్యానకు సంబంధించకపోవుటనున్ను వారు స్వప్నావస్థలో గూడా చూడనివిగానున్ను యెట్టి బుద్ధిమంతులకున్ను యీలాగు సంభవించు నని ఊహించ కూడనివిగానున్ను వుండే అనేక విషయములు సంభవించడమున్ను తాను తెలుసుకొన్నందున తన మనసుకు లోకరీతి బాగా తెలిసి పరలోకదృష్టి ప్రబల మవుచు వచ్చిన దని చెప్పినారు.

మరిన్ని తన కూతురి వివాహమందు "అన్నస్య క్షుధితః పాత్రి" మనే వచనప్రకారము అన్నానకు ఆకలిగొన్నవా రందరున్ను పాత్రులని యోచించి అందుకు ఆక్షేపించినవారినిన్ని సన్మతిపెట్టి సమస్తజాతులకున్ను అన్నప్రదానము చేసినారు. దీనివల్ల ఆయన సర్వ సమదృష్టిగల పురుషుడని స్పష్టముగా తెలియవచ్చుచున్నది. కొందరు యీ వివాహ విషయమై ద్రవ్యమును వ్రయపరచుట కంటె చిన్నదానికి ఆస్తిగా వుంచుట మేలని అయ్యవారితో చెప్పినందుకు ఆయన చిన్నదాని పోషణకొరకు ద్రవ్యమును మనుష్యాధీనముగా నుంచుటకు ప్రతిగా యీశ్వరునిచేత నేను వుంచుచున్నానని చెప్పి అపారముగా అన్నదానము చేసినారు.

ఈ చెన్నపట్టణమందు హిందు లిటరెరి సొసయిటి యనే విద్వత్సభను తాను కల్పనచేసి దాన్ని వృద్ధిపొందించను యిచ్చటి గొప్ప మనుష్యులను స్వంతపనికి అనుసరించేలాగు అనుసరించి వారి వారికి ఇష్టములయిన విద్యావిషయము లన్నీ యీ సభవల్ల సిద్ధించునని అనేక మార్గములను కనుపరచుచు వారి కందరికిన్ని యీ సభమీద శ్రద్ధ వృద్ధిబొందేలాగు చేయుచు వచ్చిరి. *

అయ్యవారు తన వుద్యోగమును వదలుకొని విరామదశను బొందవలెనని తన్ను యేలుచునుండిన సుప్రీం కోరటు పెద్ద జడ్జీయైన సర్ రాబర్టు కమిన్ దొర♦గారికి వ్రాసుకొన్నప్పుడు ఆ కోరటు అడ్వొకేటు జనరల్ జార్జి నార్టను దొరగారు అయ్యవారియొక్క అతి చాతుర్య విశిష్టమయిన ద్విభాషిత్వ క్రమములను విస్తరించి చెప్పినంతలో జడ్జిగారు తానున్ను అయ్యవారి సుగుణములను బహుతరముగ తెలియపరచునప్పుడు యీ వుద్యోగమును యీ పురుషుడు నడిపినట్టు నడిపే శక్తిమంతులను నేను యిదివరలో చూడ

* దీనిని గూర్చిన తప్పీలుకు పీఠిక చూడండి.

♦సర్ రాబర్టు బక్లే కమిన్ గారు మద్రాసు సుప్రీముకోర్టులో 31—12—1835 వ తేదినుండి 17—1—1842 వ తేదివరకు ప్రధాన న్యాయమూర్తిగా నుండేవారు.

లేదనియున్ను యీ పురుషుడు యీ వుద్యోగమును వదలుట యీ
కోరుటుకు బహు నష్ట మనిన్ని వ్యసనపూర్వకముగా సెలవిచ్చి
నారు. జడ్జీగారు యీలాగు చెప్పే పాటియోగ్యతతో అయ్యవారు
తన వుద్యోగమును జరుపుకొన్నారు.

అయ్యవారు తాను జీవించి యుండిన కాలమువరకున్ను కీర్తి
ప్రతిష్ఠా హేతువులయిన సత్కార్యములను అనేకముగా జరిగించి
తుదను నిర్యాణకాలము సంభవించినపుడు తీర్థయాత్రా ఋగ్యజు
స్సామవేదత్రయ పారాయణాది సత్కర్మ ప్రభావ పరిశుద్ధాంతః
కరణులై పరమేశ్వర కరుణాకటాక్ష లబ్ధతత్వావబోధచేత మాతృ
భ్రాతృ పుత్రికా భార్యా సుహృన్మిత్ర బంధువులయెడల నుండిన
స్నేహపాశములను మూషికా జాలచ్ఛేదన న్యాయముగా ఛేదించి
యీషణత్రయ రహితులై దేహ లోక శాస్త్రవాసన లనే వాసనా
త్రయమునున్ను అవిద్యాస్మితా రాగద్వేషాభినివేశంబు లనియెడు
పంచక్లేశములనున్ను జయించి నిస్సంగులై వానప్రస్థాశ్రమ ప్రతి
నిధిగా కొన్ని దినములు ఆరామవాసము చేసి మహావాక్యార్థ
విచారణవల్ల సచ్చిదానందఘనమయిన బ్రహ్మకున్ను తనకున్ను
భేదము లేదని తెలిసి సోహంభావన జేయుచు నుండి యిష్టులుగా
నుండిన వారిని తనకు ఆపత్సన్యాసము సిద్ధింప చేయవలె నని బహు
తరముగా ప్రార్థించి తన స్నేహ సంబంధికులయిన వారికి అనేక
విధవివేక హేతువు లగు వాక్యములను బోధచేసి సమ్మతి పరచి
నిర్యాణదినమందు బహిరంగమయిన ఆపత్సన్యాసమును స్వీకరించిన
ముహూర్తములోనే యోగాసనాసీనులయి ప్రణవానుసంధానము
చేయుచు ప్రాణోత్క్రమణ క్షణ పర్యంతమున్ను పూర్ణమయిన
తెలివి కలిగియుండి, ఆత్మ నిత్యుడు దేహము అస్థిర మనియున్ను
తెలిసిన వారు గనుక, దేహము వదలుటవల్ల వ్యసనమును చెందక
సంతోషముతో అనాయాసముగా శాలివాహన శకంబు ౧౭౬౦
అగు దుర్ముఖి సంవత్సర భాద్రపద బహుళ పక్షాష్టమీ సౌమ్య

వారము నాడు * ఉదయాన స్థూలదేహము వదిలి లింగ దేహముతో పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మలోక నివాసమును పొందినారు.

కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళ

---

* దుర్ముఖి సంవత్సరము శాలివాహన శకమున ౧౭౬౦ లో రావడం లేదు. అది ౧౭౫౮ లో వచ్చుచున్నది. ౧౭౬౦ అనునది పొరపాటు అని తోస్తూవున్నది. శాలివాహనశక ౧౭౫౮ దుర్ముఖిసంవత్సర భాద్రపద బహుళ ౧. సోమవారము నకు సరియైన ఇంగ్లీషు తేది 1836 వ సంవత్సరము అక్టోబరు 3 వ తేది అవుతున్నది. - స్వామి కణ్ణుపిళ్ళెగారి ఇండియన్ ఎఫెమిరిస్ చూడండి.

శ్రీరామజయము.

శ్రీ ఏనుగుల వీరాస్వామయ్యగారి

# కాశీయాత్ర చరిత్ర

## మొదటి ప్రకరణము :

జగదీశ్వరుండు నాచేత కొంత దేశాటనము జేయింప దలచి నన్ను నేలుచున్న సుప్రీంకోర్టు * దొరలగుండా సెలవిప్పించినాడు గనుక నేను కాశీయాత్ర బోవలెనని ౧౮౩౦ సంవత్సరము మే నెల ౧౮ వ తేది కుజవారము రాత్రి ౯ ఘంటలకు చెన్నపట్టణము విడిచి మాధవరము జేరినాను. అది తండయారువీడులోనుండే నాతోటకు 3 గడియల దూరము. కీనీరుభూమి, మధురమయిన జలసమృద్ధిగలది. ద్రావిడ వైష్ణవుల నివాసము. వారు సమిదెలు వగయిరాలు చెన్నపట్టణములో అమ్మి జీవింపుచున్నారు. దోవలో ఉప్పుకయ్యాయున్నది. అందులో కాక్రేను దొర పడవలు నడిచే పాటికాలువ త్రొవ్వించి వారధులు కట్టించి యున్నాడు.

౧౯ తేది ఉదయాన అక్కడనుండి పాలవాయి సత్రము మీదుగా వెంకటేశ నాయడి సత్రము చేరినాను. అది శిథిలమై యున్నది. తటాకమున్నది. అంగళ్ళు గలవు. అది మాధవరమునకు ౫ గడియల దూరము. దోవసరాళము. బండ్లు నడుచును. ఆ రాత్రి పెద్దపాళెము చేరినాను. దోవలో కొరతలేరు దాటవలెను. దగ్గిర దగ్గిర గ్రామాలున్నవి. బాట సరాళము. ఆ పాళెములో శక్తిరూపముతో పరమాత్ముడు తామస పూజల నంగీకరించి లోకుల కిష్టసిద్ధిని జేయుచున్నాడు. ఆ శక్తి చిన్న లింగము జాడగా భూమిలో నుద్భవించి యున్నది. ఆ గుడి బహుచిన్నది. శూద్రపూజ. ఆ పాళెము అరణ్యనదీ తీరము. వాసయోగ్యము. బ్రాహ్మణాగ్రహారము, శివాలయము, పలపట్రిల యిండ్లున్నవి. ఈ పాళెము, పై సత్రానికి ఆమడదూరము.

---

* 'సుప్రీంకోర్టు' చెన్నపట్టణమున క్రీ.శ. 1800 మొదలు 1862 వరకు అనగా మద్రాసు హైకోర్టు స్థాపింపబడువరకు నుండిన ఉన్నత న్యాయస్థానము. దీనిలో ఒక ప్రధాన న్యాయమూర్తి ఇద్దరు సహాయ న్యాయమూర్తులు నుండేవారు.

౨౦ తేది పగటిమీద నక్కడనుండి తరలి రాత్రి తిరువళ్ళూరు చేరినాను. దోవ సరాళము. మళ్ళి కొరతలేరు దాటవలెను. దోవలో పెంగలియనే గ్రామమువద్ద సత్రమున్నది. తిరువళ్ళూరు విష్ణుస్థలము. హృత్తాపనాశిని యనే తీర్థమున్నది. అందులో ప్రార్థనలవారు బెల్లము వేయుచున్నారు. ఆ తీర్థస్నానము స్మృతులయందు మహా ప్రాయశ్చిత్తములలో ముఖ్యముగా చెప్పబడియున్నది. అది పేట స్థలము. అన్ని వస్తువులు దొరుకును. అదిపై పాళెమునకు ౨౪ ఆమడ దూరము.

౨౧ తేది పగటిమీద రామంజేరి మార్గముగా రాత్రి నగరి సత్రము చేరినాను. ౨ ఆమడదూరము. దారిలో నాగ నది దాటవలెను. రామంజేరివద్ద దోవ రాతిగొట్టు; మిగత సరాళము. నగరి సత్రము బొమ్మకంటి శంకరయ్య కట్టించినది. పేట స్థలము. కోమట్లు సంపన్నులు. అగ్రహారమున్నది. అది మొదలుకొని కార్వేటినగరము వారిసీమ. సత్రపు కోనేటినీళ్లు లెస్సయున్నవి.

౨౨ తేది పగలు బుగ్గగుడి చేరినాను. బాట సరాళము. ౧౪ ఆమడ. పుణ్యక్షేత్రము. శాశ్వతముగా మూడు జలధారలు - గంగా, యమునా సరస్వతు లనిపించుకొని గుడికింద స్రవించి అరణ్యానదిలో పడుచున్నవి. కాశీగుడిరీతిగా మూర్తులకు పేర్లుగలిగియున్నవి. దగ్గర గ్రామములు, యిండ్లు లేవు. పదార్థములు దూరమునుండి తెచ్చుకొని గుడివద్ద తోపులో వంట చేసుకొనవలెను. రమ్యప్రదేశము. అరణ్యానదీతీరము. ఆ రాత్రి నగిరిమీదుగా పుత్తూరు చేరినాను. ౧౪ ఆమడ దూరము. నగిరివద్ది కనమ దాటవలెను. అది రాతిగొట్టు బాట. ౪ గడియల దూరము ప్రయాస; అవతల సరాళము. నగిరి పేట స్థలము. ముసాఫరులకు అన్ని వస్తువులు దొరుకును. అక్కడ వెంకటేశ నాయుడి కొడుకు గొప్ప సత్రము కట్టను యత్నము చేయుచున్నాడు. పుత్తూరిలో మునియప్పిళ్ళ సత్రమున్నది. బ్రాహ్మణులకు గోసాయిలకు బైరాగులకు సదావృత్తి యిచ్చుచున్నారు. అక్కడ కుంఫిణీవారు దొరలకు ముసాఫరుఖానా కట్టియున్నారు. చిన్న పేట

స్థలము. రమ్య ప్రదేశము. చుట్టు కొండలున్నవి. కావలసిన వస్తువులు దొరుకును. బ్రాహ్మణుల యిండ్లున్నవి. మంచినీళ్ళ గుంటయున్నది.

౨౩వ తేది అంజాలమ్మ కనమదాటి వడమాలపేట సత్రము చేరినాను. ఆమడ దూరము. అక్కడి కనమ రాతిగొట్టయినా నడచుట నిండా ప్రయాసగాదు. అక్కడ అంజాలమ్మ అనే శక్తి ప్రతిమ పందిటికింద యుంచబడియున్నది. అందులో పరమాత్మ చైతన్యము ప్రతిఫలించి ప్రార్థించినవారి యిష్టసిద్ధిని జేయుచున్నది. బాట సరాళము. ఆ సత్రము కొల్లా పెద్దసామిశెట్టి కట్టించినది. విశాలముగా నున్నది. బ్రాహ్మణులకుమాత్రము సదావృత్తి యిచ్చుచున్నారు. పేట బస్తీ యైనది. కోమట్లు విస్తరించి యున్నందున వారు విరాళము వేసుకొని గోసాయిలకు బైరాగులకు సదావృత్తి యిచ్చుచున్నారు. తద్వారా సత్రమునకు యశస్సు కలిగియున్నది. కనకమ్మ సత్రము మొదలుకొని యిదివరకు కార్వేటి నగరమువారి సీమ. ఆరాత్రి అలమేలు మంగాపురము మీదుగా దిగువ తిరుపతి చేరినాను. ఆమడ దూరము. దోవలో సువర్ణముఖరి యనే నదియున్నది. బాట సరాళము. కొంతదూరము చెరువుకట్టమీద నడవవలెను. దోవలో కొన్ని బస్తీ గ్రామములున్నవి. అక్కడ ౮ దినములుంటిని. అందులో నొకనాడు వెంకటాచలపతి దర్శనార్థమై కొండ యెక్కి దిగినాను. మరునాడు కపిలతీర్థములో సమారాధన చేసినాను. దిగువ తిరుపతిలో గోవిందరాజులగుడి కోదండరామస్వామి గుడియు నున్నవి. రామస్వామిగుడికి సరకారు తుమ్మక్కు కొంచమైనా లేదు. గోవిందరాజులగుడి ఆచార్య పురుషుల అధీనముగా నున్నది. అయినా సర్కారు విచారణకలదు. త్రిమతస్థులయిండ్లు ౨౦౦ దనుక గలవు. గురునాథశెట్టి స్మార్తులకు అన్నసత్రము పెట్టియున్నాడు. మునియప్పిళ్ళ ౧౫ మంది చిన్నవాండ్లకు పాఠకశాల యేర్పరచి అన్నంపెట్టి వేదము చెప్పించుచున్నాడు. చందులాలా ♦ వగయిరా ముగ్గురు పుణ్యాత్ములు గోసాయీలు వగైరాలకు సదావృత్తి యిచ్చుచున్నారు. మూడు రామానుజకూటము లున్నవి.

---

♦ చందులాల్ హైదరాబాదులో దివాన్ పేష్కారు.

వాటిలో వైష్ణవులకు ప్రతిదినము ప్రసాద మిచ్చుచున్నారు. తిరుపతి భారీగ్రామము. అన్ని వస్తువులు దొరుకును. అన్ని పనివాండ్లు కలరు. పంగులూరు గురునాథ శెట్టి వగైరా సాహుకార్లు వున్నందున మహా రుస్థలమురీతిగానున్నది. కోతుల తొందరకలదు. నరసింహ తీర్థ జలమే పానార్థముగాని వేరే లేదు. ౨ గడియల దూరములో కపిలతీర్థ మున్నది. అది రమ్యప్రదేశము. గంగధార సదా పడుచు కింద తటాక ముగా నిలిచియున్నది. చుట్టు విశాలమైన మంటపము కట్టియున్నది. అది బ్రాహ్మణ సమారాధనకు యోగ్యమయినది. ఆచుట్టుపక్కల దేశ స్థలములలో చందులాలా ధర్మములు నిండాగా జరుగుచున్నవి. గాలి కాలము గనక కొండమీద నొక్క పగ లుంటిని. దిగువతిరుపతికి కొండ మీద స్వామిగుడి ౧౪ ఆమడ. గాలిగోపురమువరకు నెక్కడము, దిగ డము బహుప్రయాస. ఆవల కొంతభూమి సమముగా నున్నది. మళ్లీ యెక్కడము, దిగడము కలిగియున్నా అంత ప్రయాస కాదు. దారిలో నిలుచుటకు జలవసతి గల మంటపాలు చాలా గలవు. గాలిగోపురము వద్ద నొక్క బైరాగి శ్రీరామవిగ్రహపూజ చేయుచు, వచ్చినవారికి మజ్జిగ మొదలైనవి యిచ్చి ఆదరింపుచున్నాడు. వెంకటేశ్వరునికి ప్రార్థ నలు చెల్లించే లోకులవలన కుంఫిణీవారికి సాలుకు సుమారు లక్షరూపా యీలు వచ్చుచున్నవి*. కొండమీద యేధమైన కార్యము చేసుటకున్న

---

* నూరేండ్లనాటి దేవాదాయాలు, ధర్మాదాయాలు:—ఇంగ్లీషు వర్తక కంపెనీ వారు మనదేశాన్ని ఆక్రమించిన తరువాత చాలాకాలం వరకు హిందువుల దేవా లయాలను తురకల మశీదులను కాపాడుతూ వారి ధర్మాలను స్వయంగా పరిపాలించే వారు. దీనిని గురించి కొన్ని కట్టుబాట్లు చేస్తూ క్రీ. శ. 1810 సం॥లో సంగ రాష్ట్రి ములో నొక శాసనం చేశారు. అలాగే మద్రాసులో 1817 వ సంవత్సరపు 7 వ రెగ్యులేషను అనబడు చట్టాన్ని శాసించారు. ధర్మాదాయాల సొమ్మును రివిన్యూతో పాటు జిల్లాకలెక్టర్లే వసూలుచేసి దేవుడి ఉత్సవాలు, అర్చనలు, భోగాలు స్వయంగా జరిపించేవారు. మిగిలిన సొమ్ము కుంపినీ వారి ఖజానాలోకి చేరేది. ఈ కలెక్టర్ల పైన రివిన్యూ బోర్డువారికి పైతనిఖీ అధికారం వుండేది. మన దేశంలో ఇంగ్లీషువారి అధి కారం బలపడినకొద్దీ దేశ ప్రభుత్వంలో క్రైస్తవ మిషనరీల పలుకుబడి ఎక్కువ కాసాగింది. ఈ క్రైస్తవుల ప్రభుత్వం ఇలాగ హిందువుల విగ్రహారాధనను, తురకల మశీదులను ప్రోత్సహించడం అసభ్యంగా వున్నదని మిషనరీలు ఇంగ్లాం

సర్కారుకు రూక యివ్వవలెను. అచ్చట పరమాత్ముఁడు సంపూర్ణకటాక్షముతో లోకుల పాపములను వారివిత్తముగుండా హరించి యిష్టసిద్ధిని చేయుచున్నాడు. కొండమీద శ్రీనివాసమూర్తి దివ్యమంగళముగా నున్నది. దేవతలో దేవతలంతవారో, పూర్వము ఆ మూర్తిని ఆరాధించినట్టు తోచుచున్నది. అచ్చట గోసాయి బైరాగులకు గురుపీఠముగా నుండే మహంతు మఠ మొకటి అతివిశాలముగా కట్టియున్నది. ఆ మహంతుకు శిష్యార్జన విశేషించికలదు. కొండమీద యిండ్లు సంకుచితములుగా నున్నవి. చైత్రము మొదలు జ్యేష్ఠమువరకు ఉదయాన చలిగాలి కొట్టుచున్నది. దానివలన శీతజ్వరాది రోగములు పుట్టుచున్నవి. కోతులతొందర హెచ్చు. అడవిపందులు నిరుపద్రవముగా మనుష్యులనడుమ సంచరింపుచున్నవి. గాలికాలములో మనుష్యులు నిండా కొండమీద నుండరు.

30 శేదిరాత్రి ఆమడలో నున్న కరకరంబాడు చేరినాను. తిరుపతి వగైరా ఊళ్ళు కానలికిగాను ఆ కరకంబాడున్ను, యింకా కొన్ని గ్రామాలున్ను అచ్చటి పాలెగానికి కుంఫిణీవారు జారీగా నడిపించు

తులో ఆందోళన చేయగా 1833 మొదలు కుంపినీవారు దేశీయ మతములతో జోక్యం కలిగించుకో కూడ దనే భావంతో ప్రవర్తింపసాగినారు. గాని తిరుపతి స్థానం మొదలయిన దేవస్థానాల పరిపాలన మాత్రం ఎప్పటిలాగునే కుంపినీ ఉద్యోగులు నిర్వహించేవారు. తుదకు 1843 లో కుంపినీ వారు తమ వశంలో వుండిన దేవాలయాలను మఠిములను కొందరు ప్రయివేటు వ్యక్తులకు కొన్ని సంఘములకు ఇచ్చివేశారు. ఆ ధర్మాదాయముల తాలూకు తమవద్ద నిల్వయుండిన అక్కులాది ద్రవ్యం మాత్రము ఇచ్చివేయలేదు. ఆసందర్భంలోనే తిరుపతి దేవస్థానాన్ని అప్పటి మహంతుకిచ్చారు. అంతట ఈ ధర్మాదాయాలు, సరియైన కట్టుబాటులేక పాడైనాయి. ఈ ధర్మాలు నశిస్తూవున్నా ధర్మకర్తలు సొమ్మును ఎంత దుర్వినియోగం చేస్తూవున్నా కుంపినీవారు జోక్యం కలిగించుకోకుండా వుపేక్షించారు. 1817 వ సంవత్సరపు శాసనమునుబట్టి తోనిని. సక్రమంగా నిర్వహించవలసిన బాధ్యతను గాలికి వదలివేశారు. ఈ అరాజకం ఇరవై సంవత్సరాలు జరిగింది. తరువాత 1863లో ఒక క్రొత్త ధర్మాదాయములచట్టం శాసించబడింది. ఈ చరిత్రంతా 1871 లో మద్రాసు గవర్నరు కవున్సిలు మెంబరైన కాంబాకం రామయ్యంగారు వ్రాసియున్నారు. (31-12-1872 తేదీగల మద్రాసు గవర్నమెంటు జుడీషియల్ ప్రొసీడింగ్సు చూడండి)

చున్నారు. ఆయూరు వసతిగాకపోయినా అవతల మహారణ్యము గనుక విధిలేక అక్కడ దిగవలసి యున్నది. పోష్టాఫీసు వున్నది. యథోచితముగా వస్తువులు దొరుకును. ముసాఫరుఖానా యున్నది.

౩౧ తేది ౯. ఘంటలకు శెట్టిగుంట చేరినాను. దోవ మహారణ్యము, రాతిగొట్టు, మిక్కిలి దొంగలభయముగలది. నడమ మామండూరు కృష్ణాపుర మనే రెండు పాళెగాండ్ల గ్రామాలున్నవి. వారి సహాయము లేక మాతుబలులు నిర్భయముగా ఆ యడవి దాటలేరు. కలకటరులు ఆదోవను నిర్భయముగా చేయను చేతగాక నున్నారు. మామండూరికి ఈవల ౫ గడియల దూరాన బాలపల్లె యున్నది. అది మొదలు కడపజిల్లా సరహద్దు. బాలపల్లెలో ముసాఫరు ఖానా యున్నది. ఆ భూమిజలము బహురోగ ప్రదము. అచ్చట రెండుమూడు నదుల వంటి కాలువలు దాటవలెను. కనమ యొకటి దాటవలెను. బాట బహు రాతిగొట్టు. ఎక్కడు దిగుడుగా నున్నది. అక్కడ బహు దట్టమయిన వెదురడవి. ఆ శెట్టిగుంటలో మంచినీళ్ళ చెరు వున్నది. రెండు బ్రాహ్మణుల యిండ్లున్నవి. పేటస్థలము. అన్నివస్తువులు దొరకును. బాలపల్లెమొదలుకొని కడప కలకటరు అడవికొట్టి బాట వెడల్పుచేసి అక్కడక్కడ ఠాణా లుంచియున్నాడు. కరకరంబాడినుండి ఆ పాళెగాండ్లను మంచితనము జేసుకొని యిరువైమంది తుపాకీల వారిని శెట్టిగుంట దనుక తెచ్చినాను. నాడు ౬ ఘంటలకు శెట్టిగుంట విడిచి ఆమడ దూరములో నున్న కోడూరువద్దనుండే అగ్రహారమువద్ది సత్రము జేరినాను. కోడూరు బస్తీ. పేటస్థలము. ముసాపరుఖానా యున్నది. బ్రాహ్మణ గృహములేదు. పై యగ్రహారమందు యేమిన్ని దొరకదు. అంగళ్ళులేవు. ఆ బ్రాహ్మణులు పరోపకారులు గాదు.

జూన్ ౧ తేది ౫ ఘంటలకు లేచి ఆమడ దూరములో నున్న వోరంబాడు ౯ ఘంటలకు చేరినాను. అది పేటస్థలము. అన్ని వస్తువులు దొరుకును. ముసాఫరుఖానా యున్నది. బాట సరాళము. శెట్టిగుంటనుంచి కోడూరికి అడవిలో దండుబాట యొకటి పోవుచున్నది. పల్లెలమీదుగా కాలిబాట యొకటి పోవుచున్నది. కాలిబాటలో న్యవా

రీలు రావచ్చును. అడివిభయము కోడూరితో సరి. అవతల భూమి తెరపగా నున్నది. దగ్గిరదగ్గిర గ్రామాలు, పైరుపొలాలు, జలసమృద్ధిన్ని భాటలో కలిగియున్నవి. అంతటయున్ను చింతచెట్లు గలవు. బాలపల్లె వద్ది కొండవాగునీళ్ళు నా బోయీలు వగైరాలు తాగినందున నొక బోయిన్ని, ఒక కావటివాడున్ను జ్వరము తగిలి ఖాయిలాపడిరి. గనుక దగ్గిరి నోరంబాడిలో మధ్యాహ్నము నిలిచినాను. పై బాలపల్లెవద్ది వాగువద్ద శ్రీనివాసమూర్తికి పాద మొకటి చేసియున్నది. అక్కడ నుంచి పడమటి దేశస్థులు కొండ యెక్కుచున్నారు. ఆ దినము 3 ఘంటలకు లేచి ౮ గడియల దూరములో నున్న పుల్లంపేట గడియ ప్రొద్దు ఉండగానే చేరినాను. అది పేటస్థలము. ముసాఫరుఖానా యున్నది. బ్రాహ్మణుల యిండ్లు గలవు.

౨ తేది రాత్రి 3 ఘంటలకు లేచి ౨ ఆమడ దూరములో నున్న సందలూరు చేరినాను. భాట సరాళమే. ఊరివద్ద చెయ్యారనే నది గడియ దూరము వెడల్పు కలిగియున్నది. నదికి నిరుపక్కల గుళ్లున్నవి. అది పుణ్యక్షేత్రము. పరశురాముని మాతృహత్య నివర్తించిన స్థలము. అక్కడికి ౨ ఘడియలదూరమందు అత్తిరాల యనే మహా స్థలము అగ్రహారసహితముగా నున్నది. ఊరు తురకలతో నిండి యున్నది. ముసాఫరుఖానా కలదు. పేటస్థలము, సకల వస్తువులు దొరుకును. బ్రాహ్మణుల యిండ్లు వసతిగా నున్నవి. ఆ దిన మంతయు అక్కడనే యుంటిని.

3 తేది రాత్రి ౨ ఘంటలకు లేచి ౯ ఘంటలకు ౨ ఆమడ దూరములో నున్న భాకరాపేట చేరినాను. దోవ మంచి దయినను రాతిగొట్టు. కొండపక్కను భాట పోవుచున్నది. పొడిచెట్ల అడివి. దోవలో వొంటిమిట్ట యనే గ్రామ మున్నది. అక్కడ నాల్గు పక్కల కొండలే కట్టగా గల్గిన యొక్క భారీ చెరువున్నది. చెరువు కట్టమీద భాట. ఆ వొంటిమిట్టలో చూడ వేడుక లయిన గుళ్ళున్నవి. ముసాఫరుఖానా యున్నది. బస్తీ గ్రామము. ఆ భాకరాపేట పేటస్థలము. అన్ని వస్తువులు దొరుకును. అంతటా రాళ్ళున్నవి. వసతి యయిన

బ్రాంహ్మణ గృహము లేదు. నాడు 3 ఘంటలకు లేచి రాత్రి ౭ ఘంటలకు కడప చేరినాను. దారిలో కొండలు, కనమలు దాటవలెను. దారి బహు రాతిగొట్టు; జలవసతి లేదు. కడపలో ౨ దినము లుంటిని. అది మంచి పట్టణ మనబడ్డీ యున్నది. అన్ని పనివాండ్లు గలరు. జిల్లా కోరటున్ను కలకటరు కచ్చేరిన్ని గలవు. ఆ యా యిలాకా ముసద్దీలు ఇండ్లు కట్టుకొని కాపుర మున్నారు. దగ్గిర నది యున్నది. ఊరి నడుమ నొక బుగ్గ యున్నది. ఇండ్లు సంకుచితములు. ఊరివద్ద నొక రిజిమెంటు ఉన్నది. అందులో ఆ యిలాకా దొరలు కాపుర మున్నారు. మరియొక పక్క సీవిలు దొరలు కాపుర మున్నారు.

౭ తేది ఉదయాన ౫ ఘంటలకు కడప విడిచి ౯ ఘంటలకు పుష్పగిరి చేరినాను. దోవ సరాళము. కడపవద్ద నొక నది దాటవలెను. అది వాన కురిసినప్పుడు అతివేగముగా ప్రవహించి వెంటనే తీసి పోవుచున్నది. పుష్పగిరి పుణ్యక్షేత్రము. పినాకినీనదీ తీరము. నది గట్టున కొండ వెంబడిగా రమణీయ్యమైన యొక దేవస్థల మున్నది. అది హాస్తినిక్షేపము చేయతగిన పుణ్యస్థలము. స్మార్త పీఠాధిపతి యయిన పుష్పగిరి స్వాములవారు, అక్కడ మఠము గట్టుకొని నివాసము చేయు చున్నారు. ౧౮ బ్రాంహ్మణ గృహము లున్నవి. అక్కడి బ్రాంహ్మణులు కొంత వేదాంత విచారణ గలవారుగా కనబడుచున్నారు. అన్ని వస్తువులకున్ను పేటకు పోవలెగాని, అక్కడ దొరకవు. నది దాటి ఊరు ప్రవేశించవలెను, మళ్ళీ నది దాటి ఛాటకు రావలెను. ఊరు రమ్యమైనది. ఆ దినము 3 ఘంటలకు బయలుదేరి కొన్ని పినాకినీ నది కాలువలు దాటి ౫ గడియల దూరమందున్న కాజీపేట చేరినాను. ఛాట నిండామంచిది కాదు. అది పేట స్థలము. వసతిగా నుండే యిండ్లు లేవు. అయినా బ్రాంహ్మణు లున్నారు.

౮ తేది రాత్రి 3 ఘంటలకు లేచి ౧౪ ఆమడలో నున్న దువ్వూరు ౯ ఘంటలకు చేరినాను. దోవలో అడివి లేదు. బయిలు పొలము లెస్సగా నున్నది. ఆ గ్రామములో వసతిగా నున్న యిండ్లు, చావిళ్ళు గలవు. చేరినట్టు పేటయున్నది. అక్కడ అన్ని వస్తు

వులు దొరుకును. అదివరకు కడపజిల్లాతో చేరినభూమి. ఆ యూరు 3 ఘంటలకు వదిలి ౫ గడియల దూరమందున్న వంగలి గ్రామమును గడియ ప్రొద్దు గద్దనంగానే చేరినాను. అక్కడ గొప్ప యిండ్లు, చావిళ్ళు న్నున్నవి. దగ్గిర పేటగలదు. అది కంధనూరు నవాబుగారిది. రూపశింగనే సరదారునికి కొలువుకు గాను, ఈ గ్రామము వగైరా కొన్ని యూళ్ళు జాగీరుగా నివ్వబడినవి. దువ్వూరు మొదలుకొని ప్రతిగ్రామమందున్న కొండ నగములవాండ్లు ఇనపరాళ్ళతో నినుము జేయుచున్నారు.

౯ తేది వాసనుంచి మధ్యాహ్నము వరకు నిలచి ౧౨ ఘంటలకు బయలుదేరి నాలగు గ్రాసను అచ్చటి వారిని తీసుకొని అరగడియ ప్రొద్దు కద్దనంగానే ౧౪ ఆమడలో నున్న అహోబళ క్షేత్రమును చేరినాను. దోవ సరాళము. అనుగడుగుకు గ్రామములున్నవి. ఒక చిన్న నదిన్ని, వాగుకాలువలున్ను దాటవలెను. అయితే అడవిభూమి. ఆ క్షేత్రమందు మెగువ అహోబళము, దిగువ అహోబళమని రెండు స్థలములు ఒకదానికొకటి ౪ గడియల దూరమందున్నవి. నడమ చీకటిగల యడవి. మెగువ అహోబళానికి పైన కొండమీద ఉక్కుస్తంభ మని చెప్పబడే స్తంభముగల పుణ్యక్షేత్ర మున్నది. అక్కడికి అడవి నడమ కాలిబాట. ఒక సవారిన్ని పోదు. అది నరసింహ్వామూర్తి ఉద్భవించిన స్థలము. దిగువను, మెగువను నరసింహ్వామూర్తి ప్రతిమ లనేక యవతారాలుగా చేసి పెట్టి ఆరాధింపుచున్నారు. ఈ స్థలము కుంభకోణము వద్దనుండే అహోబళంజియ్యరువారి యొక్క ఆధీనము. వారి ముద్రకర్త అహోబళానకు రెండుకోసుల దూరమందున్న బాచపల్లెలోనుండి ఆ స్థల విచారణజేయుచున్నాడు. ఆ ముద్రకర్త మెగువ దిగువ స్థలములలో అర్చన చేసే అర్చకుల కిద్దరికిన్ని అప్పుడప్పుడు నెల ౧కి ౬ రూపాయిలు జీతము యేర్పరచుచు వచ్చుచున్నాడు. గుడి ఖర్చులకు జియ్యరు పంపించే అయివజు దప్ప మరియే ఆకరమున్ను లేదు. రాజా చందులాలా* యీ స్థలానకు ప్రియార్థమై సాలుకు ౧౦౦౦ రూపాయలు ఇప్పింపుచున్నాడు. మెగువ అహోబళానకు

* రాజా చందులాలా హైదరాబాదు దివాను పేష్కారు.

సవారీలు వెళ్ళడము ప్రియాస. దిగువ అహోబిళములో శూద్ర గుడిసెలు కొన్ని యున్నవి. యెగువ అవిన్ని లేవు. జనులు దేవాలయములందే దిగవలసినది. చీకారణ్యప్రదేశము. మృగభయము గలదు. జలము రోగప్రదము. మనుష్యులు వసింపను భయపడు చున్నారు. దేవస్థలములు శిథిలము లయినందున జిల్లేడు, పల్లేరు మొలచి యున్నవి. అచ్చట ఫాల్గునమందు బ్రహ్మోత్సవము. అప్పుడు జనులు వచ్చుచున్నారు. ఉత్సవకాలమందు ౪౦౦ వరహాలు హాశ్శీలు వసూ లవుచున్నవి. వాటి నంతా కందనూరి నబాబు పుచ్చుకొని విసర్గుళ్ళ సంగతినే విచారింపడు. ఈ స్థలములలో ప్రతిష్ఠించి యున్న పరమాత్మ చైతన్యము, స్వప్రకాశముచేత లోకులకు భక్తిని కలుగ చేయుచున్నది గాని, అక్కడ నడిచే యుపచారములు దానికి నేపా టిన్ని సహకారిగా నుండలేదు. ఈ ౨ స్థలములలోను నొకవస్తువున్ను దొరకదు. ఉప్పుతో తొమ్మిదిన్ని బాచపల్లెలో నుంచి తెచ్చుకో వలెను. ఆ రాత్రి అక్కడ నిలిచినాను. బాచపల్లె కుంఫిణీ వారిది. మంచి గ్రామము.

౧౦ తేది పగలు ౧౨ ఘంటలకు దిగువ అహోబిళములో నిలిచి చేతనున్న వస్తువులతో నక్కడి బింబములను ఆరాధించి ౧ ఘంటకు ప్రయాణమై ౬ ఘంటలకు శ్రీరంగాపురము చేరినాను. అది ౧౫ ఆమడదూరము. దోవ సరాళము. మిక్కిలి అడివి. నడమ రుద్రవర మనే బస్తీగ్రామ మున్నది. అది కడపజిల్లాలో చేరినది. గొప్ప పేటస్థలము. కావలసిన వస్తువులు దొరుకును. సరాబు అంగళ్లు, బ్రాహ్మణ గృహములు గలవు. శ్రీరంగాపురము చిన్నది; బస్తీగ్రామం; కుంఫిణీవారిది; ఇండ్లు చిన్నవి; ఉదకసౌఖ్యము లేదు.

౧౧ తేది రాత్రి 3 ఘంటలకు లేచి ౮ ఘంటలకు ౧౫ ఆమడలో నున్న మహానంది యనే మహాస్థలము చేరినాను. దోవ సరాళము. మహాదేవపురము, బసవాపురము అనే బస్తీ గ్రామములు దోవలో నున్నవి. ఆ మహానంది చీకారణ్యములో నున్నది. కొండ సమీపము. గుడి చుట్టు సకలఫలవృక్షములు నున్నవి. గుడి సమీపమున ఒక

గుడిశయున్ను లేదు. అన్ని వస్తువులు బసవాపురమునుంచి తెచ్చుకొనవలెను. నిప్పు దొరకడమున్ను ప్రియాస. అచ్చట రాత్రిపూట మనుష్యులు నిలవరు. ఆ గుడిలో లింగమునకు దిగువ గుండా తీర్థము ప్రవించి ఒక తొట్టిలో నిలిచి అవతల ప్రవహించుచున్నది. గుడి తీర్థము రమణీయ్యమైనది. శాస్త్రప్రసిద్ధమైన స్థలము. అర్చకుడు తంబళ వాడు. వచ్చినవారు తామే యీశ్వరుని అభిషేకము చేసి పూజించుచున్నారు. అర్చకుడు ప్రతిదినమున్ను ఉదయమయిన జాముకు వచ్చి గర్భగృహము తలుపు తెరుచుచున్నాడు. గోసాయీలున్ను బయిరాగులున్ను ౨-3 దినములు ఆ స్థలమందు నిలిచి పునశ్చరణ చేయుచున్నారు. అక్కడ ౨ ఘంటల గనుక నుండి రాత్రి ఆమడదూరములో నున్న బండాతుకూరు సాయంకాలమునకు చేరినాను. దోవ రేగడభూమి. ముండ్లు విస్తరించి యున్నవి. దోవలో నొక చిన్న నదిన్ని, మరికొన్ని కాలువలున్ను దాటవలెను; అడివి లేదు. ఆ యూరు కందనూరు వారిది. బస్తీ గ్రామము. అన్ని వస్తువులు దొరుకును. ఇండ్లు గొప్పవి. ఆ ప్రాంతములలో ఆవులను పాలు పితుకుట లేదు. దూడలను ఆవులతో కూడా మేతకు తోలుచునున్నారు. అక్కడివారికి యెనప పాడి సహజముగా నున్నది. పశువులకు తాము కాపురముండే యిండ్లకంటె చక్కగా కొటములు కట్టి బాగా కాపాడుచున్నారు. ఆ ప్రాంతములలో వరిపంట లేదు. పుంజధాన్యములు సమృద్ధిగా పండుచున్నవి. శూద్రులు బాగా కష్టపడి కృషిచేయుచున్నారు. బ్రాంహ్మణులకు భూజీవనము పుష్కలముగా కలిగియున్నది.

౧౨ తేది రాత్రి ౮ ఘంటలకు ఆమడలో నున్న వెలపనూరు చేరినాను. దోవ రేగడ, సరాళము; అడివి నిండా లేదు. ఇండ్లు గొప్పవి. బట్టల అంగళ్లు కూడా యున్నవి. సకల పదార్థములున్ను దొరుకును. మంచి బ్రాంహ్మణులున్నారు. గ్రామకరణమయిన శేషప్ప అనేఅతడు అన్నదానము చేయుచున్నాడు. ధర్మాత్ముడు. నవాబు తరఫున ఉద్యోగస్థులు కొందరు ఆ గ్రామములో నున్నారు. ఉదకసౌఖ్యము నిండా లేదు. అక్కడికి ఓంకార మనే స్థలము ౭ పరుగుల దూరములో

అడివి నడుమ నున్నది. ఆ దినము మధ్యాహ్నము ౨ ఘంటలకు బయలుదేరి ౨ ఘడియల ప్రొద్దు కలదనంగా ఆమడదూరమున నుండే వెంపెంట అనే గ్రామము చేరినాను. దోవ అడివి బలసినది. మృగ భయము కలదు. గులక, రేగడ కలసిన భూమి. ఆ యూరు నవాబు యిలాకాలో చేరినది. చేబందు గ్రామము. చిన్న యిండ్లు. పదార్థాలు విశేషముగా దొరకవు.

౧౩ తేది వుదయ మయిన గడియకు బయలుదేరి ఆమడదూరములో నుండే ఆత్మకూరు చేరినాను. బాట మంచిది. అడివి నిండా లేదు. ఆ యూరు కందనూరు నవాబు తాలూకా ఉద్యోగస్థు లుండే కసుబాస్థలము. ఆ కందనూరు నవాబు తాలూకా నాలుగు మేటీలుగా పంచి ఒక్కొక్క మేటీకి నొక్కొక్క అములుదారుని నేర్పరచినాడు, కొంత తాలూకా తన వద్ది నవుకరలకు జీతానికి బదులుగా జాగీరుగా నిచ్చినాడు. ఆ నవాబు, కుంఫిణీకి సుమారు లక్షరూపాయీలు సాలెనా కట్టుచున్నాడు. అతని రాజ్యము భళ్లారి జిల్లా కలకటరాజ్ఞకు లోబడి నది. కలకటరు తరఫున నొక వకీలు కందనూరులో కాపుర మున్నాడు. ఆ నవాబు రాజ్యస్థులకు స్వాంతముగా నొక ఖాజీకోరటు పెట్టి న్యాయ విచారణ చేయుచున్నాడు గాని, జిల్లా కుంఫిణీ కోరటుకు నిమిత్తము లేదు. నవుకరులకు జీతము క్రమముగా ముట్టచెప్పడము లేదని నదంతిగా నున్నది. అందరికి జీతము బహుస్వల్పము. తాలూకా అములుదారుల మీద అకబరునివీసు అని ఒక ఉద్యోగస్థుని ఉంచియున్నందువలన పనులు హామీ భరాయించి చూడడమునకు నెవరికిన్ని స్వాతంత్ర్యము లేక నున్నది. ఆ యాత్మకూరు దూరమునుంచి వినడానకు గొప్పయూరు; పేట స్థలము. ప్రతి ఆదివారమున్ను సంత కలదు. సంతలో సకల పదార్థాలు దొరుకు నని ప్రసిద్ధి కలిగియున్నది. వచ్చి విచారించగా తద్వ్యతిరిక్తముగా నగుపడును. సంతలో ముసాఫరులకు అక్కరలేని పదార్థాలు విక్రయింపుచున్నారు గాని ఉపయోగించునవి విశేషించి లేవు. ఆయాత్మకూరిలో శ్రీశైల స్థలమందలి యాచకులున్ను యాత్ర చేయను వచ్చిన వారివద్ద హాశ్శీలు పుచ్చుకునే నవాబు ముసద్దీలున్ను

ఉన్నారు. అక్కడికి శ్రీశైలము నాలు గామడ దని చెప్పుచున్నారు. ఆ నాలు గామడ దూరములో నడమ కొన్ని యూళ్ళున్నా, పదార్థాలు ఎంత మాత్రమున్నూ దొరకవు గనుక నక్కడనుంచి బయలు వెళ్ళినది మొదలు మళ్ళీ ఆ స్థలము చేరేవరకు కావలసిన సామానులన్ని మరచి పోకుండా తీసుకొని పోవలసినది. మరచిన పదార్థములు తక్కువ పడే యుండును. శ్రీశైల యాత్రికు తీసే హాశ్శీలు కందనూరునవాబుకు చేరుచున్నది. శివరాత్రి ఉత్సవములో శూద్రజనము ౧కి రూ ౭, గుర్రానికి రూ ౪, అభిషేకమునకు రూ ౩, వాహనోత్సవము చేయిస్తే ఉత్సవపు సెలవులు గాక ౧ ౩, దర్పణసేవోత్సవమునకు రూ ౩. ఈ ప్రకారముగా పుచ్చుకొనుచున్నారు. శ్రీశైలమునకు నాలుగు ఘాటులు. ఎటు పోయినా యీశ్వర సంకల్పమేమో ౯ ఆమడదూరము; చీకారణ్యమయిన దోవ. ఒక ఘాట నల్లూరు మీద వచ్చి చుక్కల పర్వతము నెక్కవలసినది. మరియొకటి కంభం దూపాటి మీదవచ్చి చుక్కలకొండ నెక్కవలెను. మరియొక ఘాట పడమటి దేశస్థులు కృష్ణానది దాటి రావలసినది. ఆ కృష్ణ పాతాళ గంగ యని పేరు వహించి శ్రీశైలము క్రింద ప్రవహించుచున్నది. శ్రీశైలమునుంచి ఆ గంగకు పోవలెనంటే రెండు కోసుల దూరము దిగి యెక్కవలెను. కొంతదూరము సుళువైన డోలీమీద పోవచ్చును. మెట్లు పాడుగు గనుక నెక్కడము, దిగడము కష్టము. నేను వచ్చిన యీ యాత్మకూరు ఘాట తప్ప మిగతా మూడు ఘాటులు ఉత్సవకాలములలో నడవ వలసినది గాని తలుచుకొన్నప్పుడు నడవకూడదు. మృగభయము, చెంచువాండ్ల భయమున్ను విస్తరించియుండును. ఆ చెంచువాండ్లు అడివి మనుష్యులయినను యాత్రకు వచ్చేవారిని యాచించి తినే వాడికె పడియున్నారు. శివరాత్రి మొదలు చైత్రమాసమువరకు శ్రీశైలము మీద ప్రతిదినమున్ను పల్లకీసేవ అనే ఉత్సవము జరుగుచున్నది. చైత్రమాసములో భ్రమరాంబ యనే దేవికి తామసపూజ చేసి శ్రీశైలముమీద వచ్చియుండే జనులు విరామమును బొందుచున్నారు. అటుపిమ్మట నొకరిద్దరు అర్చకులుమాత్రము మాచిర్ల మాచిర్ల ఆయాత్మకూరు నుంచి వచ్చి యుంచున్నారు. ఎక్కువ దినములుంటే అక్కడి

నీళ్లు ఒంటక జ్వరము, మహోదరము, శోభ మొదలయిన రోగములు
కల్గుచున్నవి. శ్రీశైలమున గుడికి సమీపముగా ౨౦ చెంచుగుడిశె
లున్నవి. వారున్ను ఆ గుడిశెలు వదిలి భాద్రపద మాసములో వలస
పోవుచున్నారు. అప్పటికి వర్షాకాలము తీరి యీగల ఉపద్రవము
కలుగుచున్నది. అది సహించతగినది కాదు. గుడివద్ద స్వామికి ఆవులు
౧౦౦ దనుక నున్నవి. కడప విడిచిన వెనుక ఆవుపాలు, పెరుగున్ను కండ్ల
చూడవలెనంటే శ్రీశైలముమీద చూడవలసినది గాని యితర స్థలము
లలో ఆవులను మాత్రము కండ్ల చూడవచ్చును. ఆవుపాలు తీసుట
లేదు, దూడలకు విడిచిపెట్టుచున్నారు. అంత జాగ్రతగా ఈ దేశ
స్థులు పశువులను కాపాడిన్ని, దున్నడముకు ఎద్దులు నెల్లూరుసీమనుంచి
తెచ్చే వారివద్ద హమేషా వారికి కొనవలసి యున్నది. ఎనుములు
పాడికే గాని అచ్చటి దున్నలు ఆ భూమిని నిగ్గి దున్న నేరవు. తడవకు
౧౦-౨౦ వరహాలు పెట్టి యెద్దులను కొనుచున్నారు. ఆ యాత్మకూరి
కాపురస్థులు అనేక వర్ణాలవాండ్లను గొప్ప, చిన్నలను చూచి మొదిగి
నవా రయినందున వారి విషయమై ఉపకారబుద్ధి లేక అలక్ష్యబుద్ధి
గలవారై యున్నారు. ముసాఫరులకు దేవ యర్చకు లయిన తెనుగు
బ్రాహ్మణులు రెండిండ్లవారున్ను, స్వామి యర్చకుడయిన జంగ
మువాడొకడున్ను - వీరే స్థల మివ్వవలసినది. గాని, యితరుల యిండ్లు
గొప్పలయినను స్థల మివ్వరు. ౨-౩ చిన్న దేవస్థలములు, చావిళ్లున్ను
న్నవి. తప్పితే అందులో దిగవలసినది. ఆ యాత్మకూరినుంచి పట్టణపు
షవారీల మీద కష్టముగా శ్రీశైలపర్వతమునకు పోయి చేరవచ్చు
నని తెలిసినందుచేత మూడు డోలీలు ౨ రూపాయీలకు చేయించి
నాను. వాటిని నొక దినములో అక్కడి వడ్లవాడు చేసినాడు. అక్కడి
రూపాయీకిన్ని చెన్నపట్టణపు రూపాయికిన్ని సుమారు కాలురూపాయి
భేద మున్నది. పట్టణపు రూపాయి ౧ కి అక్కడి రూపాయి ౧౹. ఎని
మిదిమంది కూలి బోయీలను అక్కడి వారిని శ్రీశైలమునకు పోయి
రాగలందులకు జనము ౧ కి రూపాయిలు ౪ లెక్కను కుదుర్చు
కొన్నాను. నా వుప్పాడాబోయీలను ౮ మందిన్ని వారికి సామాను
తేను ౩ బోయీలనున్ను నాసామాను తేను నా కావటివాండ్లను అర్దురి

నిన్నీ తీసుకున్నాను. వారి సామానున్ను బంట్రౌతులకు నలుగురికి భోజన సామానున్ను తేను ఒక కావటివాని కూడా తీసుకొన్నాను. నా పరివారమైన ౧౫ మంది బ్రాంహ్మణులకు ౫ దినముల మోయీను (భత్యము) తీసుకొని ౧౮ తేది అంతా ఆత్మకూరిలో నుండి ౧౫ వ తేది ఉదయాన ౫ ఘంటలకు ఆత్మకూరు వదిలి ౫ క్రోసుల దూరములో నుండే నాగులోటి అనే గుడి ౮-౪ ఘంటకు ప్రవేశించినాను. దోవలో రాధాపురము, కృష్ణాపురము, వెంకటాపురము, సిద్ధాపురము అన్నే గ్రామము లున్నవి. బహు చిన్నవి. చెంచువాండ్లు, యితరులున్ను కలిసి కాపుర మున్నారు. ఆ వెంకటాపురము వరకు భాట సరాళము; వెల్లడిగా నున్నది. అది మొదలు నాగులోటి గుడివరకు భాట సరాళమయినా యిరుపక్కలనున్ను దట్టమయిన అడివి. ఆ సిద్ధాపురములో చెంచువాండ్లకుగాను నవాబు మనుష్యులు మనిషి ౧.కి ౩ డబ్బులు హాశ్శీలు పుచ్చుకొనుచున్నారు. డబ్బులు అనగా చెన్నపట్టణపు రెండు దుడ్లు. అక్కడ అణాలు, అర్ధణాలు, పావులాలు దొరకవు. అక్కడ డబ్బులు మార్చి పెట్టుకొని సెలవు చేయవలసినది. అణాకు మూడు డబ్బు లవుచున్నవి. ఆ డబ్బులు ముందరి పట్నం లింగిశెట్టి దుడ్లవలెనే అరిగిపోయి యున్నవి. ఆ నాగులోటి వరకు సవారీ మనుష్యులున్ను సాధారణముగా పోవచ్చును. నాగులోటిలో సిద్ధాపురములో కాపుర మున్న చెంచువాండ్లు వేటకు రాగా వారిం జూడవలసిన దేగాని యితరులు పరప వారికి కనుబడరు. ఆ గుడి మజిలీ చేసి దిగను వయిపు (వీలు) గా జలవసతి కలిగి యున్నది. ఆ గుడి వీరభద్రస్వామిది. ఒక జంగము ఆత్మకూరిలోనుంచి వారానికి ౨ ఆవృత్తులు వచ్చి పూజచేసి పోవుచున్నాడు. అక్కడ మధ్యాహ్న భోజనము చేసుకొని ౨ ఘంటలకు బయలుదేరి అక్కడికి అయిదు క్రోసుల దూరములో నున్న పెద్దచెరువు అనే యూరు ౬ గంటలకు చేరినాను. నాగులోటి వదిలినది మొదలు ' క్రోసెడు దోవపర్యంతము కష్టమయిన కొండ యెక్కుడు, దిగుడుగా నున్నది. మెట్లు బాగా కట్టియున్నవి. ఆ క్రోసెడు మిక్కిలి ప్రయాస. అవతల ౨ క్రోసులు ఎక్కుడము, దిగడము లేక

పోయినా దోవ రాతిగొట్టుగాను న్నిరుపక్కల దట్టమయిన అడివిగాను న్నున్నది. సవారీలు వస్తే చెట్లకొమ్మలు వాటికే తగులును. ఆ రాతి గొట్టు దారిని దాటిన వెనుక పెద్ద చెరువుదాకా గుఱ్ఱపుబండ్లు పొయ్యే పాటిగా, భాట విశాలముగా, సమముగా నున్నది. పెద్ద చెర్వునుంచి వచ్చేటప్పుడు రెండు మూడు భాటలు చీలిపోవుచున్నవి. తెలిసిన చెంచువాండ్లను పిలుచుకొని నాగులోటికి చేరవలసినదిగాని స్వతంత్రముగా బోతే తప్పిపోదురు. కుడిచేతి పక్క చీలే భాటలు వదిలి యెడమచేతి ఎక్క భాటను పట్టి వస్తే నాగులోటికి రావచ్చును. ఆ పెద్ద చెరువు విడిచి శ్రీశైలము చేరేవరకు గాని నాగులోటి వదిలినది మొదలుచేసు కొనిగాని యెక్కడనున్ను ఆవరణ సంబంధమయిన నీడయున్ను, జల వసతి గల ప్రదేశమున్ను లేవు. ఆ పెద్దచెర్వు అనే యూరిలో పందులు తోలను చాలేపాటి ౨౦ కిరాతకుల గుడిశె లున్నవి. మరి వేరే నీడ లేదు. చెరువులో రమణీయ్యమయిన తామరస పుష్పాలుగల జలము కలిగి యున్నది. చెన్నపట్టణపు కోణ్నారు నీళ్లు వదిలిన వెనక నింత పాటి యుదకము నేను చూచిన వాడను గాను. అందరున్ను ఆ చెరువు కట్టమీద వంట, భోజనములు చేసుకొని వానవచ్చేనేని ఆ గుడిశలలో కూర్చుండి యుండవలసినది. ఆ యూరి చెంచు బోయీలనే కిరాతకులకు నొకడు యజమానుడుగా నాయకుడనే బిరుదు వహించియున్నాడు. వాడు ధర్మాత్ముడు. పరప వారివద్ద నవాబు సరకారుయొక్క ఆజ్ఞప్రకారము మనిషికి 3 డబ్బుల వంతున హాశ్శీలు తీసుకొన్నా పస్తుగా నుండేవానికి బియ్య మిచ్చి పాత్ర యిచ్చి వంట చేసుకొను మని ఉపచరింపుచున్నాడు. ఆ మార్గముగా శ్రీశైలముకు వెళ్ళేవారికి పొయ్యేటప్పుడు, వచ్చేటప్పుడు అక్కడ నిస్సందేహముగా విధిలేక మజిలీ చేయవలసి యున్నది. నేను తిరుగుదలై వచ్చేటప్పుడు పదిరూపాయీలలో నొక చావిడి విశాలముగా కట్టవచ్చునని ఆ నాయకుడు మొదలైనవారిగుండా తెలుసుకొంటిని. అక్కడి వాడిక ప్రకారము వెదురు తడికలతో గోడలుపెట్టడము వలన నున్ను, అడివి వెదురు మయమయి యందుననున్ను, అక్కడి వెదురుతడికలు మట్టి

గోడలకంటె ద్విగుణ మయిన బలము కలవి గనుకనున్ను బహు బల
మయిన కొయ్యసామానును అతి నయముగా దొరుకుచున్నది గనుకనున్ను
వారు చెప్పిన ప్రకార మొక చావిడి కట్టడానకు రూ ౧౦ చాలు నని
తోచినది. ఆ రాత్రి చెరువుకట్టమీద వంట, భోజనములు చేసుకొని
ఉదయమయిన ౫ ఘంటలకు బయలుదేరినాను. ఆ రాత్రి మిక్కిలి చల్ల
గాలితోకూడా మబ్బు తువ్వర పడుచుండెను గనుక నొక బోయిగుడిసె
ఖాళీ చేయించి అందులో పండుకొన్నాను.

---

## రెండవ ప్రకరణము

౧౩ తేదీ అక్కడికి ౫ కోసుల దూరములో నుండే శ్రీశైలము
౧౨ గంటలకు చేరడ మయినది. పెద్దచెరువు విడిచి వెంబడిగానే కొండ
యెక్కను ఆరంభించవలసినది. ఒక కోసెడు దూరము యెక్కుడు,
దిగుడుగా నుంచున్నది. అయితే మెట్లువైపు(వీలు)గా కట్టియున్నవి. నిండా
ప్రయాస కాదు. ఇసుపక్కలా అడివి. అటుపిమ్మట కోసెడు దూరము
సమభూమి. అందులో పొయ్యేదారి రాతిగొట్టుగా నుంచున్నది.
అటుపిమ్మట భీముని కొల్లు మనే అగాధమైన కొండ పల్లమువరకు కొండ
యెక్కుడు దిగుడుగా నుంచున్నది. అక్కడ మెట్లు పర్వరచి కట్టియున్నవి.
ఆ యగాధ మైన కొండదొనలో నొక వాగు పారుచున్నది. అక్కడ
ఆసోదా చేసుకొని కొండ యేడు తిరుగుళ్ళు, రెండువేల మెట్లు
పర్యంతము, మిక్కిలి పొడుగుగా నెక్కవలసినది. ఆ ప్రదేశములో
నెక్కేటప్పుడు, దిగేటప్పుడున్ను వాడిక లేనివారికి చుట్టూ చూస్తే
కండ్లు తిరుగును. మెట్లు బాగుగా నెక్కవలసినంత దూరము కట్టి
యున్నవి. చుట్టు ఏ తట్టు చూచినా పర్వతము లున్నవి. యీ ప్రకా
రము రెండుకోసులు ఎక్కిన వెనుక సమభూమిలో రాతిగొట్టు గల
మార్గము శ్రీశైల పర్యంతము పోవుచున్నది. ఆ కొండ యెక్కు
డుకు, దిగుడుకు తిరుపతి బోయీలు డోలీకి ౬ మంది అయినట్టయితే

అనాయాసముగా నెక్కిపోదురు. అంతదూరము ఎక్కుడు దిగుళ్ళలో తిరుపతి గాలిగోపుర పర్యంతము ఎక్కవలసినంత ప్రయాస యెక్కడ నున్ను లేదు. నా తోడవచ్చిన వుప్పాడా బోయీలు ౮ మందిన్ని నా డోలీని అనాయాసముగానే మోసినారు. అయితే నాగులోటి దాటగానే కొండ యెక్కడము, పిమ్మట కొండ యెక్కవలసిన దాని కంటె రవంత ప్రయాస యెక్కువ గనుక, అక్కడ ప్రథమ మందే యీలాగున నున్నదే, యిక నేలాగున నుండునో యని అధైర్యము తోచుచున్నది. అవతల సాగి పోగా సుళువనిపించు చున్నది గాని వేరు గాదు. ఆ కొండ యెక్కుడు, దిగుడులలో ఆత్మకూరి బోయీలకు వుప్పాడ బోయీలు తీసిపోలేదు. ఆ యాత్మకూరి బోయీలకు సంవత్సరమునకు నొకసారి పనిపడుచున్నది గాని నిండా పనిలేదు గనుక నెక్కడము, దిగడములలో తిరుపతి బోయీల వలెనే ఆ బోయీలు వాడికెపడిన వారు కారు. నేను చేయించిన డోలీకి బంగాళాపాలకీ వలెనే రెండుం ముక్కాలడుగు వెడల్పు పెట్టించినాను. అది శ్రీశైలమునకు సాధారణముగా సాగి పోయినది. కందనూరు నవాబు వగయిరాలు పల్లకీల మీదనే శ్రీశైలమునకు వెళ్లియున్నారు. సంపన్ను లయినందున దోవలోని చెట్ల కొమ్మల కొట్టడమునకు ముందుగా మనుష్యులను జాగ్రత్త పెట్టి యుండవచ్చును.

౧౭ తేది పగలు 3 ఘంటలకు శ్రీశైలముమీది గుడి కల్యాణ మంటపములో నుంటిని. అక్కడ ముందు గుడికి చుట్టునున్న గొప్ప పట్టణ ముండెను. వేశ్యా స్త్రీల యిండ్లు మట్టుకు 3౬౦ ఉండినవి. ఆ పట్టణ మంతయు ఇప్పుడు పాడుబడి పోయెను. ఇంటింటనున్న బావులు శిథిలము లయినవి. గోడలుగూడా యిప్పుడు తెలియుచునున్నవి. ౪౦౦ (౪౦౦?) ఏండ్లనాడు అనవేమారెడ్డికి భగవంతుని కటాక్షము చేత బంగారనుములు పండినవని వాడుక కలిగియున్నది. అతడు స్వామిగర్భ గృహమునకున్ను, ముఖమంటపమునకున్ను, పయి నందులకున్ను, విమానమునకున్ను, ధ్వజ స్తంభములకున్ను బంగారు మొలాము చేసిన రాగి తగుళ్ళు కొట్టించినాడు. అవి యిప్పుడు నిండా శిథిలములుగా నున్నవి.

గుడికి రెండు ప్రాకారములు కలిగియున్నవి. బయిటి ప్రాకారపు గోడలమీద నాలుగుపక్కల శివలీలలు సుందరములయిన ప్రతిమలుగా చెక్కియున్నవి. వాటిని శిల్పి బహుబాగా చేసినాడు. అయితే రాళ్ళను వయిపుగా సంతన చేసినవాడు కాడు. ప్రాకారముమీద ప్రతి కోట కొమ్మకు నొక్కొక్క ప్రతిమ చెక్కియున్నది. గుడిలోపల రెండో ప్రాకారము బొత్తిగా శిథిల మయియున్నది. మంటపములు ఆ రీతిగానే యున్నవి. అర్చకులకు మనసు వచ్చినప్పుడు దీపారాధన, నైవేద్యములు స్వామికి చేయబడుచున్నవి. గాని నిత్య నియమము లేదు. బ్రాహ్మణులు స్వేచ్ఛగా లింగమును తాకి అభిషేక నివేదనలు చేయవచ్చును. భ్రమరాంబా దేవికిమాత్రము మిరాశీ అర్చకుల తరఫున నొకడు నియమముగా గుడిలో కాపురముండి అర్చన చేయు చున్నాడు. ఆలాగు అర్చనచేసే గుమాస్తా సంవత్సరము ప్రాణముతో నుండుట దుస్తరము. అందుకు కారణము రోగప్రదేశమేనో, వాని భక్తి తక్కువేనో తెలిసినది కాదు. ఇప్పుడు ౫ సంవత్సరములుగా రాజశ్రీ భట్లు అనే బ్రాహ్మణుడు ౯౦ ఏండ్లవాడు ప్రాణముతో నక్కడ నిలచియున్నాడు. అది ఆశ్చర్యముగా నున్నది. అతడు ఏకాకి. ఆ గుడి లింగము భూమికి జానెడు పొడుగుగా నున్నది. విమా నమునకు ౫ శిఖరములు. అవి నాలుగుపక్కల శిథిలము లయియున్నవి. నడమ నున్న గొప్ప శిఖరము దర్శనమునకు నుపయోగింపు చున్నది. ఆత్మకూరి దారిని వస్తే గుడిలో ప్రవేశించేవరకు శిఖరదర్శనము కానే రదు. నెల్లూరు కంభము మార్గములవస్తే గుడికి మూడుకోసుల దూరములోనున్న శిఖరేశ్వర మనే పేరు కలిగిన యున్నత ప్రదేశమునకు శిఖరము తెలియుచున్నది. ఆ గుడివద్ద వశింపుచున్న చెంచువాండ్లు ఆత్మ కూరి ద్వారివలెనే మిక్కిలి కొవ్వినవారు. భ్రమరాంబ గుడికిన్ని, మల్లి కార్జునస్వామి గుడికిన్ని సమీపమందే కొంచెపు మిట్టమీద వారి గుడిసె లున్నవి. దేవి బింబము సుందరముగా, కొంచపాటిదిగా, నూర్చున్న అవసరముగా నున్నది. గర్భగృహపు కడపమీద శ్రీచక్రస్థాపన చేసి యున్నది. గుడిలో ౧౧ తీర్థములున్నవి. ప్రతి తీర్థముకున్ను కొండ

ప్రాట ప్రవించి తీర్థములకు అంతర్వాహినిగా పారివచ్చి అవతల సాగిపోవుచున్నది. ప్రతి తీర్థమునకున్ను సూర్యరశ్మి పడకుండా పైన మంటపాలు కట్టియున్నవి. ఏ తీర్థమున్ను మోకాటిలోతుకు నెక్కువ లేదు. రోగకారి యని అక్కడివారు చెప్పినారు. ఉదకము నిర్మలముగా నున్ను, శీతళముగా నున్నది. ఆ గుడిహాశ్శీలు మూలక ముగా సంవత్సరము ౧ కి ౧౮౦౦౦ కందనూరు నవాబుకు వచ్చినా, గుడి యేగతి పొందేదిన్ని విచారింపడు. ఎవరయినా మరమ్మతు చేసినట్ట యితే సెలవంత హాశ్శీలు తీసుకొనుచున్నాడు. రాజా చెంగల్రాయలు ఈ నిర్బంధముచేత కొంత మరమ్మతు చేసి దినికి విడిచి పెట్టినాడు. అతను ఆర్గురు బ్రాహ్మణులను నెల ౧కి ౬ రూపాయీలు జీతము చేసి నిత్యము స్వామికి అభిషేకము చేసేటట్టు వుంచినాడు. మహిషాసుర మర్దనము మహిసూరి దేశములో చేసినందున ఆ దేశమునకు మహిసూరని పేరు వచ్చిన దనుచున్నారు. అక్కడ మహిషాసుర మర్దన మయిన వెనుక భ్రమరాంబ శ్రీశైలము ప్రవేశించినది. మహిసూరు తద్ద్వారా ఆమె పుట్టిన దేశమని ఆదేశస్థులు ఎవరువచ్చినా హాశ్శీలు యియ్యనక్కర లేదు. జంగాలకు, ఆరాధ్యులకు, బ్రాహ్మణులకున్ను ఉత్సవకాలములో హాశ్శీలు లేదు. గుడిలోనే పక్క చూచినా అడివి మొలిచి సర్ప వ్యాఘ్ర భూయిష్ఠముగా నున్నది. ఆ యడవి కొట్టి చక్కచేసే దిక్కు లేదు. స్వామికిన్ని, దేవికిన్ని ఎవ రయినా ఆభరణాలు, వస్త్రాలు సమ ర్పించిరేని వాటి మదింపంత రూకలు హాశ్శీలు పుచ్చుకోవడము మాత్రమే కాకుండా కొన్నిదినములు పోనిచ్చి ఆ వస్తువులనే ఆ కంద నూరి నవాబు అపహరింపుచున్నాడు. తిరుపతి విషయముగా కుంఫిణీ వారిని "అహో గుణవతీ భార్యా ఖాండమూల్యం న యాచతే" అనే శ్లోకసంగతి ప్రకారము ఆ స్థలవర్తమానము తెలిసినవారు కొనియాడ వలసియున్నది. కలి సామ్రాజ్యము గనుక, లోకకర్మ సాక్షిగా నుండే యీశ్వరుడు లోకులకు కర్మఫలప్రదానము చేయుటకంటె ఎక్కువ యేమి చేయగలడు? ఇది సర్వజనపూజిత మయిన ప్రసిద్ధి కెక్కిన స్థలము. శిఖరదర్శన మాత్రముచేతనే జన్మాదులు లేవని పురా

ణాలు మొరపెట్టుచున్నవి. యీ మహాస్థలము ౩ ఘంటలకు వదిలి ౪½ ఘంటకు దిగుడు గనుక త్వరగా భీముని కొల్లము చేరినాను. ౬½ ఘంటకు పెన్నచెరువు చేరినాను. ఆ రాత్రి అక్కడ వసించి ౧౭ తేది ఉదయము అయిన ౬½ ఘంటకు బయిలువెళ్లి ౯ ఘంటలకు నాగులోటి చేరినాను. అక్కడ నుంచి భోజనోత్తరము ౩ ఘంటలకు బయిలుదేరి సాయంకాలము ౬. ఘంటలకు ఆత్మకూరు చేరినాను.

౧౯ తేది ౩ ఘంటలకు అక్కడనుంచి బయిలువెళ్లి కోసెడు దూరములో నుండే సందగుంట అనే గ్రామము ౪ ఘంటలకు చేరి వర్షప్రదమముచేత అక్కడనే నిలిచినాను. భాట మంచిది. అయితే మిండ్లు విస్తారముగా నున్నవి. ఆ గ్రామము గొప్పది. బ్రాహ్మణుల యిండ్లు,కోమట్ల యిండ్లు న్నున్నవి. సకల పదార్థాలున్ను దొరుకును. దేవస్థలను లున్నవి. ఆ దేవస్థలములో దిగినాను.

౨౦ తేది ఉదయాన ౬ ఘంటలకు బయిలుదేరి రెండామడ దూరములోనున్న నివృత్తిసంగమ మనే పుణ్యక్షేత్రము ౧౨ ఘంటలకు చేరినాను. అది కృష్ణాతీరము. ఆ కృష్ణలో తుంగభద్రతో కూడా అయిదు నదులు అంతకుముందే కలియుచున్నవి. భవనాశిని అనే నదిన్ని ఆ స్థలమందు కలియుచున్నది గనుక అక్కడ కృష్ణానది అనర్గళముగా ప్రవహించుచున్నది. వాసయోగ్య మైన ప్రదేశము. పటిఒడ్డున ధర్మరాజ ప్రతిష్ఠితమైన శివస్థల మొకటియున్నది. బృహస్పతి కన్యాగతు డయినప్పుడు అక్కడ అనేకవేల ప్రజలు వచ్చి కృష్ణపుష్కరాల యాత్ర చేసుకొని పోవుచున్నారు. సకల పాపాలను నివృత్తిని పొందించే ప్రదేశము గనుక నివృత్తి సంగమ మనేపేరు ఆ స్థలమునకు వచ్చినది. ఇరువది బ్రాహ్మణుల యిండ్లున్నవి. కావలసిన పదార్థాలు ప్రియముగా దొరుకును. ఊరు కొండకింద నున్నది. అక్కడ కృష్ణ ఉత్తర వాహినిగా ప్రవహించుచున్నది. ఆ దినము వచ్చినదోవ మహా సుఖకర మయినది. ఎటువంటి ఋతువులోనున్ను సన్న గులక భూమి గనుక భాట ప్రతికూల మయ్యేది కాదు. అడివి లేదు. దోవలో అడుగడుగునకు గ్రామాదు లున్నవి. జలవసతి కలదు. ఊరుపూర్తికి శిథిల

మయిన కోట యొకటి కలిగియున్నది. అక్కడి గుళ్ళలో తంబలవాండ్లు అర్చకులుగా నున్నారు. కావలసినవారు తామే పూజ చేయవచ్చును. ఆ యూరున్ను కందనూరు నవాబుతో చేరినది. ఆ కృష్ణ దాటడానికి మనిషికి ఇంతమాత్ర మని హాశ్శీలు పుచ్చుకొనుచున్నారు. శ్రీశైలానకు వెళ్ళేటందుకు నేను శూద్రమనిషి ౧ కి రూ ౩౪ గుఱ్ఱానికి రూ ౩౪, అభిషేకానికి రూ ౧౪, బ్రాహ్మణునికి అ ౨, లెక్కనిచ్చినాను. కృష్ణ అక్కడ దాటవలసినది గనుక అక్కడ ఘాటు హాశ్శీలు ఒకపక్క కందనూరు నవాబుకున్ను ఒకపక్క హాయిదరాబాదు వారికిన్ని యివ్వవలసియున్నది. ఆ కృష్ణ యీవలి గట్టువరకు కందనూరి నవాబువారియొక్క దొరతనమునకు లోబడిన దేశము. ఆవలిగట్టు మొదలుచేసుకొని హాయిదరాబాదు వారి రాజ్యము. తిరుపతి మొదలు ఆ యూరివరకు ప్రతి గ్రామమునకున్ను ఒక రెడ్డిన్ని, ఒక కరణమున్ను ఉన్నారు. ఆ కరణాలు కొందరు నందవరీకులు, కొందరు ప్రథమ శాఖలు, కొందరు నియోగులు. ఈ రీతిగా బ్రాహ్మణులు ఆ యుద్యోగమును చూచుచున్నారు. కట్టుబడి బంట్రౌతులని జీతానికి బదులుగా భూమిని అనుభవింపుచు కావలి కాచుకొని గ్రామముల సకల పని పాటలున్ను చూచుచున్నారు. పరువు కలిగిన ముసాఫరులకు కావలసిన సరంజామా సహాయసంపత్తు ఆ రెడ్డి కరణాలగుండా కావలసినది. ఆ యుద్యోగస్థుల సిద్ధరినిన్ని నయభయములచేత స్వాధీన పరచుకొంటేగాని మార్గవశముగా వచ్చే పరువుగల వారికి పనులు సాగవు. పరువు గలిగిన ముసాఫరులు అధికారపు చిన్నకొంత వహించితేనే బాగు. నిండాసాత్విక గుణము పనికిరాదు. మార్గము చూపించడమునకున్ను, దిగిన తావున కావలసిన సామానులు తెప్పించి యివ్వడమునకున్ను రెడ్డి కరణాలయొక్క ఉత్తరవు ప్రకారము ఆ కట్టుబడి బంట్రౌతులు పనికివచ్చుచున్నారు. ఓంకార మనే స్థలమందలి తీర్థములో నున్న జలమందు మునిగి క్షణమాత్రము తల యెత్తక నిలిపియుంటే ఓంకార నాదము వినిపింపుచున్నది. ఆనివృత్తిసంగమమునకు నేను వచ్చిన ఘాటలో అక్కడకు ఆమడ దూరములో ముసలిమడుగు అని యొక యూ

తున్నది. అది పేటస్థలము. దిగేమజిలీ. వసతియయిన గ్రామము. ఆ నివృత్తిసంగమములో నుండే అగ్రహారీకులకు భళ్ళారిజిల్లా శిరస్తా చేసి యిప్పట్లో బోర్డులో శిరస్తాగా నుండే రామచంద్రరాయుడు ఒక కాలమందు అక్కడికి యాత్రపోయి వాక్సహాయము చేసి ఆ యగ్రహారీకులు నవాబు-సరకారుకు కట్టుచునుండే పన్నురూకలను మాపుచేయించి వారు అనుభవించే భూమిని సర్వదుంబాలా చేశినాడు. గనుక అక్కడి ద్విజులు మేము చేసే సత్కర్మఫలము అతనికి చెందవలసిన దని చెప్పి కొనియాడుచున్నారు. కడప మొదలుకొని యిదినరకు జ్యేష్ఠమాసము మొదలు శ్రావణమాస పర్యంతము క్రమమయిన వర్షాకాలము. ప్రతి దినమున్ను మబ్బు, వర్షము గలిగియుంచున్నది. కొండక్రింది గ్రామాదులలో గాలి కొట్టేటప్పుడు ఆ గాలి కొండలమీద మోది అతిధ్వనితో బహువేగముగా సమీపమందు విసురుచున్నది. కొత్తవారికి ఆ గాలి సహించడము ప్రయాసగా నుంచున్నది. తిరుపతి మొదలుకొని యెంత పాతబియ్య మని అంగటివాడు ఇచ్చినను కొత్తబియ్యము వలెనే అన్నము మెత్తపడుచున్నది; గనుక ఆ బియ్యము వాడికెబడేదాకా ప్రయాసగా నుండును. నాటు ఉప్పుడుబియ్యము ఆ ప్రాంతములలో బొత్తిగా దొరకదు. పేదలు జొన్నలతోనున్ను, ఆరికెయన్నముతోనున్ను కాలము గడుపుచున్నారు.

౨౧ తేది మొదలు ౨౪ తేది మధ్యాహ్నపర్యంతము తీర్థవిధి మొదలయిన పితృకర్మములు చేయడానకు అక్కడ వుండి ౧౨ ఘంటలకు భోజనము చేసుకొని బయలుదేరి ౧ కోసెడు దూరములో నుండే సిద్ధేశ్వరం ఘాటుకు పోయినాను. ఆ ౧ కోసున్ను కొండమీద నెక్కి నడిచి కొండ తిరిగి పోవలసినది. దారి రాతిగొట్టు ఎక్కి దిగుచు నడవవలసినది. అక్కడ కందనూరు వారిది యొక పుట్టి యున్నది. నలుగురు బోయి జాతి మనుష్యులు ఆ పుట్టిని తెడ్లతో తోసిగడుపుచున్నారు. ఆ పుట్టి - అనగా పెద్ద వెదురుగంప; ౪౦ మంది కూర్చుండ వచ్చును. పయిన చర్మముతో కవచము కుట్టియున్నది. బహుసున్నితము. రవంత ద్వారము పడితే ప్రమాదము వచ్చును. ఒక పల్లకీనిన్ని ౧౨

మంది బోయీలనున్ను ఒక నడతకు దాటించినాను. ఇనాటిగట్టుకు పోయి రావడానికి ౧౫ నిముషాలు పట్టుచున్నవి. [illegible] తూర్పున నదికి నిరుపక్కలా కొండ లున్నవి. [illegible] విస్తరించి ఆ ఘాటుకు లేదు. గనుక ఆ ఘాటు దిగడము ఎక్కడము ఘాట్లకన్నా నది దాటడానికి క్షేమకరము. నాలుగు ఘంటలకు నా సరంజామాతో కూడా అవతలిగట్టుకు పోయి అక్కడ [illegible] సవారీకి రూపాయిలు ౫ న్ను, గుర్రానికి ౧। రూపాయిన్ని, నౌకర్లకు స్వల్పముగా నున్ను యిచ్చి ఆ గట్టునలెనే నిజాం యిలాకా వారికిన్ని యిచ్చి ౪। ఘంటలకు బయలు దేరి అక్కడికి మూడు కోసుల దూరములో నుండే పెంటపల్లి అనే గ్రామము ౭ ఘంటలకు చేరినాను. దారి కొండలనడమ బోవుచున్నది. అందులో ఒక కోసుదూరము రాళ్ళమయ మయిన కనమ. అది దాటిన వెనక నాల్గు కోసుల దూరము వెల్లడిగా, బాట బాగుగా నున్నది. ఆ గ్రామములో విశాలమున్ను, సుందరమున్ను అయిన వెంకటేశ్వర దేవాలయము ఒకటి యున్నది. ముసాఫరులు దిగడానికి ఇదే యుండ్లకన్నా [illegible]గా నున్నది. బస్తీ గ్రామము. ౪౦ కోమటియిండ్లున్నవి. సకల పదార్థాలున్ను దొరుకును. ఆ గ్రామము హయిదరాబాదు రాజ్యములో చేరినది, అయినా హయిదరాబాదు నవాబుక్రింద అనేక జమీనుదారు లున్నారు. గనుక కొల్లాపురపు జమీనుదారునితో ఆ గ్రామము చేరియున్నది. ఆ జమీనుదారులు క్లుప్త మయిన రూకలు కట్టి సకల రాజతంత్రములున్ను తమ తమ జమీనుదారీలో స్వతంత్రముగా జరిపింపు చున్నారు. సేనా సహాయ సంపద యెక్కువ గల జమీనుదారుడు క్లుప్త మయిన రూకలిచ్చుట లేదని చెప్పుట కలదు. అప్పుడు హయిదరాబాదు వారు దండెత్తి కొట్టి సాధించి రూకలు తీసుకొనుచున్నారు. ఆ జమీనుదారులకు ఒకరి కొకరికి సరిపడక వచ్చినట్టయితే పోట్లాడి చావడము మాత్రమే కాకుండా ఒకరి గ్రామాదులను ఒకరు కొల్ల పెట్టి రహితులను హింసించి గ్రామాదులను పాడుచేయు చున్నారు. ఈలాగున కలహములు పొసగినప్పుడు న్యాయము విచారించి యొకరికొకరికి సమ

రస పెట్టకుండా దివాణజీతనము చేసే చందులాలా ప్రభృతులు ద్రవ్య కాంక్ష చేత నుభయులకున్ను కలహమును పెంచి వేడుక జూచుచున్నారు. ఈలాటి ప్రారబ్ధము నా ప్రయాణకాలములోనే వనపర్తి జమీాను దారునికిన్ని కొల్లాపురపు జమీానుదారునికిన్ని. ఒక సంవత్సరముగా పొసగి తహతహపడుచున్నది. నేను ఆ పెంటపల్లి కోటలో హాయిదరా బాదు నవాబువారిని కొంత ఫౌజు ఉన్నందున నయభయాలచేత ఆ ఖిల్లేదారుని స్నేహితునిచేసుకొని జవానులను కొందరినికూడా తీసుకొని ౨౫ తేది ఉదయాన ౫ ఘంటలకు ప్రయాణమై ౮ కోసుల దూరములో నున్న పానగల్లు అనే ఖిల్లాగ్రామము ౧.౨ ఘంటలకు చేరినాను. ౩ కోసుల దూరమునకు వెనక తుమ్మగుంట యనే గ్రామమున్నది. అది మొదలు కుంపిణీవారు హాయిదరాబాదుకు లష్కరు వెళ్ళడానకు యేర్పరచిన భాట. అంతకు లోగడ దున్నప్పారు మొదలుకొని ఆ తుమ్మ గుంటవరకు శ్రీశైల యాత్రనిమిత్తమై నేను కల్పించుకొన్న భాట. ఆ పెంటపల్లెకు పోయినవెనక హాయిదరాబాదుకు వెళ్ళను అనేక భాటలను లోకులు చెప్పుదురు. వాటిలో కొత్తకోట భాటను అందరు సాధారణముగా ముఖ్యమని చెప్పుదురు. అది చుట్టుగానున్ను, ప్రయాసమైన మార్గముగాను న్నున్నది. ఆ తుమ్మగుంటవరకు భాట వెల్లడిగా సరళమయినదిగా యిసకపరగా నున్నది. అది మొదలుకొని పానగల్లువరకు చిన్నచిన్న కొండలపక్క పార్శ్వములలో నుంచున్నది. ఆపానగల్లు కొండక్రిందనున్ను, కొండమీాద విశాలమైన దుర్గమున్నది. ఆ గ్రామమున్ను, దానితో చేరిన మరికొన్ని గ్రామములున్ను జేరాల బారోగాకు జాగీరుగా నిచ్చినారు. గ్రామము బస్తీగాకపోయినా యింగిలీషులష్కరుకు సరంజామాచేసి వాడికెపడినది గనుక ముసాఫరులకు కావలసిన వస్తువులు దొరుకుచున్నవి. ఇండ్లు మిక్కిలి కుసందిగా నున్నవి. చావళ్ళు గలవు. బ్రాహ్మణులు నిండా పారమార్థికులుగారు. ఆ రాత్రి అక్కడనే నిలచినాను.

౨౬ తేది ఉదయాన ౫ ఘంటలకు బయిలువెళ్ళి ౧.౨ ఘంటలకు ౬ కోసుల దూరములోనుండే చిన్నమంది అనే గ్రామము చేరి

నాను. 3 కోసుల దూరమునకు వెనక వనపర్తి అనే జమీనుదారి కసుబాగ్రామము ఖిల్లా సహితముగా సమస్థానపరువు కలిగియున్నది. పానగల్లునుంచి తెచ్చిన జవానులను మార్చడమునకు ౧ గంటసేపు అక్కడ నిలిచినాను. వనపర్తి ౮ ఘంటలకు చేరినాను. దోవ యిరు ప్రక్కలా అడివి కలిగియున్నా దారి సన్నయిసుకపరగా బాగా ఉన్నది. మృగభయము లేదు. వనపర్తివరకు కొండలనడమ భాట పోయినా రాతిగొట్టుకాదు. ఆ యూరున్ను రహాదారి అయినందున ముసాఫరులకు కావలసిన సామానులు దొరుకును. ఊరూరికి కోటలు వుండడము మాత్రమే కాకుండా హయిదరాబాదువారి రాజ్యములో ఊరూరికి ఒక జమీనుదారు డున్నందున శిబ్బందికి జీవనము కలగడ మొక్కటేగాని, రహితులకు న్నితరులకున్ను క్షేమములేక ప్రాణభయ ముతో సదాకాలము తోయుచు నుండవలసి యున్నది.

కుంఫిణీవారు మజిలీపట్టీలు వారి పంచాంగములో వ్రాయుచు వచ్చుచున్నారు. గ్రామాదుల పేళ్ళు వివరముగా వ్రాయుసందున వారు వ్రాసిన ప్రకారము పేళ్ళు అడిగితే అట్టి గ్రామమే దారిలో లేదను చున్నారు. గ్రామాదుల దూరమును కొన్ని ప్రకరణములలో తప్పి వ్రాసినారు. ఇందుకు సందేహము లేదు.

ఆ చిన్నమంది అనే వూళ్ళో వసతి యయిన చెరువు కట్టమీద నీడ యివ్వగల చెట్లున్నవి. ఇండ్లలో దిగడానకు స్థలము చాలదు గనుక చెరువుకట్టమీదనే వంట చేసుకొని భోజనము చేసి ౩ ఘంటలకు బయిలువెళ్ళి అక్కడికి ४ కోసుల దూరములో నుండే గణపురము సాయంకాలము ౬. ఘంటలకు చేరినాను. ఆ గణపురానికి వెళ్ళే దోవలో చోళపురము, మనోజీపేట అనే రెం డూళ్ళున్నవి. మనోజీపేటవరకు భాట కిరుపక్కల దట్టమయిన అడివి భాట విశాలముగానున్ను, గులక యిసుక పొరగానున్ను నడవడానికి వైపుగాను న్నున్నది. భాట కిరు పక్కల కొంతదూరంలో చిన్న తిప్ప లున్నవి. మనోజీపేట అనే వూరు బస్తీ అయినది. దేవాలయ మున్నది. కొంత దూరములో కొండమీద వెంకటేశ్వర స్థల మున్నది.

ప్రసిద్ధ మయిన దేవస్థలము. ఆ మనోజీపేటకు సమీపాన నీడ గల యొక తోపు సుందరముగా నున్నది. అక్కడికి సమీపముగానే బంగారుగుండు అనే పేరు కలిగిన యొక సోగయయిన గుండు ఒక తిప్ప కొనయందు యున్నది. చూపుకు ఆ తిప్పగుండు పానవట్ట సహితమయిన లింగాకారముగా నగుపడుచున్నది. ఆ మనోజీపేట మొదలుగా గణపురము వరకు కొండలనడుమ ఘాట పోయినా రాళ్ళు లేవు. అది గులక యిసక పొరగా నున్నది. ఆ గణపురము జాగీరు గ్రామము. కొండ క్రింది యూరు, కొండమీద దుర్గము. కోట, మజుబూతీ (గట్టి)గా కట్టి యున్నది. బస్తీగ్రామము. ౨౦-౩౦ బ్రాంహ్మణుల యిండ్లున్నా చిన్నవి గనుక స్థలము దొరకడము ప్రయాస. చావిళ్ళున్నవి. అన్ని పదార్థాలు దొరకును గాని నీళ్ళకు బహుప్రయాస. బావులు లోతుగా నుండడమే గాక జలము ఉప్పుగా నున్నది. మంచినీళ్ళు బహుదూరముగా వెళ్ళి తెచ్చుకొనవలసినది. ఆ రాత్రి అక్కడ నిలచినాను.

౨౭ తేది ఉదయాన ౫౹౪ ఘుంటలకు ప్రయాణమై ౧౧ ఘుంటలకు ౬ కోసుల దూరములో నుండే జడచర్ల అనే యూరు చేరినాను. దారి యిసుకపొర. ఆ నడమ మూలకర్ర, కోటూరు, ఆలూరు అనే గ్రామాదు లున్నవి. ఆలూరివరకు అడివినడమ ఘాట. ఆలూరు మొదలుకొని అడివి లేదు. దారిలో జలసమృద్ధి గల బావులు, చెరువులు న్నున్నవి. వరిపొలాలు పొలకట్లు తీర్చియున్నవి.

కృష్ణానది దాటినదిమొదలు శేషాచలపర్వతము అదృశ్యమయినా అడుగడుగుకు చిన్న చిన్న పర్వతా లున్నవి. సృష్టిచేసిన పరమాత్ముడు ఆ కొండలు రాతిమీద రాయిని అతికియుంచినట్టుగా నొక బండమీద నొక బండ యిమడక దొర్లునని తోచిన తావులలో పలకవంటి రాళ్ళను కొల్లేరుతో చెక్కి చక్కచేసినట్టు ఉంచి యిమిడిచి యున్నది. ఆ కొండల సమూహములను జూడగా భూమిని ముక్కాలు వాశి పర్వతమయముగా భగవంతుడు చేసినట్లు తోచుచున్నది. ఇన్ని పర్వతములను సృష్టించ డానికి ముఖ్యకారణ మేమని యోచించగా నీ భూగోళము ఉదకబుద్బుదము గనుక భూమిని

స్థావరదశను పొందించేటందుకు ఈ పర్వతసమూహములను సృష్టించినట్టు తోచబడుచున్నది. పరమాత్మునియొక్క లీలావిభూతి యయిన యీవిచిత్ర పర్వత సమూహములున్ను నానావిధము లయిన వృక్షాలున్ను కలిగిన అరణ్య సమూహములు చూడగా బుద్ధి ఆశ్చర్య పడడానికి చాలియున్నది గాని వర్ణించుటకు శక్తిని పొందచాలక నున్నది. ఆపగలు అక్కడ నిలచినాను. ఆయూరు బస్తీయయినది. సంపన్నులయిన కోమటి షాహుకారులున్నారు. దేవస్థల మున్నది. అందులో దిగవచ్చును. రమణీయ్యమైన కోనేరు వున్నది. అదిచుట్టు మంటపాలతో నేర్పరచ బడియున్నది. సకల పదార్థాలు దొరుకును. ఆయూరున్ను ఇంకా కొన్ని గ్రామాలున్ను రాజగోపాల రావు అనే ఆరువేల నియోగి బ్రాహ్మణునికి మొకాసాదారులుగా [illegible] నడుచుచున్నది. ౩ లక్షల రూపాయీలు గోలకొండ నవాబుకు కట్టు చున్నారు. ఇప్పుడు ౧౨ సంవత్సరముల చిన్నవాడు [illegible]ముగా దొరతనము చేయుచున్నాడు. ధర్మ సంస్థాన మని చెప్పబడు చున్నది. రాచూరు అనేయూరు వారికి రాజధానిగా నున్నది.

౨౦ తేది ఉదయమయిన ౫ఘంటలకు లేచి ౩ కోసుల దూరములోనుండే నాగనపల్లె, బాలనగర మని రెండుపేళ్ళు కలిగిన యూరు ౧౦ ఘంటలకు చేరినాను. దారిమిక్కిలి సరాళము. గులక యిసక కలిగిన రేగడభూమి. నడవడానికి బండ్లకు మిక్కిలి సుఖముగా నున్నది. ఆయూరికి చుట్టున్ను కోట యున్నది. అది బాలచందు అనేముసద్దీకి జాగీరుగానివ్వబడినది. అతడు బహుధర్మాత్ముడని పేరుబడి యున్న కాయముతో ఇప్పటికి జీవించు చున్నాడు. అతనికి మొగసంతు లేదు. అల్లునికి జాగీరు నడుచు చున్నది. ఆ కోటనున్ను, గ్రామమునున్ను బహుబస్తీ చేసియున్నాడు గనుక ఇదివరకు చూచిన యనేకము లయిన కోటలలో ఈ కోట గచ్చుచేసి చూపుకు బాగా వున్నది. బహుబస్తీ గ్రామము ఆ గ్రామములో నుండే యొక ఆడమనిషి అక్కడ ధర్మశాలయని వాడుకొనే యొక సత్రము కట్టియున్నది. తిరుపతి వదలిన వెనక సత్రమనే మాట యిక్కడ విన్నాను. బాలచందు ౨ దేవాలయములు వారి

మున్నది. ఆ పాలమాకుల వరకు ఘాట సరాళము. కొంత కొంత దూరము రాతిగొట్టుగా నున్నది. జలచలా వదిలిన వెనక పర్వత సమూహముల దర్శనము దారిలో నిదివరకు లేదు. సాధారణమైన యడవినడుమ ఘాట పోవుచున్నది. ఆ గ్రామములో దిగి వాడికెపడిన మామిడితోపు జలవసతిగా నున్నందున అక్కడ భోజనమునకు దిగినాను. గ్రామమందు కావలసిన పదార్థాలు దొరకును గాని దిగను స్థలమివ్వరు. ఆత్మకూరు మొదలుకొని దిగడానకు దేవస్థలము లుంటేనే వయివుగాని యిండ్లలో స్థలమివ్వరు. ఇచ్చేపాటి విశాలమయిన యిండ్లున్ను లేవు.

ముసాఫరులు పరువుకావలెనంటే డంభము వహించవలెను. ఆ డంభమునకు తగిన దాతృత్వము లేకుంటే లోకులు సంతోషింపరు. ఇంతేకాకుండా దోవలో విషయభోగముల నెక్కువగా అపేక్షించే కొద్దీ వ్యసన మెక్కువౌచున్నది.

దూరప్రయాణము బోను మేనా సవారీలు తీసుకొని వచ్చేవారు సవారీలకు దండెను ఆసరాచేసి కిందను మీదను ర ఇనపకమ్ములు బిగియించి యిస్కూలు చీలలు కొట్టకమునుపు బలమయిన మూలతగుళ్ళు కొట్టించి ఆ తగుళ్ళలో ద్వారములు చేసి వాటిలో యిస్కూలు చీలలు బిగియించవలెను. అటు చేయనందున నా బంగాళాపాలకీ దోవలో మోసుకొని వచ్చునప్పుడు ఆ చీలలు కొట్టిన తావున పలకచీలి పల్లకీ కిందపడుచునుండెను. చీలిన చప్పుడు వినగానే నా బోయీలు పల్లకీని దిగువ దించినారు. దోవలో బావులు లోతుగా నుంటే నీళ్ళు చేదుకోవచ్చునని తెచ్చిన సీమ సన్నతాడు ౫ం బారలది వద్దనుండగా పయిన ౫ కట్లున్నూ చట్టానికి దిగువ ౫ కట్లున్ను చుట్టు బలముగా వేసి ముందు దండెకున్ను వెనక దండెకున్ను దిగువ చట్టముగుండా మూడు కట్లువేసి బిగించి యిది వరకు భగవత్కటాక్షము చేత ఆ పల్లకీమీదనే సవారీఅయి వచ్చినాను. కాబట్టి పల్లకీసవారీ అయి వచ్చేవారు కొన్ని తాళ్ళు అగత్యముగా కూడా తేవలసియున్నది. నా వద్ద నున్న తాళ్ళు చాలక దోవలో నెక్కడ విచారించినా తాళ్ళు దొరికినవి కావు గనుక సాగ

నార నివృత్తిసంగమ మనే గ్రామములో తీసి బోయీలచేత తాళ్ళు పేడించి కట్టించినాను.

యింతే కాకుండా పరివారసమేతముగా దూరదేశము పొయ్యే వారు దారిలో అస్వస్థపడే పరిజనము ఆటంకపడి నిలవకుండా సాగి రావడానికి దినానికి 3 ఆమడ దూరము నడవగల యొక గుఱ్ఱపు తట్టువ నున్ను ౫ బోయీలతో నొక తేలికయయిన సామాన్యపు డోలీ నిన్ని కూడా తీసుకొని రావలసినట్టుగా నా యనుభవము నాకు తెలియ చెప్పినది. అదే ప్రకారము తిరుపతిలో రూ ౨౬. కి ఒక గుఱ్ఱపుతట్టువను తీసి కూడా తెచ్చినాను. అందరున్ను ఆరోగ్యముగా నుండే కాలములో తట్టువమీదనున్ను డోలీలోనున్ను కావలసిన భోజనసామానులను అధికముగా చెయికావలికి వేసుకొని పోవచ్చును.

యింకా నా యనుభవమువలన తెలియవచ్చినది యేమంటేసపరి వారముగా దేశము తిరిగేవారు చికిత్స చేసే క్రమము యథోచితముగా తెలిసినవారిని కూడా పిలుచుకొని తగుపాటి యౌషధములు కూడా తీసుకొని పోవలసినది. ముఖ్యముగా అజీర్తికి జ్వరమునకు వ్రణాలకు గాయములకున్ను ఔషధాలు తీసుకొని పోవలసినది. ఆ ప్రకారముగానే నేను తెచ్చి నా వద్దనుండే ఔషధాలు నా బుద్ధిస్ఫురణద్వారా నాతో కూడా వచ్చిన వారికి ఇచ్చుచు వచ్చినంతలో భగవత్కటాక్షముచేత నా పరివారానికి వచ్చిన యుపద్రవములు నివారణ మవుచు వచ్చినవి. కూడా వచ్చేవారికి నొక విధమయిన నిర్భయమున్ను తోచి యుండెను. శీమసైనపువత్తు లెంత భద్రముగా నుంచినా తునకలుగా పగులు చున్నవి గనుక బంగాళా నాటువత్తులే దారికి యోగ్యము లని తెలుసు కొన్నాను. అణాలు, అర్ధణాలు, పావులాలు చెన్నపట్టణపు దుడ్లు కడప విడిచిన వెనక దొరకవు. కూడా తెచ్చియుంటే వెండి నాణ్యా ములు మాత్రము పనికివచ్చుచున్నవి. కృష్ణ కవతలి పేయిసాలు కృష్ణ కీవల పనికిరావు. కృష్ణకు నుత్తరమున అణాలున్ను పనికిరావు.

---

24/12/1947

## మూడవ ప్రకరణము

ఆషాపురము 3 ఘంటలకు వదిలి రాత్రి ౮ ఘంటలకు ౬ కోసుల దూరములోనుండే హైదరాబాదు షహరు ప్రవేశించి షహరుకు సమీపమందుండే బేగంబజారు అనే పేటలో నొక తోటలోని బంగా ళాలో దిగినాను. ఆషాపురము వదిలిన వెనక ౨ కోసుల దూరములో షంసాబాదు అనే బస్తీ గ్రామము కోటసహితముగా నొకటి యున్నది. అదివరకు దోవసరాళము. లోగడి మజిలీ భాటవలెనె ౧ గడియదూరము మిట్టయెక్కుచు గడియదూరము పల్లములో దిగుచు దారిని నడవవలసినది. షంసాబాదు మొదలు చిన్నతిప్పలు దారికి నాలుగుపక్కలా అగు పడుచు వచ్చును. దారి కొంచెమయిన రాతిగొట్టుగలది. దగ్గిరదగ్గిర చిన్న గ్రామాలున్నవి. అనేక మశీదులు చూచుచు పోవచ్చును. చిన్న చెరువులు కొన్నియున్నవి. వాటికింద మామిడితోపులున్ను, కూరగాయల తోటలున్ను వేసియున్నవి.

ఆ దినము మొహర్రం అనే పండుగ ఆరంభమయినది. ఆ తొమ్మిదో దినము ఆ షహరుకు కంచికి గరుడసేవ ముఖ్యమైనట్టుగా ఆ మొహర్రం పండుగ ప్రబలమైన యుత్సవము. ఆ యుత్సవ కాలములో పరమాత్ముని చైతన్యము ఆ షహరులో నెక్కువగా ప్రకాశించుటచేత అనేక వేలమంది యితర మతస్థులుగా నుండేవారుకూడా షహరుకువచ్చి ఆ తొమ్మిదోదినము మొదలు ఆఖరువరకు నుంచున్నారు. సకలవిధము లయిన యారాధనలను అంగీకరించి "యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ" అనే వచనప్రకారము లోకుల యిష్టసిద్ధిని చేసే పర మాత్ముడు ఒక్కడేగనుక ఆ యుత్సవకాలములో పరమాత్ముని చైత న్యము అక్కడ ప్రతిఫలించుటచేత ఆస్థలము ఆ కాలమందు పుణ్యస్థల మని భావించి అక్కడ నట్టికాలమందు నన్ను ప్రవేశ పెట్టినందుకు నీశ్వ రుని చాలా కొనియాడడ మయినది.

౨౯ తేది రాత్రి మొదలు జూలాయి నెల ౮ తేదీ సాయంకా లమువరకు హాయిదరాబాదు షహరుతోచేరిన బేగంబాజారులో నున్నాను. ఆ రాత్రి మొదలు జూలాయి ౧౯ తేది రాత్రివరకు శికంద

రాబాదు అనే పేరుగలిగిన యింగిలీషువారి దండు ఉండే బస్తీకి సమీపముగా నున్న కాకాగూడ మనే బొమ్మదేవర నాగన్నతోట చావిడిలో నుంటిని.

హాయిదరాబాదు షహరుకుచుట్టు బేగంబజారు అనే బస్తీ యొకటి యున్నది. అందులో సాహుకార్ల కోఠీలు కలవు. అది షహరు కంటె వాసయోగ్యము. అక్కడికి కోసెడు దూరములో కారువానా అనే బస్తీ యొకటి యున్నది. అది రత్నాలు వగయిరా అమ్మే వర్తకులుండే స్థలము. ఆ బేగంబజారుకు చేరినట్టు యింగిలీషు రెసిడెంటు వారి ఖర్చుక్రింద విస్తారముగా నున్ను అలంకారముగా నున్ను ఒక హవేలీ కట్టించుకొని నిజాముకు బాడిగె ఇచ్చుచు కాపుర మున్నాడు. హవేలి చుట్టున్ను లోకులున్ను వర్తకులున్ను ఇండ్లు కట్టుకొని యుండుటచేత నొక పెద్ద బస్తీ అయినది. ఆ స్థలము పేరు చంద్రఘాటు అనుచున్నారు.

షహరు లోపల షాలీబండ అనే పేరు కలిగిన యొక పేట యున్నది. ఆ స్థలమందు అక్కడి బ్రాహ్మణులు ఇండ్లు కట్టుకొని కాపుర మున్నారు. దివాన్ పేష్కారు చందులాలు అక్కడ ఇండ్లు కట్టుకొని కాపురమున్నాడు. నిజాం దేవిడి షహర్ నడమ నున్నది. అనేకులయిన పెద్దమనుష్యులు, అమీరులు వుమరా లనే పేరు కలవారు, సాధారణపు వర్తకులు, నిజాం వంశస్థులున్ను షహరునడమ కాపుర మున్నారు. షహరునడమ మక్కామజ్జిత్ అనే యొక తురకల జపశాల యున్నది. దాని స్థూపీలు రెండు మొలాము చేయబడి యున్నవి గనుక బహుదూరానికి తెలియుచున్నవి. మశీదుకు నెదురుగా లోగడి దివాన్ మీరాలం అనే వాడు కట్టించిన కారంజీలు లోతుగా నున్నవి. వాటికి సమీపముగా చౌకు అనే పేరు గల గుజిరీ అంగడి యొకటిన్ని, బట్టల యంగళ్లు, పాత్రసామానుల యంగళ్లున్ను ఉన్నవి. నాలుగు దోవలు చేరడానకు గాను కట్టిన యొక గొప్ప స్థూపీ గలిగి నాలుగు ద్వారాలు గలిగిన యొక చావడిన్ని యున్నది. షహరులో రాజవీధులయందు గుండురాళ్లు పరచియున్నవి. అట్టి వీధులలోనుండే కిశ్మలమయిన యుడుసులో నడిచేవారి పాదాలు పూడిపోవుచున్నవి. ఇండ్ల యలంకార

మున్ను సందులకు సందియున్న యితర దక్షిణదేశపు షహరులలో
వాసముచేసే వారికి ఇష్టముగా నుండవు. రాజవీధులలో ఏనుగలు
మొదలయిన వాహనాలు యెల్లప్పుడు సంచరింపు చున్నవి గనుక
నున్ను మనుష్యులందరున్ను, ఆయుధపాణులై మొత్తని వారిని
కొట్టి నరుకుచున్నారు గనుక నున్ను, షహరులో ఇతర దేశస్థులు
సవారీమీద పోయి రావలసియుంటే ఆయుధపాణులైన విశ్వా
స్యము కలవారిని కొందరిని కూడాపిలుచుకొని పోవలసి యున్నది.
కృష్ణానది దాటినది మొదలు హైదరాబాదు వరకు పకీరులు నిండి
యున్నారు గనుక సవారీమీద నెవరు వచ్చినా అడుగడుగుకు పకీరులు
పొగడి భిక్షం అడగక మానరు. వారికి కొన్ని గవ్వలయినా యిచ్చి
పోకపోతే అవమానము తోచుచున్నది. చెన్నపట్టణపు రూపాయి
౧ కి అక్కడి పయిసాలు ౫౦. పయిసా ౧ కి ౨౦ పుంజీలగవ్వలు. పుంజీ
౧ కి గవ్వలు ౪. యీ హాయిదరాబాదులో పిచ్చిరూపాయలని యొక
దినుసున్ను గోవింద బక్షీలని యొక దినుసున్ను చెలామణీ యవు
చున్నవి. ఆ రూపాయలు ఒకచేతినుంచి యొక చేతికి వచ్చేటప్పుడు
యొకటి రెండు పయిసాలు వట్టమియ్యకనే చెలామణీ కానేరదు. చెలా
మణీ రూపాయలకు అక్కడివారు చేసే పరీక్ష అసదృశ మయినది. ఎట్టి
రూపాయిల కయినా ఒక దోషము పెట్టక మానరు. చెన్నపట్టణపు
కుంఫిణీ రూపాయలకు ఆ తొందర లేదు. అయితే అవి దొరకవు. మరి
అక్కడి రూపాయలకు రూపాయి ౧ కి పయిసాలు ౪౦.

ఈ షహరు గోడకు చేరినట్టుగా 'ముసి' అని అక్కడి వారిచేత
చెప్పబడుచున్న ముచుకుంద నది పారుచున్నది. ఆ నది వాడపల్లెవద్ద
కృష్ణలో కలియుచున్నది. అది గొప్పనది. పోయినసంవత్సరం నదీప్రవా
హము ఎక్కువగావచ్చి ఢిల్లీ దరవాజావద్ద యింగిలీషువారు కట్టిన
వారధిని పగలకొట్టి ఆ షహరులో కొన్ని వీధులున్ను, బేగంబజారులో
కొన్నివీధులున్ను ముంచివేసి పోయినది. బేగంబజారుకున్ను, షహరు
కున్ను నడమ ఆ నది దాటుటకు పూర్వకాలమందు తురకలు మంచి
రాళ్ళతో అతి బలముగా నొక్క వారధి యేనుగలు మొదలయినవి
గుంపుగా నెక్కి పోవడానకు యోగ్యముగా కట్టినారు. ఆ షహరు

చుట్టున్ను చిన్న తిప్పలున్నవి. కొండలు మెండు. అనేక తిప్పల కొనల యందు మశీదులు కట్టబడి యున్నవి. హిందూదేవాలయాలు లేవు. అవి యున్నా వృద్ధికి రానియ్యరు.

పహారుకున్ను ఇంగిలీషుదండుకున్ను ౨ కోసుల దూర మున్నది. నడమ హుశ్శేనుసాగర మనే పేరుగల యొక గొప్ప చెరువున్నది. ఆకట్టమీద యింగిలీషువారు గుర్రపుబండ్లు పొయ్యేటందుకు యోగ్యముగా భాట ముచ్చటగా చక్కచేసి మొగలాయి వాహనాలున్నూ మనుష్యులున్ను ఎక్కినడచి చెరచకుండా భాటకు ఇరుపక్కల తమ పారా పెట్టియున్నారు. జాతులవాండ్లను తప్ప ఇతరులను ఆ కట్టమీద హుకుములేక ఎక్కనియ్యరు. ఈ జాతులవారిని పరంగీలని ఏలచెప్పుచున్నారంటే ఫిరంగీలతో సహవాసము చేసేవారు గనుక ఫిరంగీవారని ఈ దేశస్థులనసాగినారు. అది యితర దేశాలలో పరంగీవారని అభాసముగా అనబడుచున్నది. కుంఫిణీ లష్కరు ఉండే స్థలము హాయిదరాబాదుకంటే నానాటికి ఎక్కువగా బస్తీఅవుచున్నది. ౨౦ సంవత్సరముల క్రిందట నేను చూచినదాని కంటే మిక్కిలి బస్తీ అయియుండుటను చూడగా ఆశ్చర్యముగానున్నది. పహారులో వస్తువులకు సుంకములేదు. ఏవస్తువుమీద సుంకానికి ఎవడు ఊహించి దరఖాస్తుచేసినా దివాన్‌జీ ఆ సుంకము గుత్తకు ఇచ్చుచున్నాడు. కట్టెల బండ్లకు, విస్తరాకులకున్ను, పహారులో రావడానికి నాలుగయిదు తీరువలు. తీరువ తీసేవాని జోరావారి కొద్దిన్ని ఇవ్వవలసియున్నది. చంపినా అడిగే దిక్కు లేదు. యింగిలీషుదండులో ఈ తొందరలులేకుండా న్యాయ విచారణ కూడా కొత్తవాల్ చావడిలో కమ్మిస్సెనరైయాటు అసిస్టాంటు గుండాజరుగుచున్నది. గనుక లోకులున్ను వర్తకులున్ను ఆదండులో వసించడానికి మిక్కిలి ఇచ్ఛయింపుచున్నారు. అక్కడి యిండ్లకంతా ఎన్ని మిద్దెలుఅంతస్తులుగా కట్టినా స్తంభాలమీద పయి పూరి మోపుచేసి మట్టి గోడలుపెట్టి, ఆ గోడల పయిన నాజూకుగా,సన్నగార చేసి కావలసినట్టు చిత్రములతో పూయుచున్నారు. అక్కడి గులక కలిసిన యెర్రరేగడ మట్టి మిక్కిలీ గట్టిగా నుంచున్నది.

యింగిలీషు దండులో నేను దిగిన స్థలము వానయోగ్యము. ఆ షహరుకు చుట్టునుండే భూమి బహు సారవత్తమయినది. ఏ వృక్షము వేసినా అతి వీర్యముతో పయిరయి వచ్చుచున్నది. అయితే పయిరు పెట్టే శ్రద్ధ యెవరికిన్ని ౨ కారణములచేత లేదు. మొదటి కారణమేమంటే బీదలయిన వారు ఏ చెట్లు వేసినా వాటి ఫలమును క్షేమముగా, ఆయుధాలే ఆభరణాలుగా నుంచుకొని సర్వమూ యశస్సుగా భావించుకొని యుండే లోకులు అనుభవించనియ్యరు. రెండో దేమంటే ఉపపన్నులు తోటలు వనాలు వేసుకొనవలెనంటే రాజకీయము లయిన విపత్పరంపరలు అప్పుడప్పుడు వారికి కలుగుటచేత ఆ సుఖము ననుభవించడానికి ప్రాప్తిలేక నున్నది. ఇంతకున్ను ఓర్చి వేసిన చెట్లు బహు బాగా అయియున్నవి. చోటా అరంజీపండ్లు విస్తరించి కలవు. సకల విధములయిన పండ్లున్ను, అరటిపండ్లు దప్ప మంచివిగానే వచ్చుచున్నవి. అయితే అతిప్రియము. చెన్నపట్టణము కంటె మూడింతలవెల యివ్వవలసినది. కూరగాయలు ఆ ప్రకారమే ప్రియములయినా మహా రుచికరములుగా నున్నవి. వస్త్రాలు, ఆభరణాలు, శిఫాయిలకు లాయఖు అయినవి. ఆషహరులో దొరుకును. భారీరత్నాలు కొనేపాటి యుత్సాహ ధైర్యము లెవరికిన్ని లేనందున వర్తకులు తేవసములేదు. ఆభరణాలు వగయిరాలు ఉంచుకొని విక్రయించేవారు తమ కాపునిమిత్తమై కొంత శిబ్బందిని వుంచుకొనవలసి యున్నది. తద్వారా ఒక గొప్పగౌరవము వారికి గలుగుచున్నది. అందువలన రత్నాలు, నగలు, కావలసిన గొప్పవారు వారియింటికి వెళ్ళి, వారిని పిలిపించుకొని కావలసినది వారు చెప్పిన ధరకు పుచ్చుకొని తమకు సమ్మతిఅయినప్పుడు ఖరీదు నిచ్చుచున్నారు. వర్తక సరణిగా అట్టి గొప్పవస్తువులు కొనిఅమ్మడము లేదు. సాత్వికప్రభుత్వముకల రాజ్యములో మెదిగినవారికి ఆ షహరులో ఉనికిన్ని, ఆరాజ్య సంచారమున్ను, భయప్రదములుగా నుంచున్నవి.

ఆ షహరుకు ౩ కోసుల దూరములో గోలకొండ అనే ప్రదేశ మొకటియున్నది. అక్కడ బలమైన కోటయున్నది. అందులో నిజాముయొక్క అంతఃపురస్త్రీలు సంస్థానము యొక్క మూలధనముతో కూడా ఉన్నారు. అందులో విస్తరించి గృహములు కట్టుకొని

మనుష్యులు కాపుర మున్నారు. ఆ షహరులో పెద్దమనుష్యులు ఆనందము కొరకు చేసుకోవడ మేమంటే ఒకబగీచా అనే చిన్నతోటవేసి, అందులో జలధారలు పయికిలేచే కారంజీలు కట్టి యుంచుకొను చున్నారు. ఆజల సూత్రాలు అలంకారముగానే యుంచున్నవి.

అక్కడి రాజ్యతంత్రము జరిపే క్రమమంటే పూర్వకాలమందు ఢిల్లీ పాదుషాను, శిఫాయి ధర్మముచేత సంతోష పెట్టి, ఆరాజ్యమును జాగీరుగా పుచ్చుకొన్న ఆసబుజావంశస్థులు ఇప్పుడు రాజ్యము చేయుచున్నారు. యింతకుమునుపు షౌలరుజంగు అనే అతడు దొరతనముచేసి, సంవత్సరము కిందట చనిపోయినాడు. అతని కొడుకులలో ఒకడయిన నాసర్ద్దౌలా అనే అతడు ఇప్పుడు కుంఫిణీవారి సహాయము చేతకట్టుకొని ప్రభుత్వమును వహించియున్నాడు. ఈ నవాబుకింద ఒక దివాన్ జాగీరు అనుభవింపుచున్నాడు. అతని కింద ఒక పేష్కారు సకల రాజ్య తంత్రము విచారింపుచున్నాడు. ఉండే రాజ్యమంతయు నవుకరులయిన అమీరు ఉమరాలనే పెద్దమనుష్యులకు జాగీరులుగానున్ను, పారంపర్యముగా ప్రభుత్వము చేసేవారికి జమీనులు గానున్ను, భాగించి జమీనుదార్లవద్ద మాత్రము సాలుకు ఇంత మాత్రమని రూకలు వసూలు చేసుకొనుచున్నారు. అమానిగా తాలుకాల నుంచుకొని మాముల్దియ్యతు వ్యవహారమును జరుపుకోవడము నిండా లేదు. వారి వారి అధీనముగా నుండే భూమికి వారు వారు పూర్ణమయిన స్వాతంత్ర్యము గలిగి ఆయా భూములలోని కాపురస్థులను భర్త భార్య మీద చెల్లించే అధికారముకంటే ఎక్కువయిన అధికారముతో నేలు చున్నారు. ఆనవాబు పెద్దలవద్ద ౪౦ సంవత్సరముల కిందట కుంఫిణీ వారు స్నేహమూలకముగా ప్రవేశించి ౬ పటాలాలను, వారి తయినాతిగా శికందరాబాదు అనే స్థలములో ప్రవేశపెట్టి, వకీలు భావనగా ఒక రిసైడెంటును అక్కడ నిలిపినారు. ఆ పటాలాల జీతానికి గాను కడప, బళ్ళారి, జిల్లాలు రెండున్ను ఈ నవాబువద్ద జాగీరుగా కుంఫిణీవారు పుచ్చుకొని యిప్పటికిన్ని అనుభవింపు చున్నారు. క్రమక్రమముగా రాజ్యతంత్రములో ఏ పని జరిగించ

వలసి వచ్చినా రిసైడెంటు అనుమతిలేక జరిపించే వాడికెల్లేని ఘట్టము ఇప్పట్లో పొసగి యున్నది. తమకు రూకలు కట్టని బలవంతు లయిన జమీనుదార్లవద్ద సాలేనా పయికము వసూలుచేసుకొనేటట్టు కందనూరు నవాబు రాజ్యము కుంఫిణీవారి యధీనము చేసినట్టే, కొద్ది కొద్దిగా చేయుచు వచ్చుచున్నారు. అటువంటి జమీన్ దారులవద్ద కుంఫిణీవారు రూకలు వసూలుచేసి నిజాముకు ముజరాయిప్పించు చున్నారు. సదరహి ౬ పటాలాలు గాక నింకా ౧౨ పటాలాల పర్యంతము రిసైడెంటు మూలకముగా కొలువుపెట్టి యింగిలీషువారి ఖాయిదాలో వుంచి అలువాల్ మొదలయిన స్థలములలో నుంచి నెల నెలకు, వారి జీతము రిసైడెంటు మూలకముగా ఆ నవాబు దివాన్ పేష్కారు యిచ్చుచు, రూకలుకట్టని జమీన్దారునిమీదికి కావలసి నప్పుడు కావలసిన మట్టుకు ఆ ఫౌజును పంపించుచు వచ్చుచున్నారు. ఇప్పుడు దివాన్ పేష్కారు చేసే చందులాలా సదరహీజాస్తి పటాలాల జీతానికిగాను నెల ౧ కి సుమారు ౩ లక్షలరూపాయలు యిచ్చు చున్నాడు.

యిదిగాక నవాబు మనోవర్తి ఖర్చులకు గాను నెల ౧ కి ౩ లక్షలరూపాయలు ఇవ్వవలసి యుంచున్నది. ఇంతేకాక నజరుయినా యతులుగా కొంతసెలవు చందులాలుకు తగులుచు వచ్చుచున్నది. ఇది పోగా మిగిలిన వస్తువులు ఆ దివాన్ పేష్కారు చేసేవాడు సమస్తమైన వ్రయము చేసుకొనుచు వచ్చుచున్నాడు. ఆ వ్రియములు చెయ్యడమునకు రాజ్యములో అయ్యే వసూలు చాలక దివాన్ పే ష్కారు అప్పులతో తహతహా పడుచున్నాడు. ఆ నవాబు రాజ్య మంతా కుంఫిణీ వారి వల్ల చాలా భయమును పొంది యున్నది.

యిటువంటి షహరు ౨౦ తేదీ ఉదయాన ౫½ ఘంటకు వదిలి ౬ కోసుల దూరములోనుండే మేడిచెలక అనేయూరు ౧౦ ఘంటలకు చేరినాను. దోవ బహు సరాళము; గులక యిసకపోర; గురప్పుబండ్లు నడవడానికి యోగ్యముగా నున్నది. బాటకు నిరుపక్కల సీతాఫలపు చెట్లుయడవి, మనోహరముగా నున్నది. మేడిచెలక యనూరిముందర

నొకటి రెండు వాగులు దాటవలసియున్నవి. అవి వర్షాకాలమున ప్రవాహము వస్తే దాటుటకు నొకటి రెండు దినములు కాచవలసి యున్నది. ఊరు పెద్దది; కావలసిన వస్తువులు దొరుకును; అంగళ్ళు చాలా యున్నవి.

నేను చెన్నపట్టణమునుంచి వచ్చేటప్పుడు కొలువుగా పెట్టుకొని తెచ్చిన ౬ మంది బంట్రౌతులుగాక కడపలో ౪ మరాటి బంట్రౌతులను కొలువులో పెట్టినాను. హయిదరాబాదులో నెక్కువగా ౬ మందిని కొలువుపెట్టినాను. వీరికంతా జనము ౧ కి నెల ౧ కి రూపా ౭ లెక్కను జీతముచేసి నేను చేసిన ఖాయిదా యేమంటే కాపాడవలసిన మూల పదార్థము సహజముగా యజమానివద్ద నుండే పెట్టెలలో నుండు ననే తాత్పర్యము లోకులకు ఉండవలసినదిగనుక అటువంటి తాత్పర్యముతో అయోగ్యులు ప్రమాదమును చేతురని తలచి నామూలధనము క్షేమముగా నుండుట కొరకు మూలధనపు పెట్టెలను సవారీలలో ఉంచి సవారీ తలుపులకు బిగాలువేసి సవారీలను ఊళ్లలో దూర ప్రదేశపు చావిళ్ళలోనున్ను, ముసాఫరుఖానాలలోనున్ను, మశీదులలోనున్ను ఉంచి యిద్దరేసి బంట్రౌతులను జాముకు ఒక జతగా పారాయిచ్చేటట్టు ౬ మందిని నిశ్చయించి బోయీలను జాగ్రత్తగా కూడా ఉండేలాగు దిట్టము చేయుచూ వచ్చినాను. సామాను కావడిపెట్టెలను నేను దిగేస్థలములో ఉంచి అక్కడ జాముకు ఒకడువంతున పారా ఉండేలాగు ముగ్గురు బంట్రౌతులను ఉంచుచు వచ్చినాను. హయిదరాబాదులో పాల్ లు అనే శిఫాయి డేరాలు నాలుగు తీసినందున అవి మోయను ౪ యెద్దులున్ను, ఆ డేరాలలో చెమ్మగిలకుండా వేసే ౬ కీలుచాపలు మోయను ఒక యెద్దున్ను, ఆడేరాల మేకులు ౨౦౦ మోయను ఒక ఎద్దున్ను, అంతు ఆరుయెద్దులున్ను ఎద్దు ౧ కి నెలకు రూపా ౫ లెక్కకొలువు పెట్టి తీసుకొని వచ్చినాను. ౩ యెద్దులకు నొక మనిషివంతున ఇద్దరు యెద్దుల వాండ్లు కూడా వచ్చినారు. ఆడేరాలు కొట్టనున్ను, తియ్యనున్ను ఇద్దరు కళాసులను నెల ౧ కి మనిషి ౧ కి రూపా ౭ లెక్కను సంబళానికి కొలువు పెట్టుకొన్నాను. ఆ డేరా బొంగులు ఎద్దులు

మోయవు గనుక అవి మోయను ఒక మనిషికి నెలకు ౬ రూపాయలు జీతము నిష్కర్షచేసి కొలువు పెట్టి నాలుగు జేరాల బొంగులు వదిన్ని సదరహి యిద్దరు కళాసులచేతనున్ను, సదరహి మనిషిచేతనున్ను మోయించుకొని వచ్చినాను. ఇంతేకాక హాయిదరాబాదునుంచి నాగపురికి పొయ్యేదారి బహు అడివిన్ని, మృగభయమున్ను, చోరుల యుపద్రవమున్ను కలిగినది గనుక దారిబాగా తెలిసేకొరకు హాయిదరాబాదు రిసెడెంటువద్దనుండే పోష్టాఫీసు రయిటరు మేస్త్రరు లూయీసు అనే పరంగి వాని మంచితనము చేసుకొని ఒకరన్నరున్ను అనే టప్పాలమనిషినికూడా పిలుచుకొని అక్కడక్కడికి రన్నరున్ను మనుష్యులు వారి వారి హద్దు వరకు నాతోకూడా వచ్చి దారి చూపించేటట్టు గిట్టము చేసుకొన్నాను. ఆ తపాలా రన్నరున్ను లను ఇక్కడ హరకారాలని వాడుచున్నారు. వారిని కుంఫిణీ యిలాకా మనుష్యులని ఆయా యూళ్ళలో గౌరవపరచుచున్నారు. తద్ద్వారా యీ యుపాయము నేను చెయ్యడము మిక్కిలి అనుకూలమయినది గనుక ఆ రన్నరున్నకు ౧ రూపాయి దినుగ ఇచ్చుచు వుసలాయించి ఒక మజిలీ నుంచి మరియొక మజిలీకి పిలుచుకొని వచ్చినాను. ఆ కృష్ణ దాటినది మొదలు ఆ దేశములో శాకులు విశేషముగా లేవు. ముఖ్యముగా హాయిదరాబాదు షహరులో ఒకటియైనా కనుపడినది కాదు. డేగలు పెంచేవారు విస్తరించి యున్నందున షహరులో వుండే కొన్నిటినిన్ని బ్రతకనియ్యరని తోచుచున్నది. ఆరాత్రి అక్కడనే నిలిచినాను.

౨౧ తేదీ ఉదయాన ౬ ఘంటలకు బయలుదేరి ౧౧ కోసుల దూరములో నుండే మాసాపేట అనే యూరు ౧౨ ఘంటలకు చేరినాను. దోవ నిన్నటిదోవవలెనే రమణీయ్యముగ నున్నది. ఇరుపక్కలా జీడిచెట్లు, విప్పచెట్లు, టేకుచెట్లు, మోదుగచెట్లు మొదలయిన వృక్షములు గల యడివిభూమి; సమమయినది. ఆ మాసాపేట గొప్ప యూరు. పేటస్థలము. సకలపదార్థాలు దొరుకును. అక్కడ ఆరాత్రి నిలిచాను. ఆయూరు వర్షాకాలములో మిక్కిలి బురదకలిగి చిత్తడిగా నుండుచున్నది. హాయిదరాబాదువద్ద హుశేనుసాగర మనే చెరువు మొద

ప్రాకారము దిగిన గ్రామము నుంచి అవతల దిగపోయ్యే గ్రామము నకు పంపుచు వచ్చినాను. ఆరాత్రి దేవాలయముతో చేరిన బ్రాంహ్మణ గృహమందు నిలిచినాను.

౨౩ తేది ఉదయాన ౬ ఘంటలకు బయలుదేరి అక్కడికి ౫ కోసుల దూరములో నుండే కామారెడ్డిపేట ౧౦ ఘంటలకు చేరి నాను. కృష్ణదాటినది మొదలుగా ఆ బిక్కనూరిపేట పర్యంతము దోవ గులక యిసక కలసిన గట్టిరేగడభూమి. ఏకాల మందున్ను నడిచే వారికి ఒక శ్రమనున్ను ఇయ్యదు. ఆ బిక్కనూరుపేట వదిలినది మొదలు కామారెడ్డిపేట చేరే పర్యంతము కాలుదిగబడే నల్లరేగడ భూమి; వర్షాకాలములో మిక్కిలి అడుసుగా నుంచున్నది. యెండా కాలములో ముండ్లవలెనే నడిచే వారికి గుచ్చుకొనుచు, కొంతదూరము భాట గులక యిసక పరగా నుండినా యీ నల్లరేగడ భూమిలో పడే ప్రయాస ఆ సౌఖ్యమును జ్ఞాపకానికి రానియ్యదు. దోవలో కొన్ని వాగులు దాటవలసి యున్నవి. ఆ కామారెడ్డిపేట వసతి యయిన గ్రామమే. అంగళ్ళు కలవు. అన్ని పదార్థాలున్ను దొరుకును. బ్రాంహ్మణగృహమందే దిగినాను. చెరువు వున్నది. జలవసతి గలదు. కృష్ణదాటినది మొదలుగా ప్రతిగ్రామములో నున్ను బియ్యము మంచి దిగా దొరుకుచున్నది. వడ్లపయిరు విస్తరించి హాయిదరాబాదు మొదలుకొని పండుచున్నది. ఆ రాత్రి అక్కడ వసించినాను.

౨౪ తేది ఉదయమున ౬ ఘంటలకు ఆ యూరు వదిలి అక్కడికి ౫ కోసుల దూరములో నుండే మల్లుపేట అనే గ్రామము ౧౦ ఘంటలకు ప్రవేశించినాను. దోవ నిన్నటికన్నా యెక్కువ యయిన నల్లరేగడభూమి. బహు లోతుగల వాగులున్ను, చెరువు మడుగు లున్ను దాటవలసి యున్నది. ఆ గ్రామము ఖిల మయినది. యథోచిత ముగా ముసాఫరులకు కావలసిన సామానులు దొరుకును. దిగడానికి స్థలము లేక ఆ గ్రామమందు మూడు డేరాలు ఒక చావడివద్ద కొట్టించి దిగినాను. హాయిదరాబాదు దాటినది మొదలు ప్రతి గ్రామానికిన్ని కోటలు బల మయినవి లేవు. కొన్ని కొన్ని గ్రామాలలో బురుజులు

మాత్రము కట్టించి యుంచుతారు. ఆ మల్లుపేటలో ఒక పాడుకోట యున్నది. చెరువు జలసమృద్ధి గలది. ఆ గ్రామములో రాత్రి వసించినాను.

౨౯ తేది ఉదయాన ౭ ఘంటలకు బయిలువెళ్ళి ౧౧ ఘంటలకు ౫ కోసుల దూరములో నుండే యీదలవాయి అనే రామస్థలము చేరినాను. ఆ యూరు చీలి జమీందారునితో చేరినది. గుడి చక్కగా కట్టి యుండకపోయినా దక్షిణదేశపు మర్యాద ప్రకారము ఆ జమీందారుడు గుడిలో సకల రాజోపచారములతో ఆరాధన నడిపింపు చున్నాడు. గుడిచుట్టు ౩౦ ఇండ్లుగల బ్రాహ్మణుల యగ్రహారమున్నది. ఈ తురకల రాజ్యమందు ఈ స్థలము కుంపటిలో తామర మొలచి నట్టున్నది. తిరుపతి వదిలిన వెనక రాజోపచారములతో ఆరాధన నడిచే గుడి యిది యొకటే చూచినాను. నా విచారణలోనున్న వేరే లేదని తెలిసినది. ఈ యూరు యథోచితముగా బస్తీగానే యున్నది. కావలసిన సామానులు దొరుకును. ఇక్కడి గుడిలో ప్రతిఫలించి యున్న పరమాత్ముడు ఈ జమీనుదారుని వంశస్థులకు పిలిచితే పలుకు ననే పాటి యనుగ్రహముతో ఆరాధనలు గైకొను చున్నాడు. మల్లుపేట వదిలిన వెనక కోసెడు దూరానికి ఇవతల యీదలగండి అనే దట్టమయిన అడివి యున్నది. రెండు కొంచపాటి తిప్పల నడమ భాట పోవుచున్నది. భాట బహురాతిగొట్టు. నల్లరేగడ భూమి. బహుచోరభయము గలది. మిక్కిలి భయంకరులయిన యింగిలీషు దొరలనే యీదలగండి భాటలో దోచినారు. నేను మల్లుపేట నుంచి ఆయుధపాణులను కొందరినికూడా తీసుకొని నాతోకూడా వచ్చిన మనుష్యులను యుద్ధసన్నద్ధులుగా దిట్టము చేసుకొని గండి దాటి వచ్చినాను. దీనిపేరు యీదలఘాటు అని చెప్పు చున్నారు. నడుమ వాగులు దాటవలెను. అదిన్నిగాక యీదలవాయి యూరిముందర వర్షాకాలములో చెరువులోనుంచి మిక్కిలి వేగముగా పారుచునున్న బహులోతు గల రెండలుగు కాలువలు దాటవలెను. అక్కడ డేరామేకుల కంట్లము చెరువు మడుగు కాలువలు దాటేటప్పుడు కొట్టుకొని పోయినది. ఇట్టి భయ

ప్రదేశములకు తుపాకులు బహుజరూరు గనుక కడపలో రెండు తుపాకులు తీసుకొన్నాను. హాయిదరాబాదులో కొల్వు పెట్టిన వారిలో అయిదుగురు తుపాకులు తెచ్చేటట్టు నిశ్చయము చేసినాను. ఆ గండిలో నడిచేటప్పుడు అక్కడక్కడ తుపాకీలు కాల్చుచు రావడ మయినది. మల్లుపేట మొదలుగా యీాదలఘాటు చేరేపర్యంతము భాట నల్ల రేగడభూమి; అటువెనుక భాట రాతిగొట్టు. ఆ యీాదలవాయియూరిలో చీలి జమీనుదారుని తరఫున పట్టేలు అనే అధికారస్థుడున్నాడు. దేవాలయ విచారణను అతడే చేయుచున్నాడు. ఆయూరిలో ౨౬ తేది రాత్రి పర్యంతము నిలవడ మయినది.

౨౭ తేదీ ఉదయమున ౬ ఘంటలకు యీాదలవాయి వదిలి అక్కడికి ౬ కోసుల దూరములోనుండే జగనంపల్లె అనే గ్రామము ౧౨ ఘంటలకు ప్రవేశించినాను. యీాదలవాయి దాటినది మొదలు కొని కోసెడుదూరములోనుండే డిచ్చుపల్లె అనే మజిలీగ్రామము చేరే వరకు ఒక చిన్న ఘాటునడుమ మార్గము పోవుచున్నది. అయినా ముందర వదలివచ్చిన ఘాటంత భయము కలది కాదు. భాట సమ భూమి. గులక యిసకపార. కొంచెము రాతిగొట్టు; ఇరుపక్కల మోదుగ చెట్లువగైరాల యడివి. ఈ డిచ్చుపల్లెలో యీాదలవాయిలో నుండే రామమూర్తిని ప్రతిష్ఠచేసే నిమిత్తమై పూర్వమందు గొప్ప దేవాలయము కట్టినారు. అయితే వాసానికి యోగ్యముగాదని తోచి పరమాత్ముడు కొన్ని లోకదృష్టాంతములచేత తెలియచేసి యీాదలవాయిలో యిప్పుడు ఆరాధనలు గైకొనే మూర్తులను స్థాపింప చేసినాడు. ఇప్పటికిన్ని డిచ్చుపల్లెలో కట్టిన దేవాలయము పాడుగా ఉన్నది. ఈ డిచ్చుపల్లె మొదలు జగనంపల్లె కోసెడు దూరము కలదనే వరకు భాట సరాళము, గులక యిసకపర, నిండా అడివి లేదు; అవతలి కోసెడుదూరమున్ను ఘాటునడుమ పోవుచున్నది. భాట కిరుపక్కల దట్టమయిన యడివి. కొండలసందున భాట. ఈ ఘాటు నిండా భయాస్పద మయినది కాదు. ఇక్కడ మొగలాయి ఠాణావారు కొందరు తుపాకులతోకూడా ఉంచున్నారు. వారు వచ్చేవారిచేత

మనిషికి రెండేసి పయిసాలువంతున పుచ్చుకొనుచున్నారు. యీ ఠాణా వారు పాంథులను కాపాడేవారివలె అభినయించడమే గాని వేరుగాదని తెలిసియుండవలసినది. ఈ జగనంపల్లెలో రెండు చిన్న దేవాలయా లున్నవి. రమణీయ్యమైన స్నానఘట్టము కలిగిన చెరువున్నది. అంగళ్లు కలవు. అన్నిపదార్థాలు దొరుకును- బ్రాంహ్మణులయిండ్లలోనే దిగి నాను. యిక్కడికి సమీపాన నరసింహక్షేత్ర మొకటి అడివినడమ నున్నది. జాగ్రతస్థలము. ఇక్కడికి ౪ మజిలీల దూరములో వేములవాడ అనే మహాక్షేత్ర మున్నది. అది భీమేశ్వర రాజేశ్వరక్షేత్రము. వేములవాడ భీమకవి జన్మప్రదేశము. ఈ ప్రాంతములలో వ్యాఘ్రాలు పశువులను అప్పుడప్పుడు బాధింపుచున్నవి. ఆ రాత్రి జగనంపల్లెలో నిలవడ మయినది.



నాల్గవ ప్రకరణము

౨౮ తేది ఉదయమున ౬ ఘంటలకు ఆ యూరువదిలి ౧౨ ఘంటలకు అక్కడికి ౬ కోసుల దూరములో నుండే దూదుగాం అనే ఊరు చేరినాను. అది గోదావరీ తీరము. ఆరు బ్రాంహ్మణుల యిండ్లు న్నవి. గోవదావరి కవతలిగట్టున స్వర్ణ అని చెప్పబడే బ్రాంహ్మణుల యిండ్లుగల యగ్రహార మున్నది. ఆ దినము నడిచిన భాట సరాళము, యిసకపొర, నిండా అడివి లేదు. జగనంపల్లెనుంచి యీ దూదుగాముకు రెండు మూడు భాటలు కలవు. అందులో నేను వచ్చినభాట కొంచము చుట్టయినా వసతి యయినది. ఆర్మూరు అనే బస్తీ గ్రామము జగనం పల్లెకు 2 కోసుల దూరములో నున్నది. ఆయూరి మీద నొక భాట పోవుచున్నది. అది వసతి కాదు. జగనంపల్లెకు ౪ కోసుల దూరములో బాలకొండ యనే గొప్ప గ్రామము మహారువలెనే బస్తీగా నున్నది. యేరస్తాగుండా జగనంపల్లెనుంచి వచ్చినా యీ బాలకొండ నడివీధిలో నడిచి రావలసినది. నేను వచ్చిన భాట శీదాగా బాలకొండకు మధ్య యేయూరున్ను తగలకుండా వచ్చుచున్నది. హయిదరాబాదు వదిలినది

మొదలుగా పాలు, పెరుగు మాత్రము తంబళజాతి వారిగుండా ఊరూ రిలో సమృద్ధిగా దొరుకును. కూరగాయలు మాత్రము ఈ బాల కొండలో కండ్ల చూడవలసినదిగాని మధ్యదొరకవు ఈ యూరికి ౫ కోసుల దూరములో రామనపేట అనే యూరున్నది. అక్కడ మేనాసవారీలు గంజీఫా-చీట్లు ఇవి మొదలయినవిచేసి హయిదరాబాదుకు తీసుకొనిపోయి అమ్ముచున్నారు. యీ యూరిలో జీనిగెలవాండ్లు అనేకులు ఉపపన్నులుగా నున్నారు.

ఈ దేశములో తంబళ జాతివారు పుష్పాలు, పాలు, పెరుగు, తెచ్చి యిచ్చి మేళాలు వాయింపుచున్నారు. మంగలజాతివారు మషాల్ వేయుచున్నారు. బాలకొండకు ఇవతల కోసెడు దూరములో మూశలా అనే చిన్న గ్రామము; అది దాటి యీ దూదుగాముకు రావల సినది. యిది నిండా బస్తి అయినది కాదు. అనుర్గారు పరగణాలో చేరినది. పట్టేలు గుమాస్తా ఉన్నాడు. నది దాటించే పుట్ల విచారణకర్త వాస ముగా నున్నాడు. ఈ యూరికి అవతలితట్టున నుండే యూరు మాధ్వుల మయము. వారే తీర్థవాసులు. స్మార్తులు పది యిండ్లవారు ఈ రెండూళ్ళలో నున్నారు. కావలసిన పదార్థాలు యథోచితముగా దొరుకును. యీ దూదుగాముకు ఉభయపార్శ్వాలలో మహాగుల వంటి గ్రామాలు రెండున్నవి. ఒక పక్క బాలకొండ సరేగదా; గోదావరి నదికి అటుపక్క నిర్మల అనే మహా రొకటి యున్నది. ఈ రెండు స్థలములలో పట్టణములలో దొరికేలాగు సకల వస్తువులు దొరు కును. యీదలవాయి మొదలుగా దూదుగాము వరకు భాట యోగ్యముగా నున్నది. అడుసువల్ల, రాతిగొట్టువల్ల ప్రయాస నిండాలేదు. ఈ గోదావరి తీరమందు తీర్థవిధులు మొదలయినవి చేయడానికు ౪ దిన ములు ఉంటిని. హయిదరాబాదులో నున్న మట్టుకు అన్ని దినములు అక్కడ వృథాగా నిలవవలసి వచ్చెగదా అనే వ్యసనము చాలా వుండెను. ఇప్పుడు తద్వ్యతిరిక్తముగా మనస్సుకు బోధ అయినది. ఏలాగంటే అక్కడ నేను నిలిచియున్న సుమారు ౨౦ దినములున్ను ఈ ప్రాంతములలో క్షోణీపాత మయిన వర్షము. ఇదిగింటి మనిషి పొరిగింటికి పోకూడ

కుండా కురిసినందున చెరువులు కాలువలు పుష్కలముగా నిండినవి. ఆ వర్షములో నేను ఈ కుగ్రామాలలో తగిలి నట్టయితే మిక్కిలి ప్రయాస పడుదును. అటుగాకుండా శ్రీరాములదేమో నన్ను కొన్ని కారణాలచేత హాయిదరాబాదు షహరులో నిలిపినదిన్ని కాక, షహరు విడిచి ప్రయాణమైన వెనకకూడా, ప్రతిదినమున్ను నేను మజిలీచేరి భోజనము చేసిన వెనక సాయంకాలము మొదలుకొని ఉదయము వరకు వర్షము కురిసి వెలిసేటట్టు కటాక్షింపుచు వచ్చెను.

హాయిదరాబాదు వదిలినది మొదలు ఈ గోదావరి తీరము వరకు సడుమనుండే జమీనుదారులు, జాగీరుదారులు, పరగణాదారులు, షహరుకు ఆపక్కనుండేవారిపాటి బలాఢ్యులున్ను కలహప్రియులున్ను కారు. యథోచితముగా రిహితు వజాబందిమీద రూకలు వసూలు చేసే జ్ఞాపకము యీ ప్రదేశపు వారికి ఉన్నది గాని, షహరుకు అవతలితట్టు వారివలె ఊరూరికి కోటలు, కొత్తళాలు, బలముచేసి గ్రామాదులను పాడుచేయడము లేదు. కృష్ణదాటినది మొదలుగా ఈ గోదావరీతీరమువరకు యిక్కడివారు వాడే కోసు, మన ౧౪ గడియ దూర మవుచున్నది. యిది హాల్కాకోసు అనుచున్నారు. కృష్ణకు అవతలిగట్టు పర్యంతము వాడే కోసు, మన రెండు గడియల దూర మవుచున్నది. యిక్కడి కోసు ౨ మయిళ్లకు కొంచెము తక్కువనే చెప్ప వచ్చును. నేను మనకోసుల సుమారే చూచి వ్రాయుచు వచ్చుచున్నాను. మనగడియ దూరము ౨౮ నిమిషాలకు నడవ వచ్చును. గనుక ఆ నిదానమున ఊహించి, ఆ యా యూరికిగల దూరమును నిర్ణయించి వ్రాయుచు వచ్చుచున్నాను. ఇకనున్ను అట్లాగే వ్రాయడ మవుచున్నదని తెలియవలసినది.

ఈ గోదావరీ తీరమువరకు ఆ యా మజిలీగ్రామములలో తమలపాకులు దొరుకుచు వచ్చినా మంచివిగా నుండవు- గనుక దిగిన మజిలీ గ్రామాదులలో తమలపాకు లున్నచోటు విచారించి తోటల వద్దికి మన స్వంతమనుష్యులను పంపించి లేతవిగా గిల్లించి సంగ్రహించు కొనుచు వచ్చినట్లయితే అనుకూలముగా నుంచున్నది. హాయిదరాబాదులో గొప్పవారందరున్ను పండుటాకులు వేసుకొనుచున్నారు.

యీదలవాయిలో తమలపాకులు బహుసయము. కొలకొండలో పండ
టాకులు దొరుకును. కడపమొదలుగా యీ గోదావరీ తీరమువరకు
అమ్మే వక్కలు ముడివక్కలు- రెండుగా వొత్తి ఉడకబెట్టినవి కావు;
మంచిదిగా ఏర్పరచి వొత్తివేసుకొంటే మన దేశపు వక్కలకన్నా బాగా
రుచిగా ఉంచున్నవి. యీ దేశములో పేదలు నిండా తాంబూలము
వేసుకోవడములేదు; వొక్కలు మాత్రము నవులుతారు. గ్రామముల
చేతి హుక్కాలు ఇతరులు తాగుచున్నారు.

కృష్ణ దాటినది మొదలుగానున్ను ముఖ్యముగా హాయిదరాబాదు
మొదలుగానున్ను, ప్రతి మజిలీ యూళ్ళలో బియ్యముతో కూడా పాటు
తియ్యగానుండే గోధుమలపిండి విసిరి అమ్ముచు నమ్ముచున్నారు. యీ
దేశములో రొట్టె వినాగా అన్నమే భుజియించుచు వస్తే దేహానికి
బలములేదని వదంతిగనుక, మే మొకపూట రాత్రి అన్నముతో కూడా
రొట్టె తీసుకొనుచు వచ్చుచున్నాము. అది ఆరోగ్యముగానే యున్నది.

పై జగసంపల్లెనుంచి కుశదర్పణ మనే గోదావరీ తీరపు రామ
క్షేత్రానికి దారిపోవుచున్నది. ఆక్షేత్రము యిక్కడికి ౮ కోసుల
దూరము. నాగపూరి దారికి వొత్తియుంచున్నది. అక్కడ అనేక
బ్రాహ్మణులు తీరవాసమని యిండ్లు కట్టుకొనియున్నారు. ఈ దూదు
గాము నదికి గడియదూరములోనున్నది. యిక్కడ స్నానఘట్టము
వసతికాదు; నీడలేదు. నది యిప్పట్లో పూర్ణ ప్రవాహముగానున్నది.
ఇక్కడ సుమారు నది గడియదూరము వెడల్పుకలది. నది నడుమ
కొన్ని లంక లున్నవి.

కడప వదిలినది మొదలుగా అరవభాష తెలిసి మాట్లాడ
తగినవారు సకృత్తుగా నున్నారు. తెనుగుమాటలు సర్వసాధారణముగా
రాగసరళిగా చెప్పుచున్నారు. ప్రశ్నపూర్వకముగా ఉత్తర ప్రత్యుత్తర
మిచ్చేటప్పుడు శబ్దములను సంకుచితపరచి మాట్లాడుచున్నారు. ఎట్లా
గంట్లే యీ యూరు ఆయూరికి ఎంతదూరమంటే నాకు తెలియదు యెరుక
యని ప్రత్యుత్తరము పుట్టుచున్నది. పండుకొన్నాడు అనడానకు పండి
నాడని అనుచున్నారు. హిందూస్తాని తురకమాటలు తరుచుగా దేశ

భాషలయినందున ఆ మాటలు తెనుగుభాషలో కలిపి మాట్లాడు చున్నారు. ఈ దేశములో ఈగలు బహు బాధపెట్టుచున్నవి. వర్షా కాలమయినందున యిటు విస్తారమయిన దని చెప్పుచున్నారు.

కృష్ణ మొదలుగా గోదావరివరకు ద్రావిళ్ళు లేరుగదా? ఆంధ్రులుగా నుండే బ్రాహ్మణులందరు సగోత్రములుగాక, ఋషిప్రవర కలియక పోయినట్టయితే మధ్యదేశమునలె వెలనాడు, కాసలనాడు అనే తెగలు విచారించక సంబంధములు చేయుచున్నారు. శాక్తికులను వ్యాపారులను చున్నారు. మధ్యదేశపు సిద్ధాంతి పంచాంగముతో ఈ గోదావరీ తీరములో నుండే అనేక సిద్ధాంతులు గుణియించిన పంచాంగాలను సరిపెట్టి నాను. తిథి వార నక్షత్ర యోగ కరణములు అహః ప్రమాణములు అరగడియ యెక్కువ తక్కువగా నగపడుచు వచ్చుచున్నవి. యీ దేశ పంచాంగములో సూక్ష్మతిథులు, తిథిద్వయాలు వ్రాయడములేదు. తద్ద్వారా పంచాంగపువారి సామర్థ్యముచేత తిథులు మునిగిపోవుచున్నవి. వైదికులు పాగా, చొక్కా లేక, ఆశీర్వాదము చేసే సంప్రదాయము లేదు. ప్రతిద్విజునకున్నూ చేత పంచాంగ ముండవలసినది. పంచాంగ శ్రవణము బహుప్రబలము. ఈ దేశములో యిప్పట్లో వర్షాకాలము గనుక మన దేశపు కార్తీకమాసములోని వ్రతములు శ్రావణ మందు శ్రావణ సోమవారాలని, నిత్యాభిషేకాలని, నక్తభోజనాలని, చేయుచున్నారు. గృహకర్మల కార్యములలో పురుషులకన్నా స్త్రీలకు చొరవ యెక్కువగా యీ దేశములో కలిగియున్నది.

కడప మొదలుగా గొప్ప వర్తకులు, ధనికులున్నుండే స్థలములో నొక్కొకవేళ డాగావాండ్లనే దొంగలు అతి ధైర్యముతో సాయం కాలములలో గుంపుగా ప్రవేశించి యెదట కండ్లపడ్డ వారినంతా చంపి ధనికుల యిండ్లలో, అంగళ్ళలో జొరబడి ఖామందులను పొడిచి చంపి, ఉండే ధనము నెత్తుకొని, అరగడియలో మటుమాయ మయి పోవు చున్నారు. యీప్రకారము హయిదరాబాదు యింగిలీషు లష్కరు మధ్యే జరిగినది. యీ డాగావారి భయము యీ దేశములో విస్తరించి కలిగియున్నది. సాత్వికుల యోగ్యత యిటువంటి దుష్టులు లేకనే

ప్రిబలముకాదు గనుకనున్ను యిటువంటి వారు యీశ్వరచిద్విలాసానికి సామాగ్రి గనుకనున్ను, వారినిన్ని యీశ్వరుడు రక్షింపుచున్నాడు.

౩౧ తేది మధ్యాహ్నము ౧౨ ఘంటలకు ఆ గోదావరి నది దాటి యివతల అరియిదు కోసుల దూరములో నుండే నిర్మల అనే మహరు ౪ ఘంటలకు ప్రివేశించినాను. దారి నదికి అటు పక్క రెండు మజిలీల వరకు ఉన్నట్టే బాగా గులక యిసుక పరగా నున్నది. నది దాటగానే ఒక బంగాళా జాతులవాండ్లు దిగడానికి యోగ్యమయి నదిగా నున్నది. యివతల చిన్న యూళ్ళు మూడున్నవి. కొన్ని మజ బూతి అయిన పాడు కోట లున్నవి. నిర్మల అనే యూరు పట్టణము వంటిది. సకల పదార్థాలు దొరుకును. సకల విధములయిన పని వాండ్లున్నారు. ఊరుచుట్టున్ను, ఊరు నడుమనున్ను చిన్న కొండలు నిండా వున్నవి. గొప్ప యిండ్లు కలవు. ఊరుకి చుట్టున్ను, తోటలు, చెరువులు కలిగి యున్నవి. ఇక్కడ ఆర్కాటి సబాబు కింద లోగడ రాయిజీ * సర్వాధికారిగా ఉన్నట్టు ఒక పరగణాదారుడు ఉన్నాడు. దేశముఖి, దేశపాండ్యాలు ఉన్నారు. కొత్తవాలు ముద లయిన యధికారస్థు లున్నారు. ౧౦౦ బ్రాంహ్మణ యిండ్లున్ను, ఒక దేవాలయమున్ను ఉన్నవి. అక్కడ నేను దిగినాను. యిట్లా గొప్ప యూళ్ళలో నుండే బ్రాంహ్మణ మండలికి సభాపతి అనే ఒక బ్రాహ్మ ణుడు ఉన్నాడు. అతని యాజ్ఞకు తక్కిన వారు యథో చితముగా లోబడి యున్నారు. నిర్మల పంచపాత్రిలు ఈ ప్రాంతములలో బహు ప్రిసిద్ధిగా నున్నవి. నిండా కంచరయిండ్లున్నవి. అయితే కూతురి ప్రాశ్నము తండ్రికి ఉపకారము అనుభవానికి రాదో అలాగే ఆయాపదార్థాలు పుట్టే స్థలముల యందు అచ్చటివారికి అనుభవానికిరావు. అందుకు దృష్టాంత మేమంటే యిక్కడచేసే పంచపాత్రి యొకటి చూతామన్నా యీ సెమూరున దొరికినదికాదు. ఈ నిర్మల వరకు నుండే పోష్టు రన్నరుసులనే టప్పా

* ఆర్కాటు నవాబుకింద రాయరెడ్డిరావు అను నతడు శిరస్తాదారుగా నుండేవాడు. ఇతడు 1809 లో బల్లవన్మరణము నందినాడు.

మనుష్యులు హైదరాబాదు పోస్టాఫీసు యిలాకావారు ఇది మొద
లుగా నుండే టప్పా మనుష్యులు నాగపూరి పోస్టాఫీసు యిలాకావారు
గనుక రెండు యిలాకాలకు న్నిద్దరు మునిషీలు ఇక్కడ నున్నారు.
నాగపూరు మునిషీగుండా నాగపూరు వరకూ నొక్కటప్పామనిషిని మజిలీ
మజిలీకిన్ని కూడా వచ్చేటట్టు దిట్టము చేసుకొన్నాను. వూరి అములు
దారుడు నేను వచ్చేటందుకు ముందరనే తగయిరు అయినాడు గనుక
దేశపాండ్యా వెంకటరాయునివారిగుండా యేదులబాదు వరకు వచ్చే
టట్టు ౫ మంది ఆయుధ పాణులయిన జవానులను తయినాతి చేసు
కొన్నాను. ఈ నిర్మలలో దృశ్యా అనేవాడు నిజాముకింద అధికారము
చేసేవాడు. అతడు తన రాజ్యపురూకలు యజమానునికి పంపించకుండా
తన చేతికిందనున్న భూమిని ఆక్రమించవలెనని కోటలు కట్టి యజ
మానునితో చచ్చేవరకు యుద్ధముచేయుచు రాజ్యము ననుభవింపుచు
వచ్చినాడు. నేను దిగిన దూదుగాము అనేది నదీతీరమందలి యూరు.
బహు రమాధారి. కాశిభాటలో నున్నది. ఆ నిర్మలలో మొదటి తేది
ఉంటిని.

అగోష్టు నెల ౨ తేది ఉదయాన ౬ ఘంటలకు బయలు
వెళ్ళి ౮ కోసుల దూరములో నుండే వొడ్డూరు అనే యూరు
౧ ఘంటకు చేరినాను. దోవ బహు ప్రియాస. నల్ల రేగడ భూమి.
వర్షాకాలములో నడిచేవారికి అడుగు ఆమడగా నుండును.
౭ కొండలు దారిలో నెక్కి దిగవలసియున్నది. దారిలో అడుసుతో
కూడా రాళ్ళు మిశ్రములై యున్నవి. దారిలో అంకిరిఅనే యూరున్ను
మరికొన్ని చిన్న యూళ్ళున్నున్నవి. మజిలీ చెయ్యడానికి వయిపు
అయినవి కావు. యీ నిర్మల నుంచి నేరేడు కొండ అనే యూరిమీద
నొక భాట పోవుచున్నది. ఆ భాట సమీపమయినా వర్షాకాలములో
నడవకూడదు. యీ దినము నడిచిన భాట కిరుపక్కల దట్టమయిన
అడివి. వ్యాఘ్రభయము జగనంపల్లె మొదలుగా కలిగియున్నది.
అంకిలి అనే యూరివద్ద ఒక వాగు దాటవలెను. ఇది బలమయిన వాగు.
నిర్మల యూరి ముందర నొక లోతుగల వాగు ఉన్నది. యిదిగాక
వానకాలము గనుక చిల్లర వాగులు అనేకములు దాటినాను. ఈ

వాడ్డూరు బస్తీ గ్రామము. సకల పదార్థాలు దొరుకును. బ్రాహ్మణుల యిండ్లు చావిళ్లున్నవి. ఇక్కడ నొక చావిడిలో ఈ రాత్రి నిలిచినాను.

౩ తేది ఉదయాన ౬ ఘంటలకు బయలు వెళ్ళి ౭ కోసుల దూరములో నుండే విచ్చోడా అనే యూరు ౧-౨ ఘంటలకు చేరినాను. దారి నిన్నటివలెనే సకల విధము లయిన ప్రయాసలను ఇచ్చుచున్నది. కొండ యెక్కుడు దిగుడు గలది. రాతి గొట్టు మాత్రము లేదు. దారిలో కడం అనే నది దాటవలెను. ఈ నది వెడల్పు తక్కువ అయినను బహు ఘాత చేసేది. పడవ, పుట్టి, తెప్ప, మొదలైనవి కూడా ప్రవాహ వేగములో నడవవు. ప్రవాహకాలములో కుంఫిణీ టప్పా కూడా రెండు మూడుదినములు ఇక్కడ నిలిచిపోవుచున్నది. విచ్చోడా అనే యూరు బహుచిన్నది. యథోచితముగా కావలసిన పదార్థాలు ముసాఫరులకు దొరుకును. ఇక్కడ డేరాలలో వసించినాను. వాడ్డూరు విచ్చోడా మధ్యే కొన్ని చిన్నగ్రామాలున్నవి. నిలవ యోగ్యములు కావు. దారికి యిరుపక్కలా చిన్న పర్వతముల దర్శన మవును. మిట్టలో నుంచి పల్లానికి నిండా దిగి కడంనది దగ్గర నెక్కవలసియున్నది. ఆయూరున ఆరాత్రి ఉన్నాను.

౪ తేది ౬౹ ఘంటకు బయలుదేరి ౨ ఘంటలకు ౧౦ కోసుల దూరములో నుండే యేదులాబాదు అనే షహరువంటి యూరు చేరినాను. దారి అట్నూరు అనే యూరివరకు నల్లరేగడభూమి. అడుసు లోగడి రెండుదినములవలెనే దిగబడుచున్నది. ప్రయాస చెప్పి తీరదు. అట్నూరు మొదలు యేదులాబాదు వరకు దారి నడవడానికి గులక యిసుక పరయున్న చిన్న రాళ్ళగొట్టున్న గనుక అనుకూలముగా నున్నది. అయితే మేకల గండి అనే ప్రసిద్ధమైన ఘాటు ఇక్కడ దాటవలసినది. ఈ ఘాటులోని యడివి, బల్లెము దూరని పాటి దట్టమని చెప్పవచ్చును. వ్యాఘ్రభయము విస్తారము. పులియడుగులు దారిలో చూచుచు మేము నడిచినాము. బహు జాగ్రతగా బాటసార్లు ఇక్కడ నడుచుచున్నారు. ఒకరిని ఒకరు విడిచి నడిచే ప్రదేశము కాదు. తుపాకులు అక్క డక్కడ కాల్చుచు

వచ్చినాము. కొండల చెరువుల నడమ ఘాట పోతున్నది. అట్నూరి వద్ద నొక పెద్దవాగు దాటవలసినది. యింకా శానాశానా చిన్నచిన్న వాగులు దాటవలసియున్నవి. నిర్మల మొదలు ఘాటలో సన్నముగా, నిడువుగా నుండే చీకటి యీగెలు నిండా కరుచుచున్నవి. యీ మేకల గండి యడివిలో నడిచే టప్పుడు నడిచేవారు చిన్న మండలు విరిచి చేతపట్టుకొని విసురుకొనుచు రావలసినది. ఆ మక్షికాల బాధ ఘాటు దాటే పర్యంతముగలదు. అఘాటు మలులే అనే యూరి పర్యంతము ఉన్నది. అఘాటును మేకలగండి అనటానికి కారణమేమంటే ఘాటు మధ్య వుండే రాళ్ళన్ని మేక అడుగులతో ఈశ్వరుడు సృష్టిచేసి యున్నాడు. యేదులాబాదులో సకల పదార్థాలు దొరుకును. సకల విధము లయిన పనివాండ్లు వున్నారు. జలవసతి కలదు. బ్రాహ్మణ యిండ్లు కలవు. ఊరికి బయిట బ్రహ్మచారి బావా మఠ మున్నది. వూరి మధ్యే కొన్ని మఠా లున్నవి. ఒక మఠములో దిగినాను. విఛోడా అనే వూరు మొదలుగా సోణి అనే వూరు వరకు ముషీర్మల్కు అనే దివాంజీకి జాగీరు అయి వున్నది. యీ యేదులాబాదులో నాయబు అనే అములుదారు వున్నాడు. ఈ యూళ్ళో కూడా వచ్చినవారియొక్క ఆసోదా నిమిత్తమున్ను, పదార్థాల సంగ్రహము కొరకున్ను ఆ దిన మంతా నిలిచినాను.

౬ వ తేది ఉదయమైన ౬ ఘంటలకు బయలు వెళ్లి ౦ కోసుల దూరములో నుండే ధనోరా అనే యూరు ౧.౨ ఘంటలకు చేరినాను. దారి నల్లరేగడ అయినా, అడుగున రాతిపారు గనుక నెంత వర్షము కురిసినా అట్నూరు పర్యంతము దిగబడేలాగు ఈ దారి దిగబడదు. దారి కిరుపక్కల భూమి వెల్లడిగానున్నది. అడివి లేదు. అయితే దారి రాతిగొట్టు. శానా వాగులు వర్షాకాలములో దాటవలసి యుంచున్నవి. యేదులాబాదుకు కొంత దూరములో నొక పెద్దవాగు మధ్య వుండే జేనదు అనే వూరి వద్ద నొక పెద్ద వాగు దాటవలెను. ఈ జేనదు అనే యూరు మంచి బస్తీ అయినది. ముచ్చటగా రాతిపని చేసిన యొక విష్ణు దేవాలయము ఈ యూరి చెరువు గట్టున వున్నది. సకల పదార్థాలు దొరుకును. యేదులాబాదుకు సమీపముగా,

౮ కోసుల దూరములో ఈ వూరున్నందున నేను దిగ లేదు. ఇదిగాక చిన్నవూళ్ళు కొన్ని వున్నవి. మజిలీచేయడానికి తలుచుకొనతగినవికావు. ధనోరా వూరిముందర పిన్నగంగ అనే నది దాటవలసినది. ఇక్కడ కొయ్యా తొలిచిన రెండేసి చిన్న దోనెలు జోడించి కట్టినదోనె రెండేసి సవారీలున్ను ఆరుబోయీలున్ను ఒక తేపకు దాటింపుచున్నది. సామానులున్ను పరివారమున్ను దాటడానికి రూ|| ౨ దోనెవాండ్లకు ఈనాముగా నిచ్చినాను. కుంఫిణీవారి తఫాల్ దాటించడానికి సం|| ౧కి యీ దోనె వాండ్లకు ౧౨ రూపాయిలు గోదావరి మొదలయిన నదులు దాటించేవారికి యిచ్చేటట్టు వర్షాకాలము నాల్గు నెలలకు నెల ౧ కి ౩ రూపాయీలు లెక్క జీతముగా నిచ్చుచున్నారు. లోకులవద్ద మనిషికిన్ని పశువుకు న్నింతమాత్రమని పుచ్చుకొని యీ దోనె వాండ్లు తమ వచ్చుబడిలో నొక హిస్సా నిజామునర్కారుకు ఇస్తారు. ధనోరా అనే వూరు చిన్నది. యథోచితముగా ముసాఫరులకు కావలసిన సామానులు ప్రియత్నముమీద దొరుకును. నేను నదియొడ్డున డేరాలలో వసించినాను. బ్రాంహ్మణులయిండ్లు లేవు. ఒక అంగడి యున్నది. యీ ప్రాంత్యపు గ్రామాలలోనంతా వర్షాకాలములో కాలుపెట్టను మనసురాదు. అసహ్యమయిన అడుసు. నడమ గ్రామము లున్నవి. యిక్కడ యీ రాత్రి నిలిచినాను.

౭ వ తేది ఉదయమైన ౯ ఘంటలకు బయలుదేరి ౧ ఘంటకు ౭ కోసుల దూరములో నుండే కాయరా అనే వూరు చేరినాను. దారి నిన్నటి దారివంటిదే. చిన్న వాగులు శానా వర్షాకాలములో దాటవలసియున్నవి. యిదిగాక ఒకరాతి గొట్టుకల కనమ యెక్కి దిగవలసియున్నది. యీ కనమమీద ముందు వెనక అడివి కలిగియున్నది. యీ యడివిలో మేకల గండిలోనున్న యీగెలవంటి రీగెలు నడిచేవారిని బాధ పెట్టుచున్నవి. దోనేగరుగాం అనే వూరితో యీ యడివిసరి. అవతల పొడిచెట్లుగాని భయములేదు. కాయరా యూరి ముందర నొక పెద్దవాగు దాటవలెను. కాయరా అనే యూరు బస్తీయయినది. నాయబు ఉండే కసుబా స్థలము. వకీల పదా

ర్థాలు దొరుకును. బ్రాహ్మణ యిండ్లు యిరవై దాకా కలవు. శేషాచ్చగునయొక్క యింటిలో దిగి యీ రాత్రి ఇక్కడ నున్నాను.

౦ తేది ఉదయమున ౬ ఘంటలకు బయలు వెళ్లి ౫ కోసుల దూరములో నుండే ఏగోటి అనే యూరు ౧౧ ఘంటలకు చేరినాను. దారిలో చిన్నగుబ్బళ్ళు వాగులున్నవి. నడిచినంత దూరము నల్లరేగడ, అడుగున రాతిపర; పయిన అడవి. చిన్న వాగులు కొన్ని దాటవలసినది. అడివి; రాతిగొళ్లు. వేమువ అనే గ్రామము బహు బస్తీ అయినది. దేవాలయాలు ౧౦ దాకా వున్నవి. సాహుకారు కొఠీలున్నవి. బ్రాహ్మణయిండ్లు కలవు. సకల పదార్థాలు దొరుకును. అధికారస్థులుండే నిసుబొస్థానము. జలవసతి కలదు. ఇండ్లు గొప్పవి. నేను గొప్ప పంకి సుళ్లగ దేవాలయములో దిగినాను. సవారీల నుంచడానికి, బోయీలు ఎలానులు కావలెనంటే వాండ్లు నగయిరా లుండడానికిన్ని, చావిళ్లు మణిగిలనే కొట్టాలు, మఠములు అసర్ఖానాలు శానా వున్నవి. దినుసువారీ నాణ్యములు ఇక్కడ మార్చుకోవలసినది. ఈ యూరంతా యిసుకపర గాను, అనువు కాదు. ఆ యూరికి నదీ తీరము. నిజాము వద్ద కలకటరు హోదా చేసినవారు కొందరు జాతులవాండ్లు యిక్కడ యిండ్లు కట్టుకొని యున్నారు. ఇంగిలీషువారు కలకటరులు కావడానికి హేతువేమంటే నిజాము సరకారు నున్న అధికారస్థులు జమీందారులు సరిగా రూకలు పంపించనందున యింగిలీషు దొరలు తాలూకాలమీద నుంటే దాపుమీద రూకలు వచ్చునని దివాన్జీ చేసే చందులాలా యోచించి రెసిడెంటుతో మాట్లాడి తాలూకాలమీదికి తన యములు దారులతో కూడావుండి వ్యవహారము చూడ గలందులకు యింగిలీషు దొరలను పంపించినాడు. వారు అక్కడక్కడ నిజాం అధికారస్థులతో కూడావుండి వ్యవహారము జరిగించినారు. అందువల్ల ముగలాయి స్థోరణిజులుము లోకులమీద నిండా వ్యవహారస్థులు చేయకూడకుండా వచ్చినది గనుక అధికారస్థులకు వైపు (ఉపాయము) తోచక, చందులాలాకు తెలియచేసినంతట్లో మళ్ళీ ఆ కలకటరులను రెసిడెంటు పిలుపించుకొన్నాడు. యిప్పటికి యింగిలీషువారి న్యాయ

ఉన్నది గాని, *కాలేజి సిద్ధాంతి వ్రాసినట్టు యింతకు మునుపే సింహ రాశిగతుడైనట్టు వ్రాయలేదు. తూర్పు దేశమునుంచి గ్రామాదులకు లేచి వచ్చి యిక్కడ నిలకడగా నిలచిన వా రెవరయినా గ్రామాదులలో నుండే వారు మాత్రము తెనుగు మాటలాడుచున్నారు. తూర్పు దేశపు బ్రాంహ్మణులు, కోమట్లు మాత్రి మీ దేశానికి యిది వరకు మొగసాకి వచ్చుచున్నారు. నేను బ్రాంహ్మణయింటిలో యీ రాత్రి వసించి, యింగిలీషు వారు యిక్కడనున్న ముందు మజిలీలో నున్న కట్టించి యుండే ముసాఫరుఖానాలో నా సవారీలు మూడు న్నుంచినాను.

౧౦ తేది ౫ ఘంటలకు లేచి యిక్కడికి ౮ కోసులదూరములో నుండే నాగిరి అనే యూరు చేరినాను. దారిలో సదరహి దోనెలవంటి దోనెలతో నొక నది దాటవలసినది. చికిని అనే యూరివరకు దారి వెల్లడిగా నల్ల రేగడ భూమిగా నున్నది. ముందు గడిచిన దినముల దోవవలెనే కాలు దిగపడే అడుసుకలది కాదు. ఆ గ్రామము మొదలుగా భూమి నల్ల రేగడయయినా గట్టిపర గనుక అడుసు త్వరగా నెండిపోవుచున్నది. విస్తరించి వాగులు యెక్కుడు దిగుడుగా దాటవలసి యున్నది. యీ నాగిరి అనే గ్రామము యథోచితముగా బస్తీ అయినది. రుక్మి విఠోబా దేవాలయము కొంచము విస్తారమయిన ముఖ మంటపముతోకూడా నున్నది. బ్రాంహ్మణ యిండ్లున్నవి. ముసాఫరు ఖానా కలదు. నేను దేవాలయములో దిగినాను. ముసాఫరులకు కావలసిన పదార్థాలు దొరుకును. యేదులాబాదు మొదలుగా నిది వరకు మెరక పంటభూమి; పుంజధాన్యము చేనులు చేసి పయిరు చేయుచున్నారు. భాటకు నిరుపక్కల చేనులలో పశువులు చొరపడకుండా ముండ్లకంపలు తెచ్చి వెలుగు వేసుటవల్ల యీ ప్రయాస నిచ్చే అడుసుతో కూడా ముండ్లుకలిసి యుంచున్నవి. ఆ గ్రామములో ఆరాత్రి వసించినాను.

* మదరాసు ఫోర్టుసెంటు జార్జికోటలో సివిలు సర్వీసు ఉద్యోగులకు దేశభాషలు వ్యవహారములు నేర్పడం కోసం 1812 లో నొక కాలేజీ స్థాపింప బడినది.

౧౧ తేది ఉదయాన ౬ ఘంటలకు లేచి యిక్కడికి ౭ కోసుల దూరములోనుండే మాండుగాం అనే యూరు ౧౨ ఘంటలకు చేరినాను. దారిలో హింగణ్ఘాటు అనే పహారువంటి యూరివద్ద పన్నె అనే నది సదరహివ్రాసిన దోనెకుండా దాటవలసినది. హింగణ్ఘాటు అనే పహారు స్థలము నిన్నటి మజిలీకి ౫ కోసులు. యీ యూరిలో చుట్టుపక్కలా బహు దూరానికి అందేటట్టుగా వుప్పు తెచ్చియుంచి వర్తకులు రాసులమోడిగా అమ్ముచున్నారు. సావుకారు కొఠీ లున్నవి. నాణ్యములు ఇక్కడ మార్చుకోనవచ్చును. బట్టలు వగయిరాలు, సకల పదార్థాలు, ఔషధ దినుసులు సమేతుగా యిక్కడ కావలసినంత దొరుకును. నేటి దారి చికిని అనే యూరు మొదలుగా నాగిరి పర్యంతము ఉన్నట్టే యథోచితముగా అనుకూలముగా నున్నది. వాగులు విస్తారము దాటవలెను. మాండుగాం అనే యూరు యథోచితముగా బస్తీ అయినదే. ముసాఫరులకు కావలసిన సామానులు దొరుకును. స్థల సంకుచితము లయిన యిండ్లు కలవు. బ్రాంహ్మణయిండ్లున్నవి. నిన్నటి దేవాలయమువంటి దేవాలయము ఒకటి యున్నది. యీ దినము గోకులాష్టమి గనుక ఆ గుళ్లో ఉత్సవము జరుగుటచేత నొక సంకుచితమైన మారువాడివాని అంగట్లో దిగి ఈ రాత్రి ఇక్కడ వసించినాను.

౧౨ తేది ౬౺ ఘంటలకు బయులువెళ్లి ౫ కోసుల దూరములో నుండే చింది అనే గ్రామము ౧౦ ఘంటలకు చేరినాను. దారి నిన్నటి వలెనే యున్నది. అనేకములయిన పల్లాలు దిగి మిట్ట లెక్కవలసి వాగులు దాటవలసి యున్నవి. చింది యనేది కసుబా గ్రామము. పేట స్థలము. అన్ని పదార్థాలు దొరుకును. బ్రాంహ్మణయిండ్లు, చావిళ్ళున్ను కలవు. నేను కచ్చేరి చావడిలో దిగినాను. ఈ ప్రాంతముల బస్తీ మజిలీ వూళ్ళలో వారానకు నొక దినము సంత. ఆ సంతకు అన్ని పదార్థాలు ఇతర గ్రామాలనుంచి తెత్తురు. అదే ప్రకారము ఈ దినమున ఈ యూరికిన్ని తెచ్చినారు. అప్పట్లో అన్ని వస్తువులు నయముగా బాహాటముగానున్ను దొరుకుచున్నవి. కూరగాయలు,

తమలపాకులు మొదలయినవి కూడా సంతకు తెచ్చుచున్నారు. ఈ రాత్రి ఇక్కడ నిలిచినాను.

౧౩ తేది ఉదయాన ౬౻ ఘంటలకు బయలువెళ్ళి ౯ కోసుల దూరములోనుండే గూంగాం అనే యూరు ౧౨౻ ఘంటకు చేరడ మయినది. దారి ముందు నడిచిన దినముల దా:వలెనే నల్లరేగడ, రాతి గొట్టు కూడా కలిగియున్నది. యిక్కడికి ౪ కోసులదూరములోనుండే తాకిలిఘాటు అనే యూరివరకు కొంచెము పొడిచెట్ల యడివి భాట కిరుపక్కల నున్నది. తాకిలిఘాటు ఊరివద్ద నదివంటి వాగు ఒకటి దాటవలసినది. యేదులాబాదు మొదలుగా ప్రతియూరు న్నొక యేరు వంటి వాగును అనుసరించి యున్నది. చెరువులు నిండా లేవు. ఈ వాగులే ఉదక సమృద్ధిని కలగచేయుచున్నవి. తాకిలిఘాటు మొదలుగా రాతి గొట్టున్ను అడివిన్ని లేదు. భాట కిరుపక్కల చదరమైన భూమి. గూంగాం అనే యూరు కసుబాస్థలము. బక్కి బాయి అనే నాగపూరు రాజు బంధురాలికి జాగీరుగ్రామము. ఈ వూరివారున్నూ, ఇక్కడి యధికారస్థులున్ను నాగపూరు షహరుకు సమీపమందున్నారు గనుక అలక్ష్యతనున్ను, అహంకారమున్ను వహించియున్నారు. అయినా బస్తీ గ్రామము గనుక అన్ని పదార్థాలు బజారులో దొరుకును. ఈ వూరిమధ్య స్వచ్ఛమయిన జలముకల వాగు ఒకటి పారుచున్నది. దేవాలయము, ధర్మశాల అనే చావడి, బ్రాంహ్మణ యిండ్లున్నున్నవి. ధర్మశాల అనేది ఒక తాళ్వారము వీధికి అభిముఖముగా వేసి యుంచున్నది.

యీ దేశపు ముసాఫరులు తాము బ్రాంహ్మణులయినా దృష్టిదోషము పాటించడము లేదు గనుక అందులో దిగి, వీథిలో వచ్చేవారు పొయ్యేవారున్నూ చూడగా వంట చేసుకొని భోజనము చేయుచున్నారు. బ్రాంహ్మణులు భోజనము చేసేటప్పుడు శూద్రులను యెదురుగా కూర్చుండబెట్టుకొని మాట్లాడుచున్నారు. శూద్రులను ఎదట పజ్త్తిగా తమతోటిపాటు కూర్చుండపెట్టి వడ్డించి చూచుచు, మాట్లాడుచు భోజనము చేసుట కలదు. అయితే "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అనే న్యాయముచొప్పున

ఇట్టి నియమములంతా స్వతంత్ర ప్రవృత్తి నివృత్తులను కలవి గనుక ఈ ఆచారము ప్రమాదమైనది కాదు. అయినా ఆ స్థలము యుక్తముగా తోచనందుననున్ను, బ్రాహ్మణ యిండ్లలో జాగా కానందునగనుకనున్ను మరిన్ని వారి యాచారవ్యవహారాలలో శూద్రులకుండా ఉదకము తెప్పించుకొని వాడుకొనేటట్టుగాకూడా ఉన్నదిగనుకనున్ను వాగువొడ్డున డేరాలు వేసి దిగి ఆ యూరిలో ఆ రాత్రి వసించినాను. దారిలో సాకిలి ఘాటుదాకా కొన్ని యూళ్ళున్నవి. మజిలీ చేయడానికి యోగ్యములు కావు. హయిదరాబాదు మొదలుగా మంచి యిండ్లు కట్టుకొనేవారు మట్టిమిద్దె నొక అర యింటికిగాని, కూటానికిగానివేసి పైన పెంకుల పూరితో నొక కొట్టడి యేర్పరచి పైన నెక్కడానకు ఒక నిచ్చెనగాన్ని, పొడుగుమెట్లుగాని కట్టి పెట్టుచున్నారు. సాధారణముగా ఇండ్లు కట్టే వారు పెంకులతోను, పూరితోను కట్టుచున్నారు. యేదులాబాదువరకు నుండే పెంకులు దక్షిణదేశములో నీళ్ళకాలువలకు స్పెట్టే కోవుల మాదిరిగా నుంచున్నవి. ఆయూరికి ఇవతలి పెంకులు దక్షిణదేశములో మిద్దెలకు వేసే చదరపు పెంకులజాడాగా నడమ కొంచము వంపు కలిగి యున్నవి.

26/12/49

---

## ఐదవ ప్రకరణము.

౧౮ తేది ఉదయాన ౭ ఘంటలకు ఈ యూరు వదిలి యిక్కడికి ౮ కోసుల దూరములోనుండే నాగపూరు షహరు ౧౦ ఘంటలకు ప్రవేశించినాను. దారి ఘట్టి నల్లరేగడభూమి; అడివి కలదు. రాతి గొట్టు లేదు. బాట కిరుపక్కల కనుచూపుమేరకు చదరముగా నుంచున్నది. నాగపూరు ముందర నాగలేరు అనే పెద్దవాగు దాటవలెను. నాగపూరు షహరువద్ద శీతాబులిడి అనే ప్రదేశమున్నది. అక్కడ రిసైడెంటు ఇల్లు, తోట కలగచేసుకొని యుంచున్నాడు. చుట్టున్ను కొన్ని యిండ్లు, అంగళ్ళు, తోటలు న్నున్నవి. చెన్నపట్టణపు కాపురస్థుడయిన వీరాసామి మొదలారి పోష్టాఫీసు రయిటరుగా ఇక్కడ నున్నాడు. గనుక నితో, హయిదరాబాదులో కమ్మిసెరియేట్ మ్యానేజరు రామస్వామి

మొదలారిని విహితపరచు కొన్నట్టే విహితము చేసుకొని అతని గుండా మోతీ బాగు అనే బహుబసతి అయిన తోటలో బంగాళాలో దిగినాను.

ఈ నాగపూరు రాజ్యము పూర్వపూర్వకముగా కొండరాజులది. వారు అడివిని బలము చేసుకొని కొండల దుర్గప్రదేశాలను ఆశ్రయించుకొని భాటసార్లు కూడా తమభూమిలో రాకుండా వుండేటట్టు ఘాత్తచేయుచు ద్విపాత్పశువులుగా సకలవిధాల నటించి ఈ రాజ్యము ననుభవింపుచు వచ్చినారు. సుమారు 200 ఏండ్లకు మునుపు బుద్ధోజీ అనే అతని పెద్దలు షాహురాజు సుతులు గనుక *పునా శ్రీమంతునికి షాహురాజు రాజ్యమును దానము చేసి జ్ఞాతులను కొండరాజ్యముల సాధించుకొని శ్రీమంతుని ఆజ్ఞకింద నుండు డని నియమించినారు. ఈ నాగపూరు సమీపవర్తి అయిన భూమిని బుద్ధోజీయొక్క పెద్దలు సాధించినారు. తదనంతరము క్షాత్రధర్మము చొప్పున క్రమక్రమముగా ఈ కొండరాజులను పూర్తిగా సాధించి యీ నాగపూరును రాజధానిగా చేసుకొని రాజ్యము చేయుచు వచ్చినారు. షాహురాజు యొక్క మరియొక జ్ఞాతులు దక్షిణరాజ్యములో ప్రవేశించి తంజావూరిసీమ సాధించి దొరతనము చేయుచు వచ్చినారు. ఆషాహురాజవంశము భోసల వంశమని చెప్పబడుచున్నది. సాతారా అనే షహరు షాహు రాజుకు రాజధాని. ఆ షాహురాజును ఢిల్లీపాదుషా కూతురు మోహించి వివాహము చేసుకోవలె నని యుండగా పాదుషా షాహు రాజును చంపినాడు. అతని కొడుకు చిన్న షాహురాజును పాదుషా కూతురు పెంచి యీ సాతారాకు రాజుగా చేసెను. వెనక రాజ్యము చేయుచున్న అతని వంశస్థులకు పుత్రసంతతి లేనందుచేత ఆశ్రయించి యున్న బ్రాహ్మణునికి రాజ్యమును దత్తము చేసినాడు. జ్ఞాతులను, కొండ రాజ్యములను పయిన వ్రాసిన ప్రకారము సాధించుకొని తాను రాజ్యదాన మిచ్చిన బ్రాహ్మణునియొక్క ఆజ్ఞకులోబడి నడుచుకొను డని ఉత్తరువు చేసినాడు. ఆ బ్రాహ్మణుడే శ్రీమంతుడు.

---

* ఈ పునా శ్రీమంతుడు పీష్వా అని చరిత్రలో ప్రసిద్ధి వహించిన మహా రాష్ట్ర నాయకుడు. శ్రీ శివాజీ తరువాతి మహారాష్ట్రరాజా ఆయన మనమడగు షాహు పేరుకు రాజా. ప్రధానమంత్రి బ్రాహ్మణు డగు పీష్వాయే నిజమునకు రాజా.

బుద్ధోజీ రాజ్యతంత్రము చేయగా బహు ప్రబలమయిన దశను పొంది ప్రసిద్ధికెక్కినాడు. ఈ బుద్ధోజీ తండ్రి యయిన రఘోజీ అనే అతనికి మరి కొందరు కొడుకు లుండగా వారికి రాజ్యము పంచిపెట్టినాడు. బుద్ధోజీ నాగపూరిని రాజధాని చేసుకొన్నాడు. మరియొక కొడుకు చందా అనే పూరిని రాజధాని చేసుకొన్నాడు. ఇద్దరు రత్నపూరును, నలది గ్రామమునున్ను రాజధానులుగా చేసుకొని రాజ్యము చేయుచు వచ్చిరి.

బుద్ధోజీ దినములు మొదలుగా యింగిలీషువారు విహిత రీతిగా ఈరాజ్యములో ప్రవేశించి అతని కొడుకు లయిన రఘోజీ వగైరాలతో యుద్ధ ప్రసక్తి కలగ చేసుకొని కాలు నిలకడ చేసుకొన్నారు. పిమ్మట రాజ వంశస్థులు ప్రత్యేకముగా రాజధానులు కలగచేసుకొన్న వారిలో కొందరు లయ మయిరి. మిగిలి యున్నవారు ఒకరిని ఒకరు విశ్వాస ఘాత చేసి చంపుకొన్నందువల్ల రాజ్యమంతా యేకముఖమయి తుదను అప్పాసాహెబు అనేవాని అధీనమయినది. అతడు యిక్కడ చేరియున్న యింగిలీసువారిని వెళ్ళగొట్టవలె నని యత్నము చేసినందున దేశ భ్రష్టుడై యిప్పట్లో మృతజీవిగా నున్నాడు. ఇప్పుడు యింగిలీషువారు రఘోజీ దౌహిత్రునికి పట్టముకట్టే వయసు వచ్చేదాకా రాజ్యతంత్రము తామే విచారింపుచువచ్చి కొన్ని ఖరారుమదారుల మీద విడిచిపెట్టి నారు. ఆ చిన్నవానికి రఘోజీ అని పేరు పెట్టినారు. ఆ ఖరారుల ప్రకారము సం॥ నకి తొమ్మిది లక్షల రూపాయిలు కుంఫిణీవారికి కట్టవలసినది. వీరి రాజ్యము గత కాలములో తూర్పున కటకము వరకున్ను, దక్షిణమున వరదానది వరకున్ను పడమట పునా వరకున్ను, ఉత్తరమున జబ్బలపూరు దాకానున్ను ఉండినది. రఘోజీదినములు మొదలుగా కలహ పడ్డప్పుడంతా కొంచెము కొంచెముగా తూర్పు దేశోత్తరములను కుంఫిణీవారు ఆక్రమించినారు. అప్పట్లో నాగపూరికి ఉత్తరమున ౧౫ కోసులమీద కుంఫిణీవారి అధికారముగాని నాగపూరు రాజుకు నిమిత్తములేదు. రామటెంకితో నాగపూరువారి రాజ్యపు సరి హద్దు ముగిసియున్నది.

యీ నాగపూరి రాజు మరాటీజాతి తంజావూరి రాజు బంధువు. ఆ రాజువంశస్థులు శ్రీయస్కాములయి యుండగా దేవ బ్రాహ్మణ పూజ చాలాగా చేయుచు వచ్చినారు. ఈ సరికి కుంఫిణీ వారి కలకటరులు నియమించిన తహశ్శీలుదారులు వగైరాలగుండా రాజ్యతంత్రము గడుచుచున్నది. రాజ్యములో నుండేవారు రాజులకు రాజ్య మివ్వపడడము వల్ల ఏమాత్రమున్ను సంతుష్టిని పొందియుండ లేదు. ఈ రాజుకు సాలుకు ఇంతమాత్రమని రూకలు నట్టు జమీందారులు కొందరు ప్రబలులుగా నున్నారు. శీతాబులిడీ యనే కొండవద్ద ఇదివరకు రాజుకున్ను, ఇంగిలీషువారికిన్ని కొన్ని యుద్ధములు జరిగినవి. చుట్టూ కొన్ని జాతుల వారి యిండ్లున్ను, ఆర్సనలు అనే ఆయుధశాల, పోస్టాఫీసు మొదలయినవి కట్టియున్నవి. పార్శీజాతివారు బొంబాయినుంచి సీమ వస్తువులు తెచ్చి యింగిలీషు లాయఖు అయిన షాపులు ఉంచుకొనియున్నారు. ఇక్కడ నౌక బజారు, కొన్ని హిందువుల యిండ్లు కలిగియున్నది. యిక్కడి జాతుల, వారి యిండ్లు విడవలితో పూరివేసి కట్టియున్నవి. యిక్కడ విడవలి పూరి అల్లే నాజూకు బహుచింతగా, అతి సుందరముగా నున్నది.

యీ నాగపూరికి ౭ కోసుల దూరములో కామిటి అనే పేరు కలిగిన ప్రదేశములో యింగిలీషువారు అయిదు బటాలాలవారున్ను అందుకు తగిన యధికారస్థులనున్ను, ఉద్యోగస్థులనున్నుంచి యున్నారు. యీ కామిటి పెద్ద బస్తీగ్రామము. దండులో లెక్కలు వగైరాలంతా యింగిలీషు భాషలో వ్రాయవలసియున్నది గనుక మధ్యదేశస్థులు బహుమంది అరికాటు మొదలారులు మొదలయినవారు చేరియున్నారు. వారు స్వదేశస్థులు వచ్చినంతలో ప్రీతి చేయడముమాత్రమే కాకుండా యీ దేశస్థులకంటె ఎక్కువగా తాము పరస్పరాభిమానము కలిగి ఒక పొట్లముగా మిత్రభావమును పొందియున్నారు. యిదివరకు జాతుల వారు యీ దేశములో ప్రవర్తించుటలో స్వజాతి స్థైరము లేక ఒకరి కొకరు ఉపకారము చేయు నిచ్ఛ కలిగియుండడము వీరి దేశ సంప్రదాయము కాబో లనుకొంటిని. యిప్పట్లో యీ కామిటిదండు ప్రవే

శించిన వెనక సహజముగా పరదేశానికి మరియొక దేశస్థులు కొందరు పోయినట్టయితే కానని యిష్టపదార్థాలు అపూర్వముగా కనుటచేత నొక విశ్వాసము అందరికిన్ని జనియింపుచున్నదని నిశ్చయించినాను.

యిప్పట్లో హిందువులుచేసే యుద్యోగాలలో హయిదరాబాదు, నాగపూరు, జాలనా, మహిసూరనే ఈ నాలుగు స్థలముల కమ్మిస్సేరైయాటు ఉద్యోగాలు ఉత్తమములుగా దోచుచున్నవి. కమ్మిస్సేరికి వచ్చే దొరలు కత్తికట్లున్ను అట్లాగే బంగాళీదండున్ను బహుదినములు ఇక్కడ వసించి బ్యారుకుసులు, వారధులు మొదలయిన పబ్లికు బులుడింగుసు అనే గృహశాలలు శానా కట్టించినారు. ఇటువంటిపనులకు చెన్నపట్టణపు గవునరుమెంటువారి శాంకిన నసే అనుజ్ఞ దుర్లభము గాని, బంగాళా గౌనరుమెంటువారు ధారాళముగా అనుమోదింపుచున్నారు.

యీ శీతాబులిడి మొదలు కామిటీదండు దాకా గుర్రపుబండ్లు పోయి వచ్చేటందుకు యోగ్యముగా శాలవేసి నడమనుండే వాగులకు వారధులు కట్టియున్నవి. అయితే దారి యడారిగా నున్నది. నాగపూరు షహరులో సుమారు యిరువై వేల యిండ్లు ఉండవచ్చును. బహు చిన్నయిండ్లు. చూపుకు లక్ష్మీకరములుగా, వాసయోగ్యములుగా నుండ లేదు. బాజారులు శానా వున్నవి. సకల భోజనపదార్థాలున్ను, ఆ దేశపు వస్త్రాలున్ను సమృద్ధిగా దొరుకును. పనుల విశేషాలు తెలిసిన వారు విస్తరించి లేరు. నివాసస్థులు కృత్రిములుగాని, హయిదరాబాదు షహరు వారివలెనే మాటకుమునుపు ఆయుధమును వాడేవారు కారు. స్త్రీలు పురుషులున్ను బలిష్ఠులుగానున్ను, రూపవంతులుగానున్నారు. సకల ఫలజాతులు దొరుకును. కమలాపండు కాలమందు బహు మంచివిగా, విస్తారముగా-ఇక్కడ ఫలింపుచున్నవి. సీమఅత్తిపండ్లు, సీమపన్నీరు పూలున్ను, అమితముగా ఫలింపుచున్నవి. సారవత్తమయినభూమి. అనేక తోటలు షహరుచుట్టు ఉన్నవి. అరటిచెట్లు సమృద్ధిగా వేస్తారు. వీధులు కుసంది. ఇప్పట్లో కొత్తవాల్ చేసే తురక షహరులో నడివీధిలో వేసిన వస్తువు వేసినవాడువచ్చి వెతికి యెత్తుకొనేదాకా పడి యుండేటట్లు ఆజ్ఞ చేయుచున్నాడు. సరదుకు ఒక ఠాణా ఉంచియున్నది. ఈ రాజుకు ఈ

విషయములో బహు శ్రేయస్సు కలిగేలాగు తోచుచున్నది. కుంఫిణీ వారు దొరతనములోగాని న్యాయవిచారణలోగాని యెంతమాత్రము సంబంధపడి యుండలేదు. మాదుజాతివారు కొందరు గోసాయిలున్ను యిక్కడ కోఠీలు వేసుకొని సాహుకారు పనులుగడుపుచున్నారు. ఒక మాత్రపు రత్నవర్తకమున్ను వీరివల్లనే జరుగుచున్నది. రాజునగిరిలో మాత్రము రెండు దేవాలయాలు అలంకారముగా కట్టియుంచి పూజ జరిగింపబడుచున్నది గాని మరియెక్కడను లేదు. నాలుగు సత్రాలలో రాజు అన్నప్రదానము నిత్యము నూటికి జరిగింపుచున్నాడు. అధ్యయన పాఠశాలలు లేవు. అధ్యయనము వినవలసియుంటే ఆర్జన నిమిత్తమై యిక్కడ వచ్చియుండే మధ్యదేశబ్రాహ్మణుల గుండా వినవలసినది. యీ దేశస్థులు హరికథ చేయడము చేయించడము వలన ఇహపరాలు సాధించేటట్టు నాకు తోచుచున్నది. హైదరాబాదు మొదలుగా కట్టియుండే దేవాలయాలలో సంతా ఒక గర్భగృహమున్ను తగుపాటి ముఖమంటపమును అరటిపువ్వు చందముగా నొక స్థూపిన్ని నిర్మింపబడి యున్నది.

ఈ దేశస్థులయొక్క ఆచారము మన దేశానకు యోగ్యము గాకున్నా శాస్త్రసమ్మతమైనదే కాని వేరే కాదు. ఆచారాలు, అలంకారాలు, ఆహారాదులున్ను దేశానికి తగినట్టుగా పెద్దలు స్మృతుల గుండా యేర్పరచియున్నారు. అది తెలియక ఒక దేశస్థులు మరియొక దేశస్థులను అన్యాయముగా నిందింపుచున్నారు. ఇందుకు దృష్టాంతమేమంటే యీ దేశములో భోజనానికి దృష్టి దోషమున్ను, ఉదకానికి స్పర్శదోషమున్ను అక్కరలేదని అంగీకరించి అలాగే నటింపుచున్నారు. అయితే అందువల్ల విరోధ మేమి? బ్రాహ్మణులు పరిషేచనము చేయడము దృష్టి దోషము పరిహారమయ్యే కొరకే కదా? అట్టుగా దృష్టిదోషము కలదని పాటించే పక్షమందు పరిషేచన విషయమైన ఆపస్తంబ సూత్రము వ్యర్థమవుచున్నది. అయితే ప్రథమములో శూద్రదృష్టి కూడదని ఒక వచనము ప్రవర్తించి వున్నది గనుక అది పట్టుకొని పిమ్మట ఆపస్తంబులు సూత్ర ద్వారా

పరిషేచన ప్రకరణము కలగచేసినా పరిషేచనమున్ను చేయుచు శూద్రదృష్టిన్ని లేకుండా దేశము నేలే ప్రభువుల ఆదరణచేతను మధ్య దేశపు బ్రాహ్మణులు వగయిరాలు జరుపుకొనుచు వచ్చుచున్నారు. పృథివ్యప్తేజోవాయ్వాకాశాలు బ్రహ్మాండానికి పంచమహాభూతాలయి యుండగా అన్నిటిని పరిశుద్ధి చేయగల జలమునకు దోష మెక్కడిది? ఒకగుంటలో సకల జాతులున్ను నాల్గు రేవులలో దిగి సమకాలమందు స్నానము చేయలేదా? ఉదకము కొద్దిగానుంటే స్పర్శదోషము పాటించవలె నని చెప్పే పక్షమందు అప్పుడు సమమయిన భూతముగానుండే అగ్నికిన్ని ఆ దోషము చెప్పవచ్చునే? అగ్నిమాత్రము యెంత కొంచమైనా యెవరు తాకినా అంటు దోషములేక పోవలసిన దేమి? యిక్కడి యీ ఆచారానికి ప్రతిగా మధ్య ద్రావిడ దేశములో పర్యుషితాన్నము తింటే పునరుపనయనము కావలసిన దనిన్ని చింతపండుతో మిరియాలు కలిసి పచనమయితే సురతో సమానమనిన్ని శాస్త్రము ప్రవర్తించియుండగా ఈ దేశమున్ను లేకపోతే ఉష్ణవాయువు భూమిలో వసించేవారు చచ్చిపోదురు గనుక అవతార పురుషు డయిన అప్పయదీక్షితులు ఆ పదార్థ భక్షణకు అనుజ్ఞ ఇచ్చినారనే బలమునుబట్టి దక్షిణదేశస్థులు వాటిని పుచ్చుకొనుచున్నారా, లేదా? ఇతర దేశస్థులు ఆ పదార్థాలతో తమకు నిమిత్తము లేదు గనుక అద్యాపి వాటిని నిషేధించే యున్నారు. కర్మద్వారా జ్ఞానము సంపాదించవలసి యున్నది గనుకనున్ను, కర్మములకు నియమములేక పూర్తి కాదు గనుకనున్ను నానా విధములయిన నియమాలను ఆయా దేశములకు అనుగుణముగా స్మృతులు ఏర్పరచినారు. ఇటువంటి ఆచారాలకు వచనాలచేతనే ప్రవృత్తి నివృత్తులు కలుగవలసి యున్నవి. యీ నియమాలన్ని వృద్ధాచారమువలన అనుసరించుటచేత మనోబంధకము లయినవి. అందుకు దృష్టాంతముగా కొందరి యాచారమే మంటే నిన్నటి మడుగువస్త్రము నేటి దేవతార్చనకు పనికివచ్చునని ధరింపుచున్నారు. కొందరు నాటి మడుగు వస్త్రమే కావలె ననుచున్నారు. ఇందులో నేమి భేదము? ఒక వస్త్రము ఉతికి ఆరవేసి

నాలుగు జాము లయితే మరి యొకటి రెండు జాములై యుంచున్నది. ఈ రీతిగా న్యాయశాస్త్రమున్ను దేశానుగుణముగా స్మర్తలు ఏర్పరచి యున్నారు. అది యెట్లాగంటే నిండు దక్షిణ దేశములో స్త్రీ చాపల్యము విస్తారము గనుక తోడబుట్టినదాని కొడుకు నిశ్చయముగా రక్తసంబంధి కుడని తెలుసునుగదా! రక్తసంబంధికుడని తోచే కుమారుని కన్నా రక్త సంబంధికుడని తెలిసిన మేనల్లుడే మేలని తోడబుట్టు కొడుకే ధనాని కిన్ని, కమానికిన్ని అధికారిగా చేయబడినాడు. నిండు ఉత్తర దేశములో స్త్రీ చాపల్యము తక్కువ గనుక "శరీరార్థం స్మృతా జాయా" అనే స్మృతి ప్రకారముగా అవిభక్తవిషయములో బహుమంది అన్న దమ్ములున్నా భార్యకు పతిసొత్తును గురించి అర్హత కద్దని నియమించ బడియున్నది. మధ్య దేశములో స్త్రీలవిషయముగా చాపల్యము మధ్య మముగా నున్నది గనుక పుత్రిద్వారా సొత్తులో సకల స్వాతంత్ర్య మున్ను వారికి కలగచేసి అపుత్రి విషయములోనున్ను అవిభక్త విష యములోనున్ను పోషణకు మాత్రము వారికి అర్హత కలగ చేసి సొత్తును అన్నదమ్ములకు ఇచ్చినారు. మొత్తుకు దేశాచారము లంతా శాస్త్రానికి, యుక్తికిన్ని విరుద్ధములుగా నుండవు గనుక అన్యదేశస్థుల పట్ల వారి యాచార వ్యవహారములు, అలంకారములు, ఆహారాదులున్ను భిన్నములుగా నున్నా వాటియందు భక్తి విశ్వాసములను ఉంచి వారున్ను ఈశ్వరసృష్టిలో చేరినవారు గనుక మనయొక్క అన్నదమ్ముల వలెనే సకల విషయములలో నున్ను వారిని విచారింపుచు రావలసిన దని తోచుచున్నది.

నాగపూరు షహరున్ను యింగిలీషు దండువుండే కామిటి అనే ప్రదేశమున్ను బహుసల్లరేగడభూమి; వర్షాకాలములో అట్టిభూమి యందు సంచరించేవాడికె లేనివారు చూస్తే అది బహుఅసహ్యముగా తోచబడును. వర్షాకాలములో వీధులున్ను, సందులున్ను కాలుపెట్ట డానికి యోగ్యములుగా నుండవు. శీతాబులిడిలోనున్ను, కామిటిలో నున్ను జాతులవారు మాత్రము గులకరాళ్ళు కలసిన ప్రదేశముగా చూచి శీతాబులిడిలో కొండసమీపముగా నున్ను, కామిటీనది

వోరగానున్ను తోటలు యిండ్లున్ను కట్టుకున్నారు. యీ ప్రాంతములలో జాజిపూలున్ను మొల్లపూలున్ను దొరుకునుగాని, మల్లె పూలు లేవు. శ్రీరంగ కస్తూరి వట్టెలు చెన్నపట్టణము వదలిన వెనక కండ్లచూడవలసినది లేదు. నాగపూరు రాజ్యము మొదలుగా యీనపుడకలు దొరకవు. ఈ ఆకులతో శృంగారికట్లలు కట్టుకొని పనులు గడుపుతారు. విస్తరాకులు జొన్నచొప్పతోను, వెదురు దబ్బలతోనున్ను కుట్టుకోవలసినది. సన్నికల్లుగుండు కడప వదిలిన వెనక లోకులు వాడడము లేదు. నూరవలసిన పదార్థాలంతా రోటిలోవేసి తొక్కవలసినది. నిండా మన దేశస్థులకు సన్నికల్లు కావలసిన ప్రయత్నము చేస్తే కలవంగుండు సంపాదించి అందుగుండా పని గడుపుకొనవలసినది. కామిటి అనే కంటోనుమెంటు దండువుండే ప్రదేశములలోనున్ను పాస్కివారు ఇంగిలీషు సాహెబులుకూడ వుంచి యున్నారు. ఊరున్ను, బజారు వీధులతో బస్తీగా కనుపడుచునున్నా హాయిదరాబాదులో యింగిలీషుదండువుండే బస్తీకళలో శతాంశలలో నొక యంశమైనా లేకుండా వున్నది. అది యెందుచేతనంటే 'స్వయం రాజా స్వయంమంత్రి' అనే న్యాయప్రకారముగా రాజ్యానికిన్ని దండుకున్ను యింగిలీషువారే యిదివరకు ఖామందులయి యుండినందున వీరి ప్రాపును అనుసరించి వీరి దండులో లోకులు చేరవలసిన అగత్యము యిదివరకు లేకుండా వుండిపోయినది. అంతేకాకుండా యీసరికి హాయిదరాబాదు ప్రభువు 'లేస్తే కొరగాని చేను తోలే మంచమీది మొండివానివలె' గౌరవములను కాపాడుకొనుచు వచ్చుచున్నాడు గనుకనున్ను నాగపూరువారు స్నానముచేసి చలిభయమును పోగొట్టుకున్నారు గనుకనున్ను యింగిలీషువారి దాపున్ను, చెల్వమున్ను హాయిదరాబాదు వారి దేశములో విశేషముగా నున్నది.

ఇంతే కాకుండా ప్రపంచంలో ఒక మంచితో కూడా, ఒక చెడు కలిసి యుంటేనే సౌఖ్యహేతువుగా తోచుచున్నది. నాగపూరు రిసైడెంటు అయిన *మేస్తర్ గ్రీన్ దొరగారితో ప్రపంచ సంబంధములయిన కొన్ని మాటలు మాట్లాడుచునుండగా ప్రపంచమే పుణ్యాపాప

* Mr. Groeme.

మిశ్రమమయినదనిన్ని పుణ్యము నిర్గుణ బ్రహ్మసంబంధ మయినదనిన్ని
పాపము సంకల్పద్వారా సృష్టమయిన మాయ సంబంధమయిన దనిన్ని
ఈరెండున్ను కలిసి ప్రపంచము నిర్మింపబడ్డది గనుక యెట్టి మంచిపనిలో
నున్ను చెడు కలిసి యుంచున్నది. అందుకు దృష్టాంతమేమంటే హిందు
వులు మూఢులకున్ను, బాలులకున్ను దైవమందు భక్తి కలిగే నిమిత్త
మయి బింబాల యెడల దైవత్వమును ఆరోపించుటచేత పరిపక్వ
కాలాలయందు కూడా ఆ నమ్మికె నిలవపడి మనుష్యకోటిని ముంచి
వేయుచున్న దనిన్ని, తద్వ్యతిరిక్తముగా విలాయతీ క్రీస్తుమతస్థులు
ఈశ్వరస్వరూపము సర్వభూతాత్మకమని ఆదిలోనే బోధచేయ తలచుట
చేత మూఢులున్ను, బాలులున్ను ఈశ్వరుడు కలడనే జ్ఞానమే లేక
మునిగిపోతారనిన్ని, హిందువులు ద్వితీయ వివాహము స్త్రీలకు లేక
చేసుటచేత బహుమంది బాల్యమున విధవలయిన స్త్రీలు మిక్కిలి కష్ట
పడుచున్నారనిన్ని దానికి వ్యతిరిక్తముగా యింగిలీషు జాతివారు
స్త్రీలకు ద్వితీయ వివాహానికి అనుజ్ఞ యిచ్చుటచేత స్త్రీలకు చాప
ల్యము సహజముగా నుండబట్టి స్వపురుషునియెడల భయభక్తులు తక్కు
వయి వాణ్ని కృత్రిమముచేత చంపి వేరే పురుషుని వివాహము చేసు
కొనుచున్నారనిన్ని ఒక మంచిని ఊహించితే ఒక చెడు ప్రపంచ
స్వభావద్వారా ఆ మంచిలో జనింపుచున్నదనిన్ని యివి
మొదలయిన హేతువులచేత చెడు కలియని మంచి పని ప్రపంచ
ములో లేదనిన్ని నిశ్చయించినాము. పయిగా ఈ యనేక జగత్తుల
సృష్టిని పరబ్రహ్మ తన చిద్విలాసార్థమయి చేసి నందున
ప్రతిదేహానికిన్ని ప్రకృతి వేరువేరుగా నున్నది. ప్రకృతిభేదము
మనసువల్ల జనితమయినది. మనస్సు బుద్ధిజనితమైనది. కాష్ఠ
ములో అగ్ని ప్రవేశించి యున్నట్టు బుద్ధిలో పరమాత్ముని చైత
న్యము ప్రతిఫలించియున్నది. కాష్ఠభేదములు అనేక భేదములయి
నట్టు బుద్ధిభేదములు అనేకములుగా నుంచున్నవి. ఒక రాజుకు అధీ
నములుగా అనేక మండలాలు ఉండుటకు బదులుగా ఒక్కొక్క
మండలానికి ఒక్కొక్క రాజు ఉండినట్టయితే బుద్ధి భేదముల చేత

నున్ను, ఒకరి యుక్తిమీద నొకరు తమ బుద్ధిద్వారా మొదటి వాని యుక్తిని కారణ మగురూపచేశనుగా నుంచుకొని తాము యెక్కువ యుక్తిని కలగచేసి రాజ్యతంత్రము గడుపుదురు. సయిగా తల్లి దండ్రులుగల బిడ్డలు తల్లి కోపము చేస్తే తండ్రివద్దికిన్ని, తండ్రి కోపము చేస్తే తల్లి వద్దికిన్ని యెట్లా పోవుచు వచ్చుచు నుందురో హాయిదరాబాదు యింగిలీషు దండులలో నుండేవారు ఒక ప్రభువును వదిలి మరియొక ప్రభువు వద్దికి పోవుచు, వచ్చుచు నెట్లా ఆనందింపుచున్నారో ఆలాగే ప్రజలు సుఖపడవచ్చు నని తోచుచున్నది. యీ యుక్తిచేతనే యీశ్వరుడు (విభా)తి విశేషాలను భూరి దక్షిణ పంచినట్టు ఆయాకాలాలలో పాత్రమెరిగి పంచి పెట్టుచు వచ్చుచున్నాడు.

యీ నాగపూరు రాజ్యానకు చెన్నపట్టణపు దండు రాక మునుపు చింతపండు దేనికి ఉపయోగమయ్యేదిన్ని తెలియదు. ఈ దేశస్థులు వేడిగా కాచకనే పచ్చి మజ్జిగెగాని పెరుగుగాని పోసుకొనరు. దక్షిణ దేశపు శూద్రులు రాత్రిలో మజ్జిగ పెరుగు పోసుకుంటే యెట్లా, జలుబు చేసునని భయపడుదురో ఆలాగే ఒక భయము వీరికి జనియించి యున్నది. ఆహార విశేషాలు జాఠరాగ్నికి స్నేహమయ్యేదాకా ఎటువంటిదిన్ని అనుకూలించదు; స్నేహమయిన వెనక బాధించదుగనుక మేము రాత్రిలో, పగటిలోనున్ను ఈ రాజ్యములో విశేషముగా దొరకుటచేత మజ్జిగెగాని పెరుగుగాని తాగడమువల్ల మాకు ఏమిన్ని విరోధము చేసినదికాదు. యిందుకు దృష్టాంతము వనములో సంచరించే మనుష్యులు విషజంతువుల భీతిలేక నుండే కొరకు మనిషిని చంపదగిన గరళమును, ముష్టివిత్తులనున్ను తిని జీర్ణముచేసుకొనుచున్నారు. గనుక దేశాచారమునుబట్టి వాడికెయయిన ఆహారపదార్థాలు విడవతగ్గవి కావని తోచుచున్నది. దేశాటనము చేయడములో పోష్యులుగానుండే దారాపుత్రాదులనుకూడా తీసికొని విషయాపేక్ష నివృత్తిపొందక వచ్చినా, తృణాగ్రముగాని భగవదాజ్ఞ లేక చలించ దనే సత్యవార్త పెద్దలకుండా వినపడినట్టు రాజఠీవిగా శ్రీరాములు ఇదివరకు దోవలో

నాకు జరిపింపుచు వచ్చినారు. ఈషణ త్రియాలమీఁది యభిమానము నిరోధిస్తే అది సచ్చిదానందము కలుగచేయఁగల మాయద్వారా ఆశ్చర్యకరమయిన భయసంతోషపుగా మనసుకు తోఁచుచున్నందున అయోధ్య మొదలయిన మహాస్థలములకు స్వదేశములో నున్నప్పుడు అనుకొన్న ప్రికారము నయిషు చేసుకొని పోదామనే తాత్పర్యము ఇక్కడ వదిలినది. కర్మద్వారా జ్ఞానము సంపాదించవలెననే అస్మదాదులకు నమ్మికచేత కడ తేరవలసినది గనుక నిత్రిబోధవత్తుగానుండే స్మృతి వాక్యముల ప్రికారము గంగాస్నానము, గయావ్రిజనమున్ను చేసి స్వదేశానికి రావలెనని యున్నాను. స్వదేశపక్షపాతము లోకులకు ఈ చొప్పున కలగడానికి ముఖ్యకారణ మేమని విచారించగా ధరించియుండే దేహముమీఁద యభిమానముకలవారు బాల్యాదారభ్య తమతో సహవాసపడినవారు బహుమంది స్వదేశములో నుండుటచేతనున్ను, మనసుకు దేహము నావవంటిది గనుకనున్ను మనసనే నావతిప్పేవాఁడు జాగరూకుఁడు కాకపోతే యేలాగు వాడ స్వేచ్ఛగా కొంతకాలము సంచరించగా ఆ నావవాఁడు వాడకు అధీనమైపోవునో అలాగే యీ దేహము మనసు అధీనమయి నా దేహసౌఖ్యము తన దనే భ్రాంతిని పొంది యుండుటవల్ల మనసు దేహాధీనమయి స్వదేశగమనమును నిరీక్షింపుచున్నది.

ఇటువంటి నాగపూరు పట్టణములో ఒంటికంభం డబ్బల్ టాపు కనాతులు కల డేరా ఒకటిన్ని, వంట భోజనాలకు కంబళి డేరా ఒకటిన్ని సంపాదించుకొనుటకున్ను పల్లకి మరామ్మతు చేయించుకోవడమునకున్ను అగస్టు ౧౪ తేది మొదలు ౨౦ తేది వరకు నిలిచినాను. హాయిదరాబాదు వహారువలెనే యీ షహారులో నేను ప్రివేశించిన కాలమందు కృష్ణనవరాత్రి యుత్సవము బహు విభవముగా యీ దేశస్థులు ఇంటింట జరిపించినారు. ఉత్సవానంతరము మధ్య దేశములో పసలపొంగలికి జరిగించే ఆగమమంతా పశువుల విషయముగా నున్ను మనుష్యుల విషయముగా నున్ను జరిపింపుచున్నారు. హాయిదరాబాదులో నుంచి తెచ్చిన ప్రియివేటు టెంటును అనే శిఫాయి డేరాలను ఇక్కడ వదిలి, నూతనముగా సంపాదించిన డేరాలకు గోను

ఆరుగురాత్రిలను కాశికి పోవడానకు గురత్రము ౧ కి రూపాయీలు ౧౫ లెక్క బాడిగెకు మాట్లాడి జుములా గుజారాలు ర కంబళిది ౧ అందుకు తగ్గ బొంగులు, మేకులు, కింద వెయ్యడానకు కీలుచాపలు, ఇవంతా ఆ యీరు గురాత్రిలమీద సాగించుకొని రావడ మయినది. హాయిదరాబాదునుంచి వచ్చిన యెద్దులకు మళ్ళీ అవి స్థలము చేరడానికి ౧౫ దినముల జీతము కట్టియిచ్చి పంపించివేయడ మయినది. యింతే కాకుండా ఒక కావటి మనిషి బళువులో 3 మంచాలు కావలసినప్పుడు తీసి మళ్ళీ జోడించేటట్టు చేయించి, డేరాలలో చెమ్మగా నున్నా పండుకోవడానికి విరోధము లేక నుండేటట్టు చేసుకొన్నాను.

ఇక్కడ నాగపూరి రూపాయి యనేది ఒక్కటీ చెలామణి. రూపాయల మార్పులో హాయిదరాబాదు వలె చేతికి చెయ్యి నష్టము తగలదు. దుడ్లుమాత్రము నాలుగేసి యీళ్ళకు ఒక్కొక్క మాదిరి చలామణి అవుచున్నవి. ముందు చెలామణి దుడ్లవయినము విచారించుకొని అప్పటప్పటికి దుడ్లు మార్చుకొనుచు రావలసినది. నాగపూరు రూపాయి ౧ కి ఇక్కడి దుడ్లు ౩౨. దుడ్ల భేదము కొద్ది సంఖ్య వ్యత్యాస మవుచున్నది.

నేను చెన్నపట్టణము వదిలి నప్పుడు కావలసిన సామానుల నుంచుకొనేటట్టు పల్లకీలో జాగా చేయవలె నని తోచినది. పిమ్మట పల్లకీ బళువుచేత దారి సాగక పోయినంతలో నేను కొనే పరుపుకూడా తీసివేసినాను. గనుక పాలకీ దోవప్రయాణానికి చులకనగా ఉండుట మేలు.

ఇక్కడ ౧౫ సంవత్సరములుగా వాసము చేయుచు నుండే డాక్టరు వాయిలీ (Dr. Wylie) గారితో మాట్లాడగా నాగపూరు మొదలుకొని జబ్బలపూరు వరకు అడివి బలిసిన భూమి గనుక అదికొత్త నీళ్ళతో తడిసి ఆ యడివిలోని ఆకులు మురిగి వాటి రసముతో పూట యెక్కుటచేతను ప్రతి సంవత్సరమున్ను ఆగష్టు ఆఖరు మొదలుగా అక్టోబరు పర్యంతము చలిజ్వరాలు తగులుచున్నవి; నీవు త్వరగా జబ్బలపూరు చేరవలసిన దని చెప్పినారు. ఈ దేశస్థులున్ను ఆ మాట నిజమే నని ఒప్పుకొన్నారు.

హాయిదరాబాదు వద్ద ఒక మనిషిని బహుదుష్ట సర్పము కరిచి సంతలో పాముచెక్క నూరి యిచ్చి మెడులూనున్న తాగించినాను. 3 ఝాములకు మనిషి లేచి తన యింటికి నడిచిపోయినాడు. చలిజ్వరాలకు లింగకట్టు బ్యార్కు ఇచ్చుచు వచ్చుచున్నాను. కొంత అభిముఖమయిన వెనుక భేదికి యిచ్చుచున్నాను. శ్రీరామ కటాక్షముచేత గుణ మవుచు వచ్చినది. కూడా వచ్చేవారికి నేను యిచ్చే ఔషధాలు గుణముఖానికి తెచ్చేటందున దిగేయూరిలో నొప్పిగలవారు కనుపడితే మా యజమానునివద్ద మంచి మందు లున్నవనిన్ని ధర్మానికి యిచ్చుననిన్ని రహస్యముగా నా మనుష్యులు చెప్పుచు వచ్చినారు. వారు వారు వచ్చినన్ని శ్రమపెట్టసాగిరి. తెలిసి తెలియని చికిత్స చేయడమువల్ల బహుపాతక మని చెప్పి ఉన్నది గనుక, హాయిదరాబాదు మొదలుగా నాపరివారము వినాగా ఇతరులకు ఆపదలేని విషయములో మందులు ఇవ్వడము లేదని నిశ్చయము చేసి ఆప్రకారము జరిపింపుచు వచ్చుచున్నాను.

దక్షిణదేశములో తిరుపతి తిరుణామలై యాత్రచేసిన వారిని అనేకులను చూడడము ఎట్లా సహజమో ఆరీతిగా ఈ నాగపూరు రాజ్యములో కాశీయాత్రచేసి దాని ఖుల్లసుకూడా చెప్పగల వారిని అనేకులను చూడవచ్చును.

ఇటువంటి నాగపూరి షహరు అగష్టు ౨౧ తేది వదిలి ఆ దినమున ౨ ఘంటలకు కామిటి అనే యింగిలీషుదండుండే స్థలము ప్రవేశించినాను. కామిటీశ్వర ఘట్టం రేవులోను అక్కడి ఖననానదిని దోనెలకుండా ౨౬ తేది దాటి అక్కడికి ౭ కోసుల దూరములోనుండే రామటెంకి అనే గుహాస్థలము పగలు ౨ ఘంటలకు చేరినాను. నేనుఉదయాన కామిటి వదిలి బయలుదేరేటప్పుడు ౬ ఘంటలు. అప్పుడు త్యాజ్యశేషము ఉండినది. దాని ఫలమేమంటే నదరహీంనది దాటడానికి నాలుగయిదు రేవులలోను న్నుండే పడవలకు కర్నల్ ప్యారన్ మొదలయిన దొరలు వారికింది యధికారస్థులకు తొలుదినమే ఉత్తర్వుచేసినందునకింది అధికారస్థు లందరు నాతోకూడా దోవ పంపించను నదిదాకా వచ్చిన్ని పడవవాండ్లు యీరేవున దాటుతారని ఆరేవువారున్ను ఆరేవున దాటు

తారని యీ రేవువారున్ను సందేహముతో హాజరులేక తుదను ఒక యొంటికొయ్య దోనెను ౮ ఘంటలకుపట్టి దానిగుండా ౧ ఘంట సేపులో మూడు సవారీలనున్ను దాటించుకొని యివతల సాగివచ్చి నాను. దారిలో వర్షముచేత రామటెంకిముందర కొంచముగా తడిసి నాము. సామానుకావిళ్ళు పోయినదోవ తెలియక కొంతసేపు వ్యథ పడితిమి.

కామిటినుంచి రామటెంకికి మూడు దోవలు వున్నవి. కామిటేశ్వర ఘట్టమువద్ద ఒక చిన్న శివాలయము వున్నది. అక్కడ ఖనానా అనే నదినిదాటి వచ్చేదారి రాజమార్గము. నా సామాను కావళ్ళు మరియొక రేవునదాటి వేరేమార్గముగాపోయి కేడి అనే వూరి వద్ద కలుసుకొన్నవి. మరికొందరు పరిజనులు రామటెంకి యూరి ముందర కలుసుకొన్నారు. దారి నల్లరేగడ. అడివి లేదు. మామిడిచెట్లు శాల వేసియున్నది. కొన్ని వాగులు దాటవలెను. చిన్నయూళ్ళు కొన్ని దారిలో నున్నవి. వాటిపేళ్ళు యీ అడుగున వ్రాసినాను.

నెంబరు ౧ - బరోడా ౧ - అగోరి ౨ - కేడి ౩ - సాటక్కు ౪ హూరా ౫ - రామటెంకి ౬.

ఈ రామటెంకి రామక్షేత్రము; మహారువంటి యూరు. కొండ చుట్టుకొనియున్నది. నాల్గువేలయిండ్లు కలవు. నాలుగయిదు చెరువులున్నవి. బహుజలవసతి. తమలపాకులతోటలు అనేకముగా ముజుబూతి అయిన పందళ్ళు పెట్టివేస్తారు. యిక్కడ తమలపాకులు బహు ప్రసిద్ధిపొందినవి. దక్షిణమున హాయిదరాబాదువరకు, ఉత్తరమున ప్రయాగవరకున్ను పోవుచున్నవి. రాజాధిరాజులు టప్పావుంచి యీ తమలపాకులు తెప్పించుకొనుచున్నారు. నెలదినములవరకు కాపాడుచు వస్తే ఆకులు చెడిపోకుండా వుంచున్నవి. యీ ఆకుల గుణమేమంటే పండినవెనక చెన్నపట్టణపు రవేసాకులంత సన్నములుగా మృదుత్వముకలిగి వుంచున్నవి; రుచిగాను వ్నుంచున్నవి. ఈ యూరిలో సకలపదార్థాలున్ను దొరుకును. ఈ యూరికి అర కోసెడు దూరములో కొండలమధ్యే అంబరీషతీర్థ మనే కొలను దివ్యోదకముకలిగి చుట్టు అనేక మంటపాలతోకూడా వున్నది, తీర్థాల

నికిచుట్టు కొన్ని తీర్థవాసుల యిండ్లున్ను ఇతరపరిజనుల యిండ్లున్ను నాగపూరిరాజు నగరు వొకటిన్ని వున్నవి. యీ నగరు అతి విశాలముగా కట్టి యున్నది. యిక్కడ బ్రాహ్మణసంతర్పణము తిరుణామలె వత్తుగా కార్తీకశుద్ధ పున్నమకు జరిపింపుచున్నారు. లక్షజనులు చేరు చున్నారు. కొండమీద దేవాలయానికి 200 మెట్లు ఎక్కిపోవలసినది. దేవాలయము చిన్నదయినా సుందరముగాను, పరిష్కారముగానున్ను కట్టియున్నది. కొండమీద నరసింహమూర్తికిన్ని వరాహమూర్తి స్వామికిన్ని రెండాలయాలు కట్టి మూర్తులను స్థాపించినారు. ఆ రెండు మూర్తులున్ను అతిగాత్రములుగా, యథాశాస్త్రముగా జీవకళ తనకు దానే కలిగి యుండేటట్టు చేసియున్నవి. దేవాలయములో సకల రాజోపచారములతో నాగపూరిరాజు సం॥ ౧కి [illegible]౦౦౦ రూపాయిల ఖర్చుతో పూజలు బ్రాహ్మణులకుండా నడిపింపుచున్నాడు. కొండ మీదనుంచి చూస్తే ఆయూరి విస్తారము చక్కగా తెలియుచున్నది. యీ గుళ్ళో కాశీ దక్షిణద్వారమని ఒకవాకిలి ఉత్తరపు పక్కనున్నది. తీర్థమునుంచి కొండ నెక్కడానికి మెట్లుకట్టి యుండడము మాత్రమే కాక ఊరిలోనుంచి కొండ యెక్కడానకు వేరే మెట్లు సుందరముగా కట్టియున్నవి. రాజునగరులో దిగి క్షౌరము తీర్థ శ్రాద్ధము మొదలయిన క్రియలు చేసినాను. ఇక్కడి తీర్థవాసులు మధ్యదేశజను లయినా ఆచార వ్యవహార భాషలు దాక్షిణాత్యులతో భేదించియున్నవి. అరువై బ్రాహ్మణులయిండ్లు ఇంత యూరికి ఉండియున్నవి. తీర్థమునకు చుట్టున్ను మంటపాలు, ఫల వృక్షాలున్ను విస్తారముగా నుండుట చేతను చుట్టూ కొండ ఆవరించుకొని యుండుట చేతనున్ను బహు తపస్విజన వాసయోగ్యముగా నున్నది. కొందరు పునశ్చరణను తీర్థతీరమందున్ను కొండమీద నున్ను నియమముగా చేయుచున్నారు. తీర్థతీరమందు దత్తాత్రేయుల వారి ప్రతిమ యొకటి మహా సుందరముగా చేసి ప్రతిష్ఠ చేయబడియున్నది. తీర్థమధ్యే అంబరీష మహారాజు సువర్ణమయముగా గుడికట్టి నాడనిన్ని అది కదాచిత్తుగా ఉదకము లోపమయిన కాలాల్లో అగుపడుచున్న దనిన్ని తీర్థవాసులు చెప్పతారు. ఆ కొలను

తీర్థ హీనముగా ఎన్నటికిన్ని కాతగ్గదిగా నుండలేదు. ఆతీర్థము పాతాళలోక జనితమయిన దనిన్ని యెట్లా ఊర్ధ్వలోకానికి మందాకి నిన్ని, భూలోకానికి భాగీరథిన్ని ఉన్నవో తద్వత్తుగా పాతాళ లోకానికి భోగవతి అనే తీర్థమిది యని పురాణ నిశ్చితమైయున్నది. అంబరీష మహారాజు అతిథిరాకను నిరీక్షించనందున దుర్వాసుల శాపగ్రస్తుడయి యుండగా ఈతీర్థము ఆశాపమును నివర్తింపచేసినది. అంబరీష మహారాజు ఇక్కడికి ౪ కోసుల దూరములో నుండే నంది గ్రామములో రాజధాని కలగ చేసుకొని దొరతనము చేసినాడు. రుక్మాంగదుని రాజధాని యెంత విచారించినా యిదివరకు తెలిసినది గాదు.

ఈ పర్వతము పేరు సింధురాజ పర్వతము. శ్రీరాములు తన దొరతనములో బ్రాహ్మణ శిశువుయొక్క మరణహేతువును కనిపెట్టే కొరకు వెతకగా శూద్రుడు తపస్సు చేయుచు నుండెను గనుక వాని సంహరించిన వెనుక వాడు సద్గతిను పొంది ప్రార్థన చేసి నందున వాని లింగాకృతి చేసి తాను సీతాలక్ష్మణహనుమత్సమేతుడై యిక్కడ ఎప్పుడున్ను దర్శన మిచ్చేటట్టు వరమిచ్చి ఆ ప్రకారమే యిక్కడ వసింపు చున్నాడు. యిది యీ స్థల మహాత్మ్య పురాణ బోధితముగా నున్నది. ఈ స్థలమందు ౨౭ తేది రాత్రి వరకు ఉండినాను.



## ఆ ఱ వ ప్ర క ర ణ ము

౨౮ తేది ఉదయమున ౬౺ ఘంటకు లేచి అక్కడికి ౬ కోసుల దూరములో నుండే దొంగల తళావు అనే వూరు ౧ ఘంటకు ప్రవే సించినాను. ఈ దినమున్ను కొంచము త్యాజ్యశేషము ఉండగా ప్రయాణ మయినందున చెన్నపట్టణము వదలిన యిన్ని దినములు వర్షాకాలములో ప్రయాణమయి నడిచి నందుకు సెలవుగా నేటి దినమున అడవిమధ్యే ఒక ఘంట సేపు సంతతోద్ధారమయిన వర్ష ములో తడియడ మయినది. దారి బహు బాగా ఉన్నది. నిర్మల వది

లీన వెనక ఈ సౌఖ్యకరమయిన మెరగులక యిసక గల భూమిని ఒక కోసెడు దూరమయినా చూచినది లేదు. దట్టమయిన అడివి మధ్యే భాట. రెండు గొప్ప వాగులున్ను మరికొన్ని చిన్న వాగులున్ను దారిలో దాటవలసినది. దొంగలతళావు అనే ఊరు చేరగానే జాగాకు నిర్వ్యసనముగా దుకాణాలవారు తమ తమ యింగళ్ళకు చేరినట్టుగా ౫౦ అడుగుల నిడివిన్ని ౧౫ అడుగుల వెడల్పున్ను గల కొట్టాయీలు కట్టి, పాయిలు వేసి ప్రతిదినమున్ను గోడలు సమేతుగా గోమయముతో శుద్ధి చేసి, కొట్టాయీల ముందర గుర్రాలున్నా పశువులున్నా కట్టడానికి మేకులు పెట్టి కొట్టి యున్నారు. ముసాఫరులు సమ్మతమయిన కొట్టాయిలో దిగవచ్చును. అయితే కావలసిన భోజనసామగ్రిలు కొట్టాయి ఖామందువద్ద పుచ్చుకోవలసినది. ఒకటిన్ని కొనకపోతే పేదలను కొట్టాయిలో సిలవనియ్యరు. ముసాఫరులకు కావలసిన సామగ్రిలు అహంపూర్వ మహంపూర్వమని యిచ్చుచున్నారు. యీ కొండమార్గములో కృష్ణ మొదలుగా స్థలమునకు శ్రమపడుచు వచ్చినవారికి ఈ విశాలము లయిన స్థలములు అయాచితముగా దొరకటములో నుండే ఆనందము చెప్పితీరదు. అయితే యీ కొట్టాయీలు వీథికి యెదురుగా నిరుపక్కల వేసియుంచున్నవి. పరదా కట్టివేస్తే యింతకుమిక్కిలి అనుకూలమయిన స్థళములేదని తోచబడును. గుర్రాలకు పచ్చికసువు మోపులుగా తెచ్చి ఉంచి ప్రార్థించి తీసికొనుమనుచున్నారు. కృష్ణదాటినది మొదలు సెనగలు అతిశయముగనుక గుర్రాలదాణాకు చింతలేదు.

ఈ నాగపూరు రాజ్యములో దక్షిణదేశమువలె యర్రకందులు, నల్లనువ్వులున్ను దొరకవు. అందుకు ప్రతి తెల్లకందులు తెల్లనువ్వులున్నా సమృద్ధిగా అమ్ముతారు. తిలతయిలము దొరకడము అరుదు. ఆముదము శుద్ధముగా దొరకదు. అవిశలని నువ్వులవంటి గింజలు పండుచున్నవి. వాటినూనె విప్పనూనెయున్ను దీపాలకు పోయుచున్నారు. సకల ధాన్యాలున్ను అమ్మడముగాక అన్నిటినిన్ని పిండిగా విసిరి అంగడిలో పెట్టి ప్రతియూరిలోనున్ను అమ్ముచున్నారు.

ఈ రామటెంకికి ఉత్తరము బంగాళా గౌనరుమెంటులో చేరిన శివినితాలూకాతో చేరినది. ఈ రాజ్యము కుంఫిణీవారికి స్వాధీనమయిన వెనక గవనర్‌జనరలువారు జబ్బలపురిలో ఒక ఏజంటును సాగరులో ఒక ఏజంటునున్ను ఉంచి వారికింద కొందరిని ప్రిన్సిపాల్ అసిస్టాంట్సు అని యేడుగురు దొరలను ఏర్పరచినారు. ఇంగిలీషువారి ఆధీనముగా ఈ రాజ్యముకాకమునుపు యీ యడవులలో దొంగలభయము విస్తారముగనుక ఇప్పుడు ఊరికి మూడేసి గుర్రపుసవార్లను ఠాణాలుగా ఉంచి బహుమందిని పట్టి శిక్షించి కొందరిని దారులలో తూకుతీసి (ఉరితీసి) ఆ కళేబరాలు శిథిలములయ్యే దాకా వ్రేలుకాడుచు నుండేటట్టు చేసినారు. మజిలీ యూళ్ళలో పరువుకల ముసాఫరుల సరఫరా నిమిత్తమయి ఒకకొత్తవాలునున్ను యిద్దరేసి సరఫరా బంట్రోతులనున్ను ఉంచియున్నారు. ఇప్పట్లో మృగ భయము ఒంటిగా వచ్చేవారికి మాత్రము ఉండవచ్చును.

యీ దొంగల తాళవు అనే యూరు బహుజలవసతి కలది, దొంగలు వేసేతళావు కలది గనుక దొంగలతళావు అని పేరువచ్చినది. యీ శివినీ తాలూకా కిందవుండే గ్రామాలు యిజారాలకు తీర్చియిచ్చినారు. ఆ యిజారాదారులను పట్టేలు అని వాడుకొనుచున్నారు. యీ యూరు చిన్నదయినా ముసాఫరులకు సౌఖ్యప్రదముగా నున్నది. ఆ రాత్రి అక్కడ వసించినాను. మోంది అనే ఊరు ఒకటి దారిలోనున్నది. అక్కడ నాగపూరు రాజు చౌకీ ఒకటియున్నది.

౩౦ తేది ఉదయాన ౬౪ ఘంటకు లేచి యిక్కడికి ౭ కోసుల దూరములో నుండే కురాయి అనేవూరు ౧ ఘంటకు చేరినాను. నడిమి వూళ్ళు: నెంబరు ౨-గర్రి ౧ కవాసా-౨ రెల్లి-౩ రంపి-౪ కురాయి-౫.

దారి నిన్నటి దారివలెనే బహుఅనుకూలముగా నున్నది. దట్టమయిన అడివి మధ్య భాట. ౬ వాగులు గొప్పవిన్ని; చిన్నవిన్ని దాటవలెను. మధ్యె గర్రి అనే యూరివద్ద సుందరమయిన తామరకొలను ఒకటి వున్నది. అక్కడక్కడ ౧౦ బారల దూరము కదాచిత్తుగా నల్లరేగడ భూమి తగులుచువచ్చును. అదిన్ని గట్టిరేగడగాని, కాలుదిగపడే అడుసు కాదు. కురాయి అనే ఊరిలో

నిన్నటివలెనే కొత్తాయిలు, చావిళ్ళున్ను కట్టియున్నవి. రామటెంకి మొదలుగా ఉండే టప్పామనుష్యులు శిమినీ టప్పారయిటరు యొక్క ఉత్తరువుకు లోబడ్డవారైనా నాగపూరి యిలాకా టప్పా డఫేదారులు ఇద్దరు నాతోకూడా వచ్చినారు గనుక వారి పెత్తనమువల్ల కురాయి దాకా టప్పా మనుష్యులను మజిలీ మజిలీకిన్ని తెచ్చినాను. రామటెంకి మొదలు కొండకోసులను పక్కాకోసు లని చెప్పుతారు. ఒక పక్కాకోసుకు మూడు కచ్చాకోసులు. ఒక కచ్చాకోసుకు ౨ మయిలు లని యిక్కడివారు చెప్పినారు. ఈ యూరున్ను నిన్నటి యూరివలెనే నిండా బస్తీకాకపోయినా మునాఫరులకు సౌఖ్యము కలగచేయడానకు సకలవిధాలా చాలియున్నది. యీ నాగపూరి రాజ్యము ప్రవేశించినది మొదలుగా ప్రతియూరిలోనున్ను కూరగాయలు దొరుకుచు వచ్చుచున్నవి. ఈ యూరిలో నున్న చెరువు కలదు గనుక జలవసతి అయిన గ్రామమే. యిక్కడి చెరువులలో శింగాడీ కాయలని పయిరు పెట్టుతారు. ఆ కాయలలో బాదంపప్పుజాడగా విత్తులు ఉన్నవి. ఆ విత్తులను పిండిచేసి ఉపవాస దినాలలో పూరీలుగా కాల్చి ఫలహారము చేస్తారు. యథోచితమయిన తీపుకలిగి ఉన్నది. ఆ పిండి ఆరోగ్యకరమయిన దని చెప్పుతారు. ఆ యూరిలో ఆ రాత్రి వసించినాను.

౩౧ తేది ఉదయాన ౬ ఘంటలకు లేచి అక్కడికి ౬ కోసుల దూరములోనుండే చావిడి అనే ఊరు ౧౨ ఘంటలకు చేరినాను. నడిమి ఊళ్లు. నెంబరు ౭ - మోహాగాం- ౧ - సూకుతలా ౨ - గోపాలపూరు ౩. ఆ యూరిలోనున్ను ఆరీతిగానే కొట్టాయీలు దుకాణపుదారులు కట్టి యుంచినా బస్తి అయిన వూరుగనుక బజారు వీథులలో జనసమ్మర్దముగా నుండుటచేత మనసుకు రమ్యముగా నుండలేదు. కురాయివూరు దాటగానే కొండయెక్కి దిగవలసినది. ఇక్కడ వింధ్యపర్వతమును ఆరోహణము చేయవలసిన దనేది ప్రసిద్ధముగా నున్నది. ఘాటరాతి గొట్టు; నల్ల రేగడ కొంతమేర. కొండదిగగానే యెర్ర రేగడగా నున్నది. అడివి మధ్యేఘాటు. దారిలో కొన్ని వాగులున్ను దాటవలెను. ఈ కొండ యెక్కగానే యాత్రకు వెళ్ళేవారు వింధ్యవాసినికి ప్రీతిగా కొన్ని టెంకాయలు కొట్టి చూరవిడుచు చున్నారు.

ఎండు కొబ్బెరలోపల నుండే టెంకాయలు దొరుకుచున్నవి. యీ ప్రాంతములలో ఉప్పుడు బియ్యము, చింతపండున్ను ప్రియమయినా కావలసినది దొరుకును. రాతి ఉప్పు విశేషముగా అమ్ముతారు. ఈ యూరునుంచి శిమినీ అనే యూరిలో కేపర్ వాడుర్‌లో దొరవద్ద ముఖ్యుడుగా నుండే బంగాళీ బ్రాంహ్మణుడయిన బాలకిసన్ బాబు అనే వానికి ఒక యుపచార మయిన యింగిలీషు జాబు వ్రాసి నా తయినాతీగా నర్మదవరకు ఒక బిళ్ళ బంట్రోతున్ను, ఒక టప్పామనిషిన్ని మజిలీల ప్రకారము కూడావచ్చేటట్టు శ్రీరామ కటాక్షముచేత ఉత్తరువు తెప్పించుకొన్నాను. చావడి అనే ఊరు గొప్పది. ఆ రాత్రి అక్కడ వసించినాను.

సెప్టెంబరు నెల ౧ తేది ఉదయాన ౬ ఘంటలకు లేచి యేడు కోసుల దూరములో నుండే నారాయణగంజు అనే ఊరు ౧౨ ఘంటలకు చేరినాను. నడిమివూళ్లు. నెంబరు ౮. పిండిరి. ౧ - లక్కనోవాడ. ౧ - శింగపూరు ౧. హోరా ౧ - చౌకి ౧ - నారిల్లి ౧ - గంటియా ౧ నారాయణ గంజు ౧.

దారిలో అడివి లేకపోయినా బహుశా నల్ల రేగడ. శానా పశ్చిమవాహీను లయిన వాగులను దాటవలెను. కొంత దూరము రాతిగొట్టుగా నున్నది. యీ యూరు యడారిమధ్యే ఉన్నది. దుకాణపు దారులు వేదలు గనుక పనిగడుపుకొనే పాటిగా కొట్లాయిలు కట్టియున్నారు. ముసాఫరులకు కావలసిన సామానులు ఒకట్టిన్ని తక్కువ లేక దొరుకును. చెరువు కలదు. జలవసతి అయిన గ్రామమేను. ఇక్కడ యీ రాత్రి నిలిచినాను.

౨ తేది ఉదయాన ౫ ఘంటలకు లేచి ౮ కోసుల దూరములో నుండే గణేశగంజు అనే ఊరు చేరినాను. నడిమి వూళ్ళు. నెంబరు ౫ - బండోలు - ౧- సాదక్కునూని - ౧ - చప్పారా - ౧- గనికెతాలు - ౧ - కుయ్యా - ౧ - గణేశగంజు - ౧.

అప్పూరు కొండ కిందనున్నది. దారిలో చప్పారా అనే కసుబా బస్తీ యూరివద్ద భానుగంగా అనేనది దాటవలసినది. చప్పారా అనే యూరి వరకు భాట నల్లరేగడ, రాతిగొట్టు. ఆయూరికి ఇవతల కొండలు

యెక్కి దిగవలెను. ఇవతల గణేశగంజు చేరేవరకు ఇరుపక్కల పర్వతములు కలిగి వున్నవి. ఘాట రాతిగొట్టు. ఈ వూరిలో కొట్టాయీలు యథోచితమయిన వసతిగా కట్టియున్నారు. కావలసిన సామానులు దొరుకును. ఈ యూరికి సమీపముగా ఒక నిర్మల మయిన జలముగల వాగు పారుచున్నది. ఇటువంటి వాగులు కొన్ని దారిలో దాటవలసి యున్నవి. ఆ రాత్రి అక్కడ వసించినాను.

3 తేది 2 ఘంటలకు బయలు దేరి యిక్కడికి ౧౦ కోసుల దూరములోనుండే ధూమా అనే వూరు 3 ఘంటలకు ప్రవేశించినాను. నడిమి వూళ్ళు. నెంబరు - ౬ - లక్కనోడాక - ౧ - మకరాచౌకీ - ౧- నెదునది-౧- జూబా-౧- ఘరువాడా-౧ ఘూఘురీ-౧- ధూమా-౧.

దారిలో లక్కనోడాక అనే ఊరు ఉన్నది. అదివరకు కొండల మధ్యే మిట్టయెక్కుచు, పల్లానదిగుచు దారినడవవలెను. ఘాట నల్లరేగడ, రాతిగొట్టు. చిన్న వాగులు అనేకములు దాటవలెను. జూబానది అనే ఒక పెద్దవాగు దాటవలెను. గణేశగంజువద్ద నుండే వాగున్ను పెద్ద దేను. అదిదాటి కొండవంటి మిట్టయెక్కవలసినది. లక్కనోడాక మొదలుగా దారి కిరుపక్కల కొండలు లేవు. యడారిమధ్యే ఘాట, అడివిలేదు. ధూమాఅనేడూరు కసుబాస్థలము, బస్తీఅయినది. దుకాణం దారులు శక్తులయినా బస్సలమందు వాసముచేసేవారు గనుక బేఫరవాచేత ముసాఫరులనిమిత్తమై యెంతమాత్రమున్ను వసతి అయిన కొట్టాయిలు కట్టినవారు కారు. నేను వూరికి బయిట డేరాలువేసి దిగినాను. నాలుగు శిపాయిడేరాలు, ఒక కంబళిడేరా, ఒక యెంటి కంభం డేరా అంతు ఆరుడేరాలున్ను వేయడానికి ౮౦ బోయీలున్ను, ముగ్గురు కళాసులున్ను వుండిన్ని దిగిన వెనక ౧ ఘంట సేపు పడుచున్నది. ఈ యూరిలో బియ్యముతప్ప సకలపదార్థాలున్ను దొరికినవి. యీ దేశస్థులకు పిండ్లి జరూరేగాని బియ్యము నిమిత్తములేదు గనుక అంగడివాండ్లు కొందరు కొన్ని జాగాలలో బియ్యము సిద్ధముగా ఉంచడము లేదని చెప్పినారు. బహు ప్రయత్నముమీద నా పరిజనుల కందరికిన్ని చాలేటందుకు ఎక్కువగానే శ్రీరామ కటాక్షముచేత బియ్యము

తెప్పించినాను. ఈ యూరు జలవసతి యయినది కాదు. తమలపాకులు ఈ యూళ్లో దొరకడము కష్టము.

శ్రీరామ కటాక్షమని అప్పుడప్పుడు నేను వ్రాయడములో పర బ్రహ్మ యొకవస్తువే జగత్కారణమై యుండగా ఒకరొకరు ఒక్కొక్క అవతారమూర్తి నామమును నావలెనే ఆశ్రయించి ఆరాధన చేయుడ మేమని శంక తోచును. అందుకు సమాధాన మేమంటే - పరబ్రహ్మ సర్వాంతర్యామిగానున్నా చందనకాష్ఠములో ప్రవేశించిన అగ్ని పరిమళించినట్టు సృష్టిస్థితి సంహారాలకు కారణమయిన త్రిమూర్తు లలో ప్రతిఫలించే పరమాత్ముడేమి లోకశిక్షార్థమై అనేకావృత్తులు అవతరించిన సత్వగుణ ప్రధానుడయిన శ్రీమన్నారాయణమూర్తిలో ప్రతిఫలించే పరమాత్ముడేమి, అస్మదాదులలో ప్రతిఫలించే పరమాత్ము డేమి, అంతా ఒక్క వస్తువయినా ప్రతిభాతిని ఇచ్చే వస్తువిశేషాలచేత ఒక ప్రకృతికి మరియొక ప్రకృతి పూజ్యమయినది. ఆ న్యాయప్రకా రమే రామకృష్ణాద్యవతారాలు అస్మదాదులకంటె అతిపూజ్యము లయినవి గనుకనున్ను నిత్యశుద్ధ బుద్ధ పరిపూర్ణ సచ్చిదానంద స్వరూప మయిన పరబ్రహ్మము అవాఙ్మనస గోచరము గనుకనున్ను జగత్తులో తృణము మొదలుగా మేరువువరకు సమస్తములోనున్ను పృథక్కుగా నున్ను ప్రతిఫలించే పరబ్రహ్మము పూర్వన్యాయాలచేత బాధకమున్ను సాధకమున్ను వొక్కటే అయినందున రూపాంతర, నామాంతరాలను బట్టి ఆరాధన చేసుటచేత బాధకము లేక సాధకముగానే యుండ వచ్చును గనుకనున్ను ఈశ్వరలీలావతారకథలు శ్రవణము చేసుటలో ఏలీలచేత భక్తులను మిక్కుటముగా పరమాత్ముడు స్మరించి, పోషించి నాడని వారివారికి తోచబడుచున్నదో ఆయా యవతారనామమే మిక్కిలి ముఖ్యమని యెంచి దాన్ని వారు వారు వృద్ధాచార ప్రకారము ఆశ్రయించి భక్తిపూర్వకముగా ఆరాధింపు చున్నారు. తామసగుణప్రధానుడయి త్రిమూర్తులలో ఒక్కడు న్నయిన సాంబమూర్తికి తమోగుణముచేత సంహారము చేయుచు రావలసినపని యొకటే మాయాయుక్తమయిన పరబ్రహ్మ వల్ల నియమింప బడ్డందున సంహారము చేయడానికి తా నున్న రీతి

చాలు నని అవతారా లెత్తినవాడు కాడని తోచుచున్నది. అందు వల్ల అతనికి అవతారాలు, తత్సంబంధము లయిన నామాలున్ను లేవు. లీలా విశేషాలుచేత కలిగిన నామాలుమాత్రము అనేకములుగా అతనికి కలిగి యున్నవి. రక్షించ వలసినపని సాత్విక మూర్తి యయిన శ్రీమన్నారాయణమూర్తికి నియత మయియున్నవి గనుకనున్ను రక్షించడ మనగా వారి వారి యిష్టసిద్ధిని పూర్తి చేయుట గనుకనున్ను అందులో దుష్టులకు శిష్టులను హింస పెట్టడము ఇష్టముగా నుంచున్నది గనుకనున్ను దుష్టశిష్ట విభజన చేయడము బహు ప్రయాస గనుకనున్ను విష్ణువుమాత్రము అనేకావతారాలు లోకశిక్షార్థమయి యెత్తి, సాధువులను రక్షించి తదపేక్షయా దుష్టులను పరిష్కారముగా నిరూపించుచు యథోచితముగా శిక్షించి శిక్షానంతరము మళ్లీ రక్షించుచు వచ్చినాడు గనుక అతనికి అనేకావతారా లెత్త వలసి వచ్చినది. ప్రతియవతారానికిన్ని ఒక నామము కలిగిన దని నాకు తోచుచున్నది. రజోగుణముచేత సృష్టించడానికి నియమింపబడిన బ్రహ్మకున్ను సాంబమూర్తి వలెనే అవతారాలు అగత్యము లేనందున ప్రపంచములో ఒక యవతారము నయినా వహించ లేదు. సాంబమూర్తి సంహార నిమిత్తమయి జగత్తులో జరిపించినలీలలున్ను అతనికి జరపవలసిన నిమిత్తము లేక పోయినది. తద్వారా అతనికి నామాంతరముకూడా లేకపోయిన దనిన్ని తోచుచున్నది. ఈ రీతిగానే పరబ్రహ్మ యీ బ్రహ్మాండములో కొంత ప్రదేశమందు క్రీస్తు యెడల ప్రతిఫలించి ఆభాతి పాత్రద్వారా యెక్కువయి ఆ దేశస్థులకు అతను శిక్షకు డయినాడు. ఆ ప్రకారమే మహమ్మదు వగయిరాలు ఆయా దేశాలకు పూజ్యులయి యీశ్వరసము లయినారు. మనము రామ కృష్ణాద్యవతారాలను లోకశిక్షకములుగా భావించి ఆ నామోచ్చారణ చేసి ఆరాధించినట్టు ఇతర దేశస్థులు అక్కడ అవతరించిన వారిని ఆరాధింపుచున్నారు. ఏ పేరుతో ఏ మూర్తినిగాని, ఏవస్తువునుగాని యే రీతిగా ఆరాధించినా ప్రతిగృహీత అంతర్యామి యొక్కడే గనుక ఏమిన్ని బాధకము లేదు. ఈయుక్తిచేతనే "గురుబ్రహ్మా గురుర్విష్ణుః" అనే ప్రశస్త వాచకాలు ఏ ప్రకృతి పట్టితే ఆ ప్రకృతే సమస్త

వాగులు, నదులున్ను వివరించి వ్రాయుచు వచ్చినానుగదా! ఊరికే దాటవచ్చె నని నేను వ్రాయుచు వచ్చిన వాగులంతా కాలినడకగా దాటతగ్గవని తెలిసి యుండవలసినది. నిన్న దాటిన జూబా నదివద్ద ఇరుపక్కల రెండు కొయ్యలు నాటి రెండు కొయ్యల తలలకు ఒక కప్పితాడు కట్టినారు. తపాలాకట్ట రాగానే ప్రవాహకాలాలలో పక్కకు ఒక హరకారా వంతున ఇరుపక్కల కాచియుండి తపాలా కట్టను కప్పికి కట్టివేస్తే యివతలి పక్కవాడు యీడ్చుకొనేటట్టు చేసినారు. రాయచౌడువద్ద ఒక కొండ యెక్కిదిగవలసినది. యీ రాయచౌడు జలవసతి కలది. పెద్ద చెరువు కొండను కట్టగా చేసుకొని యున్నది, యీ కట్టమీదనే అప్పాసాహెబు అనే నాగపూరి రాజును కుంఫిణీవారు ఖయిదు చేసి తీసుకొని వచ్చుచుండగా తప్పించుకొని పరుగెత్తి పోయినాడు. ఇక్కడ దిగడానకు అంగళ్ళవాండ్లు, యథోచిత వసతి గలవిగా చావళ్ళు కట్టి పెట్టినారు. అందులోనే దిగినాను. సకల పదార్థాలు ముసాఫరులకు దొరుకును.

ఇటువంటి కాలుదిగబడే అడుసు, రాతిగొట్టు, ముండ్లు, వొరుగుడు, కాలువలు, వాగులు, కొండలెక్కి దిగడము, వీటివల్ల కలిగే ప్రయాసను ఓర్చి అర్థముకన్నా దేహము మీది యభిమాన మెంత జఘన్యానికిన్ని యెక్కువగా నుండవలసినది సహజమై యుండగా కొంచానికి ఒకరితో నొకరు కలహమాడే బోయజాతి ఒక జతగా కలిసి యేకవాక్యతనుపొంది దోవ సాగించడము ఎందువల్ల నని ఊహించితిని. అర్థాపేక్ష చేత ఓర్చుచున్నా రందామంటే లోభులవద్ద అర్థము గుంజవలిస్తే వారి దేహమును బాధించి అర్థాకర్షణ చేస్తారు. అప్పటికి అర్థాపేక్ష చేత సామాన్యముగా మనుష్యులు దేహకష్టమును మిక్కుటముగా ఓర్చజాలరు గనుక ఒకరు కాకుంటే ఒకడు యిటువంటి మిక్కుటమైన కష్టము వచ్చినప్పుడు నాకు రూకవద్దబ్బా అని వెనక తీసిపోవును. రాజాజ్ఞచేత సహిస్తారందామంటే మిక్కుటమయిన కష్టపుమోత కలిగినప్పుడు ఒకడు కాకుంటే ఒకడు ఇప్పుడు దేహానికి అశక్తి వచ్చినది, యీ కష్టపుమోత నేను మోయలేనని తిరగబడితే రాజయినా యేమి చేయగలడు? గనుక అదిన్ని కారణము కాదని తోచినది. అప్పటికి

నేను ఊహించిన కారణ మేమంటే సమానులలో ఉత్తమ కీర్తిగలవాడు కావలెననే శ్రుతివాక్యార్థ ప్రకారము ప్రతి పురుషునికిన్ని సమానులలో ఉత్తము డనిపించుకోవలెననే ఆసక్తి సకల విధాలా వుండును గనుక యీ బోయీలు ఒక జతగా కలిసి నప్పుడు మంచి మోతగా డయితే వారిలో ఉత్తమకీర్తి జనింపుచున్నది, గనుక ఒకడు యీ ప్రయాసలకు ఓర్వనేరక వెనకపడ్డా, మోతలో జబ్బువడ్డా జతలో నుండే యితరులు అప్పుడే చాలాగా వెనకపడ్డ వానిని నిందింపుచున్నారు. గనుక సమానులవద్ద నిందింపబడే దాని కన్నా దేహము పోవడము మేలని తోచి యిటువంటి ప్రయాసను ఓర్చి సమానులచేత స్తుతింపబడక పోయినా, నింద యయినా లేక నుండవలెననే తాత్పర్యముతో ఈ కష్టములను ఓర్చి యీ బోయీలు మోత సాగింపుచున్నా రని నిశ్చయించినాను. యీ కొద్ది పరువు కల మనుష్యులకే సమానులలో యోగ్యు డనిపించుకోవలెనసే అక్కర యింత ఉండగా తదపేక్షయా ఉత్తములకు పరంపరంగా ఎంత ఉండవలసినది? యిది యోచించి సమానులను నిష్కారణముగా అవమానపరచి సంతలో ప్రమాదము వచ్చుననిన్ని సమానులను ఆదరించి గౌరవము చేస్తేగాని తాను ఉత్తమశ్లోకుడు కానేరడనిన్ని, తెలిసి ప్రపంచములో ప్రవర్తింపుచు రావలసినది. యీ యూరిలో యీ రాత్రి వసించినాను.

౫ తేది ఉదయాన ౫౺ ఘంటకు లేచి యిక్కడికి ౬ కోసుల దూరములో నుండే పిప్పర అనే ఊరు ౧౨ ఘంటలకు చేరినాను. (మధ్యనున్న ఊళ్ళు)

౧౦ ౮ జంజూరికే భావనా - ౧ - చెమ్రా - ౧ - మోతినాలా-౧ ద్వారి రాతిగొట్టు. నల్ల రేగడ. సాతుగడ అనే ౭ కొండలు ఎక్కి దిగవలసినది. మోతినాలా అనేవాగు మధ్యే ఉన్నది. ఆ వాగుకు ఇవతల యేడుకొండలు యెక్కి దిగేవరకు కొంత అడివి కలిగి యున్నది. కుర్తాయి అనే యూరు మొదలుగా లోగడ యింగిలీషువారికి నాగపూరు రాజు యిలాకా దారులతో అనేకావృత్తులు యుద్ధ ప్రసక్తులు కలిగినవి. గనుక అప్పట్లో విస్తారముగా అడివికొట్టి భాట వెడల్పుచేసి చక్కపెట్టినారు. అది యిప్పట్లో లోకోపకారముగా నున్నది. యీ

పిప్పర అనే ఊరు మజిలీలాయఖు అయినదే. దుకాణందారుల కొట్టా యీాలలోనే దిగినాను. బియ్యము అతి ప్రియత్నముమీాద దొరికినది. చింతపండు ఎంత ప్రియత్నము చేసినా సాధ్యమయినది కాదు. రామ ఔెంకి మొదలు రాతిపుప్పు మాత్రము దొరుకుచున్నది గనుక మెత్తగా విసిరి శాకములలో కలపవలసినది. ఈదేశములో చింతపండుకు బదులు ఆముచూరు అనే మామిడివరుగు వాడుకొనుచున్నారు. నింమపండ్లు మాత్రము పట్టినతావున దొరుకుచున్నవి. యీాయూరిలో యీా రాత్రి వసించినాను.

౭ తేది ఉదయాన ౫ ఘంటలకు లేచి యిక్కడికి నాల్గు కోసుల దూరములో నుండే తిలవారా అనే ఊరును దారిలో నర్మదా మహానది దాటి ౯ ఘంటలకు ప్రివేశించినాను. ఇక్కడ ౨౦౦ మంది యెక్కే పడవ ఒకటిన్ని ౫౦ మంది యెక్కే చిన్న పడవ ఒకటిన్ని ఉన్నది. ముందు యిటువంటివి ఈ నర్మదామహానధి రేవులో అనేకము లుగా నుండినవి. అయితే యిటు తర్వాతను ౨ సంవత్సరముల కిందట అకస్మాత్తుగా ప్రివాహము వచ్చి రేవున నున్న పడవలన్ని కొట్టుకొని పోయినందున ఇప్పుడు కుంఫిణివారు రెండు చేయించి వేసి ఘాటు సుంకము సంవత్సరము ౧ కి ౩౦ రూపాయీాలకు ఒక ఆసామీాకి గుత్త కిచ్చినారు. వాడు మనిషికి ఒక పయిసా, గుర్రానికి ౧ అణా ఈ వంతున హాశ్శీలు తీస్తాడు.

ఈ నది పశ్చిమ వాహిని. సుమతి అనే పశ్చిమ సముద్రి తీరపు గ్రామమువద్ద సాగరసంగమవుచున్నది. యిక్కడికి ఆ సంగమ ప్రిదేశము రెండు నెలల ప్రియాణ మున్నది. అమరకంటక మనే ప్రిదేశములో వెదురుపొద మధ్యే యీా నది పుట్టినది. ఆ మహా స్థలము ఇక్కడికి ౨౦ దినముల ప్రియాణముంచున్నది. యీా నది మహిమ యేమంటే ధృవమహారాజు యాగము చేసినప్పుడు ఋత్విక్కు లుగా వచ్చిన మహాపురుషులు యాచనమీాద సాంబమూర్తిని తపస్సుచేత సంతోషపెట్టి భూమిలో ఎక్కడా నదులు లేక నుం డగా పశ్చిమ వాహినిగా ఒక నది కావలెనని ప్రార్థించి సాంబమూర్తియొక్క అర్థదేహాన్నే ప్రివహించేటట్టు చేసుకొన్నారు.

తద్ద్వారా యిది పురుషనది అనిపించుకొనుచున్నది. యీ మహానది మహిమ వాయు పురాణములో ౧౩ వేల గ్రంథములచేత విస్తరించి చెప్పియున్నది. యిందులో పుట్టే శిలలంతా లింగాలుగా ఆరాధింపు చున్నారు. ఈ లింగాలు హిందూస్తాని మాటతో "నర్మదు కాకంకరు సబు శంకరు" అంటారు. బెడాఘాటులో కృష్ణవర్ణపు లింగాలు పుట్టు చున్నవి. ఆ స్థలము ఇక్కడికి ౪ కోసుల దూరము. ఓంకారంఘాటులో శ్వేతలింగాలు పుట్టుచున్నవి. ఆస్థలము ఇక్కడికి ౧౮ దినముల ప్రయాణము. ఈ తిలవారాస్థలములో ఒక దృష్టాంతము నాకండ్ల చూచినాను. అది యేమంటే వేసిన అస్థులు సగము ముక్కాలువాసి శిలామయము లవుచున్నవి. గనుక క్రమముగా అంతా శిలామయము లవుచున్న వనడానకు సందేహము లేదు. ఈ మహానది పశ్చిమవాహిని కావడముచేత అత్యాశ్చర్యముగా పది యిరువై తాటిచెట్ల పొడుగు గల కొండల నడమను భేదించుకొని ప్రవహింపుచున్నది. యీ వేడుక బెడాఘాటుకు పోతే చూడవచ్చును. ఈ మహానది ఇక్కడ నిండా వెడల్పు లేదు. 30 సంవత్సరముల కిందట రఘోజీబాబాతల్లి బహు స్తోమముతో కూడా యిక్కడికి యాత్రకు వచ్చి ముందర నర్మదానదిని పూజచేసి దాటవలసిన దని ఘాటువారు చెప్పగా మా నాగపూరి వద్ద ఖనానా అనే నదిపాటి వెడల్పు లేదే పూజ యేమని అలక్ష్యపెట్టినందుకు, నాటి సాయంకాలమే యివతలి గట్టుకు వచ్చి నదివోరగా దిగివుండగా గడియలో అమితముగా ప్రవాహము వచ్చి ఆమె సర్వస్వాన్ని హరించి మరునటి గడియలో ప్రవాహము తీసిపోయి యథాస్థితికి వచ్చినది.

ఈ తిలవారా అనే వూరిలో ౧౨ ఇండ్లవారు కృష్ణాతీర మందలి యాంధ్ర బ్రాంహ్మణులు, ఇండ్లు కట్టుకొని బహుకాలముగా ఈ దేశపు బ్రాంహ్మణులతో సంబంధ బంధుత్వములు చేయకుండా అధ్యయనము చేయుచు పాఠము చెప్పుకొనుచున్నారు. రామటెంకి వదిలిన వెనక ఈ యూరివరకు బ్రాంహ్మణ దర్శనమే అయినది కాదు. ఈ యూరిలో వసతి అయిన కొట్టాయి కట్టియున్నారు. నేను బ్రాంహ్మణ యింట్లోనే దిగినాను. సకల పదార్థాలు దొరుకును. ఇక్కడ క్షౌరము మొదలైన

పితృక్రియలు చేసినాను. నేటి దారి నల్లరేగడ అయినా ప్రయాస కాదు, అడివి, రాతిగొట్టు, లేదు.

ఈ మహానది దాటిన వెనక రంగిడి జాతి బ్రాహ్మణులని ఒక సమూహమును చూచినాను. వీరికి గాయత్రీ జపము కలిగియున్నా వ్యవస్థలేని నడితిని నడిచేవారు. ఈ దేశపు కరాడీబ్రాహ్మణులున్ను, చిత్పావనీబ్రాహ్మణులున్ను వీరిని గర్హింపు చున్నారు. పిమ్మట వ్రాసిన రెండు తెగలవారితో మన దేశపు బ్రాహ్మణులు సాహచర్యము కలిగి సహపఙ్త్కిగా భోజన మజ్జనాదులు గడుపుచున్నారు. చిత్పావనీవారు పునా శ్రీమంతుని జాతి. కరాడీవారు శక్తిపూజాపరులు. ఈ యిరుతెగలవారినిన్ని పరశురాముడు బ్రాహ్మణుల యెడల జిహాసతోచి మశీదులలో వుండే శవాలను లేపి చిత్పావనీలను పుట్టించి కాష్ఠములగుండా కరాడీలను సృష్టించి తాను పితృకర్మలను ఆ రెండు తెగలవారిగుండా గడుపుకొన్నాడు. తెగకు ౭ గోత్రాలవంతున వీరు ౧౮ గోత్రాలవారు. వీరిని కొంకణదేశస్థు లని అనుచున్నారు.

నర్మదకు ఇవతలిగట్టు మొదలుగా విక్రమ శకము ప్లవనామ సంవత్సరము బహుళ పాడ్యమి మొదలుగా పున్నమ వరకు మాసమున్నని వ్యవహరింపుచున్నారు.

వింధ్య పర్వతమును కురాయి అనే వూరివద్ద ఆరోహణము చేసినట్టుగా లోగడ నేను వ్రాసినాను. అదే వింధ్యపర్వతమునకు ఆరంభమనిన్ని యీ భూమి యావత్తున్ను వింధ్యపర్వతము మీదిదే ననిన్ని చెప్పుతారు. రాయచౌడువద్దనున్న పర్వతము మహాదేవ పర్వతమనిన్ని అచ్చట వరప్రసాదము చేయగల ప్రసిద్ధమయిన యొక శివస్థలము ఉన్నదనిన్ని చెప్పుతారు. యీ తిలవారాలో రెండుమూడు దేవాలయాలు చిన్నవయినా సుందరముగా కట్టియున్నవి. బ్రాహ్మణపూజ లేదు. గోసాయీల ఆధీనములో నున్నవి.

కురాయి అనే వూరు మొదలు నర్మదా నది పర్యంతము లోగడి కాలాలలో దారినడిచి సురక్షితముగా చేరడము బహుదుర్లభము. అందుకు దృష్టాంతముగా యిక్కడి దేశస్థులు సాహి

త్యాలుగా ఈ మధ్యవుండే ఊళ్ళు పేళ్ళు కని కొన్ని చేసినారు. వాటి తాత్పర్యము ఈ యూళ్ళు గడిచి నర్మద చేరితే తల్లికడుపులోనుంచి మళ్ళీ పుట్టినట్టు అనుకోవలె నని యున్నది. ఆ భయాలు యింగిలీషు దొరతనము వచ్చినవెనక లేదు. ఈవిషయములలో వీరి దొరతనము మేలని అనిపించుకొన్నా, యిక్కడి బ్రాంహ్మణులు నాగపూరు రాజు సాగరారాజు మొదలయినవారు బాగా వుండగా మేము రాజాన్న భోజనము చేస్తూ వస్తిమి; వారున్ను వారికింది అధికారస్థులున్ను పుష్కలమయిన జీవనాలు మాకు కలగచేసి యిచ్చుచువచ్చిరి; ఇప్పుడు వస్తుగానున్నా మంటారు. దొంగతనముపోతే దొంగను పట్టి శిక్షించే వరకు సొమ్ముపోగొట్టుకొన్నవారున్ను, సాక్షులున్ను ఇల్లు వాకిళ్లువదిలి భత్యముకట్టుకొని తిరిగి చస్తాము. తుదకును శిక్షబలము లేదు. కొంత కాలము గిడ్డంగిలో దొంగనుపెట్టి వదలుతారు. వారు మళ్ళివచ్చి కన్నము వేసి దొంగిలింపుచున్నే ఉంటారు; దొంగిలించినదానికి సాక్షి తెమ్మంంటే యెక్కడనుంచి తెచ్చేది? అని యీ విషయాలలో యింగిలీషుదొరతనము బహు హింసగా నున్నదని వ్యసనపడుకొంటారు. యీ దృష్టాంతముచూడగా ఒక మంచి వూహించి పనిచేయబోతే ఒక చెడు ఆ మంచిలోనే ఉత్పత్తి కావడము నిశ్చయమేనని తోచు చున్నది.

హాయిదరాబాదు మొదలుగా తియ్యని దొండకాయలు విస్తారముగా దొరుకుచున్నవి. యీ తిలవారాఘాటులోపల వరకాయ లని ఒకదినుసు కాయలు చూచినాను. పచ్చిపోకకాయలవలెనే ఆకారముకలిగి దొండకాయలవలె గీతలు తీరియున్నవి. వంటచేసి భోజనముచేస్తే పువ్వులు రాలని లేతవంగపిందెల రుచితో సరిపోలియున్నవి. ఈ కాయలు బహు ఆరోగ్యకరములనిన్ని రుచిగానున్నవనిన్ని రాజాధిరాజులు నల్భై, యాభై ఆమడదాకా విందులకు గుర్రపుసవారీలను తపాలుపెట్టి తెప్పించుకొంటారు గాని తమ స్థలములో వృద్ధిఅయ్యే యోచన చేయడము లేదు. యీ కాయలకు బీజము గడ్డలు. వాటిలో మొలక మొలిచి తీగెలు అల్లి కాయలు కాచుచున్నవి. ఆవాల నూనె నాలు గయిదు వీజలీలుగా దీపపుచమురుకు దొరుకుచు వచ్చు

చున్నది. చింతకాయ తొక్కుకు నేను ఆవనూనె పోయించినంతలో అతి రుచికరముగా నున్నది. ఈయూరిలో ౭ తేది మధ్యాహ్న పర్యంతము వుంటిని.



## ఏడవ ప్రకరణము

౭ తేది మధ్యాహ్నముమీద ౩౪ ఘంటకు బయిలుదేరి యిక్కడికి ౩ కోసుల దూరములోనుండే జబ్బల్‌పూరు అనే షహరు ప్రవేశించినాను. దారి బాగా ఘట్టనచేసి కాలువలకు వారధులు కట్టి యున్నవి. దారికి ఇరుపక్కలా దూరాన చిన్న కొండ లున్నవి. చిన్న గుళ్ళు, బావులు, గుంటలున్ను కొన్ని దారికి ఇరుపక్కలా కట్టియున్నవి. యీ గుళ్ళు స్తూపీలు చెరిసగానికి పగలకొట్టిన శిగ గల టెంకాయ చందముగా కట్టి యున్నవి.

యీ జబ్బల్‌పూరు అనే షహరు లోగడిదినములలో యథోచిత మయిన కసుబాస్థళము. ఘర్డామండల మనే రాజధాని కింద నుండినది. ఆ రాజధాని నిజాంషాహు అనే కొండరాజుది. షుమారు ౫౦ ఏండ్ల కిందట పునాశ్రీమంతుడు భోసల వంశస్థులు సాధించిన రాజ్యములు గాక ఇంకా కొండరాజుల కిందనుండే ఘర్డామండలము మొదలయిన రాజ్యములను తియ్యవలెనని సర్వ ప్రయత్నమున్ను అప్పుడప్పుడు చేస్తూ వచ్చినందున బ్రాంహ్మణ జాతిమీద ఒక ద్వేషము ఈ కొండరాజుకు జనించి బ్రాంహ్మణులని తన రాజ్యములో కనుపడ్డ వారి నంతా సంహరింపుచు వచ్చినాడు ఈ నిజాంషాహు రాజును సాధించడము పునాశ్రీమంతునికి ప్రయాసగా నుంచు వచ్చినది.

ఆ కొండరాజుకు రాజధానియయిన ఘర్డామండల షహరును చుట్టుకొని నర్మదానది ప్రవహింపుచు వున్నది. యీనది మహాత్మ్యమేమంటే గతకాలములో భృగు మహాముని యీ ప్రాంతమున తపస్సు చేయుచు నుండగా నది అతనికి కొంత దూరములో ప్రవహించినది. భృగు మహాముని నా సమీపముగా వచ్చి ప్రవహించక పరగడగా పోవలసిన దేమని మనసులో నోచ్చుకొన్నంతలో తత్పూర్వపు ప్రవాహమును

వదిలి భృగుమహాముని సమీపముగా వచ్చి ప్రవహించినది. పూర్వేణము ప్రవహించి మళ్లినచోటువరకు ఇప్పటికిన్ని బెడాఘాటువద్ద నవనీతము వంటి తెలుపు నునుపు వర్ణములతో భూమియావత్తున్ను శిలామయ మయి యున్నది. ఆ శిలను ఇక్కడి దేవస్థళాలలో ప్రతిమలుగాచేసి యుంచుచున్నారు. నర్మదాలింగాలు తెచ్చి అమ్మే గోసాయీలు ఈ శిలలతో కోడిగుడ్డు చందముగా లింగాలుచేయించి స్వయంభువు లని దేశాంతరాలలో అమ్ముచున్నారు. మెట్టుకు వీరు ఎంత కృత్రి మముచేసినా నర్మదశిలలు శివస్వరూపాలు అనేమాట సత్యము గనుక ఆ లింగాలను ఆరాధనచేసేవారికి అభ్యుదయమే కలుగును.

ఈ కొండరాజు అపారమయిన ధనముగలవాడు గనుక అజేయు డుగా నుండినాడు. ఆ రాజు వేసుకొన్న నవరత్నఖచితమయిన పాపాసు (పాపోసు) ఒకటి యిపుడు సాగరా రాజు సంస్థానములో నున్నది. దాని వెల నిశ్చయించను ఇప్పటికిన్ని అశక్యముగా నున్నది. యిట్లావుండగా గోవిందపంతులు, గంగాధరబావా, బాలాజీబావా అనే కరాడి బ్రాం హ్మణులుముగ్గురున్ను పరస్పర రక్తసంబంధము గలవారు; వారు పునా శ్రీమంతుని ఆజ్ఞను ధరించిన సరదారులు. వారు నర్మదానదిని అనేక సహస్ర సువర్ణపుష్పములతో ఆరాధించి ఆ నదికటాక్షము సంపాదించి దాన్ని కాలినడకతోనే దాటి ఘుర్డామండలంజిల్లా తీసుకొని కొండ రాజును పట్టుకొన్నారు. ఆ కొండరాజు తాను పట్టుబడకమునుపే తన ద్రవ్యమంతా ఆ నర్మదకు ప్రీతిగా అందులోవేసి పగవారికి లభించకుండా చేసినాడు. ఆముగ్గురు సరదారులున్ను సాగరాయనే యూరును తమకు రాజధానిగా చేసుకొని అబ్బాసాహెబు అనే తమ వంశస్థునికి ఈ రాజ్యమిచ్చి తమ్ము నాశ్రయించియుండిన ఆంధ్రదేశపు బ్రాంహ్మణులకు తిలవాడాఘాటు మొదలయిన స్థలములలో పుష్కలమయిన జీవనాలు కలగచేసి అక్కడి కాపు రస్తులుగా చేసినారు. ఆ అబ్బాసాహెబు రవంత మెత్తని వాడయినందున కొన్ని సమయములలో తమ క్షాత్రధర్మము చేత పునాశ్రీమంతుని సంతోషపెట్టి యీ నర్మద సమీపవర్తి అయిన యీ జబ్బల్పూరుతో చేరిన భూమిని నాగపూరు

రఘోజీబాబా తీసుకొన్నాడు. పిమ్మట ౧౨ సంవత్సరముల కిందట రఘోజీ వగయిరా రాజులతో యింగిలీషు వారికి కలహము పొసగి నంతలో వారు ఈ జబ్బల్పూరునున్ను యిక్కడికి సమీపములో నుండే సాగరా మొదలయిన భూములనున్ను ఆక్రమించుకొని రాజ్యము చేయుచున్నారు. మళ్ళి నాగపూరు రాజ్యమును రఘోజీ దౌహిత్రునికి యిచ్చినా ఈ జబ్బల్పూరు పరగణాలు పూర్వము సాగరారాజుది గనుక సాగరారాజుకు పుత్రసంతతి లేక అతని భార్య రాజ్యము చేయుచు నుండి యుద్ధ ప్రసక్తి పెట్టుకొకనే రాజ్యమును యింగిలీషువారి అధీనము చేసి సాలుకు వీరు యిచ్చిన లక్షరూపాయిలు తీసుకొని భోజనము చేయుచున్నది గనుక ఆపె తరఫున ఈ జబ్బల్పూరు రాజ్యమును తాము పుచ్చుకొన్నందున ఈ రాజ్యము నాగపూరితో చేరినది కాదని కుంఫిణీవారు అనుభవింపుచున్నారు.

రఘోజీ రాజు యీ రాజ్యమును కట్టుకున్నది మొదలు ఈ జబ్బల్పూరు బస్తి అవుచూ వచ్చినది. యిప్పుడు యింగిలీషువారి దొరతనమయిన వెనక బజారు వీధులు రాజవీధులున్ను విశాలముగా లక్షణముగా కట్టించి బహు సుందరముగా నిర్మలముగానున్ను పెట్టుకొని యున్నారు. సారవత్తయిన భూములు గనుక అనేక తోటలు వూరి చుట్టున్ను వేసియున్నారు. ఇప్పుడు సీవిల్ అధికారముచేసే దొరలు ఊరికి ౨ గడియల దూరములో సుందరమయిన తోటలు వేసి బంగాళాలున్ను కట్టుకొని శాలలు (నీడకోసం రెండు పక్కలా పాతిన చెట్ల వరుసలు) వేసి వేడుకగా కాపురమున్నారు. ఇక్కడ నుండే సుమారు ఒక పటాలం దండున్ను అందుతో చేరిన డాక్టర్ మొదలయిన దొరలున్ను మరియొక పక్క తోటలో బ్యారుకసులు కట్టుకొని కాపురమున్నారు. సకల పదార్థాలు దొరుకును. కండ గలిగి గొప్పవిగా నుండే దోసకాయలు విశేషముగా అమ్ముతారు. పలవర కాయలు ఇక్కడ శానా దొరుకును. ఇక్కడనుంచే దేశాంతరమందలి ప్రభువులకు సాగిపోవుచున్నవి. బారెడేసి నిడుపుగల బీరకాయిలు, అమితముగా అమ్ముచున్నారు. బట్టలు పాత్రసామాను ఆయుధ విశేషాలున్ను నయముగా అమితముగా అమ్ముచున్నారు.

ఇక్కడ గౌనర్ జనరల్ యేజెంటువుండే స్థలము గనుక హాజూరనిపించుకొని చుట్టుపక్కలావుండే మైహరు రాజు రీమారాజు సాగరారాజు మొదలయినవారి వకీళ్ళు కాచుకొని యున్నారు. అక్కడక్కడి తాలూకాలు విచారణచేసే ప్రిన్సిపాల్ అసిస్టాంటుసులు, జడ్జీఅధికారముకూడా జరిగింపుచున్నారు గనుకనున్ను వారి తీర్పులమీద యేజెంటుకు అప్పీలు చేయవచ్చును గనుకనున్ను చుట్టుపక్కలఉండే అనేకరహితులతోను ఈ బస్తీ నిండియున్నది. తాకరు ప్రసాదుఅనే సాహుకారు ఒకడు కానుపూరు కాపురస్థుడు ఇక్కడ వసించి సాహుకారుపనులు జరిగింపుచున్నాడు. యేజంటు అయిన స్మిత్తు దొరగారు అత్యున్నతమయిన మొగలాయి సంతనతో దాపుకలిగిఉన్నా నా పట్ల శ్రీరాముల కటాక్షముచేత ఫరవానా ఒకటి దారిలో నాకు సకలక్షేమములున్ను కలిగేకొరకు హాయిదరాబాదు కర్నల్ కేమిల్ నాగపూరు మేస్తర్ గ్రీన్ దొరలవలెనే వ్రాశియిచ్చి కాశివరకుకూడా వచ్చేటట్టుగా చప్పరాశి అనే బిళ్ళబంట్రౌతును ఒకని తయినాతి చేసినారు.* యీ జబ్బల్పూరు చేరేవరకు నాతోకూడా వచ్చినవారందరున్ను సురక్షితముగా ఉన్నా యిక్కడ చేరిన రెండు మూడుదినములకు వారిలో నలుగు రయిదుగురకి అడివి గడిచివచ్చినా తత్సంబంధ మయిన చలిజ్వారాలు తగిలినవి. యీ యూరిలో చిన్నపడుచులను కొందరిని తెచ్చి అమ్మేటట్టువిన్నాను. యీ బస్తీలో ౧౨ తేదీదాకా నిలిచినాను.

౧౩ తేదీ ఉదయమైన ౫ు ఘంటకు లేచి ఇక్కడికి ౬ కోసుల దూరములో వుండే గోసలపూరు అనేవూరు ౧౦ గంటలకు చేరినాను. మధ్యనున్న ఊళ్లు: నెం. ౬ కొట్రా ౧ సహాగి ౧ పరియెదునది ౧ పన్నాగరు ౧ రేవురా ౧ కూసుమీరు ౧ బాడాగల్ ౧ గోసలపూరు ౧.

---

* జబ్బల్పూరులో తాలూకా ప్రిన్సిపాల్ అసిస్టాంటు అయిన కర్నల్ స్లీమన్ గారు శిఫారసుఉత్తరా లిచ్చి కాశీవరకు చప్రాసీ నిచ్చి పంపివారని వ్రాత ప్రతి ౧౩౩ పుట లో నున్నది. ఈ స్లీమన్ గారు తరువాత హిందూదేశాన్ని గురించి అనేక గ్రంథాలు వ్రాశారు.

దారి యిక్కడ పరంగి కొండకు పొయ్యేమార్గము‡వలె నడక్కు అనే ఘట్టనవేసి యిరు పక్కలా మామిడి చెట్లు అశ్వత్థాలు శాల♦ వేసియున్నది. ఆ చెట్లు చూడగా వేసి యాభై అయినట్టు తోచు చున్నది. దారి వెల్లడిగా యిరు పక్కల తోపులతో వరిపయిరులతో శృంగారముగా ఉన్నది. చిన్న వాగులకు వారధులు కట్టినారు. పెద్ద వాగులకు కల్లురాళ్ళతో ఇనపమేకులు బిగించి దారిని కోయకుండా యెక్కి దిగడానికి వయిపుగా మెట్లు కట్టియున్నవి. యీ చెట్ల శాల పెద్దపెరిగితే సూర్యరశ్మిప్రయినపడదు. గుర్రపుబండ్లు వేడుకగా నడిచి పోవచ్చును. ఈ దారులనున్ను శాల వృక్షాలనున్ను కాపాడడానికి రీమా అనే యూరిలో ఒక దొరను తగుపాటి సిబ్బందితో మార్గ విచారణకర్త హోదా కలగచేసి ఉంచియున్నారు. ఈ దారుల విష యమై బంగాళా గౌనర్ మెంటువారు చేసే వ్యయానికి ఈశ్వరుడు సంతోషించునని తోచుచున్నది. దారిలో పెన్నగరు అనే వూరికి ముందు ఒక పెద్దనది దాటవలసినది. యిక్కడ ౨ దోనెలు ఉన్నవిగాని నాకు కాలునడకగానే యుండెను. పెన్నగరుకు ఇవతల ఒక పెద్ద వాగు దాటవలసినది.

ఈ గోసలపూరు పెద్దది. దుకాణాలు కొట్టాయిలున్ను కట్టి యున్నారు. అవి వసతివికావు గనుక వూరికి సమీపాన నుండే ఒక కొలను వొడ్డున డేరాలు వేసుకొని దిగినాను. అది రమణీయ మయిన జలము గలది; ఫలవృక్షాలతోనున్ను ఆవరింపబడియున్నది. ఒక గోసాయి ఇక్కడ శివప్రతిష్ఠచేసి కొన్ని మంటపాలు కట్టినాడు. అందులో కొన్ని నూతన సృష్టములయినా యీశ్వరాజ్ఞచేత శిథిలము లయియున్నవి. యీ యూరిలో సకల పదార్థాలున్ను పుష్కల ముగా దొరుకును. చింతపండు మిరపకాయ యీ రెండు వస్తువు లున్ను భవాలు ప్రయత్నముమీద కాశీ పర్యంతము దారిలో నా

‡ పరంగికొండ అనగా చెన్నపట్నంలో సెంట్ తామస్ మౌంటు. దీనికి పోయే రాజబాటకే మౌంటురోడ్డు అని పేరు. ఆ కాలానికే ఇది చాలా అందముగా ఉండేది.

♦ శాలవేసి యున్నదనగా నీడకోసం రోడ్డుకు రెండు పక్కలా చెట్లువరుసగా వేయబడెనని అర్థం.

బ్రాంహ్మణ పరిజనానికి చాలేటట్టు జబ్బల్‌పూరు బస్తీలో సంపాదించి బియ్యముతోకూడా రెండు బాడిగె గుర్రాలమీద గుర్రము ౧ కి ౧౦ నాగపూరి రూపాయలవంతున కాశికి బాడిగె మాట్లాడి యేర్పా రచి తీసుకొని వచ్చినాను. ఈ యూరిలో ఈ రాత్రి నిలిచినాను.

౧౮ తేది ఉదయ మయిన ౬ ఘంటలకు లేచి యిక్కడికి ౮ కోసుల దూరములోనుండే సలమాబాదు అనే ఊరు రెండు ఘంట లకు చేరినాను. నడిమిఊళ్ళు: నెం॥ ౧౦ - బజారి-౧ - మహీంద్రా - హోదంన్న యనది - సోమిరియా ౧ - పరవా - శిహోరా౧ - మానం రేపరా - మోహాలా - ౧ - ధనుగా౬ - ౧ - చప్రా - ౧ - సలమా బాదు ౧. బోయీలు యీదినము మెండగొట్టు పడినందున చప్రా అనే వూరివద్ద వారు వంటచేసుకొని భోజనముచేసి వచ్చే దాకా నాలుగు గడియలు నిలవడమయినది గనుక మజిలీ చేరడానికి ఇంత ప్రొద్దు పోయినది. దారి నిన్నటివలె సౌఖ్యప్రదముగా శాలవేసి యున్నది. దారిలో హోరాఅనే యూరు బహు గొప్ప కసుబా, బస్తీ అయినది. సుందర మయిన మామిడితోపులు గుంటలు చెర్వులు చిన్న దేవాలయాలు జప మంటపాలున్ను కలిగి యున్నది. యీ యూరి వరకు అడివిలేదు, వెల్లడిగా నున్నది. పైరుభూమి. దానికి ఇవతలి మజిలీ యయిన సలమాబాదు వరకు దారికి యిరుపక్కలా తేలికె యయిన అడివి కలిగి యున్నది. జబ్బల్‌పూరు మొదలుగా ఈ మజిలీ యూరి వరకు ఘాటకిరుపక్కలా దూరములో చిన్న కొండలు కనుపడుచు వచ్చు చున్నవి. యీ సలమాబాదులో దుకాణాలలోనే దిగినాను. ఇది తహశీలుదారుడు ఉండే కసుబాస్థలము. ప్రతి యూరికిన్ని ముసాఫరుల సరఫరాయి నిమిత్తమై ఒక కొత్తవాలు ఉన్నట్టు ఈ యూరిలోనున్ను ఒక కొత్తవాలు ఉన్నాడు. సకలపదార్థాలున్ను దొరుకును.

ఈఆచార నియమములు మనోబంధ హేతుకము లనిన్ని "అభావే విరక్తిః" అనే సత్యవచన ప్రకారము సాగని పక్షమందు ఆ నియమాల మీద విరక్తి పుట్టగలదని యనడానకు ఒక దృష్టాంత మే మంటే, మేము చెన్నపట్టణము వదలి వచ్చిన వెనక హైదరాబాదుకు ఇవతల నుండే మల్లుపేట అనే ఊరివరకు బ్రాంహ్మణయిండ్లు వుండి కష్టపడితే

౧౫ వ తేదీ ఉదయాన ౫ ఘంటలకు లేచి యిక్కడికి ఆరు కోసుల దూరములో నుండే మురువారా అనే గ్రామము ౧౦ ఘంటలకు చేరినాను. నడిమి వూళ్లు: నెం ౧౧ తెవురి ౧ నయ్యాగా ౧ లక్కెపటారి ౧ పిప్పరవేడు ౧ దేవురి ౧ జింజిరి ౧ మురువారా ౧. దారి నిన్నటిదారివలెనే శాలవేసి రమణీయముగా నున్నది. పయిమజిలీవూరు ముందరనే కాటిని అనే నది దాటవలసినది. యిక్కడ దోనెలు వేసి యున్నా నేను కాలినడకతోనే దాటినాను. దేవురి అనేవూరివద్ద నేవారు అనే నదిఒకటి దాటవలసినది. అదిమొదలుగా మురువారా చేరేవరకు చిన్నపర్వతాలు దారికి నిరుపక్కలా సమీపమున నున్నవి. పొదిచెట్లు అడివివలెనే యున్నవి. ప్రతిదినమున్ను అక్కడక్కడ మనుష్యులు భాట మరామత్తు చేస్తూ శాలగా పెట్టియుండే చెట్లను పశువులు తినకుండా చుట్టు అడివికొయ్యలతో గ్రాదులు కట్టుచునున్నారు.

నాగపూరు మొదలుకొని ముఖ్యముగా జబ్బల్పూరు మొదలుగానున్ను సకల స్త్రీలున్ను వృద్ధులతోకూడా బహు పనితరముగా అనేకవిధాలుగాచేసి వెండివలె శుభ్రముగా నుండే కంచు పాంజేబులున్ను మోచేతులకు పొడుగుగా ఆలోహముతోనే చేసిన కడియాలున్ను ధరించియున్నారు. భూమి సారవత్తు నయినది గనుకనున్ను దేహము పృథ్వీ భూత సంబంధ మయినది గనుకనున్ను స్త్రీలు పురుషులవలెనే కండపుష్టిన్ని దేహవర్ణమున్ను కలిగియున్నారు. దేహమాద్యంతమున్ను పావడ పయిట రవికె వీటి చేత నిండుగా కప్పియుండడముగాక పురుషదర్శన మయినంతలో ముఖమునకుకూడా ముసుగు యీడ్చి కప్పుకోవడానకు మాత్రమే యిక్కడి స్త్రీలకు తెలుసును గాని దాక్షిణాత్యులవలె చిన్నెలు వన్నెలు కులుకులు బెళుకులు చేయడానికి యేపాటిన్ని తెలియదు. పనిపాటలు చేసే సామాన్య పురుషులు అంధరున్ను తల మట్టుకు యిమిడేటట్టు ఒక కుల్లాయివలె యేర్పరచి దానిచుట్టూ విశాలముగా ఒక చట్టము వెదురు దబ్బలతోనున్ను మందారపు ఆకులు మోదుగాకులతో నున్ను గొడుగు చందముగా యేర్పరచుకొని యెండకు వానకున్ను తలకు వేసుకొని నడుస్తూ బయిలులో పనిపాటలు చేస్తూ వుంటారు.

---

యీ మజిలీ వూరు రహితు పుష్టిగలది. నేను దుకాణాలలోనే దిగినాను. యిది నదీతీరము. సకల వస్తువులు ముసాఫరులకు దొరకును. యీ రాత్రి యీ యూరిలో వసించినాను. జబ్బలపూరులో వుండే తపాలు ఆఫీసు మ్యానేజరు కుషుచందరుదత్తుబాబు అనేవాణ్ని మంచి తనము చేసుకొని, ప్రతిచౌకిలోనుంచి ఒక తపాలుమనిషి వచ్చేటట్టు జాగ్రత్త చేసుకున్నాను. హాయిదరాబాదు మొదలు యీ తపాలు మనిషి కూడావచ్చుటచేత ఖర్చు విస్తారము తగులుచూ వచ్చినా యీ పరరాష్ట్రములో దారి తప్పితిమి అనే మాటలేదు. దారి యెటు పోవలసినదని ఒకణ్ణి అడగవలసినది లేకుండా దారి తెలిసి నడుస్తూ రాబట్టి సౌఖ్యముగా వున్నది. యీమురువారాలో యీ రాత్రి వసించినాను.

౧౬ వ తేదీ ఉదయాత్పూర్వమే 3 ఘంటలకు బయిలుదేరి ౧౦ ఘంటలకు యిక్కడికి ౫ కోసుల దూరములో వుండే సభాగంజు అనేయూరు చేరి అమావాస్యగనుక వంటభోజనములు దుకాణాలలో చేసుకొని ౨ ఘంటలకు బయిలుదేరి అక్కడికి ౫ కోసులలో వుండే గుణవారా అనేయూరు సాయంకాలము ౬ ఘంటలకు చేరినాను. నడివూళ్లు:సెం ౧౨. చెక్కా౧ జాకాహి ౧ సభాగంజు ౧ నయగాం ౧ గుణవారా ౧ - ౫.

సదరహి మురువారా వద్ద ఒక నదిని దాటవలెను. నేను దోనె లున్నా వాటితో దాటితే కాలతామస మవుచున్నదని మొలలోతు నీళ్ళలో కాలినడకగానే దాటినాను. దారి నిన్నటిదారివలెనే సడక్కు వేసి చక్కబరచి యున్నది. అయితే కొంతమేర యెర్రగులక దొరక నందున బంకమట్టితో గట్టించియున్నది. అక్కడ యెండినచోట ముండ్లవలె గుచ్చుకొనుచున్నది. తడిసినతావులో అడుసుగా నుంచు న్నది. అయినా కాల్లు దిగబడడము, జారడమున్ను లేదు. చెక్కా అనే గ్రామము మొదలుగా గుణవారా మజిలీవూరువరకు దారికి నిరు పక్కల సమీపమందు సుందరము లయిన కొండ లున్నవి. అవి యథోచితమైన నునుపుగలిగి అందముగా నున్నవి. కుడిచేతిపక్క కొండ బురుజుకు వెంబడి బురుజును కట్టినట్టు యేర్పడియున్నది.

మనుష్యులు సకల స్వరూపాలున్ను ఏర్పరచడానకు ఈశ్వరుడు ఒక మాదిరిని సృష్టించి చూపించుచు వచ్చుట సిద్ధము గనుక, కోట బురుజులను మనుష్యులు కట్టను ఈ కొండను సృష్టించి చూపించినట్టు తోచుచున్నది. ఘాట కిరుపక్కల పొడిచెట్లుగాని అడివిలేదు. దారిలో విస్తరించి వరిపయిరు వేసియున్నది. పచ్చికె దట్టముగా కోసులముగా పొడుగుగానున్ను పెరిగేభూమి సారవత్తయినది గనుక నిర్మల మొదలు శింధిఅనే వూరిదాకా భూమి పచ్చికబాగా పట్టివున్నందున నున్ను మృదువయిన తియ్యని నల్ల రేగడమట్టి గలిగి యున్నందుననున్ను అంతమేరయున్ను సారవత్తయినదని చెప్పవలెను. పయిగా ఆ భూమి చెట్లబలం ఇతరభూమి చెట్లకులేదు. అయితే వానకాలమున అక్కడ వసించేవారికి కాలు దిగబడుచున్నది గనుక ప్రియాస విస్తారము. ఒక విధమయిన సౌఖ్యము ఈశ్వరుని కృపవల్ల కలిగితే ఒక విధమయిన కష్టమున్ను కలిగి యుంచున్నది.

సభాగంజు అనే గ్రామము మజిలీస్థలము. దిగను అంగళ్ళు వసతిగావుండవు. అన్నిపదార్థాలున్ను దొరుకుచున్నవి. గుణవారా అనేవూరిలో అంగళ్ళు దిగను మంచి వసతిగానున్నవి. చెక్కా అనే వూరు మొదలుగా మయిహరు రాజు రాజ్యము. అతనికింది అధికారస్థులు గొప్ప ముసాఫరుల సరఫరాయి నిమిత్తమై కొత్తవాలు మొదలయిన మనుష్యులను వుంచియున్నారు. ఈ గుణవారాలో ఆ రాత్రి వసించినాను.

౧౭ తేదీ ప్రొద్దున ౬ ఘంటలకు లేచి ౧౦ ఘంటలకు ౫ కోసుల దూరమం దుండే మైహరు అనే రాజధాని చేరినాను. మధ్యమున్న యూళ్ళు. నెంబరు ౧౩: గురయ్యా ౧ - మైహరు - ౧.

యీ మైహరు యథోచితముగా బస్తీ అయినది. దారి నిన్నటి దారివలె నడక్కువేసి యున్నది. వానవల్ల అక్కడక్కడ దారి చెడి ఉన్నందున మనుష్యులు మరామత్తు చేయుచున్నారు. నిన్నటివలె కొండల నడుమ దారి పోవుచున్నది. అడివిలేదు. ఈమైహారులో జబ్బల్ పూరు యిలాకా రహదారుల విచారించే దొర ఒక బంగాళాకట్టి తన ఠాణాను ఒక డభేదారునితో కూడా వుంచి యున్నాడు. రాజు కోట,

లోపల వున్నాడు. ఉత్తరువు లేకనే ముసాఫరులను కూడా లోపల
పోనివ్వరు. వూరి చుట్టూ మంచి చెరువులున్ను గుంటలున్ను ఉన్నవి.
అందులో దామరవేసి యున్నది. ఊరివద్ద పర్వతాగ్రమందు ఈ రాజు
తన యిష్టదేవత యయిన శక్తికి గుడి కట్టించి యున్నాడు. ముసాఫరు
లకు గాను సదరహింబంగళాదగ్గిర ఒక చెరువు కట్టమీద సరాయి అనే
ఒక పెద్ద కొట్టాము కట్టించి యున్నాడు. అందులో నొక అంగడి
యున్నది. అందులోనే ముసాఫరులు దిగవలసినది. మరియొక గుంట
గట్టున ఒక పెద్ద శివాలయ మున్నది. అందులో ఒక మధ్యరంగ
మున్ను చుట్టూ తాళ్వారము (మండువా వసారా) న్ను పయిన
అంతస్థులతో రెండుస్తూపీ లున్ను అందులో రెండు అరలున్ను నాల్గు
దిక్కులలో నాల్గు జపమంటపాలున్ను కట్టి యున్నవి.

నేను కన్యాకుమారి మొదలుగా ఇదివరకు దేశసంచారము చేసి
నంతలో దాక్షిణాత్యులకున్ను ఉత్తర దేశస్థులకున్ను ఆహారాదులున్ను
ధైర్యస్థైర్యములున్ను బింబారాధనలున్ను వీ రందరున్ను శ్రుతిస్మృతి
పురాణములను అనుసరించినవారైనా, భేదించి యుండుటకు కారణమేమని
యూహించగా నా బుద్ధికి తోచినది యేమంటే యీ బ్రహ్మాండము కోడి
గుడ్డు చందముగా పరబ్రహ్మ యాజ్ఞచేత రజ్జువుచేత విడవబడ్డ బొంగ
రము వలెనే కొన్ని బ్రహ్మాండాలకు జ్యోతిర్భూతముగా యేర్పరచబడి
యుండేసూర్యునికి ఒక ప్రదక్షిణము ౩౬౫ దినములు చిల్లర గడి
యలకు చేసేది గనుక ఆ సూర్యునికి ఈ బ్రహ్మాండములో అభిముఖ ప్రదే
శముగా వుండేదాన్ని మనవారు నిరక్షదేశమని చెప్పుతారు. యింగి
లీషువారు దానినే లయను అని చెప్పుతారు. అక్కడ మధ్యాహ్న
కాలానికి ఆయా వస్తువులనీడ వాటి గాత్రము లో లయింపుచున్నది
గనుక ఆప్రదేశము మిక్కిలి ఉష్ణకరమైనది. ఆ ప్రదేశము మొదలు
ఉత్తరధృవుని పర్యంతము ౯౦ భాగలుగా యీ గణితజ్ఞులు భాగించి
యున్నారు. ఆవుత్తర ధ్రువున్ని యింగిలీషువారు నార్తుపోల్ అను
చున్నారు. ఆ నిరక్షదేశము మొదలు భాగకు భాగకున్ను ఉష్ణము
తగ్గుచు వచ్చుట వలన అక్కడికి నిండా దూరపు ప్రదేశము శీతమ్ము

శీతతరము అతిశీతతరము న్నవుచు వచ్చినది. ఆ ప్రకారము భూమిని భాగించి నంతలో కన్యాకుమారి తొంమ్మిదో భాగలోవున్నది. చెన్న పట్టణము ౧౪ భాగలోనున్ను హాయిదరాబాదు ౧౮ భాగలలోనున్ను నాగపూరు ౨౨ భాగలోనున్ను అగరా(ఆగ్రా) ౨౮ భాగలోనున్ను ఢిల్లి ౨౯ భాగలోనున్ను వున్నవి గనుక కన్యాకుమారి మొదలు సుమారు ౧౫ భాగలోనుండే నెల్లూరి వరకు భూమి ఉష్ణకరమయిన వెన్న యెట్లా ఉష్ణానికి క్రమక్రమముగా పలచన అవుచున్నదో తద్వత్తుగా ఆయుష్ణ భూమిలో వసించే వారి హృత్కమలము మృదుభావమును పొందే కొద్దిన్ని వారియొక్క ధైర్య స్థైర్యాలు జాఠరాగ్నిన్ని, బలహాని ద్వారా తక్కువ అయివుంటున్నది. 'ఉష్ణ ముష్ణేన శీతలం' అనే న్యాయ ప్రకారము జాఠరాగ్నికి ఉష్ణభూమిలో దీపనశక్తి మట్టుబడ వలసినది సహజమేగదా ? జాఠరాగ్ని మందగతిని పొందియుండుటచేత కన్యాకుమారి మొదలుగా నెల్లూరి వరకు వసించేవారు త్వరగా జీర్ణ దశను పొందతగిన తేలికె ఆహారాలైన తమిదెల పుల్లటి యంబలి సద్దిఅన్నము కూటిసీళ్ళు గంజి, మజ్జిగె తేట, మిరియాల చారు మొదలయిన భక్ష్యములను పుచ్చుకొనుచు వస్తారు. యీభక్ష్యములు బలకరములు గానందున హృత్కమలాన్ని దృఢతరము చేయనేరక యున్నవి. హృత్కమలము దృఢకరముకానందున బిడ్డపాపలను విడచి ఎట్లా దూరసంచారము పొయ్యేది? పోతె మనగతి అక్కడ యేమవునో; యిక్కడ వీరిగతియేమవునో అని భయపడి దేశ సంచారమును దాక్షిణాత్యులు బహుశః మానుకొనుచున్నారు; ఇంతేకాకుండా యెప్పుడు ధయిర్యము కొంచె మవుచున్నదో అప్పుడు చాంచల్యము జనింపుచున్నది గనుక చాంచల్యద్వారా వస్తువిషయములుగానున్ను స్త్రీ భోగాలు మొదలయిన వాటి విషయముగానున్ను నిండా భోగించే శక్తిలేకపోయినా అలాటి విషయములను భోగించవలె నని తత్సంబంధమయిన ఆపేక్ష యెక్కువ అవుచు వచ్చుచున్నది. అటువంటి వారున్ను ఒక సద్గతిని పొందవలసినది యీశ్వరునికి అగత్యము గనుక అతడు తన చైతన్యము యెక్కువగా ప్రతిఫలించిన అప్పయదీక్షితులు రామా

నుజాచార్యులు ఆళ్వారాదులు అప్పర సుందర మాణిక్యవాసులు మొదలయిన వారిగుండా ఆ దేశపు 'యద్యద్విభూతి మత్సత్వం' అనే పాటిరాజులగుండానున్ను ధనికులగుండానున్ను వారున్న భూమిలో వూరూరికి సమీపవర్తిగా ఒక్కొక్క ప్రదేశాన్ని పుణ్యభూమియని యేర్పరచి ఆ ప్రదేశాలలో మనుష్యుల భక్తిని ఆకర్షించేపాటి దేవాలయాలను బహు ద్రవ్యవ్యయముతో అమానుషకృత్యముగా వుండేటట్టు కట్టించి అందులో బింబాలకు మంత్రమూలకముగా మహాత్మ్యమును కలుగజేసి ఆ బింబాలకు చేసే రాజోపచారములు మొదలయిన ఆరాధనలు యీ చాంచల్యము కలిగిన జనులకు సుఖకరములుగానున్ను ఉత్సాహకరములుగానున్ను అపేక్షితములుగానున్ను వుండేటట్టు చేసి యీ సుఖాపేక్షగుండానయినా అట్టి దేవాలయాలకు మనుష్యులు పోవుచు ఉపచరింపుచు అక్కడక్కడి విభవాలను ధనవ్యయముగుండా వృద్ధి పొందింపచేయుచురాగా వారికి ఒక భక్తిజనితమై తరించడానకు హేతువు అయివుంటున్నదని చేసినాడు. ఉత్తరదేశమున ౧౫ నో భాగ మొదలు సుమారు ౩౦ యో భాగపర్యంతము వసించేవారు, తత్పూర్వ దేశస్థుల అపేక్షయా వుష్ణశమనమైన భూమిలో వశించేవారు గనుక నెల్లూరు మొదలుగా ఢిల్లీపర్యంతము వుండేవారికి జాఠరాగ్ని క్రమక్రమముగా పటుత్వముకలిగి వుండేటందున రొట్టె, నెయ్యి, పాలు, దూదుఫేడాలు పప్పు చక్కెర ఘనీభవించిన పెరుగు మొదలయిన దీర్ఘముగా జీర్ణము కాతగ్గబలమయిన ఆహారాదులు పుచ్చుకొనుచున్నారు. తద్ద్వారా హృత్కమలము యథోచితమయిన దృఢభావాన్ని పొంది ఉష్ణదేశస్థుల అపేక్షయా ధైర్యస్థైర్యాలు యెక్కువ కలవారై దేశాటనము చేయడానకున్ను గురుకులవాసముచేసి శాస్త్రవిచారణ చేయనున్ను సామర్థ్యము కలవారై యున్నారు గనుక శాస్త్ర విచారణద్వారా జ్ఞానము ఉదయించక పోయినా భక్తిమాత్రము సహజముగా ఈశ్వరునిపట్ల ఉదయించవచ్చును గనుక మూఢులకు ఉత్సాహకరములైన నృత్యవాద్యగీతాలు రుచికరములయిన ప్రసాద తీర్థాలున్ను లభ్యములు కాగల దేవాలయాలు ఉత్తర దేశములో

అడుగడుగుకు విశేష ద్రివ్యవ్రియముచేత సృష్టించవలసిన అగత్యము లేదని ఉత్తరదేశపు పూర్వీకులైన ఉత్కృష్టులు నియమించినవారు కారు; కాని ఒకవేళ శాస్త్రవిచారణచేసి అందువల్ల భక్తి మాత్రిము సంపాదించడముకూడా అందరికి సాధ్యము కాదని ఊహించినవారై యిక్కడి మూఢులు తరించే నిమిత్తమై యీ ఉత్తరదేశములోనున్ను యథోచితమైన ద్రివ్యవ్రియముతో బహు దూరానికి బహు దూరమున ఒక్కొక్క నదియందు ఒక్కొక్క మహాత్మ్యము నిర్ణయము చేసి ఆ నదీతీరమందు కొద్ది అయిన దేవాలయాలు నిర్మించేటట్టు చేసి వాటిలోని బింబాలకు యథోచితమయిన పూజలు ఉపాయముగా జరిగించేటట్టు చేసినారు గనుక అందువల్ల యీ శీతదేశపు మూఢులు కొంతదూరము కాయాన్ని క్లేశపెట్టి దేశ సంచారము చేయడానికి సమర్థులు గనుక ఆ ప్రికారమే చేసి అట్టి నదులలో స్నానము చేసి అట్టి దేవాలయాలలోని బింబాలను ఆరాధించి కడతేరుచు వచ్చుచున్నారని తోచుచున్నది. అయితే మూఢవ్యతిరిక్తులుగా వుండేవారు యీ నదుల స్నానాలున్ను చేయనక్కరలేదే అని శంక తోచును. మూఢ వ్యతిరిక్తులకు శాస్త్రమువల్ల కలిగే తెలివి పైపాచిని తోసిన జలమువంటిది గనుకనున్ను మళ్ళీ మూఢత్వము పాచివలెనే కమ్ముచూ వచ్చును గనుకనున్ను మూఢ వ్యతిరిక్తులు మూఢుల అపేక్షయా పెద్దలు గనుకనున్ను మూఢులకు గతి కల్పించవలసినది మూఢ వ్యతిరిక్తులకు మిక్కిలి అగత్య మయినందుననున్ను తృణము మొదలు మేరువు వరకు పరబ్రిహ్మ చైతన్యము నిండి ఉన్నదనే నిశ్చయముతో పూర్వీకులైన పెద్దలు వ్రాసిన నిమిత్తములను బట్టి యేర్పరచివుండేస్థలములనేమి బింబాలనేమి తీర్థాలనేమి వారి సంకేతానికి యెంతమాత్రిమున్ను భంగము రాకుండా భక్తితో మూఢ వ్యతిరిక్తులున్ను ఆరాధింపుచు రావలసినది. తద్వారా "యాదృశీభావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అనే సత్యవాక్యప్రకారము మూఢులను మూఢవ్యతిరిక్తులనున్ను తరింపచేయుచు వచ్చుచున్నది.

ధైర్య స్థైర్యాలకు నెల్లూరికి దక్షిణములోనున్ను నెల్లూరికి

ఉత్తరములోనున్ను వుండే భేదములు తెలియను ఇంకా యీ అడుగున వ్రాయుచున్నాను. తంజావూరు తిన్నెవల్లి సీమవారు 'తాయికి వందవర్ తగప్పర్' అనే వాక్యాన్ని వాడుచు ఊరికి వచ్చిన అధికారస్థుడు ఏమిచేసినా అంగీకరింపుచున్నారు. హయిదరాబాదు నాగపూరు రాజ్యములలో భిక్షుకుణ్ని ఒక ముసాఫరులు దిగేస్థలములోనుంచి నాలుగు గడియలు అవతలికి లేచిపోయి ఉండుమంటే తనకు చేసిన ఆజ్ఞ న్యాయవిరుద్ధము గనుక నా తలకాయ కొట్టిన వెనక నా కళేబరాన్ని యీ స్థలములోనుంచి వొత్తించవలసినదిగాని నేనుగా భయపడి లేవనని సర్వాధికారము కలవారిని నిగ్రహించి చెప్పుతాడు. దక్షిణదేశస్థులకు బెత్తపుదెబ్బ పుట్టించే నొప్పి, కలగచేసే భయము ఉత్తరదేశస్థులకు తల తెగడములో లేకుండా వున్నది. అయితే దక్షిణదేశస్థుల భయము భక్తిజన్యము కాదు గనుక నిలకడగా వుండేదిలేదు. ఉత్తర దేశస్థులు భయప్రేరణ లేకుండానే చేతనయినంత మట్టుకు న్యాయముగా నటింపుచు వచ్చుచున్నారు. తమ తాత్పర్యము యెదటివారి తాత్పర్యముతో భేదించినప్పుడు పురుషవాహిని ప్రకారము అహంకారాన్ని వృద్ధిపొందించి నటింపుచున్నారు. యిటువంటి మనోబుద్ధి యహంకారాలు స్థూలదేహముతో నెయ్యిపాలలో కలసినట్టు వున్నందున బౌద్ధులు నెయ్యిని పాలలోనుంచి విడతీసే ప్రయాస పుచ్చుకోచాలక పాలనే నెయ్యి అని భావించినట్టు స్థూలదేహాన్నే పరబ్రహ్మ అని భావింపుచున్నారు. అటువంటి భావనకూడా ప్రత్యవాయమయినది కాదని తోచుచున్నది. కొండకొనకు పోవలిస్తే మెట్టు మెట్టుగా యెక్కిపోవలసినది గనుక ఒకరు ఒకదారిగా మరియొకరు మరియొక దారిగా యెక్కుచున్నారు. యే రీతిగా నయినా ఏ పదార్థమందయినా పరబ్రహ్మను నిరూపించి ఆరాధనచేసి కడతేరవలసినది గనుక సర్వం విష్ణుమయం జగత్ అనే న్యాయప్రకారము యేవస్తువును యే నామ రూపాలతో పరబ్రహ్మగా నిరూపించినా బాధకము గాదు. దాక్షిణాత్యులకు అతిసమీపములో అనేక దేవాలయాలు అతివిభవముతో ఉత్సవాలు జరిగేవిగా వుండిన్ని తమకు భోజనమజ్జనాదులు ఉపచరించేవారు అక్కడలేని పక్షమందు ఆస్థలానికి వెళ్ళ

డము మాని ఉపచరించేవారు ఉండే మహాస్థళానికే చెన్నపట్టణాపు శెట్లు తిరువట్టూరికిన్ని కోమట్లు తిరువల్లిక్కేణికిన్ని మొదలారులు మయిలాపూరికిన్ని వెళ్లేటట్టు పోవుచు నుంటారు గాని ఒకపూటు అన్నము తమ ప్రయాసతో జాగ్రత్త పెట్టుకొనేపాటి ధైర్యముతో ఇతర స్థళాలకు వెళ్లడములేదు. ఉత్తర దేశస్థులు సహజముగా తీర్థ-యాత్రలకు అక్కడ యెక్కువ విభవాలు జరగక పోయినా యెరిగిన వారు యెవరున్ను లేకపోయినా బహుదూరానికి వెళ్లుచున్నారు. మళయాళ దేశస్థులు సేతుయాత్ర వెళ్ళవలిస్తే వరత్త్ కోట్టై యమణల్ వెళ్లి కట్టియముళ్ దారిలో వున్నదని అద్యాపి జడుస్తారు. హిందూస్థాని దేశస్థులు మనోభీష్టాలు యీడేరవలిస్తే అనాయాసముగా గంగోత్తరి మొదలయిన పంచగంగ కావిళ్ళు తెచ్చి దాతా వైద్యనాథ స్వామికి అభిషేకము చేస్తూవస్తున్నారు.

ఆహారములు, స్త్రీసంగమాలున్ను, దృఢతరముగా చేసి ఉత్తర దేశస్థులవలె దాక్షిణాత్యులు తృప్తినిపొంది వాటివల్ల వెంబడిగానే విరామాన్ని పొందకపోయినా దాక్షిణాత్యులు దినానికి నాలు గవసరాలుగా భోజనముచేసి మధ్యే మధ్యే మజ్జిగె తేట మొదలైన పానీయాలు పుచ్చుకొని చూచిన భక్ష్యభోజ్య స్వల్ప పదార్థాల సంతా చూచినప్పుడంతా తినకోరుచున్నారు. స్త్రీ సంగమాదులలో నున్ను అదేరీతిగా మనస్సున నిబ్బరముతో దేహధర్మాన్ని వుంచనేరక దృఢముగా భోగించలేకపోయినా, చూచిన మిణుకుకత్తెల పయినంతా దృష్టిని పోనిచ్చి సంగమాదులలో అనేకావృత్తులు ప్రవర్తింపుచున్నారు. అందువల్లనే ఆ దేశస్థులకు త్వరగా వీర్యనష్టమయి అండవాయురోగము కల్గుచు వచ్చుచున్నదని యింగిలీషు వారు తాత్పర్యము గలవారై వున్నారు. ఈ చాపల్యాలకంతా కారణము పిత్తోద్రేకమని తోచుచున్నది. యీ పిత్తోపరి కావడానికి ఉష్ణమే కారణముగాని వేరేలేదు. వాతము రజోగుణధాతువు; పిత్తము తమోగుణధాతువు; శ్లేష్మము సత్వగుణధాతువు. పిత్తము ఉష్ణభూమిలో ప్రకోపమవుచున్నది; శ్లేష్మము శీతభూమిలో ప్రకోపమవుచున్నది; వాతము ఉభయమధ్యస్థముగా ఇతరములయిన రెండు ధాతు

వులతో ప్రత్యేక ప్రత్యేకముగా కలుసుకొన్నప్పుడు ఆ యా గుణములతో తాను ప్రకోపింపుచున్నది. అది యెట్లానంటే శీతదేశస్థులకు శ్లేష్మవాయువు ప్రకోపమయి వేధించినట్టున్ను ఉష్ణదేశస్థులకు ఉష్ణవాయువు ప్రకోపించి వేధించినట్టున్నే గాని శుద్ధవాయువు ఎక్కడా ఒక ప్రకోపాన్ని పొందడములేదని తోచుచున్నది.



## ఎనిమిదవ ప్రకరణము

యీ మైహరు అనే ఊరు బొందిలీ ఖండము మధ్యే ఉన్నది. దీని చుట్టూ ౧౦ ఆమడదూరపు భూమిని బొందిలీఖండ మంటారు. యీ మైహరు రాజుపేరు 'బిషన్‌శింగు.' వీని తాత పన్నా దేశపురాజు కింద సరదారుగా వుండి పన్నారాజు తమ్ముణ్ణి యుద్ధములో చంపినందున చెయి పట్టుగా పట్టి నాకు ఒప్పగించక నా తమ్ముని చంపితివే అని షరాపెట్టి పన్నారాజు యీ రాజును తలకాజ్ఞచేసి అయినా తనకు నుపకారము చేసినందున సంవత్సరము ౧ కి లక్షరూపాయీలు యెత్తే యీ మయిహరు రాజ్యాన్ని యీ రాజు తండ్రికి జాగీరుగా యిచ్చినాడు. అద్యాపి ఆ ప్రకారమే అనుభవింపుచు కుంఫిణీ వారికి చాలా విహితముగా నడుచుకొను చున్ను ఈ దారిని వచ్చిన దొరలకు కావలసినట్టు సరఫరాయిచేసి సంతోషపెట్టి యీ రాజు బహు యోగ్యుడని వారివద్ద క్యారకటరు పుచ్చుకొనుచున్నాడు. భగవంతుడు నాయందున్ను ఆ ప్రకారమే గౌరవము కలగచేసినందున ఆరాజు సకల విధాలను నాకు ఉపచరించి వెనక నా వద్దనున్న క్యారకటరు పుచ్చుకొన్నాడు. కొన్ని సంవత్సరములు కిందట యీ బిషన్‌శింగు తమ్ముడు ప్రయాగదత్తు అనేవాడు అన్నతో కలహపడి జబ్బల్‌పూరు యేజెంటుగుండా రాజ్యమును పంచుకొన్నాడు. ఈ బిషన్‌శింగు కింద యిప్పుడు అతని సగానికి వచ్చిన ౫౦౦౦౦ రూపాయీల రాజ్యమున్ను ఉన్నది. ఇతని రాజధానినిండా బస్తి అయినదికాదు.

ప్రయాగకు సిహోరానుంచి బలుహోరా మీదుగా ఒక దారిన్ని మైహరునుంచి చిత్రకూటము మీదుగా ఒక దారిన్ని పోవు

చున్నది. ఆరెండు దోవలున్ను దగ్గరైనా సడక్కు వేసివున్నందుననున్ను అన్నివిధాలా ప్రయాస నిచ్చే మార్గములు గనుకనున్ను ఆరామడ చుట్టయినా సడకు వేసిన దారిగుండా మిరిజాపురానికి వెళ్ళేటట్టు నిశ్చయించినాను.

ఈ మైహారులో ౨౦ తేది మధ్యాహ్నము వరకువుండి మూడు ఘంటలకు బయలుదేరి ౬ కోసుల దూరములోనున్న అమరాపాటక్ అనేవూరు రాత్రి ౯ ఘంటలకు చేరినాను. నడిమి వూళ్ళు: నెంబరు ౧౪. బరహ్యా - ౧ - అమరాపాటక్ - ౧ దారి ముందరి మజిలీవలె సడక్కు వేసియున్నా యెర్రగులక వేసి గట్టించినందుననున్ను వర్షాకాలము గనుకనున్ను భూమి గౌరవర్ణపు రేగడ అయినందుననున్ను నడవను అనుకూలముగా నుండలేదు. మైహారు వూరికి కోసెడుదూరాన తమసానది దాటవలెను. అమరాపాటక్‌వూరి ముందర జింజిరీ అనే కాలవయొకటి దాటవలెను. ఆ కాలువ వరకు మైహారు రాజ్యముసరి. దానికి ఇవతల రీమూరాజు రాజ్యము. అమరాపాటక్‌వూరు గొప్ప బస్తీఅయినది. అంగళ్ళు విస్తరించి వున్నవి. అన్నివస్తువులు దొరుకును. రీమూరాజు తన తరఫున గొప్ప ముసాఫరుల సరఫరా నిమిత్తమై ఒక కొత్తవాలును వుంచియున్నాడు. మైహారు నుంచి అమరాపాటనుకు వచ్చేటప్పుడు మార్గములో కుడిచేతితట్టు మాత్రము కొంతదూరములో కొండ అగుపడుచు వచ్చుచున్నది. ఎడమచేతిపక్క కొండలు అక్కడక్కడ తునిగి సంక్షేపబడుచు వచ్చుచున్నవి. వాటిలో రెండుకొండలు- ఒకటి ఫిరంగిగుండ్లు రాశిపోసి అతికిన చందముగానున్ను, ఒకటి ఒంటికంభము డేరాచందముగానున్ను వున్నవి. యీ వూరిలో అంగళ్లలో యీ రాత్రి వసించినాను.

౨౧ తేది ఉదయమయిన ౬ ఘంటలకు లేచి యిక్కడికి 3 కోసుల దూరములోవుండే పల్నా అనే వూరు ౯ ఘంటలకు చేరినాను. జబ్బల్‌పూరు దాటిన వెనకకూడా కొందరు బోయీలు కావటివాండ్లు బంట్రౌతులున్ను అటు ముందు దాటివచ్చిన అడివిగాలి సంబంధమయిన చలిజ్వరాలతో పడ్డందున కొందరిని డోలీలలో వేసి కూడా తేవలసివచ్చినది; గనుక వారు వచ్చి కూడా కలుసుకొనే నిమిత్తమయి

యింత చిన్న మజిలీ చేసినాను. డోలీ అనగా ఒక చిన్న నులక మంచానికి బొంగు కట్టి యిద్దరు మోసేది. యిక్కడి బోయీలను డీమర్లు అంటారు. వారిద్దరు అటువంటి డోలీని సాధారణముగా నా సవారితో కూడా మోసుకొని వచ్చిరి. దారి నిన్నటి దారివలెనే అనుకూలమయినది కాదు. ఈ వూరు చిన్నది. జలవసతి కద్దు. దీన్ని యీ దేశపు బ్రాంహ్మణునికి రీమారాజు యీనాంగా యిచ్చినాడు. మజిలీవూరు కాదు గనుక ప్రయత్నము మీద బియ్యము మొదలయిన సామానులు అందరికిన్ని దొరికినవి. యిక్కడ యీరాత్రి డేరాలలో వసించినాను.

౨౨ తేది ఉదయాత్పూర్వము ౩౪ ఘంటకు లేచి యిక్కడికి ౬ కోసుల దూరములో వుండే రీమారాజుయొక్క రాజధానిని (రీమా) చేరినాను. నడిమివూళ్లు. నెం - ౧౫ - వుసురి - ౧ రీమా ౧.

దారి నిన్నటివలెనే వున్నది. రీమా అనేవూరిముందర తమసా అనే నది మళ్ళీ దాటవలసినది. ఈ నది గంగలోనుంచి చీలివచ్చేదిగా చెప్పుతారు. రీమా బహు గొప్పవూరు. కోటలోపల రాజు వుంటాడు. కోటకు బయిట అంగళ్ళు మొదలయినవి వున్నవి. వూరిచుట్టు తోటలు గుంటలున్ను కొన్ని వున్నవి. సకలమయిన పదార్థాలున్ను దొరుకును. చింతపండుకూడా బహు ప్రయత్నముమీద ఒక శేరు యిక్కడ దొరికినది. నాతో కూడా వచ్చిన స్వదేశపు పరిజనులు మిరపకాయలు చింతపండు తిననందున మాకు రోగాలు వస్తున్నవని భ్రాంతిపడి చెప్పుతారు. వారికి చింతపండుకు బదులు గోంగూర చింతాకు చింత పిందెలు దొరుకుచు వస్తున్నవి. ఉపపన్నులయిన యాత్రవచ్చేవారు నా వలె మోసపోకుండా స్వదేశ పరివారసంరక్షణ నిమిత్తమై ౨ నెలలకు చాలేపాటి చింతపండు మిరపకాయలు మిరియాలు ఆవాలున్ను నాగపూరులోనే జాగ్రతచేసుకొని కూడా తీసుకొని రావలసినది. లోగడ నేను వ్రాసిన ప్రకారము కోసుకు మూడుకోసులుగావుండే కొండకోసులు నర్మదానదితో సరి. జబ్బల్‌పూరు మొదలుగా అను కొనే కోసులు కొంచెమెచ్చుగా మనదేశపు కోసులకు సరిపడుచున్నవి.

నాగపూరు మొదలుగా వక్కలులేవు. ఫోకలు వొత్తికాచుతో

కూడా వేసుకొనుచున్నారు. యీ సంగతి నాగపూరిలో తెలిసి నందున నా దేహ సంబంధికులకు మాత్రము కాశివరకు చాలే పాటిగా నాతో కూడా వచ్చినవారు వక్కలు కొని తెచ్చినారు. యీ దేశస్థులు హుక్కా తాగడము చేత పొగాకు సాధారణముగా దొరుకుచు వచ్చుచున్నది. తమల పాకులు జబ్బల్‌పూరు మొదలు అతినల్పువర్ణముతో బిల్వ పత్రి వలెనే వుండేవి దొరుకుచున్నవి. మిక్కిలి ప్రియత్నము మీద ఆలాటి నల్లని వర్ణముగల తమల పాకులే పెద్దవిగా దొరుకుచున్నవి. హాయిదరాబాదు మొదలుగా అమ్మే నెయ్యి మంచిది కాదు, గనుక నాగపూరు వరకు వెన్న తీసి నెయ్యి కాచుకుంటూ వచ్చినాము. పిమ్మట జబ్బల్‌పూరు వరకున్ను అటు యివతలనున్ను వెన్న మజ్జిగె దొరకడము ప్రయాస అయినా నాకు యీ రాజ్యములో అక్కడక్కడ గొప్పవారిని శ్రీరాములు విహితము చేస్తూ వస్తాడు గనుక దొరికే తావులోనుంచి దొరకని తావుకు వెన్న మొదలయిన పదార్థాలు నాకు ముట్టుచున్నవి.

ఆగామి సంచిత ప్రారబ్ధ కర్మాలలో మూటిలోనున్ను "అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం" అనేవచనము ప్రారబ్ధ కర్మ విషయమై సత్యమై వుండగా ఈశ్వరకటాక్ష మేమి చేయగలదు? మనము చేసినంత అనుభవించవలసినదాయెనే అని సందేహపడి యీశ్వర భజన చేసి యీశ్వరప్రియము లయిన పనులు చేసినంతలో అది పయివాక్యాన్ని అనృతపరచకుండానే ఆ ప్రారబ్ధకర్మఫలము దుఃఖమయిన పక్షమందు దుఃఖ ఫలమును పొందకుండాచేసి అభ్యుదయాన్ని నిస్సందేహముగా పొందింపచేస్తున్నది నేటందుకు సాధనములయిన వచనములు "కోటయో బ్రహ్మహత్యానా మగమ్యాగమ కోటయః, సద్యః ప్రళయ మాయాంతి మహాదేవేతి కీర్తనాత్" ఇది మొదలయినవి అనేకములున్నవి. యీ వచనములు సత్యములయితే అవశ్య మనుభోక్తవ్యం అనే వచనము అబద్ధము కావలసినదాయెనే, యిందులో యేది సత్యము యేది అబద్ధము? లేక రెండున్ను అబద్ధములా? ఒకదానికొకటి విరుద్ధముగానుండుటవలన రెండున్ను సత్యములు కానేరవే; అనే తాత్పర్యము బహుదినములుగా నాకు కలిగివుండి, నేను పెద్దలని తోచిన

వారినంతా యీ సందేహమును నివృత్తి చేయవలసినదని అడుగుచు వచ్చినంతలో వారు వారు యథోచితమయిన సమాధానాలు చెప్పుచు వచ్చిరిగాని, నిస్సందేహమును పొందచేసిన వారుకారు. అయితే పరబ్రహ్మమే గురువు గనుక పరబ్రహ్మ ప్రతిమానుష దేహములో ప్రతిఫలించేటట్టు నా దేహములోనున్ను ప్రతిఫలింపు చున్నాడు గనుక నా యొక్క అంతర్యామిగా వుండే పరబ్రహ్మ యీ విషయములో నాకు ప్రత్యక్ష గురువయి, నా బుద్ధి ద్వారా నాకు సందేహ నివృత్తి చేసిన క్రమ మేమంటే, కర్మమనిన్ని పరబ్రహ్మమనిన్ని రెండు వస్తువులు శిశువును తల్లిదండ్రులు పోషించేటట్టు అప్పటప్పటికి మనుష్యుణ్ని శిక్షించి రక్షింపు చున్నవనిన్ని కర్మము సదా తల్లివలెనే శిశువు మంచి పనులు చేస్తే లాలించి చెడు పనులు చేస్తే శిక్షించినట్టు మనుష్యులు చేసిన శుభాశుభకర్మములకు తగ్గ ఫలమును సిద్ధముగా కర్మము అనుభవింప చేయుచున్న దనిన్ని అయితే శిశువుకు తండ్రిగావుండేవాడు శిశువు చేసిన దుర్మార్గాన్ని గురించి తల్లి దండించి శిశువుకు ఏ దేహ పాటి తాపత్రయము పుట్టినప్పుడు శిశువు తండ్రిని తలచి నాయనా అని పేరుపెట్టి తల్లిచేసే శిక్ష తాళలేక నివృత్తిని పొందించమని యేడిస్తే యెట్లా తండ్రి మంచిదిపో ఆ చేష్ట చేస్తే చేసినాడు; వాణ్ని కొట్టక తిట్టక వానికి పాలు నెయ్యి అన్నమున్ను పెట్టుము, ఇకను అట్లా చేయడని ఎట్లా తల్లి చేయతలచిన శిక్షను పూర్తిగాకుండా శిశువును విడిపిస్తాడో తద్వత్తుగా మనుష్యులు దుష్కర్మము చేసినా దుష్కర్మ ఫలానుభవము వచ్చినపుడు ఈశ్వరుని గురించి భజనచేసి ఈశ్వరప్రీతి సంపాదకములయిన పనులు చేసినట్టయితే తల్లిచేత శిక్షింపబడుచు నుండే శిశువును తండ్రి విడిపించినట్టు మనుష్యుని దుష్కర్మ ఫలానుభవములో నుంచి యీశ్వరుడు సిద్ధముగా విడిపించ గలడు. అయితే కొన్ని వేళలలో దుష్కర్మ ఫలానుభవము వచ్చినప్పుడు యెంత ఈశ్వరభజన చేసినా ఈశ్వరప్రీతి సంపాదకము లయిన జపహోమ సురార్చనాదులు అనేకములు చేసినా దుష్కర్మఫలానుభవమే ఘటిస్తున్నదే అది యేమి? అని శంక తోచును. దానికి సమాధాన మేమంటే శిశువు

చెడు చేష్టలే విస్తారముగా చేస్తూ వచ్చినా వాటి నంతా ఆ శిశువు నటించే కొన్ని మంచి నడతలవల్ల మన్నించి బుజ్జగిస్తూ వచ్చిన్ని చెడు చేష్టలు యెక్కువయి తల్లి శిశువును దండించ తలచి దండించే రెండు మూడు తరుణాలలో తండ్రి విడిపించి యుండగా మళ్ళిన్ని శిశువు చెడు చేష్ట మానక తల్లిచేత శిక్షింపబడుచు నుండగా తండ్రిని తలచి యేడ్చినట్టయితే యెట్లా తండ్రి మన కెక్కడి జోలి? యీ శిశువును కాపాడవలసిన భారము తల్లిదేను; మన మెంత సేపు ఈ శిశువును తల్లి దండనకు లోబడకుండా కాపాడగలము; తల్లి తెలియక దండించునా? ఇట్లా మనము దండనకు లోబడకుండా విడిపిస్తే శిశువు మరిన్ని మకురు బట్టి చెడిపోను; తల్లికి శిశువుకున్ను బంధ మెక్కువ; మనము తల్లికి యజమానుడయినా శిశువుకు సన్నిహిత బంధురాలు తల్లిగాని మనము గాము; యీ వుభయుల దుఃఖము ఎన్నటికిన్ని యిట్లా వుండే దేను; శిశువుకు బుద్ధి వచ్చేటందుకే తల్లిదండిస్తున్నది; మంచిపనే; యీ శిశువు ప్రతి దినమున్ను పెట్టే మొరజోలికి మనము పోరాదని యెట్లా తండ్రి విరామమును పొందుతాడో తద్వత్తుగా పరబ్రహ్మ దుష్కర్మ ఫలానుభవమును చేయుచునుండే మనుష్యుడు నిండా పాపిఅయి కొన్ని ఆ వృత్తులు తన కృపవల్ల ఆ యశుభ ఫలానుభవము తేలికె చేయబడిన్ని మళ్ళిన్ని దుష్కర్మ పరంపరనే చేసివుండి తత్ఫలానుభవాలు వచ్చినప్పుడంతా యీశ్వరభజన చేసి ఈశ్వరకటాక్ష సంపాదకములయిన పనులుచేసినా మనుష్యునికి నుత్తరోత్తర శ్రేయస్సు నిమిత్తమై దుష్కర్మఫలమే అనుభవానికి వచ్చేటట్టు అవుచున్నది. గనుక 'అవశ్య మనుభోక్తవ్యం' మనే వచనము సత్యమే, 'కోటిజన్మ బ్రహ్మహత్యానా మిత్యాది' వచనాలున్ను సత్యములేగాని ఒకటికి ఒకటి విరుద్ధముగాదు.

చెన్నపట్టణములో నేను వుండగా కొందరు ఫరంగివాండ్లతో మతానుసారము లయిన మాటలు మాట్లాడుచు నుండగా యిదే రీతిగానే డిస్టయిని (Destiny) అనే విధి బలమయినప్పుడు ఈశ్వర కటాక్షమేమి పనికివస్తున్నదని ప్రస్తాపము వచ్చెను. అప్పుడు నాకు తోచిన బుద్ధిప్రకారము నేను సమర్థించిన వయిన పేమంటే డిస్టయిని అనేవిధిని మదరాసు సూప్రింకోర్టుగా భావించ వలసిన

దనిన్ని యీశ్వరుని సీమరాజుగా భావించ వలసిన దనిన్ని; యెట్లా సీమరాజుయొక్క ఆజ్ఞవల్ల లోకులుచేసే తప్పులకు సూప్రీంకోర్టువారు తూకు (ఉరి) తీయగలరో తద్వత్తుగా డిష్టయిని అనేవిధి కర్మఫలాను భవమునిచ్చినా సీమ రాజుతో రూపురూపుగా చెన్నపట్టణములోనుంచి యెవరికయినా జాబులు నడుస్తూ వుండేపాటి విహితముండి తనకు తూకున తీసేటట్టు సుప్రీం కోర్టువల్ల కలిగినఆజ్ఞకు సీమ రాజుమన్నన నిమిత్తమై వ్రాసి పంపించి తెప్పించుకో గలిగితే యెట్లా సుప్రీం కోర్టుయొక్క దండన తప్పిపోవచ్చునో, అట్లా డిష్టయిని అనేవిధి యీశ్వరకటాక్షము ముందర నిలవనేరదనిచెప్పి సమాధానపెట్టినాను. ఈ యుక్తులచేత శిశువుచేసిన తప్పుచేష్టలకు తగినదండన చేస్తూవుండే క్రోపముగల తల్లికన్నా దూరముగా నుండిన్ని శిశువుచేసిన చేష్టలనున్ను అందుకు తల్లిచేసే దండననున్ను చూస్తూవుండే తండ్రి నిండా దయాళువు గనుకనున్ను తల్లి శిశువుల కిద్దరికిన్ని తండ్రి స్వామి గనుకనున్ను తండ్రియెడలనే శిశువు నిండా భయభక్తులతో నడుచుకొంటే అది యెట్లా క్షేమకరమో తద్వత్తుగానే మనుష్యులు కర్మములు చేసుట కన్నా భక్తిపారంగతులు కావడమే మంచిది. యీ న్యాయమును పట్టే విశిష్టాద్వైతులు 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనేవాక్యాన్ని పాటించిన వారివలె అభినయిస్తారు. అయితే తల్లి తండ్రికన్నా ఎక్కువగా యెప్పుడున్ను శిశువుతో కిందను మీదను పడుచున్ను పోషిస్తున్నండేది గనుక మంచిపనులుచేసి మంచిమాటలాడి నప్పుడంతా అతి త్వరగా మనస్సు కరిగి శిశువును తన చేతనయినంతమట్టుకు ఉత్సాహపరచడమే కాకుండా తండ్రికి ఫలాని మంచిపని శిశువు చేసినాడు, ఫలాని మంచి మాటను ఆడినాడని తెలియచేసి యెట్లా తండ్రియొక్క మన్ననకూడా శిశువుకు సంపాదించి యిస్తున్నదో, తద్వత్తుగా మనుష్యులు చేసే శుభకర్మాలు ఈశ్వరకటాక్షాన్ని కూడా సంపాదించి యిస్తున్నది. యెట్లా శిశువు పెద్దవాడయ్యేదాకా శిశువు తల్లి యొక్క అనుసరణ మన్ననలు అగత్యమో తద్వత్తుగా మనుష్యుడు జ్ఞానమువచ్చే పర్యంతము కర్మబద్ధుడయి మంచి కర్మాలు చేస్తూ తద్ద్వారా యీశ్వరకటాక్షాన్ని సంపాదించుకొనుచు జ్ఞానము పుట్టిన

వెనుకకూడా తానుగా కర్మాలను విడవకుండా జ్ఞానప్రకాశముచేత ఆకర్మములు తన్ను వదిలిపొయ్యేటట్టు నటించవలసినదని దోచబడుచున్నది.

ఈ రీవాంరాజు పారంపర్యముగా యీ రాజ్యమును యేలుచున్నాడు. ఇతడు బగ్గెలు అనే క్షత్రియజాతి. యీరాజుపేరు జయశింగదేవు. ఇతనికి ముగ్గురు కుమాళ్ళు. వారు విశ్వనాథశింగు, లక్ష్మణశింగు, బలభద్రశింగు అనే పేళ్లుగలవారు. యీముగ్గురికిన్ని రాజ్యము పంచిపెట్టి జ్యేష్ఠుణ్ని తనకు బదులుగా పట్టాభిషేకము చేసి వుంచి యిప్పటికిన్ని తండ్రి సుఖముగా వున్నాడు. సంవత్సరము ౧కి పదిలక్షల రూపాయిల యెత్తే రాజ్యము వీరికి కలిగియున్నది. యీ రాజు కుంపిణీ వారిని నిండా లక్ష్యపెట్టడములేదు. యథోచితమయిన స్వాతంత్ర్య దశను పొంది నటింపుచున్నాడు. కొన్ని కాలాలలో దేవబ్రాహ్మణ పూజ బాగా చేస్తాడు. ఈ వూరిలో ఈ రాత్రి డేరాలలో వశించినాను.

౨౩ తేది ఉదయాన ౫ ఘంటలకు లేచి యిక్కడికి ౪ కోసుల దూరములోవుండే రాయపూరు అనే వూరు ౯ ఘంటలకు చేరినాను. దారి సడక్కువేసినారనే పేరేగాని వేయనట్టే వున్నది. వుమరియనే వూరి పర్యంతము జబ్బల్‌పూరు దారి విచారణకర్త అయిన కేపన్ నిక్కోల్సెన్ విచారణ అయినందున దారి యొకతీరుగా కాపాడబడి వున్నది. వుమరికి యివతల మిరిజాపూరిదారి విచారణకర్త కేపన్ డ్రిమ్మర్ విచారణగనుక దారి విచారణ బహు తక్కువగా వుండేటట్టు అగుపడుచున్నది. భాటకు యిరుపక్కలా చెట్లుకూడా పెట్టినట్టు అగుపడలేదు. భూమి యెర్రరేగడ గనుక యెండివుండేచోట గుచ్చుకొనుచున్నది. మైహరు మొదలుగా భూమి బాగా పచ్చికబట్టి వుండలేదు. పయిరున్ను వృద్ధికాకుండా వుండేటట్టు తోస్తున్నది. యీ రాయపూరు అనేవూరు గొప్ప దేను. వూరిలో ఎక్కడ చూచినా మిట్టపల్లము, అడుసు కాలువలు మొదలయిన అసహ్యములతో నిబిడీకృతముగా వున్నది. వూరిచుట్టూ నాలుగుతోటలు, పెద్దగుంటలు, చెరువులున్ను వున్నవి. సకలపదార్థాలున్ను ముసాఫరులకు దొరుకును. అంగళ్ళు శానావున్నా వసతికావు గనుక డేరాలలో యీ దినమంతా వసించినాను.

౨౮ తేది ఉదయాన ౪ ఘంటలకు లేచి యిక్కడికి ౫ కోసుల దూరములోవుండే సత్తిని అనేవూరికి ౧౦ ఘంటలకు చేరినాను. మధ్యనున్న యూళ్లు: నెం - ౧౬ - మనగాం - ౧ - సత్తిని - ౧. దారి నిన్నటివలెనే అనుకూలముగా వుండలేదు. కొండల యడివి కొన్ని దినములుగా ఉపద్రవపెట్టడములేదు. యీ దినము ౧౦ వాగులదాకా దాటినాను. ఆవాగులుదిగి యెక్కడానికి వయిపుగా (వీలుగా) రాళ్లతో కట్టివుండలేదు. దారిలో మనగాం అనే వూరికి సమీపముగా ఒక వాగువద్ద ఒక మనిషిని చంపి పడవేసివున్నది. నాతోకూడా వచ్చే తపాలు మనుష్యులు కుంఫిణీ వారియాజ్ఞ యీ ప్రాంతములలో కలిగిన వెనుక నడక్కుమీద యిట్లా ఘాతలు నడవలేదు. యిప్పుడేమో ఆరంభమయినదని వ్యసనపడుకొన్నారు. రీమాలో ఒక మనిషి జబ్బల్‌పూరు యేజెంటుకు రీమా అకుబర్లు (సమాచారములు) వ్రాస్తూ మిరిజాపురము వరకు తపాలు హరకారాల విచారణ కూడా చేస్తూ వున్నాడు. అతనితో స్నేహము చేసుకొని మిరిజాపురము దాకా తపాలు మనుష్యులు కూడావచ్చేటట్టు చేసుకొన్నాను. యీ వూరిలో ఈ రాత్రి పగలున్నూ వసించడమయినది. అన్ని పదార్థాలు దొరికినవి. చిన్న వూరు. జనవసతి కద్దు. గుంటగట్టున డేరాలు వేయించినాను.

౨౯ తేది ఉదయాన ౪ ఘంటలకు లేచి యిక్కడికి ౫ కోసుల దూరములో వుండే మాగంజు అనే వూరు ౯ ఘంటలకు చేరినాను. మధ్యనున్న ఊళ్లు నెం ౧౭. లవరుటిలావు ౧- మాగంజు -౧- దారి నిన్నటివలెనే వున్నది. శిలానాలా అనే వాగు ఒకటి దాటవలసినది. యింకా కొన్ని వాగులు దాటవలెను. శిలానాలా మొదలుగా శాలగా దారికి యిరుపక్కల కొన్ని చెట్లు పెట్టి వున్నవి. నిన్నటి మజిలీ మొదలుగా భూమి చెన్నపట్టణము చుట్టూ వుండే భూమివలెనే కలిమెడు చల్లితే తూమెడు పండే సాటి చవుడు కలిసిన రేగడగా వున్నది. అందుకు తగ్గట్టే యీ భూమి నివాసస్థులు సందిళ్లు చెక్కిళ్లు చిక్కి స్వల్పగాత్రులయి వున్నారు. యీ మాగంజు అనే వూరు మాగంజు ఠాకూరు రాజధాని. యిప్పటి రాజు పేరు అనిరుద్ధసింగు. సెంగెరు అనే

క్షత్రియజాతి. వీని రాజ్యము సాలుకు లక్షరూపాయలు యెత్తేది. యితడు రీమారాజుకు సాలుకు ౧౨౫౦౦ రూపాయలు కట్టేవాడు. కొన్ని సంవత్సరముల రూకలు కట్టకపోయి బలహీనుడయి నందున రీమారాజు మూడు సంవత్సరములుగా రాజ్యమును జప్తు చేసికొని దినానికి ౫ రూపాయలు లెక్క యీ రాజుకు బత్యఖరుచుకు యిస్తూ వున్నాడు. ఈ వూరు బస్తీ అయినది గనుక సకల పదార్థాలు దొరుకును. జలవసతి గలది గనుక సుందరమయిన తామరకొలను వొడ్డున డేరాలు వేయించి దిగి యీ రాత్రి పగలున్ను యిక్కడ వసించినాను.



## తొమ్మిదవ ప్రకరణము

౨౬ తేది ఉదయాన ౪ ఘంటలకు లేచి యిక్కడికి ౬. కోసుల దూరములో వుండే హనుమాన్యా అనేవూరు ౧౦ ఘంటలకు చేరినాను. మధ్య నున్న ఊళ్లు: నెం ౧౫. పటహారా ౧ - చావోనా ౧ - కటుకరి ౧ - బిజాలి ౧ - గురుమానది ౧. దారి నిన్నటివలెనే సడక్కు వేసిన దని పేరు పెట్టుకొని వున్నా యెరుపుధాతు రేగడకలది గనుక మనుష్యులకు నడవడములో కాళ్లు నిండా గుచ్చుకోలేదు. కొన్నితావులలో వాగులకు కాలువలకున్ను వారధులు కట్టినారు, గాని మన్ను వేసి శాలతో వాటిని సముముచేసిన వారుకారు. వరిపంట భూమి నిన్నటివలె సారవత్తయినది కాదని తోస్తున్నది. దారిలోవుండే కటుకరి అనేవూరు నిండా బస్తీ అయినది. సకల పదార్థాలున్ను దొరుకును. నేను దిగిన హనుమాన్యా అనే మజిలీ వూరు చిన్నదయినా దుకాణాలు విశాలములుగా వున్నవి. డేరాలు వేసి తీసే ప్రయాస లేకుండా వుండును గనుకనున్ను, చెరువుగుంటలు వసతి అయినవి లేనందుననున్ను, దుకాణాలలోనే దిగినాను. డాకు చౌకీ హరకారాల కుమ్మక్కువల్ల అన్ని పదార్థాలున్ను దొరికినవి.

మైహరు మొదలుగా నేను మజిలీ చేసే ప్రతివూళ్లోనున్ను జ్వరాలతో శానామంది హింసపడుచున్నారు. నా సోబతు కోరి వచ్చేవారికి అచ్చే గతిగా వున్నది. నా పరివారజనము సుమారు నూర్లమంది. వీరిలో

౧౫ మందికి జ్వరాలు తగిలి ప్రతిదినమున్ను మజిలీ చేసిన వెనక ఆసుపత్రిలో డాక్టరులు వరుసగా చికిత్స చేస్తూవచ్చేటట్టు నాడేరాలవద్ద వీరి కందరికిన్ని చికిత్స జరుగుచు వచ్చినది. యిదివరకు శ్రీరామకటాక్షముచేత అందరికి అనుకూలముగానే ఉన్నది. యీ వూరిలో యీ రాత్రి పగలున్నూ వసించడమయినది.

యింతకు ముందు నేను మజిలీ చేసిన సత్తిని అనేగ్రామమువద్ద నుంచి ప్రయాగకు సూటియయినదిగా నాల్గుమజిలీలతో చేరతగ్గదిగా ఒక దారి వున్నది. ఆ దారి అడ్డున్ను కొండ యెక్కుడు దిగుడు ప్రయాసయున్ను కలది. చెన్నపట్టణము వదిలి పెదపాళెమురాగానే ఒక గయావళి కలుసుకొనెను. వానిని వదిలించుకోను బహుకష్టమైనది. అలాగే వకగయావళి తిరువళ్లూరిలో కలిసి వదిలినాడు. కడపలో ఒక గయావళి తగిలి హయిదరాబాదు దాకా చెంగి చెంగి కూడావచ్చి వదిలి పోయినాడు. నాగపూరులో కొందరు తగిలి చేరనేరక వదిలినారు. రామటెంకిలో ఒక గంగాపుత్రుడు జబ్బల్‌పూరులో యిద్దరు ప్రయాగ వాళీలును యిద్దరు కాశీ తాణీ తెనుగు బ్రాంహ్మణులున్నూ తగిలి నా వద్ద చేగడము ప్రయాస అయినా మజిలీ మరు మజిలీగా నాతో కూడా వస్తున్నారు. యీ రాత్రి పగలున్న ఈ వూరిలో వసించినాను.

౨౭ తేది ౮ ఘంటలవరకు పయిమజిలీ వూరిలోనే వుండి ఆ వూళ్లో యింటింట చలిజ్వరాలతో మనుష్యులు బాధపడుతారని తెలిసినందున యెండను లక్ష్యపెట్టకుండా బయలుదేరి యిక్కడికి ౭ కోసుల దూరములోనుండే కటారి అనిన్ని దర్మ్మాగంజు అనిన్ని ద్వినామమయిన వూరు ౧ ఘంటకు చేరినాను. హనుమాన్యా విడిచినది మొదలుగా కటారిఅనేవూరు చేరేవరకు కొండ కొంచెముగా యెక్కి నిండా దిగుతూ రావలసినది. యీ దినము దారి యావత్తు కొండమీద అడివిమధ్యే నడుస్తూ రావలసినది. మృగభయము విస్తారము గనుక కూడావున్న తుపాకీలను నా జవానులు కాలుస్తూ వచ్చినారు. ఆ ధ్వనికి వృక్షాలుకూడా అదురును గనుక మృగభయము మాకు యేమాత్రమున్ను లేక వుండినది. పూర్వకాలమందు ఈ హనుమాన్యావూరినుంచి కటారి అనే వూరికి రావడానికి మనుష్యులు

కష్టపడి నడిచేపాటిగా ఆకొండల మధ్యే ఒకచిన్నదారి వుండినది. యీ రాజ్యములో యింగిలీషువారి అధికార మయిన వెనక యీ కొండను కొట్టి దారియేర్పరచి యేడుతిరుగుళ్ళుగా దిగడానికి యెక్కడానికిన్ని బండ్లకు కూడా ప్రయాసలేకుండా వుండేటట్టు చేసి నారు. యీ దినము నడిచిన దారి రాతిగొట్టు వొకటే ప్రయాస గాని కడమ అన్నివిధాల అనుకూలముగా నున్నది. నేడు నడిచిన ౭ కోసులమధ్యే ఉదక వసతి యే మాత్రమున్ను లేదు. తపాలు మనుష్యులుకూడా వేసంగి కాలములో ఉదకము కూడాతీసుకొని వస్తూ పోతూవుంటారు. కొందరు ముసాఫరులు వేసంగికాలములో దారిలో ఉదకము దొరకనందున దాహమును వోర్చుకొనలేక ప్రాణములు వదిలి నారట. గనుక యీ యేడు కోసులున్ను చల్లనివేళ నడవ వలెను. యీ వూరు కొత్తగా బస్తీ అయినది. అంగళ్ళు మొదలయినవి వసతిగా కట్టివున్నవి. దగ్గిర ఒక నదివున్నది; బావులుకలవు. పశువులు మొదలయినవి నిలవడానికి వూరిముందర ఒక మర్రి చెట్టు తప్ప వేరే ఆసరాలేదు. ముసాఫరులకు కావలసిన పదార్థాలు దొరుకును. యిక్కడ మరునాడు మధ్యాహ్న పర్యంతము నిలిచినాను.

౨౮ తేది మధ్యాహ్నము మీద రెండు ఘంటలకు యీవూరు వదిలి యిక్కడికి ౭ కోసుల దూరములో నుండే లాలుగంజు అనేవూరు రాత్రి ౭ ఘంటలకు చేరినాను, దారిలో మూడునదులు దాటవలెను. వాటికి వారధులు కట్టడానికి కుంఫిణీవారు యత్నపడుచునున్నారు. సడకు్కవేసి యున్నదని పేరేగాని నడిచేవారికి అనుకూలముగా ఘట్టన చేసి యుండలేదు. దారి మయిదానము మధ్యే పోవుచున్నది. దారిలో బరోడా అనేవూరున్ను మరికొన్ని చిన్నవూళ్లున్ను వున్నవి. యీ లాలు గంజులో డాకా అనే దొంగసమూహాల భయముచేత కుంఫిణీవారు ముసాఫరులను దుకాణాలలో, ఇతరస్థలాలలోనున్ను రాత్రి దిగకుండా చేసి సరాయి అనే ఒక పెద్దచావడి నాల్గు పక్కలా ప్రహారీగోడ పెట్టి ఆగోడ ఆసరాచేసి చుట్టూ కొట్టాయి వేసి ఆ కొట్టాయిని అరలరలుగా వుంచి రెండు దరవాజాలు పెట్టి, కావలికి ౨౫ తాణాజవానులను వుంచి నారు. రాత్రి ౧౦ ఘంటలకు ఈ సరాయితలుపులు బిగించి బీగాలు

వేస్తారు. వెలుతురుఅయ్యేదాకా సామాన్యుల నిమిత్తము తలుపులు తెరవరు. ఈలోగా లోపలనుండే మనుష్యులకు దేహబాధ శానాగా వుంటున్నది. యీ వూరిలో సకలపదార్థాలు దొరుకును బస్తీ అయినదేను. యీ రాత్రి యీ సరాయిలోనే వసించినాను.

౨౯ వ తేది ఉదయాన ౬ ఘంటలకు లేచి యిక్కడికి ౬ కోసుల దూరములోవుండే మిరిజాపూరు అనే గంగగట్టు షహరు ౧౨ ఘంటలకు ప్రవేశించి గంగా దర్శనము చేసి ఆనందించినాము. పరమాత్ముడు గంగానదిలో విస్తరించిన దీప్తితో ప్రతిఫలించి అనేక కోటి జనుల పాపములను వారి భక్తి ద్వారా పరిహరించి వారలను పావనులుగా జేసి యిష్టసిద్ధుల జేయుచున్నాడు గనుక ఆమహానదీ దర్శనాపేక్షితులయి వచ్చిన మాకు ఆ గంగాదర్శనము కావడములో వున్న తృప్తి వ్రాసితీరదు. నేటి దారి శానాదూరము రాతి పొర గనుక వేసిన సడక్కు చెదరకుండా పాంథులకు హితముగా వున్నది. కట్రా వద్ద కొండ దిగినట్టుగా యీ దినమున్ను ఒక చిన్న కొండ దిగవలసినది. ఆ కొండ దిగుడు బహు వయిపుగా కుంఫిణీవారు బండ్లు కూడా చులకనగా దిగేటట్టు కొండ కొట్టి దారి చేసినారు. యిది వింధ్యపర్వతము నుంచి దిగడమని తెలుసుకోవలసినది. దారిలో భగవాన్తలావు, తులసీతలావు అనే చిన్న వూళ్లు కొన్ని వున్నవి. దారి వెల్లడి గాని అడివిలేదు. ఆ కొండ యేమి కట్రావద్ద కొండ యేమి దిగే టప్పుడు కిందవుండే భూమిని మీదినుంచి చూస్తే వుండే శృంగారము అనుభవవేద్యము కాని వ్రాయశక్యము కాదు. దారిలో నాల్గు నదులు దాటవలెను. మయిహరు మొదలుగా దాటే నదులు పశ్చిమ వాహినులుగా కొన్ని ప్రవహిస్తూ వున్నవి.

యీ మిరిజాపూరు అనే వూరు గొప్ప షహరు. చెన్నపట్టణము వలెనే వీధులు తీర్చబడి అంగళ్లు యిండ్లు మొదలయినవి బహు సుందరముగా నున్ను, వున్నతముగా నున్ను, కట్టబడి యున్నవి. యీ హిందూస్తాని కంతా యిక్కడి పాత్రసామాగ్రీలు ప్రసిద్ధమయినది గనుక పాత్రసామానుచేసే కంచరవాండ్లు వెయ్యిక్కడపదాకా అహోరాత్రిళ్లు యీ వూళ్లో పనిచేస్తూవుంటారు.

గంగగుండా అనేక సరకులు కలకత్తా ఢిల్లి మొదలయిన స్థలములకు పోతూ వస్తూవుంచున్నవి గనుక ఒంటి కంభం పెద్ద పడవలు చిన్నపడవలున్ను సుమారు ౭౦౦ పురువులు సదా యీ మిరిజాపురము ఘాటున నిలిచివుంటున్నవి. యిక్కడి గంగలో నాల్గు స్నానఘట్టాలు బహుసుందరములుగా శివాలయాలు, అశ్వర్థాలు, మొదలయిన పావన వాటికలతో కట్టివున్నవి. యీ స్నాన ఘట్టాలలో యీ దేశపు బ్రాహ్మణులు ఘాటు వారనేవారు పందిళ్ళు వేసుకొని స్నానము చేయవచ్చే వారికి సంకల్పము చెప్పి వారి వస్త్రములను కాపాడి, వారు వారు లలాటమందు వుంచుకోవడానికి గోపీచందనము స్త్రీలకు సిందూరము మొదలయినవి జాగ్రత్తచేసుకొని కూచుండి వుంటారు. యీ దేశస్థులు స్త్రీలు పురుషులున్ను స్నానముచేసి కాగానే మడుగుకు తెచ్చిన వస్త్రముమీద గంగ ప్రోక్షించి లలాట రేఖలు వుంచుకొని ఆఘాటు బ్రాహ్మణుల చేతిలో తాము చేసిన పాపమంతా యిచ్చి వేసినట్టు ఒక దుడ్డు ఒకదర్భ పవిత్రముతోకూడా ధారపోస్తారు. ప్రతి దినమున్ను శిరస్నానము చేయని ప్రాణి యీ పహరులో వున్నట్టు నాకు తోచలేదు. బందేఖానాలోవుండే ఖయిదీలుకూడా బంట్రోతుల కావలితో వుదయానవచ్చి స్నానముచేసి ఒక గుంపుగా వెళ్లిపోతారు. విటులుగావుండే స్త్రీలు పురుషులున్ను యెట్లా దేవాలయాలు ప్రబలించి వుండే ద్రావిడదేశములో దేవాలయాల ఉత్సవ విభవాల సాకుపెట్టుకొని వారి వారికి కలిగిన అలంకారములతో బయట వస్తారో తద్వత్తుగా గంగా స్నాన వ్యాజము పెట్టుకొని యిక్కడి విటులు వుదయాన అగత్యముగా జమఅవుతూ వచ్చుచున్నారు.

ఈ ప్రాంతములో స్థలమును శుద్ధిచేయవలిస్తే గంగాజలమునే ప్రోక్షించుచున్నారు. గోమయమును అపేక్షింపరు. గంగాజలమును యే జాతి మనిషిచేతనున్నా పరిశుద్ధమని గ్రహింపుచున్నాడు. ఇతర జలమును మాత్రము ఆలాగు గ్రహించరు. ద్రావిడదేశములో మడుగు వస్త్రములను మడి సంచులలో దర్భాసనములలోనున్ను పెట్టుకొని వస్తే పవిత్రము లనుకొని స్నానానంతరము యేలాగు యెత్తి కట్టుచున్నారో ఆలాగే యిచ్చటివారు మడుగు వస్త్రములను

చేతపట్టుకొని వచ్చి గట్టునవుంచి స్నానముచేసి తడిగుడ్డతో ఆ
వస్త్రముమీద గంగను ప్రోక్షించి యెత్తి కట్టుకొనుచున్నారు.
ద్రావిడ దేశస్థులకు గంగ పరమపావని యనే భక్తి కలిగియున్నా
మడిసంచిలో మడుగువస్త్రమును వుంచుకోవలెనన్న బుద్ధిపుట్టుచున్నది.
గాని యీ దేశస్థులవలె చేతపట్టుకొనిపోయి గంగాజలముచేత పవిత్ర
పరచే నమ్మికె పట్టుబడినదికాదు. మరిన్ని ద్రవిడదేశములో మడుగు
వస్త్రమును ఒక కొయ్యతో యెత్తుకొనివచ్చి నా తాడుకు కట్టి
ఆతాడు కొన పట్టుకొనివచ్చినా అది మడుగనే నమ్మికె కలిగియున్నది.
యీ దేశాచారభేదములను చూచి యోచించగా ఈ నియ
మాలంతా మనోబంధకాలే గాని వేరేకాదని రూఢిగా తోచుచు వచ్చు
చున్నవి.

ఇది మొదలు కుంఫిణీవారి రాజ్యము గనుక రహదారిలేక ఆయు
ధాలు పట్టనియ్యరు. ఇక్కడికి కాశి ౧౮కోసులు, ప్రయాగ ౨౨కోసులు;
వింధ్యవాసినీ స్థలము ౨ కోసులు. ఇక్కడ గంగాదర్శన మయినందున
క్షౌరము తీర్థోపవాసము హిరణ్యశ్రాద్ధము మొదలయిన పితృక్రియలు
చేసినాను. ఈ షహరులో అన్నివిధాల పనివాండ్లున్ను వున్నారు. అన్ని
పదార్థాలున్ను దొరుకును. నా పరిజనానికి చింతపండు మిరపకాయ
మొదలయిన ద్రవిడదేశపు వస్తువులుకూడా సమృద్ధిగా దొరికినవి.
అరిటిచెట్లుమాత్రము ఈ ప్రాంతములలో లేవు. యింగిలీషు దొరలు
గంగగట్టున యిండ్లుకట్టుకొనియున్నారు. ఈ షహరు చెన్నపట్టణమంత
వుండునని తోచుచున్నది. ఇక్కడి తమలపాకులు రామటెంకి తమల
పాకులకంటే బాగావున్నవి. నా పరిజనులకు జ్వరము నాశి అయ్యే
దాకా ఇక్కడవుండి ప్రతిదినమున్ను గంగాస్నానము చేయుచు వచ్చి
నాను. నర్మదానదికి ఇవతల వున్నమపోయిన పాడ్యమి మొదలుగా
మాసప్రవేశము గనుక ఇక్కడ నిన్న మొదలు కార్తీక మాసారంభ
మయినది. కృత్తికాస్నానాలు గంగలో ముఖ్యము గనుక జగదీశ్వ
రుడు నాకు గంగలో ఆ స్నానాలు కలిగేలాగు కటాక్షించినాడు.

౨౯ తేది మొదలు అకుటోబరు ౭ డో తేదివరకు మిరిజాపుర
ములో నివాసముచేసినాను. కూడావచ్చిన పరిజనములో ౨౦ కి చలి

జ్వరాలు తగిలినందున పదిహేనుమందికి నేను యిచ్చిన వాంతిభేది వాంతిమందులతో నున్ను బ్యారుకుపాడి లింగకట్టు మాత్రలతోనున్ను వాశిఅయినది. చెన్నపట్టణమునుంచి కూడావచ్చిన యొక కావటివాడు మాత్రము గంగతీరమందు దేహము చాలించినాడు. ఇంతకు లోగడ హైదరాబాదు దాటిన వెనక ఒక బంట్రోతు వాంతిభేదుల ఉపద్రవము అకస్మాత్తుగా తగిలి నావద్ద ఔషధాలు సేవించను అవకాశము చిక్కక చనిపోయినాడు. ఇప్పటికి నలుగురికి మాత్రము తేలికెగా చలిజ్వరములు తగులుచుండుటచేత వారినికూడా నడిపించుకొని ౯ వ తేది ఉదయమైన ౮ ఘంటలకు బయలువెళ్ళి యిక్కడి అధికారస్థులయిన గురుదాసుబాబు వగయిరాలతోకూడా యిక్కడికి ౨ కోసుల దూరములోవుండే వింధ్యవాసిని అనే దేవీక్షేత్రము ౧౦ ఘంటలకు చేరినాను.

మిరిజాపూరుపూరి తోటలు మొదలయినవి దాటి వెలిపడగానే గంగలోకలిసే వొక వాగు దాటవలసినది. ఆ వాగునీళ్ళు తీసిపోయినా రొంపివిస్తారము గనుక మోకాలుదాకా దిగబడుచు వుంటున్నది. అందువల్ల గంగలోనే పడవయెక్కి ఆ వాగు అవతలిగట్టు చేరవలసినది. దారి నడక్కు లేకపోయినా నడవడానికి తోటలపెరండ్ల మధ్య నున్నది గనుక వైపుగావున్నది. రేగడభూమి.

వింధ్యవాసిని వూరు గొప్పదే. అయితే వీధులు బహు కుసంది మిట్టలు పల్లాలుగా వుంటున్నవి. యీ దేవిని పూజచేశేవారు పండ్యావాండ్లనే బ్రాహ్మణులు. ఇక్కడి బ్రాహ్మణులు పంచగౌడులతో చేరినవారు. కన్యాకుబ్జు లనిన్ని, సర్వర్యులనిన్ని, గౌడులనిన్ని, సారస్వతులనిన్ని, మైధిలులనిన్ని, అయిదు తెగలుగా నున్నారు. అందులో యీ పండ్యాలకు కన్యాకుబ్జులనిపేరు. వీరే కనోజా లనబడుదురు. మన దేశములోను బ్రాహ్మణులు పంచద్రావిళ్ళని యెట్లా చీలియున్నారో, అదేరీతిగా ఈ దేశాన్ని యీ పంచగౌడులున్ను భాగించుకొని యున్నారని తెలుసుకోవలసినది. మన దేశములో పంచద్రావిళ్ళవయిన మేమంటే ఆంధ్రులు, ద్రావిళ్ళు, మహారాష్ట్రులు, కర్ణాటకులు, ఘూర్జరులున్నని తెలిసేది.వీరి దేశవిభాగాలు తెలిసియున్నవిగదా. యీ అయిదు తెగల

వారికి ఆచారవ్యవహారాలు భేదించి వుండేటట్టు యీ దేశపు పంచ గౌడులకున్ను భేదించియున్నది.

యీ పండ్యాలలో యెవడు ముందర యాత్రవారిని కనుక్కుంటే వారికి వారు యీ దేవీస్థలములో ముఖ్యాశ్రితులయి యాత్రవారు దేవీ విషయముగా యిచ్చే వస్త్రాభరణ దక్షిణలు మొదలయినవి యావత్తున్ను తీసుకొని అనుభవిస్తారు గనుక నేను మిరిజాపురము చేరగానే నన్ను అనుసరించ వచ్చిన పండ్యాలను లెక్క పెట్టను శక్తి లేదనుకోవలసినది. గురుదాసుబాబు పండ్యాను నేను నిష్కర్ష చేసుకొని యీ స్థలములోనుండే రామనగరపు రాజు వుదయనారాయణ తోట బంగాళాలో దిగినాను. యీ తోట సకల ఫల వృక్షాలతో శాలలు తీర్చబడి బహు సుందరముగా గంగాతీరమం దున్నది. అందులో గంగవొడ్డుగా రమణీయమైన బంగాళా కట్టియున్నది. వంటకున్ను పరిజనానికిన్ని చుట్టూ ఆవరణాలు యేర్పరచియున్నవి.

యీ మహాస్థలములో రెండు తామస మహోత్సవాలు చైత్రశుద్ధములోను, ఆశ్వీజ శుద్ధములోనున్ను, జరిగి అందుకు లక్షో పలక్షు ప్రజలు వస్తున్నారు. దేవి ప్రీతిగా బలియిచ్చే సన్న జీవాలు లెక్కపెట్టను ఒకరికిన్ని తరము కాదు కనుక ఆపది దినములలో సంహారమయ్యే జీవాలంతా ఒక మిరాశి దారుని చేతిగుండా సమాప్తి కావలసినది గనుక వానికి అజము ౧కి వచ్చే ఒక పయిసా రుసుము ప్రకారము దినానికి, ౨౫-౩౦ వరకుబాదు రూపాయిలు వస్తూ వుంటున్నవి. అనేకులు యీ స్థలములో పునశ్చరణచేసి యిష్టసిద్ధిని పొందినారు.

యీ స్థలములో మూడు శక్తులు వసిస్తున్నవి. వాటికి యోగ మాయా, భోగమాయా, కాళీ, అనే పేళ్ళుకలిగియున్నవి. యీ భోగమాయ ప్రతిదినము అయ్యే పూజా నైవేద్యాలను మిక్కుటముగా వూరికి సమీపమున వుండుకొని పరిగ్రహింపు చున్నది. అక్కడికి రెండుకోసుల దూరములో పర్వతముమీద యోగమాయా అనిన్ని, అష్టభుజీ అనిన్ని పేరుగలిగిన శక్తి వసించి యున్నది. అక్కడికి సమీపము గానే ఒక పక్క కాళి అనే శక్తి వసించి యున్నది. యీ బలిప్రదా

నాలు యేమి వున్నా కాళీ సన్నిధానమందు జరిగిస్తారు. పునశ్చరణలు యోగమాయ సన్నిధానమందు చేస్తారు. రాజోపచార పూజలు భోగమాయ ముందుగా జరుగుచున్నవి. గుడి చిన్నది గాని ప్రసిద్ధికి తగ్గ బాహుళ్యముగలది కాదు.

యీ స్థల మాహాత్మ్య మేమంటే యశోదాగర్భజనిత యయిన యోగమాయ కంసునివలన తప్పించుకొని యీ పర్వతముమీద వసించి పిమ్మట శ్రీకృష్ణమూర్తిచేత సంహారింపబడక నిలిచిన రాక్షసులను జంపుటకై దేవతల ప్రార్థనచేత మహాకాళీరూపము ధరించి భూభారాన్ని మాన్పి మళ్ళీ సాంబమూర్తి సన్నిధాన ప్రాప్తిని గురించిన అపేక్షచేత ఆ ఉగ్రస్వరూపము వదిలి భోగశక్తి అయినట్టు చెప్పుచున్నారు.

యీ వింధ్యవాసినీ మాహాత్మ్య మేమంటే యిటీవలనే కాశిలోనుంచి ఒక పురుషుడు తెచ్చి ఈ స్థలములో ప్రసిద్ధి చేసినాడు: ఈ వింధ్యవాసినికి సమీపమందు రామగయ అనే ఒక ప్రదేశ మున్నది. అక్కడ పిండప్రదానాలు ముఖ్య మనిన్ని, యీ వింధ్యవాసినీ క్షేత్రముయొక్క పంచక్రోశము ముక్తప్రద మనిన్ని, యీ స్థల పురాణప్రసిద్ధము. ఈ శక్తికి నా వంటి వారు ఆరాధన చేయించ వలసితే వస్త్రమున్ను అంగుళీయకమున్ను వెండి చిన్న మధుపర్క పాత్రయున్ను యివి మొదలయినవి అగత్యముగా ఇయ్యవలసినవి. బ్రాహ్మణభోజనము చేయించడమని ఒక సంప్రదాయము ఇక్కడ కలదు. అది యేలాగంటే మిఠాయివాండ్లను పిలిచి కచ్చూరసూయి అనే పూరీలు చేయించి దూదుఫేడాలు బరిఫీలు బత్తాసాలు తీసి ఈ పండ్యాబ్రాహ్మణులకు ఆకులు వేసి వడ్డిస్తే మనము దిగివుండే తావుకువచ్చి తింటున్నారు. గట్టిపెరుగుకూడా వడ్డించవలసినది. మనిషికి ఒక కొత్త పిడత దాహము పుచ్చుకోవడానికి తీసి యివ్వవలసినది. నూటికి సుమారు ౨౦ రూపాయిలు పట్టుచున్నది. భోజనానంతరము ఒక పట్టి తాంబూలము రెండేసి అణాలు ఇస్తే ఆనందింపుచున్నారు.

ఈ దేవిని వారు తాకి పూజచేయవచ్చును గనుక నా

పురోహితునిచేత మన దేశాచారప్రకారము శ్రీ సూక్తప్రకారముగా యథోచితముగా షోడశోపచార పూజ చేయించి కుంకుమతోను, పుష్పాలతోనున్ను, అర్చన చేయించినాను. పూజాకాలమందు అయిన నా మంత్రోచ్చారణలు బాగావున్నవని యిక్కడివారు ఆనందించినారు. ఆ దేవీ నివేదనానికి గుడికి తీసుకపోయిన పదార్థాలు మళ్లీ బయిటికి తేనియ్యరు. బ్రాహ్మణభోజనాని కని చేయించే పదార్థాలు విడిదిలోవుంచి మితముగా నివేదనార్థమై గుడికి తీసుకపోవలసినది. యీ వూరిలో బజారు వీధి వున్నది. సకల పదార్థాలు దొరుకును. ఈ పండ్యాలు వెయ్యింటిదాకా వుంటారు. వీరుగాక యాచకులు అనేకులు గలరు. యీ మహాస్థలములో యీ రాత్రి వసించినాను.

౯ తేదీ ఉదయాన ౫ ఘంటలకు లేచి యిక్కడికి ౪ కోసుల దూరములో వుండే గోపీగంజు అనేవూరు ౧౧ ఘంటలకు చేరినాను. వింధ్యవాసిని వూరిముందరనే గంగదాటవలసినది. దానికి సడక్కు లేదు; పాలరేగడభూమి. అడుగడుగుకు వూళ్ళు కలవు. మెరకపయిరు భూమి. యిక్కడ గంగ దాటే తావున ఒక పెద్దవాగు గంగలో వచ్చి కలుస్తున్నది. యీ వాగు వొడ్డుగానే కొంతదూరము దాటిన వెనక బాట పోవుచున్నది. యీ గోపీగంజు అనేవూరు రామనగరపు రాజుది. యీ వూళ్లో ముసాఫరులు దిగడానకు ఒక సరాయి కట్టియున్నది. యిదిగాక యీ రాజుకింది తాశ్శీలుదారుడు ఒక గుంటతోవ్వి ఒక బంగాళా కట్టి దానిచుట్టూ సరాయిచట్టముగా అరలు కట్టినాడు. నేను అక్కడ దిగినాను. యిది మొదలుగా హిందుస్తాను తుదవరకు అక్కడక్కడ సరాయీలు కట్టి వున్నదట. ఆ సరాయీలకు తురకలేగాని యితరులు ఖావందులు కాకూడదట. అందుకు పాదుషా హుకుము వున్నదట! యీ సరాయీలు కల తురకలు, దిగే మనుష్యులవద్ద వర్షాకాలములో ఎక్కువగానున్ను, ఎండాకాలములో తక్కువగానున్ను, మనిషికి సుమారు ఒకటి రెండు పయిసాలవంతున బాడిగె పుచ్చుకుంటారు. యీ సరాయీలు లాలుగంజులో వుండే సరాయివలెనే కట్టియున్నవి. సర్కారుతరఫున రాత్రిళ్ళు యిక్కడ యిద్దరేసి ఠాణావాండ్లు పారాయిస్తూ వుంటారు. యీ గోపీగంజు

గొప్పవూరు. సకలపదార్థాలు ముసాఫరులకు కావలసినవి దొరుకును.

యీవూరిముందర ఒక గుంటవద్ద నేను దిగినంతలో ఒక సమూహాముగా స్త్రీలు పురుషులున్ను సుమారు యిన్నూటిదాకా ఒక చెట్టు నీడలో నిశ్శబ్దముగా కూచుండి ఒక పురుషుణ్ణి సమూహామధ్యే వున్న ఆసనము మీద కూచుండబెట్టి వాడు చదివిచెప్పే అర్థాన్ని వింటూ వున్నారు. ఏమని విచారించగా భాగవత గ్రంథ కాలక్షేపము జరిగేటట్టు తెలిసినది. యిదేప్రకారము మిరిజాపూరులోను జరిగేటట్టు వినివున్నాను. ఇంతసమూహాములో ఒకరయినా యిన్ని పల్లకీల గుంపుతో వచ్చి నన్ను తిరిగి చూచినవారు కారు. తదేక ధ్యానముగా పురాణశ్రవణమే చేస్తూ వచ్చినారు. యింత యెండలో నియమముగా ఉపవాసముతో చిత్తాన్ని తదేకాగ్రముగా వుంచి భగవత్కథాశ్రవణము చేసే క్రమములో నిశ్చలమయిన మనస్సు కలవారికి ఉత్సవ విభవాలు జరిగే దేవాలయాలు భక్త్యాకర్షణ నిమిత్తమయి యేమి జరూరు? అందునుంచే శీతభూమిని నివసించే వారికి యథోచితమయిన చిత్తస్వాస్థ్యము కద్దని లోగడ నేను వ్రాసిన ప్రకారము, ఈ దేశములో ఉత్సవవిభవాలు జరిగే దేవాలయాలు విశేష ధనవ్రయాలుచేసి పూర్వీకులు కట్టినవారుకారు. తదనుసారముగా యిప్పటివారున్ను కట్ట నిచ్ఛయించిన వారు కారని తోచుచున్నది. యీ వూళ్లో యీ రాత్రి పగలున్ను వసించడ మయినది.

౧౦ తేది ఉదయాత్పూర్వము 3 ఘంటలకు లేచి యిక్కడికి ౬ కోసుల దూరములోవుండే అండ్యాసరాయి అనే వూరు 3 ఘంటలకు చేరినాను. దారి రమణీయమయిన సడక్కువేసి కాలువలకు పూలు (వంతెన) అనే వారధులు కట్టి మయిలుకు వక రాయి వంతున కుంఫిణీవారు రాళ్లు వేసినారు. గులక లేకపోయినా ఘట్టన బాగా పడివున్నది యీ సడక్కు ప్రయాగకున్ను కాశికిన్ని వేసి వున్నది. యీ గోపీగంజు మొదలు యిదే ప్రకారము కాశీవరకు సడక్కు వేసి వున్నదట. జబ్బల్‌పూరు వదిలినవెనక యెండలు కొంచెము కొంచెముగా తీవ్రములు అవుచు వచ్చి మిరిజాపురము చేరేటప్పటికి పడమటిగాలితో సమేతముగా అతితీవ్రము లయినవి. ౯ ఘంటలమీాద

వూరినుంచి ౫౦౫ దాకే టప్పుడు ప్రవాహము తీసి వుండేయిట్టికాలాలలో నడమ మిట్ట పెట్టి వుంటున్నది గనుక నడమ పడవదిగి మిట్టకవతల మళ్లీ పడవ యెక్కి ప్రయాగలో దిగవలసినది. రెండుమాట్లు యెక్కి దిగే ప్రయాస లేకుండా యీవూరినుంచే యమునానదిలో నా పడవలు పొయ్యేటట్టు చేసి ఒకసారిగానే ప్రయాగలో పెరిమిట్టు ఘాటులో దిగినాను. యిక్కడ మనిషి ౧కి పయిసా వంతున ఘాటుసుంకము పడవ దాటడానికి యియ్యవలసినది. యీ ఘాటుసుంకము సాలుకు ౨౬౦౦౦ రూపాయలు లెక్క యిజారాకు యిచ్చివున్నారు. ౧౨ ఘంటలకు త్రివేణి దర్శనముచేసి స్నానతర్పణాదులు చేసుకోవడమయినది.

యీ ప్రయాగ మాహాత్మ్యమేమంటే జగత్సృష్టికి ముందు పరమాత్ముడు బాలరూపాన్ని ధరించి యీ స్థళమందున్న అక్షయవటపర్ణముమీద వసించి వుండినాడు. యీ మూలవటము యెన్నటికి క్షయమును పొందనిది గనుక అక్షయవట మనే నామము కలిగినది. ఈ అక్షయవటమే బ్రహ్మస్వరూపమని పురాణసిద్ధము. పిమ్మట జగత్సృష్టి అయిన వెనకకూడా ఈ అక్షయవటము సువర్ణమయమై బహుకాలము శోభిస్తూ వుండినది. మాధవమూర్తి కూడా యీ వటవృక్షాన్ని అనుసరించి యిక్కడ విరాజమానుడయి వున్నందున యీ స్థళము బహు పుణ్యస్థల మయినది. తద్ద్వారా యీ పుణ్యస్థలములో చేశే సుకర్మాలు అక్షయఫలప్రదము లౌననే తాత్పర్యముతో పూర్వము బ్రహ్మ యిక్కడ దశాశ్వమేధాలు జేసినాడు. ఆ ప్రదేశము యిప్పటికి యిక్కడ దశాశ్వమేధఘట్ట మని ప్రసిద్ధి పడి వున్నది. ఈ దశాశ్వమేధాలు చేసినంతలో మాధవమూర్తి బ్రహ్మకు ప్రసన్నుడయి యిచ్ఛయించిన వరమిస్తానని వాగ్దత్తము చేసినాడు. గనుక బ్రహ్మ యీ మహాస్థలము విష్ణు క్షేత్రమని యిదివరకు ప్రసిద్ధమై యున్నది కదా; యికమీద నా పేరుకూడా యీ స్థళానికి సంబంధించి వుండేటట్టు చేయవలెనని ప్రార్థించినాడు. మాధవమూర్తి అదేప్రకారము కటాక్షించి యికను లోకులు యీ క్షేత్రాన్ని విష్ణు ప్రజాపతి క్షేత్ర మన్ని వాడుకుందురుగాకా అని నియమించినాడు. అది మొదలుగా యీ స్థళాన్ని విష్ణుప్రజాపతి క్షేత్రమని వాడు కుంటున్నారు.

యిట్లా వుండగా సూర్యభగవానుడు ఛాయాదేవికి గర్భోత్పత్తి అయ్యేటట్టు చేసెను. తదనంతరము ఆమె తపస్సు చేస్తూ వుండెను. మళ్ళీసూర్యుడు ఆమెతో సంగమము యిచ్ఛయించి నంతలో ఆమెగర్భావస్థలో సంగమము విధివ్యతిరిక్తమని సమీపానికి రాక పోయినది. సూర్యుడు మోహావేశ యుక్తుడయి ఛాయాదేవి సమీపానికి వచ్చినాడు గనుక వెంబడిగానే అతని తేజోవేగానికి ఆమెగర్భము నిలవలేక విచ్ఛిత్తి అయిపోయినది. ఆ చొప్పున విచ్ఛిత్తి అయిన గర్భము కొంతమట్టుకు ఒక పిండాకృతిగా నున్ను కొంత వుదకముగా నున్ను స్రవించి సంమున ఛాయాదేవి సహితముగా సూర్యుడు విస్మయాన్ని పొందినాడు. వెంబడిగానే వారిరుద్రాదులు ప్రసన్నులయి రుద్రుడు తన శక్తిని ఆ పిండములో ఆవాహనచేసి యమధర్మరాజు అనే ఒక పురుషుణ్ణి ఆ పిండము ద్వారా వుత్పత్తిచేసి అతణ్ణి భూమిలో దక్షిణభాగమందు వుండేటట్టు నియమించి పాపులను విచారించి శిక్షించేటట్టు నియమించినాడు. విష్ణువు తత్ప్రతిగా స్రవించిన వుదకములో తన శక్తిని ఆవహింపచేసి యమునా అనే నామముతో ఒక స్త్రీని ఉత్పత్తిచేసి నదీరూపముతో భూమిలో లోకుల పాపాలను పోగొట్టుచు రమ్మని నియమించినాడు. అప్పుడు ఆ యమునా అనే స్త్రీ నదీస్వరూపముతో యీ పుణ్యక్షేత్రానికి ప్రవహించి వచ్చినది. యిక్కడ విరాజమానుడుగా వుండే మాధవమూర్తి ఆ స్త్రీ సౌందర్యము చూచి మోహితుడై భార్యగా వరించినాడు.

యిట్లుండగా రామాయణములో వివరించిన హేతువులచేత భగీరథుడు గంగను కూడా భూలోకమునకు తీసుకొని వస్తూవుండగా గంగ యీ క్షేత్రములో ప్రవేశించగానే యమునకు సమాచారము తెలిసి యెదురుకొని పోయి ఆరాధించి తనతో కూడా కలిసి ప్రవహించవలెనని ప్రార్థించినది. అందుకు గంగ చెప్పిన దేమంటే నీవు మహా ప్రసిద్ధురా లయితివే. నీతో కలిస్తే నా పేరే లేకపోనేమో అని సందేహించి నంతలో యమునానది గంగా సహవాసాపేక్షితురాలై యీ క్షేత్రము మొదలుగా నీవు నాతో కలిసి ప్రవహిస్తే పేరు నీదేను. నా ప్రవాహ స్వరూపము మాత్రము వేర్వగా వుండతగ్గదని

వరమిచ్చినందున గంగ యమునతో యిక్కడ సంగమమైనది. యీస్థలము యాగాలు చేయ నిశ్చయించిన బ్రహ్మదేవుడు మొదలుగాగల పెద్దలను ఆకర్షించుచు వచ్చినందున ప్రయాగ అనే పేరు యీస్థలానికి కలిగి నది. యీ ప్రయాగక్షేత్రములో గంగ యమునతో సంగమ మయి నది మొదలుగా సాగరసంగమ పర్యంతము రెండునదుల సమష్టి జలము ఒకపక్క యమునా సంబంధమైన నైల్యవర్ణము కలిగి గంగా అనే పేరుతో ప్రవహిస్తూ వున్నది.

యిట్లుండగా బ్రహ్మ అశ్వమేధాలు చేసిన వెనక యీ స్థలాన్ని స్తుతి చేయను మొదలుపెట్టి సమాప్తి చేయడానకు శక్తుడు గాకపోయెను. బ్రహ్మపుత్రి అయిన సరస్వతి నేను సమాప్తి చేయ గలను గాని నీచేత వచ్చునా యని స్తుతిచేయను ఉపక్రమించి ఉపసంహారము చేయను శక్తురాలు కాకుండా పోయి లజ్జితురా లయి వుండెను. యిట్లుండగా బడబుడు అనే ఒక రాక్షసుడు భూలోకమందు పుట్టి అతి క్షుత్తుచేత లోకాన్ని హింసిస్తూ వచ్చినం దున త్రిమూర్తులు లోకరక్షణార్థ మయి ఒకటిగా కూడి యోచన చేస్తు వున్నంతలో లజ్జితురాలయిన సరస్వతి యేసాకుచేత నయినా బ్రహ్మముఖము చూడక తప్పించుకొని పోవలెననే యిచ్ఛచేత నేను ఆ రాక్షసుని ఉపద్రవము జగత్తునకు లేకచేస్తున్నానని ప్రతిజ్ఞచేసి బ్రహ్మ లోకము వదిలి వారి అనుజ్ఞమీద భూలోకానికి వచ్చి అతి సుందర రూపముతో వీణాగానము చేస్తూ ఆ రాక్షసుని సన్నిధానానకు వచ్చి నది. ఆ రాక్షసుడు ఆమె సుందరాకృతికి మోహితుడయి క్షుద్బాధను కూడా సహించి కొంతసేపు లోకాన్ని ఉపద్రవ పెట్టనివాడయి సర స్వతిని చూచి నిన్ను వివాహము చేసుకోవలెనని మనసు వున్నదని చెప్పినాడు. ఇంత క్షుత్తుగల నిన్ను పెండ్లిఆడితే భోగాలకు సావకా శము వుండనేరదే! ఒకవేళ నీవు నన్ను భక్షించి వేతువనే భయమునాకు జనింపుచున్నది గనుక క్షుత్తు నివర్తించే పని ముందర విచారిస్తే వెనక వివాహసంగతి మాట్లాడు కొందామని సరస్వతి చెప్పెను. నాక్షుత్తు నివృత్తి అయ్యేమార్గము నీవే విచారించవలెనని ఆ రాక్షసుడు సరస్వతిని ప్రార్థించి నందున సరస్వతి బడబాసురుని మంచిదని వెంట

పెట్టుకొని సముద్రమధ్యే తెచ్చి సముద్రోదకాన్ని పానము చేయుము, నీ క్షుత్తుతీరిన వెనక వివాహము చేసుకుంటానని చెప్పెను. మంచిదని అద్యాపి బడబుడు అగ్నిస్వరూపముగా బడబాగ్ని యనే పేరు పెట్టుకుని సముద్రోదకాన్ని పానముచేస్తూ వున్నాడు.

యీ రీతిగా ఆ రాక్షసుణ్ణి నివృత్తి పొందించి నాకు కూడా సమాప్తి చేయను అశక్యమయిన స్తుతికి పాత్రీభూతమైన యీ ప్రయాగను కండ్ల చూతామని సరస్వతి యిక్కడికి వచ్చినది. ఆ సమాచారము గంగా యమునలకు తెలిసి సరస్వతిని ప్రార్థించి తమతో కూడా యీ స్థలమందు క్రీడింపుచు వుండవలెనని చెప్పినారు. సరస్వతి ధన్యురాల నయితి నని యెంచుకొని వారి ప్రార్థనను అంగీకరించి అయితే నేను ప్రకాశముగా మీతో క్రీడింపుచు నుంటే బ్రహ్మ యేమే సరస్వతి, ప్రయాగ మాహాత్మ్య స్తుతిని సమాప్తి చేయక పోతివని నన్ను అడుగును; అప్పుడు నేను మిక్కిలి లజ్జించ వలసి యుండును; గనుక గుప్తగామినై మీతో కూడా వుంటానని, అద్యాపి క్రీడింపుచు నున్నది. వారు ముగ్గురున్ను యీ రీతిగా యిక్కడ సంగమ మయినందున త్రివేణీ అనే మూడు పాయలు గల జడ అయినారు. ఈ త్రివేణికి పయిన వ్రాసిన అక్షయవటమనే వృక్షము కుచ్చుగా ప్రకాశింపు చున్నది. గంగ యమునతో సంగమ మయినది మొదలు లోకుల పాపాలను కత్రించను ఈ రెండు నదులు మంచి కత్తెర అనే ఆయుధముగా నున్నా ఆ కత్తెరకు నడుమ బిగించే చీల లేకున్నందున బలము తక్కువబడి వుండెను. ఈ సరస్వతి గుప్తగామినిగా ఆ చీల స్థానమును పొంది వున్నందున ఈ మూడు నదులున్నూ అది మొదలుగా లోకుల పాపాలను కత్రించను శక్తిగల చురుకయిన కత్తెర అయి త్రివేణి నామమును వహించి సదరహి ముగ్గురు స్త్రీలున్ను ఇచ్చట ఒక నదీరూపమును వహించి ప్రవహింపు చున్నారు.

ఇచ్చట క్షౌరము, గోదానము, త్రివేణీదానము, తిలదానము, కించిద్దానమనే ఉపాయ దానమున్ను, ముఖ్యములని చెప్పబడియున్నవి. ధైర్యముచేత ప్రాణదానము ఇచ్చట చేస్తే వాడు జన్మాంతరమందు

దారి నడవ కూడలేదు. మిరిజాపురము మొదలుగా భూమి పాలరేగడ గనుక భూమియెండి మనుష్యుల పాదఘట్టన అయ్యే కొద్ది గంధపొడి కన్నా సన్నమయిన యొక దినుసు ధూళి ఉత్పత్తి అయి మనుష్యులకు బహు ప్రియాసగా వుంటున్నది. మిరిజాపురము మొదలు యిక్కడ చెప్పే కోసులు మన దేశపు కోసులో ముక్కాలుకు తక్కువగా వుంటున్నది. యీ అండ్యాసరాయి అనేవూరు నాలుగు భాగములుగా నాల్గు పక్కలా కట్టి వున్నది. అన్నిపదార్థాలు దొరుకును. నేను సరాయిలో దిగినాను. జలవసతి కద్దు. గుంటలవద్ద చెట్ల నీడ బాగాలేదు. ఈ వూరిలో యీ రాత్రి నిలిచినాను.

౧౧ తేది ఉదయాత్పూర్వము ౩౪ ఘంటలకులేచి యిక్కడికి ౬: కోసులదూరములో వుండే జూసీసరాయి అనే వూరు ౮ ఘంటలకు చేరినాను. దారి నిన్నటివలెనే నడక్కు వేసి మయిలు రాళ్ళు వేసి వున్నవి. వర్షాకాలములో మన్ను పాలరేగడ గనుక యెంత ఘట్టన పడి మనుష్యుల పాద ఘట్టన బండ్ల రాపుడు విస్తారమయి వుండి నప్పటికిన్ని కాళ్ళు ఒక మాత్రిముగా దిగబడుతూ వచ్చునని తోచుచున్నది. మిరిజాపూరు మొదలు వూళ్ళు బహు దగ్గిర దగ్గిరగా దారిలో వుంటూ వచ్చినందున అనేక చిన్న గ్రామాల పేళ్లు వ్రాయడము విస్తరిస్తున్నదని వ్రాయలేదు. వింధ్యవాసిని కొండ అదృశ్యమయిన వెనకను చూపు మేరలో యెక్కడా కొండలు అగుపడడములేదు.

యీ జూసీసరాయి అనే ఊరు గొప్పది. గంగవొడ్డున వున్నది. గనుక గంగకు అటు పక్క వుండే ప్రియాగకోట ఊరున్ను, త్రివేణీ సంగమమున్ను, తెలుస్తూ వుంచున్నది. యిక్కడ గంగ దక్షిణ వాహిని. యమున కలియని శుద్ధగంగలో యీ వూరి ఘాటువద్ద స్నానము చేయ వచ్చును. యీ ఘాటున మళ్లీ గంగదాటి ప్రియాగ చేరవలసినది. యిక్కడ గంగ కోసెడు దూరము వెడల్పు కలిగి వున్నది. ప్రవాహ వేగము బహు విస్తారము. గంగ ప్రవహించే దేశము. ఇక్కడ అభ్రిక సంబంధమయిన భూమి గనుక గంగాజలము మెరుస్తూ వున్నది. ఈ వూరిలో ముసాఫరు లాయఖు పదార్థము లన్ని దొరుకు చున్నవి.

వూరినుంచి ౧౦౧ దాటేటప్పుడు ప్రవాహము తీసి వుండేయిట్టికాలాలలో నడమ మిట్ట పెట్టి వుంటున్నది గనుక నడమ పడవదిగి మిట్టకవతల మళ్లీ పడవ యెక్కి ప్రయాగలో దిగవలసినది. రెండుమాట్లు యెక్కి దిగే ప్రయాస లేకుండా యీవూరినుంచే యమునానదిలో నా పడవలు పొయ్యేటట్టు చేసి ఒకసారిగానే ప్రయాగలో పెరిమిట్టు ఘాటులో దిగినాను. యిక్కడ మనిషి ౧కి పయిసా వంతున ఘాటుసుంకము పడవ దాటడానికి యియ్యవలసినది. యీ ఘాటుసుంకము సాలుకు ౨౬౦౦౦ రూపాయలు లెక్క యిజారాకు యిచ్చివున్నారు. ౧౨ ఘంటలకు త్రివేణి దర్శనముచేసి స్నానతర్పణాదులు చేసుకోవడమయినది.

యీ ప్రయాగ మాహాత్మ్యమేమంటే జగత్సృష్టికి ముందు పరమాత్ముడు బాలరూపాన్ని ధరించి యీ స్థళమందున్న అక్షయవటపర్ణము మీదనసించి వుండినాడు. యీ మూలవటము యెన్నటికి క్షయమును పొందనిది గనుక అక్షయవట మనే నామము కలిగినది. ఈ అక్షయవటమే బ్రహ్మస్వరూపమని పురాణసిద్ధము. పిమ్మట జగత్సృష్టి అయిన వెనకకూడా ఈ అక్షయవటము సువర్ణమయమై బహుకాలము శోభిస్తూ వుండినది. మాధవమూర్తి కూడా యీ వటవృక్షాన్ని అనుసరించి యిక్కడ విరాజమానుడయి వున్నందున యీ స్థళము బహు పుణ్యస్థల మయినది. తద్ద్వారా యీ పుణ్యస్థలములో చేశే సుకర్మాలు అక్షయఫలప్రదము లౌననే తాత్పర్యముతో పూర్వము బ్రహ్మ యిక్కడ దశాశ్వమేధాలు జేసినాడు. ఆ ప్రదేశము యిప్పటికి యిక్కడ దశాశ్వమేధఘట్ట మని ప్రసిద్ధి పడి వున్నది. ఈ దశాశ్వమేధాలు చేసినంతలో మాధవమూర్తి బ్రహ్మకు ప్రసన్నుడయి యిచ్ఛయించిన వరమిస్తానని వాగ్దత్తము చేసినాడు. గనుక బ్రహ్మ యీ మహాస్థలము విష్ణు క్షేత్రమని యిదివరకు ప్రసిద్ధమై యున్నది కదా; యికమీద నా పేరుకూడా యీ స్థళానికి సంబంధించి వుండేటట్టు చేయవలెనని ప్రార్థించినాడు. మాధవమూర్తి అదేప్రకారము కటాక్షించి యికను లోకులు యీ క్షేత్రాన్ని విష్ణు ప్రజాపతి క్షేత్ర మన్ని వాడుకుందురుగాకా అని నియమించినాడు. అది మొదలుగా యీ స్థళాన్ని విష్ణుప్రజాపతి క్షేత్రమని వాడు కుంటున్నారు.

యిట్లా వుండగా సూర్యభగవానుడు ఛాయాదేవికి గర్భోత్పత్తి అయ్యేటట్టు చేసెను. తదనంతరము ఆమె తపస్సు చేస్తూ వుండెను. మళ్లీసూర్యుడు ఆమెతో సంగమము యిచ్ఛయించి నంతలో ఆమెగర్భావస్థలో సంగమము విధివ్యతిరిక్తమని సమీపానికి రాక పోయినది. సూర్యుడు మోహావేశ యుక్తుడయి ఛాయాదేవి సమీపానికి వచ్చినాడు గనుక వెంబడిగానే అతని తేజోవేగానికి ఆమెగర్భము నిలవలేక విచ్ఛిత్తి అయిపోయినది. ఆ చొప్పున విచ్ఛిత్తి అయిన గర్భము కొంతమట్టుకు ఒక పిండాకృతిగా నున్ను కొంత వుదకముగా నున్ను స్రవించి నందున ఛాయాదేవి సహితముగా సూర్యుడు విస్మయాన్ని పొందినాడు. వెంబడిగానే హరిరుద్రాదులు ప్రసన్నులయి రుద్రుడు తన శక్తిని ఆ పిండములో ఆవాహనచేసి యమధర్మరాజు అనే ఒక పురుషుణ్ణి ఆ పిండము ద్వారా వుత్పత్తి చేసి అతణ్ణి భూమిలో దక్షిణభాగమందు వుండేటట్టు నీమించి పాపులను విచారించి శిక్షించేటట్టు నీమించినాడు. విష్ణువు తత్ప్రీతిగా స్రవించిన వుదకములో తన శక్తిని ఆవహింపచేసి యమునా అనే నామముతో ఒక స్త్రీని ఉత్పత్తి చేసి నదీరూపముతో భూమిలో లోకుల పాపాలను పోగొట్టుచు రమ్మని నీమించినాడు. అప్పుడు ఆ యమునా అనే స్త్రీ నదీ స్వరూపముతో యీ పుణ్యక్షేత్రానికి ప్రవహించి వచ్చినది. యిక్కడ విరాజమాన్యుడుగా వుండే మాధవమూర్తి ఆ స్త్రీ సౌందర్యము చూచి మోహితుడై భార్యగా వరించినాడు.

యిట్లుండగా రామాయణములో వివరించిన హేతువులచేత భగీరథుడు గంగను కూడా భూలోకమునకు తీసుకొని వస్తూవుండగా గంగ యీ క్షేత్రములో ప్రవేశించగానే యమునకు సమాచారము తెలిసి యెదురుకొని పోయి ఆరాధించి తనతో కూడా కలిసి ప్రవహించవలెనని ప్రార్థించినది. అందుకు గంగ చెప్పిన దేమంటే నీవు మహా ప్రసిద్ధురాలయితివే. నీతో కలిస్తే నా పేరే లేకపో నేమో అని సందేహించి నంతలో యమునానది గంగా సహవాసాపేక్షితురాలై యీ క్షేత్రము మొదలుగా నీవు నాతో కలిసి ప్రవహిస్తే పేరు నీ దేను. నా ప్రవాహ స్వరూపము మాత్రము వేరుగా వుండతగ్గదని

వరమిచ్చినందున గంగ యమునతో యిక్కడ సంగమమైనది. యీస్థలము యాగాలుచేయ నిశ్చయించిన బ్రహ్మదేవుడు మొదలుగాగల పెద్దలను ఆకర్షింపుచు వచ్చినందున ప్రయాగ అనే పేరు యీస్థలానికి కలిగినది. యీ ప్రయాగక్షేత్రములో గంగ యమునతో సంగమ మయినది మొదలుగా సాగరసంగమ పర్యంతము రెండునదుల సమష్టి జలము ఒకపక్క యమునా సంబంధమైన నైల్యవర్ణము కలిగి గంగా అనే పేరుతో ప్రవహిస్తూ వున్నది.

యిట్లుండగా బ్రహ్మ అశ్వమేధాలు చేసిన వెనక యీ స్థలాన్ని స్తుతి చేయను మొదలుపెట్టి సమాప్తి చేయడానకు శక్తుడు గాకపోయెను. బ్రహ్మపుత్రి అయిన సరస్వతి నేను సమాప్తి చేయగలను గాని నీచేత వచ్చునా యని స్తుతిచేయను ఉపక్రమించి ఉపసంహారము చేయను శక్తురాలు కాకుండా పోయి లజ్జితురాలయి వుండెను. యిట్లుండగా బడబుడు అనే ఒక రాక్షసుడు భూలోకమందు పుట్టి అతి క్షుత్తుచేత లోకాన్ని హింసిస్తూ వచ్చినందున త్రిమూర్తులు లోకరక్షణార్థ మయి ఒకటిగా కూడి యోచన చేస్తు వున్నంతలో లజ్జితురాలయిన సరస్వతి యేసాకుచేత నయినా బ్రహ్మముఖము చూడక తప్పించుకొని పోవలెననే యిచ్ఛచేత నేను ఆ రాక్షసుని ఉపద్రవము జగత్తునకు లేకచేస్తున్నానని ప్రతిజ్ఞచేసి బ్రహ్మలోకము వదిలి వారి అనుజ్ఞమీద భూలోకానికి వచ్చి అతి సుందర రూపముతో వీణాగానము చేస్తూ ఆ రాక్షసుని సన్నిధానానకు వచ్చినది. ఆ రాక్షసుడు ఆమె సుందరాకృతికి మోహితుడయి క్షుద్బాధను కూడా సహించి కొంతసేపు లోకాన్ని ఉపద్రవ పెట్టనివాడయి సరస్వతిని చూచి నిన్ను వివాహము చేసుకోవలెనని మనసు వున్నదని చెప్పినాడు. ఇంత క్షుత్తుగల నిన్ను పెండ్లిఆడితే భోగాలకు సావకాశము వుండనేరదే! ఒకవేళ నీవు నన్ను భక్షించివేతువనే భయమునాకు జనింపుచున్నది గనుక క్షుత్తు నివర్తించే పని ముందర విచారిస్తే వెనక వివాహసంగతి మాట్లాడుకొందామని సరస్వతి చెప్పెను. నాక్షుత్తు నివృత్తి అయ్యేమార్గము నీవే విచారించవలెనని ఆ రాక్షసుడు సరస్వతిని ప్రార్థించినందున సరస్వతి బడబాసురుని మంచిదని వెంట

పెట్టుకొని సముద్రమధ్యే తెచ్చి సముద్రోదకాన్ని పానము చేయుము, నీ క్షుత్తుతీరిన వెనక వివాహము చేసుకుంటానని చెప్పెను. మంచిదని అద్యాపి బడబుడు అగ్నిస్వరూపముగా బడబాగ్ని యనే పేరు పెట్టుకొని సముద్రోదకాన్ని పానముచేస్తూ వున్నాడు.

యీ రీతిగా ఆ రాక్షసుణ్ణి నివృత్తి పొందించి నాకు కూడా సమాప్తి చేయను అశక్యమయిన స్తుతికి పాత్రీభూతమైన యీ ప్రయాగను కండ్ల చూతామని సరస్వతి యిక్కడికి వచ్చినది. ఆ సమాచారము గంగా యమునలకు తెలిసి సరస్వతిని ప్రార్థించి తమతో కూడా యీ స్థలమందు క్రీడింపుచు వుండవలెనని చెప్పినారు. సరస్వతి ధన్యురాల నయితి నని యెంచుకొని వారి ప్రార్థనను అంగీకరించి అయితే నేను ప్రకాశముగా మీతో క్రీడింపుచు నుంటే బ్రహ్మ యేమే సరస్వతి, ప్రయాగ మాహాత్మ్య స్తుతిని సమాప్తి చేయక పోతివని నన్ను అడుగును; అప్పుడు నేను మిక్కిలి లజ్జించ వలసి యుండును; గనుక గుప్తగామినై మీతో కూడా వుంటానని, అద్యాపి క్రీడింపుచు నున్నది. వారు ముగ్గురున్ను యీ రీతిగా యిక్కడ సంగమ మయినందున త్రివేణీ అనే మూడు పాయలు గల జడ అయినారు. ఈ త్రివేణికి పయిన వ్రాసిన అక్షయవటమనే వృక్షము కుచ్చుగా ప్రకాశింపు చున్నది. గంగ యమునతో సంగమ మయినది మొదలు లోకుల పాపాలను కత్రించను ఈ రెండు నదులు మంచి కత్తెర అనే ఆయుధముగా నున్నా ఆ కత్తెరకు నడుమ బిగించే చీల లేకున్నందున బలము తక్కువబడి వుండెను. ఈ సరస్వతి గుప్తగామినిగా ఆ చీల స్థానమును పొంది వున్నందున ఈ మూడు నదులున్నూ అది మొదలుగా లోకుల పాపాలను కత్రించను శక్తిగల చురుకయిన కత్తెర అయి త్రివేణి నామమును వహించి సదరహి ముగ్గురు స్త్రీలున్ను ఇచ్చట ఒక నదీరూపమును వహించి ప్రవహింపు చున్నారు.

ఇచ్చట క్షౌరము, గోదానము, త్రివేణీదానము, తిలదానము, కించిద్దానమనే ఉపాయ దానమున్ను, ముఖ్యములని చెప్పబడియున్నవి. ధైర్యముచేత ప్రాణదానము ఇచ్చట చేస్తే వాడు జన్మాంతరమందు

ఇహసుఖమును కోరిన ప్రకారముగా అనుభవించి మళ్లీ యీ క్షేత్రమందే మరణము కలిగి అనంతల జన్మము లేకుండా ముక్తిని పొందునని పురాణమందు చెప్పబడియున్నది. యీ స్థలమాహాత్మ్యము ద్వాదశాధ్యాయములు గలది ఒకటిన్ని శతాధ్యాయములు గలది ఒకటిన్ని యిచ్చట శ్రవణము చేయబడుచు నున్నది. ఈ క్షేత్రమందు స్నానదానాలకు మకర మాసము ముఖ్యము. అప్పట్లో లక్షోపలక్ష ప్రజలు వచ్చి యాత్ర చేసుకొని పోతారు.

యిక్కడ స్వేచ్ఛా మరణము వల్ల యిష్ట సిద్ధిని జన్మాంతరములో పొందుటచేత ముచికుంద బ్రహ్మచారి అనే తపస్వి సార్వభౌమత్వము కోరినవాడై నడుము దాకా దేహాన్ని బద్దలుగా కోసి ఆహుతులు చేసి యిక్కడ దేహము చాలించినాడు. అతని శిష్యులు జన్మాంతరములో అతనికి పరిచారకులుగా వుండవలెననే ప్రార్థనతో ఆ హోమాగ్నిలో ధుమికి దేహాలు విడిచినారు. వీరి కందరికిన్ని జన్మాంతరములో పూర్వ జన్మజ్ఞానము వుండవలెననే ప్రార్థనకూడా వుండినందున యీ స్థల మాహాత్మ్యాన్ని ప్రస్తుతి చేసినట్టుగా యెనిమిది శ్లోకాలు వ్రాసి బొరుగులు వేయించి అమ్మే ఒక స్త్రీ వశముచేసి చనిపోయినారు గనుక ఆ బ్రహ్మచారి ఢిల్లికి అకుబరు పాదుషాగా నున్ను శిష్యులు మంత్రులుగా నున్ను అయిన వెనక జన్మాంతర జ్ఞానము వున్నందున మళ్ళీ ఈ స్థలానికి వచ్చి తాము శ్లోకాలు వ్రాసివుంచిన స్త్రీ బ్రతికివుండగా ఆపెవద్ద పూర్వము వ్రాసివుంచిన శ్లోకాలు తీసి చదువుకొని ఆశ్చర్యపడి స్వేచ్ఛామరణము కోరిన వారికి యిక్కడ అనుకూలముగా మెడయిస్తే త్రుటికాలములో అనాయాసముగా తెగకోసే యంత్రము ఒకటి వుండగా తమకు బాధగా వుండుననే వెర్రి తాత్పర్యముతో ఆ యంత్రాన్ని యెత్తి పారవేసి త్రివేణీ సంగమము వద్ద అత్యద్భుతమయిన కోట వకటి కట్టినారు. ఆ కోట యెంత ప్రవాహాలనున్ను ధిక్కరించి అత్యంత బలముగా యిదివరకు ఉన్నది.

ఆ సువర్ణాక్షయవటము కలి సామ్రాజ్యకాల మయినందున త్రివేణీసంగమము వద్ద వున్నా యిప్పట్లో అదృశ్యమయి యున్నది.

దానికి ప్రత్యామ్నాయముగా కోటలో ఒక నేలమాళిగెలో ప్రయాగేశ్వరుడు మొదలయిన లింగాలు బింబాలున్ను ఉండే తావున ఒక లావు మర్రికొమ్మను తెచ్చి యీ స్థళజ్ఞులు పాతివున్నారు. వాటిని లోకులు ఆరాధిస్తారు. "త్రివేణీ మాధవం సోమం భరద్వాజం చ వాసుకిం, వందే ఒక్షయవటం శేషం ప్రయాగం తీర్థనాయకం॥" అనే శ్లోకప్రకారము ఆ యెనిమిది తావులకు వెళ్లి యిక్కడ దిన యాత్ర చేయవలసినది. గనుక ప్రత్యామ్నాయ మయిన అక్షయవట పూజ యిక్కడ అగత్యమయినది. అందులో సోమేశ్వరుడిగుడి మాత్రము యమునకు అవతలిగట్టున వున్నది. కడమ అన్ని గుళ్ళు ప్రయాగ క్షేత్రమందే వున్నవి; గనుక నిత్యయాత్ర గపంత ప్రయాసతో చేయ వచ్చును.

యీ స్థళమాహాత్మ్యములో యీ త్రివేణీతీరమందు ప్రతి గ్రహానకు బహు ప్రత్యవాయము చెప్పి వున్నది. గనుక భిక్షాటన మే స్వధర్మ మయిన బ్రాహ్మణులు యిక్కడ వాసము చేయ డానికి భయపడి యీ స్థళవాసమే మానినారు. యింత పుణ్యతీరమందు బ్రాహ్మణులు లేకపోతే లోకులు కడతేర రనే తాత్పర్యము చేత లోగడ ఢిల్లి పాదుషా కింది అధికారస్థులు కొందరు కనోజా బ్రాహ్మణులకు భూస్థితు లిచ్చి యిక్కడ యెల్లప్పుడు తీరవాసులుగా వుండేటట్టున్ను యీ తీరములో వారికి స్థలాధికారాన్నిన్ని కలగచేసి కొందరిని స్థాపించినారు. వారు ప్రయాగవాళీలని పేరు పెట్టుకొని యిప్పటికి ౯౦౦ యిండ్లవారై వున్నారు. వారికి యిప్పట్లో యాత్రి వారి కుండా జీవనము జరుగుతూ వున్నది. యీ ప్రయాగవాళీలు కాక ఘాటీవారని ౧౨౫ మంది, ౧౨౫ ఝుండాలు వేసుకొని స్నానఘట్ట మందు బలంపీటలు వేసి స్నానము చేయవచ్చే వారికి ఉపకృతులు చేస్తూ అయాచిత జీవనమును యాత్రివారి గుండా చేస్తూవున్నారు. వీరుగాక పంచద్రావిళ్ళతో చేరిన మహారాష్ట్రులు ౧౦ యిండ్లవారున్ను తెనుగు వారు మూడిండ్ల వారున్ను నూరుయేండ్లుగా తాణాలనే పేరుపెట్టుకొని యిక్కడ వసిస్తూ వున్నారు.

ఒకటి రెండు ధర్మశాలలు ద్వారకాదాసు లక్నో

నవాబు మంత్రి కట్టించినవి యీ స్థళములో వున్నవి. దేశాంత
రస్థులకు అన్నము అహల్యాబాయి సత్రము నిలిచి పోయి
నది మొదలుగా శుద్ధముగా లేకవున్నది. త్రిస్థళయాత్ర చేసేవారు
అందరున్ను యెట్లా? కాశిలో మాత్రము అన్నపూర్ణ ఆజ్ఞచేత
ద్రావిడ దేశస్థులకు యిక్కడి వారికి బుద్ధి ప్రేరితమయి అనేక సత్రాలు
యేర్పడి వున్న వేగాని యిక్కడ ఒక సత్రమయినా లేక వున్నది.

యీ క్షేత్రములో యమద్వితీయ యనే కార్తిక శుద్ధ విదియ
నాడు యమునాస్నానము బహు ముఖ్యము. యమధర్మరాజు ఆ
దినము తన తోడబుట్టు అయిన యమునను జూచే నిమిత్తమై యిక్కడికి
వచ్చి ఆ దినము యమునలో స్నానముచేసేవారి వంశస్థుల కంతా
యమదండన లేకుండా వుండేటట్టుగా వర మిచ్చినాడట. ఆ దినము
యమునా స్నానము నాకు రామబ్రహ్మము కలిగేటట్టు కటాక్షించినాడు.

యీ ప్రయాగ వూరు పాదుషా కోటకట్టిన వెనక బహు
బస్తీ అయినది. ఇప్పుడు (ఊరు?) కట్టి సుమారు నాలుగువేల యేండ్లు
దాకాలయినది. లక్నో నబాబు ఢిల్లి పాదుషాను స్వామిద్రోహము
చేసి లక్నో రాజ్యముతో కూడా యీ ప్రయాగను స్వాధీనపరచుకొని
ప్రయాగవాళీలకు పాదుషా యిచ్చిన మాన్యపు భూములు యావత్తు
కట్టుకున్నాడు. పిమ్మట 30 సంవత్సరముల కింద కుంఫిణీవారు స్నేహ
పూర్వకముగానే యీప్రయాగను దీని చుట్టు ఉండేభూమితో కూడ తీసి
కొని త్రివేణి సంగమమువద్ద వుండే కోటను బహుబలముచేసి భరతపురపు
రాజు మొదలయిన గొప్పవారిని భద్రపరచడానికి తగుబాటిగా మిక్కుట
మయిన రస్తుతో కూడా కోటను కాపాడుతూ వున్నారు. కోట
బహు ముచ్చటగా బయిటికి కనబడుచున్నది. ప్రత్యామ్నాయ వట
వృక్షాన్ని కోటబురుజుకింద వుండే సరస్వతి తీర్థాన్నిన్ని దర్శనము
చేసినాను. యీ ప్రయాగకు మొగలాయీలో అలహాబాదు అని పేరు
పెట్టినారు. అధికారస్థులు అదేప్రకారము యిప్పటికిన్ని వాడుకుంటారు.
యీ అలహాబాదులో ఒక రివిన్యూ కల్కటరు ఒక కష్టం కల్కటరు
ఒక మేజస్ట్రేటు ఒక జడిజీయున్ను వుండివున్నారు. వీరికందరికి అధి
కారిగా ఒక కమిస్సనరును యేర్పరచి పెట్టినారు.

మిర్జాపూరు దొరలు యిచ్చిన ప్యాసుపోర్టులను యిక్కడి దొరలు కాయముచేసి వేరే ప్యాసుపోర్టు తాము ఇచ్చి కాశిదాకా కూడావచ్చేటట్టు బరకత్‌దాసు అనే ఒక పోలీసు బంట్రౌతును నా తయినాతీచేసి జూసీసరాయిలో ఘరవానాకు వ్యతిరిక్తముగా నా మూటముల్లెలను శోధించిన పెరిమిట్టు మనుష్యులను కొలువు తీసివేసేటట్టు నిశ్చయముచేసినారు. వారున్ను భగవత్సృష్టితో చేరినవారయి తద్వారా నా సహోదరు లయినందున వారికి నావల్ల హింసకావడము యుక్తము కాదనిన్ని క్రోధము పాపకారి అనిన్ని యీశ్వరుడు నాబుద్ధికి తోపింప చేసినవాడయి నాకుండా ఆదొరలను మళ్ళీ ప్రార్థించబడేటట్టు చేసి వారి జీవనాలు కాపాడినాడు.

యిక్కడ వేణీదానము పెనిమిటి సహితముగా వచ్చిన స్త్రీలున్ను పితృసహితముగా వచ్చిన వివాహముకాని కన్యలున్ను చేయవలసినది. యీ వేణీదాన మనగా జడ కత్రించి దాన మియ్యడము ముఖ్యమా, లేక తలవెంట్రుకలు యావత్తు కత్రించి యియ్యడము ముఖ్యమా అనే వివాదము, మనదేశములో రామానుజ దయాపాత్రము వారున్ను శ్రీశైల దయాపాత్రము వారున్ను నాసాగ్రము యేది అని వివాదపడ్డట్టుగా పడి, మనవారు ఏకవాక్యత పడనట్టు వీరున్ను యీ విషయములో ఏకవాక్యత పడక కొందరు స్త్రీలకు జడవేసి కొంతమట్టుకు కత్రించి దానము చేస్తారు; కొందరు తలవెంట్రుకలు యావత్తు కత్రించి యిస్తున్నారు. నేను సమగ్రముగానే దాన మిప్పించినాను.

ముందు కాలాలలో యిక్కడ వచ్చి క్షౌరము చేసుకొని యాత్ర చేయడానికి మనిషికి ౭ రూపాయల వంతున దొరతనము చేసేవారు హాశ్శీలు పుచ్చుకొనుచు వచ్చినారు. యిప్పట్లో మనిషికి కుంఫిణీవారు ఒక రూపాయ వంతున నిష్కర్ష చేసి త్రివేణీ సంగమము ఎక్కడ అవుచున్నదో అక్కడ పాటక్కు అనే ఒక చావడి విడవలి (పూరి)తో కట్టి వుంచినారు. ఆ పాటక్కులో ౧౦ బంట్రౌతులతో ఒక జమీదారుణ్ని ఉంచి యున్నారు. ఆ పాటక్కుకు కొన్ని బారలకు ముందుగా ఒక దారోగా కచ్చేరిని ఉంచియున్నారు.

ఆరాధనను విధిగా యేర్పరచినారో యెట్లా వైష్ణవ మతస్థులలోని మద్యపాయులు తరించడానికి రహస్య రామానుజకూటారాధనను నియమించినారో తద్వత్తుగా లోకముమీాద విసుకుచేత దేహమును బలాత్కారముగా త్యజించడానికి నిశ్చయించినవారు తరించడానికికూడా యీా ప్రియాగ మాహాత్మ్యద్వారా దేహత్యాగము విధిచోదితముగా చేసినట్టు తోచుచున్నది. మెట్టుకు యీా కర్మభూమిని జనియించిన తిర్యగ్జంతువులుకూడా ఒక విధమయిన భక్తి యీాశ్వరుని యెడల కలిగి తరించవలసిన అగత్యము పూర్వీకులకు కలదు గనుక వాని వాని శక్తికి, ఇచ్ఛకున్ను, యెక్కువగా పనులు నియమిస్తే చేయక తద్ద్వారా యీాశ్వరభక్తిలేక మునిగిపోదురు గనుక వారి వారి యిచ్ఛకు, శక్తి కిన్ని, అనుకూలమయినట్టుగా; సారాయి తాగితే తాగినావు యీాశ్వ రార్పణమని ఒకవిధమయిన ఆరాధనతో తాగు అన్నట్టు; ఆత్మహత్య చేసుకొంటే చేసుకొన్నావు; యీాశ్వరార్పితమని శ్రద్ధతో ఫలాని తావుకుపోయి విధిపూర్వకముగా చేయుము అనేటట్టుగా యిక్కడ నియమించినారని నాకు తోచుచున్నది.

త్రివేణీగర్భములో కోటగోడకింద నా కోసరము తత్పూర్వమే చప్పరాల కొట్టాయీలు వేయించి వున్నందున అందులో తీర్థశ్రా ద్ధాలు పెట్టించినాను. బ్రాహ్మణుడు ౧ కి రూపాయవంతున దక్షిణ యిచ్చినాను. ఆ బ్రాహ్మణులున్ను, అందుకు సంతోషపడిరి. ప్రియా గావళీల స్త్రీలు రాణివాసము గలవారు గనుక తెనుగు మహారాష్ట్రీ ము త్తయిదువలు ౧౨ మంది దొరికినందున వారికి మాయింటి స్త్రీతో కూడా ఆ చప్పరాలలో ముందుగా యిక్కడి వాడికె ప్రకారము గాజులు తొడిగించి అభ్యంగనాలు చేయించి నూతన వస్త్రాలను ధరింప చేసి మేళతాళాలు స్వస్తివాచనములతో కూడా త్రివేణీ సంగమము వద్దికి వెళ్లి వేణీదానము యిప్పించినాను.

యీా చప్పరాలు ౧౬ రూపాయల బాడిగెకు బనయావాడి (కోమటి) వద్ద నిష్కర్ష చేసుకొని పయిన ౧౦ రూపాయిలు ఖర్చు చేసి అరవ భాష - పఆన (ப అను అక్షర స్వరూపము) అందముగా కొట్టాయి ౧ కి ౪౦ అడుగుల నిడువున్ను ౧౬ అడుగుల వెడల్పున్ను

పెట్టి 3 కొట్టాయీలు వేయించినాను. బహు రమణీయముగా వుండి నవి. ఆ చప్పరాలు బాడిగెకు యిచ్చిన బనయావాడు అక్కడనే ఒక అంగడి తెచ్చిపెట్టినాడు. సకల సామానులున్ను వాడివద్ద పుచ్చుకొన్నాము. మకర మాసములో వచ్చే జనము దిగడానికి బనయావాండ్లు వేలపర్యంతము చప్పరాలు కట్టి యీలాగంటి కొట్టాయీలు వేసి అడుగుకు పావులావంతున బాడిగె తీసుకొని మీాది మిక్కిలి ఆ దిగిన వారిని మరియొక తావున సౌదా అనే సామాను కొనకుండా నిర్బంధపెట్టుతారు. అయితే యిటువంటి చప్పరాలు కావలసినన్ని బాడిగెకు దొరుకుచున్నవి.

నేను యెల్లప్పుడున్ను త్రివేణీదర్శనము కాగల ద్వారకాదాసు ధర్మశాలలో దిగినాను. యీా స్థలములో వశించినన్ని దినాలున్ను ప్రతిదినమున్ను ఉదయాన యీా చప్పరాలకు వచ్చి సాయంకాల పర్యంతమున్ను యిక్కడనే వుండి రాత్రి పడకకు ధర్మశాలకు పోవుచు వచ్చినాను. ప్రయాగవాళీలకున్ను ఘాటీ వారికిని యింటికి రెండేసి అణాల వంతున సుమారు ౧౧౦౦ ఇండ్లకున్ను, ముట్ట చెప్పినంతలో వారందరున్ను సంతోష పడిరి. యిక్కడికి గొప్ప వారు వస్తే స్నాన ఘట్టములో ఒక బలంపీట నున్ను ఒక జండానున్ను వేయడం వాడికె గనుక పదిరూపాయిలలో రెండున్ను నన్ను అనుసరించిన శంకర ఘాటీకానును తెమ్మని స్నాన ఘట్టములో వేసి అతని ఆధీనము చేసినాను. క్షౌర దినమున్ను, వేణీదాన దినమున్ను, భూరి యివ్వడములో ౧౫ రూపాయిల పయిసాలు తగులుచున్నవి. అందులో అన్ని జాతులు చేరుతారు. త్రివేణిదానానికి మరునాడు నా ప్రయాగవాళీ యింట్లో ప్రయాగవాళీలకు నూరుమందికి సంతర్పణ చేసినాను. దక్షిణ సహితముగా ౨౫ రూపాయిలు మట్టుకు ముట్టచెప్పినంతలో ఆనందించి నాతో కూడ వచ్చిన ప్రతి శూద్రునిచేత నేను మనిషి ౧ కి యిచ్చిన రెండేసి అణాలు తీసుకొని తీర్థవిధి పిండప్రదాన సహితముగా చేయించినాడు. పంచద్రావిళ్లు పెట్టే శ్రాద్ధాలజోలికి వారు రావడము లేదు. పిండ దక్షిణ అనే పేరుతో బ్రాహ్మణార్థము చేసే ఒక బ్రాహ్మణునికి యిచ్చే దక్షిణంత ప్రతి శ్రాద్ధానికిన్ని ప్రయాగ

వాళీ తీసుకొంటారు. యీపాటి, నాకుండా యీ స్థలములో యీశ్వరుడు జరిపించడము వల్ల చెన్నపట్నానికి యశస్కరముగానే వుండినది.

నేను ప్రయాగవాసము చేసినన్ని దినములు వైదికుల సమూహముతోనే కాలము తోయడమయినది గాని హయిదరాబాదు వగయిరా షహరుల వలెనే లౌకిక సహవాసము నేను త్రివేణీ తీరమునందు దిగినందున నిండా తగిలినది కాదు. యీ ప్రయాగలో నాలుగు పటాలాల బారుఉన్నది. ఆ దండు వుండే స్థలము బస్తీకి రెండుకోసుల దూరము. నా మీద దయచేసి నేను సేవచేసిన సర్ జాన్ న్యూబోల్టు, (Sir John Newbolt) * సర్ చార్లీసుగ్రే మొదలయిన దొరలు వ్రాసి యిచ్చిన క్యారకటరులు యీ పరస్థలాలలో నన్ను యింత గొప్ప చేస్తున్నవి.

సర్వాంతర్యామిగా వుండే పరమాత్ముడు యేలే స్వామిలో యేలబడే వారి యాత్మలలో దీపించుటకంటే యెక్కువ దీప్తితో ప్రకాశించుచున్నాడు గనుక స్వామిభృత్యన్యాయముగా మనుష్యుడు నడుచుకొంటే పరమాత్ముడు ఆనందించి ఆ నడిచిన వానికి సకలేష్టసిద్ధులు కలగచేయుచున్నాడు. యిందుకు యే మాత్రమున్ను సందేహములేదని తోస్తున్నది.

బంగాళా గౌరర్నమెంటువారు వినాంన్సుకమిటీ అనే సెలవులు తగ్గించే సమూహము వారి తాత్పర్యము మీద అక్కడక్కడ ఉండే కష్టం హావుసులనే సాయరు చావిళ్ళు యెత్తివేసి చెన్నపట్టణమువలెనే కష్టం అనే సుంకమును యిజారాకు యివ్వవలెనని యత్నముచేసినారు. యీ రాజ్యములో వుప్పుకు తీరువగాని చెన్నపట్టణమువలె మొనాపాలీ చేసి సుంకము యిజారాకు యివ్వడములేదు. చెన్నపట్టణమువలె జరిగించడము యీ దేశస్థులకు సమ్మతము లేక నున్నది. అందువల్ల సుంకము యిజారాకు యివ్వడములో యిటీవల చెన్నపట్టణములో తూకున (ఉరి) తీయబడిన అణ్ణాసామి వగయిరాలకంతా కలిగిన

---

* న్యూబోల్టుగారు చెన్నపట్టణములో 1815 నుండి 1820 వరకు సుప్రీము కోర్టు ప్రధాన న్యాయమూర్తిగా వుండేవారు.

ప్రమాదాలనున్ను, యింకా కలగ గల ప్రమాదాలనున్ను, నాకు తోచిన మట్టుకు తెలిశేటట్టు ఒక యాదాస్తు శీకష్టం కలకటరు మేస్తరు నీపన్ (Mr. Nepean) దొరగారి కోరినమీదట వ్రాసియిచ్చినాను.

మేస్తర్ నీపన్ దొర నాతో మత సంబంధమయిన ప్రసంగము వచ్చినప్పుడు యీ నదులను యీ గుళ్ళను యీశ్వరుడని నమ్ముతావా అని ప్రశ్న చేసెను. చెన్నపట్టణము చూడని మీకు, హిందూస్తాన్ ప్లాన్ యెత్తి యిదుగో చెన్నపట్టణమని చూపిస్తే అది చెన్నపట్టణమౌనా? చెన్నపట్టణము ఫలాని తావున వున్నదని బోధ చేయవలసిన వారికి వారిని చెన్నపట్టణానికి పిలుచుకుని పోయి ప్రత్యక్షముగా చూపించను వల్ల లేని పక్షమందు, ప్లాన్ గుండా నయినా చూపించ వలసినది అగత్యము గనుక, యెట్లా ప్లాన్ వ్రాసి మీరు యెరుగని దేశాలను ప్రకటనము చేయుచున్నారో తద్వత్తుగా జ్ఞానముచేత యీశ్వరుని తెలుసుకో లేని వారికి ఈ కర్మస్థలముల మూలముగా యీశ్వరుని యెడల భక్తి కుదిరేటందుకు యిటువంటి స్వరూపాల యెడల యీశ్వరజ్ఞానము ఆరోపితము చేసి ఆరాధనోపాయములు మా పెద్దలు చేసినారు, అని ప్రత్యుత్తర్వు యిస్తిని. అయితే నీవు క్రీస్తు మతస్థుడవేకదా! అని చెప్పి సమ్మతి పడినాడు.

ఈ దేశములో మహారాష్ట్రులు మొదలయిన ద్రావిళ్ళును, ఘూర్జరులున్ను పంచద్రావిళ్ళతో చేరినవా రయినా ఘూర్జరులతో భోజనప్రతి భోజనాలు చేయడము లేదు. అందుకు కారణము ఘూర్జరులు శంకరాచార్యులవారి శాపగ్రస్తులని చెప్పుచున్నారు. యిక్కడ వాసము చేసే పంచగౌడస్త్రీలు రవికెలు తొడగడములేదు. తురకసంప్రదాయ ప్రకారము ప్రతిస్త్రీలున్ను ముసుకు లేకనే బయిట రారు. ఆరుమూర నిడివి, నాల్గు మూర వెడల్పులో చంగావివేసిన నుంచి రేకు విత్తముకొద్దీ తీసి ముసుకుగా ముఖముకూడా తెలియకుండా దేహ మాద్యంతము కప్పుకొనుచున్నారు. గంగాతీరమందు వసించే సకలజాతులు స్నానము శివపూజ చేయకనే జలపానము చాయుడములేదు. పుణ్యనదుల తీరములలో వుండే వారి కంతా యిదే స్నాననియమము కలిగినట్లు నా అనుభవము నాకు తోపచేయుచున్నది. స్త్రీలు అందరు వుదయా

త్పూర్వకము గంగాస్నానముచేసి యిండ్లకుపోతారు. పిమ్మట పురుషులు స్నానానికి పోతున్నారు. యిక్కడి స్త్రీలకు స్వరూప సౌందర్యమే కాని ఆభరణాపేక్ష విస్తారము మనదేశమువలె కలిగిన వారు కారు.

మిరిజాపురము మొదలు ప్రతి మజిలీ వూరిలో బాడిగెకు గుఱ్ఱాలు కోసుకు ఒక అణావంతున కావలసినన్ని దొరుకుతున్నవి. తిరువలిక్కేణి గాడీలవంటి గాడీలకు ఒక తట్టువాని గుర్రాన్ని కట్టి యెక్కా అని పేరు పెట్టి వారు వారు యెక్కడము మాత్రమే గాక కావలసినన్ని బాడిగెకున్ను యిస్తూవున్నారు. ఆ యెక్కా అనే సవారీ దినానికి ౧౦ కోసులు సాధారణముగా పోవుచున్నది.

దక్షిణదేశములో వస్త్రాలు ఆ దేశస్థులు బహుశః ప్రియాసపడి ఉతికి శుభ్రముగా వుంచుకొని వుండేటట్టు, ఈ దేశస్థులు వాడుకునే పాత్రసామాను శానా సేపు ప్రయాసపడి తోమి బహు శుభ్రముగా వుంచుకొనుచున్నారు. యీ దేశస్థుల వస్త్రాల నైల్యమున్ను, మనదేశస్థుల పాత్రల నైల్యమున్ను, సమముగా ఉన్నది. యిందుకు కారణము నా బుద్ధికి తోచడమేమంటే దక్షిణదేశస్థులు భోగప్రియులు గనుక వస్త్రసౌందర్యము కలవారయినారు. ఉత్తరదేశస్థులు భుక్తిప్రియులు గనుక భక్షణోపకరణాలు శుభ్రముగా వుంచుకొనుచున్నారు. ఈ దేశస్థులు యెనిమిదిమంది చేరితే తొమ్మిది పొయిలని ప్రసిద్ధిగనుక, వంటలు వారువారు దేహసంబంధికులయినా ప్రత్యేకముగా చేసుకొని మనదేశపు వైష్ణవుల వలె దృష్టి దోషము మాత్రము పాటించకుండా భోజనము చేస్తారు.

మిరిజాపూరు మొదలు ప్రయాగవరకు భూమినిండా సారవత్తు కాకపోయినా గంగవొడ్డు భూమిగనుక ప్రవాహము తీసిన కాలాలలో దున్ని పయిరుపెట్టుచున్నారు. గంగవండలి మన్ను అతి సారవత్తు అయినది గనుక అమితముగా గోధుమలు వగయిరా పుంజ ధాన్యములు పండుచున్నవి. ఈ దేశములో వేదపాఠము లేకనున్ను, వేదపారాయణము లేకనున్ను, ఉండడానికి కారణమేమని నా బుద్ధ్యా ఊహించగా అర్థము తెలియని వేదపాఠము యేమిఫున్నా శ్రౌత పురస్సరముగా యాగము మొదలయిన కర్మాలకు ఉపయోగమే

గాని జ్ఞానానికి ప్రత్యక్షమైన సాధకము కాదు గనుక నున్ను, యీ భూమి మ్లేచ్ఛాక్రాంతమై పోయిన వెనక గంగాయమునల మధ్యే నివసింపుచు నున్న కర్మఠులయిన ద్రావిళ్ళు శుద్ధ ద్రవిడ దేశములయిన కావేరీ తామ్రపర్ణీ తీరములలో ప్రవేశించినందున అక్కడి వారు కర్మోపయోగిగా వేదార్థము తెలియక పోయినా వేద పారాయణము చేయడములో ఫలము కలదని ఫలశ్రుతులు కలగచేసి బహుశః వేదపాఠము పారాయణానకు ఉపయోగముగా జరిగింపుచు వుండేటట్టు తోచుచున్నది.

యిప్పుడు పంచగౌడులని యిక్కడ వసించే వారికి గౌడులని పేరు రావడానకు కారణమేమంటే కర్మఠులయిన ద్రావిళ్లు యీ గంగా యమునలమధ్యే వసించే కాలములో కర్మములయెడల శ్రద్ధ తక్కువైన వారైనందున వీరిని గౌణులు అంటూ వచ్చినారు. ఆనామమే యిప్పుడు గౌడులని ప్రసిద్ధమైనది. కర్మఠులు యీ రాజ్యము వదిలి పోయి ఢిల్లీ నుంచివచ్చిన తురకలచేత ఈ రాజ్యమంతా నిండిపోయినందున నిండా కర్మఠులు కాకుండావుండే గౌడులకు ఆ తురకలతో సహవాసము కలిగినందున ఉచ్చారణలుకూడా ఆతురకభాషను అనుసరించినవి. ఆచారాలు కూడా తద్ద్వారా నిండాభేదించి పోయినట్టు చెప్పచున్నారు. ఈ దేశము తురకదేశమున కున్ను, హిందూ దేశమునకున్ను, నడుమనుండే సింధు నదికి సమీప మయినది గనుక తురకలు ఢిల్లీ ప్రవేశించగానే వారు ఈ దేశాచార విరుద్ధ కర్మఠు లయినందున వారివల్ల ఉపద్రవము కలగ పోవుచున్నదని భయపడి యిక్కడి కర్మఠు లయిన ద్రావిళ్ళు పయిన వ్రాసిన ప్రకారము శుద్ధ ద్రవిడదేశములో ప్రవేశించినారు. ఆదినుంచి కర్మఠులు గాని గౌడులు, యిప్పటికి ముక్తికి తగ్గ దారి యయిన జ్ఞాన సంపాదనార్థమై తర్కము, మీమాంస మొదలయిన శాస్త్రములను అభ్యసింపు చున్నారు.

కర్మద్వారా, జ్ఞానమనే న్యాయ మార్గమును బట్టి కర్మ మనే మజిలీయూరి మీదుగా జ్ఞానమనే పురమునకు పోతే దేహాన కున్ను, ప్రాణాలకున్ను, ప్రయాస యియ్యదు. కర్మమనే మజిలీలో నిలిచి ఆసోదా చేసుకోకనే జ్ఞానమనే పురమునకు ఒక్కసారిగా వేర్తే

అగుపడలేదు. యిదిగాక శ్రీమచ్ఛంకరాచార్య భగవత్పాదులవారు దిగ్విజయార్థముగా ఈ దేశానికి వచ్చిన కాలములో యిక్కడ సన్యాసమును స్థాపించిన వెనక ఈ గౌడులలో కొందరు సన్యసించి వారికి శిష్యభావమును వహించి ఉంటూ వచ్చినారు. భగవత్పాదుల వారికి కొందరు మద్య మాంసాదులతో భిక్ష చేసినప్పుడు గురువు స్వీకరించగా మేము యెందుకు విడిచి పెట్టవలసిన దని వారితో పాటుగా ఈ దేశపు శిష్యులు మద్య మాంసాదులను భక్షించినారు. పిమ్మట వారి పరీక్షార్థమై ఒక కంచరవాడు సీసమును కరిగి ఆయుస్సముతో భిక్షాకాలమందు భగవత్పాదుల వారికి పాత్రతో సమర్పించగా దాన్ని భగవత్పాదులవారు సమదర్శను లయినందున ఉదక ప్రాయముగా పుచ్చుకొన్నారు. ముందు వారితోటి పాటుగా మద్య మాంసములను పుచ్చుకొన్న గౌడ సన్యాసులు యిది మేము పుచ్చుకో గలమా అని కరగించి పోసిన సీసమును తాగలేక త్యజించి నందున భగవత్పాదుల వారికి వారి యెడల ఆయాసముతోచి, బుద్ధి స్థైర్యమును పొందేవరకు లోకదృష్టితో మంచిచెడు తారతమ్యములను విచారించక నాయందు గౌరవమున్న్ను లేకుండా అహంకృతిని వహించి నందున మీరు భ్రష్టులై పోదురు గాకా యని శపించినారు.

అప్పట్లో శాపగ్రస్తులయిన పదిమంది సన్యాసులున్ను, దశ నామములు కలిగి శిష్యప్రశిష్య పరంపరగా యీ దేశములో గోసాయీ లనే పేరు పెట్టుకొని తమది సన్యాసాశ్రమమైనా వర్తక వ్యాపారాలు చేసుకొంటూ యిక్కడ మహాజనులనే సాహుకార్లుగా నటింపుచున్నారు. ఆగోసాయీలు శిష్యపరిగ్రహము చేసేటప్పుడు ఒక విధమయిన హోమముచేసి కొంత ఆగమము జరిపించి శిష్య పరిగ్రహము చేయుచున్నారు. ఆ శిష్యుడు గురువుయొక్క ధన ఋణాలకు బాధ్యుడవుచున్నాడు. యిట్లా మునుపు గోసాయీలు బ్రాహ్మణ వ్యతిరిక్త జాతులను కూడా శిష్యులుగా పరిగ్రహింపుచు వచ్చినారు. అయితే యిప్పుడు కొంతకాలముగా కుంఫిణీవారు ఆ యాచారమును నిలిపి బ్రాహ్మణులనే శిష్యులుగా పరిగ్రహించే టట్లు

ఆగోసాయీలకు నియమము చేసి యున్నారు. ఆగోసాయీలకు యెవరు నమస్కారము చేసినా యిప్పటికిన్ని నారాయణ స్మరణ చేయు చున్నారు. యీ గోసాయీ లందరున్ను, వనా, రణా, గిరి, పర్వత్, సాగరా, భారతీ, పురీ, సరస్వతీ, తీర్థ, ఆశ్రమ, యీ పది నామ ధేయములకున్ను అంతర్భూతులయి యుంటారు గాని వేరేయుండరు.

యీ తెగలు గాక బయిరాగులని కొందరు విరక్త్యభినయాలు బహుశా కలిగి తెంగల నామధారులయి సంచరింపుచు నుంటారు. వారికి గురుపీఠముగా మన ద్రావిళ దేశము నుంచి కొంతమంది వైష్ణవులు కొన్ని కాలములలో వచ్చి సమాశ్రయణము చేసి వారిగుండా బహుధనమును సంపాదించుకొని పోవుచున్నారు. వారు విష్ణుభక్తు లయినా ద్రావిడ దేశములో అద్వైతులకున్ను, విశిష్టాద్వైతులకున్ను, సగుణనిర్గుణ వివాదము పడివున్నట్టు యిక్కడ లేదు.

యీ దేశము యావత్తున్ను తరుచుగా శ్రీమచ్ఛంకరా చార్యులవారు స్థాపించిన అద్వైత మతము చేతనే వ్యాపింపబడియున్నది గాని పిమ్మట రామానుజాచార్యుల వారున్ను, మధ్వాచార్యుల వారున్ను, అవతరించి స్థాపించిన విశిష్టాద్వైత ద్వైతాలు యీ సరికి సకృచ్ఛముగా నెగడినది కాదు. ద్వైత మతస్థులు మన దేశములో ఉంచుకొనే అంగార రేఖ యీ దేశములో ఎవడున్ను లలాటమందు ధరించినట్టు నాకండ్లపడినదికాదు. సకలమైన వారున్ను ఏమిన్ని భేద ములేకుండా విభూతిన్ని గోపీచందనమున్ను చందనమున్ను లలాట మందు ధరింపుచున్నారు. బయిరాగులు మాత్రము తిరునామమును పయిన వ్రాసినట్టు ధరింపుచున్నారు.

శైవ వైష్ణవ సౌర శాక్తములు మొదలయిన మతాలన్ని అద్వైత విశిష్టాద్వైత మతాలకు అంతర్భూతము లయినవే గనుక యీ మూడు మతస్థులున్ను శైవవైష్ణవములు మొదలయిన ఆరాధనలు ఏవి చేసినా చేయవచ్చును. ఈ ఆరాధనలన్ని కర్మాలకు అంగము లే కాని వేరేకావు. మత రహస్య మనే వృక్షమూలము గురుముఖముగా తెలియవచ్చినప్పుడు కర్మాంగములయిన ఆరాధన లన్నియు తమకు తామే నివర్తించి పోవుచున్నవి. మత రహస్యమనగా ఆయా మతము

యొక్క తత్త్వము. అద్వైతమతముయొక్క తత్త్వ మేమంటే సృష్టికిన్ని సృష్టికర్తకున్ను, దీప దీపికా న్యాయముగా భేదములేదనుట. విశిష్టాద్వైత తత్త్వమేమంటే సృష్టికిన్ని సృష్టికర్తకున్ను పాలతో కలిసి వుండే నెయ్యివలెనే కించిత్తు భేదము చెప్పడము. ద్వైత తత్త్వమేమంటే పాలు పెరుగు మజ్జిగె మజ్జిగె తేట నెయ్యి యివి భేదిస్తే భేదపడుచున్నవి గనుక వీటివలెనే యీశ్వరునికిన్ని జీవునికిన్ని భేదము ఉండడము మాత్రమే కాకుండా అనేక భేదాలు జీవులలో కూడా కల వనడము. యీ మూడే యిదివరకు తీరని వివాదాలుగాని శివుని కన్నా విష్ణువు సర్వోత్తముడని వైష్ణవులున్ను, శివుడే వుత్తముడని శైవులున్ను వీరిద్దరికన్న శక్తి యెక్కువని శాక్తులున్ను, వివాద పడడమున్ను అందరికి యెక్కువ గణపతి అని గాణపతులు వగయిరాలు వివాద పడడమున్ను స్వప్రయోజన కారి కాదు. యేలాగంటే విందుకు వండిన కూరలు మొదలయిన వ్యంజనాలలో యెవరికి లేహ్య భక్ష్య భోజ్య చోష్యములలో యేది సమ్మత మయితే వారు అది యెత్తి భక్షించవచ్చును; విందు చేసేవారికి కావలసిన ప్రయోజనము భోజనము చేసిన వారికి యెట్లాగయినా కడుపునిండవలసినది. శైవ వైష్ణవారాధనలను కలగచేసిన మతోద్ధారకులకున్ను అదేప్రకారము తమతమ మతప్రవిష్టులు తత్త్వము తెలుసుకొనేవరకు ఒకవిధమయిన నామ రూపాలు యేర్పరచుకొని ఈశ్వర జ్ఞానముతో ఈశ్వరుని యెడల భక్తికలిగి వుండవలెననిగాని వేరే కాదు. జ్ఞానోదయము కావడానికి శాస్త్రవిచారణమాత్రము చేసి యిక్కడి సమస్త జనులున్ను, బహుశః అద్వైత ద్వైతమత ప్రవిష్టులుగానే వున్నారని నాకు తోచబడుచున్నది. మన దేశములో వుండే ద్వైత మతస్థు లయిన మాధ్వులు ధరించే చక్రముద్రలు మాత్రము యీ దేశములో బహుమంది గోపీతో వేస్తారు.

క్రీస్తు మతస్థుల్లో ప్రొటెస్ట్యాంట్సు అనే జాతులవారు విశిష్టాద్వైత మతాను సారముగా సృష్టికర్త అయిన యీశ్వరుడు చేతనాచేతనాత్మక మయిన అనేక జీవులను సృష్టించినాడు; కర్మాలు తదంగమయిన ఆరాధనలవల్ల యీశ్వరదృష్టి అల్ప పదార్థాలమీద కలిగితే ప్రమాదాన్ని యిస్తున్నవి గనుక, కర్మాలున్ను తజ్జనితమయిన ఆరా

ధనలున్ను యేమి వద్దు, మనసా యీశ్వర భజన చేస్తూ వుండవలసిన దని చెప్పుతారు. తురకలున్ను, అందు కనుసరణగా అనేక ప్రకారా లయిన కర్మాలు తజ్జనిత మయిన ఆరాధనలున్ను వుంటే బుద్ధి నిశ్చ యము తప్పి పోతున్నది గనుక, ఒకటి రెండు విధములయిన కర్మా లను ఆరాధనల నున్ను యేర్పరుచుకొని ఆమూలకముగా యీశ్వర భజన చేసి కడతేరుతారు. రోమన్ క్యాథలిక్సు అయిన క్రీస్తు మత స్థులు తురకలవలెనే సంక్షేపమయిన కర్మాలతో ఆరాధనలతోనున్ను యీశ్వర భజన చేస్తున్నారు. తురకలకున్ను క్యాథలిక్సులకున్ను తాము చేసే కర్మారాధనలలో వివాదమే కాని తత్త్వములో వుండ నేరదని తోస్తున్నది.

భగవత్పాదు లయిన శంకరాచార్యులవారు అవతరించి దిగ్వి జయము చేయక ముందర యీ కర్మభూమిలో దేహానే బ్రహ్మమని వాదించే ఒక ప్రమాదమయిన బౌద్ధమతము ప్రసిద్ధముగా వుండెను. యిప్పుడు ఆ మతము యీ దేశమందు ఖిలమయినా అంకురాలు మాత్రము అక్కడక్కడ ఉన్నవి. ఆ మతము పాలు నే నెయ్యి అన్నట్టు స్థూల దేహాన్ని బ్రహ్మముగాను, యీశ్వరుడుగాను, అనేక దృఢయుక్తు లతో వ్యవహరిస్తున్నది.

సచ్చిదానందమయిన పరబ్రహ్మ సంకల్పమనే మాయతో యుక్తుడయి సృష్టించిన అనేక బ్రహ్మాండములలో వసించే సృష్టి సంబంధమయిన యావజ్జనులున్ను అద్వైత విశిష్టాద్వైత ద్వైత దేహ బ్రహ్మవాద మతాలకు లోబడి వుండవలసినదే కాని యితరము కాదని తోస్తున్నది. లేనిపక్షమందు దైవము గలదనే జ్ఞానలేశము లేకుండా ద్విపాత్పశువుల వలెనే ప్రవర్తింపుచు ఉండవలసినది. యింత తక్కువ వేరేవుండ నేరదు.

జ్ఞానజంతువు లయిన మనుష్యులకు అజ్ఞాన జంతువులయిన పశ్వాదులకున్ను భేదమేమని విచారిస్తే యెట్లా అద్దాలంతా ఒకటే దినుసో తద్వత్తుగా జంతువులంతా ఒక దినుసేగాని వేరుకాదు. అయితే తన ప్రతిభాతి పుట్టవలసిన అద్దాలకు వెనకతట్టు యెట్లారసము పూస్తా రో తద్వత్తుగా యీశ్వరుడు తన ప్రతిభాతి కలిగే కొరకు బుద్ధి అనే

రసాన్ని మానుష కోటికి వెనకతట్టు పూసి యున్నాడు. అటువంటి రసము పూసిన అద్దాలకు కూడా యెట్లాచూచే పక్క ముందుగా దుమ్ము అనే కల్మషము కప్పివుంటున్నదో తద్వత్తుగా మాధ్య మనేమాలిన్యము మనుష్యులకుకమ్మిఉంటున్నది. ఆఅద్దాలపై కల్మషాన్ని మనుష్యులుతుడిస్తే యెట్లా తమప్రతిభాతి స్పష్టముగా తెలుస్తున్నదో తద్వత్తుగా సత్సంగతి కల్గడమువల్ల మనుష్యుల మాధ్యము వదిలి యీశ్వరభాతి మనుష్యులబుద్ధిలో సంపూర్ణముగా కలగడానికి హేతువవు చున్నది.

బహుదినములుగా స్త్రీలు తిర్యగ్జంతువుల వలెనే మోక్షానర్హులు కాక నున్నారే! పురుషులకు భోగార్హలా లేక పురుషులవలెనే వీరున్ను జ్ఞానవంతులయి మోక్షార్హలా? అనే శంక నాకు కద్దు. తిరువళ్ళూరి మహాముని రఘునాథాచార్యులు మొదలయిన పెద్దలను గురించి స్త్రీలు మోక్షసామ్రాజ్యాన్ని పొందినట్టు భారత భాగవతాది సారవత్తులయిన యితిహాస కథలలో యెక్కడనైనా వున్న జ్ఞాపకము గాని వున్నదా? తుదను స్వర్గాది భోగాలయినా వారు అనుభవించినట్టుగా గాని వున్నదా? అనిన్ని యితిహాసాదులలో పురుషులకు ఫలాని ఫలాని సుకర్మమును చేస్తే స్వర్గములో అనుభవించడానికి రంభాద్యప్సరసలు వున్నారని ఆశ చూపించియున్నదిగాని ఫలాని మంచికర్మము స్త్రీలు చేసుటవల్ల ఫలాని దేవతలతో స్వర్గములో క్రీడిస్తూ వుండవచ్చు నని ఆశకూడా చూపలేదే! స్త్రీలు జ్ఞానవతులయి మోక్షార్హలు యెట్లా అవుదురని ప్రశ్న చేస్తూ వచ్చినాను. వారువారు శానా ప్రయాసపడి స్త్రీలను పురుష సమానలుగా స్థాపించవలెనని యుక్తులు చెప్పినా దేవహూతి మొదలయిన తత్వబోధగల స్త్రీలనుకూడా వివాదములో దృష్టాంతములుగా తెచ్చినా తుదను నా సందేహమే వారినిన్ని పట్టుకున్నది గాని తేరుగడ అయినదికాదు.

నా బుద్ధిద్వారా నిశ్చయము చేసినది యేమంటే స్త్రీలకు పురుషులకున్ను హృత్కమలములు ఊర్ధ్వాధోభాగములయందు రెండేసి గ్రంథులనే ముళ్ళుగలిగి వుండేది నిశ్చయము. అధోభాగమం దుండే గ్రంధి పరమాత్మ సంబంధమయినదిన్ని ఊర్ధ్వభాగమందుండే గ్రంధి సంకల్పరూపం బయిన మాయా సంబంధ మయినదిన్ని పైన్ను.

స్త్రీలకు గర్భధారణ నిమిత్తమయి అధోభాగమందుండే గ్రంధి ఫల కాలము రాగానే పీడబడి ఋతువనే సంజ్ఞను పొందుచున్నది. పురుషు లకు మాయా సంబంధమయిన పూర్వభాగమందుండే గ్రంధి ఫలకాలము రాగానే జ్ఞానోదయ సామగ్రి చేయడానికి వయిపుగా పీడబడి పోవుచున్నది. యిందుకు దృష్టాంత మేమంటే పురుషులకు యౌవనప్రారంభమయినవెనక బాల్యమునం దుండే కంఠధ్వని సౌష్టవము వుండేదిలేదు; భేదింపుచున్నది. స్త్రీలకు మాత్రము జననాదారభ్య కంఠధ్వని యొకటే రీతిగా పురుషులకంటే హెచ్చుగా యధోచితమయిన శ్రావ్యతకలిగి ఉంటు న్నది. యీ రీతిని స్త్రీలకు పరమాత్మ సంబంధమయిన గ్రంధి పీడ బడి మాయా సంబంధమయిన గ్రంధి నిలిచియుండడముచేత యెన్నటి కిన్ని జ్ఞానోదయ మయ్యే పాటిబుద్ధిన్ని స్థైర్యమున్ను లేక మాయాసం బంధమయిన చాంచల్యముతో మనస్సు తల్లడింపుచున్నది; తద్వారా జ్ఞానమువినా ముక్తిలేదు; గనుక స్త్రీలు ముక్తికి అర్హులుకారు; యధోచితముగా అజ్ఞాన జంతువులతో చేరినవారేను.

జ్ఞానార్హులు కాకపోతే అట్టిపోయెను కర్మభూమియందు ఉత్పత్తి అయిన స్త్రీలకు మంచి కర్మాలుచేయ నిచ్ఛ పుట్టేటట్టుగా స్వర్గాది భోగాలనే మీాది ఫలము కలదని తద్ద్వారా దేవశిలతో సంభోగము కలుగుననే ఆశైనా వుంచరాదా అని యోచిస్తే అటువంటి ఆశపెట్టితే స్వకీయ పురుషుల యెడల భక్తిని వదిలి అటునియమించిన కర్మములే చేస్తూవుందురనే భయముచేత మన పూర్వీకులు ఆయాశ కూడా పెట్టక వారికి చెప్పిన కర్మాలు యేమి ఉన్నా ఐహిక సంబంధమయిన అష్టపుత్ర ఐశ్వర్యధనములున్ను భర్తాసహా ఆయురారోగ్యములున్ను మాత్రమే సకల పురాణాదులలో చెప్పియున్నవి; తద్ద్వారా స్త్రీలు తిర్యగ్జంతువుల వలెనే యధోచితముగా పురుషులకు భోగార్హులే కాని యితరము కాదని తోచుచున్నది.

యీ ప్రయాగ మహాక్షేత్రములో ఉండే పౌరాణికుడయిన మధురానాధు అనే మహారాష్ట్ర బ్రాహ్మణుని స్త్రీలకు యే సుకృత కర్మముచేతనైనా పురుషజన్మము కలిగినట్టు పురాణేతిహాసములలో

కద్దా? అని అడిగినాను. కొన్ని కొన్ని పురాణాదులలో పుత్రులు సన్యసి స్త్రీ పురుషజన్మము కలిగేటట్టు ఉన్నది, కొన్ని పురాణాదులలో సర్వథా యెప్పుడున్ను స్త్రీలకు పురుషజన్మము లేదని పరిష్కారముగా వున్నదని చెప్పినాడు గనుక యీ యుక్తుల ద్వారా విచారించగా స్త్రీలు లేని పోని పురుషయోగ్యము లయిన కర్మములజోలికి పోక వేదాంతాలు విచారించి శుష్కవేదాంతలు కాక, పతిశుశ్రూష కుటుంబ సంరక్షణ మొదలయిన ఐహికపు పనుల యెడలనే ప్రవిష్టలుగా ఉండుట యుక్తముగా తోచుచున్నది.

ఈ ప్రయాగలో సకల పదార్థాలు దొరుకును. సకల విధమయిన పనివారున్నున్నారు. సీమసామానులు అమ్మే యింగిలీషు షాపు కూడా ఒక బంగాళీ వేసుకొని ఉన్నాడు. యీ ప్రయాగలో అక్టోబరు నెల ౧౨ తేది మొదలు ౨౨ తేది రాత్రి వరకు వసించి ౨౩ తేది ఉదయాన బజరా అనే యిల్లుగల పడవ ఒకటిన్ని, నావా అనే సాధారణపు పడవ ఒకటిన్ని బాడిగెకు తీసుకొని గంగగుండా ప్రయాణమై సాగివచ్చినాను. యీ బజరాలనే పడవలు సుమారు ౬౦ అడుగుల నిడివిన్ని, ౨౦ అడుగుల వెడల్పున్ను కలిగి ఒకటి వెనుక ఒకటిగా మూడు అరయిండ్లు యేర్పడి ఉంటున్నవి. ఆ యిండ్లు మంచి పలకలతో కట్టి సుందరమయిన రంగువేసి యున్నవి. కడాపటిది మరుగు అర. నడిమిది పడకటర. మొదటిది కచ్చేరి కూటముగా ఉంటున్నది. యీ అరల కింద సామాను ఉంచడానికి ఒక అంతస్తు ఉన్నది. ఈ మూడు అరలమీద సవారీలు మూడు వుంచి ౩౦ మంది బోయీలు వుండవచ్చును. దీనికి కొయ్యలతో నీళ్లు తోసేవారు మాలీలు అని ౧౮ మంది, మాంజీ అనే చుక్కాణి తిప్పేవాడు ఒకడున్ను ఉన్నారు. యిటువంటి బజరాకు సాధారణమయిన బాడిగె దినానికి ౭ రూపాయలు. ఇక్కడకలదారలని, శిక్కారూపాయిలని చెలామణి అవుచున్నవి. ఈ రూపాయలు మన దేశపు రూపాయి ౧ కి ఒకఅణా యెక్కువ అనుకోవలసినది. యీ బజరాలు ఫలాని ఊరికి వెళ్ళడానకు యిన్ని దినము లని సర్కారువారు నిరుకుచేసి ఉన్నారు. యీ పడవ ఒకరికే ఒకతావుకు బాడిగెకు వచ్చి మళ్లీ వచ్చినతావుకు పొయ్యేట

ప్పుడు మరిఒకడు బాడిగెకు మాట్లాడుకుంటే ఆ నిరుకు దినాలలో సగము దినాలకే బాడిగెయియ్య వలసినది. బజరాచేరే నిరుకుదినాలకు ఎంత తక్కువగా స్థలము చేరినా ఆ నిరుకుదినాల బాడిగెపూర్తిగా యివ్వ వలసినది. అది యెట్లానంటే కాశికి ప్రయాగ నుంచి యీ కాలములో బజరా ౬ దినములకు చేరుతున్నది. అయినప్పటికిన్ని నిరుకయిన ౧౫ దినాలకున్ను బాడిగె యియ్యవలసినది.

ఈ ప్రకారము దండు తీసుకొని అనేక పడవలు బంగాళా నుంచి ప్రయాగకు వచ్చివుండి మళ్ళీ పోవుచుండగా ఒక బజరాను బాడిగెకు మాట్లాడి నిశ్చయము చేసుకున్నాను. యిది ఒకటే నాసత్తునకు నేను యిక్కడ ఉంచుకున్నంత మటుకు చాలును. అయితే దేశానికి పట్టుకుని పోవలసిన గంగాజలము యమున కలియకుండా ఇక్కడ దశాశ్వమేధ ఘట్టములోనే పట్టవలసినది నియమము గనుక సుమారు ౫౦౦పళ్ల *గంగ ౫౦ బానలలో పట్టి యుంచినాను. ఆ గంగ కాశికి తీసుకురాగలందుల కయి ఒకనావా ౨౦ రూపాయిలకు మాట్లాడి కుదుర్చు కున్నాను. మొరకను నాలుగు దినాలకు కాశికి పోవచ్చును. ప్రవాహము తీసిన దినాలు గనుక గంగకుండా పోతే ౬ దినములు పట్టునని యిక్కడివారు చెప్పినా పరీక్షార్థముగానున్ను కూడావచ్చిన వారి ఆసోదా (విశ్రాంతి) నిమిత్తమున్ను ఊహించి గంగకుండా రావడ మయినది.

గంగా ప్రవాహకాలము ఇక్కడ శ్రావణ భాద్రపద మాసాలు. యిప్పట్లో తూర్పుగాలి కొట్టుచున్నది. ప్రవాహపు వడి ముందర గాలికూడా నిండా పనికిరాదు. యీ బజరాలకు మూడేసి చాపలు ఒక స్తంభమునకు కట్టుచున్నారు. నేను పోవడము తూర్పు గనుక నాకు గాలి యెదురయి యున్నది. యిక మంచుకాలము వచ్చే నెల మొదలు ఇక్కడ ఆరంభ మవుచున్నది. చైత్ర మాసమునందున్ను, వైశాఖ మాసమునందున్ను, ఈ కార్తీకమాసమునందున్ను ఇక్కడ ఎండ తీక్ష్ణముగా కాయుచున్నది. నాతో కూడావచ్చిన సామగ్రిని మిరిజాపురమునుంచి కాశికి లోగడనే పంపించివేయగా మిగిలిన నాతో

* చెన్నపట్నములో పాలు మొదలగు ద్రవములు కొలుచు కొల మానము ఒక పడి రమారమి ఒకటిన్నర సేరులు.

కూడా ఉన్న కంబళిడేరా ఒకటిన్ని, శిఘాయిడేరా ఒకటిన్ని ఒక కళాసు నున్ను కూడా పడవలమీాద ఉంచుకుని, గుర్రాలను, ఒక జత బోయీాలను, కావడివాండ్లను, కాయలామనుష్యులనున్ను మెరకను పంపించి బయలు దేరినాను.

గంగలో రాతిగొట్టు లేదు. గంగాతీరమునందు వసతి అయిన ప్రదేశములో దిగి రాత్రి పగలున్ను వంట చేసుకొని తలీఁపోవుచు వచ్చినాము. ప్రవాహపు వడిచేత గంగమధ్యే మిట్టలు పెట్టుచున్నవి గనుక పడవలు, బజరాలున్ను మిట్టతగిలి పగిలిపోతున్నవనే భయము చేత రాత్రిళ్ళు పడవలు ఇక్కడ నడిపించరు. చీకటిపడగానే ఒకతావున పడవలు నిలుపుతారు. గంగలో సాయంకాలమునందు పరంగి కొండ శాలలో గుఱ్ఱపుబళ్ళు నడిచేటట్టు * పడవలు బజరాలున్ను వచ్చుచు పోవుచున్నవి. గాలిలేక ప్రవాహానికి యెదురుకొని పడవలు పోవలసినప్పుడు పడవలకు తాళ్ళుగట్టి గట్టుననుండే మనుష్యులు యీాడ్చుకొని పోతారు. ప్రవాహపుదారిగా గాలికి యెదురుకొని పొయ్యే టప్పుడు కొయ్యలతో నీళ్ళు తోస్తూ పోతారు. గాలి అనుకూలించి నప్పుడు ప్రవాహపుజోరు కలిగిన తావులలో చాపలుకట్టి మాలీలు వూరికే కూర్చుంటారు. చుక్కాణివాడి జాగ్రత మాత్రము సర్వకాలమందున్నుండవలసి యుంచున్నది.

గంగ భూమి మట్టానికి బహు లోతుగా ప్రవహింపుచున్నది గనుక ఊళ్ళు నిండా గంగ సమీాపమునందు ఉండకపోయి నప్పటికిన్ని గంగకు యిరుపక్కల అడుగుకు ఒక ఊరు వున్నట్టుగా దగ్గర దగ్గర ఊళ్ళు వుండి వున్నవి. వాటి పేళ్ళు విచారించడానికి గంగలో రావడము చేత వయిపు లేకపోయెను. వాటి పేళ్లు పడవతోశ్లే మాలీలకు కూడా తెలియదు. గంగలో రాగా కనుపడ్డ ప్రసిద్ధ స్థలాలు యేవంటే వింధ్యవాసిని ౧, మిరిజాపూరు ౨, చెన్నాడుగడ అనే బస్తీకోట కలిగిన షహరు ౩, చోటా కలకత్తాయనే దండు ౪, రామనగరము వ్యాసకాశి అనే ద్వినామములు గల బస్తీ షహరు ౫.

---

* చెన్నపట్టణములో ఆనాడు దొరలు విహరించు స్థలము మౌంటు రోడ్డులో నీడకోసం రెండుపక్కలా వేయబడిన చెట్ల బజారులో నే.

చెన్నాడుగడ వద్ద ఒక కొండ ఉన్నది. ఆ కొండమీదనే గంగ ఒడ్డుగా ఒక కోట యున్నది. దాన్ని యింగిలీషువారు ఇప్పటికి బహు బస్తీగా ఉంచుకొన్నారు. కాశికి యెదట గంగకు ఇవతలి పక్కనుండే వ్యాసకాశిలో ౨౬ తేది రాత్రి ౮ ఘంటలకు ప్రవేశించినాను. ఇక్కడికి కాశీపట్టణము తెలియుచున్నది. నిత్యము చంద్రాస్తమయ మయ్యేవరకు నా పడవలు తోయిస్తూ వున్నాను గనుక అదేరీతిగా యింకా రెండు గడియలు తోయిస్తే కాశి చేరుదును. అయితే ఉప వాసముతో మహానగరము చేరవలసిన నియమము గనుక యిక్కడనే ఈ రాత్రి వసించడమైనది.

గంగలో బజరాలమీద వెళ్ళే సౌఖ్యము అనుభవ వేద్యము గాని వ్రాయ శక్యము కాదు. దిగిన తావున పారా యియ్యడానికి మాత్రము మనవంటి వారికి మనుష్యులు చాలివుండవలసినది. సామా న్యపు ముసాఫరులు పడవలమీద వస్తే పెరిమిట్టు మనుష్యులనే సుంకం బంట్రోతులు సోదా యియ్యవలె ననే బహానా (వంక; నెపము) ప్రతి పూరిదగ్గర పెట్టి యేమైనా లంచము యియ్యకపోతే మూట ముల్లెలు విచ్చి అభాసు చేసి పడవలను నిలిపి బహు తొం దర పెట్టుతారట. పేదలకు ప్రయాగనుంచి కాశికి రావడా నికి పడవకు యిచ్చే బాడిగె గాక మనిషి ౧ కి రూపాయి వంతున లం చాలకింద తగులుతున్నదట. యీ లంచాల మూలకముగానే యీ ఘాట్ల సుంకపు దారోగాలకు జీతము పదిఅయిదు రూపాయలు అయినా యిన్నూరు మున్నూరు రూపాయలు నెల ౧ కి సంపాదించే టట్టు మిరిజాపూరులో నాకు తెలిసినది. ప్రయాగలో జూసీసరాయి సుంకము వారికి నా నిమిత్తమై జరిగిన దాపువల్లను, ఆ జిల్లా బంట్రో తులు కూడావున్నందుచేతనున్ను అటువంటి శ్రమ నాకు యెక్కడా కలిగినది కాదు.

హాయిదరాబాదు మొదలు యింగిలీషుదొరల వద్దికి మనవంటి వారు పోయి రాగానే కొంచెములో తృప్తిలేని ఆదొరలవద్ది నకీబులు చోపుదార్లు వగయిరాలు యినాములకు వచ్చుచున్నారు. యీ ధుబారు ఖర్చు విస్తారముగా అక్కడక్కడ తగ్గుతూ వచ్చినది.

యీ ప్రయాగలో పైన వ్రాసిన దావువల్ల అటువంటి ఖర్చు ఒక గవ్వఅయినా తగిలినది కాదు. ప్రయాగలో స్నానఘట్టపు బంట్రోతులు నిత్యము నా సేవచేస్తూ వచ్చినందున వారికిన్ని నా తయినాతీ బరకందాసు బంట్రోతులకున్ను మాత్రము నేను వచ్చేటప్పుడు కొంచెము యినా మిచ్చినాను.

ప్రయాగ యిండ్లు, అంగళ్ళు యథోచితమైన వెడల్పు గలవిగానే కట్టివున్నవి. ప్రయాగలో చెప్పే సంకల్పక్రమము మన దేశమువలెనే 'భరతఖండే' అనే మట్టుకు చెప్పి అటుతర్వాత 'ఆర్యావర్తాంతర్గత బ్రహ్మావర్తైక దేశే, విష్ణు ప్రజాపతి క్షేత్రే, షట్కోణమధ్యే, అంతర్వేద్యాం, భాగీరథ్యాః పశ్చిమే భాగే, కాళింద్యాః ఉత్తరే తీరే, వటస్య పూర్వదిగ్భాగే, విక్రమశకే, బౌద్ధావతారే, ప్లవనామ సంవత్సరే' అని పిమ్మట మనదేశరీతిగా మాసము తిథి మొదలయినవి చెప్పవలసినది. కాశిలో చెప్పే సంకల్పక్రమ మేమంటే 'ఆర్యావర్తైక దేశే, అవిముక్త వారణాసీక్షేత్రే, అసివరణయోర్మధ్యే, మహాశ్మశానే, ఆనందవనే, గౌరీముఖే, త్రికంటకవిరాజితే, భాగీరథ్యాః పశ్చిమతీరే, బౌద్ధావతారే, విక్రమశకే, ప్లవనామసంవత్సరే' అని చెప్పవలెను. ఇటువంటి కాశీమహాక్షేత్రమును అకటోబరు ౨౭ తేది ఉదయమయిన ౮ ఘంటలకు శ్రీరామకటాక్షముచేత చేరినాను.

## పండ్రెండవ ప్రకరణము

కాశీపట్టణములో నిండా జనసంఘము కలిగివుండును గనుక వూరికి బయట అసివద్దవుండే తోటలలో ఒకతావున దిగవలెనని యోచిస్తిని. వాట్లలో స్థలము సంకుచితముగా వుండినందున నున్ను మణికర్ణిక మొదలయిన స్థలాలకు దూరమవుట చేతనున్ను కాశీతంబురాయనియొక్క కేదారఘట్టములో వుండే రెండు అంతస్థులు నాలుగు ముంగిళ్లు కల ఒక పెద్దయింట్లో దిగినాను. నాకోసరమై ఆస్థలము ముందుగా ఖాళీచేసి శుద్ధిచేసివుంచి యున్నందున బహుసౌఖ్యముగానే వుండెను. ఆయిల్లు గంగ యొడ్డుగానే వున్నందున సమ్మతి అయినప్పుడు నిద్దెమీదినుంచి గంగాదర్శనము చేయడానికి అనుకూలముగా వుండినది.

ఈ కాశీస్థలానికి బాధ్యులుగా గంగాపుత్రులనే వారు ౧౨౦౦ యిండ్లవారు ఉన్నారు. వారు క్షాత్రిశౌర్యాల చేత దౌరతనము చేసే వారని, గంగాయాత్రి చేయ వచ్చేవారివద్ద గుత్తానికి ౧౨ రూపాయల వంతున నున్ను, మనిషికి ౪ రూపాయల వంతుననున్ను, గాడీకి యాభై రూపాయిల వంతున నున్ను యాత్రివచ్చే వారిని ముందుగా చూచిన గంగా పుత్రుడు తీసుకొని మణికర్ణికలో స్నానము చేయింపుచు, యివ్వక స్నానముచేసి మొండాటలాడితే కొట్లో వేసి కోర్టు సెలవులతో కూడా తీసుకుంటూ, బహుశా యియ్యని వారిని యియ్యచాలని వారినిన్ని తమ పోకిరితనము చేత మానభంగమున్ను, దేహబాధయున్ను పెట్టుతూ వచ్చుచున్నారు. వీరికి భయపడి శరభోజీ మహారాజు *అంతటి వాడు, కేదారఘట్టమే వృద్ధమణికర్ణికయని ఒక పురాణ ప్రమాణమును పట్టి క్షౌర శ్రాద్ధాలు కేదారఘట్టములో గడిపినాడు. విజయనగరపు రాజు కాశికి వచ్చిన్ని ఒక సంవత్సరము మణికర్ణిక స్నానము లేక నుండినాడు. యిక పేదల గతి చెప్పవలసినది లేదుగదా! యిటువంటి సమూహము వల్ల నాకు ఒక అభ్యంతరమున్ను లేకుండా నన్ను రామటెంకివద్ద యెదురుకున్న రామరహల్లు అనే గంగాపుత్రుడు గోపీగంజులోనే నేను యిచ్చినది తీసుకొని యాత్రి చేయించేటట్టు దస్తయివేజు వ్రాసియిచ్చి ప్రయాగ వరకు కూడావచ్చి నా సహితముగా కాశి ప్రవేశించినందున యథాశాస్త్ర ప్రకారము మహా స్థలము చేరిన మరుసటి గడియకే మణికర్ణికకు వెళ్ళి అక్కడ చక్రతీర్థములో భేటికి అని ఒక మొహరు ఫలపుష్ప సహితముగా నుంచి ముందర స్నానము చేసి పిమ్మట క్షౌరానికి సంకల్పము చేసుకొని క్షౌరానంతరము మణికర్ణికలో స్నానముచేసి గంగాపూజ చేసి గంగాపుత్రుల సమూహానికి భూరి దక్షిణ అని పదిహేను రూపాయలు, ఘాటీయాలనే గంగాతీర స్నాన ఘట్టమునందు వుపచరించేవారికని, పదిరూపాయలు, కంగాళీల

---

* ఈయన తంజావూరి మహారాజు. 1786 లో తండ్రి చనిపోవునాటికి 9 ఏండ్లవాడు. పినతండ్రి రాజ్యాక్రమణ చేయగా కుంఫిణీవారి నాశ్రయించి 1797 లో రాజ్యము పొందెను గాని రెండేండ్లలోనే పింఛనుదారు డయ్యెను. ఈయన 1833 లో చనిపోయినాడు. బిషప్ హెబరు 1826 లో ఈయనను దర్శించినాడు.

కని అయిదు రూపాయలున్ను భూరి యిచ్చి నేను దిగిన స్థలము ప్రవే
శించినాను. ఆ మరునాడు నాతో కూడావచ్చిన బ్రాహ్మణు
లందరిచేత తీర్థశ్రాద్ధాలు పెట్టించడ మయినది. నాలుగో
దినము నేను తీర్థ శ్రాద్ధము పెట్టడమయినది. యీ మహా
స్థలములలో అన్ని శాఖల బ్రాహ్మణులున్ను సమూహాలుగా వున్నం
దున శాఖకు యాభై మంది వంతున అధిశ్రవణనకున్ను, యిష్టబంతికిన్ని
పిలిపించినాను. పావులా దక్షిణతో వారు సంతోషించినారు.

యీ కాశిలో మణికర్ణికకు మహాత్మ్యము వచ్చినందుకు
కారణ మేమంటే విష్ణువు చక్రము చేత తీర్థము కల్పించుకొని తపస్సు
చేస్తూ వుండగా పార్వతీసమేతముగా శివుడు అక్కడికి వచ్చినంతలో
పార్వతియొక్క కర్ణికామణి ఆ తీర్థములో పడిపోయెను గనుక
శివుడు వెతికినట్టున్ను, విష్ణు మాయచేత దొరకనట్టున్ను, తదనంతరము
విష్ణువు బావమరిది వొప్పారితో హాస్యము చేసినట్టున్ను, ఆ చక్రతీర్థము
పార్వతీకర్ణికామణినిన్ని శివుని మానసమునున్ను, ఆకర్షించి విష్ణు
చక్రోద్భవమున్ను అయినందున గంగ భగీరథుని నిమిత్తము భూలోక
ప్రవేశమయినప్పుడు యీతీర్థమాహాత్మ్యము తెలిసి యీతీర్థ సంగ
మము చేసినది గనుక యీ మణికర్ణికా ఘట్టము యీ స్థలానికి అతి
ముఖ్యమయినది. ఆ చక్రతీర్థములోనే ప్రథమస్నానమును కాశి
ప్రవేశించగానే అందరున్ను చేయవలసినది. ఆ చక్రతీర్థము మణి
కర్ణికా ఘట్ట సమీపమునందు ఒక చిన్న గుంటగా యున్నది.
ఆ తీర్థాన్ని గంగాపుత్రులు ఆక్రమించుకోవడముమాత్రమే
గాక సదా ఆవరించుకుని వుంటున్నారు.

యీ కాశికి బహుపుణ్య కాలమున్ను, బహు మహోత్సవ
కాలమున్ను, బహు జనాకర్షణ కాలమున్ను యేదంటే కార్తీకమా
సము. ఆ కార్తీకమాసములోను శుద్ధైకాదశి మొదలు పున్నమవరకు
పంచ దివసములు పంచరత్నాలని పేరు వహించివున్నవి. యీ కార్తీ
కమాసము ముప్పైదినములు లక్షావధి ప్రజలు కాశికి స్నానాల నిమిత్త
ముగా వస్తారు. కృత్తికా నక్షత్రము అదర్శనము కాక మునుపే

అందరున్ను పంచ గంగా ఘట్టమందు స్నానము చేస్తున్నారు. శ్రీరామ కటాక్షము యీ పంచరత్న దినములలోనే నన్ను యీ కాశిలో ప్రవేశింప చేసినందున పున్యమస్నానము ఆ పంచగంగా ఘట్టములో చెయ్యడమయినది. యీ పంచగంగా ఘట్టము పంచపాండవుల తపోబలముచేత యింత ప్రసిద్ధమయినట్టు పురాణ సిద్ధము.

కాశి పట్టణమునకు ఉత్తరమున 'వరణ' దక్షిణమున 'అసి' అని రెండు నదులు కాలువలుగా గంగలో సంగమ మవుచున్నవి. అసి అనే కాలువ అతి స్వల్పము. యీమధ్యే వుండే భూమి వారణాసి అనే పుణ్యక్షేత్రమయినది. యీ అసివరణల మధ్యే గంగ ధనురాకారముగా ప్రవహింపుచున్నది. గంగకు పడమటి యొడ్డున కాశీపట్టణము యేర్పడియున్నది. అసివరణల మధ్యము అవిముక్తక్షేత్రము గనుక యిక్కడ దేహము వదలిన జీవాత్మునికి తారకోపదేశము అవుచున్నదని పురాణ ప్రసిద్ధము. గనుక గంగాతీరమందు యిండ్లు స్నానఘట్టాలున్ను నారు పోసినట్టు వీధులకు కూడా యెనిమిది అడుగుల భూమి విడువకుండా జానెడు జానెకు భూమికి వేలమోడిగా రూపాయలు యిచ్చి స్థలము విశాలముగా కావలిస్తే మీద్దెమీదమిద్దెగా యేడేసి అంతస్తులు కూడా కట్టుకుని కాపురముచేస్తూ వున్నారు. యీ అసివరణల మధ్యే గంగాతీరమందు భూమి కొనవలిస్తే పూనా శ్రీమంతుడు *వగయిరాలకు శక్యమేగాని సామాన్యులకు వయిపులేదు. అసివరణల మధ్యే కేదార ఘట్టము మొదలు రాజఘాటు వరకు అహల్యాబాయి,♦నాగపూరిరాజు, శింధ్యా వగయిరాలు అనేకలక్షలు వ్రయముచేసి కాపురానికి యిల్లున్ను

---

* పీష్వా అని చరిత్రలో ప్రసిద్ధిజెందిన మహారాష్ట్ర ప్రధానమంత్రి, తరువాత కొంతభాగమునకు రాజయ్యెను. పునహా అతని రాజధాని.

♦ అహల్యాబాయి ఇందూరు రాజగు మలహాల్ రావు హోల్కారు భార్య. ఈమె 20 వ ఏటనే భర్త మరణించాడు. కొమారు డప్రయోజకు డైనాడు. ఈమె సహగమనం చేయదలపగా ప్రజలు వారించి రాజ్యాధికారం వహించ మని ప్రార్థించారు. 1765 మొదలు 30 సంవత్సరాలీమె ఇందూరును అతి సమర్థతతో పరిపాలించింది ఈమె సద్గుణములను, దాతృత్వమును, తెలివితేటలను ఇంగ్లీషువారు కూడా మెచ్చుకున్నారు. ఈమె హిందూదేశములో అనేక పుణ్యక్షేత్రాలలో గొప్ప దాన ధర్మాలు చేసి 1795 లో స్వర్గస్థురాలైంది.

స్నానానికి ఘట్టమున్ను శివప్రతిష్ఠకు గుడిన్ని ఒకటిగా కలిపి కట్టుతూ వచ్చినారు.

సవారీలలో స్నానానికి ఒక ఘట్టమునుంచి ఒక ఘట్టానికి పోవడము వీధుల కుసందిచేత ప్రయాస గనుక చిన్నపడవలమీద పరువు గలవారు గంగగుండా పోతూ వస్తూ వుంటారు. ఆ ప్రకారము పోయి వచ్చేటప్పుడు చూడడమునకు ఆ పట్టణము అతిసుందరముగానున్ను అత్యద్భుతముగాను న్నుంచున్నది. అందులో శ్రీధర మునిషీ అనే వాఁడు కట్టిన ఘట్టము, అహల్యాబాయి కట్టిన ఘట్టము మరికొందరు గోసాయీలు కట్టిన ఘట్టములున్ను సుందరములుగా నున్నవి.

ఆ అసివరణాల నడిమి పుణ్యఘట్టము లేవంటే వరణాఘట్టము, రాజఘట్టము, త్రిలోచన ఘట్టము, దుర్గాఘట్టము, పంచగంగా ఘట్టము, మణికర్ణికా ఘట్టము, దశాశ్వమేధఘట్టము, కేదారఘట్టము, హనుమద్ఘట్టము, అసిఘట్టము న్నున్నవి. త్రిలోచన ఘట్టమువద్ద చెన్న పట్టణములో కష్టం హావుసు రేవు వలెనే సకల ధాన్యాలు బోళా అనే పెద్ద అంగళ్ళు పెట్టి మొత్తపు విక్రయాలు చేయుచు వున్నారు. రాజ ఘాటులో ముఖ్యమయిన సుంకపు చావిడీ వుంచున్నది.

కాశీవాసము యథావిధిగా చేశేవారు యీ అడుగున వ్రాసిన శ్లోక ప్రకారము ఆయా ఆలయాలకు వెళ్ళి ఆయా మూర్తులను ఆరాధించి రావలసినది. శ్లో॥ విశ్వేశం మాధవం ధుండిం దండ పాణించ భైరవం । వందే కాశీం గుహాం గంగాం భవానీ మణికర్ణికాం॥ వీటిలో విశ్వేశ్వరుడి ఆలయము భవానీ అనే అన్నపూర్ణ ఆలయము, ధుండి వినాయకుడి ఆలయమున్ను కేదారఘట్టానికి సమీపముగా మణికర్ణికకు పొయ్యే దోవలోనే యున్నవి. అటువెనక దుర్గాఘట్టమువద్ద కాలభైరవుడి ఆలయము దండపాణి ఆలయము వుండియున్నవి.

పంచగంగాతీరమునందు బిందుమాధవుడి ఆలయము వున్నది. అక్కడికి సమీపముగా తురకల మశీదు ఒకటి ఆశ్చర్యకరమయిన యున్నతము కలిగి రెండు స్తూపీలతో నిర్మించపడి యున్నది. ఆ రెండు స్తూపీల కొనకు పోవడానికి లోపలనే మెట్లు కట్టియున్నది. ఆ రెండు

స్తూపీలు సుమారు యేనూరు అడుగుల పొడుగు వుండవచ్చును. తోలు కాలమందు అకబరు పాదుషా కాశీ యావత్తూ తురకాణ్యము చెయ్యవలె నని తలిచి ముఖ్య మయిన గుళ్ళు యావత్తు కొట్టి పాడుచేసినప్పుడు యీ మసీదును కట్టినాడట *అద్యాపి అది నిర్మించపడి యుండే శృంగారము యింగిలీషువారిని కూడా మరామత్తు చేశేటట్టు ప్రేరేపణ చేసినది. యిప్పుడు వుండే విశ్వేశ్వరుడి ఆలయము మొదలుగా అనేకములు నూతన నిర్మాణములై వున్నవి.

పయి శ్లోకములో నుండే గంగా అనే తీర్థము ఒక కోలను స్వరూపముగా పట్టణమునకు పశ్చిమ భాగమునందు యుండి యున్నది. కాశి అనే దేవి త్రిలోచనేశ్వరుడి ఆలయము వద్ద దుర్గాఘట్టములో యున్నది. గుహా అనే ఒక బిలము కాశీ పట్టణమునకు దక్షిణభాగమందున్నది. యీ కాశీపట్టణములో శివాలయాలు లింగాలున్న అనేకములు కాశీఖండములో విష్ణుపాదిగా త్రిమూర్తులేమి యింద్రుడాదిగా దేవతలేమి ధృవుడాదిగా తేజస్వరూపాలేమి సూర్యుడాదిగా గ్రహాలేమి అగస్త్యుడాదిగా ఋషులేమి ఈ అవిముక్త క్షేత్రమందున్న ఆనందవనములో లింగప్రతిష్ఠ చేసి ఆరాధన తపస్సు పురస్సరముగా ఆ యా విభూతులను సంపాదించుకొన్నట్టు యున్నది. గనుక ప్రతిలింగానికి అగస్త్యేశ్వరుడని, రామేశ్వరుడని ఒక్కొక్క పేరుగలిగి అవి వొకానొక దినమున అక్కడి ఆరాధన ప్రాబల్యము కలగచేసుకొని ఉండియున్నవి. ఆ యా నియమింప బడిన దినములలో ఆ యా స్థలాలలో జనసంఘము మిక్కటముగా నుంచున్నది.

ఇక్కడ నుండే ఆలయాలు అన్ని సంకుచితములుగా నున్ను అరిటిపువ్వందముగా సాదాస్తూపీలు కలిగిన్ని అర్చకులవల్ల నిండా కాపులేకుండా నున్ను వృషభముల చేత ఆవరింపబడిన్ని యుంచున్నవి. ఆరాధనచేశేవారు పత్రిపుష్పఫలతోయములతో తామే, శక్తి కలిగినంతమట్టుకు ఆయా ఆలయములలో ఆయా మూర్తులను జాతినియమము లేకుండా ఆరాధనచేయుచు వచ్చుచున్నారు. కాచియుండే

* ఇది పొరబాటు ఈ మశీదు కట్టినది ఔరంగజేబు చక్రవర్తి. విశ్వేశ్వరాలయం క్రీ. శ. 1669 ఏప్రిలులో నాశనం చేయబడింది.

అర్చకులు, వచ్చిన ఉపపన్నులను యాచిస్తూ పేదలు ఇచ్చేదాన్ని పుచ్చుకొంటున్నారు.

యీ క్షేత్రములో సర్వత్ర ఆలయములలోని అర్చకులు పంచగౌడులతో చేరినవారు. కాలభైరవుని అర్చకులుమాత్రము కాను పడాలని ఒక వింతజాతివారు. చెవులు మధ్యప్రదేశములో బొందచేసుకొని స్ఫటిక బిళ్ళలను ధరించియున్నారు. మణికర్ణికా ఘట్టమునందు గంగాపుత్రులున్ను ఘూర్జరులున్ను వసింపుచున్నారు. దుర్గాఘట్టములో మహాజను లనే సాహుకారులు పూర్వీకులైన స్థలజ్ఞులున్ను వసింపుచున్నారు. కేదారఘట్టములో కంగాళీలనే దక్షిణదేశస్థులు యాత్రార్థముగా వచ్చినవారు మిక్కుటముగా వసింపుచున్నారు. దుర్గాఘట్టములో ఇండ్లు వున్నతములుగా అంతస్థులు యెక్కువగా కలిగియున్నది.

మణికర్ణికకు దక్షిణమున సమీపముగా చౌకంబా అనే గుజరీ అంగడీ యున్నది. యీ పట్టణములో పీతాంబరాలేమి సకల విధములయిన వస్త్రములేమి అపూర్వము లయినవి కావలసినంత మట్టుకు దొరుకును. పాత్రసామానులు అపారముగా అమ్ముతూ ఉన్నారు. మహాజనులు రత్నాలు మొదలయినవి అమ్ముతూ వున్నారు. లక్నో * మొదలయిన సమస్థానములకు కావలశిన ఆభరణాలు రత్నములున్ను యిక్కడి నుంచి పోవుచున్నవి.

పట్టణానికి వుత్తరముగా గంగా సంగమము అయ్యే వరణ పట్టణమును చుట్టుకొని పడమరగా ప్రవహింపుచు దక్షిణమున అసితో

---

* లక్నో అయోధ్యనవాబు రాజధాని.

ఈ నవాబు మొగలాయి చక్రవర్తి కాలంలో రాజప్రతినిధి తరువాత స్వతంత్ర రాజు, ఇంగ్లీషువారు ఇతనితో స్నేహంచేస్తూ ఇతనివల్ల చాలా సొమ్ము సంపాదించారు. ఇతని దర్బారు అతివిభవంగా వుండేది. ఇతడు దొరల మెప్పుకోసం అమితసొమ్ము ఖర్చుపెట్టి అప్పులపాలైనాడు. అత్యధికవడ్డీలతో ఇతనివల్ల దొరలు చాలా పత్రాలు వ్రాయించుకొన్నారు. అయోధ్యరాజ్యం పాడిపంటలతో తులతూగుతూ సుభిక్షంగా వున్నందువల్ల ఎలాగైనా దీన్ని కాజెయ్యాలని కంపెనీవారితని పరిపాలన బాగాలేదని ప్రజలు బాధపడుతున్నారని దుష్టప్రచారంచేస్తూ చివరకు 1857 లో ఇతనిని తోసి రాజన్నారు. ఈ నవాబు సద్గుణాలను విధివాన్ని బిషప్ హెబరుగారు 1824 లో వర్ణించారు.

కలిసి వుంచున్నది గనుక ఆవరణకు బహిః ప్రదేశములో జాతులవారు సిక్కులూరు అనే ప్రదేశములో ఇండ్లు తోటలు కట్టుకొని వసింపు చున్నారు. ఇక్కడ ఉండే అధికారస్థులు గౌనరు జనరల్ యేజెంటు అనే సర్వాధికారి ఒకడు, అప్పీల్ కోరటు జడ్జీలు ముగ్గురు, కష్టం కలకటరులు యిద్దరు, జడ్జీ ఒకడు, మేజస్ట్రేటు ఒకడు; వీరు కాక రెండుమూడు పటాలాలు ఇక్కడ వునికిగా ఉంచున్నవి గనుక వాటితో చేరిన దొరలు ఒక జనరల్ సహితముగా వసింపు చున్నారు. లోగడను యీ పట్టణములో టంకసాల ఉండెను; ఇప్పుడు యెత్తివేశినారు. యీ దొరల కచ్చేరీలు అన్ని శిక్కులూరిలో ఉన్నవి.

యీ పట్టణములో కొత్తవా లనే ఒక పెద్దఉద్యోగస్థుని కచ్చేరీ యున్నది. ప్రతివీధికి తాణా లున్నవి. యిక్కడి వీధులకు గళ్ళీ లని పేరు. ప్రతి గల్లీకి పాటక్కు అని తలుపులు ద్వారబంధనాలు పెట్టివున్నవి. ప్రతి పాటక్కునున్ను రాత్రి ౧౦ ఘంటలకు బిగింపుచున్నారు. అవతల జనులు తిరుగులాడడము ప్రయాస. తాణా బంట్రౌతులు బరకన్దాసు లనే పేళ్ళతో రాత్రిళ్లు గస్తు తిరుగుతూ వున్నారు. వీరందరున్ను కొత్తవాల్ ఉత్తరువుకు లోబడి వున్నారు.

సమస్తమయిన కూరకాయలున్ను ఫలాలున్ను అపరిమితముగా దొరుకుచున్నవి. అందులో ఇక్కడి ముల్లంగిగడ్డల గాత్రమున్ను పొడుగున్ను నేను యీ సరికి యెక్కడ చూచినవాణ్ని కాను. కూర గడ్డ లని వేలెడులావు గల గడ్డలు వాటి ఆకు సహితముగా అమ్ముతూ వున్నారు. కిచ్చిలి మణీలా పండ్లు, కిచ్చిలి కమలాపండ్లున్ను చెట్లుకింద రాలి యెత్తేవారు లేక నున్నవి.

గొప్పయిండ్లు పట్టపగులే చీకటిగా ఉంచున్నవి. ఘాటియా లనే స్నానోపచర్యలు చేసేవారు అనేకజాతులుగా కలిసి యుంచున్నారు. అసివరణల మధ్యే ౧౨౦౦ మంది ఆయా స్నానఘట్టాలలో పలకలు వేసుకొని ఉపచార్యాద్రవ్యా లయిన విభూతి గోపీచందనము మొదలయినవి ఉంచుకొని యున్నారు. స్నానఘట్టములలో వారి యధికారము ఎక్కువ. యీ గంగా పుత్రులు ఘాటియాలు కాక తాణీలని పంచ

పూజలని ప్రసిద్ధముగా చేయుచున్నారు. ౩౦ రూపాయలలో ముఖ్యమైన స్థలములలో మహాపూజలు జరుగుచున్నవి.

పట్టణమునకు దక్షిణ భాగమున అసీతీరము నందు దుర్గా గుడి ఒకటి యున్నది. ఈ దేవత ఈ పట్టణమునకు కావలిగా వుండే శక్తియని పురజనులు మెండుగా ప్రతి మంగళవారమున్ను వెళ్లి ఆరాధింపు చున్నారు. ఈ గుడి తక్కిన గుళ్ళకన్నా విశాలముగా నున్నది. సమస్త మయిన గుళ్ళున్ను యెక్కడ చూచినా నిత్యయాత్రచేసేవారు అభిషేకనిమిత్తమై పోశే ఉద్ధరిణె నీళ్ళతోనున్ను బిల్వదళములతో నున్ను తిలాక్షతలతోనున్ను నిండియుంచున్నవి. యీబిల్వపత్రములు తిలాక్షత లున్ను తినడమునకు వృషభములు లోగా సంచరింపు చున్నవి. కాబట్టి పూజించ పొయ్యేవారు పుష్పమాలికలున్ను,బిల్వదళములున్ను,చేతులో తెలిసేటట్టు యుంచుకుంటే ఈ వృషభములు పయిన పడుతున్నవి. నిత్య యాత్ర చేసే నిమిత్తముగా వేలపర్యంతము స్త్రీలు, పురుషులున్ను, పిడికిలి కోణిగిన బుట్టలలో డబ్బిలలో నున్ను బిల్వపత్రము, తిలాక్షత లున్ను ఉంచుకొని,మరియొకచేత ఉదకము తీసుకొని, చూచిన లింగాని కిన్ని లింగము ఉండే ఆలయ ద్వారము మూసియుండే పక్షమందు ఆ ద్వారపు కడప మీద ఒక ఉద్ధరిణె ఉదకముతో అభిషేకము చేసి ఒక బిల్వపత్రము వేసి కొన్ని తిలాక్షతలు చల్లుచు వచ్చుచున్నారు. స్నాననియమము ప్రతి మనిషికిన్ని కలిగియున్నది. శూద్రులుకూడా శిరస్నానము చేయక భోజనము చేయరు. ఈ దేశపు బ్రాహ్మణులు ఇతర వర్ణాలను నిండా అనాదరణ చేసి అగౌరవ పరచనందున కర్మ హీనులుగా చేయవలెననే క్రిస్తు మతస్థుల ప్రయత్నము ఈ దేశములో ఈ సరికి మిక్కిలి సాగలేదు.

ద్రావిడ దేశములో శూద్రులనున్ను, ముఖ్యముగా చండాలు లనున్ను అగౌరవ పరుస్తూ, శూద్రుల దృష్టిన్ని చండాలుల సమీప వర్తిత్వమున్ను కూడదని నిండా అగౌరవ పరచడము చేత, వేల పర్యంతము ప్రజలు క్రీస్తు మతస్థులుగా పెదపాళెము మయిలాపూరు క్రీస్తుగుళ్ళ వుత్సవాదులలో చూడబడుచున్నారు. బ్రాహ్మణులకు శ్రుతి చోదితములయిన కర్మాదులను చేసుకొనుచు "స్వస్తి ప్రజాభ్యః

ద్రావిళ్ళు పంచగౌడులతో చేరిన యాచకులు ౧౫౦౦౦ మంది దాకా వున్నారు. అందులో పంచద్రావిళ్ళు సగమని చెప్పవచ్చును.

ఈ కాశిలో వుండే వుపద్రవాలు మూడని చెప్పుకొనుచున్నారు. అవి యే వంటే - 'రాండు - సాండు - ఛీడీ' లని మూడు వుపద్రవాలు కలవు. రాండు అనగా విధవస్త్రీలు, సాండు అనగా వృషభములు, ఛీడీలు అనగా మెట్లు. విధవలు నిండా యాచించడము చేతనున్ను, దుర్మార్గపు బాలవిధవలు ఇతర నడతలు కలిగి యుండుట చేత నున్ను వారివల్ల బహు పీడ లోకులకు కలిగి యున్నది. వృషోత్సర్జనము చేసి లోకులు అనేక వృషభములను పట్టణములో విడిచి పెట్టినందున యీ గల్లీలలో మనుష్యులతోటి పాటు మెలగి సంచరింపుచు ఉంచున్నవి. ఇట్లా నుండగా వాటికి రంధి పుట్టినప్పుడు మనుష్యులను చాలా హింస పెట్టుచున్నవి. ఛీడీలని ప్రతి గల్లీలలో మెట్లు యెక్కి దిగవలసినది. వైపు తప్పి పడ్డవారికి కాళ్ళు చేతులు విరగడము కద్దు.

గోసాయీలు ధనికులుగా మహాజనాలనే పేరు పెట్టుకుని సాహుకారు పనులు చేయుచున్నారు. భిక్షాటకులుగాను బహు మంది బయిరాగులతోటి పాటు సంచరింపుచు ఉన్నారు. కంగాళీలనే భిక్షాటకులకు లెక్కలేదు. సవారీ సమేతముగా యాత్రి వచ్చేవారిని యాచించే కంగాళీలు పక్కీరులు గల్లీలలో సవారీని సాగనియ్యరు.

ఈ కాశీ మహా క్షేత్రములో అధర్వణ వేదమును కొందరు ఘూర్జరులు అధ్యయనము చేసి యున్నారు. ఆ వేదస్వరము ఋగ్వేద స్వరమునకు సమీపముగా నున్ను, ఉద్ధృతముగా నున్ను, యున్నది. యజుర్వేదములో మాధ్యందినశాఖ యని శుక్లయజుశ్శాఖ యని ప్రథమ శాఖ యని తైత్తిరీయశాఖయని స్వరభేదములతో అధ్యయనము చేయుచున్నారు. ఇక్కడ సామగులు నూటిదాకా యున్నా స్వరము దక్షిణ దేశమునకు బహు భేదముగా నున్నది; గానసౌష్టవము విస్తారము లేదు. పంచద్రావిళ్ళలో పంచగౌడులలో నున్ను ఒకటి రెండు శాస్త్రాలు చదివిన పండితులు వెయిమంది దాకా ఈ కాశీలో యున్నారు. న్యాయశాస్త్రము ఇక్కడ నిండా ప్రచురము.

బంగాళీ బ్రాహ్మణులు బహుమంది యిక్కడ పండితులయి యున్నారు. వారు ఉత్కలగౌడులు. ఉత్కలదేశములో మత్స్యభక్షణ, ద్రావిడ దేశములో మాతులకన్యా వివాహము, మాగధదేశములో మద్యపానము, మైథిలదేశములో దేవరేణ సుతోత్పత్తిన్ని, అద్యాపి నిషిద్ధము కాదని ప్రసిద్ధము.

ఈ గంగాపుత్రుల ఉత్పత్తి హేయముగా కొన్ని పురాణాదులలో చెప్పియున్నది. వారు చెప్పడ మేమంటే భీష్మాచార్యులకు పూర్వము గంగ కన్నకొడుకులను తనలో ఐక్యము చేసుకొని యుండగా అటుతర్వాత భీష్మాచార్యుల తండ్రిని గంగవదలిన వెనక, లోగడ తనలో కలుపుకొన్న పుత్రులను మళ్లీ భూమిలో ఉద్ధరించినట్టున్ను, తాము వారి వంశస్థులనిన్ని వాదింపుచున్నారు. వారు ఇప్పట్లో కాన్యకుబ్జులతో సంబంధములు చేయుచు నున్నారు. గంగాతీరమునందు ఏదానమున్ను వారిని వినహా మరి ఒకరికిన్ని యివ్వకూడదు. తాణీబ్రాహ్మణులు వచ్చినవారికి తీర్థ పురోహితము చేసినా యిండ్లలో యిచ్చే దాన్ని ప్రతిగ్రహించ తగ్గవారేగాని బాహాటముగా గంగాతీరమునందు తీసుకోలేరు. ఘాటియాలకు తాణీలకు గంగా పుత్రుల భయము విస్తారము కలదు. ఈ వుభయుల మీదనున్ను గంగాపుత్రులు తమ. రహితులని అధికారమును ఆ యా కాలములలో చెల్లింపుచు వచ్చుచున్నారు.

ఇక్కడి రూపాయీలకు చెన్నపట్టణపు రూపాయలకున్ను ఒక అణా భేదమున్నది. మన రూపాయలు చిన్న. రూపాయ ౧కి ౧౬ గండులనే ౬౪ పయిసాలు. అన్ని భక్షణయోగ్య పదార్థాలున్ను నయముగా అమ్మినా రుచికలిగి వుండడము లేదు. చూపుకుమాత్రము బహుబాగా యుంచున్నవి. నీళ్ళున్ను ఉప్పున్ను కలియని మిఠాయిన్ని పక్వాన్నాలున్ను సకలమయిన బ్రాహ్మణులున్ను కొని భక్షింపుచున్నారు. చేసే వారిజాతి విచారణ అక్కరలేదు. పుష్పాలలో జాజి పూలుతప్ప యితర సుగంధ పుష్పాలు దొరకవు. మన దేశములో తురక పూలని నిషేధముగా యెంచే పుష్పము లంతా యిక్కడ దేవతారాధనకు పరిగ్రహింపుచు నున్నారు. యిక్కడి గుళ్ళలో మహా

పూజలని ప్రసిద్ధముగా చేయుచున్నారు. ౩౦ రూపాయలలో ముఖ్యమైన స్థలములలో మహాపూజలు జరుగుచున్నవి.

పట్టణమునకు దక్షిణ భాగమున అసీతీరము నందు దుర్గా గుడి ఒకటి యున్నది. ఈ దేవత ఈ పట్టణమునకు కావలిగా వుండే శక్తియని పురజనులు మెండుగా ప్రతి మంగళవారమున్ను వెళ్లి ఆరాధింపు చున్నారు. ఈ గుడి తక్కిన గుళ్లకన్నా విశాలముగా నున్నది. సమస్తమయిన గుళ్ళున్ను యెక్కడ చూచినా నిత్యయాత్ర చేసేవారు అభిషేకనిమిత్తమై పోశే ఉద్దరిణి నీళ్లతోనున్ను బిల్వదళములతో నున్ను తిలాక్షతలతోనున్ను నిండియుంచున్నవి. యీబిల్వపత్రములు తిలాక్షతలున్ను తినడమునకు వృషభములు లోగా సంచరింపు చున్నవి. కాబట్టి పూజించ పోయ్యేవారు పుష్పమాలికలున్ను, బిల్వదళములున్ను, చేతులో తెలిసేటట్టు యుంచుకుంటే ఈ వృషభములు పయిన పడుతున్నవి. నిత్యయాత్ర చేసే నిమిత్తముగా వేలపర్యంతము స్త్రీలు, పురుషులున్ను, పిడికిలి కోశిగిన బుట్టలలో డబ్బిలలో నున్న బిల్వపత్రము, తిలాక్షతలున్ను ఉంచుకొని, మరియొక చేత ఉదకము తీసుకొని, చూచిన లింగానికిన్ని లింగము ఉండే ఆలయ ద్వారము మూసియుండే పక్షమందు ఆ ద్వారపు కడప మీద ఒక ఉద్ధరిణి ఉదకముతో అభిషేకము చేసి ఒక బిల్వపత్రము వేసి కొన్ని తిలాక్షతలు చల్లుచు వచ్చుచున్నారు. స్నాననియమము ప్రతి మనిషికిన్ని కలిగియున్నది. శూద్రులుకూడా శిరస్నానము చేయక భోజనము చేయరు. ఈ దేశపు బ్రాహ్మణులు ఇతర వర్ణాలను నిండా అనాదరణ చేసి అగౌరవ పరచునందున కర్మహీనులుగా చేయనలెనసే క్రీస్తు మతస్థుల ప్రయత్నము ఈ దేశములో ఈ సరికి మిక్కిలి సాగలేదు.

ద్రావిడ దేశములో శూద్రులనున్ను, ముఖ్యముగా చండాలులనున్ను అగౌరవ పరుస్తూ, శూద్రుల దృష్టిన్ని చండాలుల సమీపవర్తిత్వమున్ను కూడదని నిండా అగౌరవ పరచడము చేత, వేలపర్యంతము ప్రజలు క్రీస్తు మతస్థులుగా పెదపాళెము మయిలాపూరు క్రీస్తుగుళ్ళ వుత్సవాదులలో చూడబడుచున్నారు. బ్రాహ్మణులకు శ్రుతి చోదితములయిన కర్మాలను చేసుకొనుచు "స్వస్తి ప్రజాభ్యః

పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః॥ అనే శ్లోకప్రకారము సమస్త లోకుల క్షేమము కొరకు ఈశ్వర ప్రార్థన చేయుచున్న తమ కర్మాదులకు విరోధము లేక క్షాత్రధర్మముతో తంమును కాపాడే క్షత్రియ జాతిని గౌరవ పరచుచు, తమకు దొరకని దేశాంతరాలయం దుండే పదార్థాలను వాణిజ్య మూలకముగా తెచ్చి యిచ్చే వైశ్యులను లాలించి, తమకు ఉపచరించి సేవ చేసే శూద్రులను ఆదరింపుచు రమ్మని శాస్త్రనియమ మున్నది గాని వండిపెట్టడానకు అర్హుడయిన శూద్ర దృష్టే మనకు కూడదు; బ్రాహ్మణ వీధిలోనే శూద్రుడు రాకూడ దనే ఆచారము మూల స్మృతులలో చెప్పి యుండలేదు. అయితే కర్మోత్కృష్టతను వాదించే నవీన ఉపస్మృతులలో ఇటువంటి అగౌరవాలకు ఆకరము పుట్టియున్నది గనుక ద్రావిడ దేశస్థులు భూరూప మయిన జీవనాలు పుష్కలముగా కలుగుటచేత కర్మాదుల విషయ మయిన ఆచారాలు మిక్కుట మయి శూద్రులను నిండా తృణీకారము చేయుచు రావడముచేత, వారికి మాంసభక్షణ మొదలయిన దుర్మార్గములో బుద్ధితగిలి, స్నానాది కర్మములను వదిలి నికృష్టు లయి వారున్ను వారికి తక్కువ తెగఅయినవారున్ను ఈ నికృష్టములో పడి అవమానపడడ మేమి? సమానత్వము పొందగల మతములోనే ప్రవర్తింపుచున్నా మని, క్రీస్తుమతస్థుల ప్రేరేపణకు లోపడుచున్నారు.

ఈ బ్రహ్మాండములో కన్యాకుమారి మొదలు కాశ్మీరమువరకు నుండే దేశము సర్వోత్తమమయిన కర్మభూమియై, రామకృష్ణాద్యవతారములకు పాత్రభూత మయి, శాపానుగ్రహ శక్తు లయిన అగస్త్యాది ఋషులకు వాసయోగ్యమయి యుండిన్ని, ఈ బ్రహ్మాండముయొక్క చివరను వసింపుచు పూర్వకాలమునందు పశుప్రాయులుగా నుండిన యింగిలీషువారిచేత యిప్పుడు యేలబడి యున్నది. మరిన్ని ఇప్పుడు కర్మశూన్యు లయిన ఆ యింగిలీషువారు ఈశ్వరకటాక్షమునకు ఈ కర్మదేశస్థులకంటె యెక్కువగా పాత్రులై ఉండవలసిన కారణ మేమని యోచించి నంతలో నాకు శ్రీరాములుతోపచేసిన యుక్తి యే మంటే: తత్వబోధసాధన మయిన విద్యాబుద్ధి లేనివారికిన్ని స్త్రీ బాలుల

కున్ను భక్తిజనితమయ్యే నిమిత్తముగా ముఖ్యముగా కర్మాదులనున్ను బింబారాధనలనున్ను ఉద్ధరించిన పూర్వీకులయిన స్మార్తలు బింబాలకు మనోజ్ఞమయిన మధుఘృతాదులతోనున్ను ఫలరసాదులతోనున్ను అభిషేకముచేసి ఆలయాలు కట్టియుంచి అలంకరించి అర్చన చేసి రాజోపచారలాంఛనలు జరగవలసిన వని వ్రాస్తే ఇటీవల ఉపస్మర్తలు భక్తిని వృద్ధి పొందింప చేయవలె ననే వెఱ్ఱితాత్పర్యముతో యెంత తేనె అభిషేకము చేస్తే అంత మంచిది, యెంత పెద్దగుడి చిత్రాలతో కట్టితే అంత పుణ్యము, యెన్ని విచిత్రాలతో అలంకరించితే అంత శ్రేష్టము, యెందరిని రూపవతులయిన దాసీలను రాజోపచార నిమిత్తముగా గుడిలో వుంచితే అంత గుణ మని వ్రాసినందున యథోచితము లయిన పంచామృతాభిషేకములను వదిలి అంతర్యామిరూపముతో పరమాత్మ వసింపుచు నుండే దేహములకు భోజ్యములయిన వస్తువులను విస్తరించి బింబముల మీద పోయుచు వ్యర్థపరచుచు రాసాగి దర్శనమాత్రము చేతనే కామవికారములను పుట్టించే ప్రతిమలతోనున్ను చిత్రములతోనున్ను దేవాలయములను కట్టసాగిరి. మరిన్ని సాధారణపు స్త్రీపురుషులు ధరించే వికారవేషములతోనున్ను వికారచర్యలతోనున్ను బింబాలను అలంకరించసాగిరి. మరిన్ని ఆ గుడికంటె యీ గుడిలో విభవము యెక్కువ అనిపించవలె నని పైపోటీలతో వ్యర్థముగా ద్రవ్యవ్యయము చేసి పయిన చెప్పిన పనికి మాలిన పనులు జరిగించి ఆలాటి అలంకారవిభవముల గుండా లోకులకు భక్తిని కలగజేయ సంకల్పించినందున సర్వాంతర్యామి యైన భగవంతునికి అది విరుద్ధముగా తోచినది.

ఆ ప్రకారమే బ్రాహ్మణులను సత్కర్మముల నాచరింపుచు లోకుల శ్రేయస్సును ప్రార్థింపుచు అందరినిన్ని ఆశీర్వదింపుచు నుండు డని చెప్పితే మేము సర్వోత్కృష్టుల మని అహంకరించి ఇతర వర్ణములను తృణీకరించ సాగిరి. అదిన్ని భగవంతునికి అసహ్యమయి నట్టు తోచుచున్నది. సగుణ బ్రహ్మారాధన విషయమయి చిత్తము భక్తి కలిగి తదేకనిష్ఠతో ఉండేకొరకు ధ్యానారంభకాలము నందు, యథోచితముగా తగుపాటి మత్త ద్రవ్యమును సకృదావృత్తిపుచ్చుకొను

మని పూర్వీకులు దోవచూపితే, సారాయి పీపాయిలను ఖాలీచేయసాగి నారు. గో బ్రాహ్మణుల పోషణ ప్రకటనమయ్యే కొరకై వారి పోషణ విషయమై అబద్ధమయినా ఆడవచ్చునని పూర్వీకులు వారి పక్షముగా వ్రాస్తే, అబద్ధముతోనే జీవనము చేయసాగిరి. వృద్ధ మాతా పితృపోషణ ముఖ్యమని తెలియపరచను 'అప్యకార్యశతం కృత్వా' అని మనువు వ్రాస్తే పరద్రవ్యమును పేలపిండి వలెనే భుజింపసాగిరి. యీ రీతిగా పూర్వీకులు కడతేరేటందుకు వేశిన మొలకలను విషధారలతో పెంచినందుచేత విషజ్వాలా సహితము లయిన ఫలములే ఫలించినవి.

కలిలో భావిఫలములను పూర్వీకులు ఊహించినట్టు ఈకర్మ తులు బహుమంచిది బహుమంచిది అనిచేసే పనులంతా యీశ్వరదృష్టికి అపరాధములుగా తోచి ఈ విపరీతము లయిన ఆచారములనున్ను అచేష్టలనున్ను బొత్తిగా నిలపదలచి యిప్పుడు ఈ బ్రహ్మాండములో యథోచితముగా పదవాక్య ప్రమాణ్యముగల యింగిలీషువారిని యీ కర్మభూమిని యేలేటట్టు చేసినాడు. యీ యింగిలీషువారికి ఆ సుగుణము వుండడము మాత్రమే కాకుండా భూతదయ పశ్చాత్తాపము తారతమ్య జ్ఞానము శుచిరుచి సాత్త్విక గుణము ఉపశాంతి ఈశ్వరభక్తి యిది మొదలయిన సుగుణాలు శానావున్నట్టు తోస్తున్నది. తద్ద్వారా వారు సర్వాంతర్యామికటాక్షానికి పాత్రులయి సర్వోత్తమ మయిన యీ కర్మభూమికి సార్వభౌములయినారని తోచుచున్నది.*

యీ కాశీపట్టణ మందువుండే సమస్త బ్రాహ్మణులు స్తోమాలని తడలని పేళ్లు వహించి ప్రత్యేకము ప్రత్యేకము లయినగుంపులుగా వొకొక్క గుంపుకు ఒక అధిపతిని యేర్పరచుకొని యిది జాలంభొట్ల స్తోమ మనిన్ని, యిది రాజేంద్రబాబు తడయనిన్ని యిట్లా చెప్పబడుచు కొంతకాలము ఒకగుంపు మరియొక గుంపుతో హితముగానున్ను మరికొంతకాలము ద్వేషరీతిగానున్ను విద్వత్ గ్రామము గనుక

* వీరాస్వామయ్యగారి కాలంలో ఈ దేశంలో ఉద్యోగాలుచేసిన దొరలలో సర్ తామస్ మన్రో, విలియం బెంటింకు గార్ల వంటి సత్పురుషులు, స్నేహపాత్రులు చాలామంది వుండేవారు. అందువల్లనే ఆంగ్లేయులయందు వీరి కింత అభిప్రాయం కలిగింది.

ఆచార వ్యవహారములను గురించి తాత్పర్య భేదము కలవారయి ప్రవర్తింపుచు వుంటారు. వీరిని ఆరాధన చెయ్యడములో ఉపాయము తెలిసి కొంత గుంపులకు ముందుగా కొంతగుంపుకు వెనక కొంత గుంపుకు సమకాలములో ప్రత్యేక స్థలాలలోనున్న యీ ప్రకారముగా సభాపూజలు చేయుచు రావలసినది. సుమంగలీపూజకు వేయి మంది స్త్రీలు వత్తురు. భిక్షము పెట్టేవారు కలిగితే రెండువేలమంది అనాథ స్త్రీలు జమ అవుతున్నారు. యిందరికిన్ని అన్నపూర్ణ కటాక్షముచేత పుష్కళమయిన అన్నము దొరుకుచున్నది. పిలువకనే వచ్చే పరదేశులలో స్త్రీలు పురుషులుగా ౨౦౦౦ మంది పంచ ద్రావిళ్లలో వున్నారు. వీరి కందరికి అన్నపూర్ణ సత్రములో పూనా శ్రీమంతుని తమ్ముడైన అమృతరాయడు ౧౫౦౦ మందికి ప్రతిదినమున్ను అన్నము పెట్టుతాడు * మన దక్షిణదేశస్థులు బహుమంది కాశీ తంబురాయడనే పండారముగుండా ౧౦౦౦ కి అన్నము ప్రతిదినము కలగచేసియున్నారు. మయిసూరు రాజు మొదలయిన గొప్పవారు యింకా అనేకులు అన్నముగానున్ను శీదా (స్వయంపాకము)లుగానున్ను ప్రతి దినమున్ను యిచ్చుచున్నారు. విశ్వేశ్వరుడు యిక్కడ చనిపొయ్యే వారికి తారక నామముఉపదేశము చేస్తానని ఆచొప్పునఅన్నపూర్ణయిక్కడ వసించే వారికి అన్నము సమృద్ధిగా కలగచేస్తాననిన్ని ప్రతిజ్ఞ చేసినట్టు పురాణమందు చెప్పియున్నది. అన్నపూర్ణ ప్రతిజ్ఞ ప్రత్యక్షముగా వున్నది.

శ్రీరాములయొక్క అవతారానికి పూర్వమే అనాదిగా రామ నామము తారకమయి యున్నది. అది తెలిసి శ్రీరాములకు ఆ నామముతోనే వసిష్ఠులు నామకరణము చేసినారు. ఈ హేతువుచేత యీ పట్టణములో యెవరు చనిపోయినా శ్మశానానికి శవానుగమనము చేశేవారు 'రామ నామసత్తుహే' అంటు నడుస్తారు. తద్ద్వారా తద్వ్యతిరిక్తమయిన దంతా అనృతమని అర్థమవుతూ వున్నది. యీ మహాస్థలానికి శ్రీమంతులు అనేకులు వచ్చి లక్షల మోడి సెలవు చేసినారు. స్థలమాహాత్మ్యమేమో కాని, యే బహానా (నెపము) చేతనయినా నెలకు

*పీష్వా అమృత రాయని దానధర్మములను గూర్చి బిషప్ హెబరు చక్కగా వర్ణించి యున్నాడు. ఈ అమృతరాయడు 1824 లోనే దివంగతుడైనాడు.

నాలుగయిదు లక్షలు సెలవుచేసేపాటి ఆసామి ఒకడు యీస్థళమందు వసింపుచున్నే యుంటాడు. యిప్పట్లో శ్రీమంతుని తమ్ముఁడు బిమ్నాజీ అప్పా అనే అతను నెలకు మూఁడు లక్షల రూపాయలు ఖర్చు చేసుకుంటూ అసి తీరమందు వసించి యున్నాఁడు. యింకా యీ దేశపు బహు ధనికులు విరామదశను పొంది కాశీవాసము చేయు చున్నారు. యీక్షేత్రాన అవశ్యముగా చెయ్యవలసినపనులు వాసము ఒకటిన్ని వర్షాశనదానము ఒకటిన్ని ముఖ్యములు.

కాశీ పట్టణములో పదివేల యిండ్లున్ను, లక్షప్రజలున్ను వుందు రని తోచుచున్నది. * యిక్కడ దొరకని పదార్థము వకటిన్ని లేదు. అందరు దేశభాష అయిన హిందుస్తాన్ మాటలాడు చున్నారు. బాహాటమయిన సంత అంగళ్ళను బాళాలని వ్యవహరింపుచున్నారు. ఉత్సవాదులను మ్యాళా అనిన్ని, పల్లకీలను కడుకడియా అనిన్ని, బోయీలను కారులోకు అనిన్ని వాడుతారు. బొందిలీ ఖండములో బోయీలను డీమరు అంటూవచ్చిరి. సామాన్య నౌకరుల జీతము నెలకు ౪ రూపాయలకు యెక్కువ లేదు.

యీ స్థల మాహాత్మ్యము స్కాందపురాణాంతర్భూతముగా వుండే కాశీ ఖండములో ౧౦౦ అధ్యాయాలుగా విస్తరించి చెప్పబడుతు నున్నది. యిదిగాక సూక్ష్మముగా ౫ అధ్యాయాలు గల కాశీ మాహాత్మ్య మనే గ్రంథమున్ను విస్తరించబడి యున్నది. వాటి సార

---

*బిషప్ హెబరుగారు 1824 లో కాశీని దర్శించి తన దినచర్యలో చక్కగా వర్ణించియున్నారు. అదిచాలా విషయములలో వీరస్వామయ్యగారు వ్రాసినదానికి సరిపోలుతున్నది. జనసంఖ్య విషయంలో మాత్రం వీరాస్వామయ్యగారు పొరబాటు పడినట్లు కనబడుతూవుంది. హెబరుగారు వ్రాయడంలో 1803 లో వేయబడిన ఒక జనాభా లెక్క ప్రకారం కాశీలో 5,82,000 ప్రజలు వున్నట్లు తేలిందనిన్నీ దానిలో కొంతమంది అతిశయోక్తి వున్నదనుకున్నా, ఉన్న లెక్క అది ఒక్కటే ననిన్నీ, పట్టణ వైశాల్యమును బట్టిన్నీ క్రిక్కిరిసియున్న కట్టుడును బట్టిన్నీ ఆ అంచనా యించుమించుగా సరియైనదేనని తోస్తూ వున్నదనిన్ని, లండన్, ప్యారిస్ నగరాలు తప్ప ఐరోపాలోని తక్కిన అన్ని నగరాల కన్నా యీ కాశీనగరం ఎక్కువ జనాకీర్ణంగా వున్నదనిన్నీ వ్రాశారు. చూడు. బిషప్ హెబర్సు జర్నల్ 1 వ సంపుటము, పుటలు 370-400.

మేమంటే నిర్గుణ బ్రహ్మము సృష్టి సంకల్పము కాకమునుపు జ్యోతిర్మయాకారముగా యీ స్థలములో మిక్కిలి జ్వలిస్తూ వున్నట్టున్ను బ్రహ్మకు, విష్ణువుకున్ను అహంపూర్వ మహంపూర్వ మని వివాదము పొసగినట్టున్ను జ్యోతిర్మయాన్ని చూచి ఆ యుభయులున్ను పరమయిన వస్తువు యీజ్యోతిస్సని తెలుసుకొని తాము శాంతిపడ్డట్టున్ను, సాంబమూర్తి ఈ స్థలము ఆనుపూర్వికమయినందున యిక్కడ వసించసాగినట్టున్ను, తద్ద్వారా మహాశ్మశాన మయినదనిన్ని ఆ జ్యోతిర్లింగము యిప్పటికిన్ని యిక్కడ పంచకోశాత్మకముగా యున్నదనిన్ని ఆదిని యీ భూమి జ్యోతిర్భూతానికి వాసయోగ్యమయినందున బ్రహ్మాదులు యిక్కడ తపస్సుచేసి సకలసిద్ధులు పొందినారనిన్ని, అగస్త్యాది ఋషులు అదేప్రకారము యిక్కడ తపస్సుచేసి సచ్చిదానందమును అనుభవించినందున యీ స్థలము ఆనందవనమనేపేరు వహించినదనిన్ని, మహాప్రళయాదులలో జ్యోతిర్భూతానికి యీ భూమి వాసయోగ్యమైనందున త్రిగుణాత్మకమయిన మూడు ముండ్లవంటి కొనలు కల ఆయుధముతో యీ భూమి యెత్తపడి వుండినందున త్రికంటక విరాజితమనే బిరుదు యీ స్థలానికి కలిగినదనిన్ని, మిక్కిలి ముఖ్యముగా చెప్పి అటుతర్వాత పరాపరవస్తువు సర్వాంతర్యామి గనుక యెవరియందు ఆ వస్తువును ఆరోపితము చేసినా చేయవచ్చును గనుక స్కాందపురాణ కారకుని యిష్టప్రకారము ఆపరాపరవస్తువే శివుడని సిద్ధాంతపరచబడిన ఆ సాంబమూర్తి తద్వస్తుగా జ్యోతిర్మయముగా ప్రకాశించినాడనిన్ని, ఆయన కటాక్షము సంపాదించి బ్రహ్మాదులు వారివారి అధికారాలు పుచ్చుకున్నారనిన్ని విస్తరించియున్నది.

యింతటికి యిక్కడి యీశ్వరునిపేరు విశ్వేశ్వరుడు. ఇది సమష్టివాచకము. లింగమున్ను సమష్టిరూపమేగాని పార్వతిసహితముగా వృషభారూఢుడయిన సాంబమూర్తి రూపముకాదు; లక్ష్మిని వక్షస్థలమందు వహించిన మహావిష్ణు రూపమున్ను కాదు; అయితే శైవులు ఆ లింగారాధనను చేయుచు వచ్చుచున్నారు. అందువల్ల వైష్ణవులు ఆ రూపముయొక్క ఆరాధనను వదిలినారు. యీ స్థలములో జ్యోతిర్భూతమ్ము

జ్వలిస్తూ యుండినందున ముక్తిక్షేత్ర మయినది. ఈ క్షేత్రములోని పాపులకు ప్రకారాంతరముగా కాలభైరవ దండన మూలకముగా పాపానుభవము చెప్పి అటుతర్వాత విశ్వేశ్వరుడివల్ల తారకమంత్రము వుపదేశమయి ముక్తినిపొందేటట్టు పురాణసిద్ధ మయి యున్నది.

యీ స్థలము అవిముక్తక్షేత్రమయినందున గంగ విశ్వేశ్వరుడి అనుగ్రహము సంపాదించి అసివరణల మధ్యే తనలోని జంతువులగుండా యెవరికిన్ని ఉపద్రవము చేసేది లేదని ఖరారుచేసి ఇక్కడ ప్రవహించ సాగినది. ఈ కలియుగములో పాపాలను పోగొట్టడానకు గంగకు మించిన పదార్థము లేదని కంఠోక్తిగా కాశీఖండములో చెప్పియున్నది. అటువంటి గంగ ఇటువంటి క్షేత్రములో ఇక్కడ జతపడినందున ఈ రెంటిమూలకముగా పరమాత్ముడు అనేకుల భక్తిని ఆకర్షించి తరింప చేయుచున్నాడు. ఇటువంటి మహాస్థలములో డిసంబరు నెల ౧౬ తేది రాత్రివరకు వసించినాను. 3.1.50Y -

పదుమూడవ ప్రకరణము

౧౭ తేది ఉదయాన ౫ ఘంటలకు ధనుర్లగ్నములో ౧౨ దాండ్లుగల బజరాలో యెక్కి గయకు తర్లి వచ్చినాను. నాబోయీలు మొదలయినవారు ఉండడానికి పట్టేలు అనే తడికెలు కట్టిన పడవను ఒక దాన్ని కూడా తేవడమయినది. ఈ బజరాకు పట్నా అనే షహరు వరకు బాడిగె యాభైయైదు రూపాయలున్ను, పట్టేలు అనే పడవకు ముప్పైరూపాయలున్ను యిచ్చినాను. కార్తీకశుద్ధ పున్నమవరకు యీ ప్రాంతమందు శీతకాలము ప్రవేశించలేదు. అదిమొదలు చలి దినదిన ప్రవర్ధమాన మయినందున యెండను మనదేశములో వసంతకాలపు వెన్నెలవలె అతిప్రియముతో అనుభవింపుచు నున్నారు.

కాశీపట్టణము గంగయొడ్డు అయినందున - గంగ ధనురాకారముగా ప్రవహింపుచు గట్టునుకోసి వొత్తిరాకుండా బలమయిన ఘట్టములను వొడ్డున కడాకున్ను కట్టియుండుట చేత, వొడ్డు కోశేదానికి బ్బద్ధులు ప్రవాహముయొక్క జోరు భూమిని కోశి లోతు అవుతూ

వచ్చినది. గనుక ఆ చొప్పున లోతు కావడమువల్ల వొడ్డున వుండే భూమి వూటపారి యీ శీతకాలములో అతిశీతమయి పయిగా జనసమ్మర్దము విస్తారమయినందున జ్వరాలు మొదలయిన అనేక రోగాలను ఉత్పత్తి చేయుచున్నది. మిక్కుటముగా భూమి కొత్త అయినవారికి వుపద్రవము యెక్కువగా వుంచున్నది. కాశీలో ప్రవేశించిన వెనక యికను సుభిక్ష రాజ్యములో ప్రవృత్తి కలుగుచున్నదనే తాత్పర్యము చేతనున్ను కలకత్తా పర్యంతము నావల మీద పోవలెననే యిచ్ఛచేతనున్ను కాశీలో కొన్ని దినములు వసించవలసి యుంచున్నదనిన్ని హయిదరాబాదులో కొలువుపెట్టిన ఒక జత పండ్రెండు మంది బోయీలనున్ను, ఆరుగురు బంట్రౌతులనున్ను పట్నాన్నుంచి వచ్చిన ఆరుగురు కావడి వాండ్లనున్ను కొలువు తీసివేసినాను. మిగిలియున్న వారిలో నలుగురికి కుదురుతువస్తే ఆరుగురికి జ్వరాలు మొదలయిన యుపద్రవాలు తగులుతు వచ్చుచున్నవి. యిక్కడి స్థలజ్ఞులు అదేప్రకారము రోగపీడితులుగానే వున్నారు. యిక్కడి చలి మన దేశస్థులకు అసహ్యముగా నున్నది. నాపరివారానికంతా ధగళాలు, కుళ్ళాయిలు, ధావళ్లు, లుంగీలున్ను తీసియిచ్చిన్ని కుంపట్లు అపేక్షింపుచున్నారు. నేను ఫ్లానుల(ఫ్లానల్)తో అన్ని వస్తువులున్ను వారివలెనే కుట్టించుకుని ధరించినాను. యెండకాలములో వుష్ణము అదే ప్రకారము అతిమిక్కుటముగా నుంచున్నదట. అందుకు కారణము అప్పట్లో గంగ లోపలికి పోవడము ఒకటేగాని వేరే తోచలేదు. ఇప్పట్లో ఇక్కడ అహస్సు ౨౬ గడియలు. యీ వాశి రాత్రి వృద్ధి అయి వుంచున్నది.

కాశీక్షేత్రము సకల స్థలములలోనున్ను చేసిన పాపములను పోగొట్టుచున్నది. యీ కాశీ మహాస్థలమందు లోకులు చేసే పాపములను యీపత్తున్ను పోగొట్టడానికి జ్యోతిర్లింగప్రదక్షిణార్థము పంచక్రోశయాత్ర అని యొకటి చేయవలసినది. ఆ యాత్ర చేసిరావడానకు అయిదు దినములు పట్టుచున్నది. ప్రథమ దినము మణికర్ణికలో స్నానము చేసుకొని సంకల్ప పురస్సరముగా ప్రయాణమయి మొదటి దినము కర్దమేశ్వరము అనే యూళ్ళో నిలిచి అక్కడ కర్దమతీర్థ

ములో స్నాన తీర్థ శ్రాద్ధాదులు చేసి కర్దమేశ్వరుని అర్చించి రెండో దినము భీమచండీ అనే స్థలము చేరి అక్కడ మొదటి దినము వలెనే గడిపి మూడో దినము రామేశ్వరము చేరి అక్కడ వరణ ప్రవహింపుచున్నది గనుక అక్కడ వరణా తీరమందు తీర్థవిధి చేసి రామేశ్వరార్చన చేసి, నాలుగో దినము కపిలధార అనే స్థలము చేరవలెను. అక్కడ లోగడి మూడు దినముల వలెనే గడిపి అయిదో దినము మణికర్ణిక చేరి అక్కడ తోలు నాలుగు దినములవలెనే గడిపి స్వస్థలము చేరవలెను. యీ యాత్ర తిరగడము ౨౫ కోసులు కద్దు. ప్రతి మజిలీస్థలములో నున్న విశాలమయిన ధర్మశాలలు కట్టి యున్నవి. యిదిగాక అంగళ్లు, యిండ్లు, తోపులు అక్కడక్కడ కలిగి వున్నది. దారిపొడుగునా శాల (నీడకొరకు వేసిన చెట్లవరస) యుంచి యున్నారు. ప్రదక్షిణానికి ఆరంభము అసి మొదలుగా చేయవలసినది.

కాశీయాత్ర చేసేవారు వారానికి ఒకసారి· మాసోపవాసి అనే వక దేవి దుర్గ గుడికి సమీపముగా నున్నది- అక్కడికి వెళ్ళి కొన్ని గవ్వలు వేయవలసినది. వేయనివారి యాత్రాఫలము ఆమె అపహరించేటట్టు ఒక వదంతి కలిగి యున్నది. యీ పంచక్రోశయాత్ర చేసేటప్పుడు భిక్షుకులకు, కలిగినవారు నిండాగా నుపచరింప వలసియుంచున్నది. యీ కాశీక్షేత్రమందు గంగలో పూజచేసే బిల్వము మునిగి పోవుచున్నదని ప్రసిద్ధి కలిగియున్నది. ప్రయాగలో స్త్రీలు యిచ్చే వేణిన్ని అదే ప్రకారము మణిగిపోతూ వుంచున్నది. యే స్థలములో నున్న సన్యాసులు త్రిరాత్రానికి అధికముగా వాసము చేయకూడదని విధియేర్పడి యున్నా,విశ్వేశ్వర స్మృతి ప్రకారము యీ కాశికి వచ్చిన యతులు యీ స్థలము వదలి పోకూడదని యేర్పరచి యున్నందున పంచగౌడులు పంచద్రావిళ్ళలో సుమారు వెయ్యింటికి యతులు యీ మహాస్థలములో నివాసముగా యున్నారు.

ఆంధ్రులలో వెలనాడు, కాసలనాడు, మురికినాడు అని వున్నట్టున్ను ద్రావిళ్ళలో వడమలు, కండ్రమాణిక్యము, యెణ్నాయిరము అని వున్నట్టున్ను ప్రతి గౌడ తెగకున్ను అనేక చీలికలున్నవి. బహు సావకాశముగా విచారించక గాని వాటి ఖుల్లస్సు బోధపడదు. బంగాళీ

బ్రాహ్మణు లయిన ఉత్కల గౌడులలో ఒక అన్యాయము జరుగు
తున్నది. అది యేమంటే లోగడ వారి తెగలో కొంత విపత్తులు వచ్చి
నప్పుడు కొందరు యథాశాస్త్రముగా ప్రవర్తించుచున్నట్టున్ను,
అద్యాపి వారి సంతతి తద్ద్వారా కులీను లయినట్టున్ను, అటు కులీనుడికి
కన్యకను వివాహము చేసి యిస్తే కులము పవిత్రమవుతున్న దని ఒక
బోధ తోచి యుపపన్నులు అందరున్ను అటువుండే బహు కొద్దిమంది
కులీనులకు బహుద్రవ్య మిచ్చి వొప్పచేసి కన్యమీద కన్యను యిరువై
మున్పైయింటిదాకా యిచ్చి వివాహము చేయుచున్నారు. ఆ ప్రకా
రము వివాహము చేసుకొన్న కులీనుడు తదనంతరము నూరారులు
యిస్తేగాని ఒకరాత్రి ఆ ప్రకారము వివాహమయిన స్త్రీలతో వసించేది
లేదు. అటుగనుక అటు వివాహమయిన స్త్రీలు చాపల్యము లేనివారు
హింసపడుతూ, చాపల్యము కలవారు వ్యవస్థ తప్పి నడుచుచునున్నారు.

యీ దేశములో వసించే ఘూర్జర దేశస్థులు అనేక తెగలుగా
ఖేడావా రని, నాగరీ లని ప్రత్యేకగుంపులుగా ఒకరి యింట్లో ఒకరు
భోజనము లేక నియమము కలిగియున్నారు. యీ దేశములో దృష్టి
దోషవిచారము లేకపోయినా కచ్చారసూయి, పక్కారసూయి అనేపాక
నియమాలు బహుశా పాటించుచున్నారు. పక్కారసూయి ఒకడు
పాకము చేసినది మరిఒకడు సంప్రదాయము విచారించక శూద్రుడయి
నా బ్రాహ్మణునిచేత కూడా తినడు. శూద్రులు బహుశా మాంస
భక్షణము చేయడములేదు. కొన్ని సంవత్సరముల కిందట దక్షిణ
దేశములో నుంచి గోపాలకజాతి యయిన ఒక గొప్ప మనిషి
కొమార్తె యిక్కడికి యాత్ర వచ్చి స్వకులస్థులను యిక్కడ పరి
చర్యకు కొలువు వుంచినది. అటు కొలువువున్న స్త్రీలు పురుషులున్ను
వచ్చిన స్త్రీ మాంస భక్షణము చేయడము చూచి, నిండా నిందించి
కొలువు వుండమని చాలించుకొన్నారు. యీ దేశములో గోపాలకులు
తులసీమణి ధారణము చేసినట్టయితే ఆచార సంపన్నులని వారి చేతి
గంగను ధారాళముగా యీ దేశపు సర్వజనులున్ను పుచ్చుకొంటారు.
వారిని సచ్ఛూద్రులని చెప్పుతారు.

కాశీలో సకల గ్రంథములున్ను సంగ్రహింపబడి వున్నవి. కుంఫిణీవారు బహు దినములుగా ఒక పాఠకశాలను వుంచి సమస్త గ్రంథాలు సంగ్రహించి యుంచి పాఠము చెప్పను మనిషికి ౬౦ రూపాయీలు జీతము చేసి పదిమంది పండితులను వుంచి చదవడానకు ౧౦౦ మంది విద్యార్థులకు మూడేసి రూపాయలు లెక్కను జీతమును చేసి యుంచినారు.* యింకా రాజాధిరాజులు గ్రంథ సంగ్రహము కావలసినప్పుడు లక్షావధి రూపాయలు కాశికి పంపించి గ్రంథ సంగ్రహము చేయుచు నున్నారు గనుక బహుమంది పెద్దలు తమ శోధ నార్థమున్ను అట్టి తరుణాలలో రాజాధిరాజులకు పనికి వచ్చేటట్టు చాయడానికిగాను అనేక గ్రంథాలు సంగ్రహించి అపారముగా వుంచి యున్నారు.

కాశికి సుమారు యిరువై మజిలీలలో గోకుల బృందావనము యుండి యున్నది. హరిద్వార మనే పుణ్యభూమి ౨౦ మజిలీలలో నున్నది. ఆ హరిద్వారమునుండి గంగోత్తరికిన్ని బదరీకేదారానికిన్ని బదరీ నారాయణానికిన్ని జ్వాలాముఖికిన్ని దారిపోతున్నది. హరిద్వారము వెళ్ళకనే పయినవ్రాసిన స్థలములకు యెక్కడికిన్ని పోను ఆయత్తు కాదు. హరిద్వారమునుంచి పయినవ్రాసిన స్థలములలో యే స్థలానికి పోవలసినా ఈశ్వరేచ్ఛ యేమోగాని పదిహేనేసి దినాల మజిలి ఆయా స్థలములకు సరిగా నున్నది. అందుకు ఒక స్థలమునుంచి ఒక స్థలానికి వెళ్ళడానికి వేరేదారిలేదు. గంగోత్తరినుంచి బదరీకేదారము వెళ్ళవలసి వస్తే హరిద్వారానికి వచ్చి పోవలసినది. అయోధ్య అతి సమీపము. ప్రయాగకు ౧౨ ఆమడ వున్నది.

పయిన వ్రాసిన గంగోత్తరి మొదలయిన మహాస్థలములు అన్ని నీలకంఠ నేపాళరాజుయొక్క రాజ్యములో యున్నవి. ఆ రాజు నేపాళములో వాసముచేయుచు యింగిలీషువారికి లోబడియున్నాడు. ఆ నేపాళమువద్దనే మూరంగి అనే యూరువున్నది. అందులో ద్రాక్షలు ఫలింపుచున్నవి. ఆ గ్రామము కాశీతంబురాయడనే పండారానికి

* ఈ విద్యాలయమును గురించి బిషప్ హేబరు చక్కగా వర్ణించినాడు.

బదరీ కేదారేశ్వరుని పూజానైవేద్యాల కొరకు నేపాళరాజు జాగీరు యిచ్చియున్నాడు. ఆ ప్రాంతములలో మంచు అపారముగా నున్నది. కేదారేశ్వరునికి ఆరునెలలు పూజలేదట. మంచుకాలము యొక్క ఉపక్రమణలో ఒక పెద్ద కొడి స్తంభము నాటిపెట్టి మంచు గుడిని మూసుకునిపోతే మంచుకాలము తీరినవెనక ఆ కొడి స్తంభము గుర్తుపట్టుకొని మంచుగడ్డలు తొవ్వి యెత్తి గుడిని కనుక్కోవలసినదని చెప్పినారు.

ఈశ్వరుడు నీళ్ళలోని చేపలకు జలాధివాసము సహజము చేసినట్టు ఆయాస్థలస్థులకు ఇటువంటి తనరూప మయిన కాలాలను సహజము చేయుచు వచ్చినాడు. కాలాన్ని అనుభవించే వ్యక్తిలోనున్ను కాలములోనున్ను యీశ్వరుడు అంతర్యామి అయినప్పటికిన్ని అభ్యాసము వల్ల నున్ను యిచ్ఛవల్ల నున్ను యిటువంటి కాలభేదములు కొన్ని వ్యక్తులకు సరిపడక వుంచున్నవి. యెట్లా అత్తిచెట్టుయొక్క అనేకపండ్లలోని ఒక క్రిమిగాని ఆ చెట్టుయొక్క గాత్రమునున్ను శక్తినిన్ని యెట్లా తెలుసుకో నేరదో తద్వత్తుగా అనేక బ్రహ్మాండాలు ఉత్పత్తి చేసిన యీశ్వరునియొక్క చిద్విలాసమహిమను ఒక బ్రహ్మాండములోని ఒకానొక ప్రాణి తెలిశి ఆశ్చర్య పడడానకు శక్తుడు కాడు.

యీ కాశీ మహాపట్నము యొక్క వేడుకనుచూచి ఆనందించి, కపిల మహాముని యిందుకు అధికముగా తనతపఃప్రభావము చేత యీ కర్మభూమికి చివరను గంగాతీరమునందు కాశ్మీరము అనే పట్నాన్ని ఉత్పత్తిచేసి సకల విధాలా బాగాచేసి కాశీవిశ్వేశ్వరునికి యెరుకచేసి అక్కడికివచ్చి చూడుమని ప్రార్థించి నంతలో విశ్వేశ్వరుడు ఆ కపిలుని మాట నిజమేనని తెలుసుకున్నవాడై అప్రతిద్వంద్వముగా కాశీ యుండవలసిన సంకల్పము పరమాత్మునికి నుండగా గర్వము చేత కపిలుడు యీప్రకారము చేసినాడు గనుక ఆ కాశ్మీర పట్నము అతని గర్వభంగము అయ్యేకొరకు వెంబడిగానే మ్లేచ్ఛాక్రాంతమయి మ్లేచ్ఛభూయిష్టమయి పోగాకా అని శపించినాడట. అది మొదలు అద్యాపి యెంత అక్కడ శంకరాచార్యులవారు దిగ్విజయము చేసినా సరస్వతీపీఠమున్నా అక్కడ ప్రవహించే గంగ సస్యాదులకు కూడా వుపయోగింపుచున్నా అక్కడవున్న బ్రాహ్మణులు అందరు బలాత్కా

రముగాతురకలలో కలిసి బ్రాహ్మణుడు ఆప్రాంత్యాల తలచూపడము అద్యాపి ప్రయాసగా నున్నది.

ఇప్పట్లో ఆ రాజ్యము రణజిత్తు సింగు* అధీనముగా యున్నది. ఆకాశ్మీరములోనే కుంకుమపువ్వు అవుచున్నది. శాలూలు నేయడానికి యోగ్యమయిన వెంట్రుక లయ్యే మృగాలు ప్రత్యేకముగా ఉత్పత్తి అవుచున్నవట. కాశ్మీరశాలూలు బయిటికి విస్తారము రావడములేదట. అందుకునకలుగా లాహోరులో నేసిన శాలూలు బయిటికి విక్రయానికి వచ్చేటట్టు విన్నాను. నిరక్షుదేశము మొదలుగా ౨౬ భాగల దూరము లో నుండే కాశీ లోగానే కాలము మొదలుకొని ఆచారవ్యవహారములు యింత భేదించి యుండగా యికను ఉత్తరోత్తరా యేమి వింతగా నుండునో తెలిసినది కాదు; వీపుమీద నుండే మచ్చ చూడడానకు కూడా మనుష్యుడు శక్తుడుకాడు. మాయావృతజ్ఞానము కలిగి వుండుట వల్ల ఈశ్వరసృష్టిని యే పాటిచూచి తెలుసుకొనును? గనుక ఈశ్వరుడే మిక్కుటముగా యీ ప్రకారము మాయామగ్నులయిన అస్మదాదులను కాపాడ వలసినది.

౧౮౩౦ వ సం॥ డిసంబరునెల ౨౭ తేది పట్నా అనే షహరు ప్రవేశించినాను. గంగలో పదిదినములు బజరా పట్టేలు అనే పడవల గుండా నడవడమయినది. దారిలో గంగ కిరుపక్కలనున్న వూళ్ళ పేళ్లు ఈ అడుగున వ్రాయుచున్నాను. నెం. ౨౧. కభారా ౧ బలురా ౧ తానాపూరు ౧ కనాలుగంజి ౧ సయత్పూరు ౧ మాంజీ ౧ చోబక్పూరు ౧ రోజా ౧ జమనియ్యాం ౧ రాంపూరు ౧ మదనాపూరు ౧ గాజీపూరు ౧ కాతిసుపూరు ౧ నెరుపూరు ౧ బకుసరు (బక్సార్) ౧ సిక్కాపూరు ౧ బందాగా ౧ దూబావలీటి ౧ జగదీశపూరు ౧ బలియ్యా ౧ సుహియ్యా ౧ కట్రాజిగంజి ౧ బిసన్పూరు ౧ ఆరా ౧ నవరంగా ౧ రామనగరము ౧ శిరుపూరు ౧ శిరంపూరు ౧ చపా్రి ౧ రస్తాన్ గంజి ౧ దానాపూరు ౧ బాకీపూరు ౧ పట్నా ౧.

---

* రంజిత్సింగు శిక్కుల రాజు. 1780 లో జన్మించి 1839 లో దివంగతుడైనాడు.

పెరుగు, పాలు, కూరకాయలు - యిత్యాది అనేక దినముల పరియంతము బాగావుండని పదార్థాలకుగాను ఒకవేళ గంగకు ఇరుపక్కలావుండే వూళ్ళలోకి వెళ్ళితే మనుష్యులు వెళ్ళి రావలసినది. సుఖహేతువులంతా కష్టసాధ్యములు గనుక యీ గంగా తీర సంచార సుఖానుభవములో పడవలోకి నీళ్ళు వూరి వచ్చిన దనిన్ని పడవ తోశే వాండ్లు చెప్పినట్టు విన లేదనిన్ని కూడా వుండే పరిజనుల ప్రకృతులు భిన్నాలు అయినందున వాండ్లు ఒకరితో నొకరు కలహము పడడము వల్లనున్ను, వద్దనుండే స్థితికి చోరులవల్ల అపాయము వచ్చునేమో అనే భయముచేతనున్ను, మనస్సుకు అప్పుడప్పుడు ప్రపంచదృష్టి పూరా కలిగిన దేహాధీన మయినందున వికల్పము కలుగుచున్నది. అప్పట్లో జగము యావత్తు పరబ్రహ్మ ఆడించే బొమ్మలుగాని, వేరే కాదనిన్ని తృణాగ్రమయినా యీశ్వరాజ్ఞ చేతనే కదల వలసినవిగాని మరిఅన్యథా కాదనే తెలివితోనున్ను మనస్సు నిండా ఖేదాన్ని పొందనియ్యకుండా బుద్ధిద్వారా శిక్షించి నట్టయితే పయిన వ్రాసిన స్థలజల సౌఖ్యములు మిక్కిలి ఆనందకరములుగా తేటపడు తున్నవి.

యీ గంగలో నడిచే అనేకపడవలు అనేకభేదములు కలిగి యున్నవి. అందులో విచారించగా తెలియవచ్చిన వాటిని అడుగున వ్రాసినాను. నావల భేదక్రమము బజరా ౧. అది ఒంటికంభము కలది. వెడల్పుయెక్కువ. తలపక్కచుక్కాణి, చుక్కాణి మొదలు పొడుగున తగ్గుచూవచ్చు చున్నది. పిన్నిస్సు ౧. అదిరెండు కంభాలు కలది. నిడుపు యెక్కువ. మొనను చుక్కాణి. యిల్లు మధ్యే వుంచున్నది. పొడుగు కొనా మొదలున్ను సమము. కటరు ౧. అది పిన్నిసుజాడ; గాలిని చాపలచేత వైపు (పీలు) చేసుకోవచ్చును. బవులియ్యా ౧. అది బజరాజాడ; గాలిని చాపలచేత స్వాధీనము చేసుకోవచ్చును. డోంగా ౧. అది చిన్నయిల్లు గల తేలిక పడవ. బాలిబోటు ౧. అది చెయిపడవ. పయిన వ్రాసిన ఆరుదినుసులు సవారీలాయఖు. సరుకు మోసే నావలు పట్టేలి ౧. అది మిరిజాపురపు శాత. పొడుగు తక్కువ. వెడల్పు యెక్కువ. వులాకు ౧. అది పట్నా శాత.

పట్నామధ్యే గంగకు యిరుపక్కలా వుండే వూళ్ళలో గాజీ

గంగలో కలియుచున్నది. చప్రావద్ద కర్మనాశినీ అనే నది దక్షిణము నుంచి వచ్చి గంగలో కలియుచున్నది. యీ కర్మనాశిని నదిలో యెవరు కాలు పెట్టినాగాని సుకర్మాలు నశించుచున్నదనే తాత్పర్యముచేత కర్మిష్ఠులు యెవరున్ను యీ నదిలో కాలు పెట్టరు. యీ నది దాటడానకు కాశినుంచి గయకు వచ్చే దోవలో అహల్యాబాయి అనే యశఃకాయము గల పుణ్యాత్మురాలు వారధి కట్టడానకు శానా యత్నము చేసినది. యిప్పటికి ఆమె చేర్చిన సామానుతో కట్టడానకు అనేకులు యత్నము చేసినా కొనసాగలేదు.

యీ పట్నాసహరువద్ద పునఃపునః అనే నది దక్షిణము నుంచి వచ్చి గయవద్ద వచ్చే ఫల్గుని నదివలెనే గంగాసంగమ మయినది. యీ పునఃపునః అనేనది గయా క్షేత్రమునకు ప్రదక్షిణముగా ప్రవహింపుచున్నది గనుక యెటునుంచి గయకు వచ్చే వారున్ను యీ పునఃపునః నదివద్ద క్షౌరము చేసుకొని తీర్థశ్రాద్ధము చేసి గయావ్రజనము చేయడానకు నియమము ధరించవలసినది.

దక్షిణమునుంచి వచ్చే పయినదు లంతా నర్మదానదివలెనే వింధ్య పర్వతములో ఉత్పత్తి అయినవి. శోణభద్రా నదిన్ని, నర్మదా నదిన్ని ఒక్క ప్రదేశములోనే ఉత్పత్తి అయి రెండు ధారలుగా చీలి ఒకటి లింగాలనున్ను, మరి ఒకటి వినాయకశిలలనున్ను జగత్తుకు కలుగ చేసి యున్నవి. యిదిగాక వేరే ప్రశస్తములేని కొన్ని నదులు ఉత్తరము నుంచి వచ్చి కాశీ పట్నాలమధ్యే గంగలో కలియు చున్నవి.

కాశి మొదలు పట్నాసహరు వరకు గంగకు యిరుపక్కలా సరసు అనే పెద్ద ఆవాలున్ను, రాయి అనే చిన్న ఆవాలున్ను, బూటి అనే శెనగలున్ను, సటానులున్ను, కంములున్ను అమితముగా పయిరు చేసి యున్నారు. యీ పెద్ద ఆవాల చెట్లు ముల్లంగి చెట్లవలెనే ప్రథమములో పయిరు అయి యెన్నుతీసి పచ్చని పూలు పూచి, గోరుచిక్కుడు కాయలవలె కాయలు కాయుచున్నవి. యీ ఆవకూర యీ మంచు దినములలో పుల్లకూరవండి యీ దేశస్థులు అవశ్యముగా పుచ్చుకొను చున్నారు. పుల్లకూర బహురుచిగా వుంచున్నది. మంచు కాలములో దేహానికి లేపనము చేసేటందుకు నాలుగు

విధాలు పరిమళ తైలములు యిక్కడ తయారు అవుచున్నవి. వాటి పేళ్ళు సుగంధరాజితేలు అనేది ఒకటి, బేలా అనేదిఒకటి, చంబెలిఅనే నూనె ఒకటి, ఫూలేది అనేనూనె ఒకటి. ఇవి వుపపన్నులు చేసుకొనేవి. పేదలు పెద్ద ఆవాలనూనె పట్టించుకొనుచున్నారు. యీ తైలాలతో అంగమర్దనము చేయకపోతే చర్మములో నుంచి సూదితో కుట్టినట్టు బెజ్జాలుపడి నెత్తురు చెమ్మగింపుచున్నది. యీ ప్రకారము నా పరిజనానకు నడిచేటప్పుడు కాళ్ళలో కొందరికి నెత్తురు చెమ్మగించి నందున భయపడి వారు యిందుకు వైద్యము ఆవనూనె పట్టించి వేన్నీళ్ళు పోసి కడిగితే వెంబడిగానే వాశి అయిపోతున్నది. చిన్నఆవాలలో నూనె నిండా రావడము లేదు గనుక చిన్న ఆవాలను భక్ష్యయోగ్యముగా వాడుకొని, పెద్దఆవాలలో మాత్రము నూనెను గానుగ ఆడి తీయుచున్నారు.

యీ మంచుకాలములో బ్రాహ్మణ సంతర్పణలు కాశిలో నావల్ల యీశ్వరుడు జరిపినప్పుడు యీ దేశములో నివాసముగా నుండే పంచద్రావిళ్ళకు దృష్టిదోషము అక్కరలేనందున ఆ బ్రాహ్మణులు ఆవరణములోపలను భోజనము చేయడానకు చలి యుపద్రవముగా వుంచున్నదని పగలు రెండుజాములవేళ మిద్దెమీద పయిదళములో యెండలో ఆకులు వేయించుకొని కాకుల బాధలేకుండా నాలుగు పక్కలా నలుగురు శూద్రులు తుపాకులు కాలుస్తూ యుండేటట్టు యేర్పరచుకొని యెండ సౌఖ్యముగా వున్నదని భోజనము చేసినారు.

కాశివరకు తాటిచెట్లు కండ్లపడక పోయినా, గంగకు యిరుపక్కలా అనేక గ్రామాదులలో తాటిచెట్లు కలిగి యున్నవి. యిరువై యేండ్లకు మునుపు జాతులవాండ్లు పొట్టేటను అనే గడ్డలు (బంగాళా దుంపలు) యీ దేశానికి తెచ్చి పయిరుపెట్టే క్రమమును యీ దేశపు జనులకు నేర్పించినారు. అది మొదలుగా యీ దేశములో యెక్కడ చూచినా వాటికి ఆలు అనే పేరు పెట్టి అమోఘముగా పయిరు పెట్టుచున్నారు. ఆ గడ్డలు పెద్దదినుసు నిమ్మకాయలంతేసి, చిన్నదినుసు గచ్చకాయలంతేసిగా అనేక రాసులుగా పన్నీరు పూలవర్ణముతో ఫలించి యెక్కడ చూచినా యీ ప్రాంత్యములలో అమ్ముచున్నారు. గంగలో

పడవలు యెల్లప్పుడు వస్తూపోతూ వుండడముచేత యీ పడవలు వాడికెగా నిలిచే ఘాట్లవద్ద యిటువంటి భక్ష్యయోగ్య మయిన వస్తువులు తెచ్చి పెట్టుకుని అమ్ముతూ వుంచున్నారు. కాశిలో అమ్మే గొయ్యా పండ్లు (జాంపండ్లు) మిక్కిలి గొప్పలుగా, విత్తులు శానా తక్కువగా యుంచున్నవి. ఈ దేశములో కాలము యెరిగి కూరకాయలు వేయుచున్నారు గనుక ఒకకాలములో అయ్యేవస్తువులు మరియొకకాలములో మన దేశములో అకాలములో కూడా దొరికేటట్టు చిక్కదు.

పట్నా అనే షహరు దానాపూరు మొదలుగా ఆరుకోసుల దూరమునకు ఒక్కే షహరుగా నున్నది. పట్నాషహరులో కలకటరు జడిజీ మేజిస్ట్రేటు ఉండడము మాత్రమేగాక ఒక అప్పీలు కోరటు రివిన్యూ క్రిమినాలు సంగతులు విచారించడానకు ఒక కమిసనరు వున్నాడు. యీ షహరు మ్లేచ్ఛమయముగా నున్నది. లోగడ యెల్లీసు దొర యీ దేశము చూసేనిమిత్తము వచ్చియుండి యీ షహరులో గోమాంసము బహిరంగముగా బజారులో పెట్టి అమ్ముచున్నారు, యీ వింత నేను హిందూదేశములో యెక్కడ చూడలేదని వ్రాసినాడు. అటువంటి వస్తు విక్రియము నా కండ్ల పడకపోయినా అంతపని సాధారణముగా చేసేపాటి మ్లేచ్ఛ షహరు అనవచ్చును.

యీ షహరులో రెండు దేవస్థలాలున్నవి. ఒకటి పట్నాదేవి మందిరము, మరియొకటి గోపీనాథుని మందిరము. రాజసపూజ వితరణగా జరుగుచున్నది. గాజీపూరు, ఆరా, చప్రా, వీటికన్నా యీ షహరులో యిండ్లమిద్దెలున్ను విస్తారముగా నున్ను, గొప్పలుగానున్ను కట్టియున్నవి. కాశీపట్నమువలెనే ప్రతిసందుకు పాటక్కులనే వాకిళ్ళు తలుపులతోకూడా కట్టియున్నవి. రాత్రిళ్ళు మూశి గడియలు బీగము వేయుచున్నారు. బాజారులను బహునిబంధము మీద యిటీవల జాతులవాండ్లు వెడల్పుచేసి చక్కపెట్టినారు. యిండ్లకు బాడిగె యీ షహరులో బహు[illegible]. నేను దినానికి ఒక రూపాయివంతున నిలిచిన దినములకు బాడిగె యిచ్చుచు వచ్చినాను. సకల పదార్థాలు సకల విధములయిన పనివాండ్లు సమృద్ధిగా దొరుకుదురు. పనివాండ్లను యీ దేశస్థులు కాలీగర్లు అని అనుచున్నారు. యీ షహరులో యెక్కా-

లనే వొంటిగుఱ్ఱపు గాడీలు బాడిగెకు వేలాంతరాలు దొరుకును. యీ షహరులోవుండేపాటి యెక్కాలు యెక్కడా లేవని హిందుస్తాన్ లో ప్రసిద్ధము. ద్వీపాంతర పదార్థాలుకూడా సమృద్ధిగా దొరుకును. యింగిలీషు షాపులు కొన్నియున్నవి.

షహరుకు మూడుకోసుల దూరములో జాతులవాండ్లు గంగాతీరమునందు యిండ్లు, తోటలు కల్పనచేసుకొని యున్నారు. సమస్త ఫల వర్గాలున్ను దొరుకును. అరిటిపండ్లు దొరికినా బొంతపండ్ల జాతేగాని రస్తాళి మొదలయిన రుచికరమయిన జాతిపండ్లు దొరకవు. నాగపూరు వదిలినవెనక మంచి అరిటిపండ్లు వెడల్పుగల అరిటి ఆకులున్ను చూచిన వాణ్ని కాను. మేవావస్తువు లని యీ షహరులో పిస్తా, బాదము, అగురోటు, మునక్కా అనే విత్తుకలిగిన ద్రాక్షయేమి, విత్తులేని ద్రాక్షయేమి, పయిచెక్క యెండి లోపల మాధుర్యము గలిగి విత్తు అతిహ్రస్వముగా కండకలిగిన అనారు అనే దాడింమపండ్లున్ను యెండు అత్తిపండ్లున్ను సమృద్ధిగా అమ్ముతారు. సెబుభి యివి మొదలయిన శీమ అప్పీల్సు యీ దేశములో అవుతున్నవి. కాశిలో పాలుక్కాబుఱ్ఱిలు అమ్మేటందుకు ఒక వీథి ప్రత్యేకముగా యున్నట్టు యీషహరులో యెక్కడ చూచినా నానావిధాలయిన పాదరక్షలు, పాలుక్కాబుఱ్ఱిలు మొదలయిన వాటి సామానులు అమ్ముతువుంచున్నవి. చలికాలములో రజాయి దుప్పట్లు, రజాయి చొక్కాలు అమితముగా తయారు చేసి అంముతారు.

యీ షహరులో హయిదరాబాదు వలెనే ఆయుధములే ఆభరణాలుగా యెంచే స్వభావము కల మనుష్యులు సమృద్ధిగా వున్నా యింగిలీషువారి అధికారము పూర్తిగా యిక్కడ జరగసాగిన వెనక లక్షాంతరాలు ఆయుధాలు నిర్బంధము మీద లోకులవద్ద తీసి విరిచి గంగలో వేసినారు. అట్లా చేసిన్ని యింకా యెవరిచేత చూచినా ఆయుధాలున్ను నిర్నిమిత్తముగా ఒకణ్ని ఒకడు నరుకోవడాలున్ను కలిగి యున్నది.

యీ దేశములో చక్కెర కాచి పోసే కలకండ, చీనా కలకండ పచ్చకర్పూరమున్ను యెంత మాత్రము దొరకదు. నేపాళ దేశము

యిక్కడికి సమీపము గనుక అక్కడ అయ్యే కస్తూరి అమ్ముతారు. అందులో కృత్రిమము బహుశః జరుగుచున్నది. కుంకుమ పువ్వు అయ్యే కాశ్మీర దేశము దక్షిణదేశము కన్నా యీ దేశానికి సమీపముగా వున్నా మనదేశములో దొరికేపాటి మంచి విడి కుంకుమపువ్వు యిక్కడ దొరకదు. వస్తువులు అయ్యే దేశాలనుంచి అన్య దేశాలకు ప్రియమయిన దినుసులను తమ దేశములో వాడికెలోకి తేకనే పంపించేటట్టు తోచుచున్నది. యీ దేశస్థులు యిక్కడి శీతము యేపాటి? నేపాళ దేశములో కలిగే చలికి సహస్రాంశములలో ఒక అంశ యిక్కడ లేదని చెప్పుతారు. సాలగ్రామాలు ఉత్పత్తి అయ్యే కొండ భూమి నేపాళ దేశములోనే వుండియున్నది. ఆ కొండ మీదుగా గండకీనది ప్రవహింపుచున్నది. ఆ నదిలో సాలగ్రామాలు యెత్తడము నర్మదా శోణభద్రా నదుల వలె పట్నావద్ద కలిసే గండకీ నదిలో పట్టిన తావున సాలగ్రామాలు దొరకవు; ఆ కొండ ప్రదేశములోనే ఆ నదిలో సాలగ్రామాలు కలిగి వున్నవి. 4/11/50

---

## పదునాలుగవ ప్రకరణము

యీ హిందుస్థాన్‌లో యింగిలీషు వారికి ఆధీనము కాకుండా యికను నిండా ప్రయత్నము మీద స్వాధీనము కావలసిన రాజ్యము రణజిత్తుశింగుది ఒకటేను. వాడి రాజ్యము హిందుస్థానకు చివర కాశ్మీర ఖండమున్ను, లాహోరు అనే షహరున్ను, మూడు లక్షలమంది మార్బలము కలిగియున్నాడు. హాయిదరాబాదు చట్టముగా యింగిలీషు వారిని ఉపసర్పించుకొని రాజ్యము చేయుచు నుండే వారు జోతీపురపు రాజు, జయపురపు రాజు, బిక్కానెరి (బికెనీరు?) రాజు, నేపాళపురాజు లక్కనో నబాబు, శింధ్యా, హోలుకరు, వీరు తప్ప మరి యెవరున్ను రాజ్యాధిపతి అని పేరు పెట్టి పిలవడానికి హిందుస్థానలో లేరు. హోలుకరు గడిచి పోయిన వెనక రాజ్యము బహుశః యింగిలీషువారి ఆధీనమయి హోల్కరుకొడుకు యింగిలీషువారి ఆజ్ఞాబద్ధుడుగా నున్నాడు

హోలుకరు రాజధాని హిందోలి అనే షహరు. శింధ్యాపడిపోయిన వెనక వాడికి వున్న లక్షమంది మార్బలము చెదరనియ్యకుండా పట్టుకొని దత్త పుత్రుడితో హింసపడుతూ శింధ్యాభార్య కాలము గడుపుతూవున్నది. ముందరి శింధ్యారాజధాని వుజినీపట్నము. యిప్పట్లో గ్వాలియ్యరులో దండు సమేతముగా అతని కుటుంబము వాసము చేస్తూవున్నది. లక్నో నవాబు ధనము విస్తారముగావున్నా లక్ష ఫౌజు వున్నా ప్రజలను హింస పెట్టుతూ ♦ పేరుకు నవాబుగా వున్నాడు. జోతీపురము జయపురము బికానెరి రాజులు మారువాడీలు గనుక యీశ్వరుడు వారికి యిచ్చిన సిర్జల భూములలో యున్నారు.

జ్వాలాముఖి యనే స్థలము రణజిత్తుశింగు రాజ్యములో వున్నది. ఆ దేవిని అతడు బాగా ఆరాధింపు చున్నాడు. అతని రాజ్యములో యిప్పటికిన్ని న్యాయము బాగా జరుగుతూ ప్రజలు బాగా పరిపాలింప బడుతూ యున్నారు. యీ దేశము మొదలు కాశ్మీరములోగా పారా అనిన్ని, బరుఫు అనిన్ని మంచుగడ్డలు పడుచున్నవి. యింతమంచు నీ భూమికి పెట్టిన ఈశ్వరుడు ఈ భూమినివాసుల క్షేమముకొరకు ఉష్ణోదకపు వూట కలిగిన గుండములు కొన్ని నిర్మించి ఉన్నాడు. అవియెక్కడ నంటే గయనుంచి జగన్నాథానికి పొయ్యేమార్గములో బలుబలు అనేవూళ్ళో వొకటి; గయకు కొంతదూరములో రాజగృహి అనేవూళ్లో ఒకటి; మూంగేరి అనేముంగా చీరలు అయ్యే గంగవొడ్డు షహరుకు సమీపముగా సీతాగుండ మనేది వొకటి; వుజ్జిన దేశములో తప్తమణికర్ణిక అనే గుండము వొకటి; ఢాకా దేశములో బాలవాగుండ మనేది ఉదకము మీద జ్వాలలు లేస్తూవుండే గుండము వొకటి; బదరీ నారాయణమువద్ద వుండేది వస్తువులను వేడిచేసే గుండము వొకటి; యీ ప్రకారము ఈశ్వరుడు సృష్టించి వున్నాడు. తప్తమణికర్ణికలో బియ్యము మూటకట్టి వేస్తే అన్నముగా పచన మవుచున్నదట. ఈ వుష్ణగుండముల వుదకము యావత్తు గంధకపు వాసన కలిగి వున్నట్టు విచారణమీద తెలిసినది. సదా జ్వాలలు

♦ ఇది ఇంగ్లీషువారు వ్యాపింప చేసిన వదంతి యని బిషప్ హెబరు గారు 1824లో స్వయముగా చూచి వ్రాసినారు.

కలిగి వుండే జ్వాలాముఖి గుళ్ళోనున్ను ఆ ప్రకారమే గంధక పరిమళము సదా కలిగి వున్నట్టు తెలియవచ్చినది. నాయుక్తితో విచారించగా పయి భూములలో శీతము కలుగ చేసిన ఈశ్వరుడు భూమి కింద వుష్ణము కలిగివుండే కొరకు గంధకము విస్తారముగా వుత్పత్తి చేసినాడనిన్ని, అగ్ని గంధకములో పుట్టడము సహజము గనుకనున్ను యీ గంధకము కలిగిన ప్రదేశములలో పుట్టే వూటజలము సహజముగా ఉష్ణముగా వుండేటట్టు తోచుచున్నది. జ్వాలాముఖిప్రదేశములో ఆరాధన నిమిత్తమయి గంధకద్వారా భూమిలో జ్వాలను ఈశ్వరుడు సదా కలగచేసినట్టు తోచుచున్నది. జ్వాలాముఖి స్వరూపముగా వుండే మహామాయ రణజిత్తుశింగుకు ప్రత్యక్షముగా యిష్టసిద్ధులు చేయుచూ యున్నది.

జ్వాలాముఖికి కొంత దూరములో రేవాలేశ్వర మనే తటాకములో అద్యాపి రెండు పెద్ద గుండ్లు పర్వతాకారముగా తేలుతూ లోకుల యారాధనలను అంగీకరింపుచు సంచరిస్తూ వుండేటట్టు నిశ్చయముగా తెలిసికొనుచున్నది. ఆ శిలల స్వభావము యెటువంటిదో తెలిసినది కాదు. కాలక్షేప నిమిత్తమయి సృష్టించిన యీ సృష్టిలో అటువంటి ఉదకము మీద తేలే శిలలు వుంటే యేమి వింత? అయితే దానికిన్ని హేతువు గర్భములో వున్నదని తోచు చున్నది.

నేపాళ దేశములో దేవప్రయాగ అనే వూరు వొకటి వున్నది. అందులో భగవత్పాదులవారు శ్రీరామమూర్తిని యంత్ర సహితముగా స్థాపించి కర్మణిసులుగా వుండే ద్రావిళ్ళు ఆ మూర్తిని ఆరాధన చేసేటట్టు నియమించి ద్రావిళ్ళను కొందరిని అక్కడ వుంచినారు. అద్యాపి వారు అక్కడ వుండి పుట్టే ఆడబిడ్డలను యీ దేశములోనుంచి వచ్చే ద్రావిళ్ళకు స్థితులు వ్రాసియిచ్చి వివాహము చేసి యిచ్చి అక్కడనే వుంచుకుంటూ వచ్చుచున్నారట. అటు జరగడము వల్ల ద్రావిడ దేశస్థులు యిండ్లు యిన్నూరుదాకా ఆ దేవ ప్రయాగలో యేర్పడి వున్నవి.

ద్రావిళ్ళ ప్రవేశము కావడములో యీ దేశములో యింతే కాకుండా మున్నూరుయేండ్ల కిందట ద్రావిడి యయిన యొక వెలనాటి

వాడు దేశములో భార్యను వదిలి గోకుల బృందావనానికి వచ్చి విరక్తు
డయి సన్యాసము తీసుకొన్నాడు. కొన్ని దినములకు పిమ్మట భార్య
వెతుక్కొనుచు ఆ పురుషుని వద్దికి వచ్చి తన్ను పరిగ్రహించక
పోయినంతలో ఆపె నిండా నిర్బంధపెట్టి కృష్ణమూర్తి ఆజ్ఞ
అయితే నన్ను పరిగ్రహిస్తావా అని అడిగినట్టున్ను, మంచిదని అతను
కృష్ణమూర్తి యుపాసకుడయినందున చెప్పినట్టున్ను పిమ్మట కృష్ణ
మూర్తి ప్రత్యక్షమయి భార్యను స్వీకరించమని ఆజ్ఞ యిచ్చినట్టున్ను
అటు పిమ్మట ఆ సన్యసించిన పురుషుడు భార్యను అంగీకరించి యేడుగురు
కొడుకుల కన్నట్టున్ను ఆ యేడుగురున్ను యేడుపీఠాలను యేర్పరచు
కొని వల్లభాచార్యులని పేరు పెట్టుకొని కృష్ణమూర్తి యుపాసకులై
ద్వారక మొదలుగా యీ హిందుస్తాన్‌లో వుండే బనయాఅనేవైశ్య
జాతి వారికంతా ఆచారవ్యవహారాలు ఉపదేశించి అటుయేర్పడ్డ
శిష్యులకు తులసీ మణులు ధారణ చేసి అతిప్రబలులుగా వున్నారు.
వారు ద్రావిడ దేశపు వెలనాటి వారితో సంబంధములు చేయుచూ
వృద్ధిపొందినారు. ఆ యేడు పీఠాలలో నాథద్వారములో ఒక పీఠము
వున్నది. అది ముఖ్యపీఠమని చెప్పుకోవడము. దక్షిణ దేశములో వారికి
శిష్యులు కోమటి గుజరాతీ వాండ్లు. ఆ యేడుపీఠస్థుల యొక్క వంశస్థులు
హిందూ దేశము యావత్తున్ను శిష్యయాత్ర చేస్తూవుంటారు.

యీ వల్లభాచార్య పీఠస్థులు గోపీకృష్ణోపాసకులు. వారికి
బనయా జాతికాక యింకా అనేక శూద్రజాతివారు కూడా శిష్యులై
యున్నారు. యీ వల్లభాచార్యుల పీఠముగాక హితహరి వంశా
చార్యులని యీ దేశపు బ్రాహ్మణుడు వొకడు రాధాకృష్ణో
పాసన చేసి బృందావనములో వక పీఠమును యేర్పరచుకొని
అనేక శూద్రజాతి జనులను శిష్యులుగా యేర్పరచుకొని వారికి
తులసీమణి ధారణచేసి ఆచారవ్యవహారాలు నియమించి వున్నాడు.
యీ పీఠస్థుని వంశస్థులకు ఏకాదశినాడు తాంబూల చర్వణము చేయు
డానికి శ్రీకృష్ణమూర్తి అనుజ్ఞ యిచ్చి వున్నాడని అవశ్యకముగా
అతని శిష్యజనులున్ను ఏకాదశినాడు అద్యాపి తాంబూల చర్వణము
చేయుచూ వుంచున్నారు. హిందుస్తానులో ఏకాదశినాడు విష్ణుభక్తులు

సకలవిధములయిన ధాన్యములు పరిత్యజించి కందమూలాదులు శింగాణి పిండిన్ని తిని వ్రతమును ఆచరింపుచున్నారు.

బ్రాహ్మణులకు దక్షిణ దేశములో భట్లు, అయ్యా అని పౌరుష నామధేయములు స్వనామముతో కలిసివుండేటట్టు యీ దేశములో బ్రాహ్మణులకు పాడె, దూబె, చౌబె, మిశిరి, తేవాడి, అని పౌరుషనామధేయాలు కలిగి వున్నవి. యీ పంచగౌడులని పంచ ద్రావిళ్ళనిన్ని భేదము కలిగి వుండడమే వాటికి కారణముగా వున్నది. మిక్కిలి విచారించగా నా బుద్ధికి తెలియబడ్డది యేమంటే సుమారు వెయ్యిన్నూరు సంవత్సరములకు ముందర హిందువులు వసించే హిందుస్థాన్ అనే యీ గంగా యమునల మధ్యేవుండే భూమి మ్లేచ్ఛ భూమి అయిన పార్శీ దేశానికి సమీపము అయి వుండగా కాబూలు కనమగుండా సింధువనిన్ని హిందువనిన్ని ద్వినామక మయిన మహానదిని దాటి కలి సామ్రాజ్య ప్రేరణచేత మ్లేచ్ఛులు * డిల్లి అనే హస్తినాపురి ప్రవేశించి కర్మద్వారా బ్రాహ్మణులు అయివుండే వారికర్మములు సాగకుండా వారిని భ్రష్టులను చేశేకొరకై అనేక హింసలు చేసినందున యీ రాజ్యము యావత్తు మ్లేచ్ఛాక్రాంత మైనందున యీ దేశస్థులు కర్మమును నిండా పాటించను వయిపులేనివారైరి.

యిప్పట్లో దాక్షిణాత్యులయిన హిందువులు స్వభాషతో యింగిలీషుమాటలు కలిపి మాట్లాడుతూ వచ్చేటట్టు యిక్కడ దొరతనము చేసేవారి తురకమాటలు సంస్కృతభాషతో యీ దేశస్థులు కలిపి మాట్లాడుతూ తురకలవలెనే వస్త్రవాహనాద్యలంకారాలను అంగీకరించి ప్రవర్తిస్తూ వచ్చేటట్టు తెలిసినది. అయినప్పటికిన్ని ముఖ్యమయిన వర్ణాశ్రమ ధర్మాదులుమాత్రము యిక్కడివారు వదిలిన వారు కారు.

---

* మ్లేచ్ఛుల దండయాత్రలు: క్రీస్తుకు పూర్వము 300-200 శతాబ్దములలో మన దేశమునకు (గ్రీకులు) యవనులు, శాకులు వచ్చిరి. క్రీస్తు తరువాత కూడా యూచీ మొదలగు మధ్య ఆశియా తెగలు వచ్చిరి. క్రీస్తుశకము 5, 6 శతాబ్దములలో, హూణులు, 8 వ శతాబ్దములో అరబ్బీలు, తరువాత అఫ్ఘనులు పారశీకులును వచ్చిరి. వీరినందరిని మనవారు మ్లేచ్ఛులనిరి.

యీ బ్రహ్మాండమునందు నున్న బ్రాహ్మణమండలి ద్రావిళ్ల నిన్ని, గౌడులనిన్ని రెండు తెగలుగా చీలి ఆ రెండు తెగలలో నున్న అయిదేశి తెగలు యేర్పడి తుదకు పది తెగలుగా చీలినది. అందులో గౌడులకు సొంతమయిన భూమి సాత్విక ప్రధానముగా అనాదిగా వుండుటచేతనున్ను స్థూలదేహాలు పృథివీ భూతానుగుణముగా వుండేవి గనుకనున్ను అనాది సంప్రదాయప్రకారము ద్వైతాద్వైతాలు శాస్త్రము చేత వాదింపబడుచునున్నా కర్మదృష్ట్యా ఉపాస్యదేవతలు భిన్నములు గానున్నా యెదటివాడి ఉపాస్యదేవతను నిందించకుండా స్వంత తండ్రిని కాపాడి యితరుల తండ్రులను కొట్టక తిట్టకవుండి మర్యాద చేయుచు వుండేటట్టు తమ తమ అంతఃకరణానుగుణముగా ఉపాసనములు చేయుచు అందరు అన్యోన్యముగా ప్రవర్తింపుచున్నారు.

స్వదేశము వదిలి కర్మముమీది శ్రద్ధ విస్తారము కలగ చేసుకొనుటచేత లేచి వచ్చిన దక్షిణదేశస్థులయిన ద్రావిళ్లు వింధ్య పర్వతానకు దక్షిణదేశమునందు ప్రవేశించగానే ఆ దేశవాసులు అందరు అప్పట్లో శ్రుతి స్మృతి పురాణాదుల సంకేతాలకు నిండా లోబడనివారలై మూఢులుగా ఉన్నందున వింధ్య దక్షిణదేశమునకు యిక్కడినుంచి లేచి వచ్చినవారు చేతనయినంత మట్టుకు కృత్య సంకేత ప్రకారము వైశ్యజాతిని మాత్రము కల్పించ తలచి క్షత్రియ కృత్యానికి తగినవారు లేనందున ఆ వర్ణ కల్పన వదిలి తాము బ్రాహ్మణులుగానున్ను తాము కల్పించినవారు వైశ్యులుగానున్ను యితరు లందరు శూద్రులు గానున్ను యేర్పాటుచేసి అలాగే ప్రవర్తింపుచూ వచ్చినారు. అందువల్లనే వైశ్యులు మేమంటే మేము వైశ్యులమనే వివాదము అద్యాపి దక్షిణదేశములో తీరకుండావున్నది. వింధ్యకు దక్షిణదేశ నివాసులు అందరున్నూ తత్పూర్వము శూద్రులకు శ్రుతి స్మృతి పురాణాదులగుండా నియమింపబడియుండే ఆచారాలు యెరగక నొక మూఢ ధోరణి అయిన తమ పూర్వికమార్గముగా ప్రవర్తింపుచు వున్నందున, యిక్కడినుంచి లేచి వచ్చిన బ్రాహ్మణులు శూద్రులతో తాము యీ దేశములో ప్రవర్తింపుచూ వచ్చిన జాడ వదిలి తమ యెక్కువగౌరవమును ఆపాదించుకొనేకొరకు వాండ్లను

కొంత వెలిగా వుంచి తదనుగుణముగా ఉపస్మృతులు పురాణాదులు కల్పనచేసి అక్కడి భూపతులకు బోధించి తమకు తోచిన కర్మాదులను క్రమక్రమముగా ఆచారవ్యవహారాదుల మూలముగానున్ను బింబారాధనల ద్వారానున్ను ప్రబలపరచుచు వచ్చినారు.

వింధ్యకు నుత్తర దేశవాసులయిన బ్రాహ్మణులు అందరున్ను ఋషులని అద్యాపి బ్రాహ్మణుల సంధ్యావందనములలో గంగా యమునల నడుమనున్న ఋషులకు నమస్కార మని వచిస్తూవున్నారు. దక్షిణదేశములో తత్పూర్వము బ్రాహ్మణులు లేనందున యీ దేశము నుంచి వచ్చిన బ్రాహ్మణులను సాక్షాదృషులనే తాత్పర్యముతో దక్షిణదేశములోని భూపతులు వీరు చెప్పినట్టువిని,ఆలయాదులు వాటి ఆరాధనలు, బ్రాహ్మణ గౌరవము,వారిపోషణ, మొదలయినవి సకలవిధాల చేస్తూ వచ్చినారు. అప్పట్లో యీ బ్రాహ్మణులు వింధ్యకు దక్షిణ దేశానికి రావడము సూర్యుడు భూమికి దిగివచ్చినట్టు అక్కడి భూపతులకు తోచినది గనుక యీ బ్రాహ్మణులు తమ దేశము వదలిపోకుండా వుండేకొరకు అపారమైన భూస్థితులు యిచ్చినారని నాకు తోచబడు తున్నది. యిప్పట్లో అక్కడి బ్రాహ్మణులు అనుభవించే భూస్థితులవంటివి యేకాలమందున్ను యీ దేశపు బ్రాహ్మణులు యిక్కడ అనుభవించినది లేదు గనుక యీ హేతువు పై వూహాకు నిండా ఆకరముగా వున్నది.

యీ ప్రకారము కర్మశ్రిద్ధ మితిని మించేటట్టు చేసేకొద్దిన్ని క్రిమక్రమముగా తమలోతమకే యీకర్మము చేసుటచేత నేను యెక్కువంటే ఆ కర్మము నీవు చేయతగవు గనుక నీవే తక్కువ యని వివాదము పుట్టి వివాద పురస్సరముగా ద్వేషము జనించి నీవు చూడగా నేను భోజనము చేయరా దనిన్ని నీవు తాకిన పాత్రి నేను కడగక వాడుకో ననిన్ని, నీ యుపాస్య దేవత మీాద ఫలాని ఫలాని దోషాలు వున్న వనిన్ని, నా యుపాస్య దేవత గుడికి నీవు రాకూడ దనిన్ని, నీ యుపాస్య దేవత గుడి నీడలోకి కూడా నేను రా ననిన్ని వాదింపుచు తమ్మెన గురుభావనగా ఆరాధింపుచూ వుండే అక్కడి దేశస్థులకు కూడా వారిలో వారికి ఆలాటి ద్వేష బుద్ధిని పుట్టించి పుండ్రాలు వస్త్రు

ధారణలు కూడా వీడు ఫలాని దేవతోపాసకుడు, వీడు ఫలాని కర్మణము చేసేవాడని గురుతు వుండే కొరకు సంపూర్ణముగా భేదించే టట్టు చేసినారు. అది మొదలు దిన దినానికి శైవ వైష్ణవులున్ను తదంతర్భూతులున్ను యితరులున్ను ద్వేషములకు అంతము లేకుండా యిప్పటికిన్ని వివాద పడుతూ వున్నారు.

హిందూస్తాన్‌లో ప్రవేశించిన తురకలు క్రమ క్రమశః వింధ్య దక్షిణ దేశములో కూడా పిమ్మట ప్రవేశించినా యిక్కడ హిందువుల సహవాసము తత్పూర్వము తమకు నిండా కలిగి వున్నందు చేతనున్ను హిందువుల మత సంకేత బలాబలాలను చక్కగా తెలుసుకొని వున్నందు చేతనున్ను తమ మతోద్ధారకుడైన మహమ్మదు తనువు ధరించిన తమ మతము శ్రేష్టమని లోకులకు బోధపడే కొరకు తమ మతములో ఒకణ్ని కలుపుకొని తురక చేస్తే పుణ్యమనిన్ని తమ మతము కాని వాని మొగము చూడరా దనిన్ని ఖురానులో వ్రాసిన మాటను నమ్మి మూఢభక్తి కలిగిన తురక భూపతులు యిక్కడ ఆదిలో తురకల చేసే కొరకు హిందువులను హింస పెట్టినట్టు దక్షిణ దేశములో పిమ్మట వారు హింసించిన వారు కారు. రాజ్యకాంతకు కలిగిన బుద్ధి ఆ విషయములో వారికి సాత్వికాన్ని సంపాదించి యిచ్చినది.

వెనక వెంబడిగానే నడితి వేరేనున్ను తత్వము వేరేగానున్ను వుండే హిందువుల బహిరంగ కృత్యములుచూచి వీండ్లు వెర్రివాండ్లు తెలియక రాళ్ళు రప్పలు నదులు కొండలు యివి మొదలైన వాటిని దేవుండ్లనుగా యెంచి చెడిపోతారనే పశ్చాత్తాపబుద్ధి మాత్రమే కలిగిన అతి దూరములోవుండే సాత్వికగుణప్రధాను లయిన యింగిలీషు జాతివాండ్లు హిందు దేశానికి భూపతులయినందున వారివల్ల కర్మాదులు యేహ్యపడ్డా ప్రబలవిరోధము మాత్రములేక తమ తమ కర్మాదులు తమ తమ యిష్టానుసారముగా సాగినమట్టుకు గడుపుకొంటూ యిప్పుడు దాక్షిణాత్యులు అక్కడ వున్నారని తోచుచున్నది.

పయిన వ్రాసిన ప్రకారము గంగా యమునా తీరవాసులయిన బ్రాహ్మణులలో కొన్ని తెగలు వింధ్య దక్షిణ దేశములో ప్రవేశించిన వెనక వొక తెగ కృష్ణాగోదావరీ నదుల సమీపప్రాంతమందును చేరి

నందున దేశభాష అక్కడ ఆంధ్రమయినందున ఆంధ్రులయినారనిన్ని రెండో తెగ కావేరీ తామ్రపర్ణీనదుల సమీపములో చేరినందున ఆ దేశభాష రీత్యా వారు ద్రావిళ్లు అయినారనిన్ని మూడో తెగ గోదావరి యుత్పత్తికి సమీపభూమి అయిన నాసికా త్రియంబకము మొదలయిన భూమిచేరినందున దేశభాషరీత్యా వారు కొంకణులని మహారాష్ట్రులని రెండు నామములు గల దేశస్థులైనారనిన్ని నాలుగో తెగవారు కావేరి యుత్పత్తికి సమీపస్థలమయిన కర్ణాటక దేశము చేరినందున ఆ దేశభాష రీత్యా వారు కర్ణాటకులైనారనిన్ని తోచుచున్నది.

నిండా విచారించగా ఘూర్జరులు మాత్రము ఎప్పుడున్ను హిందుస్థాన్ లోనుంచి యెత్తిపోయిన బ్రాహ్మణులతో చేరినవారు కారు. వారు ఎల్లప్పుడున్ను ఘూర్జర దేశములోని కాపురస్థులే నని తోచపడుచున్నది. అయితే వారిని పంచద్రావిళ్లతో కలిపి వాడడము ఎందువల్లనంటే వారున్ను ద్రావిళ్లరీతిగా వింధ్య దక్షిణ దేశ నివాసులయి వున్నందుననున్ను హిందుస్థాన్ లో అయిదు తెగలుగా అయిదు దేశాలలో బ్రాహ్మణులు పృథక్కు పృథక్కుగా భాగింపబడి వున్నందున యీ పంచగౌడులకు ప్రతిగా పంచద్రావిళ్లు అనుకోవడానకు ఘూర్జరులను కూడా కూర్చి వాడుకుంటూ వచ్చేటట్టు తోచబడుచున్నది. అందుకు ప్రబలమయిన కారణము యేమంటే యీ దేశములో పుట్టిన గయావళీలు మొదలైన స్థలవాసులు ఘూర్జరులు వినాగా వుండే నాలుగు తెగల ద్రావిళ్లు అన్నశ్రాద్ధముచేస్తే బ్రాహ్మణార్థముచేసి వారి పాకములో భోజనము చేస్తారు గాని ఘూర్జర బ్రాహ్మణులు చేసే శ్రాద్ధాలలో బ్రాహ్మణార్థము నిమిత్తమై వారి పాకములో భోజనము చేయడము లేదు. ఘూర్జరుల చేత చటకశ్రాద్ధము చేయించి శీదా లనే స్వయంపాకము గయావళీలు పుచ్చుకుంటున్నారు. అందువల్ల నున్ను యీ ఆచారమునే అద్యాపి దక్షిణ దేశమందున్ను కడమ నాలుగు తెగల ద్రావిడ బ్రాహ్మణులున్ను పాటిస్తూ వుండడము చేతనున్ను కావేరి తామ్రపర్ణీ తీరాలయందు మాత్రము ఘూర్జర బ్రాహ్మణులు నిండా కర్మఠులుగా

నడవపట్టి ఒకమాత్రముగా వారితో భోజనప్రతిభోజనాలు కల్గివుండుట చేతనున్ను భగవత్పాదుల వారు దిగ్విజయము చేసినప్పుడు ఘూర్జర దేశములోనే నివాసులుగా వున్నట్టు శంకర విజయములో కని వుండుట చేతనున్ను బ్రాహ్మణ మండలి పృథక్కు కాకమునుపే యీ మండలిలో చేరక ఘూర్జరులు ప్రత్యేకముగా స్వదేశ నివాసము యెప్పుడు ఒక టే రీతుగా చేస్తూవుండే టట్టు తోచుచున్నది.

యీ ప్రకారము యిప్పుడు తెలియవచ్చి వుండే పంచగౌడులు పంచద్రావిళ్ళు అనే పది తెగల బ్రాహ్మణులు గాక పరశురామ నిర్మితమయిన కేరళ దేశస్థులు, చిత్పావనులు, కరాడీలు, అనేమూడు తెగల వారు వున్నారు. యీ మూడు తెగలలో పునా శ్రీమంతుడు చిత్పావన బ్రాహ్మణుడై సార్వభౌముడై బహుకాలము ప్రవర్తించి నందున కొంకణస్థులలో నాసికాత్రియంబక నివాసులైన బ్రాహ్మణులకు కనకాభిషేకాలుచేసి, ఆ తెగతో పూరాగా తాను తనజాలాన్ని కలిపి కరాడీలను కూడా కలిపినాడు. యిప్పుడు మహారాష్ట్రులకున్ను వారి కిన్ని యెంత మాత్రమున్ను భేదము లేకుండా వుభయులు వొకరితో వొకరు కలిసి యున్నారు. యీ తెగలు గాక కేరళ దేశస్థులు తమ దేశములో పూజ్యులుగా, యితర బ్రాహ్మణులతో కూడా కలియక నున్ను కలియకూడకనున్ను నంబురు (నంబూద్రి) లనిపించుకొని తమంతట తాము వుండి వున్నారు.

గయలో బ్రహ్మకల్పిత బ్రాహ్మణులనే వొక తెగవారు గయావళీలుగా వున్నారు. కాశిలో గంగా పుత్రులని వొక తెగవారు వుండి వున్నారు. యిదిన్నిగాక శాకద్వీప బ్రాహ్మణులని వొక తెగ వారు హిందూస్తాన్ దేశములో వాసము చేస్తూ యిప్పటికిన్ని వున్నారు. వారి వృత్తాంత మేమంటే శ్రీకృష్ణులు ద్వారకలో విరాజమానులయి వుండగా సాంబుడనే అతని కొమారుడికి పెద్దరోగము ప్రాప్తించి నట్లున్ను చికిత్స నిమిత్తమై వైనతేయుడు శాకద్వీపమునుంచి వొక బ్రాహ్మణుని తెచ్చినట్టున్ను వాని వంశస్థులు తాము ని ఆ తెగవారు అద్యాపి యీ దేశములో చికిత్స చేస్తూ నెగడి వున్నారు. పైన వ్రాసిన తెగలుగాక యీ హిందూస్తాన్‌లో విశ్వకర్మణకు రంభకున్ను

శాపము తగిలి భూలోకములో మానుషజన్మము కలిగి ఉభయులకున్ను దాంపత్యము పొసగి సంతతి కలిగినట్టున్ను వారికి కలిగిన సంతతి విశ్వకర్మ కల్పిత బ్రాహ్మణులని వారు శిల్పిపనులు చేస్తూ యిప్పటికిన్ని నెగడి వున్నారు.

గయలో వుండే డాక్టరు జాన్ జేవిడు సన్ దొర ప్రపంచసృష్టి సంబంధము లయిన మాటలు నాతో ఆడుతూవుండగా హిందూ దేశములో వుండే బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణాలనే భేదము యీశ్వర నిర్ణయమా? లేక మానుష సంకేతమా? అని ప్రశ్న వేసినాడు. బహుదూరము వాదము జరిగి మానుష నిర్ణయమని తెలియ చేసినాను. పిమ్మటనున్ను బహుశా విచారించగా అదే తాత్పర్యమునాకు బోధ అయినది. అందుకు హేతువులు యేమంటే వొకపురుషుడు ప్రజల వుత్పత్త్యర్థమున్నూ తద్వారా మానుషానందానుభవార్థమున్ను స్త్రీని పరిగ్రహించి ప్రజావృద్ధి చేసినట్టు యీశ్వరుడు సృష్టించిన అనేక బ్రహ్మాండాలలో అనేకకోటి పిండాండాలు అంతర్భూతములై వున్నవి. ప్రతి పిండాండానికిన్ని బ్రహ్మాండానికి కలిగిన సకలగుణాలు చేష్టలు మొదలయినవి యేర్పడివున్నవి. అందుకు దృష్టాంత మేమంటే పృథివ్యప్తేజోవాయ్వాకాశాలు ప్రతి బ్రహ్మాండానికి కలిగి వున్నట్టు అంతర్భూతములుగా వుండే అనేక పిండాండాలకు కలిగి వున్నవి. ప్రతి పిండాండానికిన్ని అనేక సూక్ష్మ పిండాండాలు అంతర్భూతములై వున్నవి. అందుకు దృష్టాంతమేమంటే ప్రతి దేహములోనున్ను అనేక క్రిమికీటాదులు ఉత్పత్తి అయి నశింపుచు వుండడము సిద్ధము గనుక యీ అర్థమున్ను సత్యమే గదా! వొక అద్దానికి యెదురుగా మరివొక నిలువుటద్దము కట్టి నడుమ మనిషి నిలిచి చూస్తే వొకటిలో నొకటిగా తన ప్రతిబింబాలు అసంఖ్యేయముగా ఉత్పత్తి అయ్యేటట్టు దీపదీపికా న్యాయముగా అనేక మనుష్యులున్ను జంతువులున్ను పరంపరగా యీశ్వర భావితేత సృష్టములై స్థితిని బొంది లయమవుచు నున్నవి.

ఇట్లు సృజింపబడిన యనేక బ్రహ్మాండములలో మనము వసించే బ్రహ్మాండము నొక్కటి. యిందులో యీ భూమియొక్క కొలత యింగిలీషువారి యొక్క వూహా ప్రకారమున్ను మన గోళశాస్త్ర

ప్రకారమున్ను చచ్చౌకము సుమారు యిరువైకోట్లమయిలు లున్నవి. వీటిలో ఉదకమయముగా నుండే భూమి ౧౬ కోట్ల మయిళ్ళు పోగా మనుష్య వాసముగా నుండే భూమి నాలుగు కోట్ల మయిళ్ళు. యిందులో వశించే మనుష్యమండలి డెబ్బదికోట్లు. యిందులో దక్షిణోత్తరాలలో కన్యాకుమారి మొదలు కాశ్మీరము వరకున్ను తూర్పు పడమరలలో సింధునది మొదలు బ్రహ్మపుత్రి నదివరకున్ను వాసముచేసే హిందు దేశపు జనులను మొత్తముగా చెరిసగముగా లెక్కచూచినా ముప్పదియైదు కోట్లకు యెక్కువవుండరు. వర్ణాశ్రమ నియమము కలిగిన కర్మభూమి పయిన వ్రాశిన యెల్ల సరిహద్దుకు లోపల నున్నది గాని యీ బ్రహ్మాండములో మరియెక్కడనున్ను లేదు.

పైన వ్రాసిన చతురశ్రిమ భూమిలో నుండే మానుషమండలికి మాత్రిమే వర్ణాశ్రిమ ధర్మములు కలిగియున్నవిగాని మిగిలిన సగం భూమిలోనున్ను వారికి వృత్తులచేతనున్ను కృత్యములచేతనున్ను మనుష్యతారతమ్య జ్ఞానమేగాని వృత్తికృత్యములతోకూడా హిందూదేశ మర్యాద ప్రకారము రక్త పరంపర నిమిత్తము లేదు. యీ కర్మభూమిలోనున్ను రక్త పరంపరే స్వతంత్రిముగా వర్ణాశ్రిమాలను కాపాడ నేరదు. కృత్యమున్ను వృత్తిన్ని పుట్టుకతోకూడా మిళితమై యుండ వలసి యున్నది గదా! యిందుకు ఆకరమేమంటే "జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః." అనే వచనమే ఆకరము. యీశ్వరుడు ఆదిలో యీ వర్ణాశ్రిమ ధర్మములతో మనుష్యసృష్టిని చేసి యుంటే బ్రిహ్మాండమందంతటా యీ వర్ణాశ్రిమ ధర్మములు యీ రీతిగానే కలిగియుండ వచ్చునే! అయితే ఈ బ్రింహ్మాండము లలో మానుష సృష్టి పయినవ్రాసిన చతురశ్రిమమైన కర్మభూమి మొదలుగా ఆరంభింపబడినది. అందుకు ఆకర మేమంటే యింగిలీషు వారి బైబిలులో యేడం (Adam)అనే పూటస్థుడున్ను ఆవి (Eve) యనే పూటస్థురాలున్ను యీ ప్రదేశములో పుట్టినట్టు చెప్పి యున్నది గనుకనున్ను మన పురాణాలు అందుకు ఏకవాక్యతపడు తున్నవి గనుకనున్ను మానుష సృష్టికి ఆరంభము మొట్టమొదట హిందూదేశములో నుంచేనని నిశ్చయించ వలసినది. పిమ్మట పరంపరగా

దీప దీపికా న్యాయముగా బ్రహ్మాండమంతా మానుష మండలితో నిబిడీకృత మవుతూ వచ్చుచున్నది.

అటు సృష్టికి ఆది మనుష్యులు యీ ప్రదేశములో వసించినందు చేతనున్ను వారు సచ్చిదానంద స్వరూపుడైన యీశ్వరునికి యథోచితముగా సమానులుగా వుండవలసినవారు గనుకనున్ను తద్వారా వారు స్వేచ్ఛామరణము గలవారుగా వుండవలసినవారు గనుకనున్ను అటువంటి మహాత్ములు యీశ్వరుని చిద్విలాసము చూచి బహు కాలము ఆనందింపుచు వుండడానకు కోరి చిరకాలము జీవింపుచు వుండవచ్చును గనుక నున్ను వారు యీ భూమిలో సృష్టులయినవారి పరంపరలను చూచి, నాలుగు ముఖ్యమయిన పనులకుగాను మానుష కోటిని నాలుగు వర్ణములుగా నియమించి, యీ నియమింపబడిన వారి పరంపరే ఆ యా వర్ణాశ్రమకృత్యములు చేయుచు వుండతగినవి కాని వొక వర్ణము వారు మరియొక వర్ణము కృత్యములు చేయ కూడదనిన్ని ఒకవేళ చేస్తే భ్రష్టులవుతారనిన్ని శిక్షకూడా విధించి ఆయా వర్ణాశ్రమాలలో నున్నవారు వర్ణానుసారముగా చాయ వలసిన పనులు తెలియడానకు పూర్వీకులు శృతి స్మృతులు చేసి యిచ్చినారనిన్ని తేటపడుచున్నది. అందుకు ఆకరము యజుర్వేదములో భరద్వాజమహామునివల్ల శృతులు మానుష మండలిలో ప్రచురము చాయబడ్డవని వున్నది. అష్టాదశ స్మృతులున్ను వాటి వాటి నామాంకితాలవల్లనే మన్వాదులయిన యిక్కడి మనుష్యులచేత వర్ణాశ్రమ ధర్మాలను నియమించి తెలియ వ్రాయబడిన పుస్తకము లని తేట పడుచున్నది.

మూల స్మృతులు ౧౮. ఆ ౧౮ స్మృతులున్ను ఆజ్ఞలను విధించి నట్టు విషయాదులను నిరూపించి చెప్పుతూ వచ్చును గాని ఫలాని ఋషి మతము యిది, అందుమీద నామతము ఇది, అని మూలస్మృతులు చెప్పవు. అటు ఋషుల మతాలు వుదాహరించి చెప్పేవంతా ఉపస్మృతు లని తెలియ వలసినది. ఇందులో యేదేది మూల స్మృతియని శానా దూరము గయలో జడ్జీగా వుండే జార్జి ఐ. మారీసు దొరగారి సన్నిధానమందు నాకున్ను యిక్కడి పండితుల

కున్ను వివాదము పడి ఒక నిశ్చయానకు వచ్చినాము గనుక ఆమూాల స్మృతుల పేళ్ళు యీ అడుగున వ్రాయుచున్నాను. నెం ౧. స్వాయం భువమను స్మృతి ౧. బృహస్పతి స్మృతి ౨. వశిష్టస్మృతి ౩. కశ్యప స్మృతి ౪. భారద్వాజస్మృతి ౫. గౌతమస్మృతి ౬. యాజ్ఞవల్క్య స్మృతి ౭. భృగుస్మృతి ౮. నారద స్మృతి ౯. కపిల స్మృతి ౧౦. పరాశర స్మృతి ౧౧. వ్యాసస్మృతి ౧౨. కాత్యాయన స్మృతి ౧౩. ఆపస్తంబ స్మృతి ౧౪. ఆశ్వలాయనస్మృతి ౧౫. కణ్వస్మృతి ౧౬. అత్రిస్మృతి ౧౭. హారీత స్మృతి ౧౮. యివి మూాలస్మృతులు అనడానకు యెవరు సందేహపడనేరరు. కాశిలో యీ వివాదము పొశిగివున్నట్టి యితే కుంఫిణీవారి పాఠక శాలలోనున్ను యింకా అనేకులవద్ద నున్ను గ్రంథసంగ్రహము బాహుళ్యముగా వున్నది గనుక వయిపు (వీలు) అయినన్ని మూాల స్మృతులు సంపాదింతును.

యిటీవల మాారీసుద్వార బహురసికుడును బహు శోధకుడున్ను గనుక సహగమనము స్త్రీలకు కూడదని లార్డు బెంటికుగారు విధించి యిటీవల యేర్పరచినారు గదా, మీాలో స్త్రీలు పురుషుడు చనిపోతే అగత్యముగా సహగమనము చెయ్యవలసినదేనా? చేయక పోతే ప్రత్యవాయమా? అని ప్రశ్న చేసినాడు. మను పరాశ రులు ఆదిస్మర్తలు; వారి స్మృతులలో పురుష దేహానం తరము విధవస్త్రీలు నడవవలసిన విధులను విధించి వ్రాశినారుగాని సహగమనము చేయ వలసిన దని విధిగా మూాలస్మృతులలో వ్రాయ లేదు; నేను బహుదినాలుగా యీ సంగతిని విచారింపు చున్నాను; ఉపస్మృతులలో యీ విషయానకు అనేక ఆకరము లున్నవిగాని మూాలస్మృతులలో లేదని చెప్పినంతలో యిక్కడి కోటుపండితులు తద్వ్యతిరిక్తముగా చెప్పి తుదను మూాలస్మృతులలో సహగమనానికి ఆకరము లేదని ఒప్పుగొన్నారు.

యీ స్మృతులు కల్పించిన వారిపేళ్ళున్ను ఋగ్యజు స్సామా లను భూమిలో ప్రచురము చేసిన భారద్వాజుల పేరున్ను సావధాన ముగా యోచిస్తే వారు యీ కర్మభూమిలో వుత్పత్తి అయినవారు

మాత్రిమేగాక ఆయా ౧౮ ఋషుల జననమును జనన కాలమున్ను పురాణాదులవల్ల వూహించి చూడగా సృష్టికి బహు కాలమునకు వెనక వారు జననమయిన వారుగా అగుపడుతున్నారు. అప్పటికి వర్ణాశ్రిమ ధర్మాలు సృష్టికి ఆదిన కలిగినవిన్ని కావు. యీశ్వర నిర్ణయమున్ను కాదు. అయితే భారద్వాజులేమి స్వాయంభువమను వేమి, పరాశరు లేమి, గౌతము లేమి, కశ్యపు లేమి, యింకా యితర స్మర్తలేమి వీరిని మనుష్య మాత్రులుగా చెప్పకూడదు; బ్రిహ్మ జ్ఞానము కలవారు గనుక సచ్చిదానంద స్వరూపులుగానే చెప్ప వలసినది.

పయిన వ్రాసిన ప్రికారము వర్ణాశ్రిమ ధర్మాలు వారు నియమించినంతలో యేతత్సంకేతానికి ఆ దినము లోబడ్డవారి రక్త పరంపర గలవారే ఆ ధర్మాలను ఆచరించవలసినది గాని యితరులు ఆచరించకూడదని అప్పటి సంకేత ప్రికారము నియమము యేర్పడ్డది గనుక క్రీస్తు మతస్థులవలెనున్ను చూచినవారినంతా బోధించి నిర్బంధ పెట్టి యీ హిందుమతములో కలుపుకోవడానకు హిందువులకు నిమి త్తము లేకుండా పోవడము మాత్రిమే కాకుండా ఆ ప్రికారము నియ మించబడ్డ ధర్మాలు తప్పి నడిచిన వారినంతా యీ హిందు సమూ హాములోనుంచి తోశి అటు ప్రార్థించే క్రీస్తు మహమ్మదు మతస్థు లతో చేరేటట్టుగా ప్రేరేపణ చేయడమవుచున్నది. ముఖ్యముగా వర్ణా శ్రమ ధర్మాలు చేసినంతలో వర్ణాశ్రమములు సిద్ధి అయ్యేటట్టుగా శాస్త్రిలుయేర్పడివుండడము మాత్రమేకాకుండ ఆదిసంకేతానికి లోబడ్డ వారి పరంపర వంటివారే ఆ కర్మాదులు చేయవలసినది గాని యిత రులు ఆ కర్మాదులు చేసినంతలో ఆ వర్ణాశ్రమములు సిద్ధించక పోవల సినదని కూడా వెంబడిగా ఒక విధి శాస్త్రిలలో యేర్పడి వుండవలసిన దేమని యోచించగా భారద్వాజులు మనకోసరము భూమిలో ప్రిచు రము చేసిన మూడు శృతులున్ను మన్వాదులు తదనుసారముగా చేసిన స్మృతులున్ను 'గజోమిథ్యా పలాయనం మిథ్యా' అని అడివి యేనుగ బ్రిహ్మజ్ఞానిని తరిమితే తప్పించుకోవడానికి పరిగెత్తుతూ 'జగన్మిథ్యా బ్రిహ్మసత్య'మనే అద్వైత వచన ప్రికారము నా పరుగు

అబద్ధము, తరిమే యేనుగ అబద్ధము, బ్రహ్మమనే వస్తువ ఒకటే సత్యము
అని ద్వైతులు నవ్వేటట్టుగా అద్వైతి అనుకున్నట్టు ఒక్కటే వస్తువని
అంతస్సులోనమ్మి ఆవస్తువే యిన్నిగా వున్నదనే నిశ్చయముతో పయికి
కనపడే అనేక వస్తువుల స్వరూపాలను మనోవికారాలుగా భావించి
అయినప్పటికిన్ని దేహబుద్ధి వుండేవరకు వాటికి తారతమ్యములు విచా
రించి తారతమ్య మయిన పనులు చేయ వలసినది గనుక యీ రీతిని
నడవడానికి సాంప్రదాయకము తెలిసినవారే నడుతురుగాని నూతన
స్థులు ఒకటి అనుకుంటూ ఒకటి చేయడము ప్రయాస గనుక చేసిన
సంకేతము నడవక చెడిపోననే తాత్పర్యముచేత పూర్వీకులు ఆదిసంకే
తానికి లోబడ్డవారి వంశస్థులే యీ వర్ణాశ్రమధర్మాలు జరప
వలెనని నిశ్చయము చేసినారని నాకు తోచుచున్నది.

పయినవ్రాసిన మూలస్మృతులు ౧౮ గాక మరికొన్ని స్మృ
తులుకూడా మూలస్మృతులని వివాదాస్పదములుగా వున్నవి. ఋగ్యజు
స్సామాలుగాక అధర్వణమున్ను వొక ప్రత్యేకమయిన వేద మని
వివాదముగా వున్నది. బ్రాహ్మణమండలి పయినవ్రాసిన ప్రకారము
భిన్నులయి ఒక తెగ దక్షిణదేశ నివాసులయిన వెనక దేశకాలాలకు
అనుగుణముగా దక్షిణానికి సాగివచ్చిన మండలిలోని పండితులు నూరా
రులు ఉపస్మృతులు వ్యాసః వశిష్ఠః నారదః అని ఆకరాలు వ్రాసి వారి
వారికి సమ్మతి అయినట్టు వుపస్మృతులు యేర్పరచినారు. దక్షిణదేశ
ములో మూలస్మృతుల సంగ్రహించడము విస్తారము లేనందున యెల్లా
జియ్యము, నిర్ణయసింధు మొదలయిన ఉపస్మృతులే సంభవించే
విషయాల పరిష్కారము నిమిత్తము యెత్తిచూచుచున్నారుగాని మూల
స్మృతుల జ్ఞాపకమే మరచినారు. ఉత్తరదేశములో పండితమండలి
బహుశః దక్షిణదేశానికి లేచిపోయినందుననున్ను మూలస్మృతి సంగ్రహ
మును తాము విపత్తులచేత చేసి వుంచనందున నున్ను యిటు వెనక
పుట్టిన మితాక్షరము సరస్వతీ విలాసము మొదలయిన కొన్ని వుపస్మృ
తులె హిందుస్తానులో ప్రచురముగా వాడుతారుగాని దక్షిణదేశము
వలె యిక్కడ వున్న స్మృతుల పరంపర అనర్గళ ప్రవాహమై వుండ

షట్ఛాస్త్రముల వల్ల ఆదినుంచి వివాదాస్పదములుగా వుండే ద్వైతాద్వైతమతాలు రెండుగాక విశిష్టాద్వైతమతము ఒకటి అతి ప్రసిద్ధమయి దక్షిణ దేశములో యిప్పుడు నెగడియున్నది. అటు ఒకటే ఆశ్చర్యకరమయిన యుక్తులతో నెగడి నిదిన్ని గాక ఆరుకాటి రాయజి * సర్వాధికారము చేయుచు వుండగా సాకారాద్వైతమని ఒక మతము వుద్ధరించి ప్రబలము చేయ తలచినాడు. పాండిత్య కుశలతలు ఆది శృతిస్మృతులనే వృక్షముయొక్క క్షేమాన్ని వెతకకుండా వేళ్ళను భేదించడమే వృక్షమునకు బలకరమని దక్షిణ దేశస్థులు మూలభేదము చేయుచు వచ్చు చున్నారు. వారి తాత్పర్యానికి వ్యతిరిక్తముగా వృక్షము బలహీన దశను క్రమ క్రమశః పొందుచున్నది.

అయినప్పటికి యీ సర్వోత్తమ మయిన కర్మభూమి కర్మద్వారా బ్రహ్మానుసంధానము చేసే మార్గమును యేర్పరచిన పూర్వీకుల తపః ప్రభావము అమితము గనుక జరిగిన అచాతుర్యాలకు విశ్వేశ్వరుడు మ్లేచ్ఛులవల్ల తగుపాటి శిక్ష కొంతకాలము హిందూ దేశపు కర్మఠులకు కలగచేసి యిప్పుడు సాత్వికగుణ ప్రధానులయిన యింగిలీషువారిని బహు దూరము నుంచి అనాయాసముగా యీ కర్మభూమికి దెచ్చి యిక్కడి సార్వభౌమత్వము వారికి కలగ చేసినాడు. యిఖమీదటనున్ను ఆ కరుణా కటాక్షముతోనే మన అపరాధాలు క్షమచేశి ఆదిని వుద్ధరింపబడ్డ శృతి స్మృతి చోదితమయిన కర్మములున్ను తజ్జనితమయిన బ్రహ్మానుసంధానమున్ను నిష్కల్మషముగా కాలాంతరములో సిద్ధించ వలశినది.

5|1|50

* చెన్నరాజధానిని ఇంగ్లీషువా రాక్రమించే నాటికి ఈ సముద్రతీరపు భూమిని చాలవరకు కర్నాటక మనే వారు. ఆ కర్ణాటక నవాబునకే ఆర్కాటు నవాబు అనిపేరు. వాలాజా నవాబు కింద శిరస్తదారు రాయరెడ్డిరావుగారు ఛాలా భలవంతుడుగా వుండేవాడు. ఇతడు 1809 లో చనిపోయినాడు.

# పదిహేనవ ప్రకరణము

పయిన వ్రాశినటువంటి పట్నా షహరులో డిసంబరు నెల ౩౧ తేదిదాకా వుండి ౧౮౩౧ సం॥ జనవరి నెల ౧ తేది ఉదయ మయిన ౪ గడియలకు గయా మహాక్షేత్రానికి ప్రయాణమై పది ఘంటలకు పునఃపునః అనే నదివద్ద చేరినాను. దారి సడక్కు వేసియున్నది. యిరుపక్కల తోపులు వూళ్ళు నిబిడీకృతముగా యున్నవి. గయా వ్రజనము చేయడానకు పునఃపునః నదివద్ద క్షౌరము చేసుకొని శ్రాద్ధము చేసి సంకల్పము చేయవలసినది గనుక అదేప్రకారము జరిగించినాను. దిగడానకు నదివొడ్డున స్థలము లేదు గనుక బయిలులో గుడారము వేశి వంటభోజనములు గట్టున గడుపుకుని రాత్రి సీమా నదామా అనే వూళ్ళవద్ద ఒక సరాయి, ఒక పబ్లిక్కు బంగళా వుండగా వాటి సమీపమందు నిలిచినాము. సరాయిమధ్యే ఒక భావియున్నది. సరాయి దిగడానకు మంచివసతి. యీ సరాయి పట్టణమునకు ౯ కోసులదూరములో నున్నది. భాట బాగుగాని దువ్వరేగడ భూమి. సీమా నదామా అనే రెండు వూళ్ళున్ను గొప్ప వూళ్ళేను. బాజారు వున్నది. అన్ని పదార్థాలు దొరుకును. వంటచెరుకులు మాత్రము ప్రయత్నముమీద దొరకవలసినది. మిరిజాపూరు మొదలుగా అడివి సమీపముగా యీ ప్రాంత్యాల లేదు గనుక గోమయ శుష్కములు నాటుపురాలలో బహుశః వాడుతారుగాని వంటచెరుకులు పట్టణములలో దొరికేటట్టు సహజముగా నాటుపురాలలో దొరకవు. పునఃపునః అనేనది నిండా వెడల్పు లేకపోయినా జీవనదిగా సార్వకాలము ప్రవహింపుచున్నది. యీ రాత్రి పయి రెండువూళ్ళవద్ద వసించియున్నాను.

జనవరి నెల ౨ తేది ఉదయమయిన ౨ ఘడియలకు మంచువల్ల బాగా యెండవచ్చిన వెనక బయలుదేరి యిక్కడికి ౯ కోసుల దూరములో వుండే జానా అనే వూరు ౧ ఘంటకు చేరినాను. దారి నిన్నటివలెనే బాగా సడక్కు కలిగి యున్నది. ఈ వూరు షహరువంటి వూరు, ౧౦౦౦ యిండ్లు కద్దు; బట్టలుకూడా నేశి అమ్ముతారు. గొప్ప బాజారు

వున్నది. వూరివద్ద ఒక చిన్ననది ప్రవహించుచున్నది. నదివొడ్డున లోగడి మజిలీవలెనే హిందువులకు ఒక సరాయి, జాతులవారికి ఒక బంగాళా కట్టివున్నది. బరకన్‌దాసు అనే పోలీసు బంట్రౌతు ముసాఫరుల సరఫరాయి నిమిత్తమున్ను కాపు నిమిత్తమున్ను సరాయి బంగాళాలవద్ద కాచియుంటాము. యీ గొప్ప వూరిలో వంటచెరుకులు ప్రయత్నము మీద దొరికినవి. యీ రాత్రి యిక్కడ వసించినాను.

3 తేది 2 ఘంటలకు బయలువెళ్ళి యిక్కడికి ౮ కోసుల దూరములోవుండే చెలాయనే యూరు ౨ ఘంటలకు చేరినాను. దారినిన్నటి దారి వలెనే బాగావున్నది. ఈ వూరిలోను సరాయి బంగాళా వున్నప్పటికిన్ని సరాయిలో మనుష్యులు నిండి యున్నందుననున్ను కాశీ పట్టణము మొదలుగా ప్రతి జిల్లా మేజస్‌ట్రేటు వారు వారి సరిహద్దు పరియంతమున్ను చప్రాశి అనే ఒక బిళ్ళ బంట్రౌతును దయచేశియిస్తూ వున్నందున, కూడావున్న తయినాతి బంట్రౌతు గుండా ఆవూరిజమీన్‌దారుణ్ని పిలుపించి వాడియింటిని ఖాలీ చేయించి అందులో దిగినాను. యీ వూరు గొప్పవూరేను. సకల పదార్థాలు దొరుకును. జలవసతి నిండా లేదు. యీ వూరిలో యీ రాత్రి వసించినాను.

౪ తేది ఉదయ మయిన 2 ఘంటలకు ప్రయాణమై యిక్కడికి ౧౦ కోసుల దూరములో వుండే గయామహాక్షేత్రము ౨ఘంటలకుచేరినాను. కాశిలోవుండగానే డౌలత్తురావు శింధ్యా గయావళి సహదేవ భయ్యాస్వీకారపుత్రుడయిన చోటాలాలు భయ్యా యోగ్యుడని తెలిసినందున ఆ చిన్నవాణ్ని కాశికి పిలుపించినాను. అతడు రాజసత్తుతో కూడా నా వెంబడి ఒక బజరాచేసుకొని పట్నాపహారుకు వచ్చి అక్కడి నుంచి కూడా గయకు మజిలి మరుమజిలీగా నాతోకూడా భోజనము చేసుకొంటూవచ్చి ముందర దిగడానకు విష్ణుపాదము గదాధరస్వామి గుళ్ళకు ఫల్గుణినదికిన్ని అతి సమీపముగా ఒక గొప్పయిల్లు కుదిర్చిపెట్టినందున అందులో దిగి, యీశ్వర కటాక్షముచేత నా గయావళీ ఉపపన్నుడయి బహుశః యింగిత జ్ఞానము తెలిసి గదాధర భట్లు అనే దేశస్థ బ్రాంహ్మణుని తనవద్ద సర్వాధికారిగానున్న ప్రాపకుడుగా నన్ను వుంచుకొని వున్నాడు గనుక సకల విధాలా ఆ క్షేత్రము నాస్వస్థ

శముపలెనే అయ్యేటట్టుగా జాగ్రిత పెట్టించినాడు. కాశీనుంచి వచ్చే దారిలో చపార్రి అనేపహరులో లోగడ చన్నపట్టణములో ఆక్టింగు గౌనరుగా వున్న గ్రిందొరగారు జననమయి వారి తండ్రిగారు అక్కడ బహుకాలము అధికారము చేసినందున వారి పాత నవుకరులకు కొంత యినాములు యిచ్చి వారి కుశలము విచారించే కొరకు నన్ను కొన్ని దినములు చపార్రిలో నిలువు మని చెప్పినందున ధనుర్గయ త్వరగా ఆరంభించడానకు కొంత ఆలస్య పడ్డది గనుక ధనుర్మాసములో గయావ్రిజనము సమాప్తి కాక పోయినా ఆరంభము మాత్రిము ధనుర్మాసములోనే చేసినాను.

గయాక్షేత్రిము మహా గొప్పపట్టణము. అందుకు వుత్తర భాగమందు ౫౦ యేండ్లుగా యింగిలీషువారు సాహేబు గంజు అని ౨కోసుల దూరములో తాము యిండ్లు తోటలు కట్టుకొని ఒకబస్తీ చేసినారు. అక్కడ అనేక మళిగెలు గొప్పబజారు వీధిన్ని యేర్పడ్డది. సకల పదార్థాలు ఆబజారులో చవుక. ఆసాహేబుగంజు బస్తిన్ని గయాపహరున్ను యిప్పట్లో యిండ్ల సమూహముతో కలిసి వున్నది. రెండు స్థలాలలో మూడు వేలయిండ్లున్ను ౧౫౦౦౦వేల మంది ప్రిజలున్ను కలిగి వుండునని తోచుచున్నది. గయలో ఒక మేజస్ట్రేటు ఒక జిల్లాజడ్జి, ఒకడాక్టరు, యాత్రిదారుల వద్ద మహసూళ్లు వసూలు చేయడానికిఒకటాక్సుకలకటరు జిల్లాకలకటరుకుఅంతర్భూతముగా వున్నారు. గయాపట్నము బాహారుజిల్లాతో చేరినది. కలకటరు హుజూరి కచ్చేరి యిక్కడ బహుకాలము వశింపుచూ వుంచున్నది. యిక్కడ సకల పదార్థాలు ద్వీపాంతర వస్తువులు సకల విధము లయిన పనివాండ్లు కలరు. గడియారము చక్కపెట్టడానకు పనివాండ్లుమాత్రిము పట్నాపహరులో వుండేటట్టు మిక్కటము యిక్కడలేరు. మిఠాయి అంగళ్ళలో తిలలతో అనేక దినుసులు భక్ష్యరూపముగా చేసి అమ్ముతారు. యిప్పట్లో పచ్చిశనగలు పచ్చిపతానులు పంటకాలము గనుక శనగ చెట్లు సమూలముగా పెళ్ళగించి తెచ్చి అమ్ముతారు. వాటి ఆకుకూరకు నిండా బాగా వుంచున్నది. యెర్రిమందారపు మొగ్గలు అమితముగా తెచ్చి కూరకు అమ్ముతారు. అది పెసలపప్పుతో కలిపి వండితే బహు

బాగా వుంచున్నది. మన దేశములో యీ మొగ్గలు వున్నా వికసిం
చినవెనక అర్చనకు వాడుతాముగాని మొగ్గలను భక్ష్యయోగ్యముగా
వాడడము లేదు. యిక్కడి దూదుప్యాడాలు ప్రసిద్ధి కలిగి దినాల
పేరట వుంచున్నవి, వీధులు కాశీ అంతటి కుసంది కావు. సాహేబు
గంజువీధులు దక్షిణ దేశములోని వీధులకు సరిపోలి వున్నవి. యిండ్లు
నాలుగు అంతస్తులదాకా కొయ్యసామాను వేశి మజుబూతి (గట్టి)
మిద్దెలుగా కట్టి వున్నారు.

యీ క్షేత్రముచుట్టు కొండలు వుండడము మాత్రమేగాక
షహరుమధ్యే కూడా చిన్న తిప్పలు వున్నవి. ఆ తిప్ప మిట్టలమీదనే
యిండ్లు కట్టియున్నారు. సమీప మందున్న ఫల్గుని నదిని ఇక్కడి
దేశస్థులు ఫల్గు అనుచున్నారు. బహుశః వెడల్పు కలిగి బహుదూరము
ప్రసిద్ధి కెక్కియున్నా ప్రవహింపుచు వుండే దినాలు బహు కొద్ది
గనుక అందులో యెక్కడ చూచినా చలమలుతీసి స్నానపానాలు గడుపు
కుంటూ వుంటారు. యీ చలమల విషయమయి యీ షహరునివాసుల
ఖర్చు విస్తారముగా ప్రతి నెలకు తగులుతూ వచ్చుచున్నది.
గదాధరస్వామి సన్నిధిలో వుండే ముఖ్య చలమ వుదకము కూపోదక
మర్యాదగా వుష్ణకాలానకు శీతముగానున్ను శీతకాలానకు వుష్ణము
గాను వుంచున్నది. గయావళీల యిండ్లు—౧౦౦౦ చిల్లర అని ప్రసిద్ధి
అయి వున్నా ౨౦౦ యిండ్లు హాజరుగా వున్నవి. గౌడబ్రాహ్మణుల
యిండ్లు శానా వున్నవి. మహారాష్ట్రులు ఆంధ్రులు కలిశి ముప్పై
యిండ్ల దాకా వున్నారు. పంచద్రావిళ్ళలో నూటిదాకా బ్రాహ్మణ
మండలి చేరుతున్నవి. వారికి జీవనము షోడశీ అనే పౌరోహితము.
వారు గయావళీలను వుపసర్పించుకొని వుంటారు. వారి ఆజ్ఞానుసార
ముగా వచ్చినవారి గయాప్రజనాలకు పౌరోహితము చేయిస్తారు.
వారికి క్లిప్తములు (నిర్ణయములు) యేర్పడి యున్నవి. అందుకు
తక్కువ యాత్రవారివల్ల పుచ్చుకోరు.

యిక్కడ గయాప్రజనాలు చేసే క్రమాలు నాల్గు. అష్టగయా
అనే గయాప్రజనము ముఖ్యమున్ను ఖర్చుయెక్కువ పట్టేదిన్ని;
పంచగయా అనేది రెండోపక్షము. యేకోద్దిష్ట మనేది మూడోపక్షము.

ఫల్గుశ్రాద్ధ మనేది నాలుగోపక్షము. మొదటి పక్షానికి కుంఫిణీ సర్కారుకు ౧౪౼ (రు 14½) రూపాయి యివ్వవలసినది. రెండోపక్షానికి ౭౼ (రు 7½) మూడోపక్షానికి మూడున్నర రూపాయ, నాలుగో పక్షానికి రెండు రూపాయలు.

యీ గయా మాహాత్మ్యము వాయుపురాణ గరుడ పురాణాంతర్భూతముగా యెనిమిది అధ్యాయాలతో యిక్కడ ప్రచురముగా వున్నది. వాటిసారము యేమంటే గయాసురు డనే రాక్షసుడు అతి దీర్ఘకాయము కలవాడు బహు తపస్సుచేసి సకలతీర్థాలకన్నా తన దేహము అతి పవిత్రముగా వుండేటట్టు వరముతీసుకొని తన తోలుదేహవాసనసంబంధమయిన తామస పనులుచేస్తూ వచ్చినట్టున్ను, త్రిమూర్తులలో ఒకడైన బ్రహ్మ వాణ్ని శాంతిపొందించదలచి వాడివద్దికి వచ్చి నీదేహము అతిపవిత్రము గనుక నీదేహముమీద నేను యాగము చేయతలచినానని చెప్పినంతలో రాక్షసుడు సమ్మతించి ఈక్షేత్రములో తలపెట్టి శయనించినట్టున్ను బ్రహ్మ ఋత్విక్కులను సృష్టించి యాగము వుపక్రమణ చేసినంతలో రాక్షసుడి శిరస్సు చలనతదశ పొందినట్టున్ను శిరస్సును కదలకుండా పట్టేకొరకు యెన్ని గొప్పకొండలు తెచ్చి వేసినా నిలవక చెదిరి చుట్టు పడి యిప్పుడు రామపర్వతము ప్రేతపర్వతముగా సమీపమున నిలిచివుండేటట్టున్ను అటుపిమ్మట అవశాత్తుగా నొకానొక పతివ్రత పురుషుడి శాపాన్ని ధరించి శిలారూపముగా వుండగా ఆ శిలను తెచ్చి గయాసురుడి శిరస్సుమీద వుంచినట్టున్ను ఆ శిలా అతిపవిత్రమయినదిగనుక గయాసురుడు తోసివేయలేక శిరస్సుమీద వుంచుకున్నా వాడి శిరస్సుయొక్క కంపముమాత్రము వదలనందున బ్రహ్మ యాగము పరిపూర్తి చేసేకొరకు 'యీశాన విష్ణు కమలాసన' అని శ్రాద్ధకాలములలో వచించే శ్లోకప్రకారము దేవతలందరు వచ్చిరి. విష్ణువు గదాధర స్వరూపుడయి ముఖ్యముగా ఆ శిరస్సుమీద వున్న శిలమీద కుడికాలుపెట్టి నట్టున్ను తదనంతరము శిరస్సు కదలకుండా బ్రహ్మ యాగము పరిపూర్ణ మయినట్టున్ను యాగసంరక్షణ నిమిత్తముగా గదాధరుడై అక్కడ నిలిచిన విష్ణువు కరుణాసముద్రుడు గనుక వచ్చిన సకల దేవతల

సమ్మతముగా, లేవలేని గయాసురుడున్ను శిలా స్వరూపముగా వున్న పతివ్రతయున్ను ప్రార్థించి నంతలో తాను అదేస్వరూపముగా యెల్లప్పటికి యిక్కడ విరాజమాన మయ్యే టట్టు వొప్పుకున్నట్టున్ను అప్పట్లో కూడిన సమస్త దేవతలు చేసిన ప్రార్థన ప్రకారము యెవరు యీ స్థలమందున "శమీపత్ర ప్రమాణేన పిండం దద్యా ద్గయాశిరే" అనే శ్లోక ప్రకారము పిండ ప్రదానము చేసినా ౧౦౧ కులమువారు తరించేటట్టు వర మిచ్చినాడు. గనుక తదారభ్య పితృస్వరూపుడైన పరమాత్మ యిక్కడ శ్రాద్ధ కర్మాలు చేసినంతలో అతితృప్తు డయ్యేటట్టు నిశ్చయః మయి యున్నది గనుక, ప్రతిదినము వుదయ ప్రభృతి సాయంకాల పర్యంతము సహస్రావధి ప్రజలు ఆ రీతిగా వుంచిన విష్ణు పాదలాంఛన మీద పిండప్రదానాలు చేస్తూ వుంటారు. శ్రాద్ధము వినా పిండప్రదానము మాత్రము కూడకపోయినా స్థల పురాణములో యీ స్థల మందు పిండప్రదానమే ముఖ్యముగా చెప్పివున్నది గనుక అనేకముగా పెట్టవలసిన శ్రాద్ధాలకు బదులు యీ స్థలాంతర్భూతమయిన ప్రదేశాలలో పిండప్రదానాలు మాత్రమే చేయుచున్నారు గనుక నేను అదేప్రకారము చేసినాను.

నెం. ౨౭ అక్షగయ చేయవలసిన క్రమము :— క్షేత్రము ప్రవేశించిన దినము ఫల్గునినదిలో స్నానము చేసి గదాధరదర్శనము విష్ణుపాదదర్శనముచేసి క్షేత్ర వుపవాసము వుండవలసినది. విష్ణుపాదము గుడి బహుసుందరముగా నల్లశిలతో ముందు విశాలమయిన ముఖమంటపముతోకూడా అహల్యాబాయి కట్టించివున్నది. అరటి పువ్వందముగా సువర్ణమలాముతో చేసిన కలశముతోకూడా ఒక స్తూపీ యేర్పరచి యున్నది. గదాధరస్వామి మందిరము అందుకు రెండో తరము విష్ణుపాదపు గుడికి చేరినట్టుగానే కట్టియున్నది. గోడలో చేర్చి గదాధరమూర్తిని నిలిపివున్నారు. విష్ణుపాదము,మనిషి అడుసులో కాలుపెట్టితే అడుగు యేర్పడ్డట్టు శిల మీద లాంఛనగా యేర్పడివున్నది. బహుకాలమయినది గనుక రేఖాలాంఛనలు తెలియవు. మహాపూజా కాలమందు ఆపాదము

మీద చందనము సమర్పించి కుంకుమ పువ్వుతో రేఖాలాంఛనములు చందనము మీద అతి సుందరముగా యేర్పరుస్తారు. గదాధర మూర్తిని అతి సుందరముగా కల్పించి వున్నది. యీ రెండు గుళ్ళు ఫల్గుని తీరమందు వున్నవి. విష్ణు పాదానికి సమీపముగా అష్టాదశ పాదాలు 'యీశాన విష్ణు' అనే శ్లోక ప్రకారము ఒకటే పెద్ద శిల మీద వున్నట్టు వదంతి గనుక ఆ శిలకు ఒక పెద్ద మంటపము అహల్యా బాయి కట్టించి వున్నది. ఆ పుణ్యాత్మురాలు శానా ధర్మాలు యిక్కడ చేసి వుండెను. అది అంతా యిప్పట్లో నిలిచిపోయినవి. ఆమె ఆకృతి శిలతో చేసి గదాధరస్వామి గుడివద్ద ఆమె అన్నసత్రములో వుంచినారు గనుక ఆ బింబాన్ని చూచి ధన్యుణ్ని అయినాను. ఆ అన్నసత్రి మున్ను యిప్పుడు నిలిచిపోయినది.

౨ డో దినము ఫల్గుని శ్రాద్ధము క్రమముగానే చేయవలసినది. గయావళులను తప్ప మరి ఒకరిని బ్రాహ్మణార్థము చెప్పకూడదు. యీ దినము పెట్టే పిండాలు ఫల్గుని నదిలో పెట్టవలసినది. బ్రాహ్మణార్థానికి మనకు యేర్పడ్డ గయావళి వారి స్వకీయ్యులను పిల్చుకొని రావలసినది గాని వారి సంకేత ప్రకారము మనము పిలిస్తే వారు రారు. యీ గయావళీలు యెందరు యెక్కడ వచ్చి యాత్రి వారిని కల్సుకున్నా యజమానుడు యిచ్ఛవచ్చిన వాణ్ని నీవు నా గయావళీ అని నియమించి మిగిలిన వారిని నాకు అక్కర లేదని చెప్పవచ్చును. కాశీ ప్రయాగ స్థలముల వలెనే నిర్బంధము లేదు.

3 డో దినము షహరుకు ఉత్తరపు పక్క 3 కోసుల దూరములో వుండే ప్రేతపర్వతానికి పోవలసినది. కొండకింద బ్రహ్మగుండము అనే తీర్థము ఒక గుంటలందముగా వున్నది. గయావర్జనము చేసే వారికి గయావళి మూలకముగా పిండపిచ్చి యనే అంగటివాడు ఒకడు యేర్పడుతాడు. ఆ యా దినానికి పెట్టవలసిన పిండాలు తెలిసి పిండ సామగ్రిలు బ్రాహ్మల కయితే బియ్యము యితరులకు యవ పిండిన్ని నువ్వులు దర్భ తేనె నెయ్యి మృణ్మయ పాత్రిలో పెట్టి యిస్తాడు. వానికి అష్టగయ చేసేవారు రెండురూపాయిలు యివ్వవలసినది. యీ షోడశీ ఆ పిండ సామాగ్రిని తీసుకొని

కూడావస్తాడు. ప్రేత పర్వతమునకు వచ్చేనాడు రెండు తావులలో పిండ ప్రదానము చేయవలసినది. యీ కొండకు సుమారు మున్నూరు మెట్లు కలవు. యెక్కడము ప్రయాస; సవారి మీద పోదామంటే కొండపయిన స్థానానికి వుదకములేదు గనుక నడిచిపోవలసినది. ఆ కొండమీదికి నిమిత్తము లేనివారిని సర్కారు మనుష్యులు పోనియ్యరు. వుపచారము చేశేవాడు కూడా వస్తే వాడికి వేరే అమరాహి అనే వొక చీటి మూడున్నర రూపాయి యిచ్చి తీయ్యవలశినది. భార్య మొదలయిన వారు కూడావస్తే వారికి వేరే చీట్లు మూడున్నర రూపాయి వంతున యిచ్చి తీసుకోవలసినది. కొండమీద స్వర్ణరేఖ ఒక శిలామంటపము కిందవున్నది.

ప్రేతగయావళీలు అనే వక తెగవారు వుంటారు. వారు పిండదాన కాలమందు శానా తెమ్మని తొందర పెట్టుతారు. అష్టగయకు రెండురూపాయలు వారికి క్లిప్తము (నిర్ణయము). అంతమటుకు యిచ్చి తీరవలెను. యీ ప్రేత గయావళీలు సుఫలము యివ్వడమని వొక సంప్రదాయము. ఈ ప్రేత గయావళీలు సుఫలము యిచ్చేక్రమ మేమంటే, పిండప్రదానము కాగానే భం అనే పేరుతో చెయితిప్పి నోరు కొట్టుకొని మీ పితృలు స్వర్గస్థు లయినారని చెప్పవలసినది. అక్కడ పిండప్రదానము కాగానే మడుగు నిమిత్తము లేదు గనుక స్త్రీలతో కూడా సవారీల మీద యెక్కి కొండ దిగివచ్చినాను.

యీ ప్రేతగయావళీలు గయావళుల అక్రమసంతు అనే వొక మాట వాడుకుంటారు. అసలు గయావళీల ఉత్పత్తి పయిన వ్రాసినప్రకారము బ్రహ్మ యాగార్ధము ఋత్విక్కులను సృష్టించినారని వ్రాసివుంటిని గదా. వీరు ఆ ఋత్విక్కుల సంతువారని యీ గయావళీలను బ్రహ్మకల్పిత బ్రాహ్మణు లని వారిపూజా కాలమునందు వచింప బడుచున్నది. బ్రహ్మ యాగము పూర్తికాగానే సమస్తమున్ను కావలశినమట్టుకు వీరికి యిచ్చినప్పటికిన్ని మళ్లీ బ్రహ్మను చాలదని యాచించి నట్టున్ను, బ్రహ్మకు కోపమువచ్చి మీకు యిచ్చినది సమస్తమున్ను వ్యర్థమై పోగాకా అనిన్ని, మీరు విద్యారహితులై దరిద్రులై పోదురు గాకా అనిన్ని

శపించినట్టున్ను ఆపిమ్మట వారు పశ్చాత్తప్తులై బ్రహ్మను శరణు చొచ్చినంతలో యిక్కడ పితృకర్మాలు చేసేవారు మిమ్ములనే ఆరాధింపుచున్నారు; అందువల్ల జీవనము చేయండని ఆజ్ఞ యిచ్చి నట్టున్ను అదే పురాణములో వ్రాసియున్నది. ఆ బ్రాహ్మణ కల్పన కాలమునందు వారికి సమానులయిన స్త్రీలను ఉత్పత్తి చేయలేదు గనుక యీ క్షేత్రములో మిక్కుటముగా వసియింపుచు నుండే మేదరజాతి స్త్రీలను వారు పరిగ్రహించి తద్వారా వంశము వృద్ధిఅయి నట్టున్ను అందువల్ల అద్యాపి స్త్రీప్రజ వీరిలో వంటవార్పులకు పనికి రాకుండా భోగార్థమునకు మాత్రము ఉపయోగింపుచు వుండేటట్టు యిక్కడ ప్రసిద్ధముగా నున్నది. యీ గయావళీలు భార్యలచేత భోజనము చెయ్యరు గనుక మన దేశము నుండి వచ్చిన అనాథస్త్రీలను స్వయం పాకమునకు కొలువు పెట్టుకొంటారు. తమస్త్రీలచేత నీళ్ళు తాగేది లేదని చెప్పడము. యీ గయావళీల స్త్రీలు యథోచిత మయిన రాణివాసము గలిగి వుంటారు. యీ గయావళీలకు యెనిమిది యేండ్లలోనే వివాహ మవుచున్నది. రెండోపెళ్ళికి పడుచును యివ్వడము లేదు. వీరి ఆర్జనకు తగ్గట్టే వివాహము మొదలయిన విషయములలో వీరికివ్రయము యెక్కువగాఅవుచున్నది. వీరియిండ్లలో స్త్రీప్రాబల్యము యెక్కువ అని ప్రసిద్ధి. గయావళీల విద్యావివేక విషయాలలో బ్రహ్మశాపము వ్యర్థమయినట్టు తోచలేదు. వారి ఆచారాలు యీ దేశానకు తత్కాలానుగుణముగా వున్నా మన దేశస్థులకు యేహ్యముగా నున్నది.

౮ గో దినము ప్రేతపర్వతము దారిలోనే షహరుకు ౨ కోసుల దూరములో సాహేబుగంజుకు చేరినట్టుగా రామపర్వత మనే కొండ వున్నది. అక్కడికివెళ్ళి నాలుగు ప్రదేశాలలో నాలుగు ఆవృత్తులు పిండప్రదానాలు చేయవలసినది. కొండమీద శివమందిరము, రామ మందిరమున్ను వున్నవి. గనుక ఆ మందిరాల సన్నిధిలో పిండప్రదానము చేయవలసినది. యీ కొండ యెక్కడము నిండా యెక్కుడు కాదు. ౧౫౦ మెట్లు యెక్కవలసినది. మెట్లు నిండా పొడుగుకావు. యీ పర్వతముమీదను పిండప్రదానముకాగానే యిక్కడకూడా

ప్రేతగయావళీల ప్రదేశము గనుక భం అనే ధ్వనితో వారు సుఫలము యియ్యవలసినది. యీ కొండమీదనున్న వుదకము లేదు. అష్టగయ చేయని మనుష్యులను యీకొండమీదికి కూడా రానియ్యరు. యీ కొండ దిగివచ్చిన వెనక కింద మూడు తావులలో పిండప్రదానాలు చేయవలసినది గనుక నేటిదినము దిగివచ్చేటప్పుడు పాదచారిగానే దిగిరావలశినది. యీ పిండపిచ్చులు వగయిరాలు పావుశేరు బియ్యముతో అక్కడక్కడ పిండప్రదానాలు చేస్తూవస్తే అష్టగయకు రెండురూపాయిలు వంతున యివ్వవలసినది. అర్ధశేరుకు రూపాయలు ౧, శేరుకు రూపాయలు ౧ దేలెక్క ప్రకారము షోడశికి ప్రేతగయావళీలకు నిష్కర్ష గనుక బియ్యపుమోయినుకు తగ్గట్టు తిలలు మొదలైన సామానులు యిస్తాడు. యీ దేశములో తెల్లనువ్వులు విస్తారముగా వున్నా యీ పితృకర్మాలకు వాడడము నల్లతిలలేను. దర్భ దొరకదు గనుక యీ దేశమునందు యావత్తు అతికోమలముగా పెరిగే కుశను ప్రతిగా వాడుకుంటున్నారు. ప్రతి పిండప్రదానానికి కారుణ్యాల సహితముగా పిండప్రదానము కాగానే ధర్మపిండాలని ౧౦ శ్లోకాలతో ౧౦ పిండాలు వేయవలసినది. యీధర్మపిండాలు ప్రతి పిండప్రదానకాలమందు వెయ్యవలసినది. 'పితృవంశే మృతాయేచ' అనే శ్లోకాలతో ధర్మపిండాలు వేయవలసినది.

౫ దో దినము పంచతీర్థాలనే ౫ ప్రదేశాలలో పిండప్రదానాలు చేయవలసినది గనుక ౫ పిడతలు హాజరయి వుంచున్నవి. వాటిని సాహేబుగంజు వద్దవుండే వుత్తరమానస తీర్థానికి తెచ్చి అయిదు పిడతలతో అన్నము ఒకసారిగా పక్వముచేసుకుని ఆతీర్థము ఒక గుంట ఆకారముగా వుంచున్నది గనుక ఆతీర్థము వొడ్డున వొక సారి పిండప్రదానముచేసి అక్కడ గుళ్లోవుండే సూర్యమూర్తిదర్శనము చేసుకుని మౌనవ్రతముతో దక్షిణమానసతీర్థము అనే వహారుమధ్యేవుండే వొక పెద్దగుంటకు కడమ నాలుగు పిడతల అన్నము పిడతలతోనే యెత్తుకుని రావలసినది. యీ రెండు మానసతీర్థాలు రమణీయ్యమయినవికావు.

ఆ దక్షిణ మానస తీర్థములోనే మూడు తావులలో

వుదీచితీర్థమని, ఖనఖలతీర్థమని,దక్షిణమానస తీర్థమని,మూడు పేళ్ళతో పిండ ప్రదానాలు చేసి అక్కడ మందిరములో వుండే సూర్య మూర్తి దర్శనము చేసుకొని ఫల్గుని నదికి ఒక పిడత అన్నము తీసుకుని వచ్చి అక్కడ గదాధరునికి యెదురుగా పిండప్రదానముచేసి, గదాధరునికి అభిషేక పూజలు చేసి, దర్శనము చేసుకుని అక్కడికి కొంతదూరములో వుండే పితామహేశ్వరుని దర్శనము చేసుకుని, రావలసినది. రామపర్వతములో, ప్రేత పర్వతములో ప్రేతగయావళీల పూజ చేసి నట్టు యీ స్థలాలలో స్వంత గయావళీ పూజచేస్తూ రావలసి నది. యీ ఫల్గుని నదికి అనేక స్నానఘట్టాలు కట్టి వున్నారు. గయా వళీల యిండ్లు అనేకముగా ఫల్గునీ నదీతీరమందుకూడా శానా గొప్ప లుగా కట్టివున్నవి. యీ గయావళీలకు కాపురము వుండే యిండ్లు గాక పరువుకలవారు బయటక్కు అని కచ్చేరి కూటాలు వేరే కట్టుకుని వుంటారు. ఆప్రేత గయావళీలు యీ గయావళీలను వుపసర్పించుకొని వుంటారుగాని వారికి స్వతంత్రదశ వున్నట్టు అగుపడ లేదు, గదాధర స్వామిపూజ ప్రేతగయావళీలది. విష్ణుపాద పూజ శుద్ధగయావళీలది.

౬ రో దినము, ధర్మారణ్యం బౌద్ధగయ అనే ప్రదేశాలకు పోవలసినది. యీ ప్రదేశాలు షహరుకు ౫ కోసుల దూరములో వుంచున్నవి. పోయిరావడానకు అస్తమాన మవును. యీ ప్రదే శాలు క్షేత్రానికి పశ్చిమభాగమం దున్నవి. యిక్కడ ఒక గోసాయి పీఠస్థుడు జాగీరు అనుభవిస్తూ వచ్చినవారికి సదావృత్తి యిస్తూ వుంటాడు. యీ స్థళము గయనుంచి కలకత్తావెళ్లే భాటలో వున్నది. ఇక్కడ దేహబ్రహ్మవాదుల బౌద్ధగుడి ఒకటి యున్నది. అక్కడవుండే ప్రతిమలు బ్రహ్మదేశములో నుంచి జాతులవాండ్లు తెచ్చిన ప్రతిమకు సరిగా యున్నవి. ఆ గుడి చూడగా ౨౦౦-౩౦౦ యేండ్లకిందట కట్టినట్టు అగుపడుతున్నది. ఆ మతస్థుల ప్రబలము యెప్పుడు యీ ప్రాంత్యాల అయివున్నదిన్ని ఖుల్లసుగా తెలియ లేదు. యిందుకు వుత్తరము జయ పురము, జోతీపురము, బికానెరి అనే మారువాడీ దేశాలు మొద లుగా దేహబ్రహ్మవాదుల నివాసభూమి గనుక పూర్వము ఒక కాలము

నందు వారు యిక్కడ ప్రవేశించి పిమ్మట యీ కర్మ భూమియందు నిలవలేక ఖిలపడి వుందురు.

యిక్కడ వుండే గోసాయి మహాంతు సంత్రాసునింబు అనే నారదపు కాయలలో అనేక లవణాలు పిప్పలి, శొంఠి, మొదలయిన జీర్ణకారి పదార్థాలు కూరిపోశి యెండపెట్టి వచ్చినవారికి మెప్పుగా తారతమ్యము విచారించి యిస్తాడు. యీ దేశములో ఆహార పదార్థాలు బలకరమయినవి గనుక అజీర్ణమీద జ్వరాలు వస్తూవుం డుట చేత పాచక మనే మందులు కరక్కాయలు, జీలకఱ్ఱ, పిప్పళ్ళు, వోమము మొదలయినవస్తువులను భావన చేసి అటువంటి పదార్థాలు నారదపు కాయలు మాదీఫలములలో యిమిడ్చి యిక్కడ చెయ్యడమే కాకుండా నేపాళాన్నుంచి అనేకముగా తెప్పించి అంముతూ వుంటారు. ఆ సంత్రాసునింబు అనే పండ్లలో సూదులు గుచ్చి పెట్టితే సూదులు కరిగి పోతున్నవని వదంతి. యీపాచక ఔషధాల దినుసులకు యిక్కడ లెక్కలేదు. యీ ఔషధాలు జీర్ణకరములై భేదికారిగా వున్నవి.

గయావళీలు వచ్చిన ప్రభువు ప్రసన్నుడయితే అంతకు మిక్కిలి పండగ వేరే లేదు గనుక కలిగిన భూషణాదులు అలంకరించు కుని వుండే స్త్రీలతోకూడా యిటువంటి పిండదానము చేసే ప్రదేశా లకు యజమానుడితో కూడా వచ్చి చేశే పూజలు ప్రతిగ్రహిస్తారు. ఒక మాత్రులయితే షోడశిని కూడా పిల్చుకుని వెళ్ళి యీ ముందు వ్రాసిన స్థలములలో నంతా పిండదానాలు చేసి రావలసినది. ఆ బౌద్ధ గయలో జగన్నాయకుల గుడి వొకటి వున్నది. పయిన వ్రాశిన మహాంతుతోట ఒకటి గొప్పదిగా నున్ను సుందరముగా నున్నది. ఈదినము నాలుగు తావులలో పైన వ్రాసిన ప్రకారము పిండదానాలు చేయడమయినది.

౭ డో దినమందు లేచి తొలుదినమే బౌద్ధగయ చేశ్శేనాడే చేస్తే సిండాప్రయాస అవుతున్నది గనుక యీదినము క్షేత్రానికి అతిసమీప ముగా వుండే బ్రహ్మసరస్సుకు వెళ్ళి అక్కడ పిండదానము చేసి కాక బలి, యమబలి, శ్వానబలి యనే మూడుబలులు అక్కడికి సమీపముగా

వుండే ఒక మంటపములో వేశి అక్కడ వుండే చూతవృక్షదర్శనము చేసి పూజచేసి రావలసినది.

యెనిమిదో దినమున విష్ణు పాదానికి సమీపముగా వుండే అష్టాదశ పాదాలమీద ౧౮ మాట్లు ప్రత్యేక ప్రత్యేకముగా పిండదానాలు ఒక మంటపములోనే ప్రత్యేక ప్రదేశాలలో చేశి ప్రతి పాదము వద్ద నున్న నందదీప మనే ఘృతదీపాలువుంచి క్షీరతర్పణము ప్రతిపాదము మీద పితృద్దేశముగా చేయ వలసినది. యీ కృత్యము కావడానకు యీ దినము అస్తమాన మవుతున్నది. ఈ స్థలాలయందు పిండ ప్రదానాలు చేశేటప్పుడు యే దేవతాత్మకముగా ఆ స్థళము వుంటే ఆలోకములో అస్మత్పితృ నివాస సిధ్యర్థం అని సంకల్పము చేయుచూ రావలసినది.

తొమ్మిదో దినమున ఫల్గునీశ్రాద్ధమువలెనే క్రమముగా అన్నశ్రాద్ధము విష్ణుపాద ప్రయుక్తముగా చేసి శ్రాద్ధానంతరము విష్ణుపాదము మీద పిండప్రదానము చేయువలసినది. విష్ణుపాదము మీద అశక్యముగా లోకులు పిండాలు వేస్తూ వుంటారు గనుక పిండముమీద పిండము పడకుండా రాజాధిరాజులుగా వుండే వారు సరకారువారికుము మీద తాము పిండప్రదానము చేశి బయిట వచ్చేకొరకు యెవరినిన్ని గర్భగృహములోకి రానివ్వకుండా సరకారు మనుష్యులను వుంచి నిరోధము చేస్తారు. యిటువంటి లౌకికప్రతిష్ఠ అయిన పనులు యిక్కడి జడ్జిగా వుండే మారీసు దొరగారికి, కలకత్తాలో వున్న నా విహితుడయిన మేస్తర్ మించ్చెన్ దొరగారు ఒక కాకితము పంపించినంతలోనా యెడల మిక్కిలి కటాక్షము వుంచి యిక్కడవుండే సకల అధికారము గల యింగిలీషు దొరలతో నాకు విహితము చేసి వారిగుండా కావలసిన సహాయము నాకు కరతలామలకము అయ్యేటట్టు చేసినాడు గనుక యీశ్వర కటాక్షముచేత నాకు కావలసినంతకన్నా యెక్కువ లౌకిక ప్రతిష్ఠ యిక్కడ సిద్ధించినది.

విష్ణుపాదముమీద పిండప్రదానముకాగానే గయావళీకి ముఖ్యముగా గోదానము చేయవలశినది. యీ విష్ణుపాదపు గుడివద్ద కొన్ని

ధర్మశాలలు కట్టివున్నవి. స్థలాంతరము దొరకనివారు యీ ధర్మ శాలలో శ్రాద్ధాలు చేయుచున్నారు. యీ దినము యెక్కడ శ్రాద్ధము పెట్టినా పిండాలు తెచ్చి విష్ణు పాదముమీద వేయవలసినది.

౧౦ దో దినమున, గయా వ్రిజనానికి పూర్తిగా వటశ్రాద్ధము చేయవలసినది గనుక అక్షయ వటము కట్టివుండే ధర్మశాలలకు శ్రాద్ధ యోగ్యమయినపదార్థాలుఅన్ని యెత్తుకొనివెళ్ళిఆధర్మశాలలోపాక ముచేసిశ్రాద్ధముచేయ వలసినది. ఫల్గుని,విష్ణుపది,అక్షయవట శ్రాద్ధాలకు గయావళీలే బ్రాహ్మణార్థాలు చేయవలసినది. గనుక వారు భోజ నానికి రావడానకు శానా సావకాశ మవుతున్నది. వారిలో బహు మంది వుదయాన ఫలహారముచేసి వస్తారు. బ్రాహ్మణార్థము చేస్తే రెండోసారి భోజనము చేయరాదనే నియమము వారికి లేదు. బ్రాహ్మ ణార్థానికి పూర్వము సహజముగా తాంబూల చర్వణము చేయుచూ వుంటారు. బ్రాహ్మణార్థానికి వచ్చేటప్పుడు యింట్లోనే స్నానము చేసి సవారియెక్కి వచ్చి యిక్కడ వస్త్రపరివర్తనము చేసుకొని బ్రాహ్మణార్థానకు కూచుంటున్నారు. హిందుస్తానులో వసించే పంచద్రావిళ్ళు మొదలైన బ్రాహ్మలందరు స్త్రీలుసహా భోజన కాల మందు పట్టువస్త్రాలు, నారపట్టులు, ధావళ్ళు కట్టుకొని వుండడము గాని నూలుబట్టలు కట్టుకొన్నవారు పంక్తికి వచ్చినప్పటికి అశుచిగా యెంచు తున్నారు గనుక యీ గయావళీలకు అదే ఆచారము.

అక్షయవటము చుట్టు గోడపెట్టి వాకిలి పెట్టియున్నది. ప్రేత పర్వతము రామపర్వతము తప్ప కడమ పిండప్రదానాలు చేశే స్థల ముల కంతా కావలసినవారిని కూడా పిల్చుకుని పోవచ్చును. యెవరు కావలసినా ఆయా స్థలముల దర్శనము నిమిత్తము యెప్పుడు కావలిస్తే అప్పుడు పోతూ వస్తూ వుండవచ్చును. గయా వ్రిజనాలు చేసి పిండ ప్రదానాలు ఆ యా స్థలములలో చేశేవారు సరకారులోనుంచి యిచ్చే చీట్లను అక్కడక్కడ వుండే చౌకీబంటోత్రులకు చూపించి వారికి చీటీ ౧ కి వొకపైసా వంతున యిస్తూ రావలసినది. యీ అక్షయవటము అనేకావృత్తులు సమూలముగా యెండిపోయి వేరే వృక్షములు కూడా బయలుకు సమీపముగా వుంచి సిద్ధము చేసినవెనక ఆశ్చర్య కరముగా

తున్నారు. పిండ్లుపెట్టే నిబంధము అంతా యీపట శ్రాద్ధమునాడు, ఆ సుఫలము యిచ్చే కాలమందు గాని మరి యెప్పుడు నోటిమాట మాట్లాడరు. పూర్వకాలమందు యీసుఫలము యివ్వకుండా లోకులను శానా శ్రమ పెట్టుతూ వచ్చినారట. యిప్పుడు తుదను నాలుగు రూపాయిలు యిచ్చినా పుచ్చుకుంటున్నారు. ముఖ్యమయిన యీ అష్టగయ చేయడానకు సకల శలవులతో కూడా అరువై రూపాయిలు పట్టుచున్నవి. యీ సుఫలము పుచ్చుకొని అక్కడ సమీపములో వుండే గుళ్లో ప్రపితామహేశ్వర దర్శనము చేసుకొని శ్రాద్ధశేషము భోజనము చేసుకొని వారి వారి పరువుకొద్ది విభవములతోనున్ను, మేళతాళములతోనున్ను వచ్చి విష్ణుపాదగదాధర దర్శనము చేసుకొని యింటికి రావలశినది.

యీ అక్షయవటము వద్ద ధర్మశాలలో గయావళులు తప్ప యితరులు భోజనము చేయకూడదని ఒకకట్టు కట్టుకొని శ్రాద్ధశేషము కర్తను తప్ప మరి ఒకరిని అక్కడ భోజనము చేయనీయకుండా అంధపరంపరగా యీవరకు జరుగుతూ వచ్చినది. యీశ్వర కటాక్షముచేత నేను గయా మహాక్షేత్రములో వుండేవరకు అన్నసత్రాలు లేనందున పంచద్రావిళ్ళు అయిన మన దేశస్థులు 30 కి తక్కువ లేక నిత్యము నాతో సహపంక్తిగా భోజనము చేయుచూ వచ్చిరి గనుక వారు అందరు నామండలితో కూడా ఆ ధర్మశాలలో పిండప్రదానానంతరము భోజనము చేశేటట్టు ఘటన అయినది. పునా శ్రీమంతుడు కూడా యీపని చేయనేరక శ్రాద్ధానంతరము విడిదికి భోజనానికి పోయినాడు, యీ పని యీ పురుషుడికి జరిగినదని బ్రాహ్మణమండలి సంతోషపడేటట్టు యీశ్వరుడు కటాక్షించినాడు. యిందుకు కారణము నా గయావళి అనుకూలము ఒకటి; మేజస్ట్రేటు కొత్తవాలును కూడావుండేటట్టుగా వుత్తర్వు చేసినంతలో ఆ కొత్తవాలున్ను నూటికి బంట్రోతులతోకూడా హాజరుభాషిగా నావద్ద వున్నందున యీపని జరిగినది. యిక మీదు అక్షయవటము కింద అనేకబ్రాహ్మణభోజనాలు జరుగుతూ రావచ్చును. యీ అక్షయవటము షహరుకు అరకోసు దూరములోనే వున్నది.

౨౧ డో దినము అష్టతీర్థాలని రామగయ అనే కొండకింద

మధుస్రవ అనే స్థలములోనున్ను, గయాశిరసి అనే తీర్థములోనున్ను కూపగయ అనే బావివద్దనున్ను, మృడపృష్ఠం అనే స్థలములోనున్ను, ఆదిగయ అనే స్థలములోనున్ను, ధౌతపదమనే స్థలములోనున్ను, భీమగయ అనే స్థలములోనున్ను, గోష్పదం అనే స్థలములోనున్ను, వైతరణి అనే స్థలములోనున్ను అంతు పదిస్థలములలో ప్రత్యేక ప్రత్యేకముగా పిండప్రదానములు చేయవలసినది. యిది అష్టగయాశ్రాద్ధముతో చేరినదికాదు. యివి అన్ని ఉపతీర్థములు. ఇటువంటివి సహస్రావధి తీర్థములు వున్నవి. వాట్లలో నంతా చేయడానికి మనుష్యులకు ప్రయాస అని గదాధరరూపముగా గయావళి అక్షయవట శ్రాద్ధము నాడు సుఫలము యియ్యడము గనుక గయావళీలలో ప్రముఖులుగా వుండే వారంతా నా యెడల జడ్జీ మొదలయిన దొరలు ప్రీతిగా వుండేది చూచి మీరు అందరివలెనే అష్టతీర్థములు చేయనక్కర లేదు. రామసాగర మనే గొప్ప తీర్థము ఒకటి దొరలు ఆక్రమించుకొని సంకిళ్ళవాండ్లగుండా మరామత్తు చేయింపుచున్నారు. ఆ తీర్థము క్షేత్రానికి మధ్యే వున్నది. ఆ తీర్థము దొరల అధీన మయిపోతే మా కండ్లు తీసివేసినట్టు అవుచున్నది. ఆ తీర్థమువద్ద యెవరినిన్ని పిండప్రదానాలు చేయనివ్వడము లేదు. మీరు దొరలవద్ద సెలవు తీసుకొని ఆ రామసాగర తీర్థము వద్ద పిండప్రదానము చేసినట్టయితే అన్ని ఉపతీర్థములలో పిండప్రదానము చేసిన దాని కన్నా యెక్కువ ఫలము సిద్ధింపుచున్నదని చెప్పుకొన్నందు చేతనున్ను, నా మనివి దొరల వద్ద అప్పట్లో సాగేటట్టుగా ఈశ్వరుడు కటాక్షించి వున్నందున మాకీసు దొరగారితో మనివి చేసినంతతో వారు మేజస్ట్రేటు జాక్సన్ దొరగారితో యోచించి ఆ తీర్థము వద్ద హిందువులు పిండప్రదానములు చేయడము ఫలాని ప్రదేశమని నిశ్చయించి అక్కడ నున్ను పిండప్రదానము చేశేటట్టు వుత్తర్వు చేశినారు. గనుక అన్ని ఉపతీర్థాలకు బదులుగా గయావళీల సమూహము అప్పట్లో అక్కడ కూడినది గనుక వారి సన్నిధిని ఆ రామసాగరములో పిండప్రదానము చేసినాను. ఆ మరుసటి దినమే మరి ఒక గొప్పవాడు యీ దేశస్థుడు

వాడి గయావళీ ప్రేరేపణ మీాద నా వలెనే అష్టతీర్థములకు ప్రత్యా మ్నాయముగా రామసాగరములో పిండప్రదానము చేశినాడు. నాతో కూడా వచ్చిన మండలిమాత్రము యథావిధిగా అష్ట తీర్థములలో నున్ను పిండప్రదానములు చేసినవా రయినారు.

౧౨ డో దినము న్యూనపరిపూర్తికై విష్ణుపాద శ్రాద్ధ మని ఒక శ్రాద్ధము చేయవలెను. మనవారు దానికి శుద్ధ శ్రాద్ధ మని పేరు పెట్టి పంచద్రావిళ్ళున్ను తమ వారిని బ్రాహ్మణార్థము చెప్పి రెండో సారి విష్ణు పాదము మీాద పిండప్రదానము చేయుచున్నారు. నేనున్ను అదే ప్రకారము చేశినాను. యీా శ్రాద్ధానకు గయావళీలు బ్రాహ్మణార్థము చేయ నిచ్ఛయించడము లేదు. వారి వారికి యిష్ట మైన వారిని బ్రాహ్మణార్థము చెప్పుకొనేటట్టు అనుజ్ఞ యిస్తు న్నారు. ఈ ప్రకారము రెండుమాట్లు విష్ణుపాదము మీాద పిండ ప్రదానము చేశే టంనుకు, పూర్వము, అభిషేక పూజలు చేయ వలసిన విధి గనుక శ్రీరాములవారు నాకు కావలసినంత సేపు గర్భ గృహములో నా పరివారము యేకాంతముగా వుండేటట్టు కటాక్షించి నాడు గనుక యీా శ్రైయింటికి బ్రాహ్మణులను గర్భగృహములో జమ చేసి పురుషసూక్తముతో అభిషేకము యథావిధిగా చేసి లక్ష తులసీదళములు అర్చన చేసి ఆ తులసీరాసిమీాదనే పిండప్రదాన ములు రెండు ఆవృత్తులు విష్ణు పాదము మీాద చేసినాను. యీా విష్ణు పాదము చుట్టు తొట్టి కట్టి వుండగా ఆ తొట్టికి తంజావూరి రాజు వెండి తగుళ్లు కొట్టించినాడు. ఆ తొట్టి నిండేటట్టు శ్రీమంతుడు ౧౬౦౦౦౦ వేల. రూపాయిలు పోయిన సంవత్సరమున యీా దినముల లోనే అందులో పోసి గయావళీలకు పంచిపెట్టినాడు. యీా గయా వళీలకు యీా లాగు ప్రవాహమువలె ఆర్జన కలిగియున్నా బ్రహ్మ దేవుడు నిత్య దరిద్రులుగా వుందురు గాక యని యిచ్చిన శాపము వారియెడల సత్యముగానే వున్నట్టు అగుపడుచున్నది.

౧౩ డో దినము ఫల్గునినదిలో సావిత్రియనే మడుగులో ప్రాత స్స్నానముచేసి దగ్గిరవుండే గుడిలో ప్రకాశింపుచున్న గాయత్రీదేవతా దర్శనముచేసి అక్కడ అదివరకు ప్రాతస్సంధ్యలను కాలాతీతముగా

కలిగి కుమురుగా ఒక స్థలములోనే వుండుకొని సద్వ్యాపారముతో కాలము తోయవలెనని తలిస్తే ఆలాటివారు కన్నతావులలోనున్ను తిరగసాగితే పుట్టిన నిశ్చయము భేదించి పోవును గనుక అందుకు యోగ్యమయిన స్థలమును ఒకదాన్ని యేపఱచి అక్కడ చేయవలసిన కృత్యముల నున్ను యేపఱచి తద్ద్వారా మోక్షము క్రమక్రమముగా కలుగు నని బోధచేస్తే మనుష్యుల బుద్ధికి చాలా స్వాస్థ్యము కలుగును గనుక యీ కాశీమాహాత్మ్యము ఆలాటి వారికి వుపయోగించే లాగు యేర్పరచినారని తోచుచున్నది.

గయా మాహాత్మ్యమును గురించి యోచిస్తే లోకమందు తల్లి దండ్రులు మొదలయిన రక్తసంబంధికులమీద సహజముగా అత్యంత మయిన ప్రీతి కలిగియుండవలసినది గనుకనున్ను, జరామరణాదులు యెప్పుడు సంభవించేదిన్ని యెవ్వరికిన్ని తెలియరాదు గనుకనున్ను అట్టి రక్త సంబంధికులు దేహము చాలించినంతలో వారు బ్రతికి వుండగా చేయవలసిన సత్కారములు చేయ డానకు వల్లపడక పోయి వుండినా, చేసినది చాలదని తోచినా, వారి ఋణము మనమీద నిలిచిపోయెనే అనే పశ్చాత్తాపము కలవారికి అటువంటి రక్త సంబంధికుల మరణానంతరము వారిని తరింప చేసే వుపాయము ఒకటి వున్నదని తెలిస్తే ఆ పనిచేసి మన ఋణము తీర్చుకుంటిమి గదా అని మనస్సుకు ఆనందము పుట్టించవలసినది అగత్యము గనుక యీ గయా మాహాత్మ్యము అటువంటి వారి విషయ మయి ప్రకటనము చేసినారని తోచబడుచున్నది.

సకల స్వరూపుడుగా నున్ను సర్వాంతర్యామిగా నున్ను వుండే దేవుడు వొక్కడే గనుక యే రూపముమీదనయినా భక్తి జనియించి దృఢమయిన బుద్ధితో యెటువంటి ఆరాధనను చేసినా సంతుష్టిపడి 'యేకమేవ'యనే శృతి ప్రతిపాదితు డయిన 'అద్వితీయ బ్రహ్మ' అంగీక రించు నని తలచి మానుషసామాన్యబుద్ధికి ప్రీతివిశ్వాసములు జని యించతగిన రూపములు కల్పించి ఆ రూపముగానైనా పరమాత్ముడి ఆరాధనలను మనచేత చేయించతలచి పూర్వీకులు యిట్టి స్థలమాహా త్మ్యలను ప్రకటన చేసినారని తోచబడుచున్నది.

న్నవి. సుగంధము కల పూలలో పన్నీరు పూలు ఒక దినుసు, జాజి పూలు ఒక దినుసు, సబుజాపూలు అని ఒకదినుసు; యివి తప్ప కడమ దొరికే పూలు అన్ని చూపులకు అలంకారముగాని సుగంధము కలవి గావు.

యీ గయా మహాక్షేత్రములో చెప్పే సంకల్ప క్రమము యీ అడుగున వ్రాయుచున్నాను. నెం. ౨౮. 'వైవస్వత మన్వంతరే, మేరోః దక్షిణ దిగ్భాగే, ఆర్యావర్తాంతర్గత మగధదేశే గయా గదాధర క్షేత్రే, కోలాహలపర్వతే, మధువనే, విక్రమశకే, బౌద్ధావతారే, బార్హస్పత్యమానే, ప్లవనామసంవత్సరే, ఆత్మసహితైకోత్తరశత కులోద్ధారణార్థ'మని చెప్పుచున్నారు.

ఈ మగధదేశములో వుండే మహాస్థలములు:—నెం. ౨౯. గయ ౧. రాజగృహి ౨. వపనాశ్రమం ౩. పునఃపునఃనది ౪. లోహదండం ౫. వైకుంఠం ౬. ఈ మహాస్థలములకు యాత్రార్థము వస్తే రావచ్చును గాని నిర్నిమిత్తముగా యీ దేశానకు కర్మఠులు రాకూడ దని పూర్వీకులు పురాణసిద్ధముగా నియమించి వున్నారు.

కాశీ నుంచి గయకు రావలసిన దారిని నేను రాకపోయినా విచారించి ఆ దారి మజిలీ వూళ్ళు క్రమముగా వ్రాయుచున్నాను: నెం ౩౦. మొగలుసరాయి కోసులు ౫. కఫనాశిని కో(సులు) ౭, మోఘనాసరాయి కో. ౭. సహసారాం కో. ౧౨. నాసరుగంజు కో. ౧౦. పునః పునః కో. ౭. పదాన్‌పూరు కో ౯ గయ కో ౫; అంతుకోసులు ౬౨.

యీ గయా షహరులో నల్లరాతితో చెంబులు, గ్లాసులు, తట్టలు, ప్రతిమలు మొదలయిన స్వరూపాలు బహుకుమారుగా చేసి అమ్ముతూ వుంటారు. అనేక విధములయిన విగ్రహాలు విత్తళి(ఇత్తడి)తో పోసి అమ్ముతున్నారు. విష్ణు పాదాలు తాంమ్రరేకులతోను, వెండితోను అనేక దినుసులుగా చేసి అమ్ముతూ వున్నారు. యిక్కడికి సమీపమయిన రాజగృహి కొండలవద్ద నున్ను, టంకారి అనే వూరి కొండవద్ద నున్ను స్ఫటిక శిలలు పుట్టుచున్నవి గనుక వాటిని స్ఫటిక మణులుగా నున్ను, శివలింగాలుగా నున్ను చేశి యీ గయా క్షేత్రములో అమ్ముతూ వుంటారు.

అండవాయువులు యింగిలీషువారు చెన్నపట్టణములో వశిస్తూ వుండగా వారికి లేక నల్లవాండ్లకు మాత్రము ఆ భూమిలో కలగడమే మని కొందరు దొరలను అడిగివుంటిని. వారు దీన్ని గూర్చి యోచించి తమ డాక్టరులు అందరున్ను కూడి నిశ్చయముచేసిన తీర్పుసంగతిని నాతో చెప్పినారు. అది యేమంటే యౌవనప్రారంభాత్పూర్వమే నల్లవాండ్లు స్త్రీభోగములలో ప్రవర్తింపుచున్నారు గనుక స్త్రీ సంచారము మిక్కుటము కావడమే అండవాయువు ఉపద్రవము కలుగుటకు కారణ మని నిశ్చయించినారట. ఆ కారణమువల్లనే యీ మగధ దేశములో అండవాయువులు విస్తరించివున్న వని విచారణమీద తెలిసినది. కాబట్టి చెన్నపట్టణానుభవముచేతనున్ను, మగధదేశపు వర్తమానము తెలిసినందుననున్ను, డాక్టరులు చెప్పినయోచన సరే నని నిశ్చయించడ మయినది.

యీ దేశపు రేగుపండ్లు బహు యోగ్యములుగా వున్నవి. నిడుపు అందముతో పొట్టివిత్తులు కలవిగా అతి మాధుర్యము కలిగి పురుగులు లేకుండా వున్నవి. యీ పండ్లు అమితముగా అమ్మడము కలిగి వున్నది. యీ దేశమంతా తట్టలతో భోజనము చేయుచు నుండడమున్ను, మర్రిచెట్లు పూజార్హముగా వుండడమున్ను, యిప్ప పూలతో సారాయి దించడమువల్ల వాటి ఆకులు కోయడము లేక వుండడమున్ను మోదుగచెట్లు విస్తరించి లేక వుండడమున్ను యిక్కడ కలిగి వున్నందున పట్టణములలోకూడా విస్తళ్లు దొరుకుట ప్రయాస ముగా నుండును. దొరికినా భోజనయోగ్యములుగా వుండవు. గనుక యీ దేశములో తిరిగే ద్రావిడదేశస్థులు విస్తళ్ళ సంగ్రహము చేసుకొని వుంచుతూ రావలసినది. హిందుస్థాన్ యావత్తున్ను రొట్టెల వలెనే అన్నమునున్ను ప్రతిదినము భోజనము చేయుచున్నారు గనుక చింతపండు మిరపకాయలు మొదలయినవి సహజముగా యెక్కడపడితే అక్కడ దొరుకుతూ వచ్చుచున్నవి.

యిక్కడి రూపాయి ౧ కి పయిసాలు ౬౮. పయిసా ౧ కి గవ్వల పుంజీలు ౨౮. పుంజీ ౧ కి గవ్వలు ౪. కట్టెలు మొదలుగా సకల పదార్థాలున్ను తూనికెమీద అమ్ముతున్నారు. తూనికె

క్రమము: శేరు ౧ కి సుమారు యెత్తు ర్పు ౮౦. దాన్ని ౨౦ గండాలు అనుచున్నారు. గండా అనగా ౪ రూపాయల యెత్తు. కొన్నితావులలో శేరు ౧ కి ౧౮ గండాలు; కొన్నితావులలో ౨౪ గండాలుగల శేరు వున్నది. కొన్నితావులలో ౧౧ గండాలుగల శేరు వున్నది. యీ గండాలు శేరు ౧ కి ఎన్ని అని తెలుసుకుని వస్తువులు బేరము చేయవలసినది. మణుగు ౧కి ౪౦ శేర్లు. శేరు ౧కి చిరాకులు ౧౬. అంగళ్ళలో వుండే తూనికగుండ్లు యేవంటే శేరు అనే గుండు ౧,పక్కా శేరు అనే అయిదు శేర్లగుండు ౧,చిరాకులగుండ్లు కొన్నిన్ని వున్నవి. కట్టెలు, బియ్యము మొదలయిన గొప్పతూనికెలు మణుగు గుండ్లతో తూచుచున్నారు.

పంచగయలు చేసే క్రమ మేమంటే ఫల్గునీ శ్రాద్ధము యథాక్రమముగా ముందర చేసి పయిన వ్రాసిన పంచతీర్థాలలో పిండప్రదానములు చేసి అటుతర్వాత మూడోదినము విష్ణుపదీ శ్రాద్ధము పయినవ్రాసిన క్రమప్రకారమే నెరవేర్చి నాలుగోదినమందు విష్ణుపాదపు గుళ్ళోనే మరివొక వటవృక్షము వున్నది గనుక అక్కడి ధర్మశాలలో శ్రాద్ధము చేసి ఆ వటవృక్షము కింద పిండప్రదానము చేసి గయావళివద్ద సుఫలము పుచ్చుకోవలసినది. ఏకోద్దిష్టము చేసేక్రమము మొదటిదినము ఫల్గునీశ్రాద్ధముచేసి రెండోదినము విష్ణుపదీ శ్రాద్ధముచేశి విష్ణుపాదముమీద పిండప్రదానము కాగానే గయావళివద్ద ఆ విష్ణుపాదమువద్దనే సుఫలము పుచ్చుకోవలసిసది. ఫల్గునీశ్రాద్ధము చేయవలసిన క్రమ మేమంటే ఫల్గునీశ్రాద్ధము మాత్రము ప్రథమదినము చేశి ఫల్గునిలో పిండప్రదానము కాగానే గయావళివద్ద ఫల్గునీనదిలో సుఫలము పుచ్చుకొని పిండములు ఫల్గునీనది చెలమలలో కలిపి వెయ్యవలశినది. యీ నాలుగు క్రమములుకాక వేరేవిధమయిన గయా ప్రజనక్రమము లేదు. గనుక నాతోకూడా వచ్చిన బ్రాహ్మణ మండలిచేత నంతా అష్టగయా ప్రజనము చేయించి, గయాప్రజనము చేయను శక్తిలేక గయలో కాచియున్న ద్రావిడ దేశస్థులయిన బ్రాహ్మణులచేతనున్ను, నాతోకూడా

వచ్చిన బోయీలు బంట్రోతులు వగయిరా శూద్రుల చేతనున్ను ఏకోద్దిష్టమనే గయాశ్రాద్ధమును చేయించినాను.

యీ గయామహాక్షేత్రము రాజా మిత్రజిత్‌శింగు అనేవాడి జమీన్దారితో చేరినది. వారి నివాసస్థలము టంకారి అనే వూరు, గయకు పదికోసుల దూరములో వున్నది. యితను బహు సంపత్తుగలిగి యున్నాడు. యితని జమీన్దారికి యితడు కుంఫిణీకి కట్టే రూపాయలు సాలు ౧ కి మూడు లక్షలు. యితని రాజ్యములో యితనికి యెనభై లక్షల రూపాయలు సునాయాసముగా కనుబడి అవుచున్నది. యిదే రీతిగా యీ ప్రాంత్యాల వుండే జమీన్దారులంతా అపరిమితమయిన లాభమును అనుభవింపుచు సుఖముగా నున్నారు. యింత లాభమునకు కారణమేమంటే యెనభై అరువై యేండ్ల కిందట యీ హిందుస్థాన్ రాజ్యము కుంఫిణీవారికిస్వాధీనముకాగానే నాలుగు పక్కల శత్రు సమూహాలు నిండివుండేను గనుక రాజ్యములు తమ స్వాధీనానికి వుపర్యుపరిగా వచ్చేకొరకున్ను వచ్చిన రాజ్యము పరాక్రాంతము గాకుండా స్వాధీనములో వుండేకొరకున్ను లార్డు కారన్‌వాలీసుగారి వుత్తర్వుమీద అప్పట్లో యీ జిల్లాలకు వచ్చిన కలకటరులు పూర్వము వున్న జమీన్‌దారులకే యావత్తు భూమినిన్ని తేలికెగా జమాబంది యేర్పరచి యుద్ధప్రసక్తులు తమకు కలిగినప్పుడు మంది మార్బలముతోకూడా (కాలుబలము) కావలసిన వస్తుసామగ్రిలను ప్రతి జమీన్దారుడున్ను కుమ్మక్కు చేయవలెనని వొక ఖరారు చేసుకొని భూమిని జమీన్దారుల వశము చేసినారు. అటువంటి సహాయములు వీరివల్ల కుంఫిణీవారికి యీ వరకు నిమిత్తము లేక వున్నది గనుక మంది మార్బలాన్ని కాపాడవలసిన నిమిత్తము లేకుండా తమ పరువుకు కావలసినంత శిబ్బందిని వుంచుకొని గజాంతైశ్వర్యములు జమీందారులందరున్ను అనుభవింపుచు కాలము తోయుచున్నారు.

యిక్కడి భూమివాటము మామిడియేతు వాటము. రహితుల క్షేమము వారి ప్రాజాపత్యాలఖుల్లనున్ను యేమంటే యీ హిందుస్థాన్‌లో భాఘు అని ఒక భూమికొలతకర్ర కద్దు. అభాసు అనే వెదురు

పంటలలో అభినిమందు గోధుమలు యవలు యివి నిండా వెలగల వస్తువులు.

అభిని మందు గసగసా కాయలమీాది బంక. ఆ కాయలను పోస్తుకాయ లంటారు. యీా వస్తువులు ఫలించే కాలము యిదే గనుక గయ చుట్టున్నూ పట్నా నుంచి గయకు వచ్చే దారిలో నున్ను పైన వ్రాసిన వస్తువులు అమితముగా ఫలించియున్నవి. పోస్తుచెట్లు వూళ్ళ వద్ద వేస్తారు గాని యిండ్లకు దూరమైన పొలములో వేయరు. పోస్తు చెట్లు అరిటిచెట్ల రీతుగా మొద్దుకట్టి వుండును. ఆ యెన్ను మొద్దుకు నాలుగు పక్కలా ముల్లంగి ఆకులవలెనే దళసరిగా ఆకులు వేసుకుని వచ్చి ముల్లంగి చెట్టంత పొడుగు కాగానే కాడవంటి యెన్నుతీసి యెన్నుకొనను తెల్లని పుష్పములు పుష్పించి రేకులు రాలిన వెనక పత్తికాయలవంటి పిందె బుట్టుచున్నది. అరటి పువ్వొందముగా వెలపటి కాయ రవంత పెద్ద పరగగానే కాయ వూర్ధ్వముఖ మవుచున్నది. ఆ కాయ నిమ్మకాయ కన్నా యెక్కువ గాత్రమవ్యేది. ముకాల్లు వాసి కాయ కాగానే మూాడు సూాదులు ఒక కట్టగా కట్టుకుని నాలుగు ఆవృత్తులుగా కాయకు నాలుగు పక్కలా మూాడేసి గీట్లుగా గీస్తారు. గీచిన మరుసటిదినము ఆ గీతలమీాద మునగబంక వర్ణముగా మెత్తని బంక పుట్టుచున్నది. వాటిని కత్తులతో గీచి కుంఫిణీవారికి శేరు ౧ కి రూపాయలు ౪ వంతున యిస్తారు. మరి ఒకరికి రహితులు అభినిమందు యియ్యకూాడదు.

ఈ మందు యీా హిందుస్థానలో అయ్యేదంతా శేఖరం చేసే కొరకు పట్నాలో సర్ చార్లీస్ డాలిబ్యార్డు అనే గొప్ప దొరను వుంచివున్నారు. అభినిమందు విషయాన్ని గురించి అతను యేమి వ్రాసినా కలకటరు మొదలయిన అధికారస్థులు శిరసావహించి నడవ వలసినది. ఆ దొర ములుకుగిరి తిరుగుతూ వుంటాడు: ఆ పోస్తుకాయలు చేతికి మెత్తగా వుంచున్నవి. కోస్తే లోపల కిత్తిలిపండువలె తొాల లుగా చీల పోతున్నది. ప్రతి తొాలమీాదా గసగసలు ఈశ్వరుడు కూరిపోసివున్నాడు. పోస్తు కాయలు పొలము చూచి నప్పుడు గొడు గులవంటి శుద్ధధావళ్యముగల పూాలతో బహుశృంగారముగా చూడ

వేడుకగా వుంచున్నది. మధ్యే ఒక్కొక్క యెర్రవర్ణపు పూలున్ను సకృత్తుగా పూచియుంచున్నవి.

గోధుమలు, జవ అనే యవలున్ను వరిపయిరు వలెనే పెరిగి తోకవడ్లవలెనే యెన్నులు తీయుచున్నవి. గోధుమ యెన్నులు కురచగానున్ను, గింజలు గుండు అందముగానున్ను జడ అల్లినట్టుగా వుంచున్నవి. యవయెన్నులు తోకవడ్ల యెన్నులకు అన్నివిధాలా సరిపోలి వుంటున్నవి. యీ దేశపు గౌడ బ్రాహ్మలందరున్ను అభిని మందు, బంగాకు దాని జడలున్ను సహజముగా అంగీకరిస్తారు.

యీ గయామహాక్షేత్రములో కాశివలెనే అడుగడుగుకు లింగాలు లేకపోయినా శానా గుళ్లు తీర్థాలకు నాలుగు పక్కలా వున్నవి. అందులో ముఖ్యముగా మంగళగౌరి యని వొక శక్తి గుడిన్ని గయాసురి అనే శక్తి గుడిన్ని వున్నవి. యీరెండు గుళ్లలో తామసారాధన లయిన బలిప్రదానాలు జరుగుచున్నవి. యీ మంగళగౌరి యనే దేవిగుడి అష్టాదశ పీఠాలలో ఒకటి యని వాడుకుంటారు. యీ గయా మహాక్షేత్రములో ఫిబ్రవరి నెల ౧౪ తేదివరకు వాసము చేసినాను.

---

## పదియేడవ ప్రకరణము

ఫిబ్రవరి నెల ౧౫ది మధ్యాహ్నము ౧౨ ఘంటలకు ఆ క్షేత్రము వదిలి ప్రయాణమై లోగడిదారిగానే మళ్లీ ౧౮ తేది పట్నావహారు ప్రవేశించినాను. నేను మైహారు అనే వూరు వదిలిన వెనక యీ నెల ౧౫ తేదివరకు యెక్కడా వొక చినుకయినా పడ్డది కాదు. శివరాత్రి ముందు వెనకలుగా యీ దేశములో వర్షము కురియడము వాడికె గనుక శివరాత్రి ముందు వెనకలుగా యిక్కడ మంచివర్షాలు కురిశినవి. యీ కాలమందు కురిశే వర్షముకూడా ఘనీభవించి రాళ్ళవాన కురియడము కద్దట. అదే ప్రకారము యీ చుట్టుపక్కలా తూర్పుగాలి సహితముగా రాళ్ళవాన కురిశినట్టు విన్నాను. ఆ రాళ్ళు భూపతన మయిన రెండు గడియలకు కరిగి పోవుచున్నవట. యీ వానలు

యిక్కడి గోధుమ వగయిరా పయిరులకు నిండా విరోధము. అక్టో
బరు నెల ఆఖరు మొదలు ఫిబ్రివరి ౧౫ తేది పర్యంతము చలియొక్క
బాధ ఒకటేరీతిగా వుండినది. పిమ్మట చలిబాధ విడిచినట్టు తోచగానే
యెండలు తీక్ష్ణము కాసాగినవి. యీ వాన కురియకపోతే చలి శుద్ధ
ముగా నివర్తించు నట. యీ వానవల్ల వైశాఖమువరకు వుదయకాల
మందు కొంచెము చలి వుపద్రవము వుంటూ వచ్చునని యీ దేశస్థులు
చెప్పినారు. యెట్లా శీతము యెక్కువో, అట్లా యెండయున్ను ఆ
కాలములో అంత యెక్కువగా వుంచున్నదని విన్నాను. యీ వుష్ణ
కాలానికి భయపడి లార్డువిల్లియం బెంటికుగారు నేపాళదేశములో
వుండే సముద్రోదకానికి పైన ౨౭౦౦౦ అడుగుల పొడుగుగా యీ
బ్రహ్మాండాని కంతా వున్నత పర్వతమైన హిమాలయ పర్వతానకు
యెండకాలపు కాలక్షేపముకొరకు వెళ్ళినారు. ఫిబ్రివరి నెల ౧౮
తేది మొదలుకొని మార్చి ౪ తేదివరకు వర్షప్రతిబంధకముచేత
నున్ను బజరా వుల్లాకులు అనే వాడలను కుదుర్చుకోవలసి సావకాశ
ముగా పట్నా షహరులో వసించినాను.

మ్యార్చి నెల ౫ తేది సాయంత్రము పట్నాషహరు వదిలి
౧౪ దాండ్ల బజరా ఒకటి బంగాళాకు బాడిగె ౧౧౨ రూపాయలకు
కుదిరి వుండగా దానిమీద సహకుటుంబముగా సవారి అయి ౭౦ రూపా
యిల బాడిగెకు వుల్లాకి యనే పడవ వొకటి కుదిరి యుండగా దాని
మీద బోయీలు, కళాసులు, డేరాలు మొదలయిన సామానులను
యెక్కించి ప్రయాణమైనాను. హిందుమతముయొక్క బాహ్యపు
చిన్నెలు చూచి హిందువులు తెలియక చెడిపోతారనే తాత్ప
ర్యము యిప్పట్లో యీశ్వరాజ్ఞవల్ల హిందువులను యేలే ఇంగి
లీషు జాతివారికి నిష్కృషగా తోచివున్నది. అటువంటి తాత్ప
ర్యము వారికి కలగడము యీ సరికి నేను వ్రాసిన హేతు
వులవల్ల యెంత మాత్రమున్ను వింతకాదు గండకీగంగాసంగమ
ప్రదేశములో యిక్కడ హరిహరాదుల గుళ్ళు రెండువున్నవి. అక్కడ
సంవత్సరానికి ఒకసారి మహోత్సవము జరిగి లక్షావధి ప్రజ వస్తు

శ్రీ శైలనాథునికి సమమవునా శ్రీకాళహస్తి నాథుడనిన్ని యుక్తులు చెప్పి శైవవైష్ణవులుమొదలయిన హిందువులు వారలలో వారే పోట్లాడ సాగుతూ వుంటే ౩౦౦౦ ఆమడ దూరములో నుంచి వచ్చిన ఇంగిలీషువారు హిందువులను జూచి నవ్వక అంతస్తత్వము విచారించే వోపిక త్వరలో యెట్లా కలుగును? గనుక పూర్వీకులతాత్పర్యము యీ కర్మోద్ధారణ విషయములో యేమైనదంటే నిప్పులో నీళ్ళు పుట్టినట్టయి నది.

పట్నాషహరు వదిలినవెనక మ్యాచి౯ నెల ౮ తేది మూంగేరి (మాంఘీర్) అని యిప్పుడు లోకప్రసిద్ధిగా వుండే పూర్వపు ముద్గలా శ్రమము ప్రవేశించినాను. గంగామహానది సప౯ము నడిచినట్టుగా అనేక తిరుగుళ్ళుగా ప్రవహింపుచున్నది. మూంగేరి ముందుగా గంగ నడమ చిన్నతిప్పలు రెండు వున్నవి. ప్రవాహకాలమందు ఆ కొండ తిప్పలు మునిగిపోను గనుక పడవలకు గుతు౯ తెలిశే నిమిత్తము వాటిమీద రెండు కొడి స్తంభములు నాటివున్నారు. మూంగేరి ఖసుబా. కలకటరు వగైరా అధికారస్థులు వుండే స్థలము. సకల పదార్థా౯లు దొరుకును. గొప్పయిండ్లు, ఒక చిన్న కోట కలదు. జాతులవాండ్లు కొన్ని బంగాళాలు ముచ్చటగా కట్టివున్నారు. యీ షహరులో నేమి యీ చుట్టు ప్రాంత్యాలలో నేమి మూంగాచీర లనే పట్టు నార మళ్ళు నేశి మన దేశానకు రావడము; యీ బట్టలను మూంగేరి చీర లనడానకు మూంగాచీరలని అభాసముగా ప్రఖ్యాతి అయినది. ఆ బట్టలు యిక్కడ శానా నయము.

యిక్కడ మాకు పడవతోశే మల్లాలకు కావలశిన భక్ష్య యోగ్య పదార్థ౯ములు పుచ్చుకొని సాగిపోయి యిక్కడికి ౫ కోసుల దూరములో వుండే సీతాగుండ ప్రదేశానకు సమీపముగా పడవలు నిలిపి సవారీలతో రెండుకోసుల దూరము వెళ్ళి అక్కడవుండే సీతా గుండదర్శ౯నము చేశి స్నానపానాదులు చేసినాము. ఆ సీతాగుండము సుమారు 30 అడుగుల చదరముతో తిరుకొలను వలె కట్టివున్నది. వుదకము బహు నిమ౯లముగా వున్నది. వుదకముకింద రాతిగొట్టు. కొండరాతిల్లో వూటపుట్టి తిరుకొలనులో పెట్టివుండే తూముగుండా

వుదకము బయట పారుతున్నది. తిరుకొలను వదిలి ౧౦౦ బారల దూరము పొయ్యేదాకా వుదకము యొక్క వుష్ణము యెక్కువ గనుక చెయి నిండాసేపు వుంచ సహ్యాము కాదు. తిరుకొలనులో వుదకము మీద పొగలు పారుతూ వుదకమువద్ది మెట్లను వుష్ణము చేయుచూ కిందమంట వేస్తే తపిలలోని వుదకము పొంగుతూ వుండేటట్టు సదా రెండు తావులలో తిరుకొలనులో పొంగుతూ వుంచున్నది. లోకులు పూజార్థము ఆ కొలనులో బియ్యము వేస్తారు. ఆ బియ్యము రెండు మూడు దినములకు నాని తూముగుండా బయిటికి వస్తున్నది గాని పచనము కావడము లేదు. యల్లీసు దొర కోడిగుడ్డును యీ వుష్ణోదకములో వుంచితే పక్వము కాలేదని వ్రాశినాడు.

యీ వుదకము యేప్రల్ నెలలో వచ్చే శ్రీరామనవమి మొదలుకొని యిక్కడ వర్షాకాలము ఆరంభమయి శ్రావణమాసము దాకా శీతకరముగా వుండి వర్షప్రదము కాగానే వుదకము మళ్లీ వుష్ణము కాసాగి శీతకాలమునందు చెప్పితీరని వుష్ణమవుచున్నదట. యిక్కడ సంవత్సరానికి వకసారి అయ్యే వుత్సవములో బహు జనసమ్మర్దము చేత మనిషి కాలుజారి ఆ కొలనులో పడితే చర్మమువూడి నాలు గయిదు దినములలో దేహమునకే అపాయము వస్తున్నదట. యిప్పట్లో ఆగుండములో నుంచి ముంచిన ఒక కుండ గంగలో సుమారు రెండు కుండల చల్లని గంగపోసి చల్లార్చి స్నానము చేసినాను.

ఆ తీర్థానికి చుట్టున్ను రామగుండము లక్ష్మణగుండము అనే తీర్థములు నాలుగు అయిదు కొలనులవలెనే కట్టియున్నవి. వాటి వుదక మంతా చల్లనే గాని, వుష్ణము కాదు. వాటి వుదకము వూరే గాని సీతాగుండమువలె వుదకము నదివలెనే సదా స్రవింపుచు పారడము లేదు. యీ వుష్ణోదకము కనిపట్టకూడని వొక సువాసనగా వున్నది. అది నిండా మాధుర్యము లేకపోయినా పానానికి సహ్యాముగా వున్నది. పానానంతరము నోరు కొంచెముగా పుల్లగా వుంచున్నది. స్నాన పానానంతరము ఒకవిధమయిన సువాసన మన దేహాన్ని అనుసరించి కొంతసేపు వచ్చే వుచ్ఛ్వాస నిశ్వాసాలతో తెలియవచ్చుచున్నది.

సల్ఫ్యూటిర్ యేసిడ్ అనే గంధక ద్రావకము వుదకములో కలిపి

తీసుకుంటే వుల్లగా వుంచున్నది గనుకనున్ను అగ్ని గంధకపు భూమిలో తనంతట పాషాణ సంబంధమయితే త్వరగా వుత్పత్తి కావచ్చును గనుక నున్ను లోకారాధ్యుడు మహానదులనున్ను, మహాపర్వతాలనున్ను అనేకముగా సృష్టించి నప్పటికిన్ని అటువంటి సృష్టికోటి చూచి ఒక వేళ తన అత్యద్భుత చర్యను తెలుసుకోలేక పోదురనే తాత్పర్యముతో యీ వుష్ణ గుండాన్ని తగుపాటి కారణాలను వుంచి సృష్టించినాడని తోచబడుచున్నది.

యీ వుష్ణగుండపు కథ : శ్రీరాములు రావణ బ్రహ్మహత్యా పరిహారార్థముగా ముద్గలాశ్రమమునకు సహకుటుంబముగా వచ్చి నట్టున్ను, అప్పట్లో తన లంకానివాసదోష సందేహము అక్కడవున్న అనేక ఋషులకున్ను, అక్కడికి సమీపమందున్న తన తండ్రి అయిన మిథిలాపురనాయకుని కిన్ని నివృత్తి అయ్యేటట్టు పాతాళమందు వుండే బాడబాగ్నిని తెప్పించి సీతాదేవి తాను ప్రవేశమై బయిటికి వచ్చి నట్టున్ను, ఆ అగ్నివల్ల యీ లోకానకు బాధలేకుండా పిమ్మట అక్కడ తదుపరి వుదకప్రవాహాన్ని సృష్టించినట్టున్ను తద్వారా అద్యాపి ఆ వుదకము వుష్ణకరముగా వుండేటట్టున్ను చెప్పుతారు.

రామకృష్ణాద్యవతారములు అబద్ధములు కావు గనుకనున్ను, వారు పరబ్రహ్మ స్వరూపు లనడానకు యేమాత్రము సందేహము లేదు గనుక నున్ను తమమహిమలు లోకములో ప్రసిద్ధిగా వుండేకొరకు యిటు వంటి యాశ్చర్యకరము లయిన విషయాదులు కలగచేసినా కలగజేసి వుండవచ్చును.

యీ స్థలమందు వసించి ఆమరునాడు జాంగీరు అనిన్ని, జాంగరా బాదు అనిన్ని చెప్పబడే గొప్పబస్తీ యయిన గంగ వుత్తరవాహినిగా ప్రవహించే పుణ్యస్థలము ప్రవేశించినాను. యీ వూరు కలకటరు మొదలయిన అధికారస్థులు వసించే జిల్లా కాకపోయినా నీలిమందు చేసే యింగిలీషు దొరలు గంగాతీరమందు అక్కడక్కడా మిద్దెలు వగయిరాలు కట్టుకొని యీ ప్రాంతముల అనేకులు వుండేటట్టు యిక్కడా కొందరు వసించి యున్నారు. యిది గొప్పవూరు. మైథిలి కాన్యకుబ్జ బ్రాహ్మణులు యిండ్లుకట్టుకొని తీరవాసు లయి యున్నారు.

వంటి సిద్ధులకు నిమిత్తములయిన వస్తువులను స్వాధీనము చేసుకో వలెనని వృథా ఆశపడి నిమిత్తము మాలిన భ్రమప్రమాద మైన పనులు చేయడము అతి వ్యర్థమని నిశ్చయము చేసినాను.

యీ దాతా వైద్యనాథ స్వరూపముగా వుండే పరమాత్మునికి శివరాత్రి దినమున సపాదలక్ష అనే లక్షాయిరువై అయిదువేల గంగ కావిళ్ళకు తక్కువ లేకుండా లోకులు తెచ్చి కామ్యార్థముగా అభిషేకము చేస్తూవుంటారు. దాతా వైద్య నాథునికి పంచకావిళ్ళు అభిషేకముచేస్తే యిష్టసిద్ధి అవుతున్నదని యీ హిందుస్తాన్‌లో బహు ప్రసిద్ధి. ఆ పంచకావిళ్ళు యేదే దంటే గంగోత్తరి, గంగా సాగర సంగమము కావిళ్ళు రెండు; హరిద్వారమువద్ద యెత్తే గంగకావడి వొకటి; ప్రయాగలో యెత్తే కావడి వొకటి; యీ జాంగీరువద్ద యెత్తే గంగకావడి వొకటి; అంతు కావిళ్ళు అయిదు.

యీదాతావైద్యనాథస్థలముయొక్క కథయేమంటేపూర్వకాలము నందు రావణాసురుడు కైలాసానకు వెళ్ళి శివుణ్ని నాలంకలో నీవు వసించవలెనని ప్రార్థించి నట్టున్ను శివుడు మంచి దని ఒక లింగములో మూర్తీభవించి నన్ను దిగువపెట్టకుండా నీలంకకు యెత్తుకొని పొమ్మని చెప్పినట్టున్ను విష్ణువుకు యీ వర్తమానము తెలిసి లోకసంరక్షణ పనికి నియమింప బడ్డ వాడు గనుక యీ తామసగుణ ప్రధాను డయిన రావణుని సమీపమందు శివుడు వసిస్తే వీడు మరీ శివప్రసాదము కలిగే కొద్దిన్ని సాధులను బాధపెట్టు ననే భయముచేత వుదకాధిపతి అయిన వరుణుని ప్రేరేపణ జేసి రావణుడు యీ జాంగీరువద్ద గంగ దాటి అడివి మధ్యే పోతూవుండగా రావణునికి జలబాధ బహుశా కలిగేటట్టు చేసి తాను వృద్ధ బ్రాహ్మణుని వేషము వేసుకొని ఆ లింగము తీసి వుంచుకొని రావణుడు జలబాధ నివృత్తి చేసుకుని వచ్చే లోపల ఆ అరణ్యములో పెట్టి వెళ్ళినట్టున్ను ఆ లింగాన్ని పెల్లగించడానికి శక్తిలేక లంకకు వెళ్లిపోయినట్టున్ను, పిమ్మట వైద్ది అనే గోపాలకుడు కాళహస్తి కన్నప్పవలెనే అతిమూర్ఖమయిన భక్తితో ఆరాధన చేశినట్టున్ను తద్ద్వారా ఆ లింగము పేరు వైద్యేశ్వరుడు అయినట్టున్ను ప్రసిద్ధి గలిగే యున్నది.

ఆ స్థలము చుట్టున్ను అడివి బిల్వ మయముగా వున్నది. యీ దేశములోనున్ను ముఖ్యముగా బంగాళీలున్ను, యెండకాలములో బిల్వ పండ్లు షర్బత్తుచేసి బహుశః తాగుతారు. ఈ దేశపు బిల్వపండ్లు బహు గొప్పలుగా వున్నవి. పండిన వెనక బహుమాధుర్యముగా వుంచున్నవి. యీ బిల్వపండ్ల నిమిత్తము బిల్వచెట్లుకు బహుకట్టు చేశియున్నారు. యీ చెట్ల కిందికి మనుష్యులను పోనివ్వరు. యీ జాంగీరువద్ద వొక తోటలో బిల్వచెట్టు పనసచెట్టు కాచివుండగా నా మనుష్యులు పన సాకులు కొయ్యపోతే పనసచెట్లనువిరచినా సమ్మతించినారుగాని పూజకు రెండు బిల్వదళములు కొయ్యనిచ్చినవారు కారు. యీ జాంగీరు స్థల ములో అమావాస్య ఆదివారము ఘటనమైనది గనుక ఆ దినమునకు మరునాడు అమావాస్య సోమవార వ్రత మిక్కడనే గడిపి సోమవారము మధ్యాహ్నము బయలుదేరి సాగివచ్చినాను.

మ్యార్చినెల ౧౬ తేది కహాలుగాం అనే గొప్పవూరుచేరినాను. యీ వూరివద్దను గంగమధ్యే రెండు చిన్న కొండలున్నవి. ఆకొండల మీద మానుషసంచారము లేదు. అడివి పెరిగియున్నది. ఈ వూళ్లో అన్ని పదార్థాలున్ను దొరుకును. మయిథిలి బ్రాహ్మణులు, కనోజా బ్రాహ్మణులు ౫౦ యిండ్లదాకా యున్నారు. కరివేపాకు మన దేశము వదిలిన తరువాత అక్కడక్కడ ప్రయత్నముమీద దొరుకుతూ వచ్చి నది. ఈ వూరిలో ప్రతిపెరటిలోనున్ను కరివేపాకుచెట్లు కొల్లగా వేసి యున్నారు. కొత్తమల్లి మనిషిపొడుగున యీ దేశములో గడియ దూరము దాకా పరిమళింపుచు పుయిరు అవుచున్నది. యీ ధనియాలు కుసుంబా చెట్లతో కలిపి అభిని చెట్లతో కూడా నున్ను ప్రత్యేకముగా పొలాలలో నున్ను చల్లుతారు.

మూంగేరి మొదలుగా గంగకు యిరుపక్కలలో పర్వత దర్శ నము అవుతూ వున్నది. బజారాలో వచ్చేటప్పుడు ఆ పర్వతాలు వొక పక్క నుండేవయినా నాలుగు పక్కలా తిరుగుతూ వుండేటట్టు స్థిరముగా నుండే సూర్యుడు భూచలనముచేత వొక పక్కనుంచి వక పక్కకు వచ్చేటట్టుతోచే లాగు అగుపడుచున్నది.

32

జాంగీరునుంచి కహాలుగాముకు వచ్చేలోపల భాగల్పూరనే జిల్లాకసుబా గొప్ప షహరు వొకటి వున్నది. అక్కడ కలకటరు మొదలయిన అధికారస్థులు నివాసముగా వుండి వున్నారు. ఆ వూరి వద్ద నుండే గంగాధార యీ దినాలలో లోతు చాలనందున ఆ వూరికి వుత్తరముగా వుండే పెద్ద ధారలో యీ బజరాలు వస్తున్నవి గనుక దూరవుదృష్టి మాత్రము ఆ వూరిమీద కలిగినది. యీ గంగధారలను యీ పడవవాండ్లు దరియ్యా లంటారు. జలధార తక్కువయితే యె దరియ్యా మరుగయా అంటారు.

౧౭ తేది గురువారము పడమటిగాలి అనుకూలముగా కొట్టినందున యీ దినము వుదయము మొదలు అస్తమానము లోపల ౨౫ కోసుల దూరము మా బజరా సాగి వచ్చినందున రాజామహాలు అనే గొప్ప వూరు చేరినాము. యీ వూరిలో నీలిమందు చేశే దొరలు మాత్రము నివాసముగా వున్నారు. యీ వూరివద్ద గంగలో రాళ్ళు వున్నవి. పడవలు జాగ్రత్తగా రావలసినది. యీ వూరు తోపులు, తోటలతో నిండి వున్నది. వొక మశీదు వున్నది. అది తురకల భక్తిని ఆకర్షించే పాటిగా పురాతనముగా వుండి వున్నది. పూర్వీకపు రాజులు *కట్టినది వొక నల్లరాతి మహాలు శిథిలమై యున్నది. సకలపదార్థాలు దొరుకును.

పట్నా అనే షహరు విడిచిన వెనక శోధన చూడవలెననే వేషముతో సుంకపు చౌకిదార్లు యెవరున్నా మా బజరాలవద్దికి చిన్న పడవలు వేసుకొని రావడములేదు. వారిని యిక్కడి కష్టం కలకటరులుపోయి వస్తూవుండే పడవలను నిండా తొందరపెట్టకుండా తాకీదు చేసినట్టు తోచుచున్నది. సుంకపువాండ్లు యీ దేశములో లోకులను చేసేతొందర అధికారస్థు లయిన దొరలకు తెలుసును. కాశిలో వుండే బూక్రుకుదొర యీ ప్రసక్తి నాతో మాట్లాడే టప్పుడు 'ఈలాగే మా దేశమైన యింగిలాండులోనున్న సుంకపువాండ్లవల్ల తొందర కలిగి

* ఔరంగజేబు చక్రవర్తి సోదరుడు షూజా క్రీ. శ. 1630 లో దీనిని కట్టెనని బిషప్ హెబరు వర్ణించినాడు.

వున్నది. వీరికి అధికారము యివ్వక విధిలేదు. యిచ్చినందువల్ల లోకులకు హింసగా వున్నదని వ్యసన పడుకున్నాడు.

యీ దేశములో బంట్రోతులు మొదలుగా శిరస్తా వుద్యోగస్థులవరకు జీతములు బహు స్వల్పము గనుక లోకులవద్ద లంచాలు నిండా తీస్తారని గయా మేజస్ట్రీటుదొర మేస్తరు జాకుసన్ దొరతో మాట్లాడునప్పుడు ప్రసక్తివచ్చి అప్పుడు వారు చెప్పినది యేమంటే; పిడికిళ్లతో యెత్తి యీ దేశములో అధికారస్థులకు లోకులు లంచాలు యిచ్చేవాడికె పడియున్నందున జీతాలు మీ దేశమువలె యెక్కువ చేసినా అధికారస్థులు అడగక పోయినా వాడికె ప్రకారము లోకులు తెచ్చియివ్వవలసినదాన్ని యిస్తూ వస్తురు గనుక అప్పట్లో కుంఫిణివారికి యెక్కువజీతము యిచ్చేనష్టము ఒకటేగాని యెవరికిని క్షేమముండ నేరదని చెప్పినాడు. బరకత్‌దాసు అనే వొక ఠాణాబంట్రోతుకు యిక్కడ జీతము నెల ౧ కి నాలుగురూపాయలు. వాడి గుర్రము వగయిరాలకు మాత్రము నెల ౧ కి ౧౦ రూపాయలు సెలవు వుంటూ వున్నది. యిక్కడ జిల్లామేజస్ట్రీటు నాజరుకు సుమారు నెల ౧ కి నూట్కి తక్కువలేక వస్తూవున్నది. హిందుస్తానులో జుడైసైయాల్‌లయనులో నల్లవాండ్లలో నాజరు వుద్యోగము సర్వోత్తమమని నిశ్చయముచేసినాను.

యిక్కడ సకల కచ్చేరీలలోనున్న లెక్కలు వగయిరా వ్రాసే భాష ఫార్సీ. యింకా యిక్కడ వ్రాశే అక్షరములు నానా విధములుగా వున్నవి. ఒకరికి వ్రాయ చదవ తెలిసినది మరివొకరికి తెలియదు గనుక జాబులు మూలకముగా పనులు జరుగడము ప్రయాస. ఫార్సీలిపిమాత్రము సర్వమధ్యస్థముగా వున్నది. యిక్కడ వ్రాశే లిపుల ఖుల్లసు యేమంటే మహాజని యని సావుకార్ల లిపి వొకటి, బ్రాహ్మణి అని బ్రాహ్మలు గ్రంథాలువ్రాశే లిపి ఒకటి, మోడి అనే మహారాష్ట్రపు లిపివొకటి, మారువాడి అని మారువాడీలు వ్రాశే లిపివొకటి. ఇంకా కొన్నిలిపులు వున్నట్టు తోచుచున్నది. మగధ దేశములో మాగధి అని వొక భాష గయావళీలు అంతరంగముగా మాట్లాడు కొంటారు.

యీగయావళీలేమి, యీ దేశపు పంచగౌడ బ్రాహ్మణులేమి వారి వటువులకు యెనిమిదో సంవత్సరమున వుపనయనము మాత్రము క్రమముగా చేస్తారుగాని ఆచిన్నవాండ్లచేత అటుతర్వాత త్రికాలములను సంధ్యావాపిఃంచే జాగ్రత చెయ్యడములేదు. వివాహాదులు నాలుగు దినముల దీక్షతో చేస్తారు. నిశ్చితార్థము మాత్రము కొన్ని నెలలకు ముందే చేసిపుంచుతారు. ప్రవేశ హోమము శేషహోమము పాణి గ్రహణము యీ ముఖ్య కృత్యములు కద్దు. మాంగల్య ధారణము మొదలయిన లౌకిక లాంఛనలు దక్షిణదేశము వలెనే నడవడము లేదు. జాతా శౌచాదులు శ్రుతి స్మృతి ప్రకారము ఆచరించుతారు. గంగకు సమీపప్రాంతములందు వశించేవారు, యెవరు దేహము వదలినా దేహమును యథోచితముగా కర్మ నిమిత్తము తప్తముచేసి గంగలో విడిచిపెట్టుతారు. కర్మ ప్రసక్తి లేనివారి దేహములు వొక నిమిత్తము లేక గంగలో విడిచి పెట్టడమే ముఖ్యముగా జరుగుచున్నది.

యిక్కడి పంచాంగాలలో గ్రహ దృష్టులు సాధించి వ్రాయుచున్నారు. తిథివార నక్షత్ర యోగకరణాదులు దక్షిణదేశపు పంచాంగానికి గడియ యెచ్చు తక్కువగా సరిగా వుంచున్నది. పంచాంగాలలో వివాహోపనయన ముహూర్త విచారణ బహుశః లోకులు చేయుచున్నారు. శివాలిఖిత మని వొక ప్రయాణ ముహూర్త నిర్ణయ గ్రంథమున్నది. దాని ప్రమేయము సాంబమూర్తి త్రిపుర సంహారము చేయబోవు నప్పుడు తలచిన కాలమందు ముహూర్తము దొరికేటట్టు ఆ గ్రంథము లోకోపకారముగా చేసినాడట. జాతక సంవత్సర ఫలాలు గొప్ప వారికి జ్యోతిషికులు వ్రాసియిస్తూ వస్తారు.

కాశీప్రయాగలలో దక్షిణదేశస్థులేమి, యిక్కడి ఉత్తర పశ్చిమ తూర్పు దేశస్థులేమి అనేక ధర్మాదులను కాశీతంబురాయడి అధీనముగా దక్షిణదేశస్థులు కాశీ మొదలయిన ధర్మాదులను చేసినట్టు చేసి అనేక గుమాస్తాలగుండా నడిపిస్తూ వుండేది. నడుస్తున్నదా లేదా అని సర్కారుతరఫున విచారణలేదు.

దక్షిణదేశపు సౌరమాన చాంద్రమాన నక్షత్రమానాలకున్న,

విశ్వాసములు కలవారు గనుకనున్ను, కలకత్తా దేశమునుంచి నూర్లు నావాలు చేసుకొని నా యెదట యిప్పుడు వస్తున్నవి గనుక యిక్కడ రాత్రిళ్ళు దిగినా అయిదారు నావాలు నాతో కూడా దిగుతూ వస్తున్నవి. యీ ప్రాంత్యములలో రాత్రిళ్ళు నావాలు ఒంటిగా మనిషి కట్టు తక్కువగా దిగి వుంటే దొంగలు తేలికెగా వుండే కిస్తీలు అనే నావాలమీద వచ్చి కొళ్ళపెట్టుక పోతారని హామకుంటారు. యిప్పట్లో అటువంటి దుర్మార్గములు శానా మట్టుపడ్డట్టు తోచబడుచున్నది.

లోగడ వ్రాసినంతలో శాస్త్రయుక్తి చోదిత మయిన ద్వైతమతము ప్రసిద్ధముగా మధ్వాచార్యులవారు వుద్ధరించి దక్షిణ దేశములో బహుమందిని తదనుష్ఠానపరులుగా నున్న యేపరు చుకున్నట్టు యీ దేశములో యెవరినిన్ని లోపరుచుకోలేదని వ్రాసుకుని ఉంటిని. గయామహాక్షేత్రము ప్రవేశించిన వెనక గయావళీల మతము విచారించగా వారు మధ్వమత ప్రవిష్టులుగా నున్న దక్షిణ దేశపు సత్యపూర్ణ పీఠపు శిష్యవర్గముగానున్న తెలియవచ్చినది.

యీ గయావళీలు మాత్రము యింత దేశములో మధ్వమతానికి లోబడ వలసిన కారణ మేమని విచారించగా వాయుపురాణ ప్రకారము యాగార్థమై వీరు బ్రహ్మకల్పిత బ్రాహ్మణులు గనుకనున్ను ధర్మప్రజా వృద్ధ్యర్థం వర్ణాంతర స్త్రీలను పరిగ్రహించినారు గనుకనున్ను యిక్కడి బ్రాహ్మణ మండలి యీ గయావళీలను తమ సముదాయములో కూర్చుకోక గయాప్రజనకాలములలో మాత్రము వాయుపురాణ ప్రకారము వీరిని తగురీతిన ఆరాధనచేయుచు నుండగా మధ్వమత ప్రకటనార్థము యే నూరేండ్లకిందట మధ్వమతోద్ధారకులు యీ దేశమునకు వచ్చినప్పుడు అందరికి యిక్కడ వెలిగా వున్న గయావళీలు అందరున్ను యిక్కడ అనంగీకారము చేసిన మతాన్ని అంగీకరించి తమంతట తాము యిక్కడ వొక ప్రత్యేక మతానుసారులుగా వుండడము యుక్తమని నిశ్చయము చేసి మధ్వమత సంకేతాలకు అన్నివిధాలా అప్పుడు లోపడినారు. మతోద్ధారకులు ద్రావిడాచారాలు యావత్తున్ను వీరికి బోధచేసి తదారభ్య ద్రావిడాన్నము భోజనము చేసేటట్టు వీరికి యిచ్ఛను కలగచేసినారు. ఆ

యిచ్ఛమాత్రము యిప్పుడు నిలిచి వున్నది గాని, వారు బోధ చేసిన ఆచార వ్యవహారాదులు యీ దేశస్థుల సాంగత్యము చేత క్రమక్రమశః ఖిలపడుతూ వచ్చినది,

వాయుపురాణ ప్రకారము గయావళీలను గయావ్రజనక్రియలు చేయడములో ఆరాధన చేయవలసినది అగత్యము గనుకనున్ను, ద్రావిడాచార ప్రకారము పిండదానాత్పూర్వము అన్నశ్రాద్ధము చేయడము ముఖ్యము గనుకనున్ను, గయావళీలు ద్రావిళ్ళు పచనము చేసిన అన్నము భోజనము చేసేటట్టు సమ్మతించినారు గనుకనున్ను, చటకము మొదలైన శ్రాద్ధాలు చేసి గయావళీలకు ఆమం మొదలైన భక్ష్య యోగ్య వస్తువులు యిచ్చే టంతకన్నా అన్నశ్రాద్ధానికి గయావళీలను బ్రాహ్మణార్థము చెప్పేటట్టు దక్షిణదేశస్థులు నిశ్చయము చేసినారు గాని యేకారణము చేతనున్ను గయావళీలు పక్వముచేసిన అన్నమును ద్రావిళ్ళు పుచ్చుకునేటట్టు సమ్మతించినవారు కారు. తదారభ్య గయావళీలు ద్రావిళ్ళవల్ల యీపాటి జరిగే గౌరవమును కాపాడుకోవలసి ద్రావిడ దేశస్థులు భోజనము చెయ్యకనుండేవారి చేతి పక్వాన్నము తామున్ను భుజించకుండా ద్రావిడాచార ప్రకారము నడిచేవారమని అభినయిస్తూ కాలము గడుపుతూ వస్తున్నారు. యాభై అరవై యేండ్ల క్రిందట సత్యపూర్ణ పీఠస్థులు యీ ప్రాంతముల వచ్చివుండి గయావళీలకు సమాశ్రయణము చేసి పూజ గైకొని పోయినారు. యిప్పుడున్ను పూనా శ్రీమంతుడు మొదలయిన గొప్పవారి గయావళీలు మాత్రము యథోచితముగా యజమాన ప్రీత్యర్థమై బ్రాహ్మణ నిత్యకర్మాలు జరుపుకుంటారు.

## పద్దెనిమిదవ ప్రకరణము

మనలో పేరుగలిగిన యాభైఆరు దేశాలు వాటి ఛెప్పన్నభాషలున్ను యీ బ్రహ్మాండములో యేపక్క వున్న వని విచారించగా నేను చేసిన దేశాటనముచేత నాకు కలిగివుండే స్వానుభవము చేతనున్ను, నా వినికిడి వల్లనున్ను, నేను నిశ్చయము చేసినది యేమంటే ఆ దేశాలంతా కర్మద్వారా బ్రహ్మానుసంధానము చేసే 'యిండి

యా' అని నామధేయము కలిగిన కన్యాకుమారి మొదలు కాశ్మీరము లోపలనే వున్నవిగాని అన్యత్రా కాదు, అని నిశ్చయము చేసినాను. అయితే బహు దినములుగా యీ భూమి తురకలచేత ఆక్రమింపబడి దేశ సరిహద్దులు తెలియకుండా భూమిని కలిపి వారు యేలుతూ వచ్చి నందుచేత యిప్పట్లో ఆ యాభై ఆరు దేశాల సరిహద్దులు అన్ని కని పెట్టి వ్రాయడానకు ప్రయాసగా నున్నది. అయినా ఆ యాభై ఆరిం టిలో అనేక దేశాల సరిహద్దులు కనిపెట్టి వ్రాయవచ్చును.

మనము వసించే భూమితోకూడా ఊర్ధ్వ లోకాలు యేడు; అధోలోకాలు యేడు. వాటిస్థితి యెక్కడ నని విచారించగా నాబుద్ధికి తేటపడ్డది యేమంటే, పయిన వ్రాశిన పదునాలుగు భువనములు యీ బ్రహ్మాండమునకు అంతర్భూతము లని నిశ్చయపడ్డది. అది యెట్లంటే యీ బ్రహ్మాండము కోడిగుడ్డు ఆకారముగా వున్నదని మన శాస్త్ర మున్ను మతాంతరస్థుల భూగోళ శాస్త్రములున్ను యేక వాక్యత పడి వున్నవి. మన గణిత శాస్త్ర ప్రకారముగా నున్ను యితర మతాంత రస్థుల గణిత శాస్త్రాల సమ్మతిగా నున్ను యీ బ్రంహ్మాండానికి ౧౮౦ భాగములుగా చేసి అందులో మధ్య ప్రదేశాన్ని మనవారు నిరక్ష దేశమనిన్ని, జాతులవాండ్లు 'లయన్' అనిన్ని పేరుపెట్టి వున్నారు. గనుక ఆ నిరక్ష దేశానకు వుత్తరము యేడులోకములుగానున్ను, దక్షి ణము అధోభాగమునందు యేడు లోకాలుగా నున్ను మన వారు నియమించినారు. వుత్తరము వూర్ధ్వభాగమందు వుండే యేడు భువ నములలో మానుష నివాస భువనము వొకటి. దీనికి పై అంతస్థు అంత స్థుగా మనుష్యాపేక్షయా దేవతాస్వరూపులుగా వుండేవారు సృష్టికోటి తారతమ్యాల ప్రకారము శుద్ధసాత్విక గుణప్రధానులై శీతల భూప్రదే శాలలో ఆనందింపుచు నుండే లాగు తోచుచున్నది. యీ లోకము లను స్వర్గ మర్త్య పాతాళలోకము లని మూడుగా చెప్పుచున్నారు. నిరక్ష దేశమునకు దక్షిణముంను అధోభాగమున తమోగుణ ప్రధాను లైన రాక్షస భూతప్రేత పిశాచాదులు వారి వారి తారతమ్య ప్రకా రము అంతస్థులుగా వసింపుచునుండేలాగు తోచబడు చున్నది.

మనుష్యనివాసభూమికి ఊర్ధ్వాధః ప్రదేశములలో వసించే

చూస్తే తామసగుణ ప్రధానులకు ద్వేషబుద్ధి జనించడము సహజము గనుక, తామసగుణ ప్రధానులయిన రాక్షసులు మొదలైన వారికిన్ని సాత్విక గుణప్రధానులైన దేవతలకున్ను యుద్ధములు పురాణోక్తముగా వుండేలాగు అప్పుడప్పుడు సంభవింపుచు వచ్చినట్టు తోచుచున్నది. వశిష్ఠాదులుగా వుండే మునులు జన్మముచేత మానుష దేహులైనా వారు చేసిన సుకర్మములచేత దేవదేహులై దేవ సమానులైనారు. గనుక సాత్వికగుణప్రధానమైన దేవలోక సంచారములు వారికి కలిగి వుండేటట్టు తోచబడుచున్నది. విరజానది సన్నిహితమైన విష్ణు నివాస వైకుంఠమున్ను, సాంబమూర్తి నివాసమైన కైలాస పర్వతమున్ను మొదలైన వుత్తమ ప్రదేశములు మనకు వూర్ధ్వమున నుండే ఆరు భువనములలోనే వున్నవి. యీ కర్మభూమిని వసించే మానుష మండలిలో కొందరు తామసారాధన ప్రియులై తామస గుణ ప్రధానులైన భూత ప్రేత పిశాచ రాక్షస గణాలను వుపాసన చేయుచూ వచ్చినారు గనుక వారి ప్రదేశమున్ను యీ మానుష నివాస భూమియందు కలిగి వారున్ను అతి తామసారాధనలచేత సర్వేశ్వరుని కటాక్షము సంపాదించినవారై సాత్వికగుణప్రధానులయిన దేవతలను ధిక్కరించేపాటి సామర్థ్యము కలవారైనారు గనుక వారు అటు తర్వాత తమ్మున ఆరాధించినవారియందు అనుగ్రహము చేయుచు తమంత వారినిగా వారిని చేయుచూ వచ్చినట్టు తోచబడుచున్నది.

లవణేక్షు సురాదులనే యేడు సముద్రములు ప్రత్యేక ప్రత్యేకముగా నున్నవా లేక వొక సముద్రములోనే ఆ యేడు సముద్రాలున్ను అంతర్భూతములా అని విచారించగా మన పురాణాదుల రీతిగానున్ను మతాంతరస్థుల పురాణాదులరీతిగానున్ను సృష్టియొక్క ఆదిలో లోకారాధ్యుడు జలార్ణవముగా వున్న బ్రహ్మాండములో జలమును తొలగ తోసి మృత్తికను కలుగచేసినట్టువున్నది గనుక అటుతర్వాత పిండాండములయొక్క వాసార్థము కలగచేసిన భూమి వినాగా మిగిలిన ప్రదేశమంతా బ్రహ్మాండములో జలమయముగా వున్నది గనుకనున్ను ఆ జలరాశి సమూహానకు సమష్టి పేరు సముద్రము గనుకనున్ను సముద్రమువొకటేగాని అనేక సముద్రములు వుండనేరవు. అయితే

సముద్రసంచారులుగా నుండే జాతులవాండ్లు సముద్రములో నుండే ప్రదేశాంతరములు గుర్తు తెలిసేకొరకు బ్లాకిసి, రెడ్డుసీ అని పేళ్ళు పెట్టినట్టు మన పూర్వపు పౌరాణికులు దేవతలు మొదలైన సిద్ధస్వరూపులు వసించే ప్రదేశములు ఈ బ్రహ్మాండములో ఫలానితావులు అని గుర్తు తెలిసేకొరకు వొక జలరాశిలోనే యిది లవణసముద్రము యిది యిక్షుసముద్రమని యేర్పరచినట్టున్ను ఆ మధ్యనుండే దివ్యభూఖండములను జంబూ ప్లక్ష అనే సప్త ద్వీపాంతరములుగా యేర్పరచినట్టుగానున్ను తోచబడుచున్నది.

సృష్టియొక్క క్రమము విచారించగా మొదట అయిదు మహాభూతములు వుద్భవించినవి. వాటిపేళ్ళు పృథివ్యప్తేజోవాయ్వాకాశాలు. ఆకాశభూతము శుద్ధశూన్యమయినా సర్వవ్యాపకముకనుక అదే పర తత్వమైయుపనిషద్వాక్య ప్రకారము తనవల్ల వాయువు, దానివల్ల అగ్ని, దానివల్ల జలము, దానివల్ల భూమి అని యిట్లు సృజించెను. ఆకాశము గాక మిగిలివుండే నాలుగు భూతములలోనున్ను వాటియొక్క సృష్టి పరంపరలోనున్ను ఆకాశ మహాభూతముయొక్క సంకల్ప స్వరూపమైన మాయాశక్తిన్ని, సర్వకారణమైన ఆకాశ భూతమున్ను లీనములై యున్నవి. వాయువుమొదలైన మహాభూతములు నాలుగింటిలో మాయాశక్తి చైతన్యము విస్తారము ప్రతిఫలించే స్త్రీ భూతములు రెండు; ఆకాశభూతసంబంధమైన పురుష చైతన్యము విస్తారము ప్రతిఫలించే పురుష భూతములు రెండు; అంతు మహాభూతములు నాలుగు. అందుకు దృష్టాంతము యే పురాణములో విచారించినా భూమినిన్ని వుదకరాశినిన్ని స్త్రీలింగాలుగా చెప్పుతూ వచ్చినారు. ఆ అయిదు మహాభూతముల ద్వారా సంకల్ప ప్రకారము అనేక బ్రహ్మాండాలను సృష్టించి వాటిలో అంతర్భూతమయిన అనేక కోటి ప్రకృతిగలపిండాండాలను పరమాత్మయనే ఆకాశ భూతముసృష్టించినది.

ఆ ప్రకారము సృష్టి అయిన అనేక బ్రహ్మాండములలో వుండే ప్రకృతి గల దేవమానుషులు మొదలైన దివ్యదేహాలంతా పరతత్వమయిన ఆకాశ మహాభూతము యొక్క ప్రత్యక్ష సృష్టి గనుక ప్రకృతి గలదేహములన్ని పంచభూతాత్మకములుగా వుంచున్నవి గనుక ప్రకృతి

దేహాలకు బ్రహ్మానుసంధానముచేయదగిన శక్తి పుట్టే వరకు భగవద్గీతా వాక్యమైన 'వాసాంసిజీర్ణాని' అనే వాక్యప్రకారము దేహాంతరములు కలవు. ఆప్రకారము పరతత్వమువల్ల సృష్టిచేయబడిన ప్రకృతిదేహాల రక్షణనిమిత్తము గాను వాయు మహాభూతము తిర్యగ్జంతుకోటి అయిన పశువులు మొదలైన ప్రత్యక్ష జీవరాసులను సృష్టించెను. అవి పరతత్వముయొక్క సృష్టికావు గనుకనున్ను పశువులు మొదలయిన దేహములలో పరతత్వముయొక్క ప్రతిభాతి కాతగ్గ ప్రకృతిలేదు గనుకనున్ను ఆ జంతుకోటికి దేహాంతరాలున్ను లేవు. యంత్రములవలెనే వాటిలో ప్రాణవాయువు నిలిచివుండేవరకున్ను చరింపుచునుండి దేహములో ప్రాణవాయువు వదలగానే దేహాంతరములేక యంత్రము పగిలిపోయినట్టు విచ్ఛిన్నమైపోవును. అయితే తిర్యగ్జంతు కోటి ముఖ్యమయిన మహావాయుభూతముయొక్క సృష్టి గనుకనున్ను ఆ జంతుకోటిలో ఆకాశభూతవ్యాప్తి ప్రత్యక్షముగా లేకపోయినప్పటికిన్ని వాయుమహాభూత సమేతముగా కొదవ నాలుగు మహాభూతముల వ్యాప్తి సంపూర్ణముగా నుండుటచేత ఆ జంతుకోటి దేహములలో పంచేంద్రియాములు గలిగి ఆ యింద్రియాల ప్రేరేపణచేత ఆహార నిద్రాభయ మైథునాదులున్ను బాల్య యౌవన కౌమార వార్ధక దశలున్ను వాటికి కలిగి వున్నవి. అయితే అవి తల్లి బిడ్డ అనే వ్యవస్థలేక మూఢత్వముతో చిన్న దేహాలను పెద్దదేహములు ఆహారము చేసికొంటూ వుంచున్నవి.

పరతత్వముయొక్క సృష్టిఅయిన ప్రకృతిదేహాల సంరక్షణార్థమని ఆ ప్రకారము వాయుమహాభూతము సృష్టించిన తిర్యగ్జంతు కోటిచాలదని తోచి అగ్నిమహాభూతమువల్ల వృక్షాదులు ఓషధులు సస్యాదులు, తృణాదులు మొదలయిన అచేతన వస్తుకోటి వాయుభూత సృష్టియైన జంతురక్షణకొరకు సృష్టించబడినది. తద్వారా అగ్ని సృష్టించిన వృక్షగుల్మ సస్యాదులకున్ను, పరతత్వవ్యాప్తిన్ని, వాయుభూతవ్యాప్తిన్ని అంతు రెండు వ్యాప్తులున్ను లేనందున పంచేంద్రియ వ్యాపారములు తజ్జనితమైన ఆహార నిద్రాభయ మైథునములు లేక నున్ను జాగ్రత్స్వప్నసుషుప్తులనే అవస్థాత్రయము లేకనున్ను స్థావర రూపములను వహించి బాల్యము యౌవ

వస్తాడు. ప్రతిభాతి తక్కువవడే కొద్ది జీవాత్మ అశుద్ధు డవుతూవస్తాడు. ప్రకృతిలో పరమాత్మ ప్రతిభాతి పరమాత్మ సదృశమై పరమాత్మ తేజోంశము పూర్తిగా సంబంధించేవరకు యీ ప్రకృతి కష్టసుఖములు అనుభవింపుచూ వచ్చుచున్నాడు. పైన వ్రాసిన పాంచభౌతిక దేహ నివాసి అయిన ప్రకృతిని ఆత్మ అని పెద్దలు అనుచున్నారు; అందులో ప్రతిభాతి అయ్యే పరమాత్మప్రతిబింబాన్ని అంతరాత్మ అను చున్నారు; ప్రతిభాతిని కలగచేసే వస్తువు పరమాత్మ అని అంటారు.

ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ, అనేవస్తుత్రయము దేవ మాను షాది దివ్య దేహములలో అంతరించి వున్నవి. యీ దేహములలోని ప్రతిభాతులన్ని పరమాత్మవల్ల సృష్టి అయిన విన్ని, పరమాత్మ సమ ములున్ను అయినందున యివి పాంచభౌతిక దేహములు అయినవి. అటువంటి ప్రకృతి దేహములు యీ అడుగున వ్రాసిన భూతపంచకము ఆత్మత్రయమున్ను అనేటి యెనిమిది వస్తువులతో వృద్ధి అవుతున్నవి. యీ యెనిమిది వస్తువులతో వుండేవి స్థూలదేహములని పేరు వహించి వుంటున్నవి. స్థూలదేహాకృతి పూర్తిగా కిందవ్రాసిన పాణి పాదాదు లయిన అవయవాలతో యేర్పడగానే కిందవ్రాసిన జ్ఞానకర్మసాధనము లైన యింద్రియాలు జన్యములై ఆ యింద్రియాలకు పటుత్వము రాగానే వాటి సమూహాన్ని సూక్ష్మదేహ మని అనుచున్నారు. యీ సూక్ష్మదేహము శబ్ద స్పర్శ రూప రస గంధాలను గ్రహింపుచు జాగ్రి దవస్థలో బహు వ్యాపారములు విరామము లేకుండా చేయుచున్నది. అందులో వాక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణా లనే పంచేంద్రియములు బహు వ్యాపారమువల్ల అలియగానే మనస్సనే ఇంద్రియము తమకు యజమానుడు గనుక ఆ మనస్సనే యింద్రియములో లయించిపోవు చున్నవి. తర్వాత ఆ మనస్సనే యింద్రియము తాను అలిశేవరకు స్వప్నావస్థ అని వొక అవస్థను కల్పించుకొని ఆ అవస్థలో బహు వ్యాపారములను యేకాంతముగా చేయుచూ వుంచున్నది. ఆ మనస్సనే ఇంద్రియానకు అలసట పుట్టగానే అది ఆత్మ అనే జీవునిలో లయించి పోవుచున్నది. ఆలాగు మన స్సనే యింద్రియము ఆత్మలో లయించి నప్పుడు సుషుప్తి అవస్థ యని అనిపించు కుంచున్నది.

వాయుభూతజన్యమయిన తిర్యగ్జంతు దేహములకన్నిటికి త్వక్కు చర్మము మాంసము మొదలైన అన్ని వస్తువులు కలిగినా వాటివల్ల శిరఃపాణిపాదావయవాలు వుద్భవించినా అవస్థాత్రియము ఇంద్రియాలద్వారా వున్నా ఆకాశానికి బదులు వాయువే అంతరాత్మ అయి వాటి ఆత్మలను కల్పించెను గనుక ప్రకృతి దేహాలవలెనే తిర్యగ్జంతువులు సుషుప్త్యవస్థానంతరము 'యీ వరకు సుషుప్తి యనే అవస్థను నేను పొంది వుంటిని' అని అనుకోవడానకు నాటి దేహములలో వస్త్వంతరమున్ను తెలివిన్ని లేదు. ఆ వస్తువే పరమాత్మభాతి అని తెలుసుకోవలసినది. అగ్నిభూతజన్యమైన వృక్షాదులలో అగ్ని మహాభూతమే వాటికి ఆత్మగా తన ప్రతిభాతి ద్వారా యేర్పడి నందున ఆ సృష్టికోటిని తిర్యగ్జంతువులకున్ను భిన్నముగా మరివొకవిధమయిన త్వక్ చర్మ మాంసాదులతో వాటి దేహములు యేర్పడి శిరఃపాణి పాదాలుగా వుండే అవయవములు పరిష్కారముగా యేర్పడక యింద్రియములు జనించక బీజాంకురాలను మాత్రము కల్పించుచున్నది. అప్పుభూతముయొక్క సృష్టిలో ఆకాశము, వాయువు, వహ్ని యీ మూడు భూతముల ప్రతిభాతి లేనందుననున్ను స్వయం అప్పుభూతమే నదమునదులు మొదలయిన జలరాశి స్వరూపము ధరించుటచేత చలనశక్తి మాత్రము వాటికి కలిగి పురుషభూతములయిన ఆకాశ వాయువహ్నులు సృష్టించిన సృష్టికోటికి అప్పుమహాభూతము తన స్త్రీ స్వభావ ప్రకారము ఇతర మహాభూతముల సృష్టికోటిని కాపాడుతూ వున్నది. పృథివీభూతము తన సృష్టి అయిన మృత్తు మొదలయిన వస్తువులలో పయి నాలుగు మహాభూతముల వ్యాప్తి లేనందున చలనశక్తి కూడా లేకుండా పురుషభూతసృష్టిని ధరించి అప్పుసృష్టి సహాయ ద్వారా వాటిని పరిపాలన చేయుచూ స్థితిని పొందియున్నది.

యీ ప్రకారము యీ బ్రహ్మాండములలో సృష్టి అయిన సకలమున్ను ఆకాశ మహాభూతమువల్ల సృష్టి అయిన ప్రకృతి దేహముల పరిపాలనార్థమే గనుక యీ ప్రకృతి దేహములు మిగిలివుండే సృష్టికోటిని యేలుబడిచేయుచున్నవి, యీ యుక్తిమీద విచారించగా ప్రతి బ్రహ్మాండమునకున్ను అటువంటి పరమాత్మ ప్రతిభాతికి

యోగ్యమయిన ప్రకృతులు సృష్టికి ఆదిన్ని యిన్ని అని సంఖ్య నిర్ణ యింపపడి వుండవలెనని తోచబడు చున్నది. యింతే కాకుండా మహ మ్మదు యింగిలీషు శాస్త్రుల ప్రకారమున్ను మనశాస్త్రముల ప్రకార మున్ను యీ ప్రకృతులకంతా వొక్క కాలములోనే వుపసంహార మనిన్ని తోచబడుచున్నది. ఆ కాలమును జాతులవాండ్లు డే ఆఫ్ జడ్జి మెంటు అంటారు. మనవారు బ్రహ్మణాసహాముక్తి అంటారు. మహమ్మదు మతస్థులు కయామల్ కాదిన్ అని చెప్పుచున్నారు. సృష్టియొక్క విభ జన తెలిసేనిమిత్తము పైన వ్రాసిన వివరములవల్ల పరమాత్మవ్యాప్తి కొన్నిటియందు లేకుండా వుండునేమో అని సందేహించవలసినది లేదు. పరాత్పర మయిన ఆకాశమహాభూతమనే పరమాత్మ సర్వాంత ర్యామిగానున్ను, అణువులో అణువుగానున్ను మహత్తులో మహత్తుగా నున్ను ప్రత్యక్షపరోక్షాలుగా వుండే వున్నాడు. సృష్టియొక్క విభజన తెలియడానకు పయిఖుల్లన్ను వ్రాసినాను. పంచమహాభూతములే దీప దీపికా న్యాయముగా పరమాత్మ సంబంధములే గనుక సర్వంబ్రహ్మ మయం జగత్ అనేవచనము సత్యముగా నమ్మడానకు యేమిన్ని సందేహము లేదు.

ఆకాశ వాయు వహ్నిభూతాలు సృష్టించిన జంతుకోటికి బాల్య యౌవన కౌమార వార్ధక దశలు సంభవించడానకు కారణమే మనిన్ని ఆ నాలుగు ధశల సంచారకాలాలలో ఆ దేహములలోని అంతరాత్మలు దశాభేదరహితులైనా వారి దేహ చేష్టలద్వారా వారికే దశాభేదములు కలిగినట్టు అగుపడవలసిన దేమనిన్ని విచారిం చగా సృష్టియొక్క వృద్ధి నిమిత్తము స్థూల దేహములలో పాంచభౌతి కాలుగా వుండే ప్రకృతులనే బీజాలను యీశ్వరుడు ప్రవేశపెట్టి వాటి ధారణకున్ను పోషణకున్ను, అంకురోత్పత్తి చేయనున్ను మాయాశక్తి చైతన్య స్వరూపులయిన స్త్రీల యొక్క గర్భాలను కలగచేసి పురుష దేహసంగమ ద్వారా ఆ గర్భాలలో బీజాలను ప్రవేశింపచేసి, ఆ బీజము తగుపాటి అంకురము కాగానే మాయాశక్తి చైతన్యము పూర్తిగా కలిగి వుండే పృథ్వీభూతము మీద ప్రత్యక్షముగా యీ శ్వరుడు నిలుపుతాడు. అది మొదలుగా ఆ అంకురాన్ని పృథ్వీ మహా

సూతము వృద్ధిచేసి దాని సస్యకాలము వచ్చేవరకు పోషించుచూ వుంచున్నది. సమస్త విధములయిన దేహములను ధరించి పోషించే శక్తి పృథ్వీ మహాభూతముదే కాని యితర మహా భూతములది కాదు. అందుకు దృష్టాంత మేమంటే మనుష్యులేమి, మృగాములేమి, పక్షులేమి అన్ని జాతులున్ను వాటి పిల్లలను, గుడ్లను భూమి ధరించేపాటి పక్వమయ్యే వరకు మనుష్యులు విత్తనములు భూమిలో చల్లేటందుకు ముందర కొంతసేపు కుండలో నానవేసి వుంచి నట్టు కొంతకాలము జంతువుల బీజములను వాటి వాటి స్త్రీ జాతి గర్భాలలో వుంచుకుని అవి భూధారణకు పక్వములు కాగానే యీశ్వ రాజ్ఞ చొప్పున భూమిమీద ఆ యా స్త్రీ జంతువులు వుంచుచున్నవి. అది మొదలుగా పృథివీభూతము వాటినన్నిటిని యింకా తన మీద వుంచబడే యితర బీజములనున్ను అంకురాలు చేసి తర్వాత ఆ వృక్షా దులను, సస్యాదులనున్ను బెంచి మనుష్యులకు, జంతువులకున్ను కాపాడి యిచ్చి, వాటి ఫలము మనుష్యులున్ను జంతువులున్ను అనుభవించే టట్టుగా యీశ్వరాజ్ఞచేత కాపాడుతూ వస్తున్నది. యీ ప్రకారము వుత్పత్తి అయిన దేహములు పెరిగి పుష్టిని పొందక బీజప్రదానము చేయలేక వుండేకాలము బాల్యదశగానున్ను, పెరిగి పుష్టినిపొంది బీజప్రదానము చేయ నిచ్ఛయించే కాలము యౌవనదశగా నున్ను తర్వాత బీజోత్పత్తి చేయగలకాలము కౌమారదశగానున్ను, తదనంతరము విరామకాలము వార్ధకదశగానున్ను ప్రత్యేక ముగా అనుభవించడానకు హేతువులైనవి. కాష్ఠములో అగ్ని ప్రవేశించినట్టు ఆత్మాంతరాత్మలు దేహాలలో ప్రవేశించి వుంటారు గనుక కాష్ఠము వంగితే ప్రవేశించిన అగ్నిన్ని వంగినట్టు ఆత్మాంత రాత్మలు దేహసంబంధమైన దశలను దేహాలు అనుభవించేటప్పుడు తామున్ను అనుభవించేవారివలె అగుపడుతారుగాని, ఆనాలుగు దశాను భవాలు ఆత్మాంతరాత్మలకు యెంతమాత్రమున్ను వాస్తవముగా లేవని తెలియబడుచున్నది.

దేహాలయొక్క దేహములలో సత్వరజస్తమోగుణములు మూడున్ను భిన్నములై వుండవలసినదేమనిన్ని, వాటి ప్రవృత్తి నివృ

త్తులకు కారణ మేమనిన్ని విచారించగా సాత్వికగుణము ఆభాస మయితే రాజసగుణముగా పరిణమింపుచున్నది గనుక నున్ను రాజసము ఆభాస మయితే తామసముగా పరిణమించడము దృష్టాంతము గనుకనున్ను, సత్వగుణ ప్రధాను డయిన పరమాత్మ ఆత్మలో భాతిఅయి ఆభాతే 'అంతరాత్మ అయినది గనుక పరమాత్మవల్ల అంతరాత్మ జనించినట్టు సాత్వికమువల్ల అంతరాత్మ స్వభావ మయిన రజోగుణము దేహములో వుత్పత్తి అయినది. అంతరాత్మజననద్వారా ఆత్మకు చైతన్యప్రభా వము కలిగినది. గనుక ఆ చైతన్యము అంతరాత్మయొక్క ఆభాసమైనం దున రాజసగుణాభాసముగా వుండే ఆత్మస్వభావమైన తామస గుణము దేహములో జనించినది. ప్రకృతి దేహములలో పరమాత్మ - అంతరాత్మ - ఆత్మ యీ ముగ్గురి వ్యాపకము సిద్ధ ముగా నుండుటచేత వారి ముగ్గురిస్వభావాలైన సత్వరజస్తమో గుణాలున్ను వ్యాపించి యున్నవి. తమోగుణ జన్య మైనవి కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు; వీట్లను సాధారణముగా అరిషడ్వర్గము లనుచున్నారు. రజోగుణజన్య ములు అహంకార మమకారాలు. సత్వగుణజన్యములు శాంతి దాంతిక్షమలు. ఆత్మకు అంతరాత్మ ద్వారా చైతన్యము కలిగినదనే తెలివి ఈశ్వరకటాక్షము చొప్పున కలిగేవరకు దేహియొక్క దేహ ములో తమోగుణప్రవృత్తి కలిగి ఆత్మ అరిషడ్వర్గాలచేత బహు బాధపడుతూ వుంచున్నది. అటు తర్వాత పరంపరగా అంతరాత్మ కున్ను, నాస్థితికి కారణము పరమాత్మేగదా. నేను యే పాటివాడను ? జలబుద్బుదవత్తనే తెలివి కలిగేవరకు రజోగుణానకు ప్రవృత్తి కలిగి నాకు సమానులు వొకరుకద్దా నేను శానాపనులు చేసినాను, యింకా చేయగలుగుదును; అంటూ అహంకార మమకారాలచేత అంత రాత్మ వ్యధపడుతూ వుంచున్నది. పైన వ్రాసిన తెలివి అంతరాత్మకు కలిగి అంతరాత్మ ప్రకోపము అణిగిపోగానే పరమాత్మయొక్క దీప్తి స్ఫురత్తుగా ప్రకాశించి సత్వగుణ ప్రధానమై తజ్జన్యమైన శాంతి దాంతి క్షమాదులు ప్రవృత్తిని పొంది వుంచున్నవి.

నపుంసక లింగము పుల్లింగము స్త్రీ లింగ మనే లింగత్రయ

వాచకము లేల పుట్టినవి? వేటికి ఆ వాచకములు వాస్తవముగా వుప యుక్తము లని విచారించగా పరమాత్ముడు సృష్టినిమిత్తముగా వట బీజములో వటవృక్షము అణిగి వున్నట్టు ఆకాశభూత స్వరూప ముతో సమస్తములో అణిగినాడు గనుక, అట్లా అణిగిన వస్తువులన్ని బీజాలు అనిపించు కున్నవి గనుక వాటిని నపుంసక లింగా లని చెప్పవలసినది. అటువంటి బీజములను తానే ధరించి అంకురోత్పత్తి చేసే నిమిత్తము గర్భములో వుంచతగిన దేహముల నంతా పుల్లింగములుగా చెప్పవలసినది. అటు చేయబడే బీజప్రదానా లను భక్తి శ్రద్ధలతో ప్రతిగ్రహించి గర్భములో భద్రపరచి అంకురోత్పత్తిగ పూర్తి కాగానే మహా స్త్రీలింగభూతముగావుండే పృథ్వి యొక్క అధీనము చేయుచు వుండే దేహములంతా స్త్రీలింగములుగా చెప్పవలసినది. యీ లింగత్రయము పైన వ్రాసిన దేహములను విభ జనచేసి వ్యవహారించను జన్యమైనది గనుకనున్ను నపుంసక లింగవాచక యోగ్యమైన బీజాలు అదృశ్యాలు గనుక స్త్రీలింగ పుల్లింగ వాచక ములు ఆకాశమహాభూతము వాయుమహాభూతమువల్ల చేయబడ్డ సృష్టికోటికే వుపయోగములుగాని మిగిలిన భూతత్రయముయొక్క సృష్టికోటికి లింగవిభజన లేదు గనుక వుపయోగము లేదు. అయితే మానుషకోటి తమయొక్క సమయ సంకేతా లనే శాస్త్రములద్వారా అటువంటి సృష్ట్యంతరములగుండా స్త్రీలింగ పూర్వకమయిన నామధేయ ములు వుంచి వాడుకొనుచున్నారు.

పయిన వ్రాసిన ప్రకారము లింగవాచకములు వుత్పత్తి అవుట చేతనే శాక్తమతస్థులు "సర్వం శక్తిమయం జగత్" అని చెప్పేమాటకు బలకరముగా ఆత్మ- అంతరాత్మ- పరమాత్మ యీ ముగ్గురికిన్ని ఇచ్ఛాశక్తి - జ్ఞానశక్తి - పరాశక్తి అని నామాంతరాలు వుంచినారు. యీ మూడువస్తువులు వాస్తవముగా స్త్రీలింగవాచకములున్ను పుల్లింగవాచ కములున్ను కాక శుద్ధ నపుంసక లింగవాచకాలు అయివుండినా రామ అనేశబ్దములో రుద్ర సంబంధముగా వుండే అక్షరము వున్నదని దశరథ నందను డని చక్రవర్తి తిరుమహ అని రాముడికి వైష్ణవులు పేరుపెట్టి నట్టున్ను, శైవుడయిన అప్పయదీక్షితులు వగయిరాలు నారాయణ

అనే నామాన్ని శైవపరముగా అర్థముచేయను మిక్కిలి హింసపడ్డట్టున్ను ఆత్మ- అంతరాత్మ- పరమాత్మ- అనే వాచకములు పురుషపరముగా వున్నదని శాక్తులు స్త్రీపరముగా నామాంతరాలు వుంచినారు.

ప్రకృతి దేహములలో కొందరిని దేవతలుగానున్ను కొందరిని రాక్షసులుగానున్ను కొందరిని మనుష్యులు మొదలయిన వారుగానున్ను భేదము కలగచేసి అటువంటి తెగలలోను ప్రతి తెగకు అనేక ప్రకృతి భేదములుగా పరాత్పర వస్తువు సంకల్పము చేయవలసిన దేమని విచారించగా సృష్టి సంకల్పము అవాఙ్మానస గోచరమైన వస్తువుకు పుట్టడము చిద్విలాసార్థము గనుక సృష్టిని అఖండమున్ను, యేకాకారమున్ను చేస్తే రసము పుట్టదు. అందుకు దృష్టాంత మేమంటే-మనుష్యులు తమ నకలుగా విలాసార్థమై వొక మేళము జతపరచి నర్తనము చేయించి వేడుక చూచేటప్పుడు అందరున్ను వొక్క తాళము నేవాయించితే రసముగా వుండ దని, ఆడేటట్టుగా వొకరిని నియమించి, పాడేటట్టుగా వొకరిని నియమించి, తాళానకు వొకరిని నియమించి, సుతిపట్టడానకు వొకరిని నియమించి యీ ప్రకారము అనేక వాద్యములకు అనేకులను ప్రత్యేకముగా వుండేటట్టుచేసి మళ్లీ అందరిని వొక తావులో చేర్చి వొకనికి వొకణ్ని పై పోటీచేసి తన్ను 'శాబాసు' అనవలె నని ప్రతిపురుషుడు తనకు నిమకమయిన వాద్యాన్ని శ్రావ్యముగా వాయింపుచునుంటే యెట్లా మనము వారి యితరేతర ధిక్కారాలను పరస్పరానుకూలతనున్ను చూచి ఆనందిస్తామో తద్వత్తుగా సర్వోత్తమమయినవస్తువుయీ దేహములనున్ను వాటిలోని ప్రకృతులనున్ను భిన్నములుచేసి-వారి మనస్సు వాక్కు-కాయముల - కర్మములద్వారా వారు చేసే చేష్టలను చూచి ఆనందింపుచున్నది.

సప్తగ్రహముల పేళ్లతో వుండే బృహస్పతి, శుక్రుడు మొదలయిన వారిని సప్తబ్రహ్మండము లనే చెప్పవలెను. ఆ పేళ్లు గలవారు బ్రహ్మండ స్వరూపు లయితే యీ బ్రహ్మండానికి వచ్చి శృతులకు వ్యాఖ్యానమయిన స్మృతులుచేసి యీ బ్రహ్మండము వదలి దేవతలు, రాక్షసులు మనుష్యులతోను వారు సహవాసము యెట్లా చేసినారని యోచించి విచారించగా పరమాత్మ జ్యోతిర్భూత మయిన సూర్యుణ్ని

రూపములయిన జ్యోతిస్స్వరూపములు గాక రాత్రిళ్ళు భూపతన మవుతూవుండే కొన్ని తేజస్సమూహాలు నక్షత్రాలుగా తోచబడుచున్నవి. అవి భూమిని అగుపడే మిణుగురులవలెనే ఖేచరమార్గములో వుండే మిణుగురులు గాని నక్షత్రములు గావు గనుక నున్ను ఆ మిణుగురులు బృహత్తులు గనుకనున్ను అవి అధోభాగమునందు పడేటప్పుడు ఆ బృహత్తులయిన మిణుగురులు నక్షత్రములవలెనే మనకు అగుపడుచూ వుండుటచేత మిరియాలలో నుండే నల్లరాళ్ళను వాటి యేకరాశిగతివల్ల వాటి సమూహదర్శన మైనప్పుడు రాళ్ళను మిరియా లనుకున్నట్టు ఆ బృహత్తులైన మిణుగురులను నక్షత్రములని భ్రమ పడవలసియున్నది.

యిటువంటి అనేకకోటి బ్రహ్మాండములలో కొన్ని బ్రహ్మాండములయిన బృహస్పతి మొదలయినవారు త్రుటికాలముకూడా జ్యోతిర్భూతమునకు చేసే ప్రదక్షిణము భంగము కాకూడకుండా తిరగవలసినవారై వుండగా వారు యీ బ్రహ్మాండమునకు పురుషాకృతితో వచ్చి యిక్కడి పిండాండము లయిన మనకు స్మృతులుచేసి యిచ్చి హితవు యెట్లా చేయగలుగుదురు? గనుక, వాటి వాస్తవము యేమంటే భృగు బృహస్పతి మొదలైన వారు మన అపేక్షయా దేవతలు గనుకనున్ను స్వేచ్ఛావిహారులై మన సూర్యుణ్ణి ఆశ్రయించి వుండే కొన్ని బ్రహ్మాండములకు వెళ్ళుతూ వాటిలో విస్తారముగా వసింపుచున్నందున నవాబు వసించే పేటను నవాబుపేట అని గుర్తు నిమిత్తము నవాబు పురస్సరముగా పేటను తెలియ చేసినట్లు బృహస్పతి మొదలైన వారి గమనాగమనములు పట్టి జ్యోతిశ్శాస్త్రములో గ్రహగతులు గణిత మూలకముగా నిర్ణయించడమునకు గాను యీ మహాపురుషుల పేళ్ళనే ఆ బ్రహ్మాండములకు సంకేత వాచకములైన పేళ్లుగా నిర్ణయించి యుండవలె నని తోచుచున్నది.

నేను యెనిమిదో లంజం భాగలో వుండే కన్యాకుమారి మొదలుగా యిరువైయారో భాగలో నుండే కాశీపట్టణమువరకు దేశాటనము చేయడములో అహఃప్రమాణములు దేశదేశానకున్ను భేదింపుచు వచ్చుచున్నవి. యీ ప్రకారము అహఃప్రమాణములు దేశ

దేశానకు భేదించడమునకు కారణ మేమని విచారించగా యీ బ్రింహాండముయొక్క మధ్యభాగమైన నిరక్షదేశములో రాత్రి పగలున్ను సరిగా ముప్పదేసి గడియల వంతున దిన ప్రిమాణ మవుచున్నది. గనుక సూర్యోదయాస్తమయములు సమముగా అవుతూ వుంచున్నవి. అందుకు కారణము అక్కడి వారికి సూర్యబింబ దర్శనము వుదయకాలమందున్ను, అస్తమయకాలము నందున్ను చక్కని అభిముఖము కావడముచేత అదిమొదలుగా వుత్తరపుదిక్కు వుదయాస్తమయకాలములలో సూర్యదర్శనము యధోచితమయిన పార్శ్వభాగముగా క్రమక్రమముగా అవుతూ వుండుటచేత బ్రంహాండము యొక్క వున్నత ప్రదేశములలో వసించే వారికి సూర్యదర్శనము అయ్యే ప్రమాణకాలము భూమియొక్క చక్రాకార చలనముచేత క్రమక్రమముగా తక్కువవుతూ వచ్చుచున్నది. యీ బ్రింహాండమునకు చలనశక్తి కలిగి వుండడానికిన్ని, యీ బ్రంహాండము సూర్యబింబానికి ప్రదక్షిణముచేయుచూ వుండడానికిన్ని యీ అహఃప్రమాణభేదము వొక్కటే దృష్టాంతముగా వున్నది. యిదిన్నిగాక యింగిలీషు దేశపు సముద్రసంచారులలో వొకడు యీ పరీక్షనిమిత్తము వొక ప్రిదేశములోనుంచి కావలసిన వస్తుకొన్ని సంవత్సరములకు వాడలో వుంచుకొని తూర్పుగా పోతూవుండేటట్టు వాడను సాగిస్తూ వచ్చినాడు. తూర్పుదిక్కు ఫలాని దనే జ్ఞానము సూర్యోదయమువల్లనే పుట్టుచున్నది గనుక ప్రిత్యహము సూర్యోదయమునుపట్టి తూర్పు తెలిసి పోతూవుండేకొద్ది సుమారు కొన్ని సంవత్సరములలో బయిలువెళ్ళిన స్థలమే చేరినాడు. అట్లా యెందువల్ల బయిలువెళ్ళిన స్థలమే ఆ పురుషుడు చేరినాడంటే బ్రంహాండములో వొకపక్క వసించే వారికి తూర్పుదిక్కు బ్రంహాండముయొక్క చలనద్వారా వారి పృష్ఠభాగమునందు వసించే వారికి ఆ తూర్పుదిక్కు పడమటి దిక్కౌతున్నది గనుక తూర్పుఅని తోచే ప్రిదేశమునుంచి బయలుదేరి అక్కడికి పడమర వెళ్ళి మళ్ళీ అక్కడనుంచి తూర్పు దిక్కుగానుండే ప్రిదేశమునకు తిరుగుతూ వస్తే బయిలు వెళ్ళిన తావు చేరడము వింతకాదుగదా! యీ దృష్టాంతము

వల్లనున్ను యీ బ్రింహాండమునకు చలనశక్తి కద్దనడానకు సందేహములేదు. గోళము తిరుగుతూవుంటే గోళముమీద నుండేవారికి నిలిచిన స్థలము కదిలికె అయితే తెలియదా అనిన్ని, గోళము తిరిగితే జంతువులు తలక్రిందుగా పడవా అనిన్ని కొందరు సందేహిస్తారు; ఆ సందేహాము యెంతమాత్రము నిమిత్తములేదు; యెందువల్లనంటే పెద్దవాడలలో వుండేవారికే వాడనడవడము తెలియక వుండగా యింత బృహత్తైన గోళముమీద వుండేవారికి గోళచలనము యెట్లా తెలుసును గనుక? సూదంటు రాయిని పొడుగుగా యెత్తి కింద సూదిని వుంచితే భూమిని ఆధారముగా చేసుకొనివున్న సూది రాయిలోవుండే ఆకర్షణ మహిమచేత పైకిలేచి రాయినిఅంటి వేలాడుచూ వుంచున్నదిగాని భూమిమీద పడదు గనుక, యీ గోళమునకువుండే ఆకర్షణ మహిమ చేత గోళముమీదనుండే సృష్టికోటి తలక్రిందుగా పడవలసిన నిమిత్తము యెంతమాత్రమున్ను లేదు.

---

## పందొమ్మిదవ ప్రకరణము

మ్యార్చి నెల ౨౨ తేది బదరుగంజు అనే వూరు చేరినాను. యిదిన్ని పదిఅంగళ్ళుగల బస్తీవూరు. యీ బదరుగంజునుంచి గంగా భవాని తూర్పుగా సముద్రగామి కావడానకు సాగిపోవుచున్నది. ఆ పెద్దప్రవాహాము గుండా కలకత్తాకు సాగిపోతే సముద్రములో ప్రవేశించి కొంతదూరము సముద్రములో పడమరగా వచ్చి మళ్ళీ హుగ్గుళి అనే నది ముఖద్వారములో చొచ్చి దక్షిణముగా తల్లి కలకత్తాకు చేరవలసినది గనుకనున్ను అటు పోవడానకు యిలాగంటి బజరాలు మొదలయిన నావాలు నడిపేవారికి నీళ్ళ పొలుకువ తెలియదు గనుకనున్ను అటుపోవడము యిరువై దినములు చుట్టుగనుక నున్ను అటు వెళ్ళే గంగాభవానిధార సుందరవన మనే అతిఘోరమైన యడివి మధ్యే పోతున్నది గనుకనున్ను ఆ అడివిలో నుండే వ్యాఘ్రాదులు మొదలైన దుష్టమృగములు మనుష్యులను బాధపెడుతూ వుండుటచేత గట్టున దిగడానకు వయిపు లేక నావాలమీదనే భోజన మజ్జనాదులు

గడపవలసినది గనుకనున్ను గంగాభవానిలోనుంచి బదరుగంజు అనే వూరివద్ద చీలి దక్షిణముగా ప్రవహింపుచూ కలకత్తాకు పొయ్యే జలంగి అనే పేరు గలిగిన గంగధారలో ప్రవేశించి కలకత్తాకు సాగి వచ్చినాను. యీ జలంగినది గంగాప్రవాహము తక్కువైన దినములలో బహు హ్రస్వమై కొన్ని మిట్టతావులలో వొక మూర, వొకటిన్నరమూర లోతు వుంచున్నది. అట్టి తావులలో వస్తూవుండే సరుకు నిండిన పడవలు సాగక దినాలవెంబడి సమూహములుగా నిలిచి, వచ్చే పొయ్యే పడవలకు దారికూడా లేకుండా నిబిడీకృతముగా వుంచున్నవి. అట్లా తక్కువ నీళ్ళు గల ప్రదేశములకు గట్టానా అని యీ నావవాండ్లు పేరు పెట్టినారు. అట్టి తావులలో వొక సమిషమైనా ఆలస్యపడకుండా నాతోకూడావుండే మనిషికట్టుద్వారా సమీప గ్రామవాసుల సహాయద్వారానున్ను అక్కడ నిలిచివుండే నావ మల్లాలద్వారా నాబజరా వుల్లాకులతో యివతలికి సాగివచ్చినాను.

మ్యాచిౝ నెల ౨౬ తేది పటకాబాడి యనే గొప్పవూరు చేరినాను. యీ వూరుచేరేలోపల గట్టానాలు శానా తగిలినవి. యిది మొదలు జలంగినది పల్లపు ప్రదేశములో ప్రవహిస్తూ వచ్చినది గనుక నీళ్లుకావలసినంత నదిలో వుంటూవున్నవి. యీ జలంగినది సర్పాకారముగా బహుచుట్లు చుట్టి ప్రవహింపుచున్నది. గనుక వుత్తరమునుంచి దక్షిణము పోవడములో మళ్ళీ మళ్ళీ వుత్తరమే చేరి, భోజనము చేసిన వూరికి గట్టున రెండు గడియల దూరములో వుండేవూరు సాయంత్రము చేరుతు వచ్చినాము.

గంగాభవాని ప్రవాహము పుష్కలముగా వుండేకాలములో బదరుగంజుకు పడమరగా వుండే మాహాౝగంజు భగవాౝగోలా అనే వూళ్ళవద్దనుంచి వొక ధారముక్కుషూదాబాదు (మూర్షిదాబాదు) కాసంబాజారు (కాసింబజారు) బురంపూరు అనే షహర్లమీద వచ్చి యిప్పుడు నేను వచ్చే ధారలో కృష్ణనగరు అనే వూరివద్ద కలియుచున్నది గనుక ఆ ధార కలకత్తా వెళ్ళడానకు నిండా సూటి యని ఆదారిని అన్నినావాలు వెళ్ళుతున్నవి. యిప్పట్లో ఆ ధారలో వుదకములేదు గనుక యీజలంగినదిగుండా అన్ని నావాలు వస్తూ

పోతూ వుంచున్నవి. కొందరు యింగిలీషు దొరలు సుందరవనపు నదిధార పూర్వోత్తరములు తెలిసినవారిని కలకత్తాలో బజరాల మీద యెక్కించుకుని గంగాభవానిలో యీ నీళ్ల తగ్గుసంబంధమైన శ్రమను పొందకుండా కలకత్తానుంచి కాశికి ఢిల్లి మొదలైన దేశములకు వెళ్ళుతారు. యీ గంగామహానదిలో గొప్ప దేహములు కల మొసళ్ళు, కూర్మములు, మత్స్యములున్ను అమితముగా వున్నవి. వొక గొప్ప మత్స్యమును నా బజరామల్లాలు గాలమువేసి పట్టిరి. అది పురుష ప్రమాణము పొడుగున్ను, అందుకుతగ్గ లావున్ను కలిగి వుండినది. దాని కళేబరమును నాతోకూడావున్న పరిజనము సుమారు యిన్నూరుమంది రెండు మూడు దినములుగా భక్షణచేసినారు. యింత గొప్ప జలచరములు గంగలో వసించినా యెవరినిన్ని హింసపెట్టినట్టు యీవరకు వదంతి లేదు. సుందరవన మనే అడివిమధ్యే ప్రవహించే గంగలో సముద్రసంబంధమైన జలచర జంతువులుకూడా వచ్చి ప్రవేశించి వుంచున్నవి గనుక అవి మనుష్యులను బాధపెట్టుచున్నవని చెప్పుతారు. యీ జలచరజంతువులేమి, క్రూరములైన స్థలచరజంతువులేమి వీటి ఆత్మలలో పరమాత్మ ప్రతిభాతి ప్రత్యక్షముగా లేక వుండుట చేత జ్ఞానవిహీనములైన చిన్నదేహాలను పెద్దదేహములు భక్షణచేయుచూ యితరులకు వుపద్రవకరములుగా వుంచున్నవి. మనుష్యులు మాత్రము జ్ఞానయుక్తులై వుండేటందువల్ల పరస్పరభక్షణ లేకుండా, ప్రకృతి లేక యంత్రవత్తుగా వుండే అజ్ఞాన జంతు దేహములను దూరము విచారించి తమ ప్రభావము తెలుసుకునేదాకా భక్షిస్తూ జ్ఞానోదయము స్ఫుటముగా కలిగినవెనకగాని సంకేతబోధవల్లగాని అటువంటి భక్షణలను చాలించి అగ్నిమహాభూతసృష్టితో చేరిన వన్యాదులు భక్షిస్తూ వచ్చి పిమ్మట తుర్యదశను పొందినవెనక హఠయోగ రాజయోగలంబికా యోగములచేత తమలోని వాయువునే తాము భక్షణ చేయుచు దివ్య దేహధారణ చేసి వుంటారు.

యీ జలంగినది అనేక తిరుగుళ్ళుగా ముందువచ్చి వెనకకు పోతూ వుండేటందున యిందులో బజరామీద వచ్చేటప్పుడు బజరా తిరుగుడువల్ల సూర్యబింబము వొకపక్కనుంచి మరివొక పక్కకు

ర్థము లేదు గనుక సమస్త జగదాధార మయిన వస్తువు అవాఙ్మానస గోచరమై శుద్ధశూన్యముగా ధ్యానించ పడి వున్నది. గనుక నున్ను నాస్తికులు ప్రపంచము యే స్వభావముచేత జరుగుచున్నదని అంటారో ఆ స్వభావాన్నే జ్ఞానులు పరతత్వ మని అంటారు. స్వభావమనే వాచకము పరతత్వమనే వాచకమునకు భిన్నమే గాని వస్తుభేదము వుభయుల తాత్పర్యములో నున్ను లేనట్టు తోచబడు చున్నది. గనుక నాస్తికులున్ను జ్ఞానులకు సహపాఠులే గాని వేరే కాదు.

యేప్రిల్ నెల ౧ తేది కృష్ణనగర మనే గొప్ప వూరు చేరినాను. ఈ వూళ్లో యిక్కడి రాజు అనే వొక జమీన్దారుడు వున్నాడు. శానా అంగళ్లు వున్నవి. సకలపదార్థములు దొరుకును.

యిక్కడ కుంఫిణీవారు వచ్చేనావాలు వగయిరాలకు వాటిదాంట్ల సంఖ్యమీద నున్ను, నావాల గాత్రిముల మీదనున్ను నిరుకులు యేర్పరచి టల్లా అనే తీరువ తీస్తారు. ఆ సుంకము తీరువ వసూలు చేయడానకు వొక కలకటరు యీ వూళ్లో వుంటాడు. ఆ టల్లా అనే తీరువ నిమిత్తము నా బజరాకు వుల్లాకు అనే వాడకున్ను యేడున్నర రూపాయి యిచ్చినాను. యీ ప్రికారము వసూలు చేసే తీరువ రూకలకుండా కుంఫిణీవారు శిబ్బంది వుంచి జలంగినది అనే పేరు కలిగిన గంగధారలో నుంచి బదరుగంజు వద్ద చీలే ప్రిదేశము మొదలు నదిలో మిట్టలు పెట్టకుండా సూత్రిపు పడవలకుండా మన్ను యెత్తి మిట్టలను సమపరచి నదిలో కొట్టుకొని వచ్చే చెట్లనున్ను పగిలి పొయ్యే నావాలపలకల నున్ను, కొయ్యల నున్ను, యెత్తి పారవేసి నావాలు రావడానకు వయిపు చేయుచుంటారు. యీ జలంగి నది ధార చిన్నది గనుక ఈ వుపాయము కుంఫిణీవారు చేయడము బహు అగత్యముగా నాకు తోచినది. మన్ను యెత్తే సూత్రిపు పడవ వొకటి బదరుగంజువద్ద వున్నది. ఆ పడవకు గొప్ప పారచిప్పలను సూత్రిము కట్టి తగిలించి వున్నారు. పడవలలో మనుష్యులు సూత్రిపు తాళ్ళు పట్టి యీడిస్తే ఆ పారచిప్పలు మన్నుతోవ్వి పడవలో తెచ్చి వేస్తున్నది. సూత్రిపుపడవ తయారుచేయడానకు యిరువై వేల రూపాయలు ఖర్చుతగిలి వుండునని తోస్తున్నది.

సదరహీ కృష్ణనగరము దాటి రాగానే నదీయ,నద్యా,అనిన్ని నవ ద్వీప మనిన్ని త్రినామము కలిగిన విద్వద్గ్రామమువద్ద మక్కుశూదా బాదుకుండా వచ్చేభాగీరథిఅనే పేరు కలిగిన గంగధార కలియుచున్నది గనుక యిక్కడ నద్యా మొదలుగా ధారగొప్పఅయి అరకోసు వెడల్పున ప్రవహింపుచున్నది. ప్రవాహపులోతున్ను మిక్కిలీగంభీరమై వున్నది.

పయిన వ్రాసిన నదియ్యా అనే గ్రామములో కొందరు జమీన్దార్లవల్ల కొన్ని పాఠశాలలు యేర్పరచబడి అందులో అనేక విద్యార్థులను పోషించేటట్టు నియమముచేసి వున్నది గనుక గౌడు లలోనున్ను, ద్రావిళ్ళలోనున్ను నన్యాటిదాకా సుమారు శాస్త్రపాఠ ములు చదువుకొంటూ వుంటారు. యిక్కడ శిక్షాధికారులు గౌడ బ్రాహ్మణులుగాని, ద్రావిళ్లు కారు. వారి పాండిత్యము ప్రసిద్ధికెక్కి వున్నది.

యేప్రిల్ నెల ౨ తేది శాంతిపూరనిన్ని సహతిపూరనిన్ని ద్వినామము కల విద్వద్గ్రామము చేరినాము. యిదిన్ని గొప్పవూరు. అన్నివిధాల నద్యాకు సరిపోలివున్నా విద్యార్థులున్ను, శిక్షాధి కారులున్ను మిక్కిలీ లేరు. యీ శాంతిపూరుకు ముందు కలనా అనే గొప్పగ్రామ మున్నది. యీ వూరు మొదలుగా టెంకాయ తోపులు, పోకచెట్లు నిండా చూస్తూవస్తాను. మనస్వదేశము వదిలిన వెనక యీ వరకు యెక్కడా టెంకాయ తోపులు చూచినవాణ్ని కాను. టెంకాయచెట్లు, పోకచెట్లు శానా ప్రదేశములలో లేకవుండినా ఆ ఫలములు అన్యే ప్రదేశములలో లేని దేశస్థులు తెప్పించుకుని అవశ్యము వాడికెలోకి తెచ్చుకుంటూ వున్నారు. యీ హిందూ దేశములో యీ వుభయ ఫలములకు యింత అవశ్యకత యీశ్వరుడు కలగ చేశినాడు.

నదియ్యా అనే గ్రామము మొదలు యీ గంగధారలో సముద్రము యొక్క పోటు పాటు ప్రత్యహము రెండుమార్లు తగులుతూ దక్షి ణము రాగారాగా ఆపోటుపాటు యొక్క జోరు అవుతూ వస్తున్నది. సకల విధమైన నావాలకు రాళ్లతోను, మట్టితోను బళువుకలగచేసి లంగరు అందముగా కొయ్యలతో నద్యావద్ద కట్టి నావాలకు నిత్యము

వేస్తూవస్తారు. లంగరులు లేకనే యీ వరకు నావాలను తాళ్లతో గట్టున మేకులు పాతి దిగగానే బేపర్వాగా కట్టుతూ వచ్చినట్టు నద్యా మొదలు రావడము లేదు. పోటుకు మనిషి పొడుగుకు అధికముగా నీళ్లువచ్చి పాటుకు తీశిపోతూ వస్తున్నవి. యీ పోటు పాటు కాలములో కలకత్తాకు పోవలసినవారు పాటులోను, అక్కడనుంచి వచ్చే వారు పోటులోను నావాలను నడిపిస్తూ వస్తారు.

౩ తేదీ హుగ్గులీ అనే కసుబా బస్తీ చేరినాను. యిక్కడ కలకటరు వగైరా అధికారస్థులున్నూ, కొంతదండున్ను వున్నది. యీ హుగ్గులీలో సుందరమైన యిండ్లు జాతులవారు గంగాతీరమునందు శానాగా కట్టివున్నారు.

౪ తేదీ బారకుపూరు అని జాతులవాండ్లవల్ల చెప్పబడుతూ నల్లవాండ్లవల్ల ఆచానక్కు అని చెప్పబడుతూ వుండే ద్వినామధేయము గల వూరు చేరినాను. ఈ బస్తీవూరు కలకత్తాతో చేరి కలకత్తాను అంటుకొని వున్నది. యీ బస్తీలో గౌరన్ మెంటు వారిది వొక గొప్ప యిల్లు తోట బహుసుందరముగా కట్టించబడివున్నది. యిక్కడ కొంత దండుకూడా వున్నది. యీ బస్తీ కలకత్తాకు సమీపముగా ౬ కోసుల దూరములో వున్నది గనుకనున్ను, విశ్రాంతి ప్రదేశముగనుకనున్ను యిక్కడఅనేకులు సౌఖ్యార్థముగా మంచితోటలు,యిండ్లు బంగాళాలు కట్టించివున్నారు. అందులో గ్రీష్మకాలములో కలకత్తా నివాసులైన గొప్ప దొరలు వచ్చి వాసము చేస్తూ వుంటారు.

యీ వూరికి యెదురుగా నదికి అవతలపక్కను శ్రీరాంపూరు అనే వొక వొలందావారి కసుబాబస్తీ గ్రామము అనేకమయిన గొప్ప మిద్దెలు కలిగివున్నది. హుగ్గులీ మొదలుగా ఆచానక్కువరకు నదికి యిరుపక్కలా యిండ్లు, తోటలు, మిద్దెలు అసంఖ్యముగా కట్టివున్నవి. అందులో కొన్ని బస్తులు ఫ్రాంసువారివిగానున్ను కొన్ని డేన్మార్కువారివిగా నున్ను, కొన్ని డచ్చివారివిగానున్ను అద్యాపి ఆ యా జాతివాండ్ల యేలుబడిలో వున్నవి గనుక నొచ్చి పోయిన బంగాళా దేశస్థులు యింగిలీషువారిన్యాయ ప్రకారము అప్పులవారి నిమిత్తము కలిగే రాజదండనవల్ల తప్పించుకొనే కొరకు చెన్నపట్టణమువద్ద పులిచేరికి వంజి

నది. మాయాశక్తి దుష్టనిగ్రహార్థము మహాకాయము ధరించి దుష్టనిగ్రహము అయిన వెనుక తన మహాకాయము తనకు అసహ్యముగా తోచినంతలో తన చైతన్యాన్ని సౌమ్యకాయము సృష్టించుకొని అందులో ప్రవేశపెట్టి లోగడి మహాకాయమును వదిలి నంతలో మహాశక్తికి నాథుడైన సాంబమూర్తి ఆ మహాకాయ మోహితుడై ఆ మహాకాయమును చంకపెట్టుకొని పరవశుడై దేశాటనము చేస్తూ వచ్చినట్టున్ను లోకశిక్షకులలో వొకడయిన అతను పరవశుడై వుండుటచేత లోకమునకు క్షేమవిరోధ మయినట్టున్ను లోకరక్షకుడయిన విష్ణువు లోకముయొక్క క్షేమముకొరకు చక్రాయుధధరుడై, అటుతిరుగుతూ వున్న సాంబమూర్తిని వెంబడించి అతని చంకనుండే కళేబరమును చక్రాయుధముతో తునకలుగా కత్తిరించుతూ వచ్చినట్టున్ను అవి భూమిలో రాలుచు వచ్చినట్టున్ను అటుకత్తిరించిన తునకలలో యీ కలకత్తాలో ఆ మహాకళేబరముయొక్క చేతివేళ్లు పడ్డట్టున్ను యిక్కడికి వుత్తర దేశమందుండే కామరూప దేశములో యోనిపడ్డట్టున్ను యింకా యితర ప్రదేశములలో అనేక అవయవాలు పడ్డట్టున్ను అటు అవయవాలుపడ్డ ప్రదేశములంతా శక్తిప్రత్యక్షకరములై ఆరాధించిన వారికి అభీష్టసిద్ధులు చేస్తూ వచ్చేటట్టున్ను యిక్కడి స్థలపురాణ మహిమ గనుక యీ కలకత్తా ప.హారుకు మూడుకోసుల దూరములో దక్షిణభాగమందు వొక కాళీ గుడి వున్నది.

ఆ గుడి దక్షిణదేశమువలెనే నిండా సుందరముగా కట్టివుండక పోయి నప్పటికిన్ని విశాలమైన గర్భగృహము ముఖమంటపము కలిగి వున్నది. ఆ గుడిసమీపముగానే గంగవాగు వకటి పారుతూవున్నది. ప్రతిదినము ఆ శక్తిని యీ దేశపు బ్రాహ్మణపండ్యాలు పూజ చేయుచు వుంటారు. మేకలను, మేకపిల్లలను లోకులు ప్రతిదినము తెచ్చి బలులుయిచ్చి పోతారు. శుక్రవారము, ఆదివారము విశేష బలులు పూజలు జరుగుతున్నవి. నవరాత్రిళ్లలో యిక్కడ మహోత్సవమును జరిగించి యీ దేశములో మహిషములు లేక పోయినా దేశాంతరాలలో నుంచి అనేకములుగా తెప్పించి

యీగుళ్ళలో నున్న వారివారి యిండ్లలో పెట్టి పూజచేసే బింబాల ముందరనున్న బలులు యిస్తారు. యీ కలకత్తాలోనున్న చుట్టు పక్కలనుండే బంగాళీదేశస్థులకు యిక్కడ విలశిల్లివుండే కాళి ప్రత్యక్ష దేవతై వారిభక్తిని మిక్కిలిగా ఆకర్షిస్తూ వున్నది. యీ గుళ్లో వుండే కాళిప్రతిమ బహుస్థూలముగా వున్నది. బహుమంది గుళ్ళలో పునశ్చరణ చేయుచుంటారు. గుడిచుట్టూ పూజాద్రవ్యాలు అమ్మే అంగళ్ళు శానావున్నవి. జపాకుసుమాలు సంపెంగలు వగయిరా పుష్పాలు మనిషి చెయ్యెత్తు పొడుగున మాలలుకట్టి అపరిమితముగా సదా అమ్ముతూ వుంటారు. ముప్పయి రూపాయిలలో వస్త్రసమేత ముగా షోడశోపచార పూజ అవుతున్నది. భిక్షుకులు బ్రాహ్మణులుగా నున్న బంగాళీలుగా నున్న ప్రతిదినము వెయ్యింటికి తక్కువ లేక గుడి చుట్టూ వుంటారు. యీ దేశమందు గవ్వలు మారడముచేత పిడికెడేశి గవ్వలు యిచ్చినా యిరువై రూపాయలు దక్షిణకు పట్టుచున్నవి. పూజ చేసే లోకులు మిఠాయి మొదలైన పక్వపు పదార్థములు పండ్లు పచ్చిబియ్యమున్ను నైవేద్యము పెట్టుతారు. గుడి పూజారులు నిత్యము పక్వాన్నము మొదలయినవి నైవేద్యముచేసి, తాము తిని బ్రాహ్మల కిస్తారు. దేవీప్రతిమను సువర్ణముతో దాపుడు నాలికెను చేసి యెనిమిది భుజములు కల్పించి లలాటమందు సిందూరము వుంచి భీకరాకారముగా అలంకరించి వుంటారు. ముఖమంటపముకన్నా గర్భగృహము, రోమ్ముల లోతు పల్లములో వుంచున్నది. నవరాత్రిళ్ళలో ఈ బంగాళీదేశస్థులు భీకరాకృతిగా మృత్తుతో దేవి ప్రతిమలుచేసి వాటికి వర్ణరేఖలు మొదలయినవి పూయించి వుత్సవానంతరము విభవముకొద్ది వూరేగింపుచేసి గంగలో కలుపు తారు. ఆ వుత్సవాలకు మద్యపానాలు వేశ్యలపొందున్ను బహుశా జరిగి చూడ వింతగా వుంచున్నది. ఆ విభవము మతాంతరస్థులకు యీ మతస్థులను నింద చేయడానకు ప్రబలమైన ఆకరముగా వున్నది.

యిది కన్యాకుమారీ క్షేత్రమంటారు. యిక్కడ పురుషులు స్ఫురత్తులేక దీనత పొందివుంటారు. స్త్రీలున్నా నిండా సౌందర్య వతులుకారు. ౧-౨ మూరల బట్టతో దేహాచ్ఛాదనమంతా చేసి తల

మీాద ముసుకుకూడా వేసుకొంటారు గనుకనున్ను రవికెలు తొడిగే సంప్రదాయము లేదు గనుకనున్ను అవయవాలు పూరాగా కప్పబడి వుండడములేదు. పురుషుల దీనత్వమున్ను, స్త్రీల ఆచ్ఛాదనమున్ను మళయాళానకు సరిపోలివుండినా స్త్రీల సౌందర్యముమాత్రము వ్యతిరిక్తముగా లోపముపడివున్నది. బంగాళీభాష హిందుస్తాని ఆభాసముగా బడా అనడానకు బోడా అనే వతుగావున్నది. బంగాళీ అక్షరాలు దేవనాగరానకు కొంచెము భేదము కలిగివున్నవి. పురుషులు కృశాంగులు గనుక ప్రయాసకు యెండకు వోర్చలేరు. శైత్యోపచారాలు తైలలేపనము ప్రత్యహాముచేసి శీకాయ మొదలయిన నూనె పొయ్యే పదార్థాలతో తోమి కడగకనే స్నానముచేసి వొళ్ళు తుడుచుకుంటూా వస్తారు. శీకాయ యిప్పిపిండి మొదలయిన పదార్థాలు యీ దేశమందు దొరకవు.

యీ దేశాన్ని గౌళదేశమనిన్ని, విరాట దేశమనిన్ని చెప్పుతారు. యీ దేశమందు శిష్టులయిన బ్రాహ్మలుకూడా సహజముగా మత్స్యభక్షణ చేయుడముమాత్రమే కాకుండా యిచ్చటి వారు సకల బ్రాహ్మణులున్ను ఆ రీతినే చేస్తూ వుందురనే సిద్ధతాత్పర్యులై నా వంటి విహితులు తటస్థమైనప్పుడు లేతమత్స్యకళేబరాలను యితర భక్ష్యయోగ్య పదార్థాలతో కూడా పంపిస్తూ వస్తారు. యిక్కడ పండితులకు ద్వైత సిద్ధాంతము కలిగి గౌతమ విరచితమయిన న్యాయ శాస్త్రములో చాలా పరిశ్రమకలిగి వున్నది. యీ దేశస్థులకు స్నాన నియమము దేశాచారములు చాలా కలిగివున్నవి. స్వయంపాక నియమమున్నూ కలిగివున్నది. వుప్పునీళ్ళు కలియని పక్వాన్నాలు వ్యవస్థ లేక పుచ్చుకొని భక్షిస్తున్నారు.

300 సంవత్సరముల కిందట యీ దేశపురాజు వొక యాగము యత్నముచేసి నిర్వహించను సమర్థులు యీ దేశపు బ్రాహ్మలలో లేనందున గంగా యమునలమధ్య ప్రదేశ నివాసులయిన కాన్యకుబ్జులను అయిదు గోత్రాలవారిని యీ దేశమునకు పిలువనంపించి ఆ యాగము సాంగముగా కాచేసుకొని ఆ అయిదు తెగలవారిని యీ దేశములో నిలుపుకో వలెననే తాత్పర్యముతో వారిని కులీనులని

ప్రసిద్ధ పరచినాడు. యీ కులీనుల కూటస్థులు యీ దేశములో ప్రవర్తించిన వెనక కొన్ని జాతినియమాలు ఆచారనియమాలు కలగచేసినారు. అందులో కొన్ని సువర్ణపు పనులు సువర్ణవ్యాపారాలు చేసేవారు బనియాలనే జాతిని స్వర్ణస్తేయము సురాపానము మొదలైన పంచమహాపాతకాలు శాస్త్రచోదితములై వుండుటచేతనున్ను, యీ సునారుబనియాజాతి యేవిధముగా స్వర్ణస్తేయము చేయకనే విధిలేనివారుగనుకనున్ను ఆ జాతిని అతినికృష్టముచేసి పెట్టినారు. తదారభ్య అదేరీతిని నికృష్టులయి వున్నారుగాని దక్షిణదేశపు కంసాలజాతివలెనే బ్రాహ్మలకు సమము కావలెననే ప్రయత్నము కలవారయి యేమాత్రము వుండలేదు.

యీ బంగాళీదేశములో వంశావళి పరంపర ఆయా తెగది ప్రత్యేకముగా వ్రాశివుంచగలందులకు తెగ తెగకు కొన్ని కుటుంబాలను ఘటికులని యేర్పరచి వుంచి వున్నారు. వివాహాలు తటస్థమయినప్పుడు ఆ కవిలెలువ్రాసేవారిని పిలువనంపించి యోచించి ఆ ఘటికులు సమ్మతించిన వెనక ఫలానివాడికి ఫలాని చిన్నదాన్ని యివ్వవలసినదని నిశ్చయము చేయబడుచునున్నది. యీ సంప్రదాయము దక్షిణదేశములో నందవరీకుల కులాచారాలకు సరిపడుతున్నది.

యీ దేశములో వివాహముల విషయమందున్ను అపరవిషయముల యందున్ను ధనికులకు విశేషవ్రయముచేసే సంప్రదాయము కలిగియున్నది. పూర్వాపరాలు చేయించడములో మంత్రబాహుళ్యము లేకపోయినా తంత్రబాహుళ్యము చాలాగా కలిగి మళయాళదేశమువలెనే శుభాలు ప్రసక్తి అయినప్పుడు స్త్రీలు కొళాలి అనే ధ్వనిచేసేవతుగా కంఠారావము చేస్తారు. అనుగమనాలు స్త్రీలు చేయడము యీ దేశములో యీ వరకు బహు విస్తారముగా జరుగుతూ వచ్చినది. అవిభక్త విషయములో కూడా యీ దేశమందు స్త్రీలకు భాగము కద్దు. రఘునందనుడనే వొక పురుషుడు చేసిన వుపస్మృతిని యీ దేశములో నిండాగా వాడుకుంటారు. తంత్రజ్ఞులని పేరుపెట్టుకొని శాక్తమతస్థులు కొందరు ప్రబలి వున్నారు.

నద్యా శాంతిపురము మొదలుగా వుండే యిండ్లు పూరియిండ్లు,

కము చేసుకునేటట్టు వునికి పట్టుకు కొంత భూమి యిచ్చి యెగుమతి దిగుమతి సరుకులమీాద నూటికి యింత అని తీరువ సుంకము మొకరరు (నిర్ణయము) చేస్తే మా యింగిలీషు జాతివారికి క్షేమము కలుగుచున్నది: యింతకు మిక్కిలి బహుమానము నాకు యేమి అక్కరలేదని మనివి చేసుకున్నంతలో పట్నా షహరు ప్రభువు ఆ డాక్టరుయొక్క సామర్థ్యానికిన్ని నిస్పృహతకున్ను సంతోషించి అప్పుడే పరవానా డాక్టరు కోరిన ప్రకారము వ్రాసి యిచ్చినాడు. తదనంతరము, కాళీ గుడివద్ద కొన్నిగుడిశెలు వుండగా ఆ స్థలములలో ప్రవేశించిన తర్వాత హుగ్గులియనేసమీాపపు వూళ్ళో గిడ్డంగిలు యిండ్లు మొదలైనవి కట్టుకొని యింగిలీషు వారు వర్తకము చేయుచూ వచ్చినారు. తర్వాత మక్సూదాబాదు (మూర్షిదాబాదు)లోని అధికారస్థునికిఢిల్లీ పాదుషాకుండా మొక్త్యారు అధికారము కలిగి యీ దేశము అతని అధీనమై ఆ అధికారస్థుడు, యీ దేశములో పూర్వపు కాపురస్థులైన ప్రాంసువారి బోధనవల్ల యింగ్లీషువారిని యెక్కువ తీరువ యివ్వమని నిర్బంధపెట్టి పట్నా అధికారస్థుడు వ్రాయించి యిచ్చిన ఫరవానా పాదుషాదికాదు అనే షరామీాద యిక్కడ యింగిలీషువారికి వుండరాములు చేసినంతలో యింగిలీషు వారు వొక డాక్టరు సమేతముగా ఢిల్లి పాదుషాతో మొరపెట్టుకునేటందుకు వెళ్ళినారు. అప్పట్లో యీాశ్వర ఘటనచేత ఢిల్లీ పాదుషాకు దేహము స్వస్థములేక యత్నముచేసిన వివాహముకూడా నిల్చివుండేటట్టు ప్రసక్తిఅయి యింగిలీషుడాక్టరు వచ్చివుండే వైనము తెలిసిపిలువనంపించినాడు. యీాశ్వరుడు ఆ డాక్టరుమూలముగా పాదుషాకు దేహముకుదిర్చి యింగిలీషువారి అభీష్టమును పాదుషా పరమానా మూలకముగా సిద్ధి చేసినాడు. ఆ ఫరమానాప్రకారము కొంచము దినములు నడిపించి మళ్ళీ మక్సూదాబాదు అధికారస్థుడు తిరగబడినందున యింగిలీషు వారు నిభాయించలేక కొందరు తమవారు వుండే చెన్నపట్టణము చేరి శీమరాజుకు అర్జీ యిచ్చుకున్నంతలో శీమరాజు తమ జాతివారి క్షేమముకొరకు కొన్ని యుద్ధపువాడలను ఫౌజుబందితో కూడా కలకత్తాకు పంపించి చెన్నపట్టణపు గౌనరుమెంటువారిని కుమ్మక్కు చెయ్యమని వుత్తర్వు చేసినందునున్ను యిరుపక్కలా భూమి ధనురాకార

ముగా వుండే సముద్రోదకము గంగా సంగమమయ్యే భాగీరథిలో పూరాగా లోచొచ్చేటట్టు యీశ్వర నియమనమయివున్నది. గనుక ఆ భాగీరథికుండా యుద్ధపువాడలు హుగ్లీ ప్రవేశించి పాలింసువారు వాసముచేయను కట్టుకొనివుండే కోటను వూరినిన్ని తీసుకునియింతలో మక్సూదాబాదు అధికారస్థుని కిందివారి మిత్రభేదపు కుమ్మక్కు ద్వారా మక్సూదాబాదుపై యుద్ధముచేసి దాన్ని స్వాధీనముచేసు కొని *కుమ్మక్కు చేసిన హస్తాంతరమయినవానికి అప్పట్లో ఢిల్లీపాదుషా దొరతనము అరాజకమైవుండగా అందులో పట్టాభిషేకముచేసి యింగి లీషువారిలో అప్పటికి యుద్ధప్రసక్తికి నిలిచిన దొరలు కావలసినంత ధనము కొత్త ప్రభువువల్ల పుచ్చుకొన్నారు. అదిమొదలుగా కలకత్తా కోటయున్ను వూరున్ను బస్తీ అయినది.

యింగిలీషు జాతివారు యీశ్వర కటాక్షమునకు పాత్రులయ్యే కొరకు వాక్యమందు ప్రమాణికులైనందున వర్తకులు ధనికులున్ను అనేక హింసలుగల చుట్టుపక్కల రాజ్యములు వదిలి కలకత్తా బస్తీ ప్రవేశించినారు. యిప్పటికి కోట్యంతాధికారులుగా వుండే హిందువులు కలకత్తాలో పదిమంది అయిదుమంది వున్నారు. యిరువై ముప్పై లక్షలు కలవారు నూటికి యిన్నూటికిదాకా వున్నారు. యీ కలకత్తా బస్తీ యీ చొప్పున నవీనమైనందున గొప్పవారి యిండ్లన్ని యింగిలీషు తరహాగా కట్టివున్నవి. వొకమాత్రపువారి యిండ్లు యెంతమాత్రము బాగులేక యింగిలీషు ఢోలుతో హిందుతరహాకూడా కలిసి వొక వికారముగా కట్టి వున్నవి. కలకత్తాలో కోటచుట్టూ మైన్లోనేను అనే కొంత బయిలు విడిచి అవతల యింగిలీషువారు రెండు మిద్దెలకుతక్కువ లేకుండా అయిదు అంతస్థులకు ఎక్కువలేకనున్ను గొప్పయిండ్లు అనేకముగా కట్టివున్నారు. యిక్కడి జాతులవాండ్లు చెప్పడ మేమంటే కల కత్తా యిండ్లు రాజునగళ్ళు అనిన్ని, చెన్నపట్టణపు ఇండ్లు బంగాళాలు అనిన్ని ప్రతిష్ఠగా చెప్పుకుంటారు. కలకత్తా గౌరన్‌మెంటు యిండ్లంత

*మూర్షిదాబాదు నవాబు సురాజుద్దౌలా క్రింది యుద్యోగి మీర్జాఫరు స్వామి ద్రోహముచేసి ఇంగ్లీషువారితో చేరగా 1757 లో ఇంగ్లీషువారు ప్లాసీయుద్ధము గెలిచి మీర్జాఫరును నవాబు జేసిరి.

గొప్పయిండ్లు యీ వరకు నేను చూచినది లేదు. హాయిదరాబాదులో మాత్రము రెసిడెంటు వుండే యిల్లు యీ యిండ్లకు ముకాబిలువాసి గొప్పగా చెప్పవచ్చును. యిక్కడి గౌరన్మెంటు యిండ్లు మూడుఅంతస్థులు భాగీరథీ నదివెంబడిగా శాలవేశి కష్టమాఫీసు మొదలైన కచ్చేరీలు అన్ని కట్టి వున్నారు. కలకత్తా కోటచుట్టూవుండే బయిలు శాలలు చూస్తే చెన్నపట్టణము చూచి తయారు చేసినట్టు తోచుచున్నది.

కలకత్తాకు వుత్తరము చిత్తుపూరు అని వొక బస్తీవున్నది. దక్షిణము మచ్చిగోల అనిన్ని గార్డన్ రీచ్చి అనిన్ని ద్వినామము కలిగిన బస్తీ వొకటి వున్నది. ఆ బస్తీలో తోటలు మిద్దెలు గంగాతీరమందు వుండుటచేత సూప్రీం కోరటు జడ్జీలు మొదలయిన గొప్పవారంతా అక్కడనే వున్నారు. ఆ ప్రదేశము వసతిఅవుటచేత నేను వున్న దినాలకు నెల ౧ కి ౧౮౦ రూపాయీల వంతున ఒక తోటమిద్దె బాడిగెకు తీసుకొని వున్నాను. పడమటిపక్క చోరంగి అనిన్ని, కిదరుపూరనిన్ని, లాలుడిగ్గీ అనిన్ని మూడు బస్తీలు వున్నవి. యిక్కడ సమస్త జాతివారు రెండు మూడు అంతస్థులుకల గొప్ప మిద్దెలు కట్టుకొని కాపురమున్నారు. అయితే ఆ మిద్దెలకు చుట్టూ తోటలు లేవు. చిత్తుపూరు నుంచి కిదరుపూరికి వచ్చే శాలలో వస్తే చెన్నపట్టణపు పాపమ్సుబ్రాడివే అనే వీధిలో వచ్చినట్టు యిరుపక్కలా షాపులు కలిగివున్నవి.

కలకత్తా షహరులో పోలైసువారు నెంబరువేశిన వొక్క బోయీలు మోశేకూలి పల్లకీలు ౧౦౦౦ కి సరిగా వుంచున్నవి. వొక్క బోయీలు యిరువురు మోయుడమేగాని ముప్పిరిమెంత బళువైనా వేయరు. నడుముకు వొకబట్ట చుట్టుకుని చేతమొగిలాకు గొడుగు పట్టుకుని చింపిరితలతో మోయుచు నుంటారు. కరాచీలు అనేబండ్లు యింగిలీషు చారయూట్ బండ్లకు నకలుగాచేసి, రెండుతట్టువాణి గుఱ్ఱములు కట్టి చెన్నపట్టణపు గూడుబండ్లకు బదులుగా వీధికి నాలుగైదు బాడిగెక్లు పెట్టుకొని వున్నారు. కలకత్తా షహరు అలంకారము జాతివాండ్ల యిండ్లవద్దనున్న శివవాడలు నిండియుండే గంగాతీరపు శాలలోనేగాని హిందువుల యిండ్ల వద్దికిపోతే సామాన్యపు స్త్రీలకు రాజును చూచిన కండ్లతో మొగుణ్ని చూచినట్టు వుంచున్నది. జాతులవాండ్ల

బస్తి అపేక్షయా కలకత్తాను చెన్నపట్టణమునకు రెట్టింపు షహరని చెప్పవచ్చును. యింకా హిందూస్థానులో జమీన్‌దారులు రాజులు నిస్సారులుకాక వుండేటందున యిక్కడ వర్తకము అమోఘముగా జరుగుచున్నది.

యేప్రల్ మే నెలలు రెండున్ను యిక్కడ మిక్కుటమైన గ్రీష్మ కాలము గనుక ప్రతియింట్లోను ప్రతికొట్టడికిన్ని పంకాలు వేశివున్నవి. యీ కాలములో ఆ పంకాలగాలివల్ల యిక్కడివారు జీవిస్తారు గాని అన్యథా కాదని తోచినది.

యీ ప్రదేశాలభూమి నివాసులున్ను పశువులున్ను బలిష్ఠములు కాకపోయినప్పటికిన్ని భూమి పచ్చికమాత్రము బాగా పట్టి వున్నది. అయితే పచ్చిక పొడుగు పెరగలేదు. యీకలకత్తాలో యింగిలీషువారు వారి శీమలోని పిచ్చన్సు అనే పండ్లు, లిచ్చన్సు అనే పండ్లున్ను రెండుదినుసులు పయిరుచేశినారు. లిచ్చన్సుపండ్లు బెత్తపు పండ్లు జాడగా పులుసుతో తీపుకలిసి వుంచున్నవి. పిచ్చన్సు అనే పండు బాదంకాయలవంటి విత్తులు లోపలకలిగి పులుసుమీరిన రుచితో వుంచున్నది. యీ షహరు హిందువులు జంబునేరేడుపండ్లను పూజ్యతగా వాడుతారు. పచ్చిద్రాక్షపండ్లు అరుదు. హిందువులందరు అరిటాకులు వేసుకోవడమేగాని యితరమయిన ఆకులు తాకడములేదు. అన్నిచెట్లు వీర్యముగానే పెరిగివున్నవి. గ్రీష్మకాలపు రెండు నెలలనున్ను యీ దేశస్థులు తుపాను కాలమంటారు. యిక్కడ హుక్కాలు తాగని వారులేరు. గుడాకుచేసే గిడ్డంగీలకు బొగ్గువుంటలుచేసే గిడ్డంగీలు శానా కలవు. గుడాకువుండలు ప్రతి అంగడిలోను వుంచి అమ్ముతారు. తమలపాకులు బహుదళముగానున్ను పెద్దవిగానున్ను మిక్కిలీ లావు పొడుగైన కాడలు కలవిగా నున్ను తెచ్చి సాధారణముగా అమ్ముతారు. యీ దేశస్థులు తాంబూల చర్వణముచేయడము విస్తారముగానేవున్నది.

యీ షహరులో ఒక వేగినాటి బ్రాహ్మణుడు విశ్వనాథభొట్లనే వాడు ముప్ఫైయేండ్లుగా సంసారములో దక్షిణ దేశపు బ్రాహ్మణులకు యథాశక్తి సహాయము చేయుచూ కాపురమున్నాడు. సంపాద నార్థము ఆగంతుకులుగా పంచద్రావిళ్ళతో చేరిన బ్రాహ్మలు

ముప్పదిమంది వాసము చేయుచు బంగాళీ ప్రభువులను ఆశ్రయించి వారివల్ల జీవనము చేయుచున్నారు.

బంగాళీ వారికి శివప్రతిష్ఠ చేయడము బహు అగత్యము గనుక గర్భగృహము మాత్రము కట్టి గుమ్మటపు అందముగా స్థాపీకట్టి యీ ప్రాంతములలో అనేక లింగాలు ప్రతిష్ఠ చేయబడివున్నవి. యీ షహరులో అనేక తటాకములు కలవు. అందులో నేను దిగిన ప్రదేశములో వుండే మోతిబీలనే గుంట బహుప్రసిద్ధమయిన వుదకముకలది. యీ షహరులో వుద్యానవనములున్ను అనేకముగా వున్నవి. అందులో గంగకు అవతలి పక్కవుండే కుంఫిణీవారి "బోటానికాలు గారుడన్" అనే వనౌషధుల తోట బహుగొప్పది. నిడుపులో వుత్తర దక్షిణాలు అయిదు గడియల దూరము వుండును; వెడల్పులో సుమారు మూడు గడియల దూరము కద్దు.

కుంఫిణీవారు, బంగాళీల శిక్ష నిమిత్తము, కొన్ని కాలీజు పల్లె కూటములు పెట్టినారు. అందులో చదివి తీరిన పిల్లకాయలు దేశము విస్తారం కర్మభూయిష్ఠమయినప్పటికిన్ని శుష్కవేదాంతులై ప్రవర్తించుచున్నారు.

యీ దేశస్థులు మీసాలు ప్రాయశః వుంచడములేదు క్షౌరము దినముమార్చి దినము చేసుకుంటారు. స్త్రీలు పురుషులున్ను బహుశా లలాటశూన్యులుగానే తిరుగుతూ వుంటారు. తులసీమణిధారణ విస్తారము కద్దు. కొందరు స్త్రీలు ముక్కుమీద పచ్చ పొడుచుకుంటారు. పట్నప్రాంతముల స్త్రీలకు పాపటలో సిందూరమును కాయముగా ధరించడము శృంగారమని తోచినట్టు వీరికి ఆ పచ్చ శృంగారముగా తోచి వున్నది. యిక్కడదొరికే చీరలు ౧౨మూరకు యెక్కువ దొరకవు. తెల్లచీరలే సాధారణముగా ధరించుతారు.

షహరు వీధులలోలో భిక్షుకులు నిండా తిరగడములేదు. యిండ్ల బాడిగె నవుకరల జీతాలున్ను బహు భారీగా వున్నవి. జాతిదొరలున్ను గొప్ప హిందువులున్ను సరకారనే పేరుపెట్టి వొక ప్రధాన నవుకరును వుంచుతారు. ద్వారమువద్ద కాచివుండడమునకు దారువాన్ అనే పేరుతో వొక నవుకరును అవశ్యముగా వుంచుతారు,

క్రీస్తుమతానికి అంతర్భూతమయిన అరమనజాతి మొదలయిన వారిగుళ్ళు బహుశః యీ బస్తీలో కట్టివున్నవి. క్రీస్తుమత ప్రకటన నిమిత్తము యిక్కడ అనేక ప్రయత్నములు గ్రంథప్రచురత్వ ద్వారా జరుగుచున్నవి.

ముచ్చిగోలా మొదలు బ్యారకుపూరుదాకా వొక సడక్కు వేసి యిరుపక్కలా చెట్లు వేసి బహుసుందరముగా యేర్పరచి వున్నది. షహరు బస్తీ నిడుపున వుత్తర దక్షిణములు మూడామడవుండవచ్చును. వెడల్పులో రెండామడ వుండవచ్చునని తోచుచున్నది. జనబాహుళ్యము చూస్తే సుమారు ౧౫౦౦౦౦ వేలు వుండవచ్చునని తోచినది.

సువాసినీలయిన స్త్రీలు శంఖపుగాజులు ధరించవలసినది అగత్యము గనుక దక్షిణదేశపు శంఖాలంతా ఈ దేశములోనే వ్రియమయ్యేటట్టు తోచబడుచున్నది. స్త్రీలు విస్తారము ఆభరణాదులు ధరించడము లేదు. పురుషులలో గొప్పగా వుండేవారు యింగిలీషుజాడగా వస్త్ర వాహనాదులు వాడుకుంటున్నారు. వాద్యవిశేషములలో ఫిడీలు అనే యింగిలీషు వీణలు యీప్రాంతముల బహు ప్రచురముగా వున్నవి. యిక్కడల స్తలుజ గ్లాసులు కరిగిపోశి చేయుచున్నారు. కంట్లాలు మోశే గుర్రాలు వొంటెలు దొరకవు గనుక నా డేరాలను బోయీల చేత మోయించేటట్టు నిశ్చయము చేసినాను.

దేశ దేశపు వాడలు యిక్కడ సరకు తెచ్చి యిక్కడి సరకులు దేశదేశాలకు తీసుకొనిపోవుటచేత యీ షహరులో దొరకని ద్వీపాంతర పదార్థములుగాని స్వదేశ పదార్థములుగాని లేకవున్నవి. వర్తకులు సుఖించివున్నారు. యిటువంటి కలకత్తాషహరులో జూన నెల ౨ తేది వరకు వసించినాను.

## ఇరువదియవ ప్రకరణము

౩ తేది వుదయాన ౫ గంటలకు ప్రయాణమై పడవలమీాద వుడుబడియా యనే వూరికి ౧౨ గంటలకు చేరినాము. ఈ దేశములో ఆయుధపాణులుగా యెవరున్ను వుండకూడకపోయినా బనారసులో

వర్షారంభము గనుక యీ రాత్రి నిండా వర్షముకురిసినది. యీ రాత్రి యిక్కడ వసించినాను.

౮ తేది వుదయాన ౬ గంటలకు లేచి యిక్కడికి నాలుగు కోసుల దూరములోవుండే బాగునా అనే వూరు ౯ గంటలకు ప్రవేశించినాను. దారి సడక్కువేశియున్నది. నామోదరు అనేనది పడవలతో దాటినాను. కాశినుంచి పదిబాడిగె గుఱ్ఱాల మీద ౪౦ బిందెల గంగ చెన్నపట్టణమునకు పంపించినది గాక కూడా వున్న గంగాజలము యెనిమిది బిందెలున్ను నిత్యము జరూరులేని డేరాలు రెండున్ను మందుల పెట్టెలు వగైరా సామానున్ను రెండుబండ్లమీద తెచ్చినందున యీనదులు పడవలకుండా దాటేటప్పుడు, బహుప్రయాస యిచ్చినవి. యీవూరుగొప్పదేను. బాజారుకద్దు. సకల పదార్థాలున్ను దొరుకును. భాటసారులు దిగడానకు గొప్ప యిండ్లు, అంగడివాండ్లు కట్టివుంచి వుండేటందున డేరాలు నిమిత్తము లేకుండా విశాలమైన అంగడి యింట్లో దిగినాను.

౫ తేది వుదయాత్పూర్వము మూడుగంటలకు లేచి యిక్కడికి అయిదు కోసుల దూరములో వుండే సీదాహాటు అనేవూరు పదిగంట లకు చేరినాము. దారి నిన్నటివలెనే సడక్కు వేశి వారధులు కట్టి వున్నది. రుక్మినారాయణ అనే నది వొకటి యీదినము పడవకుండా దాటినాము. యీవూరు గొప్పది. బాజారున్నది. దిగడానకు యిండ్లు సహా కట్టివున్నారు గనుక డేరాలు వెయ్యలేదు. దిగినయింటికి నాలు గణాలు యిస్తే అంగటివాడు ఆనందించినాడు. యెవడు కట్టివుంచిన యింట్లో దిగితే వాని అంగడిలో సామాను తీయవలసినది గనుక అదే ప్రకారము చేసినాను. సమస్తమైన పదార్థాలు ఈ వూళ్ళో సహజ ముగా దొరికినవి. యీవూళ్లో ఈరాత్రి వసించినాను.

౬ తేది వుదయాత్పూర్వము మూడుగంటలకు లేచి యిక్కడికి యేడు కోసుల దూరములో నుండే డబరా అనే వూరు ౧౦ గంటలకు చేరినాను. దారి సడక్కువేసి ముందుదినముల దారివలెనే యిరుపక్కలా వైరుపాలాలుకలిగిసుందరముగా వున్నది. దోవలోవుండే కర్మసారి అనేనది కాలునడకగా దాటినాను. యీవూరుగొప్పదేను. అంగటివాండ్లుగొప్ప

యిండ్లుకట్టిపెట్టివున్నారు. సమస్తమయిన పదార్థములు దొరికినవి. పోలీసుజమీాందారుడువుండే కిసుబావూరు నాపరవానా వొక మజిలి ముందు పంపిస్తూ రావడమువల్ల నేను దిగే ప్రతివూరున్ను అన్ని విధాలా సొంతమువలె కావడనుమాత్రమే కాకుండా దిగిన వూరిమనుష్యులు దిగపొయ్యేవూరిదాకాకూడావచ్చిసాగనంపించి పోవుచున్నారు. యిటు నాకు జగడమేకాకుండా యిక్కడ పోలియసుఖాయిదా ముసాఫరులువచ్చి దిగితే చౌకీపారా రాత్రిళ్ళు యిచ్చి వారిని వారి సామానున్ను కాపాడి పంపించేటట్టుగా వుత్తర్వుఅయివున్నది. అంగటివాండ్లు వచ్చిన ముసాఫరులను ప్రార్థించి దిగేలాగుచేసి కావలసిన పదార్థాలు యిచ్చి ఆదరింపుచున్నారు.

యీ దేశపువాడికె వొకసారి వండుకున్నకుండ రెండోసారికి పనికిరాదు గనుకనున్ను కుండలు నయముగనుకనున్ను ముసాఫరులు అందరు కుండలుకొని వండుకొని దిగిన తావులలో ఆకుండలు పగలగొట్టిపోతారు. దిగుడు మజిలీలలో కుండపెంకులవల్ల అసహ్యము మాత్రము ఒకటి కలిగియున్నది. యిల్లుకట్టి అంగటివాండ్లు జలవసతికూడా పూరాగాచేసి యుంచుతారు. యీవూళ్లోనుంచి రాణీసరాయిదాకా సడక్కు లేనందుననున్ను సడక్కు తిన్నగా యీవూరినుంచి మేదినిపూరుకు వేశియుండేటందుననున్ను నా రెండుబండ్లను మేదినిపూరుకుండా రాణీసరాయికి రమ్మని సాగనంపించి యీవూళ్లో యీరాత్రి వసించినాను.

౭ తేదీ ఉదయాత్పూర్వము ౩౪ గంటకు లేచి యిక్కడికి యేడు కోసుల దూరములో వుండే భద్రకాళి అనే వూరు ౧౨ గంటలకు ప్రవేశించినాను. దారి సడక్కులేదు. పొలములమీాద నడిచి రావలసినది. ప్రతిదినమున్ను నేను బయలుదేరిన దినము మొదలుగా కలకత్తాలో కలిగియున్న గ్రీష్మము లేకుండా తెల్లవారి మబ్బువేసి మజిలీ దిగిన వెనక వర్షము కురియుచూ వచ్చినది. గనుక దారి బహు అడుసుగావుండినది. యీవూరున్ను గొప్పదేను. భద్రకాళి అనే దేవి గుడివున్నది. దిగడమునకు విశాలమయిన యిండ్లుకట్టి వసతికి గుంటలు త్రొవ్వించియున్నారు. ముసాఫరులు దిగడానకు ఈ అంగడివాండ్లు,

అంగడికి చేరినట్టు ప్రత్యేకముగా కట్టివుంచే యిండ్లు విడవలిపూరికలవి అయినా బహు రమణీయముగా ప్రతిదినమున్ను శుద్ధిచేసి వుంచుతారు. యిక్కడ సమస్తమైన పదార్థములు దొరికినవి.

౮ వ తేది వుదయాత్పూర్వము ४ గంటలకు లేచి యిక్కడికి యెనిమిదికోసుల దూరములోనుండే రాణీసరాయి ప్రవేశించినాను. ఈజాగాలో వూరులేదు. 30 అంగళ్ళు సడక్కుకు యిరుపక్కలా కట్టివున్నవి. దిగడానకు విశాలమయిన యిండ్లుకట్టి వాటికి చేరినట్టుగానే రమణీయమైన గుంటతోవ్వించినారు. చౌకీదారులు మాత్రము వున్నారు గాని పోలీసు బంత్రోతులు యిచ్చట వుండడము లేదు. దారిలో నారాయణగడయని వొకవూరు వున్నది. అక్కడ పూర్వపురాజులు నియమముచేసిన సదావృత్తి సత్రాన్ని అద్యాపి కుంఫిణీవారు నడిపిస్తూవున్నారు. యిక్కడ సకల పదార్థములు కూరగాయల సమేతముగా దొరికినవి. ఈ దేశములో పాలు పెరుగు సహజముగా దొరుకుచున్నవి. దిగిన మజిలీలలోవుండే చౌకీదార్లను నలుగురేశిమందిని రాత్రిళ్ళు నాబంత్రోతులతోకూడా పారాయిచ్చేటట్టు చేసి వుదయాన సాగివచ్చేటప్పుడు నాలుగేశిఅణాలు యిస్తూ వచ్చుచున్నాను. యీ దినము దారి కొంతమేర సడక్కు వేశి యున్నది.

౯ తేది ఉదయాత్పూర్వము ౨౻ గంటకు లేచి యిక్కడికి ౯ కోసుల దూరములో నుండే జేలేశ్వరం పట్టణా అనే వూరు ౧౨ గంటలకు ప్రవేశించినాను. దారిసడక్కు వేసి వారధులు కట్టివున్నవి. యిరుపక్కలావుండే భూమికన్నా మనిషి పొడుగుమిట్టతో సడక్కు వేసియున్నారు. సడక్కునిమిత్తమై కాలువగా మట్టి యెత్తినారు గనుక ఆ కాలువలో నీళ్ళు నిలిచినప్పుడు వొంటికొయ్య దోనెలమీద కావలసిన సామానులు వుంచి యీడ్చుకొని వస్తూవుంటారు. ఈ వూరు సువర్ణ అనే నదీతీరము. గొప్పవూరు. బాజారువీధి వున్నది. ముసాఫరులు దిగడానకు యిండ్లు సమేతముగా యేర్పడివున్నవి. సమస్తమయిన పదార్థాలు దొరికినవి.

౧౦ తేది వుదయాత్పూర్వము 3౻ గంటకు లేచి యిక్కడికి అయిదుకోసుల దూరములో నుండే బస్తా అనే వూరు ౧౦ గంటలకు

చేరినాను. యీ వూరు చిన్నదైనా అన్ని పదార్థములు అపరిమితముగా దొరికినవి. కుంఫిణీవారు విశాలమైన ధర్మశాలలు రెండుమిద్దెలు వేశి కట్టించివున్నారు. నేటిదారిన్ని సడక్కు వేసియున్నది. సువర్ణనది కాలునడకగా దాటినాము. నదికి యీపక్క సుంకపుచౌకీ వొకటి యున్నది. వొకమాత్రపు వారిని సోదా చూడడమనే సాకుపెట్టి కొంత గుంజుకోకనే ఆ చౌకీదారులు వదలరు. నేటిదారిలో భాటకు కుడిపక్క కొంతదూరములో వొక పర్వతము తెలుస్తూ వచ్చుచున్నది.

కలకత్తాలో నేను వుండగా వొకదినము గాలితోకూడా రాళ్ళ వాన కురిశి గచ్చకాయలంతేశి రాళ్ళు పడ్డవి. ఆ రాళ్ళు పది అయిదు మొత్తి వొకపాత్రలో వేశి కుదిలించితే రాళ్ళు కుదిలించినట్టు చప్పుడౌతున్నది. కిందపెట్టి బలువైన పదార్థముతో కొట్టితే నీళ్ళయి పోతున్నవి గాని దెబ్బకు తాళనేరవు. చేత పట్టుకుంటే తూటుపొయ్యేపాటి శీతళముగా శుద్ధస్ఫటిక సంకాశముగా వున్నది. గడియవుంచితే క్రమక్రమముగా కరిగిపోతున్నవి. మళ్ళీ అటువంటి వాన ప్రసక్తించలేదు. కలకత్తాలో కలిగివున్న పిశాచగాలిన్ని యిక్కడ లేదు.

కలకత్తాలో నేను వుండగా మలడీ అనే జ్వరము కలకత్తాలో నంతా ప్రవేశించి నా పరివారములో యిరువైయింటిని బాధపెట్టినది. గయలో వొక సల్లడాక్టరు నాకు చెప్పిన ప్రకారము హిందుస్తాని భాషలో ఛిరటా అనిన్ని యింగిలీషులో బిట్టరు అనిన్ని చెప్పే మూలిక వేశి కషాయముపెట్టి యిలిక్కిసియా వితిరిల్ అనే ద్రావకము వొక క్వాటర్ బాటిల్ కషాయానకు రెండు తేగరిబెలు పోశి సాయంప్రాతః రెండేశి తులాలు యిస్తూ వచ్చినంతలో ఈశ్వర కటాక్షముచేత అందరికిన్ని అనాయాసముగా వాశి అయినది. వొక బోయివాడికి నీరుకు బదులు నెత్తురు దిగుతూ వచ్చినంతలో బొందెగడ్డ రసము తీసి తవ్వెడు రసములో మూడు బొట్లు గంధకద్రావకము పోశి యిచ్చినాను. త్వరగా వాశి అయినది.

౧౧ తేది వుదయాత్పూర్వము ౨౪ గంటలకు లేచి యిక్కడికి ౭ కోసుల దూరములో నుండే బాలేశ్వరమనే కసుబాబస్తీ౯ గంటలకు చేరినాను. దారి యీవరకు వున్నట్టు సడక్కు యేర్పడి వుండడములో

భూమి యిసుక కలిసిన రేగడ గనుక బహు గట్టిపడి వర్షము కురిశి వున్నా కాలికి అంటుకోకుండా వున్నది.

కలకత్తా మొదలుగా సువర్ణానది వరకు భూమి జిగట రేగడ. అందువల్ల కలకత్తాలో కోశే యిటికెరాళ్ళు బహుగట్టిగా రెండుమూళ్ళ చచ్చౌకముగా కొయ్యగల పాటివైపు కలిగివున్నవి. కలకత్తా యిటికె రాళ్ళు యినుప చిట్టముతో సమమైన బలము కలవని చెప్పవచ్చును. కలకత్తా సున్నముమాత్రము ధావళ్యము చాలదు గనుక యింటి గోడలు చెన్నపట్టణము వలె సీడలు తేరడము లేదు.

దేశస్థు లందరున్ను గుల్లసున్నము వేసుకొంటారు. యీ విష యాన్ని గురించి ఒక దినము బంగాళీవాడు మీ దేశములో బ్రాహ్మ ణులు మత్స్యభక్షణ చేయడములేదంటిరే, గుల్లసున్నము తాంబూల చర్వణముతో తినడములేదా అని అడిగెను. నా అనుభవద్వారా కావేరి మొదలు కన్యాకుమారి వరకు సమస్త బ్రాహ్మణులున్ను దేశాచార ప్రకారము గుల్లసున్నము వేసుకుంటారని తెలిసి నేను ఆ దేశ సంచారముచేసినప్పుడు వారితోటిపాటుగా అదే సున్నము వేసుకొనివున్నా. బంగాళీవాడుచేసిన ప్రశ్నమహిమను యోచించి మా చెన్నపట్టణములో గుల్లసున్నము వేసుకోవడములేదని వుపాయముగా వుత్తర్వు చెప్పినాను గాని నా మనస్సుమాత్రము కలతబడి వున్నది. గుల్లలున్నూ జలజంతువుల కళేబరాలతో చేరినది నిజమేకదా! యీ దేశస్థులు మత్స్యకళేబరాలను పచనముచేసి తింటే దక్షిణదేశస్థులు వాటి దేహాలమీది చిప్పలను కాల్చి తింటారు. ఈ రీతిగా పరోక్ష ప్రత్యక్షాలుగా జలజంతువుల కళేబరాలను వొక పక్కది వొక దేశ స్థులు వొకవిధమయిన పచన ద్వారా భక్షణ చేస్తే మరివక దేశస్థులు మరివొకపక్క కళేబరాన్ని మరివొక విధమయిన పచనముతో భక్షణ చేయుచూ సమమైన పాపులయివున్నా వొకరిని వొకరు నిమిత్తము మాలి నిందింపుచూ వుంటారు. యీ సరికి నావద్ద ప్రయాగనుంచి తెచ్చిన రాతిసున్నము వున్నది. యిది ఖర్చు అయిన వెనక బంగాళీ వాడివల్ల ధర్మసూక్ష్మము యెచ్చరించబడ్డా యిక రాతిసున్నము దొరకక పోతే దేశాచారాన్ని లోగడివలెనే అనుసరించవలసి వస్తున్నది.

మూటశోధన నిబంధము లోకులకు కలిగి యున్నది.

౧౭ తేది వుదయాత్పూర్వము ౧౫ గంటకు లేచి యిక్కడికి ౯ కోసుల దూరములో వుండే సూరంగు అనే వూరు ౯ గంటలకు చేరినాము. నా మూడు సవారీలలో రెండు సవారీలకు యిరువై యింటికి వోఢ్రిబోయీలను పెట్టవలసి వచ్చినందుననున్ను వారు యిరువురి మోతతో వారి వారి అడుగులను యివతలవారి అడుగులతో కలుపుకోకుండా మెల్లిగా నడిచేవారు గనుకనున్ను యెండగొట్టుకు యెంత మాత్రము సహించలేదు గనుకనున్ను రాత్రిళ్ళు యింతపొద్దువుండగా లేచి నడవ వలసివున్నది. దారి నిన్నటివలెనే సడక్కువేసి యున్నది. యిసక కలిసిన రేగడ. బాలేశ్వరము మొదలుగా కుడిపక్క రెండు గడియల దూరములో సముద్రములో కలియవచ్చిన వింధ్యపర్వత సంబంధమైన పర్వతములు వుండి వున్నవి. నేటిదారిలో బాలేశ్వరానకు కోశెడు దూరములో వక సుంకపు పెరిమెట్టు చౌకీ వున్నది. యిక్కడి కలకటరు మేజిస్ట్రేటు అయిన రిక్కెట్టు దొర వొక చప్పరాశి బంట్రౌతును తయినాతిగా యిచ్చినందున తలాషీ అనే శోధన చిక్కులేకుండా సాగి వచ్చినాను. అయినప్పటికి నా గొప్ప కాపాడుకునే నిమిత్తము చౌకీ ౧ కి ద్రు ౨ వంతున యినాము యిస్తూవచ్చినాను. ఠాణా సరిహద్దు ప్రకారము వొక బరకందాసు అనే పోలీసు బంట్రౌతు వస్తూ వచ్చినాడు గనుక యివతలి సరిహద్దు పోచాయించి (చేర్చి) బంట్రౌతు సాగి పొయ్యేటప్పుడు అరరూపాయి యినాము యిస్తూవచ్చినాను

యీ భూమిని వరిపయిరు యెక్కువ. యీ వుత్కలదేశములో వసించే వోఢ్రబ్రాహ్మణ పండితులు గౌడదేశస్థులకన్నా సంస్కృత భాషను బాగా వుచ్చరించుతారు. యీ దేశస్థులకు తెనుగుమాట వొకటి అర వచ్చును. చెన్నపట్టణము యెరిగినవారు యిక్కడ కొందరువున్నారు. బంగాళీలవలెనే మదిరాసు ద్వీపాంతరమా అని అడగడములేదు. యీ నెట్టున చెన్నపట్టణమంటే తెలియదు. మదిరాసు అనవలసినది.

కలకత్తావద్ద భాగీరథీనది వదిలిన వెనక గంగలో కొట్టుకునివచ్చే కళేబరాలను తినే నిమిత్తము యీశ్వరుడు గంగకు యిరుపక్కలా సృజన చేసిన వింత ఆకృతిగల బోరుగద్దలను చూడలేదు. ఆ గద్దలు రెండు

పూర్వ మహాంపూర్వ మని యెదురుగా వచ్చినారు. వారు వోఢ్రబ్రాహ్మలు, వుత్కలు లనిన్ని చెప్పుతారు. యిక్కడ శేరు ౧ కి ౮౦ రూపాయుల యెత్తు. కలకత్తా శికారూపాయులకు చెన్నపట్టణపు రూపాయులకు నూటికి పది వ్యత్యాసము వున్నది. చెన్నపట్టణములో తగ్గిన దినుసని తెలియవలసినది. బంగాళా సీమలోనుండే బోయీలు యీ రీతిన బళువు యెత్తలేని జబ్బుమోతగాండ్లుగా వున్నారే, మన దేశానకువచ్చే బంగాళా పల్లకీలు బహు బళువుగా వుంటున్నవే, వీటి నిమిత్తమే మని విచారించగా బంగాళాలోవుండే యింగిలీషుదొరల కేమి?హిందువుల కేమి పాలకీలుయెక్కే షోకేలేదు.పని గడవడానకు కూలిపల్లకీలుఅప్పటప్పటికి వుంచుకుంటారు. ఆ కూలిపల్లకీలు తేలికగానే వుంచున్నవి. అక్కడ వెల పోడుగు పల్లకీలు మాత్రము చేసి వుంచివున్నవి. వాట్లను హిందుస్తాన్ చెన్నపట్టణము మొదలయిన దేశాంతరాలకు పంపించడానకు తయారాయినట్టుగా తోచబడుచున్నది.

౧౪ తేది వుదయాత్పూర్వము ౪ గంటలకు లేచి యిక్కడికి ౮ కోసుల దూరములోనుండే వైతరణీనదీతీరపు వూళ్ళయిన ఆకులా పదా, మూడియాపాడు అనే వూళ్ళు ౧౧ గంటలకు చేరినాను. యీ నది వర్షాలు కురిశినందున పడవలకుండా దాటడమయినది. యీ దినము నడిచినభూమి శుద్ధరేగడ, మన్ను వర్షము కురిశినందున అమితముగా కాళ్ళకు అంటుకుంచూ వచ్చినది.

యిక్కడికి జాజీపురమని పేరుకలిగిన నాభిగయ మూడుకోసుల దూరములోవున్నది. అక్కడ యీ వైతరణీ నదీతీరమందు దేహానంతరము జీవుడు వైతరణీనది దాటే కష్టము పొందకుండా వుండేకొరకు వైతరణీ ప్రయుక్తముగా వొక గోదానముచేసి నాభి ఆకారముగా వుండే వొక కూపములో పిండప్రదానము చేయవలసినది. వుత్కల బ్రాహ్మలు ౧౫౦ యిండ్లవారు నాభి గయావళీలని పేరు వుంచుకొని యాచించి జీవనముచేస్తారు. వీరు మత్స్యభుక్కులు కామనిచెప్పినా గయా మహాక్షేత్రములో గయావళీలకు బ్రాహ్మణార్థము చెప్పినట్టు దక్షిణదేశస్థులు వీరిని చెప్పడములేదు. ప్రత్యేకముగా అన్నశ్రాద్ధము చేస్తే స్వదేశస్థులు దొరికితే బ్రాహ్మణార్థము చెప్పుతారు. లేని

పుగా యెక్కి పడవలమీద వుండవచ్చును. ఈ రెండునదుల పేర్లు కరుసా అనిన్ని బ్రాహ్మణి అనిన్ని చెప్పుతారు. బ్రాహ్మణినది గోపాలపూరుకు వోరగా వున్నది. యీ వూళ్లోను ధర్మశాల వున్నది గనుక అందులో దిగినాను. బస్తా మొదలుగా నేను దిగుతూవచ్చిన ధర్మశాలలు ౨౦౦ అడుగుల నిడువు ౧౫ అడుగుల వెడల్పుతో వొక కూటమున్ను ఆరుఅడుగుల వెడల్పుతో వొక తాళ్వారమున్న్నూ వేశి రెండుకొనలలో రెండు కొట్టిడీలు కట్టివున్నవి. యిటువంటి ధర్మశాలలు రెండేశి వొక్కొక్క వూళ్ళో యెదురెదురుగా మధ్యే ౫౦౦ అడుగుల బయలు విడిచి రమణీయముగా కట్టివున్నవి. మధ్యేవుండే బయిలులో వొక బావి తొవ్వించివున్నారు. యీ ధర్మశాలలు కుంఫిణీవారు కట్టించి మూడుసంవత్సరములు అయినవి. ప్రతి ధర్మశాలలోను వొక పోలీసు బంట్రౌతును యిద్దరేశి ఝాడుమాలీలను వుంచినారు. యీ దినము దిగిన ధర్మశాలకు చేరినట్టుగా వొక బజారు కట్టివున్నది. సుందరమైన మామిడితోపులుకూడా సమీపములో వున్నవి. యీ వూళ్ళో సమస్తమైన పదార్థములు దొరికినవి.

౧౭ తేది వుదయాత్పూర్వము ౩ గంటలకు లేచి యిక్కడికి ౭ కోసుల దూరములో నుండే చత్రియా అనే వూరు ౧౦ గంటలకు చేరినాను. దారి సడక్కువేసి వున్నా వర్షము కురిసి యెండివున్నందున మనుష్యులను నడవనియ్యకుండా మట్టిగడ్డలు కాళ్ళకు నిండాగా గుచ్చుకుంటూ వచ్చినవి. యిక్కడి బోయీలను బేరాలని చెప్పవలెను. వారందరు గోపాలకజాతి అని తెలియవచ్చినది. మన దేశపు వుప్పాడ బోయీలు వారు మోశే దండె మీద చెయివేస్తే మాజాతి మణిగిపోయెనని బహు రచ్చచేస్తారు, వీరు స్నానము మొదలయిన ఆచారముకలిగి బ్రాహ్మణులకు యిక్కడి దేవతలకున్ను వుదకము పాకానికి తెచ్చియిచ్చి నిండా వుపచారము చేయను అర్హులుగా తుళసీమణి ధారణచేసి మాంసభక్షణ వదిలి నియమముగా వుంటారు. యీ వుత్కలదేశములో అమితమైన పొగచుట్టలు తాగుతారుగాని హుక్కాలప్రసక్తి లేదు. నేటిదారి కుడిపక్క కనుపడుతూ వచ్చే కొండలకు అడివికిన్ని సమీపము గనుక పులులభయము కద్దు. మేముదారినడుస్తూ వుం

డగా దారిలో వొక అంగడివద్దవుండే కుక్కను పులివచ్చి పట్టుకొనిపోయినదని గాబరాగా వుండినది. యీ వూరిలో బజారు వీధి వొకటే కలిగివున్నది. దిగడానకు ఇండ్లు నిండా చిన్నవిగా కట్టివున్నవి. నాపల్లకీలు నవుకర్లు వుండడానకు నడివీధిలో వొక గుడారము వేసి యిముడ్చుకొని దిగినాను. ధర్మశాలలు యిక ముందరలేవని విన్నాము. యీ వూళ్ళోను కావలసిన పదార్థాలన్ని దొరికినవి. యీ వూళ్ళో యిద్దరు పోలీసుఠాణా బంట్రోతులు ఠాణా వుంటారు. ఠాణా యిక్కడికి మూడుకోసుల దూరములో వున్నది.

నాతోకూడావచ్చిన మనుష్యులలో కొందరికి అకస్మాత్తుగా తాళకూడని కడుపునొప్పి తగిలి నూరుబొట్లు స్పిరిటులవండర్ ద్రావకము పోసియిస్తే కుదిరినది. కొంతమందికి నెత్తురుబంకపడుతూ వచ్చినంతలో లాడును ద్రావకము పదిబొట్లు చక్కెరలో పోసియిస్తే కుదిరినది. భేదులు అమితముగా అవుతూ వచ్చినవారికి శుద్ధిచేసిన అభిని మందు పూటకు చిన్నరూకయెత్తు యిస్తూ వస్తే కుదిరినది. స్త్రీసంబంధమయిన మేహరోగముమాత్రము వొకమాత్రానికిసాధ్యమయ్యేదిలేదు. వొక కావటివానికి అతి బలిష్ఠుడైనా సకృదావృత్తి ఒక స్త్రీ సంభోగము అయినంతలో మేహము మేహవ్రణముకూడా పుట్టి క్రమముగా పాదాలలో నొప్పిపుట్టి నడవ కూడకుండా కలిగి నా చేతనయినంత చికిత్స కలకత్తాలో చేయించిన్ని కుదరక నా స్నేహితులవశముగా ఆ మనిషిని కలకత్తాలో విడిచిపెట్టి వచ్చినాను.

ఈశ్వరుడు యింతరోగమును సకృదావృత్తిలో పురుషులకుయిచ్చేపాటి దేహధర్మముతో స్త్రీలను పురుషాకర్షణ చేయుచు వచ్చేటట్టుగా వేడుకతో తిరుగుతూ వుండేటట్టు యెందుకు నియమించినాడో ఆకారణము అతనికే తెలియ వలసినది. అయితే నాకు తోచేది యేమంటే ఆరీతిగా స్త్రీలను వుంచడము వల్ల తనకటాక్షానకు పాత్రులు కాతగ్గ పురుషులకు అడివిలో చరింపుచు నుండే వ్యాఘ్రము మొదలయిన మృగాలను చూచితే యెట్లా భయపడి దూరస్థు లౌదురో తద్వత్తుగా అయ్యే నిమిత్తమని తోచినది. అయితే అతని మాయ దురత్యయము గనుక మోహాన్ని జయించలేకుండా వున్నాము.

యీ గౌడ దేశములోనున్ను వుత్కల దేశములోనున్ను చింత పండు మిరపకాయలు విస్తారముగా మన దేశమువలె తినక పోయినా మన దేశస్థుల నిమిత్తము కావలసినవి అంగళ్లలో పెట్టి వుంచుతారు. యెండు మామిడి వరుగు చింతపండుకు బదులుగా వాడుతారు. మామిడిచెట్లు అమితముగా కలవు. తోటలలోకూడా అవే పెట్టి పయిరు చేస్తూవున్నారు. యీ దేశపుబోయీలు మిట్టలు యెక్కవలసినప్పుడు హరిబోలో అనే మాటతో కంఠధ్వని వుగ్గళించి చేయుచూ వచ్చుచున్నారు.

౧౮ తేది ఉదయాత్పూర్వము ౪ గంటలకులేచి యిక్కడికి ౭ కోసుల దూరములో నుండే కటకమనే షహరు ౧౧ గంటలకుచేరి నాను. దారి సడక్కువేళ గట్టిపడి వున్నా నిన్నటి దినము అమితమయిన వర్షము కురిసినందున దారినిండా అడుసుగా వుండినది. కటకముముందు రెండుకోసులు కద్దనంగా సడక్కులో నుంచి వొక కాలువ చీలిమహానదిలో కలిసినది. ఆదారి గులకయిసుక పరగా వుండినది. ఆ మహానది కటకము చుట్టుకొని ప్రవహింపుచున్నది. ఆ నది రెండుకోసుల వెడల్పు కద్దు. యీ నది వింధ్యపర్వతములో వుత్పత్తిఅయి కటకానికి సమీపముగానే సముద్రగామి యయినది. వైతరణినది మొదలుగా కటకము వరకున్ను అతిఘోరమయిన అడవిగా లోగడ వుండినది. యిప్పుడు కుంఫిణీవారు కలకత్తాలో వుండే బంగాళీధనికుల కుండా ఆ అడివి కొట్టించి సడక్కు వేయించినారు.

కటకముపూర్వమందు ఢిల్లీ కింద వుండినది. అక్కడిపాదుషాకుటుంబస్థులకు అంతఃకలహము కలిగి అరాజక మయిన మీదట నాగపూరు యేలుతూ వున్న షాహురాజు వంశస్థులు యీ నెట్టునవున్న అధికారస్థులనుకొట్టి తీసుకున్నారు. పిమ్మట యింగిలీషువారు పునాషహరు స్వాధీనము చేసుకొని క్రమక్రమముగా హిందుస్థాన సమగ్రముగా స్వాధీన పరచుకుంటూవచ్చేసమయములో నాగపూరుఅప్పాసాహేబుతో కలహప్రసక్తి అయినది గనుక ఆకలహము ఆకరము చేసుకొని కటకపుజిల్లా స్వాధీన పరుచుకొన్నవారై పిమ్మట నాగపూరు రాజ్యము ఆరాజు సంబంధకుని అధీనము చేసినప్పుడు యీ కటకపుజిల్లా ఢిల్లీ పాదుషాది గనుకనున్ను ఆ ఢిల్లీ తఖ్తు యిప్పట్లో తమచేతికింద వున్నది గనుక అన్యా

యముగా మీావారు ఆక్రమించిన కటకపుజిల్లా మీాకు యివ్వవలశినది లేదని యింగిలీషువారు నిలుపుకొని యేలుతూ వున్నారు. ౨౫ సంవత్సరములుగా వీరి అధీనములో వుండివున్నది.



## ఇరువది ఒకటవ ప్రకరణము.

కన్యాకుమారి మొదలు కాశ్మీరమునకు సమీాపమయిన దేశము వరకు ఉత్తరదక్షిణములున్ను సింధునది మొదలు బ్రహ్మపుత్రినది వరకు తూర్పు పడమర లున్ను యింత అనాయాసముగా యెంతో దూరవాసులయిన క్రీస్తు మతాంతరులకు యీాశ్వరుడు స్వాధీనము చేయవలసిన దేమని మరిమరి యోచించగా నాబుద్ధికి విశేషముగాతోచినది యేమంటే మన పూర్వీకులు చెప్పియుండే "అహింసా పరమోధర్మః, స్వర్ణస్తేయం సురాపానం, ఆత్మవత్సర్వ భూతాని" యివి మొదలయిన వచనముల యొక్క ధర్మములను జగత్తులో అందరున్ను పరిపాలన చేయసాగితే ప్రపంచధర్మము జరగక లోకము కృత్యరహితమై శాంతినిపొందును గనుకనున్ను అటువంటి శాంతి యీాశ్వరుని చిద్విలాసానకు వ్యతిరిక్తము గనుకనున్ను అటువంటి ధర్మాలు అందరున్ను జరిపించ నేరరు గనుకనున్ను ప్రపంచముయొక్క మర్యాదప్రకారము కామక్రోధములతో చిద్విలాసము నడుస్తూ వుండేటట్టుగానున్న అటువంటి ముఖ్య ధర్మాదులు వదలకుండా కొందరు అవశ్యముగా లోకములో జరిగించి యీాశ్వరుణ్ని తృప్తిపరచి ఈశ్వరకటాక్షము సంపాదించి అటువంటి జగదీశ్వరునియొక్క దుర్లభమయిన కటాక్షము తాము సంపాదించుకునేటట్టుగా తమకు అయాచిత జీవనము కలుగచేసి కాపాడుచువచ్చిన ఇతరులక్షేమమును "స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం" అనే వచన ప్రకారము ప్రార్థింపుచూ వుండేకొరకు బ్రాహ్మణ క్షత్రియులు మొదలయిన వర్ణములు నిర్ణయించపడ్డవిగదా? అందులో క్షత్రియులు చేయుచూవచ్చినక్షాత్రధర్మపురస్సరమయిన రాజ్యపరిపాలనపూజ్యులుగా వున్న బ్రాహ్మణులకు దురభిమాన పురస్సరముగా పూర్వకాలములో సరిపడక ఆగ్రహోదగ్రులై క్షత్రియులను నిర్వంశము చేసినందున

రాజ్యపరిపాలనచేయ నేర్చిన సంప్రదాయకులు యీ కర్మభూమిని లేకపోయిరి. కడమ మూడువర్ణములవారు యెంతవారివారి ధర్మములు జరిపింపుచున్నా శిక్షకులు రక్షకులున్ను అయిన క్షత్రియులు లేకపోయినందున వీరి స్వధర్మములు దీర్ఘముగా జరిపించుకోలేక వర్ణాశ్రమ సంకరులైనారు.

శాంతిరహితులయిన బ్రాహ్మణులద్వారా యింత సంకరము అయిన వెనుక యీశ్వరుడుచూచి వీరి శిక్షనిమిత్తము బలాత్కారముచేత కర్మశూన్యులను చేయ నేర్పరచిన తామసగుణప్రధానులయిన మహమ్మదు మత ప్రవిష్టులను యీ భూమిలో ప్రవేశింపబెట్టి కావలసినంతమట్టుకు పూర్వపు వాసనప్రకారము కర్మద్వారా జ్ఞానము సంపాదించవలెనని పోరాడుతూవుండే బ్రాహ్మలను శిక్షించినాడు. పూర్వికులుచేసిన పాపానికి వారివంశస్థులు యెట్లా శిక్షకు అర్హులయినారని విచారిస్తే "మాతా శేశద్ మక్కళ్ క్కు" అనే అవ్వయారు వచనమే ఆకరము. పిమ్మట యీశ్వరుడు కృపాసముద్రుడు గనుక ఆనుపూర్వికమైన కర్మభూమి శుద్ధముగా కర్మశూన్యమైపో వనే భయముచేత సత్వగుణప్రధానులై బుద్ధికుశలతచేత యీశ్వర సృష్టి అయిన అనేక బ్రహ్మాండముల గతులను ఉత్తర దక్షిణ ధృవనక్షత్రాల స్థితులనున్ను తెలిసి సాహస ధైర్యములతో నక్షత్రరూపముగా నుండే బ్రహ్మాండాల వృచ్ఛములను పట్టి సముద్రము మధ్యే వాడలను నడిపించి యిన్ని బ్రహ్మాండములకు సృష్టికర్తగా వొకడేవున్నాడని నమ్మి యీశ్వరుణ్ని ఆరాధనచేయుచూ వుండే యింగిలీషువారికి తగుపాటి బహుమతిగా ఈ కర్మభూమిని అవలీలగా యిచ్చినాడని తోచినది.

యీశ్వరుడు చిద్విలాసార్థమై ప్రతి చైతన్యానికి భిన్నరూపము భిన్నధ్వని భిన్నతాత్పర్యము కలగచేసి వున్నాడు గనుకనున్ను ప్రకృతి దేహములకు సద్గురుకటాక్షము కలిగేవరకున్ను ఆత్మస్తుతి పరనింద చేసేటంతకన్నా మిక్కిలీ ఆనందము వేరే లేదు గనుకనున్ను సాత్విక బుద్ధిగా విచారించితే హిందువులను తమ క్రీస్తుమతానకు యెక్కువ అని వారు అనుకోక పోయినా సరిపోలిన దనియైనా అనుకోవచ్చును. దురత్యయమయిన యీశ్వరమాయ ఇట్టు సాత్వికముతో

వాక్యమాత్రముగా యెవరినిన్ని అనుకోనివ్వరు గనుకనున్ను మీాది మిక్కిలి హిందువులు పై సంకరద్వారా మత విషయమైన బహిరంగకృత్యములలో గర్హితముగా కొన్నికొన్ని ప్రమేయాలయందు నడుచుచున్నారు. గనుక పయిన నార, లోపల చెక్క, అందుకులోపల మధురమయిన విత్తు, కలిగిన బాదమపండు వతుగా వుండే హిందుమత సారమును తెలుసుకోలేక హిందువులు తెలియక మునిగిపోతారే; మనమతము పట్టితే కడతేరుదురే; అనే పశ్చాత్తాపముతో స్వగత ప్రకటన చేయను యింగిలీషువారు వుద్యోగిస్తావున్నారు గాని మరి యెటువంటి విషయములోనున్ను హిందువులకు యే విరోధముచేతనైనా తమచేత నయినంతమట్టుకు తొందరలేకుండా రాజ్యపరిపాలన చేయుచు ఈశ్వర కటాక్షమునకు దినదినానికి పాత్రులుగా ప్రవర్తింపుచువున్నారు.

యీ కటకపు షహరులో ౨౦౦౦ యిండ్లు కద్దు. పదివేలమంది ప్రజలు వుండవచ్చును. సమస్తమయిన పదార్థములు దొరుకుచున్నవి. తురకలు ఈ రాజ్యము చేసేటప్పుడు యిక్కడ తురకలు నిండా ప్రవేశించినారు. ఇప్పట్లో మొహరంపండుగ అయినందున యీావూళ్లో తత్ప్రయుక్తమయిన వుత్సవము జరుగుచున్నది. గాని దక్షిణదేశము వలెనే వుత్సవము జరిగించేవారు నామము బొగ్గు మొదలయినది పూసుకొని వెఱ్ఱిచేష్టలు విస్తారము చెయ్యడములేదు.

మహమ్మదుమతస్థులు కాబూలుదేశ ద్వారా హిందుస్థానములో ప్రవేశించిన వెంబడిగానే సింధునదీతీరమందు వున్న సోమనాధస్వామి గుడి నవరత్నఖచితమైనది వుండగా కొట్టి పాడుచేసి కోట్యంతరాల రత్నాలు స్వాధీనముచేసుకొని అక్కడి నివాసులనున్ను పంజాజ అనే అయిదు ధారలు కల సింధు నదీతీరమందు వుండే హిందువులనున్ను సుమారు లక్షమందిదాకా మహమ్మదుమతములో మేము ప్రవేశించమని చెప్పినందుకు వారిని శిరచ్ఛేదము చేయించినారు. అటుతర్వాత ప్రయాగలోవున్న అక్షయవటం యంత్రము మొదలయిన స్థలములను నిర్మూలముచేశినారు. కాశిలో విశ్వేశ్వరుడు అన్నపూర్ణ వగైరా దేవతలను వారి మందిరాలను బ్రహ్మాలయాలను పగలకొట్టినారు. యింత నిర్బంధము మహమ్మదు మతస్థులు జరిగించినప్పటికిన్ని

యిప్పుడు వుపాయముచేత క్రీస్తుమతస్థులు తమ మతములో చేర్చిన హిందువులలో సహస్రములో వొకపాలైనా ఆ కాలమందు మహమ్మదుమతములో హిందువులు ప్రవేశించక మహమ్మదు మతస్థులను క్రమక్రమశః తమ మతముజోలికి రాకుండావుండేటట్టు చేసుకొని యిడిసిన దేవాలయాలను బ్రహ్మాలయాలను మళ్ళీ వుద్ధరించుకుంటూ వచ్చినారు. క్రీస్తుమతస్థులు "ఉపాయేనతు యచ్ఛక్యం నతచ్ఛక్యం పరాక్రమైః" అనే వచనప్రకారము క్రమక్రమముగా యీ దేశములో గౌరవము సుతరాం లేకుండా వుండే జాతిని విస్తారముగా తమమతములో చేర్చుకొని కర్మఫలముయొక్క రహస్యము తెలియనివారిని క్రీస్తుమతమే వుత్తమమని చెప్పుకుంటూ వుండేటట్టు యెప్పటికిన్ని చేసి వున్నారు.

మహమ్మదు మతానకు క్రీస్తుమతానకున్ను (హిందూమతానకున్ను) వుండే తారతమ్యములను గురించి నేను ఒకకథ వినడమయినది. అది యేలాగంటే వొక ప్రభువు ఈ మూడుమతస్థులను వద్దవుంచుకొని వొక ప్రశ్న చేసినాడట. ఆ ప్రశ్న (ఏది) అనగా వొక దారిమధ్యే వొకడు భాటసారిని కొట్టి నిర్బంధపెట్టి తన యింటికి పిలుచుకొనివచ్చి ఆతిథ్యము యిచ్చేటట్టు సంకల్పముచేసుకొని యిల్లు కట్టుకొని కాపురము చేయుచూ వచ్చినాడు. మరివొకడు తన యింటియొక్క సౌఖ్యమును తన ఆతిథ్యముయొక్క రుచినిన్ని బోధచేసి దారినడిచేవారిని యింటికి పిలుచుకొని వచ్చి ఆతిథ్యము యిస్తూ వచ్చేటట్టు సంకల్పముచేసి వొక యిల్లు కట్టుకుని కాపురము చేయుచువున్నాడు. మరివొకడు తనయింటికి వొకరిని పిలువవలసినది లేదు, నేను వొకరింటికి వొకరివద్దికి పోను, నా అంతట నేను వుండవలసినదని నిశ్చయముచేసి యిల్లు కట్టుకుని కాపురము చేయుచు వచ్చినాడు. యీ ముగ్గురిలో యెవడు వుత్తముడని పై ముగ్గురి మతస్థులను ప్రశ్నచేసి నంతలో మహమ్మదు మతస్థుడు బోధించి పిలుచుకుని వచ్చేవాణ్ని న్ని తావులోపడివుండే వాణ్ని న్ని నపుంసకులుగా నిందించి ఆతిథ్యము యివ్వవలెనని తోచినప్పుడు వెర్రితనముచేత దారి పొయ్యేవారు రాకపోతే తన్ని ఆతిథ్యము యిచ్చేదే పురుషవాహినియని ప్రత్యుత్తరము యిచ్చినాడట. క్రీస్తుమతస్థుడు నిర్బంధము చేసేవాణ్ని

క్రూరుణ్ని గానున్ను వుండేతావులోనుంచి కదలనివాణ్ని స్థావరరూపుణ్ని గా నిందించి మనసును రంజితపరచి ఆతిథ్యం యిచ్చేవాడు శ్రేష్ఠుడని ప్రత్యుత్తరవుయిచ్చినాడట. హిందుమతస్థుడు మంచిపదార్థములున్ను మంచిస్థలమున్ను దొరికినవాడు తనకు అబ్బెగదా అనిన్ని కొత్తవాణ్ని పిలుచుకొని వస్తే తనకు దొరికిన మంచిపదార్థము భక్షణ చేసేవాడికె కొత్తవానికి లేక పదార్థాన్ని చెరిచి తాను భుజించక ఆ మంచి పదార్థాన్ని నిందించి పదార్థము కలవానికి పనికిరాకుండా కొత్తవాడు యెక్కడ చేసిపోనో అనే భయముచేత మంచి పదార్థము కలవాడు వొకణ్ని చేర్చక వొకనితోను చేరక తనంతట వుండును. వాడు పూర్ణుడున్ను బలవంతముచేసి తన పదార్థము పెట్టేవాడున్ను బోధించి తన పదార్థమును పెట్టేవాడున్ను సకాములు వుత్తమ పదార్థమును కన్నవారు కారు అని పరస్పరమున్ను నిందించినారట.

యిదిన్నిగాక మరివొక ఇతిహాసము విన్నాను. అది యేమంటే వొక యింగిలీషుదొర వొక బ్రాహ్మణ్ని నా దేహమువలెనే నీ దేహము రక్తమాంసాది యుక్తములయిన అవయవాదులతో చేసివున్నదే బ్రాహ్మలు మేము యెక్కువ అని అనుకోవడానకు కారణ మేమని అడిగినంతలో బ్రాహ్మణుడు పుల్లమామిడిపండు తియ్యమామిడి పండున్ను వొక్కదినుసు ఆకులు కొమ్మలుగల చెట్టున వొక ఋతువులో వొకటే విధమయిన తోలు కండముట్టెతో జనించి సమస్త విధాలా వొక్కటేరీతిగా వున్నా రుచిభేదము కావడానకు యేమికారణమో అదే కారణము బ్రాహ్మణుల యెక్కువతనాన కని చెప్పి మరిన్ని బ్రాహ్మలు శ్రేష్ఠులని యీశ్వరుడు చెప్పినాడంటాము గాని మేమే చెప్పలేదు. యెట్లా అన్ని మామిడిపండ్ల వుత్పత్తి స్థితిలయాలు వొక్కటే క్రమమయినా వాటి భోక్తకు వాటి రుచిభేదము తెలిశి యిది మంచి యిది చెడు అని వాట్లను వాడినట్లు మీ దేహ సారాన్నిన్ని బ్రాహ్మణ దేహాల సారాన్నిన్ని యెరిగి యీశ్వరుడు తియ్యమామిడి పండు శ్రేష్ఠమని రుచిచూడగలవాడు చెప్పినట్లు బ్రాహ్మలను శ్రేష్ఠులని నిరూపించినాడని చెప్పినాడట.

౧౯ తేదీ మధ్యాహ్నమువరకు కటకములో నిలిచి ౧౪ గంటకు బయలుదేరి యిక్కడికి ౫ కోసుల దూరములో నుండే గోపాలపూరు అనేవూరు ౫ గంటలకు చేరినాను. కటకముముందర చుట్టుకొనివుండే మహానదిని పడవలకుండా వొకసారి దాటినాను. లోగడ మామిడిచెట్ల శాలవుండగా వాటిమధ్యే యిప్పాకు సడకు వేసివున్నది. గనుక బహు రమణీయ్యముగా వున్నది. గోపాలపూరు గొప్ప వూరు. బాజారు వీధి కద్దు. వూరుమధ్యే వొక నరసింహస్వామి గుడి కట్టి లోపలి ఆవరణములో బ్రాహ్మలు దిగడానికి తాళువారము వేశి వెలిపక్క శూద్రులకు తాళువారము వేశి మిద్దె వేశికట్టివున్నది గనుక ఆగుళ్ళోనే దిగడ మయినది. నరసింహమూర్తిని సుందరముగా చేసివుంచినారు. యీమత్స్య దేశపు బ్రాహ్మణుడు రెండుకాలాలున్ను పూజచేస్తాడు. దక్షిణదేశపు చట్టముగా గుడి కొంచములో ముఖమంటపము వుంచి కట్టివున్నది. యీవూళ్ళో అన్నిపదార్థములు దొరికినవి. గోపాలపూరుముందర రెండు నదులు కాలినడకగా దాటినాను. వాటిపేళ్ళు భార్గవనది వొకటి, కుశనది వొకటి.

౨౦ తేదీ వుదయాత్పూర్వము ౧౪ గంటకు లేచి యిక్కడికి ౧౦ కోసుల దూరములోనుండే సత్యవాది యనే వూరు ౨ గంటలకు చేరినాను. దారిలో పిప్పిలి అనే మజిలీవూరివద్ద మనుష్యులు తడిశేపాటి వర్షము కురిశినది. రేపటిదినము ద్వాదశి గనుకనున్ను జగన్నాథమహా క్షేత్రములో కొంచము బ్రాహ్మణ భోజనము చేయింతామని యత్నముతో యీ దినము యింతదూరపు మజిలీచేయుడమయినది. యీవూరున్ను గొప్పది. మహాస్థలము. వొకమఠములో విశాలముగా స్థలమువుండగా దిగినాను.యిక్కడ గోపాల మూర్తిగుడి వున్నది. వజ్రరేఖయనే నది వొకటి చిన్నదిగా గుడికి సమీపముగా ప్రవహిస్తూవున్నది.

ఈ స్థలమాహాత్మ్యము పూర్వకాలములో గోకుల బృందావన నివాసిగావున్న కులీనుడయిన బ్రాహ్మణుడు, ఆసన్నకాలమందు వుపచరిస్తూ వున్నవాడికి తనకన్యకను యిస్తానని వాగ్దత్తము చేసినట్టున్ను, ఆవృత్తాంతము కన్యాబంధుజనము అబద్ధమని వాదించినంతలో గోకుల బృందావననివాసి యయిన గోపాలమూర్తి పురుషాకృతి ధరించి

యిక్కడి రాజుముందర సాక్షి చెప్పి ఆ కులీనుడికి కులీనుడికన్యను తీసి యిచ్చి వివాహము చేసినట్టున్ను అదిమొదలుగా యిక్కడ గోపాల మూర్తి విలశిల్లి అంగుళియ్యకముతో గీచి, నదిని కలగచేశి భ క్తవత్స లుడుగా వుండేటట్టు వాడుకుంటారు. మత్స్యదేశపు బ్రాహ్మల యిండ్లు యీవూళ్లో ౧౦౦ కడపదాకా వున్నవి. యీ మూర్తికి పిష్టపక్వాన్నము నైవేద్యముగాని ప్రత్యేక అన్నము నైవేద్యము చేసే వాడికలేదు.

౨౧ తేది వుదయాత్పూర్వము ౪ ఘంటలకు లేచి యిక్కడికి అయిదు కోసుల దూరములోనుండే జగన్నాధ మహాక్షేత్రము వుదయ మయిన రెండు గడియలకు చేరినాను. దారి సడక్కు వేసియున్నది. క్షేత్రానకు కోశెడు దూరములో తులసిదాసు అనే మహాపురుషుడి సమాధి వున్నది. అక్కడ జగన్నాధస్వామి స్థూపీమీదనుండే చక్రి దర్శనము అవుతున్నది. అక్కడి స్థలవాసులకు యధోచితము దక్షిణ యిచ్చి చక్రిదర్శనము చేయవలశినది. అటూరానాళాఘాటు కుండా క్షేత్రము ప్రవేశించినాను. ఆఘాటులో యాత్రి వచ్చినవారివద్ద హాశ్శీలు పుచ్చుకొనే కచ్చేరి వున్నది. అక్కడ మనుష్యుల గణన చేయించుకొని హాశ్శీలు యిచ్చి చీటీచేయించుకుని స్థలము ప్రవేశించ వలసినది.

యీ జగన్నాధ మహాక్షేత్రమాహాత్మ్యము పురాణ సిద్ధముగా యిప్పుడు తెలియడము యేమంటే పూర్వకాలమందు యీ భూమి అతిఘోరమయిన దండకారణ్యముగా వుండినది. అందులో నీలాద్రి అనే పేరుగల పర్వతము వొకటి వున్నది. అందులో నీలమాధవస్వామి అనే మూర్తి నివాసము చేయుచు కిరాతకులవల్ల ఆరాధన చేయ బడుతూ వుండినట్టున్ను యిట్లా వుండగా యిక్కడికి బహుదూరప్రాంత మందున్న యింద్రద్యుమ్న మహారాజుకు యీమూర్తి ప్రభావము ఈ స్థల ప్రభావమున్ను తెలిశి నిశ్చయముగా చూచి విచారించి వచ్చే కొరకు వొక బ్రాహ్మణ్ణి పంపించినాడు. పూజ చేయుచున్న కిరాత కులకు నీలమాధవస్వామి తత్పూర్వము నన్ను యెప్పుడు బ్రాహ్మణుడు వచ్చి దర్శనము చేయుచున్నాడో అప్పుడు మీఅధీనము వదిలిపోతానని

చెప్పివుండినాడు. గనుక యింద్రద్యుమ్న మహారాజువల్ల పంపించబడ్డ బ్రాహ్మడు తన్ను బ్రాహ్మణుడని తెలిస్తే కిరాతకులు హింసింతురనే భయముచేత ప్రచ్ఛన్న వేషుడై యీ దండకారణ్యము ప్రవేశించి స్త్రీలు మాయాశక్తి చైతన్య పరిపూర్ణులై సమస్త కామక్రోధ కలహాలు పురుషులకు కలగచేశేవారు గనుక వచ్చిన బ్రాహ్మణుడు కిరాతక రాజుకొమార్తెను స్వాధీనపరుచుకుని కిరాతకులవల్ల అర్చింపపడే నీల మాధవస్వామిని దర్శనముచేసి తన రాజుకు సమాచారము చెప్పను వెళ్ళినాడు. ఇంతలో నీలాద్రిపర్వతమున్ను నీలమాధవస్వామి మూర్తిన్ని సముద్రసైకతమువల్ల అంతర్ధానమైపోయి సముద్రతీరమందుండే చక్రతీర్థముదగ్గర బలభద్ర కృష్ణసుభద్రల మూడు కళేబరాలున్ను కొంతమట్టుకు దహనమై కొంతకాలకనిలిచి అవి దారుమొద్దువలెనే ఆ కారములు కలిగినవిగా కొట్టుకునివచ్చి పడివుండగా అందులో నీలమాధవస్వామి చైతన్యాంశలు ప్రవేశించివుండినవి. ఆ వయినము ముఖ్య కిరాతకులకు తెలిసి ఆ దారుమొద్దులను తెచ్చి మృదంగవతుగా వక్షస్థలములయందు ధరించి వాటిని వాయిస్తూ ఈశ్వరభజన చేయుచూ వచ్చినారు. ఇట్టి సమయమందు యింద్రద్యుమ్న రాజు యీ స్థలము ప్రవేశించి నీలమాధవస్వామి అంతర్ధానమయిన వర్తమానము తెలిసి ఖిన్నుడై బహు తపస్సుచేసి మళ్ళీ నీలమాధవస్వామి ఇక్కడ విలసిల్లుతానని వాక్కు యిచ్చినందు మీదట యిప్పుడు దృశ్యముగావుండే మందిరములు కట్టి మళ్లీ బహుకాలము తపస్సు చేయుచునుండగా యీ మందిరాలుపరరాజు స్వాధీనమై పోయినవి. మళ్ళీ యీమందిరాలనున్ను కిరాతకుల స్వాధీనముగా వున్న దారువులనున్ను యింద్రద్యుమ్నరాజు సంపాదించిన వెనక విశ్వకర్మ వృద్ధ స్వరూపముగావచ్చి ఆ దారుమొద్దులను బింబాలు చేస్తూవుండగా విశ్వకర్మ నియమించిన కాలము వరకు మనసు తాళక అతనుపనిచేసే ఆలయము తెరిచి చూచినందున సగము మట్టుకైన పనితో ఆ మొద్దులను యధోచితముగా బింబాకృతి చేసివిడిచిపెట్టి విశ్వకర్మ పోయినాడు. తర్వాత ఆరీతిగావుండే బింబాలలోనే మూర్తిభవిస్తానని అశరీరవాక్కుగా యీశ్వరాజ్ఞ అయివందున బ్రహ్మపురస్సరముగా ఆ మూర్తులను యింద్రద్యుమ్న రాజు

ఇక్కడ ప్రతిష్ట చేసినాడు. అది మొదలుగా యిక్కడ యీశ్వర చైతన్యము ప్రతిఫలించివున్నది—యిక్కడ ప్రసాదమహిమ యెక్కువ కావడానకు కారణము యేమంటే వైకుంఠములో నుండే శ్రీమహా విష్ణుదర్శనానకు సాంబమూర్తిన్ని బ్రహ్మయున్ను వెళ్ళినట్టున్ను అప్పుడు లక్ష్మీ సహితముగా విష్ణువు ప్రసాదము ఆరగింపు చున్నట్టున్ను ఆ భోగ్యాన్నమును లక్ష్మీ బ్రహ్మకు శివునికిన్ని యిచ్చినట్టున్ను వీ రుభయులు వుచ్ఛిష్టమని యెంచక మహాప్రసాదమని భుజించి వీరి స్వస్థ లాలకు వచ్చినంతలో వీరుభయుల భార్యలకున్ను వీరుభయులు కళాహీ నులై యున్నట్టు తోచి అందుకు కారణ మేమని అడిగినంతలో వీ రుభ యులు తాము మహాప్రసాదభక్షణ చేసిన వర్తమానము చెప్పగా ఆ యిద్దరుస్త్రీలు ఆ ప్రసాదభక్షణ కళావృద్ధి చేయతగ్గదిగాని కళా హీనము చేయనేరదే, మరి యేమి పనిచేసినారో అని చెప్పి ఆ ప్రసా దము మాకు యేల తెచ్చియియ్యకపోతిరి అని అడిగినట్టున్ను వీ రుభ యులు మీరు స్త్రీలు మాయాస్వరూపులు గనుక మహాప్రసాదానకు అర్హులుకారని మీకు తెచ్చి యియ్యలేదని చెప్పి మనము కళా హీనులు కావడానకు కారణ మేమో అడిగి తెలుసుకుందా మని మళ్ళీ విష్ణువద్దికి వచ్చినట్టున్ను విష్ణువు వారికి చెప్పడములో మా ప్రసాద భక్షణవల్ల మీరు కళాపరిపూర్ణులు కావలసినవారైనా ఆ మహాప్రసా దము స్వీకరించడములో ఆ ప్రసాదము మీ చేతులకు తగిలి పరం పరగా తక్కువఅయిన అవయవములలో తాకి ప్రసాదాన కగౌరవము మీవల్ల నడిచినదిగనుక తన్నిమిత్తమయిన అపరాధముచేత మీరు కళాహీనులైనారని తెలియచెప్పినట్టున్ను అందుకు ప్రాయశ్చిత్త మేమని అడగగా జగన్నాధ మహాక్షేత్రములో వొక పుణ్యతీర్థము వున్నది, ఆ పుణ్యతీర్థమందు మీరు స్నానము, పానము మొదలయినవి చేసితిరేని తత్పాపపరిహార మగు నని చెప్పినట్టున్ను బ్రహ్మ రుద్రులు అట్లా చేసినట్టున్ను తదారభ్య యీ స్థలము వదిలిపొయ్యేటప్పుడు యాత్రికు వచ్చినవారు అందరు ఆ తీర్థములో ప్రసాదవిషయ మయిన అపరాధపరిహారార్థము స్నానపానములు చేస్తారు. ఆ చొప్పున విష్ణుమహాప్రసాదానకు స్త్రీలు అర్హులుకారని తెలిసినవెనక

పార్వతి సరస్వతులు యిద్దరు ఈ స్థలములో తపస్సుచేసి సర్వసాధారణ ముగా స్త్రీలకు శూద్రులకు కూడా విష్ణుమహాప్రసాదము కలిగేటట్టుగా వరము తీసుకున్నారుగనుక అద్యాపి యిక్కడ ప్రసాదము సర్వసాధార ణమై తారతమ్యము లేకుండా పరిగ్రహింపబడుతూ వున్నది.

ఆ చొప్పున తపస్సుచేసే అవసరముగా పార్వతి విమలా అనే పేరు ధరించి యీ గుళ్లో విలసిల్లి ఆమె సంవత్సరోత్సవములో అద్యాపి తామసపూజాంగ మయిన జీవహింస బలులు అంగీకరింపుచున్నది. విష్ణుగుళ్లో ఆవరణము లోపల యీ బలులు జరగడము యుక్తము కాదని కొందరు సాత్వికులు యిటీవల విరోధిస్తే వారిని ఉపద్రవపెట్టి యథాప్రకారము ఆ శక్తి బలిపూజలు జరిగించుకుంటూ వున్నది. సర స్వతి రజోగుణ ప్రధానురాలు గనుక యథోచితమైన పూజను అంగీ కరిస్తూ యీ గుళ్లో పార్వతివలెనే విశేషనామధేయము లేక విలసిల్లి వున్నది. యీ గుళ్లో స్నానము చేసినమాత్రాన విష్ణుసారూప్యము కలగచేయ తగ్గపాటి వొక మహాతీర్థము వుండీన దట. తద్ద్వారా కాకులు మొదలయిన పక్షులకు విష్ణుసారూప్యము కలుగుతూ వచ్చె నట. ఆ తీర్థము యిప్పుడు కలిసామ్రాజ్యద్వారా అంతర్థానమై ఆ ప్రదేశముయొక్క నిశానిమాత్రము చూపింపుచున్నారు. రహస్య మయిన తాపిని మొదలయిన గ్రంథాలలో పరమాత్మ చతుర్థా కృతిగా ఇక్కడ దర్శనము యిస్తున్నాడని చెప్పేటట్టు తెలిసినది.

ఇక్కడి గుడి నన్నూరు అడుగుల చచ్చౌకములో సుమారు తిరువట్టూరి గుడిపాటి విశాలముగా రెండు ప్రాకారాలు కలిగివున్నది. గర్భగృహము మీది స్థూపీ అరిటి పువ్వందముగా రెండు తాటిచెట్ల పొడుగున కట్టి మీద చక్రము వుంచివున్నది. ముఖమంటపము విశాల ముగా పయిన గుంమటము అందము గల స్థూపీలు వుంచి కట్టివున్నది. ముఖమంటపముయొక్క బయిటి ప్రాకారము గోడలో తురకరాయి మీద చిత్తుళిపని బహుసుందరముగా చేసివున్నారు. గర్భగృహము చుట్టూ చిల్లర గుళ్ళు శానా కట్టివున్నవి. గుడిలోపల వొక అక్షయ వటము వొక ముక్తి మంటపము వున్నది. వాటికింద జపము చేస్తే ముక్తిప్రదమని నియమించివున్నారు. వెలిప్రాకారములో నన్నూరు

పొయిలుగల వంటశాల విశాలముగా వొకటి కట్టివున్నది. వొక్కొక్క పొయిమీద ౧౨ పిడతలు వుంచి అన్నము పచనమయ్యేటట్టు వయివు (పీలు) చేసివున్నారు. వొక్కొక్కపొయి ౫ వేల రూపాయలకు కదా చిత్తుగా అమ్మకానికి దొరుకుతున్నది. పచనమయ్యే ప్రసాదములో పొయి గలవానికి ప్రతి పిడతకు స్వతంత్ర హక్కు కద్దు. అందువల్ల పొయిగలవానికి వరుమానము విస్తారము. నిత్యము రమారమిని అయిదు గరిశెల బియ్యము అన్నము భోగ్యముగా నివేదనము అవుతున్నది. పిడతలు చేసే కుమ్మర్వాండ్లు ౫౦౦ యిండ్లు వా రున్నారు. ప్రసాదస్వీకారము చేయడములో ఉచ్ఛిష్టదోషము యెంతమాత్రము పాటించక స్వీకారము చేయుచున్నారు. గుడి లోగడ నీలాద్రిపర్వతమున్న తావులో కట్టివున్నది గనుక వూరువుండే భూమి కన్నా గర్భగృహము సుమారు నూరడుగుల పొడుగులో కట్టి వున్నట్టు తోచబడుచున్నది.

గుడికి నాలుగు పక్కలా నాలుగు ద్వారాలువున్నవి. అందులో తూర్పుపక్క ద్వారములో ఒక సింహాన్ని చేసివున్నారు. కనుక దాన్ని సింహద్వారమంటారు. అక్కడ సర్కారు మనుష్యులుంటారు. చీటీ చూచుకొని స్వామిదర్శనానికి గుడిలోపల మనుష్యులను యెంచి విడిచి పెట్టుతారు. జేలేశ్వరమువద్దవుండే సువర్ణ రేఖనది మొదలు గంజాం వద్దవుండే ఋషికుల్యానదివరకు వోఢ్ర దేశముగనుక యీమధ్యేవుండే కాపురస్తులు జగన్నాథానకు వస్తే యెంతమాత్రము హాశ్శీలు యివ్వనక్కరలేకుండా పూర్వమునుంచి యేర్పాటు అయివున్నది. యితర దేశస్థులు యెవరువచ్చినా నాలుగుదినములు స్వామి దర్శనము చేసి అయిదోదినము భోజనముచేసి పోవడానకు జనము ౧కి రుప ౨ | ౬ రు (2-6-0) యివ్వవలసినది. యెక్కువ దినాలు స్వామిదర్శనము అపేక్షిస్తే ఆలెక్కను త్రైరాశికము మీద రేట్టించి మహసూలు యిచ్చి చీటి పుచ్చుకోవలెను. మహసూలు తీరువచీట్లు యిచ్చేటప్పుడు పురోహితము వహించిన పండా మారిఫత్తున వాడి పేరు కూడా దాఖలా వ్రాసుకుని యిస్తారు. క్లుప్తమయిన దినాలకు యెక్కువగా యాత్రవారు వుండి పండా తెలియచేయకపోతే ౧౨ రూపా

యలు జులుమానా వాడివద్ద పుచ్చుకుంటారు. గనుక పండావాండ్లు క్లుప్త దినాలకు యెక్కువ వొక గడియఅయినా యాత్రవాండ్లను వుండనీయకుండా కూడా ఘాటీవరకువచ్చి సాగనంపించి లోగడ యిచ్చిన చీటీని మళ్లీ వెళ్లిపోయిన ఘాటులో దాఖలుచేసి యాత్రవాండ్లు సాగి పోయిన వయినము లెక్కపెట్టించి రిపోర్టు వ్రాయించివేస్తాడు.

యీ పండాలనే స్థలవాసులవి ౨౦౦ యిండ్లదాకా వున్నవి. వీరు ముప్పదియారు తెగలవారై పూజ వంట మొదలైన పరిచారకము గుళ్లో చేస్తూవుంటారు. ఈ గుడి దేవదాశీలు వింజామరలు మొదలైనవి వేశి వుపచారపు వస్తువులు చేత వుంచుకొని సన్నిధానములో సేవ చేయడముగాని నాట్యమాడడము లేదు. మేళగాండ్లు కొలువు లేదు. హాశ్శీలు మూలకముగా లక్షాయిరువై వేల రూపాయిలు సాలుకు వసూలు అవుచున్నవి. అందులో సగముమట్టుకు గుడి సెలవుల నిమిత్తము కుంఫిణీవారు నెలకు సుమారు నాలుగువేల రూపాయిలవంతున యిస్తూవస్తారు. * అన్నిరూపాయిలు ప్రసాదముగా నివేదనచేసి ప్రతి దినపు ప్రసాదాన్ని వారివారి క్లుప్తప్రకారము పంచుకోవలసినదిగాని వొక గవ్వఅయినా రొక్కముగా గుడి యిలాకాదార్లకు దొరకదు.

ప్రసాదాలు సింహద్వారము మొదలు ముఖమంటపము వరకు గంపలతో పెట్టి అనేక అంగళ్లుగా అమ్ముతూ వుంటారు. వుచ్ఛిష్ట వ్యవస్థను విచారించక సమస్త జనులున్ను రుచిచూచి కొనుక్కొను చున్నారు. కుంఫిణీవారు మహసూలు వసూలుద్వారా పైన వ్రాసిన ప్రకారము యివ్వడము కాకుండా గుడికి కొంత, లాకుజారి భూమిన్ని వుండివున్నది. స్వామిముందర భేటి యనే కానుకలు యేవివుంచినా సరకారుకు చేరుతున్నవి. యీ మహసూలు ద్వారా సరకారువారికి సమస్త శలవులుపోగా సాలుకు సుమారు పదివేల రూపాయలు మిగిలే టట్టు తెలిసినది. ♦పండాలకు యాత్ర వారిని యాచించి జీవనము చేయ

---

* చూడు. యీ పుటలోని వ్యాఖ్యానము.

♦ 1843 సంవత్సరము వరకు దేవాదాయములను కంఫిణీవారు స్వయముగా పరిపాలించుచుండిరి. కలెక్టరులు రివిన్యూబోర్డు తనిఖీక్రింద అజమాయిషీ చేయుచుం డిరి. మిగిలిన సొమ్ము తీసికొనుచుండిరి.

డమేకాని వేరే యెటువంటి భూజూపకమయిన ఆకరములేక వున్నా లక్షాధికారులుగా కొందరు పండాలు వున్నారు.

మూడుమూర్తులున్ను దేవదారు దారువులతో నడుముమట్టుకు తీరితీరని అంగములతో చేసివున్నవి. బలభద్రుడు జగన్నాధస్వామి యనే మూర్తులకు రెంటికిన్ని మణికట్టులేని హస్తాలు ఆలింగనము చేసుకోను జాచిన వతుగా యేర్పరచి యున్నవి. మధ్యేవుండే సుభద్రా బింబము చిరతవాలుగా చేతులు లేకనే యేర్పరచబడి యున్నది. జగన్నాధస్వామికి కుడి పక్క సుదర్శనమనే •పేరుపెట్టి వొక ముసలాకారముగా ఆదారువుతోనే వొక రూపము యేర్పరచి వుంచినారు. ౧౨ సంవత్సరములకు వొకసారి వచ్చే అధిక ఆషాఢమాసములో కొత్త దారువులను తెచ్చి మూర్తులు యిక్కడ పారంపర్యముగా చేసే శిల్పులచేత చేయించి పూర్వీకపు కిరాతకుల వంశస్థులలో ముక్తిని అపేక్షించి ఏకవారాశనము చేసి బ్రహ్మచర్యము చేయుచునుండే వృద్ధులచేత పాతమూర్తుల వక్షస్థలములో వుండే చైతన్యాన్ని కొత్తమూర్తులలో వుంపించి ఆవక్షస్థలానకు బిగము ముద్రలు వేయిస్తారు. సుభద్ర మూర్తిలోని చైతన్యము పరరాష్ట్రస్థులకు చిక్కి వోఢ్రదేశమందే వేరేచోట పూజింప బడుచున్నది. నాకు తెలియడములో బలభద్ర మూర్తిలోను జగన్నాధస్వామి మూర్తిలోను అద్భుతమయిన వొక లోహమిశ్రమయిన హస్తప్రమాణము గల వొక స్థూలాకృతి పరమాత్మకున్ను వొకవిగ్ర(హ)ము జీవాత్మకున్ను ప్రత్యామ్నాయముగా వుండేటట్టు విన్నాను. సుభద్రా దేవిబింబములో వొకలక్ష్మీనారాయణ మూర్తి సాలగ్రామము మాత్రము వుండేటట్టు విన్నాను. జగన్నాధ స్వామి బింబమున్ను బలభద్రబింబమున్ను గజస్థూలాకృతిగా చేసినారు. గర్భగృహములో వుండేటప్పుడు పీఠముమీద మెత్తతలగడలు వేసి వుంచి వస్త్రాలంకారము చేసివుంచుతారు. గనుక కాళ్ళుకలిగినట్టుగానే దర్శనము అవుతూవుంచున్నది. జగన్నాధ బింబమునకు నీలవర్ణము పూశి యున్నారు. బలభద్రబింబమునకు శ్వేతవర్ణమున్ను సుభద్రకు పసుపువర్ణమున్ను పూసి వర్ణములతో కండ్లుముక్కు యేర్పరచి

యున్నారు. రత్నమయముగా మూడుశిరోభూషణములు మూండు బింబములకు ధరించివున్నవి.

నిత్యము యేడు భోగ్యపదార్ధములు నివేదన మవుచున్నవి. వాటిలో ప్రథమద్వితీయాలు యేవంటే బాలభోగ్య మొకటిన్ని కిచ్చిడి భోగ్య మొకటిన్ని. యీ రెంటిలోనే విశేషపదార్థాలు చేరడముగాని తతిమ్మా భోగ్యములనంతా అన్నము పప్పుకూరలు చారు పులుసు పరమాన్నము వడలు అతిరసాలు మొదలయిన పిండి వంటలున్ను చేరి నివేదమవుచున్నది. బాల భోగ్యానకు దూదుపూరీ అని పాలమీగడతో వొక దినుసు పూరీచేస్తారు. అది అపూర్వముగా తోచినది. మిరపికాయలకు బదులు మిరియాలు వాడుతారు. హారతికి పచ్చకర్పూరము వాడుతున్నారు. ఉదయకాలమందు దంతధావన సేవయున్ను అర్ధరాత్రిలో బడాశృంగారపు సేవయున్ను ముఖ్యములు. నైవేద్యమయ్యేవరకు ప్రసాదాలు నియమము కల పండాల అధీనముగా వుంచున్నవి. నైవేద్యానంతరము జాతిహీనుల అధీనమయి అందరికి వారు తెచ్చి యిస్తూ వుంటారు. వంటశాలలో పాచకులు తప్ప యితరులు పోకూడదు.

జ్యేష్ఠశుద్ధ పున్నమనాడు గర్భగృహములోనుంచి మూర్తులను వెలిప్రాకారములో వుండే అభిషేక మంటపానకు నడిపించి తీసుకుని వచ్చి జ్యేష్ఠాభిషేక మంటపములో సాయంకాలము దాకా వుంచి రాత్రి మళ్ళీ నడిపించి గర్భగృహము వద్దికి తీసుకొనిపోయి మరుసటి అమావాస్య వరకు తెరకు లోపల యెవరికిన్ని దర్శనము లేకుండా శయనావసరముగా మూర్తులను వుంచి పెట్టుతారు. యీపక్షము యావత్తు కిరాతక వంశస్థుల ఆరాధనతో మూర్తులుంటున్నవి. పండాలుకూడా చూడడము లేదు. జ్యేష్ఠాభిషేక మంటపము బహువున్నతముగనుక ఆ అభిషేక దివము సాయంకాలము వరకు వూళ్లో యెదటి వీధులలో వుండే వారికంతా స్వామిదర్శనము అవుతూవుంచున్నది. యీ దినపు యాత్రనున్ను రథయాత్రనున్ను పతితపావనయాత్ర అని యిక్కడివారు చెప్పుచున్నారు. జ్యేష్ఠాభిషేకానంతరమువచ్చే అమావాశ్యమీది పాడ్యమినాడు ప్రతిసంవత్సరమున్ను చేసే క్రొత్తరథాలు మూంటినిన్ని సింహ

గొప్పది. ౧౦౦౦ యిండ్లు వుండును. రథములుపొయ్యే వీధులు మాత్రము నిండా విశాలముగా వున్నవి. స్వతంత్రుడుగా శీమనుంచి వచ్చివుండే పేయిర్ అనే దొరను యాత్రవారి మహసూలు వసూలు చేసే పనులలో కలకటరు హస్తాంతరముగా మామూలు ప్రకారము అటారానాళాఘాటువద్ద వుంచి వున్నారు. యాత్ర వారి సమేతముగా పండాల విచారణ ఆ దొర పరమై వుంచున్నది. బియ్యము మొదలయిన సమస్త పదార్థములు అంగళ్లలో వుండేవి. స్వామికి నివేదనార్హములు గనుక వాటిని వాసన చూచి మళ్లీ ఆ రాసులలో వెయ్యనియ్యరు. యీ నియమము వింతగా యీవూళ్లో జరుగుచున్నది. మహాజనులనే సాహుకారులు యీ వూళ్లో లేరు. సమస్త పదార్థములు దొరుకుచున్నవి. యీవూరు సముద్ర తీర మందున్నది. యిక్కడ సముద్ర స్నానము బహుముఖ్యము. జాతుల వాండ్లు సముద్రతీరమందు యిసుక దిబ్బలలో వుపాయమైన యిండ్లు కట్టుకుని కాపురమున్నారు.

కొత్త మూర్తులను ప్రతిష్ఠచేసిన వెనక గుళ్లోవుండే పాత మూర్తులను మూటినిన్ని రెండో ప్రాకారములో వుండే మోక్ష ద్వారమనే కూపములో ప్రవేశింప పెట్టుతారు. ఆ కూపము అగాధమైన లోతని తెలియవచ్చినది. ఆ కూపము వుండే ప్రదేశానకు యిక్కడివారు పోను భయపడుతూ వుంటారు. పాత మూర్తులలో నుండిన చైతన్యకళలను కొత్తమూర్తుల వక్షస్థలాలలో ప్రవేశింప పెట్టినవెనక రెండుమూడు నెలలలో ప్రవేశింపపెట్టిన వృద్ధ కిరాతకులు దేహాలు వదులుతారని నిశ్చయముగా తెలిసినది. దాని కారణము యీశ్వరునికే తెలుసును. అయినా నాకు భయమే కారణముగా తోచుచున్నది. యిక్కడ నాలుగు కూరలు పప్పువులుసు పరమాన్నము రెండు పిండివంటలతో సాధారణముగా వెయ్యంటికి భోజనము చేయించ వలిస్తేయిన్నూటయాభై రూపాయలు సరాసరిపట్టు చున్నవి. యిక్కడ అనేక మఠాలున్ను రోగిష్ఠులకు ప్రసాదవినియోగ మర్యే కొరకు కుంఫిణీ ధర్మశాల వొకటిన్ని వుండేటందున బ్రాహ్మణ భోజన నిమిత్తము వొకదినము ముందు పిలిస్తే పండితులు పామరులు సహా

వెయ్యింటికి చేరుతారు. గుడి పండాలలో ౧౫౦౦ కి దాకా చేరుదురు. గోసాయిలు బయిరాగులు యేనూటికి చేరుతారు. వొక్క అణా పామరుని కిన్ని నాలుగుఅణాలు పండితునికిన్ని దక్షిణయిస్తే ఆనందింపుచున్నారు. గొప్పవాడు యీ స్థలము విడిచిపెట్టి వచ్చేటప్పుడు గుడియిలాకాపండాలకు నూరు రూపాయలు బహుమతి రూపముగా మొత్తముగా యిస్తే వారివారి తారతమ్య ప్రకారము కలియపంచుకొని తృప్తిని పొందుతారు. యీ పండాపురోహితులు మాత్రము యెంతకు తృప్తిని పొందడము లేదు. నాపరువుకు మున్నూరు రూపాయలు ముట్టచెప్పితే యెంత మాత్రము నా పురోహితునికి కనికరము తోచ లేదు.

వింధ్యకు ఉత్తర దేశస్థులు యెందరు ధనికులు యెందరు ప్రభువులు యే యాత్రవచ్చినా యే సత్కర్మములు చేయతలచినా తోచిన కాలమందు యీశ్వరుడు యిచ్చిన సంపత్తుకొద్ది దానాలు చేసి యత్నసిద్ధి గలవారవుతారు గాని దాక్షిణాత్యుల స్వభావము వలె నేటికి బోరిగెల కోసుకోగానే సరేనా, యెల్లప్పటికి వొక్కటేరీతిగా నడవను యోచనచేసి ఒక్కటే నిదానముగా ధర్మము చేయుచూ వుండవద్దా? అని వెర్రితనముగా యీశ్వర వేద్యము లయిన భవిష్యత్కార్యములను తమకు తెలిసినట్టు తమ అధిక జాగ్రతవల్ల కొన్నిపనులు నడవ తగ్గట్టుగా యీశ్వరుడు కటాక్షించిన కాలమందు కూడా శక్తికొద్ది ధర్మము చేసుకోకుండా విత్తము త్యాగభోగరహిత మయ్యేటట్టు దాచి వ్యర్థోపయోగ మయ్యేటట్టు చేయడములేదు. గనుక హిందుస్తానులోని గొప్పవారు యీ పండ్యాలవంటి యాచకులకు యిచ్చే ప్రకరణములో అతిశయమైన యీవిని యిస్తారు గనుకనున్ను దక్షిణ దేశస్థులు కొంచముయిచ్చి తియ్యనిమాటలు శానా చెప్పుతారు గనుక దక్షిణ దేశస్థులకు యేర్పడివుండే పండ్యా దాక్షిణాత్యులకు రాక్షసులని నామకరణము చేసినాడు.

ఈ స్థలముయొక్క రీతి యేమంటే గుళ్ళోవుండే బింబాలు నిరూపించకూడని స్వరూపాలతో వుండడమున్ను రెండుబింబాలు యిరుపక్కల వుండేవి యథోచితముగా సమమయిన గాత్రముతో వుండడమున్ను మధ్యే సూక్ష్మరూపముతో ఒక బింబము స్త్రీ అని పురుషుడ

నిన్ని సందేహవిషయముగా వుండడమున్ను వుచ్ఛిష్ట నిషేధములు లేక ప్రసాదస్వీకారము చేయడమున్ను ప్రసాదముమీద అత్యంతగౌరవ మున్ను జాతినియమ వర్జితమున్ను యివి మొదలయినవి కలిగియున్నవి. వీటిని చూవత్తున్ను వొక సమూహముచేసి వాటివాటి కారణాలున్ను ఆ కారణాలలో పరంపరగా జన్యమయ్యే కారణాలున్ను యివంతా విచారించగా నా బుద్ధికి తోచడము యేమంటే సమస్తమయిన కర్మ భూమియందున్ను సగుణోపాసనకు అనుకూలముగా అనేక దేవతల ఆరాధనలు నియమించి వారివారి భార్యలతోకూడా బింబాలను చేసి వాటికి మందిరములు కట్టి ఆరాధింపుచూ వుండగా నిష్కాముడయి మహాత్ముడయి నామరూప రహితుడయి జ్ఞానస్వరూపుడయిన దేవుని యొక్క రీతిని లోకులకు కృష్ణలీలలను భాగవతసేవ అనే ఆటమూల కముగా ప్రసిద్ధపరచినట్లు యీ జగన్నాధమందిరాన్ని కట్టి యిందులోని మూర్తులను యీరీతిగా రూపనిర్ణయము లేక కల్పించి స్థాపించి వొక తత్వ సంగ్రహ పురాణద్వారా ఉచ్ఛిష్టదోషరహితముగా ప్రసాద గ్రహణము జాతిభేద నివృత్తి యీ స్థలములో కలగచేసి ప్రకాశింప చేసినట్టు తోచుచున్నది. దాని క్రమ మేమంటే శుద్ధతత్వము సమస్తశృతిచోదితముగా నాదము బిందువు కళ అతీతము అని చెప్పబడుచున్న నాలుగు వస్తువులు ఒకటిగా అయితే అవాఙ్మానస గోచర వస్తువు ప్రకాశిస్తున్నది. నాదస్వరూపమయిన జీవాత్మ, బిందు స్వరూపమయిన ఆత్మ, కళాస్వరూపమయిన అంతరాత్మ, అతీతస్వరూప మయిన పరమాత్మ వీటియొక్క రూపములు యిట్టివని నిర్ణయించ కూడనిది సత్యము గనుక నిర్ణయించకూడని రీతిగానే జీవాత్మ అని చూపించేకొరకు యిప్పట్లో బలభద్రుడనే బింబాన్ని చేసి ఆత్మ నిరూపణకొరకు సుభద్ర బింబాన్ని చేసి అంతరాత్మయొక్క నిరూపణకొరకు జగన్నాధస్వామిబింబాన్ని చేసి పరమాత్మ నిరూపణకొరకు శుద్ధస్తంభాకారముగా వుండే సుదర్శన బింబాన్ని కల్పించి యీ నాలుగింటిని బోధితము లయ్యేటట్టు చేయడము అవా ఙ్మానస గోచరవస్తువుయొక్క అన్నమయినందున ఆ అన్నాన్ని ప్రసాద ముగా యిక్కడ పేరుపెట్టి సమస్తానకు ఆధారభూతము అన్నము

గనుక దాన్ని సమస్తవిధాలా యిక్కడ పూజితపరచి అన్నము యెట్టి గతిని పొందినా నిషిద్ధముకాదని యేర్పరచి ప్రపంచము యావత్తు పైన వ్రాసిన అయిదు పదార్థాలకు అంతర్భూతము అయినది గనుక నేను యెక్కువ, నీవు తక్కువ అనే బుద్ధి లేకుండా జాతి నియమాదులు కూడా మరిచిపోయి ప్రవర్తించేటట్టు ప్రసాదస్వీకార విషయములో వొకనిర్ణయము కలగచేసి అందుకు కొన్ని పురాణాలున్ను ప్రసిద్ధ పరచినట్టు తోచుచున్నది. అటువంటి సారవత్తైన పురాణములు యిక్కడ దొరకకపోయినా వాటి కథాక్రమము యెవరికైనా యిక్కడ జ్ఞాపకము వుందునా అని విచారిస్తే యెటువంటె పండితునికిన్ని నాకు తోచినకథ వినికిడి అయివుండేటట్టు తోచలేదు. అయితే పరబ్రహ్మ నాలుగాకృతులతో యీ స్థలమందు ప్రకాశింపుచున్నాడని వొక మాట స్థూలముగా పండితుల వాక్కున ప్రచురముగా వినపడుచున్నది. వాటి క్రమ మేమని అడిగితే ధోరణిగా చెప్పను వారికి వినికిడి లేకుండా వున్నది. యిటువంటి మహాస్థలములో జూన్ నెల ౨౬ తేది వరకు వసించినాను.

12/11/50

## ఇరువదిరెండవ ప్రకరణము.

౨౭ తేదీ భోజనోత్తరము ౧౧ ఘంటలకు బైలుదేరి యిక్కడికి ౫ కోసుల దూరములో వుండే నరసింగఘాటు అనే వూరు ౩ గంటలకు ప్రవేశించినాను. యీ వూరు చిన్నదైనా ముసాఫరులకు కావలసిన సామానులు అన్ని యిచ్చేపాటి కోమట్లున్నారు. యిక్కడ కోమట్లు రెండు తెగలు. కళింగ కోమట్లని వొక తెగ. గౌర కోమట్లని వొక తెగ. దక్షిణదేశములో వుండే తెగ గౌరకోమట్లు. యిక్కడ గౌరకోమట్లునిండా లేరు. యీవూళ్లో దక్షిణదేశస్థుడు ముద్దుకృష్ణ పిళ్లె అనేవాడు గంజాంలో వుద్యోగముచేసి వొక డాబా అనే సత్రము చుట్టు మిద్దెవేశి కట్టి మధ్యే జగన్నాథస్వామికి వొక మందిరముకట్టి వొక తటాకము వొక వనప్రతిష్ఠ చేసి భూస్థితులు సంపాదించి అతని ఆచార్య పురుషుడు జగన్నాథ నివాసియై వుండగా అతనికి దానము యిచ్చినాడు.

ఆ డాబా యేనూటికి దిగేపాటి విశాలముగా వున్నది. గుళ్ళో వోధ్రి బ్రాంహ్మణునిగుండా పూజ నడిపింపుచు అప్రతిగృహీత సంతతివారు యిప్పటికి వుంచుకొని వుండేటందున అందులో దిగినాను. యీ వూరికి సమీపముగా జగన్నాథ క్షేత్రములో వుండే పండ్యాలు మొదలైన వారికి ముఖ్యమైన యిష్టదేవత అయిన వొక చండీదేవి ప్రతిమ వొక చిన్న కొండమీద ప్రతిసంవత్సరము తామసపూజలు అంగీకరింపుచువున్నది. నేటిరాత్రి సముద్రతీరమందు యిసుకలో నడిచివచ్చినాము. యెండకాలములో దారి యిక్కడ నడవడము ప్రయాస అనిపించును. చెట్లనీడకూడా లేదు. యీ ౫ కోసుల దారికి చెరిసగములో వొక మంచి నీళ్ళబావి వొక బోగంది తొవ్వించినది వున్నది.

౨౭ తేది వుదయాత్పూర్వము 3 గంటలకు లేచి యిక్కడికి ౬ కోసులదూరములో వుండే మాణిక్యపట్టణము ౭ గంటలకు చేరినాము. నిన్నదిగిన మజిలీవూరివద్ద వొక వుప్పు టేరు వున్నది. పాటుపోటు కాలాలు చూచి దాటవలెను గాని పడవలువుండే పాటి లోతు కలది కాదు. నేటిదారి సముద్రతీరము. యిసుకలో చిలక సముద్రము అనే వుప్పుకయివారగా నడిచివచ్చినాము. మాణిక్యపట్టణములో పోలయినుదారోగా వుంటాడు. యీ వూరు మొదలుగా మాలుర్ఘా అనే వూరివరకు వొక తురకవానికి జాగీరు. యిక్కడ సమస్త పదార్థములు అంగళ్ళలో దొరుకును. యీ వూరివద్ద చిలకసముద్రము దాటవలసి వున్నది గనుకనున్ను యాత్రవారికి దిగడానకు స్థలములేక ప్రయాసపడుతూ వుండినారు గనుక గంజాం కలకటరువద్ద శిరస్తాగా వుండే వెంకన్నపంతులు జాతి వివక్షనగా దిగడానకు వసతిచేసి సుందరమయిన ధర్మశాలకట్టి సదావృత్తి అందరికీ యిస్తూ వున్నాడు. యీ ధర్మశాలలో యీ దినము వసించినాను.

౨౮ తేది వేకువనే 3 గంటలకు లేచి అక్కడికి ౫ కోసుల దూరములో నున్న మితాగున్వ అనేవూరు ౧౦-౧ గంటలకు చేరినాను. యింత పొద్దుపోను కారణమేమంటే, బయిలుదేరిన వూరిముందర చిలక సముద్రమనే నది దాటవలెను. అది ౨ కోసుల వెడల్పు కద్దు. దాన్ని దాటించే హక్కు యిచ్చటి జాగీరుదారు డయిన తురకకు యివ్వబడి

వున్నది. ఆ తురక యీ నదిలో పడవలను పురుగులు తూట్లుపడేటట్లుగా తినివేస్తున్నవని నలుగురు యెక్కేపాటి వొంటికొయ్య దోనెలు నాలు గయిదు చేయించివున్నాడు. మనిషికి అణా ౧ బండికి ర్పు ౪ (౦-8-౦) గుఱ్ఱానికి ర్పు । (0-4-0) యీలాగు కూలితీసుకుని దాటింపుచున్నాడు. ఆ చిన్నదోనెలతో నా పరిజనము నూరుమందిన్ని, మూడుబండ్లున్ను, మూడు సవారీలున్ను దాటను అక్కడనే వుదయమయిన ౭ గంటల దాకా పట్టెను. నాకు సర్కారుకుమ్మక్కు వున్నందున అంత త్వరగా దాటినాను. సాధారణమైనవారు రెండు మూడుదినాలు కాచివుండవలెను.

యీ మితాగువ్వలో వుప్పుకొఠాలున్ను వున్నవి గనుక వాటి అధికారస్థులు ఇండ్లుకట్టుకుని వున్నారు. జాగీరుదారుడు కట్టించిన డాబా సముద్రపు యిసుక పెట్టి పూడిపోయినది. యిప్పుడు త్రొవ్వి బయిటికితీసినా దిగను వసతిగావుండలేదు. వొక్కమర్రిచెట్టు తప్ప వేరే చెట్టునీడకూడా లేదు. వొక్కటే అంగడి వున్నందున అక్కడ వొక బావివొద్దున చెట్టునీడలో వంటభోజనము కాచేసుకుని ౨ గంటలకు బయిలుదేరి రాత్రి ఆరు గంటలకు యిక్కడికి ఆరుకోసులదూరములో వుండే మాలుఝూ అనేవూరు చేరినాము.

యిక్కడ జాగీరుదారుడు కట్టిన డాబా పనికిరాక వున్నది. వూరు పెద్దదిఅయినప్పటికి యాత్రవాండ్లు దిగడానకు స్థలము లేదు. వూరిముందర వొక పెద్ద వటవృక్షమున్ను అమృతతుల్యమైన జలము గలిగి మంచివూటగల బావి వొకటిన్ని వుండగా వాటివద్ద డేరాలు వేశి దిగినాను. యిక్కడ పోలీసు జమేదారుడు వుండే స్థలము గనుక రాత్రిపారాచౌకీ యివ్వడానకు నలుగురు చౌకీదార్లను పంపించి నాడు.

కలకత్తా మొదలుగా ప్రతిగ్రామములోనున్ను దక్షిణదేశ ములోని తలారుల వలెనే యిక్కడ నాయకులని కొందరు వుంటారు. యిదిన్నిగాక చౌకీదార్లని సరకారువారు యేర్పరచిన వారు కొందరు ప్రతివూరికి వుంటారు. అందరున్ను పోలీసు నౌకరుల అధీనమయి వుంటారు. ఈ మాలుఝూ అనే వూళ్ళో ౧౦ అంగళ్ళదాకా వున్నవి. సమస్త పదార్థాలు దొరుకును. నేట్టిదారి చిలక సముద్రము

మూలురఘూ యీరెంటి మధ్యే, యీ దినమంతా నడిచినాను. దారి శుద్ధ యిసక. నిలవ నీడ లేదు.

౩౦ తేది ఉదయాత్పూర్వము ౪ గంటలకు. లేచి యిక్కడికి ౫ కోసుల దూరములో వుండే ప్రియాగ అనేవూరు ౮ గంటలకు చేరినాను. యీవూరు మొదలుగా మదిరాసు గౌరణ్మెంటు యిలాకాతో చేరినది. వూరుగొప్పదేను. అన్నిపదార్థాలు దొరుకును. యిక్కడ వొకతపాలా రైటరు గంజాం కలకటరుకింద వున్నాడు. సుంకంచావడి వొకటి వున్నది. వచ్చేపొయ్యేవారి మూటముల్లెలు సరిహద్దుజాగా అయినందున ఆ సుంకరులు శోధించి చూస్తారు. యీవూరు మొదలుగా చెన్నపట్టణపు రూకలు దుడ్లలెక్క. కలకత్తా పయిసాలు మూలురఘూలో చెల్లుచున్నవిగాని యీ ప్రియాగలో పట్టరు. యీ హద్దు మొదలుగా పిచ్చశేరులు. శేరు ౧కి యిరువై రూపాయల యెత్తు. శేరు యిన్నిరూకలని వెలగాని యిన్నిఅణాలు పయిసాలు అనుకోవడము లేదు. గంజాములో వుండే వొక గౌరకోమటి యిక్కడ విశాలముగా డాబాకట్టి వొక వనప్రతిష్ఠ, తటాక ప్రతిష్ఠయున్ను చేసి భూస్థితికూడా వాటి పరిపాలనకు సంపాదించినాడు.

యీ ప్రాంత్యాలలో కొండలు గుహాలు అడువులు కల ప్రదేశాలను మన్యా లంటారు. ఆ మన్యాల యజమానులను మన్యదొరలని చెప్పడము, వారు తమకు యిష్టములేనివారి యిండ్లను కలిమిగలవారి యిండ్లనున్ను మనుష్యులకు రాత్రిళ్లు దివిటీలు యిచ్చి పంపించి కొళ్లపెట్టించి మనుష్యులను నరికించి యిండ్లను కాల్పిస్తూ రావడము సహజముగనుక అదేరీతుగా యీ వూరి తపాలారైటరు యిల్లు మరివొకరిద్దరి వర్తకుల యిండ్లున్ను ౧౫ రోజుల కిందట యీ ప్రాంత్యపు జమీందారుడు దోపించినాడు. యీ దేశపుజమీందారుడు డాబాభూస్థితిని జప్తీ చేసుకొన్నందున డాబా బేమరామత్తు కింద వసతి తప్పివున్నది. సమీపమందుండే టెంకాయతోపులో డేరాలు వేయించి వంట భోజనము చేసుకొని ౧ గంటకు బయిలుదేరి యిక్కడికి ౬ కోసుల దూరములో వుండే గంజాం అనే షహరు ౫ గంటలకు చేరినాను.

వుదయాన నడిచినదారి సముద్రతీరమైనప్పటికి యిసక వొక

మాత్రముగా వుండినది. భోజనాత్పరము నడిచిన దారి యేనుగపాడుగా యిసక దిబ్బల మధ్యే. వొక పక్క సముద్రము, కుడిచేతిపక్క అంది పుచ్చుకున్నట్టు వింధ్యపర్వతము వుంచూ వచ్చినది. యిక్కడ వింధ్యపర్వతము సముద్రములో కలిసినట్టు తోచుచున్నది. యిక్కడ యెప్పుడున్ను దొంగలు కొట్టి దోచడము వాడికె యని తెలిసినది. నిలవ నీడ, తాగ నీళ్లున్ను దొరకవు. ప్రయాగకు గంజానికి చెరిసగములో వొక బావి. వొక చిన్న శివాలయమున్నున్నది. ఆగుడిచుట్టూ యీశ్వరాజ్ఞచేత వొక మర్రిచెట్టు ఆవరించునట్టు అల్లుకుని యేనూటికి చాలే పాటి చల్లని నీడ గలిగివున్నది.

గంజాం షహరు ౧౫ యేండ్లకిందట మల్లాడి యనే జ్వరముచేత హతమైనది గనుక నున్ను మిగిలినవారు బురంపురమునకు వలసవెళ్ళి అద్యాపి అక్కడి నివాసులై యున్నారు గనుక షహరు పాడుపడ్డట్టుగా కనుబడుచున్నది. యిక్కడ వాడలు మరామత్తు చెయ్యడానకు గంగాతీరమందు కలకత్తాలోనుంచి వుడిబడియాకు నావలమీాద వచ్చే దారిలో బాందలు అమితముగా చేసి పగిలిన వాడలను వుంచివుండేటట్టు యిక్కడ సముద్రతీరమందు గదులు చేసి వాడలు వుంచివున్నది. అనేక గొప్ప యిండ్లు ఖాలిగా వున్నవి గనుక అందులో వొక యింట్లో దిగినాను. యిక్కడ వొక రేవుదొర, వొక కొత్తవాలు న్నున్నారు. ముసాఫరులకు కావలసిన పదార్థాలు అన్ని దొరుకుచున్నవి.

యీ గంజాం పట్టణము ఋషికుల్య అనే నదితీరము. వింధ్యగిరి యిక్కడనే సముద్రగామి యయినందుననున్ను, యీ గంజాము వింధ్యకు దక్షిణదేశ మనిపించుకోబడి యిక్కడివారు యీ ఋషికుల్యానది మొదలుగా చాంద్రమాన రీత్యా అయ్యే ప్రభవాది సంవత్సరములను సంకల్పములో చెప్పుతారు. ప్రయాగ యనే వూరివరకు బృహస్పతి మానము, గంజాం మొదలుగా చాంద్రమానము. గంజాం మొదలుగా యీశ్వర నిర్ణయ ప్రకారము కళింగదేశము ఆరంభమవుటచేత యిండ్లు మనుష్యుల అలంకారాలు దృష్టిదోషపు పాటింపులు దక్షిణదేశము వలెనే యావత్తు కలిగివున్నవి. చిన్న యిండ్లకు కూడా వాకిటి పంచతిన్నెలు పెట్టి కట్టినారు. ప్రతిస్త్రీలు బులాకులు ముక్కర

ధరించి వున్నారు. సమీపమున వుండే మాలుఝూ అనేవూరిలో యెవరికి రాని తెనుగుభాష యిక్కడ అందరికి వచ్చివున్నది.

జూలాయినెల ౧ తేదీ వుదయాత్పూర్వము మూడుగంటలకులేచి యిక్కడికి ౫ కోసుల దూరములో వుండే నాయడిపేట అనేవూరు యేడుగంటలకు చేరినాము. యీ దినము దారి మదరాసు గొరణమెంటువారి హుకుముకు లోబడ్డభూమిలోది గనుకనున్ను యీ గొరణమెంటువారి యోచన లగాయతునుంచి హిందువులను చలి పురుగులకు సములనే అగౌరవబుద్ధితో ఆత్మార్థమైన పనులలో సర్వ కృషిచేసి పరార్థమైన పనులుమాత్రము యీశ్వరాధీనముచేసి వుండడము సహజము గనుకనున్ను కలకత్తా గొరణమెంటువారి వలెనే లోకోపకారమైన దారులను గురించి నడక్కు వేశే ప్రయాస వీరు విశేషము పుచ్చుకోకుండా వున్నందున యధోవిలాసముగా అడివి యీ జిల్లాలో బలిసివున్నది గనుక ఆ అడివిలో సూటిగా లయనువేసి నూరడుగుల వెడల్పుకు అడివికొట్టి శాలచెట్లు పెట్టినారు. ఆచెట్లుమాత్రము అక్కడక్కడ వొకటొకటి జీవించివున్నది. భూమిని చదరంగానైనా చేసినవారుకారు గనుక లయనుకుచుట్టూవుండే చదరపు భూమిని వెతుక్కొని దారినడిచేవారు తాము దారులు కలగజేసుకుని నడుస్తూ వున్నారు.

యీదినమంతా ఘాట అడివి దారిలో ఛత్రపురమనే వూళ్లో కలకటరు స్థలవసతినిమిత్తము వసింపుచున్నాడు.*

యీ నాయడిపేట యనే వూరు అడివిమధ్యే వున్నది. ఆ వూరి వద్ద అడివికొట్టి బందా చలమయ్య యనే కోమటి వొక డాబా కట్టించి గుంటబావి తొవ్వించినాడు. వొక అంగటివాడు వున్నాడు. అక్కడ పదార్థాలు మృగ్యముగా దొరికినవి. అక్కడ భోజనము కాచేసుకుని అక్కడికి మూడుకోసులదూరములో వుండే బురంపురమనే బస్తీ నాలుగు

* అరణ్యమార్గంగా ఛత్రపురానికి ప్రయాణము కలకటరుకచేరీలో ట్రాన్సులేటరుగా వుండే కపిల రామదాసుపంతులుగారికి నేను వక వుత్తరంవ్రాసివున్నందులో ఆయన 40 కావళ్ళు 2 దలాయతులు ఒక గుమాస్తాను పంపి అరణ్యమార్గం సుళువు చేయించినాడు. (చూ. వ్రాత ప్రతి పుట ౪౧౩)

గంటలకు బయిలుదేరి యేడు గంటలకు చేరినాను. దారి తెల్లవారి వలెనే వున్నది.

బురంపురము బస్తీవూరు. గంజాంలో మకారత్రియమనే మల్లడి మాత్రా మరాహి అనే జ్వరములవల్లనున్ను కొండపాళెగాండ్ల బంది పోటువల్లనున్ను మరాటీల కొళ్ళగురాత్రిలవల్లనున్ను అర్థములు ప్రాణాలున్ను పోయి బేజారుఅయిన వెనక కలకటరు మొదలయిన ధైర్యము గల యింగిలీషుదొరలు సమేతముగా ఋషికుల్యానది దాటడానకు సందుచిక్కకుండా వలసవచ్చి ఈ బురంపురము ప్రవేశించినారు గనుక అదిమొదలు యీవూరు వొక పటాలముదండు కూడా వుండబట్టి బహు బస్తీ అయివున్నది.

యీవూళ్ళో కొద్దిదినములకు ముందు సర్వతోముఖమనేక్రతువు నడిచి ఆక్రతువు నిమిత్తము నన్ను యెరిగిన గోదావరీతీరపు బ్రాహ్మణ మండలి నూటికిదాకా యిక్కడ వచ్చివున్నది. ఆ బ్రాహ్మణులందరున్ను శ్రౌత్రవిషయము బాగా తెలిసినవారుగనుక అథర్వణ వేదము మూలమా లేక కడమ మూడువేదాలసంగ్రహమా అని నాకు బహుశః వున్న సందేహము వారివల్ల తీరునని వారిని విచారించినంతలో సంగ్రహమే నని తీరినది. అందుకు ఆకరము సర్వతోముఖయాగములో కడమ మూడు వేదాలవలెనే అథర్వణానకు ప్రత్యేకాధ్వరము లేదు. పయిగా లోకప్రకటనకు భారద్వాజులు మూడువేదాలే తెచ్చి యీ మూడింటిలోనుంచి అస్త్రప్రయోగ నిమిత్తము మంత్రసంగ్రహముచేసి క్షత్రియులకు అథర్వణమని పేరుపెట్టి వొక వేదము చేసియిచ్చినారు. పంచ గౌడులలో గాని పంచద్రావిళ్ళలో గాని మేము అథర్వణుల మని చెప్పేవారు యెవరున్ను లేరు.

కలకత్తాలోనుంచి జగన్నాధమువరకు బోయీలకు జనము వొకటింటికి యేడురూపాయలు లెక్కను, బండి వొకటింటికి యిరువై యెనిమిది రూపాయిలు లెఖ్ఖను తెచ్చి జగన్నాధమునుంచి మళ్ళీ బురంపురమువరకు వేరే బోయీలను, కావడివాండ్లను జనము వొకటింటికి ర్పూ౨౹ (2-4-0) వంతున బండి ౧కి ౭ ర్పూ లెక్కనిష్కర్ష చేసి తెచ్చినాను గనుక వారికి యివ్వవలసినది తీర్చియిచ్చి వేరేబోయీలను,

వస్తూ వుంచున్నవి. యిక్కడి నేతగాండ్లను దేవాంగు లంటారు. యీ దినపుదారిలో వున్న అడివి బలిశివున్నది. బహుశా భూమి నల్ల రేగడ. దారిలో మంత్రిరెడ్డి అనే వూరు వున్నది.

౮ తేది వుదయ మయిన ౫ ఘంటలకు లేచి యిక్కడికి ౫ కోసుల దూరములో నుండే కంచర్ల అనే వూరు ౧౦ గంటలకు చేరి నాను. యిక్కడ అయిసోలు (అయిపోలు?) వారు అనే, యీ దేశపు వర్తకులు వొక సత్రముకట్టి తటాకప్రతిష్ఠ, వనప్రతిష్ఠలు చేసి వొక గోసాయి అధీనము చేసినందున ఆ ధర్మశాలను గోసాయీలు వారి నివాస మఠముగా చేసుకుని అందులో వొక మూర్తిని పెట్టి ఆరాధన చేయుచూ సత్రానికి వుండే భూస్థితిని తమ అనుభవములోకి తెచ్చు కొని సదావృత్తిని నిలిపివేసి ఆధర్మశాలలో భాటసారులను ప్రవేశించ నియ్యకుండా నిర్బంధము పెట్టుతూ వచ్చినారు గనుక యీ జిల్లా శిరస్తా వెంకన్నపంతులు యిక్కడనున్నూ, వేరే ధర్మశాల విశాల ముగా కట్టింపుచున్నాడు. యిక్కడవుండే కోమట్లు యిటీవల బందిపోటు వల్ల నొచ్చిపోయి విడవలి యిండ్లు బందిపోటువారి దీపారాధనకు అను కూలముగా మళ్ళీ కట్టుకుని, వచ్చినవారికి కావలసిన సామాను యిస్తూవున్నారు. యీవూళ్ళో గుంటవొడ్డున వంట, భోజనాలు కాచేసు కొని 3 ఘంటలకు బయిలువెళ్ళి యిక్కడికి మూడుకోసుల దూరములో వుండే కొత్తపల్లి యనే వూరు ౫ గంటలకు చేరినాము.

యీ వూరివద్ద మహేంద్రతనయా అనే నది వొకటి వున్నది. యీవూరు బ్రాహ్మణ అగ్రహారము. యిది మొదలుగా వింధ్య దక్షిణదేశ మయినందున అవశ్యాత్తుగా గంగా యమునా మధ్యప్రదే శమునుంచి వచ్చిన బ్రాహ్మలను యిక్కడిరాజులు ఆదరించి బ్రాహ్మలు దేవమందిరాలు గల వూరే శ్రేష్ఠమని అక్కడక్కడా బ్రాహ్మలను ప్రవేశపెట్టుతూ వచ్చినందుననున్ను 'యథా రాజా తథాప్రజాః' అనే వాక్య ప్రకారము ఒకపాటిభూస్వాతంత్ర్యము కలవారుకూడా తమతమవూళ్ళల్లో బ్రాహ్మలకు వసతులు చేసియిచ్చి యిండ్లుకట్టి యిస్తూవచ్చినారు గనుక నున్ను యిదిమొదలుగా కన్యాకుమారి పర్యంతము బ్రాహ్మణాగ్రహా రాలు చూస్తూ రావచ్చునని తోచినది. కొండమార్గములో గోదావరి

దాటినది మొదలు యీవరకు అగ్రహార మనే మాట వినలేదు. పంచద్రావిడ బ్రాహ్మలు వొక సమూహముగా వున్న వూరు వొకటిన్ని లేదు. వోఢ్రదేశములోని మనుష్యులు మూఢులున్ను హఠవాదులున్ను కృత్రిమము చేత హఠము సాధించేవారుగానున్నానాకుతోచబడ్డది. యీబురంపురపు పహరుతో వోఢ్రదేశస్థుల ప్రచారము నిలిచిపోయినది. యిక్కడ అందరు తెనుగువాండ్లేగాని వోఢ్రదేశస్థులు అతిస్వల్పముగా నున్నారు. యీ బ్రాహ్మలయిండ్లు చిన్నవైనా అందులోనే దిగినాము.

౫ తేదీ వుదయాత్పూర్వము ౩ గంటలకు లేచి యిక్కడికి ౫ కోసుల దూరములోనుండే పలాశీ యనే వూరు ౭ గంటలకు చేరినాను. యీవూరు గొప్పదేను. వొక మఠము కొన్ని బ్రాంహ్మణయిండ్లునున్నవి. మఠములో దిగినాను. యీ వూళ్ళుఅన్ని జమీన్‌దారులవి. యీగంజాం జిల్లాలో సరకారుకు ౧౦ లక్షలరూపాయిలు వసూలవుచున్నవి. అందులో జమీన్‌దారుల వశముగా వుండేభూమి ఆరులక్షలరూపాయలది గాక మలకు రాజీ లని కొన్ని ముఠాలు లోకులు చేసి సాలుకు కిస్తీలప్రకారము సరకారు రూకలు కట్టుతూ వుంటారు.

ఈ దేశస్థులకు బహుమందికి అర్థలోభము చాలాకలిగి సుషుప్తికాలాలలో యిండ్లమీద పడి మనుష్యుల అర్థప్రాణాలు హరించే బుద్ధులు పుట్టడముచేత మల్లడియనే వింతజ్వరము యీశ్వరుడు వీరి శిక్షనిమిత్తము ఈ దేశములో పుట్టించి లక్షావధి ప్రజలను యీ లోకము వదలపెట్టినట్టు తోచుచున్నది. అయితే అందులో సాధువులుకూడా కొందరు లయించి యుందురే అని శంక తోచితే అందుకు సమాధానము (ఏకః పాపాని కురుతే ఫలం భుంక్తే మహాజనః) అనే వచనము. యీ వచనానకు దృష్టాంత మేమంటే వొకగురువు, వొక శిష్యుడున్ను సముద్ర తీరమందు సంచరింపు చుండగా వొకగొప్పవాడ మునిగి పోయినది. శిష్యుడు చూచి అనేకవేల జనము వాడతోకూడా మునిగి పోయినది గదా యిందుకు కారణమేమని గురువును అడిగినాడు. గురువు ఆవాడలో వొక పాపిష్టుడు వుండబట్టి వారిగతి అట్లా అయినదని చెప్పినాడు. శిష్యుడు యింత అన్యాయము యీశ్వరుడు చేయవచ్చునా?

వొకపాపి నిమిత్తము వెయ్యింటిని చంప నిచ్ఛయించెడను యుక్తమా అని ప్రశ్న చేసినాడు గనుక గురువు అందుకు మౌనధరుడై యుండెను. కొంతమేర యీశిష్య గురువులు వెళ్లేలోపలనే సువర్ణ రేఖలు గల వొక సుందర మయిన దక్షిణావర్త శంఖము శిష్యునికి ఆ సముద్రతీర మందు దొరికె నంతలో యెత్తి పూజ్యముగా వక్షస్థలమందు ధరించినాడు. ఆ శంఖములోపల అనేక లక్షల చీమలు శంఖములోని మాంసము భక్షించేకొరకు పుట్టపెట్టి వుండినవి. ఆ సమూహములోని వొక చీమ బయిలువెళ్లి శిష్యుణ్ని కరవగానే శిష్యుడు ఆ శంఖముతీసి అందులో చీమలగుంపు చూచి దాన్ని విశిరివుచ్చి సముద్రములో పడవేసినాడు. యీ నడితి గురువుచూచి యేమబ్బా వొకపాపి నిమిత్తము వెయ్యింటిని యీశ్వరుడు వాడతోకూడ సముద్రములో ముంచినందుకు యీశ్వరుణ్ని దూషించితివే, వొక చీమ నిన్ను కరిచినందుకు అనేకలక్షల చీమలు చచ్చేటట్టు యేలమంచిశంఖమును న్యాయ క్రమ మెరిగిన నీవు సముద్రములో పడవేస్తి వని అడిగినాడు. ప్రత్యుత్తరము లేనందున భిడియపడి శిష్యుడు మౌనమును ధరించినాడు.

యీ దినము నడిచిన దారి దట్టమైన అడివిమధ్యే వున్నది. వెదుళ్లు విస్తారముగా యీఅడవిలో వున్నవి. బురంపూరు మొదలుగా పర్వతసమూహాలు దారికి కుడిపక్క సమీపమందే వున్నవి. జగన్నాథము మొదలుగా భూమి సముద్రతీరమై యిసకైనందున ముంతమామిడి చెట్లు ముంతమామిడి పప్పున్ను ఈ ప్రాంతాల విశేషముగా కలవు. చెన్నపట్టణము వదిలినవెనక ఈ చెట్లున్ను తమిదె పయిరున్ను చూచినవాడనుకాను. గంజాం మొదలుగా బురంపురమువరకు భాట పశ్చిమాభిముఖముగా వచ్చి యిచ్ఛాపురము మొదలు కొండలకిందుగా దక్షిణాభిముఖ మవుచున్నది.

యీ దేశములో కర్ణాలు తక్కువజాతివారు. బ్రాహ్మణవేషధారులు. వారిని శిష్టకర్ణా లంటారు. వేశ్యాస్త్రీలను సాండీ లంటారు. బ్రాహ్మణాగ్రహారప్రవర్తకులను భుక్తు లంటారు. శూద్రగ్రామప్రవర్తకులను నాయిండ్లంటారు. తలారులను చార్లకు లంటారు. పల్లెలలో అంగళ్ళు వున్నందున సమస్తపదార్థాలు దొరికినవి.

యిక్కడ వంట, భోజనము కాచేసుకొని యిక్కడికి ౭ కోసులదూరములో నుండే రఘునాథపుర మనే గొప్పవూరు రాత్రి ౯ గంటలకు చేరినాను.

దారి వుదయాన నడిచినంత వసతికాదు. అంత దట్టమయిన అడివి ఇరుపక్కల లేదు. కొండలుమాత్రము దారికి సమీపముగా వున్నవి. దారిలో కొత్తఅగ్రహార మని వొకవూరు వుండగా దానివద్ద కొంత సేపు ఆసోదా చేసుకొని అక్కడి బ్రాహ్మలను పూజించి సాగివచ్చినాము.

రఘునాథ పురములో యిక్కడి జమీన్దారుడు వొక గొప్ప గుడి రెండు అంతస్తులుగా కట్టి రాధాకృష్ణులను ప్రతిష్ఠచేసి పూజ నైవేద్యాలకు వసతులు యేర్పరచి బైరాగుల అధీనము చేసియున్నాడు. బ్రాహ్మల యిండ్లున్నా రాత్రి అయినందున స్థలము విచారించుకోలేక ఆ గుడివద్ద డేరాలు వేసుకొని దిగి రాత్రిభోజనాలు మొదలయినవి గడిపినాను. గుడి మహాసుందరముగానే వున్నది. యీ వూరిలో సమస్త మయిన పదార్థాలు కలవు. మా డేరాలవద్ద అంగళ్లు తెచ్చి వేయించి కావలసిన సామానులు తీసుకొన్నాము.

౬ తేది ఉదయాత్పూర్వము నాలుగు గంటలకు లేచి యిక్కడికి అయిదుకోసుల దూరములో నుండే హరిశ్చంద్రపురము పదిగంటలకు చేరినాము. దారిలో కుంఫిణీవారు వేశిన లయను చుట్టు గనుక నున్నా, ఆ లయను మిట్టాపల్లాలుగా వున్నది గనుక, చిన్నగ్రామముల మీద పొయ్యే పూర్వము కలిగివుండే దారే యిప్పటికి నడుస్తూ ప్రసిద్ధి కలిగి వున్నది. అయితే లయనుదారి అనే మాటమాత్రము వొకటి యిక్కడ వినికిడిలోకి వచ్చియున్నది.

ఈవూరు ౪౦ యిండ్ల బ్రాహ్మణాగ్రహారము. గంజాం మొదలుగా బ్రాహ్మలలో వెలనాడు, కాసరనాడు, నియ్యోగు లనే వ్యవస్థలు కద్దు. యీ అగ్రహారాల కన్నిటికి జమీనుదారులు భూవసతులు చేసి వున్నారు. హరిశ్చంద్రపురములోను అంగళ్లున్నవి. సమస్త పదార్థాలు దొరికినవి. బ్రాహ్మణయిండ్లో దిగి వంట భోజనములు కాచేసుకొని నాలుగుగంటలకు బయిలువెళ్లి యిక్కడికి ౩ కోసులదూరములోనుండే నరసన్నపేటవద్ద వుండే రావులవరస అనే వూరు ఆరుగంటలకు చేరినాము. దారి పొడిచెట్లు అడివి. కాలిబాట రేగడభూమి

యీవూళ్లో కొరివి రామన్నపంతులు అనే జమీన్‌దారుడు నివాసము చేయుచూ వచ్చినాడు. వారియింట్లో దిగినాము. అంగళ్లు వూళ్లో లేకపోయినా నాపరివారానకు కావలసిన బియ్యము పప్పు యీవత్తు ఆ జమీన్‌దారిగారు యిచ్చినారు గనుక రాత్రి సుఖోపాయముగా గడిచినది.

మధ్యాహ్నము దిగినవూరు మొదలుగా నరసన్నపేటవరకు రాత్రిళ్ళు నిద్రలేదని గ్రామస్థులు చెప్పుతూవచ్చినారు. దానికి కారణ మేమంటే యిక్కడి జమీన్‌దారుడు కొన్ని బందిపోట్లకు ఆధార భూతుడైనందున సరుకోటు (Circuit) విచారణకు పెట్టినారట. ఆ కోటువారు పూర్తిఅయిన రుజువుకాలేదని అతణ్ని వదిలినారట. యిప్పట్లో నామీద సాక్షి చెప్పినవారి వూళ్ళన్ని కొళ్లపెట్టి తగల పెట్టుతానని పౌరుషము పులికి వున్నాడట. అందునిమిత్తము నిద్రలేక బాధపడుతున్నామని చెప్పినారు. జగన్నాధములోను వొకసంగతి వినడములో యిదే ప్రకారము హయిదరాబాదునుంచి ధర్మయాకలు తెచ్చే గుమస్తాలను యీదారిలో చంపినందుకు చచ్చినవాడివద్ద వున్న సామానులు కొన్ని దొంగలవద్ద దొరికిన్ని వారిని సరుకోటువారు వదిలినట్టు పండావాండ్లు చెప్పినారు. విజయనగరపు రాజు కాశిలో యిదే ప్రకారము దొంగలను సొమ్ముతోకూడా పట్టిన్ని సరుకోటువారు వదులుతారు గనుక నేను నిభాయించలేక రాజ్యము కలకటరు అధీనము చేసి కాశీనివాసము చేస్తానని చెప్పినాడు.

యింగిలీషువారి న్యాయమేమంటే, పదిమంది దొంగలు శిక్షలేక తప్పిపోవడము మంచిది గాని, సందేహముమీద వొకగృహస్థుడు దండనకు లోబడడము యుక్తము కాదని లలితముగా న్యాయవిచారణ చేస్తారు. యీ దేశములో చూస్తే వొకదుష్టుణ్ని రక్షిస్తే వెయిమంది శిష్టులను శిక్షించినట్టు అనేమాట ప్రత్యక్షముగా వున్నది. యెట్లా నడిస్తే మంచిదో, యెట్లానడిస్తే చెడ్డదో యీ ధర్మసూక్ష్మము తెలియడానకు యీశ్వరుడు సమర్థుడుగాని యీశ్వరజ్యోతి దీప్తిగా ప్రకాశించే ప్రకృతి జనులు శక్తులు కారు.

రావడముచేత కొన్నికొన్ని తావులలో పశ్చిమాభిముఖముగా వెళ్లి మళ్లీ, దక్షిణాభిముఖమవుతూ వచ్చుచున్నది.

యీ శ్రీకాకుళము బలరామక్షేత్రమని ప్రసిద్ధి. యీ స్థల మాహాత్మ్యము స్కాందపురాణాంతర్భూతమయిన కూర్మపురాణములో 30 అధ్యాయలలో విస్తరించియున్నదట. యీ వూరి చేరగా, లాంగూలనది అనే పేరుకల నది వొకటియున్నది. యీ వూళ్లో వీధుల నడమ ప్రవాహకాలాలలో నదిసంబంధమైన వుదకము ప్రవహిస్తూ వుంచున్నది గనుక యిండ్లు పురుషప్రమాణము మిట్టవేశి ఆ మిట్టల మీద కట్టుకున్నారు. నదీ తీరమందు కోటీశ్వరుడనే శివస్థల మొకటి పురాణసిద్ధమయినదిగా వున్నది. యీ వూళ్లో బ్రాహ్మణ గుజరాతి వాండ్లు ౪౦ యిండ్లవారు రత్నవ్యాపారసాహుకారు పనులు చేయుచున్నారు. సమస్తమయిన పనివాండ్లు వున్నారు. యీ వూళ్లో ౮ తేది పర్యంతము వెనక దిగబడిపోయిన బండ్లను కలుసుకొని వేరే బండ్లు యిక్కడ టీకా చేసేకొరకు నిలిచినాను. బండి ౧ కి బురంపూరు నుంచి యిక్కడికి కూలి రూపాయిలు ౭౺, యిక్కడినుంచి విజయనగరానకు బండి ౧ కి రూపాయిలు ౪ చొప్పున నిష్కర్ష చేసినాను.

౯ తేది వుదయమయిన ౫ గంటలకు లేచి యిక్కడికి అయిదు కోసుల దూరములో నుండే వెజ్జపురం ౯ గంటలకు చేరినాను. యీ వూళ్లో నాలుగు బ్రాహ్మణయిండ్లు వున్నవి. అంగళ్లు కలవు. సమస్తపదార్థాలు దొరుకును. ఆరునెలలుగా వర్షము లేక నిన్నరాత్రి మంచివర్షము కురిసినది. దారిలో యెక్కడచూచినా మడకలుకట్టి దున్నుతూవున్నారు. శ్రీకాకుళమునుంచి విజయనగరానకు రెండుమూడు మార్గాలు వున్నవి. అందులో యీ మార్గము సమీపమనిన్ని, వసతి అనిన్ని తెలిసినది. యీ వరకు నడిచిన దారి యిసకకలసిన రేగడ. నిండా మిట్టాపల్లాలు లేవు.

విజయనగరపురాజులు సంగీతసాహిత్య ప్రియు లయినందున కొందరు భోగస్త్రీలకు సంగీతరత్నాకరం భరతశాస్త్రప్రకారము శిక్ష చెప్పించి తయారుచేయించినారు. వారు కొందరు శ్రీకాకుళము వచ్చి వుండగా చింతా జగన్నాధపంతులు నిన్నరాత్రి వారి విద్యాప్రకట

యిక్కడ విజయనగరపు రాజు గురువు వశిస్తాడు. యీ రాజుయొక్క పూర్వీకులు వైష్ణవ మతస్థులయి దక్షిణదేశ సంచారము లోగడ చేసి నందున శానామంది వైష్ణవులను ఈ దేశానకు పిలుపించి ఈ రామ తీర్థాలలో ప్రవేశపెట్టి వారికి పుష్కలమైన భూజీవనాలు యిచ్చినారు గనుక వారు సంతోషముగా యీ రాజ్యములో వశింపుచున్నారు. ఈ విజయనగరము యిప్పటి రాజుల పూర్వీకులకింద ౨౫౦ సంవత్సరములుగా వున్నట్టు తెలిసినది. ఈదేశము దేవబ్రాహ్మణ సమాగమద్వారా ౧౦౦ సంవత్సరములుగా నిండార్లుగా కర్మభూమి అయినట్టు తోచినది. యీబస్తీలో రాజు వశించే చిన్న కోట వొకటి వున్నది. కోటవెలిగా వెయ్యిండ్లు కలవు. సమస్తమయిన పనివాండ్లు వున్నారు. బంగారుమీద పోగరపని చేసేవాండ్లు ఘట్టివాండ్లుగా శానామంది వున్నారు. సుందరమైన పాత్రసామానులు చేయగల కంచర వాండ్లున్ను, మంచి బట్ట నేసే నేతగాండ్లున్ను వున్నారు.

యిక్కడి రాజు రాజ్యమును విశాఖపట్టణపు కలకటరు ఆధీనము చేసి కాశీవాసము సహకుటుంబముగా చేసుటచేత యీ రాజ్యనివాసులు తల్లినికానని బిడ్డలవలెనే తల్లడింపుచున్నారు. యీ మొర ఆలకించగా హిందువులకు వర్ణాశ్రమధర్మముల ప్రకారము సమస్త తారతమ్యములు తెలిశిచేసే దొరతనమే మిక్కిలీ అనుకూలముగా తోచబడుచున్నది. యిక్కడి రాజుఅయిన నారాయణబాబు ధనసంగ్రహమయిన జాగ్రత విశేషముగా పెట్టక అప్పులపాలైనా ప్రజలవల్ల స్తుతి చేయబడుచున్నాడు.

యీ వూళ్లో బోయీలు బండ్లు మార్చుకునే నిమిత్తము సోమవారమంతా గోపాలస్వామి మఠములో నిలిచినాను. యీవూరి యిండ్లు యథోచితముగా బాగానే కట్టియున్నవి. రాజవీధులుమాత్రము విశాలముగానే కట్టియున్నవి. యీ సోమవారము జగన్నాథములో రథోత్సవము గనుక యీ వూళ్లోనున్ను ఒక జగన్నాథస్వామి గుడి వుండగా అక్కడ రథోత్సవము బహువిభవముగా జరిగినది. యీ రాజ్యము ౯ లక్షలరూపాయిల దని పేరు. ౮ లక్షలు యెత్తుతున్నది. సాలుకు ౫లక్షలు కుంఫిణీవారికి కట్టవలశినది. దేవాదాయము బ్రహ్మ

దాయము యీ రాజ్యములో ౨ లక్షల దాకా వుండేటట్టు విన్నాను. యిక్కడానున్ను బందిపోటు వుపద్రవము చెన్నపట్టణములో వారంటు తియ్యడాలు జడిజీకోటుకు యీడ్చడాలవలెనే *వొకరి మీద నొకరికి కోపమువస్తే నిమిషములో జరిగింపుచున్నారు. ఆదివారము రాత్రి నేను దిగిన వూళ్లో వొక బిందువు పడకపోయినా విజయనగరములో అమితమయిన వర్షము కురిసినది.



## ఇరువదిమూడవ ప్రకరణము.

౧౨ తేది వుదయాత్పూర్వము 3 గంటలకు లేచి యిక్కడికి ౬ కోసులదూరములో వుండే అలమంద యనే వూరు ౯ గంటలకు చేరినాము. యీ విజయనగరము దేశపు బోయీలు బాగా నడుస్తారు. చెన్నపట్టణములో పల్లకీసవారీలయొక్క షోకు బహుశా అందరికి కలిగి వున్నందున గంజాము మొదలుగా వుండే బోయీ లందరు చెన్నపట్టణమునకు వచ్చుచున్నారు. చెన్నపట్టణములోనుంచి నాతోకూడా యాత్రవచ్చిన యాత్రబోయీలలో కొందరు యిండ్లు బురంపురము వద్ద వున్నందున వారు శెలవుతీసుకొని వెళ్లినారు.

నేను కన్యాకుమారి మొదలుగా కాశ్మీరమువరకు సంచరించిన ప్రదేశములలో వుప్పాడ బోయీలకు సమానమైన మోతగాండ్లు, చూపలుర్, బలాఢ్యులు, అలంకారప్రియులు, ప్రయాసకు వోర్చగలవారు, బంట్రౌతుమూనాగా ఆయుధధారణప్రియులు యెక్కడా వున్నట్టు తోచలేదు. అయితే దేశముకాని కొన్ని దేశాలకు వస్తే యీ వుప్పాడబోయీలకు దేహదార్ఢ్యము తప్పి రోగిష్ఠు లవుతారు. వారిని జాగ్రతగా కాపాడుచూ వారి దేహములు నొచ్చిన కాలమందు ఆయా దేశస్థులయిన బోయీలతో పనిగడిపి వీరిని తీసుకొనివస్తే యీ వుప్పాడ బోయీలతో భూగోళ సంచారము యావత్తూ చేయవచ్చునని తోచుచున్నది. పాలకీలు మోశే వృత్తికి యీ వుప్పాడదేశస్థులనే ఈశ్వరుడు తగినవారినిగానే నియమించినట్టు తోచబడుచున్నది. అయితే వీరు మాంస, మద్య, మత్స్యప్రియులు ఖిక్కిలి అయినందున వీరు తాగి

నప్పుడు తమలో తాము పోట్లాడితే పోట్లాటలు ఖామందుల మనసున నిండా నొప్పిచేస్తున్నది.

నేను వుదయాన నడిచినదోవ కుంపిణీలయను దారి కిరుపక్కలా చెట్లుమాత్రము పెట్టి యెండాకాలములో వాటికి నీళ్ళు పోయడానకు మనుష్యులను వుంచుతారు. వర్షాకాలము రాగానే ఆ మనుష్యులను తీసివేయడమువల్ల పెట్టినచెట్లు అదృశ్యమయి మళ్ళీయివతలి సంవత్సరానకు కొత్తచెట్లు పెట్టవలసి వున్నవి.

యీ రాజ్యములో వీరభద్రరాజు యనేవాడు తనకు కావలశినంతా నారాయణబాబుగారి కార్యస్థులు యివ్వలేదని కొళ్ళగాండ్లను కొలువు పెట్టించి మనుష్యులను హింస చేయుచున్నాడు గనుక నేను బురంపురములో కొలువు పెట్టిన ఆరుగురు బంట్రౌతులు శ్రీకాకొళము నుంచి కోటునజీరు తయినాతి పంపించిన ముగ్గురుజవాన్లు గాక నారాయణబాబుగారి ఫౌజు సంబంధమయిన పదిమంది శిఫాయిలను కూడా తెచ్చినాను. అలమంధలో విజయనగరము రాజు నారాయణబాబుగారి వడ్డకుడు వాసము చేస్తాడు. ౧౦ బ్రాహ్మణయిం డ్లున్నవి. సమస్తమైన పదార్థాలు అంగళ్ళు కలవు గనుక దొరుకుచున్నవి. యిక్కడ వర్ష ప్రతిబంధముచేత యీ వూళ్ళో యీ రాత్రి వసించినాను.

౧౩ తేది వుదయాత్పూర్వము ౩గంటలకు లేచి యిక్కడికి ౬ కోసుల దూరములో వుండే సుబ్బవర మనే వూరు ౮ గంటలకు చేరినాను. దారి బహు దొంగల భయము. కొండలు, అడివి దారి కిరు పక్కలా వున్నవి. కొంతదూరము రాతిగొట్టు. తతిమ్మా దారి కొంతదూరము యిసకపొర, కొంతదూరము రేగడభూమిగా నున్నది. అలమంద అనే వూరికి సమీపమందు అరణ్యము మధ్యే కొండమీద పద్మనాభమనే స్థలము వున్నది. పురాతన ప్రతిష్ఠగాని అనాదిపురాణ సిద్ధముకాదు. అక్కడ మానుషసంచారము విస్తారములేదు. సుబ్బవరమనే వూళ్ళో వెన్నకోటివారు వొక గ్రామము విజయరామరాజువద్ద సంపాదించి వొకపాలు అగ్రహారానకు వృత్తులు చేసి మరివొకపాలు అన్నసత్రానకు వొదిగేటట్టు నిశ్చయము చేసి వొక అన్నసత్రముకట్టి మరివొకఫాలు తమ వంశస్థుల అనుభవానకు వుంచి

నాడు గనుక అతని వంశస్థుడైన రవణప్ప ఆ సత్రము లోకోపకార
ముగా బహుచక్కగా నడిపింపుచున్నాడు. యీ దినము మేము కొం
చము తడిశినందున యీ రాత్రికూడా నిలిచినాను. యీ వూళ్ళో
వచ్చిన సమస్తజాతిపాంథులకు కావలసిన భోజనసామానులు యీ
సత్రములో బలవంతముచేసి కావలిస్తే పక్వాన్నముగాకూడా పెట్టు
తారు. అంగళ్ళు విచారించనక్కరలేదు. ౫౦ బ్రాహ్మణయిండ్లున్నవి.
మంచి వసతైన గ్రామము.

యీ వూరికి రెండుకోసులదూరములో సింహాచల మనే మహా
స్థల మున్నది. ఆ గుడిఖర్చుకు సాలుకు ౧౦ వేల రూపాయిలు తగులు
చున్నవి. యీ ధర్మము విజయనగరపురాజు పరిపాలనచేయుచు
న్నాడు. యీ స్థల మాహాత్మ్యము ప్రహ్లాదుణ్ని తండ్రిదండనవల్ల
నివర్తింప చేసి కాపాడిన అవసరము. యీ మూర్తి పేరు వరాహ
నరసింహమూర్తి. అనేక జలధారలు స్రవించే పర్వతము మీద
వరాహాకృతిగా ఆ మూర్తి వొకమందిరములో వసించివున్నాడు.
౨౦౦ వైష్ణవుల యిండ్లు యీ స్థలమందున్నవి. రాజోపచారములతో
యీ మూర్తిని ఆరాధింపుచున్నారు. అక్షతదియతప్ప మరియేదినము
ఆ మూర్తి దర్శనము లేదు. తతిమ్మా దినాలు చందనముచేత ఆ
మూర్తిని కప్పివుంటారు. యీ మూర్తియొక్క ధ్యానశ్లోకము యీ
అడుగున వ్రాయుచున్నాను. శ్లో॥ త్రాహీతి వ్యాహరంతం త్రిదశ
రిపుసుతం పాతుకామ స్స్వభక్తం। విస్రస్తం పీతవస్త్రం నిజకటియుగళే
సవ్యహస్తేన గృహ్ణ । వేగక్రాంతం నితాంతం ఖగపతి మమృతం
పాయయ న్య స్స్వపాణౌ । సింహాద్రౌ శీఘ్రపాతక్షితినిహితపదః పాతు
మాం నారసింహః॥ యీ శ్లోకమే యీస్థల మాహాత్మ్యానకు సంగ్రహ
మని తెలియవలసినది.

౧౮ తేది వుదయాత్పూర్వము 3 గంటలకు లేచి యిక్కడికి ౭
కోసులదూరములో నుండే కసంకోట అనేవూరు ౯ గంటలకు చేరినాము.
దారిలో అనకాపల్లి యనే మజిలీవూరు వున్నది. పోలీసు అమీనున్ను
౫౦ యిండ్ల బ్రాహ్మణాగ్రహారమున్ను కలది. దారి నిన్నటివలెనే
భయోత్పాదకములయిన మన్యాలు యిరుపక్కలా కలిగివున్నవి.

కసంకోట యనే వూరు గొప్పదేను. అన్ని పదార్థాలు దొరికేపాటి అంగళ్లు కలవు. బ్రాహ్మణ యిండ్లలో వంట, భోజనము కాచేసుకుని వొక గంటకు బయిలుదేరి యిక్కడికి యేడుకోసులదూరములో నుండే యలమంచిలి యనే వూరు ౨ గంటలకు చేరినాను.

నేటి మధ్యాహ్నము దారిలో వ్యాఘ్రభయాలుకూడా కద్దు. యిది మజిలీవూరు అయినప్పటికిన్ని దారి వొత్తి వొకకోసుదూరములో వుండే దివ్యల అనే గ్రామ నివాసి యయిన భాగవతుల కిత్తన్న యెదురుగా వచ్చి తన వూరికి రమ్మని ప్రార్థించినందున ఆ వూరు ౨ గంటలకు ప్రవేశించి ఆరాత్రి ఆ మరునాడు శుక్రవారము వర్ష ప్రతిబంధముచేత నిలిచినాను. యీ వూరు ౧౦౦ యిండ్ల అగ్రహారము. అందరు ఉపపన్నులు అయినప్పటికిన్ని వొక యతిశాపముచేత పెంకుటిండ్లు కట్టక పూరియిండ్లల్లో కాపురము చేయుచున్నారు. యీ వూళ్లో వుండే బ్రాహ్మణులందరు వేదపారంగతులు. కిత్తయ్య యనే వారు జమీందారుడున్ను, మంచి సాంప్రదాయికుడున్ను. యీ వూళ్లో అంగళ్లు కలవు. అన్ని పదార్థాలు దొరుకును.

౧౬ తేది వుదయాత్పూర్వము ౪ గంటలకు లేచి యిక్కడికి ౫ కోసుల దూరములో నుండే నక్కపల్లి వుపమాకా యనే వూళ్లు ౯ గంటలకు చేరినాను. దారి కొంత వెల్లడిగా వున్నది. కొంత దూరము యిసకపరగానున్ను, కొంతదూరము రేగడగానున్ను వున్నది. వుపమాకా యనే వూళ్లో వొక చిన్నకొండమీద వెంకటాచలపతి గుడి వున్నది. ౫౦ యిండ్ల వైష్ణవాగ్రహారము ఆ గుడిని నమ్ముకుని వున్నది. వెంకటాచలపతిపేరు ప్రసిద్ధి. యీవూరు మొదలుగా దక్షిణ దేశములో కలిగివున్న దని తెలియవలసినది. ఆకు తినే మేకల మందలు పొలాలలో విశాఖపట్టణముతోచేరిన విజయనగరపు రాజ్యము సరిహద్దు మొదలుగా చూస్తూవస్తాను. జగన్నాధము మొదలుగా యేదలనే యెనుములు పోతులు విస్తారము కలవు.

విశాఖపట్టణము జిల్లా సాలుకు ౧౪ లక్షల రూపాయిలు యెత్తుచున్నది. భూమి యావత్తు జమీందారుల అధీనముగాని కలకటరు అమానీ విచారణలో యేమాత్రమున్ను లేదు. జమీందారులకు యీ

జిల్లాలో ౧౦౦ కి ౨౫ వంతున లాభము వచ్చును. అయినా బందిపోట్లు వల్ల నిండా నొచ్చిపోవుచున్నారు. నక్కపల్లి, వుపమాకా యనే వూళ్ళున్ను చేరినట్టుగానే యున్నవి. మధ్యే వొక చెరువుకద్దు. వుపమాకాలో వొక శివమందిరమున్ను, దానితో చేరినట్టు వొక సత్రమున్ను వుండగా అందులో దిగినాను. నక్కపల్లెలో అన్ని పదార్థములు దొరుకును.

యీ దేశపు స్త్రీలు మంచి సౌందర్యము కలవారుగానున్ను, ముఖలక్షణము కలవారుగానున్ను అగుపడుతారు. జాఫరావిత్తుల వర్ణము వేసిన బట్టలు వుపవన్నులు కట్టుతారు. కాళ్ళకు పాడగాలు వెయ్యడము కలిగివున్నది.

సర్వసాధారణముగా యీ దేశమందు తెనుగుభాష ప్రచురముగా వున్నది. మాటలు దీర్ఘముగానున్ను దేశియ్యమయిన శబ్దహ్రాస్వముగానున్ను పలుకుతారు. తెనుగు అక్షరములు గొలుసుమోడిగా వ్రాస్తారు. మనుష్యులు స్వభావముగా దౌష్ట్యములు చేయతలచినా మంచితియ్యని మాటలుమాత్రము వదలరు. యేపనిన్ని వూహించి చేస్తారు. యీ వూళ్లో రాయవరపు మునిషీ కోటూరు వీరరాఘవ మొదలిని కలుసుకొనే నిమిత్తము యీరాత్రికూడా నిలిచినాను.

౧౭ తేదీ వుదయాత్పూర్వము ౩ గంటలకు లేచి యిక్కడికి ౫ కోసులదూరములో నుండే తుని యనే వూరు ౭ గంటలకు చేరినాను. యీ వూరివద్ద తాండవ మనే నది వొకటై, కసంకోటవద్ద శారదా అనే నది వున్నట్టె వొకవా గున్నది. యీ తాండవనదికి అవతలిపక్క రావుపేటయనే వూరు వొకటి వున్నది. అక్కడ తపాలాఆఫీసు రయిటరు వొకడు ఆఫీసును వుంచుకుని వున్నాడు. ఈ రెండువూళ్ళు గొప్పబస్తీలు. యిక్కడ హేడ్డాపోలియను వాసముచేయుచున్నాడు. సమస్త పదార్థములు దొరుకును. యీవూరినుంచి రాజమహేంద్రవరానకు కుంఫిణీవారు వేసిన లయను దారి మన్యాలమీాద వేశేచీలి పెద్దాపురము, పిఠాపురముల నిమిత్తము లేకపోవుచున్నది. ఆ దారి వొక ఆమడ సమీాపమయినప్పటికిన్ని, బండ్లదారి అయివున్నా నాతోకూడా చెన్నపట్టణమునుంచి వచ్చిన బోయీలయిండ్లు పిఠాపురపుదారిలో వున్నందున వారి సంతో

పునిమిత్తము ఆ దారివెళ్ళ నిశ్చయించినాను. యీ మధ్యాహ్నము నడిచినదారి బహుదూరము. రేగడ, అడివి నిండాలేదు. దారి కిరుపక్కలా కొంతదూరములో చిన్నకొండలు వుండీవున్నవి.

గంజము మొదలుగా అన్ని యిండ్లల్లో యర్రమన్ను గోడలకు పూశి సున్నపుచుక్కలు నాలుగైదు అంతస్తులుగా బారు తీర్చివుంచుతారు. కడపలకు పసుపు కుంకుమ వుంచుతూవస్తారు. విజయనగరము మొదలుగా రసచెక్కలని కాచు కలిపి నిండు, చిన్నపోకలను వుడక పెట్టి వక్కలుగా అమ్ముచున్నారుగాని యీవరకు కనుపడుతూవచ్చిన పోకలు విశేషము లేవు. చుట్టలు తాగడము విశేషము.

యీ వూరునుంచి బండ్లను రాజానగరములో నన్ను కలుసుకునేటట్టు పంపించి యిక్కడ బ్రాహ్మలయిండ్లలో వంట, భోజనము కాచేసుకుని రెండు గంటలకు బయిలుదేరి యిక్కడికి ౫ కోసుల దూరములో వుండే వంటిమామిడి యనే వూరు ౬ గంటలకు చేరినాను. యీ వూరు చిన్నది. అయినప్పటికిన్ని యిప్పుడు కోటీత్రియంబకరాయని వారు నడిపించే సదావృత్తి అన్నసత్రము వొకటి విశాలముగా కట్టివున్నది. అంగళ్లు కలవు. సమస్తమయిన పదార్థములు దొరికినవి. యీ వూళ్లో యీరాత్రి వసించినాను.

౧౮ తేది వుదయాత్పూర్వము ౭౪ గంటకు బయిలువెళ్లి యిక్కడికి ౬ కోసుల దూరములోనుండే నాగలాపల్లె అనే వూరు ౧౦ గంటలకు చేరినాను. తుని మొదలుగా దారి దక్షిణాభిముఖముగా వచ్చినందున కొండలు దూరమై సముద్రము దగ్గిర అవుతూవచ్చినది. కన్యాకుమారి మొదలుగా కలకత్తావరకు యీభూమిగడ్డను సొగతమలపాకు అంచమయ్యేటట్టు సముద్రము ఆవరించి వున్నందున మనము దక్షిణాభిముఖముగా వచ్చే కొద్ది సముద్రతీరానకు సమీపముగా రావడమైనది. గంజాం మొదలు సముద్రతీరమందే వచ్చేటట్టు చెన్నపట్టణమునకు వొక భాట వున్నది. ఆభాట సమీపమయినా వుప్పుకాలువలు అనేకముగా దారిలో దాటవలసి వున్నవి గనుక ఆ మార్గము వదిలి కుంఫిణీవారు పడమరవార్తి శాల వేసినారు. సముద్రతీరపు భాటను వుప్పుకాలువల తిరోధమము మొటువున్నదో అటువంటి దారివి

అడివి, కొండలు, పులులు, రాళ్ళు, దొంగలు వీండ్ల భయము చాలా కలిగివున్నది. యీ దినము నడిచినదారి తెడారి. కొంత మేర అసుసు నీళ్ళుగా వున్నది. నాగలాపల్లెవూరి ముందర వొక వుప్పు కాలువ వున్నది. దానికి పాటు పోటు కద్దు. పోటువేళ దానికి సంగడి అని రెండు తాటిచెట్లను దోనవలెనే తొలిచి చేర్చి కట్టివుంటారు. అందులో ఆరుగురు యెక్కవచ్చును.

నాగలాపల్లె అనేవూరు పెద్దది కాక పోయినా అన్ని పదార్థములు దొరుకును. యిక్కడి వుప్పుకాలువ వద్ద చెన్నపట్టణములో వుండే వొక పెద్దమనిషి యీ దేశస్థుడి బోధన మీద పదివేల రూపాయలు ఖర్చుపెట్టి రెండుతాటాకు గుడిశెలు వేసి రెండునీలిమందు చేసే తొట్లుకట్టి వొక బావి తొవ్వించినాడు. నీలిమందు లాభముయొక్క భ్రాంతి చెన్నపట్టణపు వారిని బహుశా యీరీతుగా ముంచినది. యీ వూరికి యీనాం నీలపల్లి అనే గొప్ప బస్తీలు మూడుఆమడలో వున్నవి. యింజరమనే గ్రామము నీలపల్లికి సమీపముగా వున్నది. మాదయపాళెము యీనానికి ఆమడదూరములో నున్నది. యీ వూరికి కాకినాడనే కలకటరు నివాసస్థలము 2 కోసుల దూరములో వున్నది.

వుప్పాడా అనేవూరు యిక్కడికి కోసెడుదూరములో నున్నది. వుప్పాడాకు చుట్టూ ఆమడదూరములో సముద్రతీరమందు మూడూరు యేనూరు యిండ్ల బోయిజాతివారు గుడిసెలు వేసుకొని కాపుర మున్నారు. వీరికి పయిరు భూమియిలాకా యెంతమాత్రము లేదు. సముద్రములో మత్స్యములు పట్టి యెండవేశి మణుగు 1కి కొంచము తీరువ యిచ్చి అమ్ముకోవడమున్ను చెన్నపట్టణములో కొలువుకొలిచి బ్రతకడమున్ను. వీరియిండ్లలో మొగవాడు పుట్టితే చచ్చేవరకు తల 1కి రూ 14 సరకారువారికి తీరువ యివ్వవలసినది. వీరి గుడిశెలు నాలుగు రూపాయలకు యెక్కువచేయవు. యీ బోయస్త్రీలు కట్టెలుకొట్టి అమ్మడమువల్లనున్ను, పైరుపెట్టే సంసారులకింద పనిపాటులు చేయడమువల్లనున్ను, వన్యములైన కూరకాయలు తెచ్చి అమ్మడమువల్లనున్ను కాలక్షేపముచేయుచు మొగవాండ్ల నిమిత్తము సరకారుకు యివ్వవలసిన పన్నుసహా యిచ్చుకుంటారు. మొగవాండ్లు రూపాయ 1కి నెలకు

ఆరు యింటికి పావులావంతున వడ్డీకి అప్పుతీశి సారాయి మొదలయిన మత్త ద్రవ్యములు త్రాగి ఆ అప్పులు మిక్కుటమయితే తీర్చడానకు దేశాంతరములకు జతలుగా కలిసివచ్చి బోయీకొలువుచేసి మళ్లీ దేశమునకు వచ్చి చేసియున్న అప్పులు తీర్చుకుంటూవుంచున్నారు. కొందరు బైటిసంపాదనకూడా త్రాగడానకు చాలక స్వదేశగమనమే పదిపదిహేను యేండ్లు తలుచుకోకుండా వుంటారు. నాతోకూడావచ్చిన బోయీలలో యిద్దరు యీ దేశమువదిలి బహుకాలమౌటచేత వారి భార్యలు వారిని కతుర్చపట్టలేకపోయినారు. ఆ యిద్దరిని వారి యిండ్ల స్త్రీలు మీకు త్రాగడానకు మేము కావలసినది యిస్తాము, యికమీరు దేశమువదలి పోవద్దని బతిమాలుకొనుచున్నారు.

యీ మత్తద్రవ్య పానముపట్ల లోకులకు యింత ఆసక్తి యేల కలిగినదో అది యీశ్వరునికే తెలుసును. అయినా నాకు తోచడము యేమంటే యేలే బుద్ధి యనే రాజుయొక్క అధికారమునకు లోబడని దేహములోని మనసు మృగముయొక్క చేష్టలతో తిరుగులాడుచూ వుంచున్నది. గనుక ఆ మనసు యీషణత్రయబద్ధ మయి స్వప్నావస్థలోకూడా యీషణాదులను గురించి కలిగే విరోధములు అబద్ధములని జాగ్రదవస్థలో తెలిశిన్ని జాగ్రదవస్థ పొందినవెనకకూడా స్వప్న సంభావితాలను జ్ఞాపకమునకు తెచ్చుకొని అవి సత్యములని కొంతసేపు భ్రమసి కొంచము దుఃఖించడము స్వానుభవముచేత నాకు తెలిశి వున్నది గనుక బుద్ధిచేత యేలబడని మనసుకు దుఃఖనివృత్త్యర్థమున్ను యథోచితము బ్రహ్మానందవతుగా వొక సుఖముకలిగేకొరకున్ను మనుష్యులు మత్తద్రవ్యాలు మితముగా త్రాగడానకు మొదలుపెట్టినారనిన్ని అది పరంపరగా యెక్కువ అయి అనేకులు యీశ్వరుడు తమకు యిచ్చిన యథోచితమైన ప్రజ్ఞనుకూడా తాము పోగొట్టుకునేటట్టు పానాపేక్ష కలగడమయినది.

ఇంత దేశము తిరగడమువల్ల స్త్రీ పురుషులకు పరస్పరస్నేహమున్ను కలియకయున్ను మోహమున్ను ఆసక్తులున్ను పుట్టను కారణమేమని విచారించగా యిదిన్ని ఆహారములు, ఆచారములు, అలంకారములు వీటి భేదల రుచిపుట్టేలాగే గాని, యెక్కువలేదని తోచబడు

చున్నది. అది యెందువల్లనంటే వొకదేశపు పురుషుణ్ని మరివొక దేశపు స్త్రీ చూస్తే ఆ పురుషుడి రూపాలంకారములు బాగా వున్నా హేయముగా చూచి అపహాస్యము కిందికి తెచ్చి అసహ్యబడు చున్నది. స్వదేశస్థుణ్ని చూచినంతలో వొక విధమైన యిష్టము హృదయములో అకస్మాత్తుగా జనించి కలియక అపేక్ష కలిగిన వెర్రి వాలుచూపులు కులుకులు అనే దేహకంపము - యిది మొదలయిన చేష్టలు స్త్రీలకు పుట్టి మర్మమైన అవయవములు దాచి మూసే లాంఛనలతో తమ అవయవములను ఆ స్వదేశపురుషులకు నిరూపిస్తూ వుంటారు. తత్రాపి స్వదేశస్థులలోను స్వకీయులనున్ను, ఆత్యాసన్నులనున్ను స్త్రీలు చూచిన పక్షమందు పైన వ్రాశిన చేష్టలు దశగుణముగా అధికమవు చున్నవి. యీ హేతువులవల్లనే పూర్వికులు వివాహవిషయమై స్వకీయ్యులలో సమీపరక్తస్పర్శకలస్థలములలో కన్యాదానాలు కన్యాప్రతిగ్రహములు నిషేధించి నిర్ణయించినట్టు తోచుచున్నది. ఆ నిశ్చయానుసారముగానే పరస్పరవాంఛలున్ను వుదయింపుచున్నవి. గాని యీ వాంఛలకు ఆచారాలంకారాలవలెనే వాడికె మీద పుట్టే మనసు కారణమేగాని మరివొక కారణము వేరే వున్నట్టు తోచలేదు. యిందుకు శిష్టవాక్యము యింగిలీషువారిలో "యూజ్ రికన్సయిల్స్ వుయిత్ ఎవ్వరి థింగ్" అని వున్నది. దీనికి తాత్పర్యము యేమంటే పరిచయము అన్నిటితోనున్ను అనుకూలింపచేయుచున్నది అని అర్థము. ౧౯ తేది అంతా యీ వూళ్లో నిలిచినాను.

౨౦ తేదివుదయాన నాలుగున్నరగంటకు బయిలువెళ్లి యిక్కడికి మూడుకోసుల దూరములో నుండే పిఠాపురమనే పుణ్యస్థలము యేడు గంటలకు చేరినాను. యీ వూరు పూర్వము గయాసుర రాజధానిగా వుండినది. యీ స్థలమును పాదగయ యని అనుచున్నారు. యిక్కడ వొక తటాక మున్నది. దాన్ని పాదగయతీర్థ మనుచున్నారు. యీ తటాకములో గయాసురుని పాదములు వున్నవని ప్రసిద్ధిగనుక యిక్కడ శ్రాద్ధముచేశి పిండప్రదానము చేయవలసినది. తీర్థమువొడ్డున వొక చిన్న శివాలయమున్నది. అందులోని లింగము పేరు కుక్కుటేశ్వరుడని అనుచున్నారు. యీ వూళ్లో వొకపాడుకూపములో అష్టాదశపీఠము

లతో చేరిన పురుహూత యనే శక్తి అదృశ్యముగా వసింపుచున్నదట. ఆపెకు ఉత్సవాదులు యేమిన్ని నడవడము లేదు.

యీ వూళ్లో యిన్నూరు బ్రాహ్మణయిండ్లు కలవు. వారందరు తీర్థవాసులుగా యాచకవృత్తిని వహించియున్నారు. యీ దేశములో గంజాము మొదలుగా భూరూపకమయిన జీవనము లేని బ్రాహ్మణుడు లేడు. యీ దినము తొలుఏకాదశి. దీన్ని సమస్తమయిన వారు యీ ప్రాంతములో గొప్ప పండగగా జరిగింపుచున్నారు. గయాపాద తీర్థమువొద్దను నేను డేరాలువేశి దిగి యిక్కడి గుడిలోపల వంట, భోజనములు కాచేసుకున్నందున గయాతీర్థములో స్నాననిమిత్తమై వచ్చిన వూరి స్త్రీలను బాలుల సమేతముగా అందరినిన్ని దర్శనము చేయడమయినది.

యీ వూళ్లో పోలీసుదారోగా సహితముగా జమీందారులు నీలాద్రిరాయనింగారి కుటుంబస్థులు వొక మట్టికోటకట్టుకొని అందులో వసింపుచున్నారు. యీవూరు గొప్పబస్తీ. సమస్తపదార్థాలు దొరుకును. సురాకార మనే పెట్టువ్వు యిక్కడ పైరాచున్నది. వూరు తోపులతోను తటాకాలతోను నిండి విశాలమైన వీధులు కలిగివున్నది. నేడు తెల్లవారి నడిచిన దారి కొంతమేర అడుసు నీళ్ళుగాని మిగిలిన భాట యిసకపరగానున్నది. జగన్నాథము మొదలుగా యిసకపరభూమి గనుక తాటిచెట్లు, మొగిలిచెట్లు, జెముడు, యివి మొదలయినవి విస్తరించివున్నవి. యిండ్లకు తాటాకులు కప్పి పయిన కసువు పరుస్తారు. యీ వూరి బ్రాహ్మణులు విచ్చలవిడిగా తారతమ్యాలు తెలియక నటించేవారు. పదియూపాయలు భూరి పంచిపెట్టినంతలో యథోచితముగా సంతోషించిరి.

యిక్కడనుంచి రెండుగంటలకు బయిలువెళ్ళి నాలుగుకోసుల దూరములోనుండే పెద్దాపురము ౬ గంటలకు చేరినాను. యీ మధ్యాహ్నము నడిచిన దోవ పల్లపు పారు గనుకనున్ను భూమి రేగడ గనుకనున్ను యీ దినము వర్షము కురిశినందుననున్ను అడుసునీళ్ళుగా వుండినందున చాలా జారుచూ వచ్చినది. యీ నడమ యేలా అనే వొక చిన్ననది కాలినడకగా దాటినాము. ఈ నది చిన్నదయినా

మిక్కిలి తీక్ష్ణమయిన వేసంగి కాలములయందున్ను, అనావృష్టి దోషాలు కలిగినప్పుడున్ను వొక్క రీతిని మిట్టను ప్రవహింపుచున్నది. పిఠాపురము పెద్దాపురము జమీనుదారుల తాలూకాలవారు వంతుల ప్రకారము యేటి నీళ్ళు అడ్డకట్టి తమ గ్రామాదులకు తెచ్చుకోవడము చేత వీరి తాలూకాలలో యెల్లప్పుడు పంటలు సమృద్ధిగా కలిగియున్నవి.

పెద్దాపుర మనే వూరు పిఠాపురముకన్నా గొప్పది. యీ వూరి యిండ్లున్ను గొప్పలుగానే కట్టియున్నారు. ౧౦౦ బ్రాహ్మణుల యిండ్లు కలవు. యిక్కడ పోలీసుదారోగా సహితముగా యిక్కడి జమీన్దారుడు వసింపుచు నుంటాడు. యితని తాలూకా 3 లక్షలది. అంగళ్ళు కలవు. సమస్త పదార్థాలు దొరుకు చున్నవి. యీ వూళ్ళో 3 సంవత్సరములుగా యీ జమీన్దారుని భార్య అమ్మన్న అనే పురుషుని గొప్పయిల్లు స్వాధీనము చేసుకుని వొక అన్నసత్రము వేసియున్నది. ఆ స్థలము విశాలముగా వున్నందున అందులోనే యీ రాత్రి వసించినాను.

౨౧ తేదీ వుదయాత్పూర్వము ౨౪ గంటకు లేచి యిక్కడికి ౭ ఆమడ దూరములోనుండే రాజానగర మనే వూరు ౧౦ గంటలకు ప్రవేశించినాను. దారి యిసక కలిసిన రేగడ. కొంచపాటి యడివిన్ని, వొక కొండ తిరుగుడున్ను బహు చోరభయమున్ను కలిగి నడవ ననుకూలమై వున్నది. యిక్కడ గోపాలరాజుల పితూరి అనే పేరుగల బంది పోట్లు ప్రతివూర కలిగివున్నది. నేను తుని యనే వూరివద్ద వదిలిన లయన్ దారి రాజానగరము ముందు వచ్చి కలిసినది. రాజానగరము జలవసతి కల వూరు. అంగళ్ళు కలవు. పోలీసు అమీనా వసిస్తూ వుంటాడు. అన్ని పదార్థములు దొరుకును. యీ వూరు కొచ్చెలకోట వెంకటరాయుడి జమీను. యిక్కడ లోగడ రాజాబహాదరు వారి అన్నసత్రము వుండి నిలిచిపోయినంతలో యీ జమీన్‌దారుడు ఆ సత్రాన్ని వృద్ధిచేసి మళ్ళీ జరిగింపుచున్నాడు. యీసత్రములో వంటభోజనముల నిమిత్తము దిగినాను. సత్రము బహు విశాలముగా కట్టివున్నది. యీవూరికి సమీపమందే ౫౦ యిండ్ల బ్రాహ్మణాగ్రహారము వొకటి వున్నది.

పాదగయలో నేను తీర్థములు వొడ్డున దేశాలలో దిగివుండగా

గొప్పవర్షము కురిశినది. అప్పట్లో స్నాననిమిత్తమున్ను శివాలయ దర్శననిమిత్తమున్ను వచ్చిన స్త్రీలు వర్షమును లక్ష్యపెట్టక స్నాన పానములు స్వామిదర్శనాలు తడుస్తూచేసిన వేడుక చూడగానున్ను విజయనగరములోను పట్నా అనే షహరులోను గొప్పవారి యిండ్ల స్త్రీలకు అత్యంత దేహాపద్రవాలు కలిగి నేను ఔషధమియిచ్చి పథ్యము తీసుకొమ్మన్నంతలో చచ్చినా మంచిదిగాని స్నానము లేక మేముగా వంటచేసుకోక అన్నము పుచ్చుకొనమని వొకపట్టుగా మూర్ఖముచేసిన నిశ్చయమున్ను చూడగానున్ను 'కలిస్నాధుస్త్రీయస్సాధు' యనే సామాన్యవచనము బాగా నేవున్నట్టు తోచుచున్నది.

యిక్కడనుంచి రెండుగంటలకు బయిలువెళ్ళి యిక్కడికి ౫ కోసుల దూరములోనుండే రాజమహేంద్రవరము ౬ గంటలకు చేరినాము దారి కిరుపక్కలా అడివికలిగి యిసుకపరగావున్నది. రాజానగర రాజమహేంద్రవరాలకు చేరినగాన పోలీసుతాణాను పాంథుల క్షేమముకై కలకటరు వుంచివున్నాడు. యీ రాజమహేంద్రవరము పూర్వము రాజరాజనరేంద్రుని రాజధాని. అతని కొడుకు సారంగధరునితో చంద్రవంశము అంత్యమయిన దని లోకప్రసిద్ధి.

యీ రాజమహేంద్రవరము గౌతమమహాముని ఆశ్రమము. పూర్వకాలమందు ద్వాదశవర్షక్షామము సంభవించి సమస్త బ్రాహ్మణ్యము అన్నములేక మనుష్యకోటికి గురువులయిన గౌతములవద్దికి వచ్చి మొరపెట్టుకుంటే వారు తన తపోబలముచేత ప్రత్యహము కొద్దిగా వరిబీజాలు చల్లి అవి సద్యఃఫలమునకు వచ్చేటట్టుచేసి ఆ ధాన్యము అక్షయ మాటచేత అనేకకోటి బ్రాహ్మణ్యమునకు ప్రత్యహము అన్నము యిచ్చి వారల ప్రాణరక్షణ చేసినారు. పిమ్మట క్షామము వదలగానే సమస్త ద్విజులు గౌతముల ఆశ్రమము వదిలి పొయ్యేటప్పుడు యింత యశస్సు గౌతములకు రావచ్చునా అని అసూయచేత, పాంచభౌతిక దేహములన్ని యీశ్వరుని మాయా సంబంధమయిన అరిషడ్వర్గమతో బద్ధము లయివున్నవి గనుకనున్ను యిక్కడి జిల్లాజడ్జియయిన వైబరుట్టుదొర, చెకుముక్కి రాయిపై యినుము వేగముగా కొట్టి అగ్ని పడకపోతే తుపాకిలోని మందుగుండు బయిలుపడదు అన్న

వతుగా యీప్రపంచము కృతజ్ఞత సాత్వికత్వములతో నిండితే అన్ని ప్రకృతులు చప్పుడు లేక స్థావరములుగా నిద్రపోతూ వుండవలశినవి గనుకనున్ను దురత్యయమయిన మాయ 'కర్షతి కర్షతి కర్షత్యేవ' అనే వచనప్రకారము పండితులనుకూడా మోసపరచి చీకటిలో కండ్లు కలవాడు కండ్లు లేనివాడున్ను సమ మయినట్టు మనుష్యులను కృతఘ్నులను చేయుచున్నది గనుక అదేప్రకారము అప్పట్లో గౌతముల ఆశ్రమములో నున్న బ్రాహ్మణులు కుతంత్రమువల్ల వొక గోవును కల్పించి గౌతములు ఆ దినము చల్లిన పయిరు మేశేటట్టు చేసినారు. ఆ గోవు ఆ ప్రకారము తాను చల్లిన పయిరు మేశే కృత్యము చూచి గౌతములు బ్రాహ్మలమీది భక్తిచేత గరికపోచను గోవుమీద వేశి అదలించినాడు. అంతమాత్రానికే ఆ గోవు చచ్చినట్టు అభినయించినది. వెంబడిగానే అక్కడవున్న బ్రాహ్మలు గౌతములను హత్యదోషము కలవాణ్నిగా నిందించినారు. గౌతములు పశ్చాత్తప్తులయి నాకు యేమి గతి యని బ్రాహ్మణమండలిని అడగగా శివుని జటాజూటములోవుండే విష్ణుపాదప్రసూతయయిన గంగను బయిటికి తెచ్చి అందులో అవగాహనము చేస్తేనేగాని నీవు పుణ్యాత్ముడవు గావని చెప్పినారు. పిమ్మట గౌతములు తపస్సువల్ల సాంబమూర్తిని సంతోషపెట్టి వొక ధారను భూమిమీదికి తెచ్చి తన ఆశ్రమముదాకా తెచ్చి స్నానముచేసి యెప్పుడున్ను లోకోపకారముగా భూమిమీద ప్రవహింపుచు వుండేటట్టు చేసినాడు. ఆ ధారకు గోదావరి అని నామకరణము చేయడమయినది. పిమ్మట సప్తఋషులు గౌతములను ప్రార్థించి సెలవు పుచ్చుకుని యేడు ధారలుగా గోదావరిని చీలదీసి తమ తమ ఆశ్రమాలకు తీసుకుని వెళ్ళినారు గనుక యీ రాజమహేంద్రవరమువరకు గోదావరి అఖండముగావచ్చి ధవళేశ్వరము మొదలుగాచీలి సప్తగోదావరులుగా అయినది. ఆ సప్తగోదావరీ తీరమందు వుండే భూములు గోదావరీ వుదకబలముచేత సమ ససస్యాదులను అమోఘముగా ఫలింపచేయుచున్నవి. ఆ సప్తగోదావరీ తీరమును కోనశీమ అనుచున్నారు. అక్కడ బ్రాహ్మలకు భూవసతులు చాలా వున్నవి.

యిది కాకినాడుజిల్లా. యెనిమిదిలక్షల వరహాలు సాలుకు యెత్తు

తన జమీన్‌గ్రామాలమీదుగా తానుకూడా వచ్చి యెనిమిదామడ పర్యంతము నన్ను స్వాగనంపించవలె నని తలచి ప్రార్థించినారు గనుక దండుదారిని యేలూరిమీదుగా నా రెండుబండ్లను రవానాచేసి నేను అడ్డదారినివుండే వాడపల్లి రాత్రి ౭ గంటలకు ప్రవేశించినాను. దారి గోదావరి వొడ్డునసే వొక మనిషి నడిచేపాటి కాలిదారిగా వున్నది. రాజమహేంద్రవరమునకు వాడపల్లి అనే వూరు ౬ కోసుల దూరము. గోదావరి మధ్యే కొన్ని లంకలు ప్రవాహపు వేగాన పెట్టబడుచువచ్చుచున్నవి. ఆ లంకలు జమీన్‌దారులకు చాలా ఫలకరములుగా వుంచున్నవి. వాడపల్లియనే వూరు విష్ణుస్థలము గనుక వెంకటేశ్వరుల గుడి చిన్నదిగా వొకటి వున్నది. యిరువై యిండ్ల వైష్ణవాగ్రహారముకూడా కలదు. రాజా కొచ్చర్లకోట వెంకటరాయనింగారి తమ్ముడు యీ వాడపల్లెలో విశాలమయిన నగరు కట్టివున్నాడు. యీ రాత్రిన్ని మరునాడున్ను యిక్కడ వుండినాను. యీ వూరు గోదావరి వొడ్డు గనుక యీవూళ్లో బావులు లేవు.

౩౦ తేదీ వుదయమయిన ఆరుగంటలకు లేచి యిక్కడికి ౭ కోసుల దూరములో వుండే ఆచంటయనే వూరు ౧౧ గంటలకు చేరినాను. దారిలో సప్తగోదావరి యనే వొక పాయ పడవలకుండా దాటడమయినది. యిది కాలి ఘాట. తోపులు, వూళ్లమధ్యే నడుస్తూ వచ్చినాము. అందులో రాల (ర్యాలి) యనే వొక గ్రామములో శుభ్రమయిన నల్లశిలతో ప్రభసమేతముగా వొక గోపాలమూర్తిని చేసివున్నది. ఆ ప్రభలోనున్ను మూర్తి పీఠము మీదనున్ను రాసక్రీడలు మొదలయిన అవసరాలు మూర్తిభవించి నట్టు చెక్కి ప్రధానమూర్తిని గోళ్ళు, వెండ్రుకలుకూడా విరళపరచి అతిసుందరముగా చేసివున్నది. యీ మూర్తి సముద్రములో కొట్టుకొని వచ్చినట్టు యిక్కడ చెప్పుకొంటారు. ఆచంట అనే వూళ్లో వెంకటరాయనింగారు తన నివాసముకొరకు వొక గొప్ప నగరుకట్టి దానికి చుట్టూ సుందరమయిన వనము నిర్మించి వున్నాడు. యీ వూళ్లోనున్ను, వాడపల్లెలోపల వున్నట్టే వొక పోలైసు అమీను వున్నాడు. ముప్పై బ్రాహ్మల యిండ్లు వున్నవి. యిక్కడ పెండలపు గడ్డలు బహు బాగా అయ్యి

యీ నెట్టున బహుప్రసిద్ధి కెక్కివున్నవి. వొక దేవాలయమున్నుకూడా వున్నది. యీ వూళ్లో యీ రాత్రి వసించినాను.





## ఇరువదినాలుగవ ప్రకరణము.

౩౧ తేది వుదయాత్పూర్వము 3 గంటలకు లేచి యిక్కడికి రెండామడ దూరములోనుండే శింగవృక్షమనే వూరు వొక గంటకు చేరినాను. దారి వరిపొలాల గనిమెలమీద నడిచి రావలసినది. రేగడ భూమి అయినందుననున్ను, వర్షాలు కురిశి వున్నందుననున్ను చాలా అడుసునీళ్లు కలిగి బహుప్రయాసగా వుండినది. గోదావరి వుదకము అడ్డకట్టి తెచ్చిన నాలుగు మడుగులు, రొమ్ముల లోతు నీళ్లలో దాటినాము. శింగవృక్షమనే వూరు గొప్పబస్తీ. ౧౦౦ బ్రాహ్మణ యిండ్లు కలవు. అనేకముగా అంగళ్లు కలవు. ఈ వూళ్లో భోజనానకు నిలిచి మూడు గంటలకు మళ్లీ బయిలువెళ్లి ౬ గంటలకు బోండాడ ప్రవేశించినాను. దారిలో తెల్లవారివలెనే రెండు మడుగులు దాటడమయినది.

బోండాడ అనే వూరున్ను బస్తీగ్రామమేను. యీ వూరిమన్ను ఘట్టిపర అయినందున ధాన్యము పాతరలువేశి వుంచుతారు. రాజమహేంద్రవరము మొదలుగా తాటిచెట్లు అమితముగా కలిగివున్నవి. ప్రతివూరనున్ను తాటిపండ్లరసము తీసి చాపలుగా చేసి వుంచుతారు. యీ రాత్రి యిక్కడ వసించినాను.

ఆగష్టు నెల ౧ తేది వుదయమయిన ౫ గంటలకు బయిలువెళ్లి యిక్కడికి ౫ కోసులదూరములో నుండే యేలూరిపాడు అనేవూరు ౧౦ గంటలకు చేరినాను. యీ వూరు పేటస్థలము. నేడు నడిచిన దారి యిసకపర. శింగవృక్షమనే వూరు మొదలు యిదే రీతిని దారి అనుకూలముగా వున్నది. బండ్లు సమేతముగా రావచ్చును. యీ వూరు నియోగుల అగ్రహారము. రాజమహేంద్రవరము జిల్లాకున్ను బందరు జిల్లాకున్ను యీవూరివద్ద వుండే వుప్పుకాలవ సరిహద్దు అని తెలియవలసినది.

యీ మధ్యాహ్నము ౧౨ గంటలకు యిక్కడినుంచి భోజనము చేసుకొని బయిలువెళ్లి వుప్పుకాలవ సంగళ్లకుండా దాటి రాత్రి ౭ గంటలకు యిక్కడికి ౬ కోసులదూరములో వుండే తుమ్మడి యనే వూరు చేరినాను. యీ మధ్యాహ్నము మీాద నడిచిన దారి యిసకపర, శుద్ధబయిలు. యేలూరిపాడు మొదలుగా వర్షాలు లేనందున యిక్కడ దారిలో మడువులు బొత్తిగా యెండివున్నవి. దారిలో కలిదండియనే ప్రసిద్ధ గ్రామము దాటి వచ్చినాను. తుమ్మడి అనే గ్రామములో బ్రాహ్మణయిండ్లలో స్థలము దొరకనందున కలకత్తాలో విక్రయించడానకు యిచ్చివచ్చిన రెండు డేరాలు, వెంకటరాయనింగారికి యిచ్చి వచ్చిన వొక డేరాగాక మిగిలిన రెండు డేరాలు యిక షరవాలేదు ప్రతివూళ్ళో బ్రాహ్మణ యిండ్లలో స్థలము దొరుకు నని అందరు బోధించినా చెయికావలికి యెనిమిదిమంది బోయీలచేత తెచ్చినందున ఆ రెండు డేరాలు వొక బావివద్ద వేయించి యీరాత్రి గడపడ మయినది. యీ వూళ్ళో మంచినీళ్ళకు బహుప్రయాస. నేను డేరాలు వేయించిన స్థలమున వుండే బావి యీ వూరికి మంచినీళ్ళు. ఆ నీళ్ళు మాకు తాగకూడనిదిగా వున్నది. అభ్యాసము అన్నిటినిన్ని అనుకూలపరుస్తున్నదనే యింగిలీషుమాట యీ దినము సత్యముగా తోచినది.

౨ తేది వుదయాత్పూర్వము ౨ గంటలకు మబ్బుచినుకులుగా వున్నా లేచి యిక్కడికి రెండామడదూరములో వుండే మచిలీబందరు అనే షహరు యీ దేశస్థులు పేట అని చెప్పే బస్తీని ౯ గంటలకు ప్రవేశించినాను. *దారి నిన్నటివలెనే యిసకపర. బండ్లు సాధారణముగా

(వ్రాత ప్రతిపుట ౮౫౫ లోని అదనపుసంగతి)

* మచిలీబందరు ౨ వ తేది మంగళ్వారం ఉదయాన దారి యిసకపొర "నా తమ్ముడయిన సీతాపతికి బారుజల్లి అనే తాలూకాకు పని అయిన్నీ నాకోసరం బందరులో శలవుమీాద కాచివున్నాడు. మణపాక సాల్యపతినాయుడుగారు నాకు విహితుడుగనుకనున్న వారు వుభయులూ కలుసుకొని" వీరాస్వామయ్యగారిని వాద్యములతో వూరిలోకి తీసుకొని వెళ్ళి రామన్నపేటలో వక గొప్పతోటయింట్లో బస యేర్పరచినారు.

నడవవచ్చును. రామన్నపేటలో వొక గొప్పతోట యింట్లో దిగినాను. యీ మచిలీబందరు బస్తీలో ౨౨ పేటలు కలిగివున్నవి. వొక్కొక పేటను పూర్వమందు లక్ష్మీకటాక్షము కలిగిన పురుషులు తామై కలుగ చేసినారు గనుక ఆపేటలలో వచ్చుబడిబాడిగెలను పేటలు కలుగ చేసిన వారి వంశస్థులు నూరారు రూపాయలవంతున సుఖోపాయముగా యిప్పట్లో ప్రతిమాసమున్ను అనుభవింపుచున్నారు. ఈ బస్తీలో గడ తురకలది. హయిదరాబాదుకింద వున్న అధికారస్థుడు యిక్కడికి తాను నవాబు అనిపించుకొని యీ రాజ్యాన్ని ఆక్రమించినాడు. ఆ స్వామి ద్రోహము వారి వంశస్థులను కుంఫిణీవారికింద పించను తీసుకొని యిప్పట్లో వుండేటట్టు చేసినది.

పూర్వకాలము మొదలుగా యీ బస్తీ సర్వాధికారుల నివాసముగా వుంటూ రావడముచేతనున్ను, యిప్పట్లోనున్ను వుత్తరఖండం ప్రొవిన్శయాల్ కోరటులో జిల్లాకోరటు కలకటరు కచ్చేరి కమ్మిస్సెర్యాటు ఆఫీసు సహితముగా కొంత దండు వసించివుంటూ రావడంచేతనున్ను, కాండ్రేగులవారు మొదలయిన కొందరు జమీన్‌దారులు సావుకారులు వర్తకులున్ను వుండుటచేతనున్ను బస్తీ చాలాగా శోభించివున్నది. రాజవీధులు బాగా విశాలముగా వున్నవి. యిండ్లు బయిటచూచేటందుకు చిన్నవిగా అగుపడ్డా లోపలి ఆవరణాలు విశాలముగా కట్టివున్నారు. లోముంగిళ్ళుమాత్రము కొంచపరచి కట్టివున్నారు. సమస్తపదార్థాలున్ను సమస్తపనులు చేయగల మనుష్యులున్ను దొరుకుదురు. శ్రీకాకోళము వదిలినవెనక బాడిగెకు బండ్లు యీ బస్తీలో దొరకడము కష్టము. భూమి వుప్పుకలిసిన రేగడ. నీళ్ళవసతి లేదు. దూరమునుంచి యీ బస్తీకి మంచినీళ్ళు తెచ్చుకోవలసినది.

---

వీరాస్వామయ్యగారు బందరులో జిల్లాజడ్జిగా నుండిన ఆంధ్రభాషోద్ధారకులగు చార్లెస ఫిలిప్ బ్రౌనుగారిని దర్శించారు గాని యీ పుస్తకములో ఆ సంగతి వ్రాయలేదని బ్రౌనుగారు స్వదస్తూరితో వ్రాత ప్రతి ౪౫౬ పుటలో రిమార్కు వ్రాసినారు. వీరాస్వామయ్యగారు చెన్నపట్టణము చేరినతరువాత బ్రౌనుగారికి వ్రాసిన ఇంగ్లీషు వుత్తరము వ్రాతప్రతి చివర అంటించబడియున్నది. వీరాస్వామయ్యగారిని బందరువుర వాసులు ౧౫ రోజులు అక్కడ వుంచారు.

మనుష్యులు నిండా ఆరోగ్యదృఢగాత్రులుగా వుండలేదు. స్త్రీలు అలంకారపురస్సరముగా శోభాయమాన లయి వున్నారు. స్వరూపలావణ్యము గలవారు కారు. చెవులకు నిడుపుగోలుసులు వేశి కొన్ని పాపటకు చేర్చి చెక్కుతారు. స్త్రీ పురుషులు చాయ వేసిన వస్త్రప్రియులై యున్నారు. రాజమహేంద్రవరానికి యీవల కృష్ణవరకు బ్రాహ్మణ్యమునకు భూజీవనాలు విస్తారములేక సంతుమాత్రము అతిశయిస్తూ రావడముచేత బందరుబస్తీ యాచక బ్రాహ్మణపూరితమై వున్నది. గంజాం, విశాఖపట్టణం, రాజమహేంద్రవరం, మచిలీబందరు, గుంటూరు జుములా యీఅయిదు జిల్లాలలోను భూమి విస్తారము జమీందారుల అధీనముగా పూర్వము నుంచి చేయబడివున్నందున జమీందారుల ప్రాబల్యద్వారా హిందువులవల్ల అద్యాపి కొన్ని విశేషధర్మాలు ౨౦-౩౦ వేల బ్రాహ్మణులకు సంతర్పణలున్ను చేయబడుచున్నవి. అన్నిటిలోను బందరు కాకినాడ జిల్లాల జమీందారులు చాలా ధర్మబుద్ధిగలవారు. రాజా కొచ్చెర్లకోట వెంకటరాయనింగారు రెండావృత్తులు కుటుంబసహిత ముగా తులాభారము తూగి రెండావృత్తులు లక్ష బ్రాహ్మణభోజనము చేయించి అనేకయాగాలు చేయించినారు. నాశిరెడ్డి వెంకటాద్రి నాయుడు అప్పారావు మొదలైన మరికొందరు అంతకు యెక్కువగా హిందుధర్మములను జరిగించినారు. యీదేశస్థులు కచ్చేరీ సహిత ముగా విందుచేస్తే ఆ వుత్సవాన్ని మేజువానీ లంటారు. కాకినాడజిల్లా సాలుకు ౮ లక్షల వరహాలు యెత్తుచున్నది. మచిలీబందరు ఆరు లక్షల వరహా లెత్తుచున్నది. యీ మచిలీబందరులో ఆగష్టు నెల ౧౫ తేదివరకు వసించినాను.

౧౬ తేది వుదయాత్పూర్వము నాలుగుగంటలకు బైలువెళ్ళి యిక్కడికి ౨ ఆమడ దూరములోనుండే కొత్తపాళె మనే కృష్ణాతీరపు వూరు ౧౦ గంటలకు చేరినాను. దారిలో యీదేశస్థులు పర్రిలు అని చెప్పే పల్లెలు కొన్ని వున్నవి. రేగడభూమి. కొత్తపాళెమునకు రెండు కోసుల దూరములో చల్లపల్లియనే యేర్లగడ్డ జమీందారుని నివాసగ్రామము వొకటి వున్నది. అందులో సుందరతరముగా వొక

మిద్దెను ఆ జమీన్దారుడు కట్టియున్నాడు. యీ కొత్తపాళెము చిన్న వూరు అయినప్పటికిన్ని వెచ్చా గోపాలకృష్ణమ్మ యనే కోమటి యిప్పట్లో బందరు ప్రొవిన్‌శియాల్ కోర్టులో ప్లీడరుగా వుండి అతడు వొక సత్రము కట్టించినందున మార్గస్థులకు బహూపకృతిగా వున్నది.

గంజాంలో బందం చలమయ్య అనే అతను, విశాఖ పట్టణములో చిన్నం చలమయ్య అనేఅతను, యానాంలో మన్నెం కనకయ్య, రాజమహేంద్రవరములో గుండు శోభనాద్రి వగైరాలు జమీన్దారులయి లక్షాంతరములు వ్యాపారముచేసి దొరతనపు డాలు పాయా పరువున్ను కలిగివున్నా వీరిని దక్షిణదేశములాగున శెట్టి అనడములేదుగాని గారు అనే ప్రతిష్ఠావాచక ప్రయోగమున్ను తాజీం అనే ప్రత్యుద్ధానమున్ను వీరికి చేయకూడదని వొక నిష్కర్ష యితర జాతులందరు తాగాయతునుంచి చేసుకొని అటు యీ దేశములో జరిగింపుచున్నారు. కోమటి జాతిలో వెచ్చా వారి కుటుంబము లాగున గవర్నమెంటు వుద్యోగాలుచేసిన కుటుంబాన్ని ఎక్కడా చూడలేదు. శూద్రజాతిలోనున్న యెంత గొప్పవాడైనా నాయడనే ప్రతిష్ఠా వాచకాన్ని ఆ పురుషుని పేరుతోకూడా సాధారణముగా వాడరు. గంజాం మొదలుగా భోగస్త్రీలు సభా స్థలములకు వస్తే తంబుర వీణల వుంచుకొని పాడేకాలము తప్ప తక్కిన వేళలలో కూర్చుండకూడదు. పశ్చాత్తాపములేక రెండు మూడు ఝాములు వారిని నిలవపెట్టుతారు.

బందరుజిల్లా ప్రవేశించినవెనక బందిపోట్లు, పితూరీలు అనే మాటలు వినడములేదు. ఆ విషయమై యీ దేశము సుభిక్షముగా వున్నది. యిటీవల గుంటూరుజిల్లాలో భేది,వాంతి వుపద్రవాలు చాలా కలిగియున్నట్టు తెలియడ మయినది. ఆ వుపద్రవము తగిలినయింట్లో మళ్ళీమళ్ళీ తగులుతూవున్నట్టు తెలిసినది. గనుక అందుకు హేతువు నాకు తోచడము యేమంటే అవశాత్తుగా వొక పురుషునికి ఆ వుపద్రవము తగిలి విపత్తుకు హేతువు కాగానే సన్నిహితులు భీతిని చెంది భీతిద్వారా యీ వుపద్రవము పరంపరగా వారు తెచ్చుకునేటట్టు తోచుచున్నది. భీతి మరణాన్ని యివ్వగల వుపద్రవమని అనుభవసిద్ధముగదా! "తేన వినా తృణాగ్రమపి న చలతి" అనేవాక్యము సత్యమయినా దేహాదృష్టిచేత

నున్ను ప్రపంచ దృష్టిచేతనున్ను యిటువంటి వూహాలు దేహదృష్టి విలయము పొందేకొరకు చేయవలసి యున్నవి.

కృష్ణాతీరమునరేదు ౧౯ తేది మధ్యాహ్నమువరకు నిలిచినాను. కృష్ణానదీ మాహాత్మ్యము విచారించగా లోకులను తరింపచేసే కొరకున్ను యీ కలిలో లోకుల పాపాలు యెంతబలుచో అంతపాటి పుణ్యము వొక స్నానముచేతనే కలిగేకొరకున్ను శ్రీమహావిష్ణువు యీ నదీస్వరూపముగా అవతార మెత్తినట్టు తెలియవచ్చినది. యీ కృష్ణామాహాత్మ్యము స్కాందపురాణాంతర్భూతముగా వున్నది. యిక్కడికి ౨ కోసుల దూరములో కళ్ళేపల్లి అనే మహాస్థలము వొకటి వున్నది. యీ నది సహ్యపర్వతములో వుత్పత్తిఅయినది. ఆ వుత్పత్తిస్థలసాగరసంగమాలకు ౭౦ ఆమడ అని విన్నాను. యిక్కడ కృష్ణానది కోశెడు వెడల్పు. అనేక గొప్ప లంకలు కలవు. అందులో అనేక అడివియావులు స్వేచ్ఛగా విహరింపుచున్నవి. యీ లంకలలో కాయకూరలు చాలాగా పైరై బందరు బస్తీలో వ్రియమవుచున్నవి.

౧౯ తేది మధ్యాహ్నము మీదట ౧ గంటకు బయిలువెళ్ళి కృష్ణానది పడవలకుండా దాటి ౫ కోసుల దూరములోవుండే కనగాలయనే వూరు సాయంకాలము ౬ గంటలకు చేరినాను. యీ తీరమందు గ్రామస్థులు తమ ఖర్చుకింద పడవలు చేయించుకుని బీదలవద్ద డబ్బులు తరాతర ప్రకారము పుచ్చుకొని దాటిస్తారు. బలిష్ఠులకు అధికారస్థులకు అమిజీ (వెట్టి)కి దాటిస్తూ వుంటారు. యీ తీరమందు నా స్నానకాలమందు చుట్టుపక్కల గ్రామాలలో వుండేవారుగా భూరి దక్షిణ నిమిత్తము ౨౦౦ బ్రాహ్మణులు చేరినారు.

యిక్కడి బ్రాహ్మలలో కొందరు దేశాంతరాలు వెళ్ళి ద్రవ్యము సంపాదించి స్వదేశము కుదురుగా చేరినందువల్ల నున్ను యీ తీరపు బ్రాహ్మలు పుత్రదారాదులయిన బాంధవులను వదిలి దక్షిణము కన్యాకుమారివరకున్ను, వుత్తరము కాశ్మీరపర్యంతమున్ను సంచారము చేసి లోకులు చేయతగిన బ్రాహ్మణపూజలు నిర్బంధపెట్టి చేయించుకుంటూ వుంటారు. యీ రీతిని కొండవేడు మొదలయిన యీ స్థలజ్ఞులు విచ్చలవిడిగా వొకరినిచూచి వొకరు సంచరించ ప్రయత్నపడ్డా

ఆవరించేపాటి ముక్కరలు చాలా లావుగా చేసి ధరించుతారు. యీ లోపల భూమికొలతన్ను కత్తెలు (కత్తులు) అంటారు. గంజాం మొదలుగా కృష్ణాతీరమువరకు పెద్దమనుష్యులు సమానుల సమాగమము అయినప్పుడు అత్తరుతాను వుంచి తాంబూలముతోకూడా అత్తరున్ను అవశ్యము యిస్తూ వస్తారు. యీ కళింగదేశము మొదలుగా కోసులు సుళువుగా అగుపడుచున్నవి. యిక్కడి వొక కోసు దక్షిణదేశపు రెండుగడియల దూరానకు కాలు గడియ తక్కువ అని చెప్పవచ్చును. గ్రామలెక్కలు మొదలయిన వ్రాతలు రాజమహేంద్రవరానకు దక్షిణము తాటాకులలో వ్రాస్తారు.

గంజాం మొదలు విజయనగరము వరకు తామర సమస్త గుంటలలో, చెరువులలో వేశివున్నారు. వాటి తూండ్లను కూర మొదలయిన పక్వాన్నాలుగా చేసి భక్షిస్తూ వస్తారు. నీళ్ళు తోకడానకు బావుల వద్ద తాటాకులు దొన్నెలుగా కట్టివుంచుతారు. వాటికి తాడుకట్టి నీళ్ళు చేదినంతల్లో రెండుపళ్ళ నీళ్ళు వచ్చుచున్నవి. యీ కనగాల అనే వూరు గొప్పది. విశాలమయిన బ్రాహ్మణ యిండ్లున్ను వొక గొప్ప చావడిన్ని కలవు. సమస్త పదార్థాలు దొరుకును. యిక్కడ సమీపముగా కాటికెవారని పౌరుష నామధేయముగల వొక నేత్రచికిత్సకుల కుటుంబము వున్నది. వారు యథాశాస్త్రముగా నేత్రచికిత్స చేయుచూ వుంటారు. యీ వూళ్ళో యీ రాత్రి నిలిచినాను. దారి నల్లచౌటి రేగడ. తుమ్మచెట్లు యిరుపక్కలా వుంటూ వచ్చినవి. దారిలో భట్టుపోలు అనే వూరివద్ద లంజదిబ్బ అని వొక మిట్ట వున్నది. అది మొదలు చెట్లశాలను దారిలో వేశివున్నారు.

౨౦ తేది వుదయాత్పూర్వము 3 గంటలకు లేచి యిక్కడికి ౫ కోసుల దూరములో వుండే చందవోలు అనే గ్రామము ౭ గంటలకు చేరినాను. దారి యిసకపర. యిరుపక్కలా చెట్లు పెట్టివున్నారుగాని నిండా లేతలు గనుక నీడ యివ్వనేరవు. యీచందవోలు అనే వూళ్ళో వెచ్చా గోపాలకృష్ణమ్మ తమ్ముడు ధర్మపురి అనే అతను వొక సత్రము కట్టివున్నాడు యీ వూరినుంచి కొండవీడుశీమకు దారి చీలిపోతూ వున్నది. యీ వూరు తురక భూయిష్ఠమయినది. లోగడ అనేక శివా

౩ కోసులదూరములోవుండే చినగంజాం అనేవూరు ౬ గంటలకు చేరినాము. దారి యిసకపొర అయినా కాలు దిగపడేపాటి బొల్లియిసక కాదు. చినగంజాంవూరిచుట్టూ వుప్పుపంట విస్తారము చేస్తారు. వూరు నిండా చిన్నది కాదు. యిక్కడ కొళంద వీరాపెరుమాపిళ్ళ సత్రము వొకటి వూరికి బయిలునవున్నది గనుక అక్కడదిగినాను. ముసాఫరులకు కావలశిన సామాను దొరికినది.

౨౨ తేది వుదయాత్పూర్వము ౩ గంటలకు బయిలుదేరి యిక్కడికి ౪ కోసుల దూరములోవుండే అమ్మనబోలు అనేవూరు ౬ గంటలకు చేరినాను. దారి నిన్నటిదినము మేము నడిచినట్టె ఉపాయమయిన యిసకగా వున్నది. చినగంజాం అనేవూరితో గుంటూరు జిల్లా సరిహద్దుసరి. యివతల నెల్లూరిజిల్లా అమ్మనబోలు అనేవూరు గొప్పదేను. సమస్త పదార్ధాలు దొరుకును. కృష్ణకు యీవలవుండే యిండ్లు అన్ని వూరివెశికట్టివున్నవి. పెంకుటిండ్లు సకృత్తైనందున యీ దేశస్థులకు అగ్నిభయము చాలా కలిగివున్నది. బాపట్ల వద్దినుంచి నాతోకూడా వచ్చిన పరిచారకపు బ్రాహ్మణులు కొందరు వారి స్వగ్రామమయిన లంజచెరుకూరికి రెండుకోసులదూరములో వుండగా వెళ్లి అమ్మనబోలులో మళ్లీ వచ్చి కలుసుకున్నారు. ఈ వూరి గ్రామ కరణము యింట్లో వంట భోజనాలు కాచేసుకున్నాము. బాపట్ల వలెనే యీ వూళ్లోనున్ను తోపులు చెరువులు వసతిగా వున్నవి. మధ్యాహ్నము మీదట రెండు గంటలకు బయిలు వెళ్లి యిక్కడికి ఆమడ దూరములో వుండే ఆకులల్లూరు అనేవూరు ౬ గంటలకు చేరినాను. దారి వుప్పుకలిశిన రేగడ. వర్షాకాలములో నడవడము ప్రయాసగా వుండును.

ఆకులల్లూరు అనే వూరు యధోచితము పెద్దదిగా వున్నది. ౩౦ బ్రాహ్మణ యిండ్లు వున్నా స్థలము యిచ్చేవారు కారని ప్రసిద్ధి కెక్కివున్నారు. అయినప్పటికి యీ శీమగ్రామ అధికారులయిన రెడ్డి కరణాలను పిలుపించి మాట్లాడి వొక బ్రాహ్మడి యిల్లు కుదుర్చుకుని అందులో బసచేసినాను. అన్ని పదార్ధాలు దొరికినవి.

రాజమహేంద్రవరము మొదలు గుంటూరుజిల్లా సరిహద్దువరకు

సరఫరాయి బంట్రోతులను నాయకవాడీ లంటారు. వారు ముసాఫరులకు గొప్పవారయిన పక్షమందు సమస్త సరఫరాయి చేస్తూరావలసినది. నెల్లూరిజిల్లా మొదలుగా అదేతరహా నౌకరులను తహాతాదులంటారు. నెల్లూరిజిల్లాలో భూమికొలతను కుచ్చెళ్ళు అంటారు. కుచ్చెల ౧కి ౮ గొర్రెల సంజ్ఞ. యీ రాత్రి యిక్కడ వసించడమైనది.

౨౩ తేదీ వుదయాత్పూర్వము నాలుగుగంటలకులేచి యిక్కడికి ౪కోసులదూరములోనుండే వెలగపూడిసత్రము ౮ గంటలకు చేరినాను. దారి యిసకరేగడ కలిసియున్నది. యీ సత్రము రాజాముద్దుకృష్ణమ నాయుడు వెలగపూడియనే గ్రామమునుందుగా యిక్కడి జమీన్‌దారులవద్ద యినాముగా సంపాదించి కట్టినాడు. గ్రామపు వసూలులో సదావృత్తి యిస్తూ వున్నారు. సత్రములక్షణముగా కట్టి యిప్పటికి బాగావున్నా కళాహీనమై వున్నది. నా అనుభవముచేత విచారించగా కళకలలాడుతూ వుండే భవంతుల కళావిలాసాలు వొకటే తీరున వున్నా వాటి వ్యత్యాసకాలాలలో కళాహీనమై పాడుకోరుతూ వుంటున్నది గనుక యిటువంటి మానుష నిర్మాణములయందుకూడా పరమాత్ముని చైతన్యము యధోచితముగా ప్రతిఫలించేటట్టు తోచుచున్నది. యిక్కడ వంటభోజనాలు కాచేసుకుని ౫ గంటలకు బయిలువెళ్ళి యిక్కడికి మూడుకోసుల దూరములోవుండే కరేడు అనేవూరు ౨ గంటలకు చేరినాను.

దారిలో రెండు వుప్పుటేరులు దాటినాము. యిప్పుడు కాలినడకగానే వున్నది. యీ రెండుయేరులలో సర్పాకారమయిన విషజంతువుల భయము కదాచిత్తుగా కలిగి వుంచున్నది. దారి యిసకకలిసిన రేగడ. అమ్మనబోలుకు ఆకులల్లూరికి మధ్యే వాగర్తను కొత్తపట్టణము యీ తముక్కుల వగయిరా బస్తీలువున్నట్టు యీమధ్యే గొప్పవూళ్ళులేవు. కరేడు గొప్పవూరు. యీభై బ్రాహ్మణయిండ్లు, వొక సత్రము, రెండు గుళ్ళున్ను, కలిగిన పేటస్థలము. సమస్తపదార్ధాలు దొరుకును. యీ రాత్రి యీ వూరి కరణము కట్టించిన సత్రములో వసించినాను.

౨౪ తేది వుదయాత్పూర్వము ౨ గంటలకు లేచి యిక్కడికి ౨ ఆమడ దూరములోవున్న కొత్తసత్రమనే పేరుతో రామానుజ

రాయడుకట్టిన సత్రము ౮ గంటలకు ప్రవేశించినాను. దారి బహు యిసక. రామయపట్నమువరకు కాలు పూడిపోతూ వచ్చినది. యివతల సత్రమువరకు రెండు కోసులు అంత యిసక లేదు. సత్రము బహు వస తిగా వున్నది. వద్దవుండే అంగళ్లలో భోటసాలకు కావలశిన పదా ర్థాలు దొరుకును. యిక్కడ వంటభోజనము కాచేసుకుని యిక్కడికి ౫ కోసుల దూరములోవుండే జువ్వలదిన్నె అనేవూరు ౬ గంటలకు చేరినాను. దారి కొంతమేర యిసక, కొంత యిసకకలిసిన రేగడ. దారిలో మామిళ్ళదొరువు అనే మజిలీవూర ముసాఫరుఖానా దొరలు దిగే లాయఖుగా వొకటి వున్నది.

జువ్వలదిన్నె అనేవూరు గొప్పదయినా నీళ్ళ ఆసరా విస్తారము లేదు గనుక పంటలుజబ్బు. పేటస్థలముగా శానాకోమటి యిండ్లువున్నం దున సమస్తపదార్థాలు దొరుకును. దేవాలయాల సహితముగా కొన్ని బ్రాహ్మణయిండ్లు వున్నవి. అందులో వొక యింట్లో రాత్రి వశించినాను. కృష్ణకు యివతల పశువులు గొప్ప దేహాలు కలవిగా వుంటూ వచ్చినవి. అమ్మనబోలు మొదలుగా అటువంటి పశువులు పుష్టికలవిగా గాలితుందలుగా అనేకములు చూస్తూ వచ్చినాను.

నేను యీవరకు కన్యాకుమారి మొదలుగా సంచరించిన భూములలో యీపాటి వైలక్షిణ్యము, స్థూలము, వున్నతము కల పశువులను చూడలేదు. యీ పశువుల పోషణముందర వ్యవసాయము నున్ను యీ దేశపు కాపులు లక్ష్యపెట్టేవారు కారు. పొలము బీడువేసి వాటికి పుల్లగి అనే తీరువ యిచ్చి పశువులను మేపించి కాపాడుతారు. యీ నెట్టు వారికి పశుధనమే ప్రబలముగా కలిగి వున్నది.

౨౫ తేది వుదయాత్పూర్వము ౨ గంటలకు లేచి యిక్కడికి రెండామడ దూరములో వుండే కొడవలూరి సత్రము ౮ గంటలకు చేరినాను. దారి పంటల్లూరివరకు యిసక కలిసిన రేగడ. పంటల్లూరు మొదలుగా సత్రమువరకు సడక్కువేశి శాలవేశి వున్నది. పంట ల్లూరు భారీదస్తు అయ్యే గ్రామము. తహశీలుదారుడు వుండే కసుబా. నేను దిగిన సత్రము వసతిగా వున్నా జలసౌఖ్యము మట్టు. యిక్కడ

గొప్పది. ౧౦౦౦ యిండ్లు వుండును. రథములుపొయ్యే వీధులు మాత్రము నిండా విశాలముగా వున్నవి. స్వతంత్రుడుగా శీమనుంచి వచ్చివుండే పేర్యిజ్ అనే దొరను యాత్రవారి మహసూలు వసూలు చేసే పనులలో కలకటరు హాస్తాంతరముగా మామూలు ప్రకారము అటారానాళాఘాటువద్ద వుంచి వున్నారు. యాత్రవారి సమేతముగా పండాల విచారణ ఆదొర పరమై వుంచున్నది. బియ్యము మొదలయిన సమస్త పదార్థములు అంగళ్ళలో వుండేవి. స్వామికి నివేదనార్హములు గనుక వాటిని వాసన చూచి మళ్ళీ ఆ రాసులలో వెయ్యనియ్యరు. యీ నియమము వింతగా యీవూళ్లో జరుగుచున్నది. మహాజనులనే సాహుకారులు యీ వూళ్ళో లేరు. సమస్త పదార్థములు దొరుకుచున్నవి. యీవూరు సముద్ర తీరమందున్నది. యిక్కడ సముద్ర స్నానము బహుముఖ్యము. జాతుల వాండ్లు సముద్రతీరమందు యిసుక దిబ్బలలో వుపాయమైన యిండ్లు కట్టుకుని కాపురమున్నారు.

కొత్త మూర్తులను ప్రతిష్ఠచేసిన వెనక గుళ్ళోవుండే పాత మూర్తులను మూటినిన్ని రెండో ప్రాకారములో వుండే మోక్షద్వారమనే కూపములో ప్రవేశింప పెట్టుతారు. ఆ కూపము అగాధమైన లోతని తెలియవచ్చినది. ఆ కూపము వుండే ప్రదేశానకు యిక్కడివారు పోను భయపడుతూ వుంటారు. పాత మూర్తులలో నుండిన చైతన్యకళలను కొత్తమూర్తుల వక్షస్థలాలలో ప్రవేశింప పెట్టినవెనక రెండుమూడు నెలలలో ప్రవేశింపపెట్టిన వృద్ధ కిరాతకులు దేహాలు వదులుతారని నిశ్చయముగా తెలిసినది. దాని కారణము యీశ్వరునికే తెలుసును. అయినా నాకు భయమే కారణముగా తోచుచున్నది. యిక్కడ నాలుగు కూరలు పప్పుపులుసు పరమాన్నము రెండు పిండివంటలతో సాధారణముగా వెయ్యంటికి భోజనము చేయించ వలిస్తేయిన్నూటయాభై రూపాయలు సరాసరిపట్టు చున్నవి. యిక్కడ అనేక మఠాలున్ను రోగిష్ఠులకు ప్రసాదవినియోగ మయ్యేకొరకు కుంఫిణీ ధర్మశాల వొకటిన్ని వుండేటందున బ్రాహ్మణ భోజన నిమిత్తము వొకదినము ముందు పిలిస్తే పండితులు పామరులు సహా

భోజనము కాచేసుకుని రెండు గంటలకు బయిలు వెళ్ళి యిక్కడికి ఆమడ దూరములో వుండే నెల్లూరు షహరు ౬ గంటలకు చేరినాము.

పయి సత్రమువద్ద కోమటియిండ్లు కొన్ని చేరినవి గనుక కావల సిన సామానులు దొరికినవి. ఆ సత్రానికి ముందు అల్లూరు మొదలుగా నేమి, యివతల నెల్లూరువరకు న్నేమి నాలుగైదు సత్రా లున్నవి. దారి నడక్కు వేశి గులకరాళ్ళు పరచి ఘట్టించి శాలచెట్లు వుంచి వున్నారు. అవి పెద్దచెట్లు అయినవి గనుక నీడ బాగా యిస్తూవున్నవి. నెల్లూరిలో జిల్లాజడ్జి కలకటర్లు వున్నారు.

పినాకినీనది దాటి నెల్లూరు ప్రవేశించినాము. నది అరకోసెడు వెడల్పు కద్దు. వొడ్డున రంగనాయకులపేట యనే గొప్ప విష్ణుస్థల మున్నది. వుత్తరము మూడుకోసుల దూరములో జొన్నవాడ యనే వూరు కామాక్షమ్మదేవి సహితముగావున్నది. అక్కడ లక్ష్మీ సరస్వతులు వింజామరలు వేశే అవసరముగా దేవివద్ద బింబాలను చేసి వున్నారు. బహుమంది సేవించి వరప్రసాదసిద్ధు లవుతారు. ఆ వూరు భోగస్త్రీలకు మిరాశి గనుక వారి సంఘప్రాబల్యముగలది. ఆ వూరికి మిక్కిలి సమీపముగానే వొక చిన్న కొండమీద నరసింహస్వామి దేవాలయ మున్నది. యీ జిల్లాలోనే వంగోలుకు రెండామడదూరములో శింగరాయకొండ యనే జాగ్రత్స్థలము వొకటి వున్నది. నెల్లూరు సౌఖ్య మయిన వూరు. ఆరోగ్యకరమయిన భూమి. సుమారు వెయ్యియిండ్లుకలవు. వుద్యోగస్థులచేత నిబిడీకృతముగావున్నది. గాని వర్తకులు లేరు. సమస్త కూరకాయలు పదార్థాలు మంచి పాలుపెరుగు కావలశినప్పుడు దొరుకును.

చినగంజాం మొదలుగా సముద్రతీరమందు యీ జిల్లాలో వుప్పు పయిరుచేయడము విస్తారము గనుక వుప్పరజాతి స్త్రీలు దోటి ముక్కరలు ధరించి పురుషులు సహాగా భూమి త్రొవ్వి పొలాలు యేపఱచే పనులలో జాగ్రతగా వుంటారు. యిప్పట్లో దక్షిణదేశము పడమటి దేశము పొడుగునా భూమి త్రొవ్వడానకు నెగడివుండేవారు యీ దేశపు వుప్పరవాండ్లున్ను, వోఢ్రదేశపు వొడ్డెవాండ్లుగా తోచినది. నెల్లూరిలో

సమస్తవిధములయినపనివాండ్లు వున్నారు. మరునాడు యావత్తు యిక్కడ వసించినాను.

౨౭ తేదీ వుదయాత్పూర్వము ౩ గంటలకు బయిలువెళ్లి యిక్కడికి ఆమణ్నరదూరములో వుండే మనుబోలువద్ది కృష్ణమాచార్యుల సత్రము ౭ గంటలకు చేరినాను. యీ సత్రము బహువసతిగా వున్నది. సమస్తపదార్థాలు దొరికినవి. యిక్కడ వంట, భోజనములు కాచేసుకుని యిక్కడికి ఆమడదూరములో వుండే గూడూరు జాములో చేరినాము. గూడూరు పెద్దదైనా అనావృష్టికాలములయందు నీళ్లకు బహుప్రయాస. బావులు లేవు. ప్రయాసమీద బ్రాహ్మణయిండ్లలో స్థలము దొరికినది.

రాజమహేంద్రవరము వదలినది మొదలు నియోగులు కర్ణీకపు వుద్యోగముకలవారై పూర్వోత్తరమునుంచి ప్రబలులుగా వుండడమువల్ల గొప్ప యిండ్లు కట్టుకొనివున్నారు. వీరి ప్రారబ్ధవశమువల్ల భాటసారులకు స్థలము యిస్తే తమకు పరువుతక్కువఅని వొక బుద్ధి జనియించి యిల్లు గొప్పగదా అని ఎవరైనా వెళ్లి స్థలము అడగపోతే బ్రాహ్మణయిండ్లకు పొమ్మంటారు. మీరు బ్రాహ్మణులుకారా అని ప్రశ్నచేస్తే కాదు మేము కరణాలము, స్థలములేదు పొమ్మంటారు. యీ వూళ్లో రెడ్లు ప్రబలముగా వున్నారు. వొక దేవాలయ మున్నది. యిక్కడ యీ రాత్రి వొక బ్రాహ్మణయింట్లో వసించినాను. దారి నడక్కువేళ శాలపెట్టి పంటల్లూరు మొదలుగా వొక్కతీరుగా గులకపరచి వారధులు కట్టివున్నవి.

౨౮ తేది వుదయాత్పూర్వము ౩ గంటలకు లేచి యిక్కడికి ౨౪ ఆమడ దూరములోవుండే నాయడిపేట అనే వూరు ౯ గంటలకు చేరినాను. యిది పేటస్థలము. సమస్త పదార్థాలు దొరుకును. మనుబోలు మొదలుగా వెంకటగిరిరాజు వారి భూమి. యీ పేటలోను వారి సదావృత్తి అన్నసత్రము, నగరున్ను వున్నది. యిక్కడ భోజనము చేసుకుని ౬ గంటలకు బయిలువెళ్లి యిక్కడికి క్రోసెడు దూరములో వుండే బ్రాహ్మణ పుదూరు చేరినాను. యీ వూరు దారి కాకపోయినా ౪౦ యిండ్ల విద్వన్మండలి వుండే గ్రామము గనుకనున్ను

నా పరివారల స్వకీయులు కొందరు అక్కడ వున్నారు గనుకనున్ను యీ వూరికి రావడమయినది. యిక్కడ అనాది దేవాలయాలు ౨ ఆ బ్రాహ్మణుల పేదరీకమునకు తగినట్టు కాపాడబడుచున్నవి. యీ బ్రాహ్మలకు ఈ గ్రామము శ్రోత్రియము. ఈ వూళ్ళో ౨౯ తేది మధ్యాహ్న పర్యంతము నిలవడమయినది.

కృష్ణ మొదలుగా గూడూరివరకు తాగ నీళ్లులేవని జనులు హాహా కారపడుతూ వుండినారు. ఇవతల నాయుడిపేట మొదలుగా యెక్కువ వర్షాలు ప్రతిదినము కురుస్తూ వున్నవి. జగదీశ్వరుడు యీ చొప్పున పాత్రాపాత్రములు యెరిగి జీవనదానము చేయుచూ వున్నాడు. కాల వర్షములకు కారణము అనేకవిధాలా విచారించగా రాజధర్మముప్రజల నడవడికె యీ రెండుకారణాలున్ను ముఖ్యములని తోచబడుచున్నది. గూడూరు మొదలుగా దారి నడక్కు కాదు. యిసక కలిసిన రేగడ. నాయుడిపేటవద్ద సువర్ణముఖరీనది దాటవలసినది. యేరు అరగడియ దూరము వెడల్పుకద్దు.

నెల్లూరు మొదలుగా అరవమాటలు వింటూ వస్తాను. యీ వూరికి ఆ వూరు యిన్ని గడియల దూరమని చెప్పుతారు. కోసులమాట నిలిచిపోయినది. వుత్తరపినాకిని మొదలు దక్షిణపినాకిని వరకు మధ్య దేశముగా తోచుచున్నది. యీ దేశములో పడమటి నుంచి కన్నడము వచ్చి కలిసినది. దక్షిణము నుంచి అరవము వచ్చి కలిశినది. వుత్తరము నుంచి తెనుగు అదే రీతుగా వచ్చి కలిసినది గనుక యీ మధ్యదేశపు భాష యీ మూడు భాషల మిశ్రమయి యీ మూడు భాషలు యీ దేశస్థులు వచ్చి రాక ఆ యా దేశములోకి వెళ్ళి మాట్లాడపోతే ఆ యా దేశస్థులు హాస్యము చేయసాగుతారు.

౨౯ తేది మధ్యాహ్నముమీద 3 గంటలకు బయిలువెళ్ళి యిక్కడికి ఆమడదూరములో వుండే దొరవారి కోనేరు అస్తమానానకు చేరినాను. యిక్కడ వెంకటగిరి రాజు వొక గుంట త్రొవ్వించినాడు. అందులో యెన్నటికి అశోష్యముగానున్ను, రుచికరముగానున్ను ఆరోగ్యకరముగానున్ను వుండే వుదకము కలిగివున్నది. యిక్కడ వారు కట్టివుండే సత్రము చావిళ్ళు యథోచితముగా విశాలములై వున్నా

నిత్యము వేలమోడిగా ప్రజలు దిగుతారు గనుక స్థలము సమ్మర్దముగా వున్నది. సమీపమందు వుండే అంగళ్లలోను, భాటసారులకు కావలశిన పదార్థాలు అన్ని దొరుకును. యిక్కడ యీరాత్రి వసించినాను. దారిమెత్తయినది. యిరుపక్కలా అడివి. చోర భయము కద్దు.

౩౦ తేది వుదయాన ౫ గంటలకు బయిలువెళ్లి యిక్కడికి ఆమడ దూరములో వుండే మన్నారు పోలూరు ౮ గంటలకు చేరినాను. దారి నిన్న మధ్యాహ్నము నడిచినటువంటి దేను. యిక్కడ ప్రసిద్ధమయిన కృష్ణ దేవాలయము వున్నది. వూరికి వుభయపార్శ్వాలా కాళింది యమునలు అనే నదులు రెండు చిన్నవిగా ప్రవహిస్తూవున్నవి. యీ గుళ్లో జాంబవంతుని గుహ యనే బావి వొకటి వున్నది. యిక్కడ జాంబవంతునితో పోరి శమంతకమణినిన్ని, జాంబవతినిన్ని ప్రతిగ్రహించి శ్రీకృష్ణులు విరాజమానుడయినట్టు స్థలపురాణము తెలియపరుస్తున్నది. భక్తాభీష్టములిచ్చే కోదండరామస్వామి ఆలయమున్ను, జాంబవంతుని ఆలయమున్ను లోఆవరణములో వున్నది. కృష్ణమూర్తిని వ్యత్యస్త పాదమనే ధ్యాన శ్లోక ప్రకారము నిర్మించి వున్నారు. యిరువై యిండ్ల బ్రాహ్మణులు వున్నారు. అగ్రహారము ముందర తిరుక్కోళము రమణీయముగా వొకటి యున్నది. వెంకటగిరిరాజాగారి నగరు వొకటి కట్టి వున్నారు. తిరుక్కోళము నీళ్లు నిండా పాచి అయినప్పటికిన్ని ప్రతియింటా బావు లున్నవి గనుక జలవసతి కలదిగానే వున్నది. కాళిందీ నదికి ఆపక్క, కోటపోలూరని వొకటి వున్నది. గడియ దూరములో సూళూరుపేట అనేపేట వొకటి వున్నది. యిక్కడ నూరిండ్ల నియోగులు చుట్టుపక్కలా వున్నారు. పోలూరిలో ప్రయత్నము మీద కావలశిన పదార్థాలు దొరుకును. నెల్లూరు మొదలుగా భూమి తొవ్వితే అక్కడక్కడ కావలసి నన్ని గులకరాళ్లు తియ్యవచ్చును. నిన్నానేను నడిచిన భాట కొంత మేర రాతిగొట్టుగా వచ్చినది. యిక్కడ యీరాత్రి నిలిచినాను.

౩౧ తేది వుదయమయిన ౫ గంటలకు బయిలు వెళ్లి యిక్కడికి ఆమడదూరములో వుండే చిలకలపూడి రామస్వామి సత్రము ౯ గంటలకు చేరినాను. దారి సన్నయిసక పొర. నిండా అడివి లేదు. యీ

సత్రము పూర్వము వున్న వొక గుంటను ఆసరాచేసి కట్టినాడు. మంచి మజిలీ స్థలము. సత్రము విశాలముగా వున్నది. సత్రములో తొవ్విన బావినీళ్లు తేలికగానున్ను, రుచిగానున్ను వుంచున్నవి. భాటసార్లకు కావలసిన సామానులు అన్ని దొరుకును. యిక్కడ భోజనము కాచేసుకోవడానకు మధ్యాహ్నము నిలిచినాను.

నెల్లూరిసీమపురుషులు, స్త్రీలు దేహపటుత్వము కలవారుగా నున్ను, యధోచితమయిన కురచరూపము కలిగి సౌందర్యవతులుగా తోచుచున్నదిగాని దేహవర్ణము నలుపుకలసిన చామనగా తోచు చున్నది. గుణము నిష్కాపట్య ప్రధాన మని చెప్పవచ్చును. యీ మధ్యాహ్నము మీదట రెండు గంటలకు బయిలువెళ్ళి యిక్కడికి ఆమడ దూరములో నుండే కోభూరురాజు సత్రము ఆరుగంటలకు చేరినాము. దారిలో పెరియవేడు అనే వూరువున్నది. అక్కడినుంచి బండి భాట గుమ్మడిపూడిమీద చీలిపోవుచున్నది. నేను వచ్చిన భాటలో పయి సత్రము సమీపముగా పడవలగుండా వొక వుప్పుటేరు దాటవలెను. చెన్న పట్టణమునకు సమీపముగా వుండే కాకిరేను కాలువకు నీళ్ళువచ్చే ప్రళయకావేరి అనే యేరు పోలూరుదాకా ప్రవాహకాలమునందు వచ్చుచున్నది. ఆ యేరు యీ దినము దారి నడవడములో చూస్తూ రావచ్చును. నేను మధ్యాహ్నము నడిచినదారి యిసకపర. పెరియవేడు మొదలుగా వుప్పుపయిరు చేసే అళాలు శానా వున్నవి. పయిన వ్రాసిన సత్రము మంచి సుందరమయినతోట మధ్యే రెండుకట్లుగా కట్టి వున్నది. జలవసతి కద్దు. సత్రమువద్ద వుండడము వొక అంగడి అయినా అన్ని పదార్థాలు దొరికినవి. యీ రాత్రి యిక్కడ వసించినాను.

15/1/50



## ఇరువదిఐదవ ప్రకరణము

సెప్టెంబరు నెల ౧ తేది ఉదయాత్పూర్వము నాలుగుగంటలకు బయిలువెళ్ళి యిక్కడికి ౧౪ ఆమడదూరములో వుండే పొన్నేరి యనే స్థలము ౧౦ గంటలకు చేరినాను.* దారి రేగడభూమి గనుకనున్ను వర్షాలునిండాగా యిప్పట్లో కురిశివున్నది గనుకనున్ను నడవడానకు నిండా ప్రయాసగా వుండినది. పొన్నేరి వూరిముందర ఆరణ్యనది రొమ్ములమట్టు నీళ్ళుండగా కాలినడకగా దాటినాము. పొన్నేరియనే వూరు రెండుభాగాలుగా విభజింపబడి వున్నది. ఆ రెండుభాగాలున్ను కలియడానకు మధ్యే వొక విశాలమయిన అంగడివీధి సత్రాలసహితముగా కట్టివున్నది. యీ వీధిలో ప్రతిసంవత్సరము హరిహరాదులు వారివారి వాహనారూఢులయి సంధించే వుత్సవము జరుగుచున్నది. గనుక ఏతద్విషయమయి యీ వీధిని బహుసుందరముగా యేర్పరచి వున్నారు. దక్షిణభాగమందు వుండే వూళ్ళో ఆరుముఖ మొదలారి వొక శివాలయము తటాకము మొదలైన ధర్మస్థలములను నిర్మించివున్నాడు. ఉత్తరభాగమందు అనాది విష్ణుస్థలము తటాకము మొదలయిన దేవాలయబ్రహ్మాలయాలు వున్నవి. ౫౦ బ్రాహ్మణయిండ్లు కలవు. బట్టలు సహితముగా కావలసిన పదార్థాలు అన్ని యీ వూళ్ళో దొరుకును. విశాలమయిన సత్రాలు చెన్నపట్టణపు వారు కొన్ని కట్టివున్నారు. విష్ణుస్థలమునకు భూరూపకమయిన జీవనము వుండేటందున కుంఫిణీవారు ధర్మకర్తను యేర్పరచి పనులు జరుపుకుంటారు. శివస్థలమునకు ఆరుముఖ మొదలారి వొక ముతాను తీసి దాని ఆర్జితముగుండా అతి విమర్శగా నిత్యోత్సవ మాసోత్సవ సంవత్సరోత్సవాలు జరిగింపుచున్నాడు.

ఈస్థల మాహాత్మ్యము బ్రహ్మాండపురాణాంతర్భూతముగా ౫ అధ్యాయాలువున్నవి. వాటిసారమేమంటే శ్రీకృష్ణమూర్తి ద్వాపరాంతమందు కలిలో తాను యీస్థలములో మూర్తీభవించేటట్టు ఋషులకు

* ఇక్కడ యీదుల నారాయణయ్యగారి దగ్గర బసచేసినానని వ్రాతప్రతి ౪౨౬ పుట.

చెప్పివున్నందున ఈ రహస్యము భారద్వాజులు తెలుసుకుని యిదే బృందావనక్షేత్రమని నిశ్చయించి యిక్కడ స్వామిసాక్షాత్కారము పొందడమునకు బ్రహ్మను కూర్చి తపస్సుచేసినట్టున్ను బ్రహ్మభారద్వాజుల యిష్టసిద్ధి అయ్యేకొరకు విష్ణుప్రీత్యర్థముగా నారాయణవనములో యాగముచేసినట్టున్ను అప్పుడు అరణిమథనలో ప్రథమము వొక నది పుట్టినంతలో ఆ ఆరణ్యానదిని భారద్వాజుల నిత్యకర్మాదులకు వొదిగేటట్టుగా యీ పెన్నేరికి పంపించినట్టున్ను పిమ్మట యాగానంతరము శ్రీమన్నారాయణమూర్తి ప్రత్యక్షమైనంతలో భారద్వాజుల యిష్టసిద్ధి చేయుమని వేడుకుని శేషశాయి రూపముతో ఈ స్థలములో విరాజమానుడయ్యేటట్టు చేసినట్టున్ను పిమ్మట వొక గోవు పాలు కార్చడం మూలముగా వూహించి పుట్టచేత కప్పబడియుండే స్వయంభు కృష్ణమూర్తిని కరిపాండ్యరాజు విశేషక్షీరాభిషేకము వల్ల బయిలుపరచి దేవాగారాలు కట్టి తనపేరు సహితముగా కరికృష్ణుడని నామకరణముచేసి ఆరాధనచేయుచూ వచ్చినట్టున్ను ఈ ఆరణ్యానదిన్ని ఈ స్థలమున్ను తదారభ్య యింద్రాదుల శాపాన్ని పోగొట్టి అనేకులను పావనులుగా చేయుచూ వుండేటట్టు విదితమయివున్నవి.

ఈ దినము పుట్లపండగ గనుక యిక్కడ భోజనానికి నిలిచి స్వామి దర్శనమున్ను చేసి నాలుగుగంటలకు బయిలువెళ్ళి యిక్కడికి ఆమడదూరములోవుండే విచ్చూరికి రాత్రి ౮ గంటలకు చేరినాను. మధ్యాహ్నముమీద నడిచినదారి రేగడభూమి. బండిదారి వొకటి కాలిదారి వొకటి అంతు రెండుదార్లు కలిగివున్నవి. కాలిదారి కొంచెము సమీపమయినందున సవారీలు మొదలయినవి కాలిదారిగానే నడుస్తున్నవి. వర్షాకాలము గనుక బహు ప్రయాసగా వున్నది. పెన్నేరికి ౨ గడియల దూరములో యెలవంబేటివద్ద కొరత లేరు నడుములమట్టు లోతు గనుక కాలినడకగానే దాటినాము. విశేష ప్రవాహకాలమందు పడవలు తెప్పలకుండా దాటవలసినది. విచ్చూరు లింగిశెట్టివారికి శ్రోత్రియుగ్రామము. సంవత్సరానకు వెయివరహాలు యెత్తును. ౩౦ బ్రాహ్మణయిండ్లు కలవు. సమస్త పదార్థాలు దొరుకును. చుట్టూ అశ్వద్ధవృక్షాలుగల రమణీయమయిన వొక తామరకొలను అగ్రహారమునకు

సమీపముగా వున్నది. యిక్కడ ఈ రాత్రి మరునటిదినము మధ్యాహ్నము వరకు నిలిచినాను.

లోకములో యీశ్వరుడు వొక రూపముతో ఆదరింపుచు మాతాపితాృదులు అనేక రసాలను కాలోచితముగా తెచ్చుకొని వొక్కొక్క రసముతో వొక్కొక్క విధమయిన అభినయాన్ని పట్టి శిశువులను రక్షించేటట్టు సమస్తవిధాలా యెదటనిలిచి యీశ్వరుడు మాట్లాడుచువుండగా యీశ్వరుడు ప్రత్యక్షముకావలె నని లోకులు యీశ్వర సాన్నిధ్యము కావలెనన్ని పిచ్చి తపస్సులు చేయుచున్నారు. యిందుకు కారణము జగదీశ్వరుని దురత్యయ మయిన మాయకాని వేరేకాదు.

౨ తేది మధ్యాహ్నము మీదట ౪ గంటలకు బయిలువెళ్లి యిక్కడికి ఆమడ దూరములో వుండే తిరువట్టూరు అనే మహాస్థలము అస్తమానానకు చేరినాను. * దారి వుప్పురేగడభూమి. చరిసగము దూరములో సుంకపుమెట్టు వొకటి వున్నది. సుంకము వసూలు నిమిత్తము యిక్కడ మూటలు ముల్లెలు చెన్నపట్టణమునకు నాలుగు పక్కలా వుండే మెట్లలో సోదా యిచ్చేటట్టు యిక్కడ యివ్వవలశినది. నేటి దారిలో మధ్యే కాకిరేకాలువ దాటవలశినది. వారధిమీదపోతే కొంతచుట్టు గనుక పడవలగుండా ఆ కాలువ దాటినాను. వర్షాకాలము గనుక దారి అడుసుగా వున్నది. యీతిరువట్టూరు బహు సుందరమైన వూరు. చెన్నపట్టణపు హిందువులకు ఆనందప్రదముగా వుంటూ వచ్చుచున్నది. ప్రతిసంవత్సరము యిక్కడ జరిగే బ్రహ్మోత్సవము వసంతకాలములో శుక్లపక్షములో అపర రాత్రిళ్లలో విభవము జరుగుటచేత చెన్నపట్టణములో సమస్తవిధములయిన జీవనోపాయాలు కలవారు నిద్రాకాలాన్ని మానుపానందానుభవానకు వుపయోగము చేసుకుని చెన్నపట్టణము మొదలు తిరువట్టూరివరకు ౨ కోసులదూరములో అడుగుకు వొక సత్రముకట్టి దానికి తగ్గ వుపచారములు వారువారు ఆ సత్రాలలో

* 'కోమలేశ్వరుడి గుడి మునియపిళ్ల కొమారుడు శ్రీనివాసపిళ్ల నన్ను వచ్చి కలుసుకొని తన సంకల్పం సిద్ధించెగదా అని ఆనంద పడ్డాడు' అని వ్రాత ప్రతి కాగితములో వున్నది.

చేస్తూవుండడమువల్ల సౌఖ్యముగా వచ్చి యీ బ్రింహోత్సవాన్నిన్ని వేడుకపరచి తాము ఆనందపడిపోతూ వుంటారు. యీవూళ్లో చెన్న పట్టణపు వుపపన్నులు అనేకసత్రాలు కట్టివున్నారు. విశాలమయిన వీధులు కలవి. వీధులు టెంకాయచెట్లశాలల వల్లను బయిటితిన్నెలు పందిళ్ళచేతనున్ను అలంకరించబడివున్నవి. సుందరమయిన దేవాలయము తటాకసహితముగా వున్నది. సమస్తపదార్థాలు దొరుకును. యీ వూరు తోటల చేత ఆవరించబడి వున్నది. యీ గుడిధర్మము లింగిశెట్టి కుమారుడైన అరుణాచలశెట్టి తనచేతి సొమ్ము సంవత్సరానకు ౨౦౦౦ వరహాలదాకా ఖర్చు చేసి జరిగింపుచున్నాడు. ఆ ధర్మము కాక అతను వేశివుండే, తోట కట్టివుండే సత్రమున్ను సుందరముగా వున్నది. అతను అన్నదానాపేక్ష చాలా కల వంశములో జనించినాడు గనుక ఆవాసన యీ పురుషుణ్ని బాగా పట్టి వున్నది.

యీ స్థల మాహాత్మ్యము యేమంటే సృష్టికి ఆదియందు భూమి జలార్ణవమై వుండగా యీశ్వరుడు సృష్టికి అంకురముగా వొక ఔదుంబర వృక్షము కలగచేసి చండవాయువుచేత ఆవృక్షమును యుక్త ప్రదేశములో నిలువుమని పంపించినట్టున్ను ఆ వృక్షము యీ వూళ్లో పతనమై పాతాళలోకము అంటినట్టున్ను అక్కడ వుండే ఆదిశేషుడు ఆవృక్షాన్ని పోషింపుచువచ్చినట్టున్ను దాన్ని వేళ్ళు పుష్టి భూమిని అప్పట్లో ఆవరించి భూమి మీద వుండే వుదకాన్ని పానము చేసి భూమిని బయిలు పడతోశినట్టున్ను అప్పట్లో వినాయకుడు మొదలయిన ఆవరణదేవతలు ఆచెట్టు కింద ప్రవేశించినట్టున్ను ఆదిశేషుడుకూడా వొకపుట్టను యిక్కడ కల్పించుకొని వసింపుచున్నట్టున్ను అటుపిమ్మట యీ స్థలములో వసించగలందులకు పార్వతిని రమ్మంటే సృష్టి స్థితి సంహారములలో అధికారము తనకుకూడా యివ్వక గాని తాను రానని చెప్పినట్టున్ను పిమ్మట యీశ్వరుడు అదేప్రకారము అధికారము యిచ్చి పార్వతిని వెంటపెట్టుకుని ఆదిశేషునివల్ల పూజింపబడి అతను కట్టుకునివున్న వల్మీకములోనే ప్రవేశించి అద్యాపి వుండేటట్టున్ను పార్వతీదేవిన్ని త్రిపురసుందర్యాకారము వహించి సృష్టి స్థితి సంహారాధికారము చేయుచూ యిక్కడ విలశిల్లి వుండేటట్టున్ను

చేస్తూవుండడమువల్ల సౌఖ్యముగా వచ్చి యీ బ్రింహోత్సవాన్నిన్ని వేడుకపరచి తాము ఆనందపడిపోతూ వుంటారు. యీవూళ్లో చెన్న పట్టణపు వుపపన్నులు అనేకసత్రాలు కట్టివున్నారు. విశాలమయిన వీధులు కలవి. వీధులు టెంకాయచెట్లశాలల వల్లను బయిటితిన్నెలు పందిళ్ళచేతనున్ను అలంకరించబడివున్నవి. సుందరమయిన దేవాలయము తటాకసహితముగా వున్నది. సమస్తపదార్థాలు దొరుకును. యీ వూరు తోటల చేత ఆవరించబడి వున్నది. యీ గుడిధర్మము లింగిశెట్టి కుమారుడైన అరుణాచలశెట్టి తనచేతి సొమ్ము సంవత్సరా నకు ౨౦౦౦ వరహాలదాకా ఖర్చు చేసి జరిగింపుచున్నాడు. ఆ ధర్మము కాక అతను వేశివుండే, తోట కట్టివుండే సత్రమున్ను సుంద రముగా వున్నది. అతను అన్నదానా పేక్ష చాలా కల వంశములో జనించినాడు గనుక ఆవాసన యీ పురుషుణ్ని బాగా పట్టి వున్నది.

యీ స్థల మాహాత్మ్యము యేమంటే సృష్టికి ఆదియందు భూమి జలార్ణవమై వుండగా యీశ్వరుడు సృష్టికి అంకురముగా వొక ఔదుంబర వృక్షము కలగిచేసి చండవాయువుచేత ఆవృక్షమును యుక్త ప్రదేశములో నిలువుమని పంపించినట్టున్ను ఆ వృక్షము యీ వూళ్లో పతనమై పాతాళలోకము అంటినట్టున్ను అక్కడ వుండే ఆది శేషుడు ఆవృక్షాన్ని పోషింపుచువచ్చినట్టున్ను దాన్ని వేళ్ళు పుట్టి భూమిని అప్పట్లో ఆవరించి భూమి మీాద వుండే వుదకాన్ని పానము చేసి భూమిని బయిలు పడతోశినట్టున్ను అప్పట్లో వినాయ కుడు మొదలయిన ఆవరణదేవతలు ఆచెట్టు కింద ప్రవేశించినట్టున్ను ఆదిశేషుడుకూడా వొకపుట్టను యిక్కడ కల్పించుకొని వసింపుచున్న ట్టున్ను అటుపిమ్మట యీ స్థలములో వసించగలందులకు పార్వతిని రమ్మంటే సృష్టి స్థితి సంహారములలో అధికారము తనకుకూడా యివ్వాక గాని తాను రానని చెప్పినట్టున్ను పిమ్మట యీశ్వరుడు ఆదేవికా రము అధికారము యిచ్చి పార్వతిని వెంటపెట్టుకుని ఆదిశేషునివల్ల పూజింపబడి అతను కట్టుకునివున్న వల్మీకములోనే ప్రవేశించి అక్కాడి వుండేటట్టున్ను పార్వతీదేవిన్ని త్రిపురసుందర్యాకారము వహించి సృష్టి స్థితి సంహారాధికారము చేయుచూ యిక్కడ విలశిల్లి వుండేటట్టున్ను

పిమ్మట యీశ్వరుడు తన ప్రీతిభాతిని మూర్తిగాచేసి సుందరుడని నామముపెట్టి పార్వతియొక్క ప్రీతిభాతితో పొగడచెట్టుకింద యిద్దరి కిన్ని వివాహముచేసినట్టున్ను ఆ వివాహము చూడవచ్చిన గంగాస్నాత యయిన భక్తుడు కాలాతీతముగా వచ్చి వివాహము చూడడానకు లేక పోయెనని దుఃఖపడితే అతని గంగను యిక్కడి తటాకములో విలసింప చేసి మళ్ళీ ఆ వివాహ లాంఛన జరిగించి అతనికి దర్శనము యిచ్చి నట్టున్ను ఆ వివాహలాంఛన ప్రతిసంవత్సరము యిప్పుడు బ్రహ్మోత్స వములో పొగడమాను సేవ అని జరిగేటట్టున్ను బ్రహ్మకు పార్వతి నిమిత్తము తాను ఆడిన తాండవము యీశ్వరుడు యిక్కడ మళ్ళీ దర్శనము అయ్యేటట్టు చేసినట్టున్ను మరికొన్ని కాలాలలో కొందరు భక్తులకు అపహరించబడ్డ భాగ్యాన్ని త్యాగము చేసినట్టున్ను మొట్ట మొదట పుట్టిన పురి అయినందున యీ వూరు ఆదిపురి అని పేరు కలిగి తాండవము చూపుటచేత తాండవ ప్రియుక్తమయిన భవును లనే నట నలు ఆడుతూ త్యాగద్వారా త్యాగరాజు అని మూర్తి పేరువహించి వల్మీకనివాసముచేత అదే మూలస్థానమై వుండేటట్టుగా ప్రసిద్ధిపడి యున్నది. యిక్కడ మరునాడు దాకా వశించినాను.

3 తేదీ సాయంకాలము ౫ గంటలకు బయిలువెళ్ళి యిష్టులతో కూడా చెన్నపట్టణమునకు అరకోసెడుదూరములో తండయారు వేడులో వుండే నాతోట యిల్లు ఆరుగంటలకు చేరినాను. దారి యిసక పొరభూమి. యిరుపక్కలా తోటలు సత్రాలు దట్టముగ్గా వుండుట చేతనున్ను భాట వెడల్పు చాలాకలిగివుండుటచేతనున్ను బహు రమణీ యముగా చూడ వేడుకగా వున్నది. జగదీశ్వరుడు తృణాన్ని మేరువు చేసుననే వాక్యము సత్యమని నేను అతిఘోర ప్రమాణము చేయగలను. అది యెట్లాగంటే నేను స్వస్థలము వదిలి మళ్ళీచేరినకాలము ౧౫ మాసాలు ౧౫ దినాలు ౧౦ నిమిషాలు. నా స్వస్థలము వదిలి దూర దేశము సంచరించి మళ్ళీవచ్చినట్టు నాకు నా పరివారానికిన్ని తోప చేయక వొకరికి కాలిలో ముల్లుకూడా నాటినట్టు తోపచేయకుండా తృణానికి తక్కువ అయిన నన్ను రాజీవిగానే స్థలముచేర్చినాడు.

గనుక అవ్యాజముగా ఈశ్వరుడు తృణాన్ని మేరువుచేస్తాడనే మాట సత్యం సత్యం పునఃసత్యమని నా సహోదరులైన లోకులు నమ్మవలశినది.

నా జన్మభూమి అయిన చెన్నపట్టణపు వృత్తాంతము యెటువంటిదంటే ౨౦౦ యేండ్ల కిందట చంద్రగిరిలో బీజానగరపు సమస్థానాధిపతి యయిన శ్రీరంగరాయడు దొరతనము చేయుచుండగా డే అనే దొర యీ సముద్రతీరమునందు వొక రేవుబందరు కట్టించవలెనని యత్నము చేసి శ్రీరంగరాయణ్ని అడిగి వుత్తరువు తీసుకుని యీ ప్రాంత్యాలకు జమీందారుడయిన దామర్ల వెంకటాద్రి నాయుడి పేర సన్నదు పుచ్చుకొన్నాడు. ఆ వెంకటాద్రినాయడు డే దొరకు కృతపరిచయుడు గనుక శ్రీరంగరాయడు తన పేరుపెట్టి శ్రీరంగరాయ పట్టణము అని రేవు బందరు కట్టమన్నా వెంకటాద్రినాయడు తన తండ్రియైన చెన్నప నాయడి పేరట చెన్నపట్టణ మని పేరుపెట్టి కట్టమని చెప్పడమేగాక తానే సన్నిధానాధిపతి గనుక అదే నామకరణము ఆరంభములో చేసినందున చెన్నపట్టణమని పేరు కలిగినది. తత్పూర్వము యీ రేవును యింగిలీషువారు మదిరాసు అంటూ వచ్చినారు.

పిమ్మట ౧౬౪౪ యింగిలీషు సంవత్సరములో రేవు బందరుకు చేరినట్టుగా వొక కోటకట్టి సముద్రతీరమునందు రెండుకోసుల భూమిని యింగిలీషువారు స్వాధీనము చేసుకున్నారు. అటుపిమ్మట ౧౬౬౧ సంవత్సరములో యింగిలీషువారిలో కొంత అంతఃకలహము జరిగి అరాజకమయి ౧౬౭౧ సంవత్సరములో మళ్ళీ స్థిరపడి యీ రేవు బందరు సుంకము యిజారా కుంఫిణీవారు చేసినారు. వెంబడిగానే కుంఫిణీవారి ప్రాపకము కోరి జగదీశ్వరుడు సత్యవాదులపై పక్షపాతి గనుక యింగిలీషువారు చాలా సత్యసంధులయినందున యీ బస్తీలో మూడు లక్షల ప్రజ వాసముచేశేటట్టుచేశినాడు. పిమ్మట ౧౬౯౬ సంవత్సములో ౪౦౦౦౦ వరహాలు సాలుకు యెత్తేపాటి భూమి కుంఫిణీవారి యధీనమయినది. పిమ్మట ౧౭౦౨ సంవత్సరములో డిల్లీ పాదుషా అవరంగజీబు తరఫున దావూతుఖానుడు దండుయెత్తివచ్చి యింగిలీషువారిని చాలా కలతపెట్టినాడు. అప్పట్లో అనేక తెగలు అనేక దేశములనుంచి యిక్కడికి చేరినందున యెడమచెయ్యి కక్షి అని కుడిచెయ్యి

కక్షి* అని రెండు పక్కలుగా యిక్కడివారు చీలి యింగిలీషువారికి చాలా శ్రమను కలగచేసినారు. అందుకు ౮౦ సంవత్సరముల తర్వాత ఫ్రాంసువారు యీకోట తీసుకొని యింగిలీషువారిని వెళ్లగొట్టినా హిందుస్తానలో యింగిలీషుజాతికి దిగ్విజయము కలిగి వుండెను గనుక వారు వొకపాటిగా సమాళించినారు. వెంబడిగానే ౫ సంవత్సరములకు రాజీ

---

* కుడియెడమ కులకక్షలు :

వైష్ణవ బ్రాహ్మణులలోని వడగలి తెంగలి తెగలవలెనే ద్విజేతరకులములందు కుడి ఎడమ కులకక్షలు చాలకాలమువరకూ అతి తీవ్రముగానుండేవి. కుడిచెయ్యి కులకక్షిలో లింగధారణముచేసిన నేతగాండ్లు, తెలికలవాండ్లు, కుట్రపుపనివాండ్లు, బలిజలు, గొఱ్ఱెల కాపరులు, కుమ్మరులు, మేదరులు, చాకళ్ళు, మంగళ్ళు, జోగులు, బుడబుడక్కలవాండ్లు, మాలలు నుండిరి. ఈ కుడికులమువారిని కొన్నిచోట్ల దైవాచారులనిన్ని, కొన్నిచోట్ల మహానాటివారనిన్ని వ్యవహరించిరి. ఎడమచెయ్యి కులములను పాంచాలులనిన్ని, మత్తులనిన్ని వ్యవహరించిరి. వీరిలో జందెములు వేసికొను అయిదు తెగల బత్తులు, వెండి బంగారు పనిచేయు కంసాలిబత్తులు, రాగి యిత్తడి పనిచేయు కంచరిబత్తులు, రాతి పనిచేయు శిల్పులు, రంగులువేయు పాటగారులు, నేతనేయు దేవాంగులును, గొల్లలు, ముతరాచలు, మాదిగలు మొదలగువారుండేవారు.

ఈ రెండు కక్షలలోని కులములవారు నొకరికన్న నొక రెక్కువ వారమనిన్ని తమకు ముందుగా మర్యాదలు జరగవలెననిన్ని తగవులాడుచుండేవారు. ఈ రెండు తెగలకు వేరువేరు మతాచారములుండెను. దేవతలు దేవుళ్ళు నుండిరి. వీరి వివాహములందు, మరణములందు కొలుపులందు జాతరలందు ఒక కులకక్షివారి వీధులనుండి రెండవకక్షి కులములవా రూరేగింపులు చేయకూడదను కులకట్టులు నిషేధములు అనాదిసిద్ధముగా నుండి తగవులకును దెబ్బలాటలకును కారణమగుచుండెను. పెండ్లిండ్లలో మహానాటి వారిలో మాలలు గుఱ్ఱమునెక్కి యూరేగుటకు కొన్ని గ్రామములం దభ్యంతర ముండెను. తక్కినవారిలో ఆయా కులముల తారతమ్యములను బట్టి పల్లకీలు మొదలైనవి యెక్కి భజంత్రీలు మేళతాళములతో నూరేగినచో నెడమకులములవా రభ్యంతర పెట్టుచుండిరి. ఇంకను చిత్రచిత్రములైన యాచారాలుండెను. ఇవి మీరినట్లయితే రెండవవారు ఆటంకపరచుచుండేవారు. చాలాకాలమువరకు నింగ్లీషు కుంపినీప్రభుత్వము వారి కులమర్యాదలను కాపాడుచునే యుండిరి. సివిలు క్రిమినలు కోర్టులీ తగవులతో నిండుచుండెను. దేశము తెలుగుమీరిన తరువాత రోడ్లు మొదలగు బహిరంగ స్థలములలో నందరికిని సమానమైన హక్కులు కలవను సిద్ధాంతము స్థాపింపబడినది. చెన్నపట్టణమున 1652, 1707, 1716 సంవత్సరములం దిట్టి తగవులువచ్చినట్లు కుంపినీవారి రికార్డులలోనే వివరింపబడియున్నది. ఈ రెండుకులములవారికి పెద్దనాయకునిపేట ముత్యాలపేటలలో ప్రత్యేక వీధు లేర్పాటు చేయబడెను.

మీాద యీా స్థలమును యింగిలీషువారు స్వాధీనము చేసుకున్నారు. ౧౭౫౮ సంవత్సరములో కలాపన పొసగి జగదీశ్వరుని కటాక్షముచేత ఫ్రాంసు దండు పరారి అయిపోయినది. అది మొదలుగా ఆరికాటి నవాబును విహితపరుచుకుని క్షేమముగా కాలము తోయుచుండగా ౧౭౬౭ సంవత్సరము మొదలు ౧౭౮౧ సంవత్సరమువరకు హాయిదరుతో నవాబు నిమిత్తము పోరవలశి వచ్చినది.

అది మొదలు యధాక్రిమముగా ఆరికాటినవాబు రాజ్యమంతా యింగిలీషువారి అధీనమయి వుత్తరము గంజాం మొదలు దక్షిణము తిన్నెవల్లి శీమవరకున్ను తూర్పుసముద్రిము మొదలు పశ్చిమసముద్రము వరకున్ను యేకచక్రాధిపత్యముగా యీా చెన్నపట్టణమును రాజధాని చేసుకుని కుంఫిణీవారు యేలుతూ వున్నారు. యీా రాజధానికింద యిప్పుడు వుండే జిల్లాలు యిరువైవొకటి. యింత భూమిమధ్యే మయిసూరు మళయాళము కొచ్చి యీా దేశముల రాజులుతప్ప కొదవ అందరు జమీాన్దారి పాయాకలవారు గాని యుద్ధసన్నద్ధులు కాగల భూపతులు వొక్కడున్ను లేడు.

యీా చెన్నపట్టణము కొడి (జండా) కింద యిప్పుడు సాలుకు సుమారు ఒకటింకాలు కోటివరహాలు వసూలవుతున్నవి. ఖరుచులుఅప్పులకు యిచ్చేవడ్డి సహాగా వసూలుకు యెక్కువగాని తక్కువలేదు. యీా చెన్నపట్టణము కొడికింద కుంఫిణీవారి అప్పు సుమారు రెండుకోట్లవరహాలు వుండును. స్థావరజంగమ రూపమైనస్థితి మూడుకోట్లవరహాలు వుండునని తోచుచున్నది. దండు ౫౦ వేలమంది ఫౌజువున్నది. యీా చెన్నపట్టణపు బస్తీకి మూడుపక్కలా మహారు (పానా)గోడపెట్టివున్నది. తూర్పుపక్క సముద్రిమేగాని గోడలేదు. బస్తీకోసెడుదూరము చచ్చౌకముగా వున్నది. బస్తీకి కోసెడు దూరములో దక్షిణపక్క యుద్ధసన్నద్ధమయిన కోట సముద్రము వారగా కట్టివున్నారు. వుత్తరపక్క సముద్రముగట్టున మొగుమతి దిగుమతులయ్యే రేవు సరుకు వేసేకొట్లున్ను కట్టివున్నవి. ఈ చెన్నపట్నానికంతా పాపంవీధి శాలవీధి ఈ రెండున్ను విశాలమైనవి. నిండా కుసంధి అయిన వీధులుకావు. యిండ్లకు రెండు విధాల పన్ను రూకలు తీసుకుని వీధులువూడ్చి మరామత్తుచేసి లాంతరు

వుంచి కుంఫిణీవారు కావలి కాస్తూవుంటారు. యిండ్లు తలవాకిలి తిన్నెలు పందిళ్ళు బయిటికి అలంకారముగానున్నా లోపల కలకొద్దిలో ఘాలికి అడ్డులేకుండా కట్టియున్నారు. పది దేవాలయముల దాకా యున్నవి. అందులో విభవముగా ప్రతి సంవత్సరము బ్రహ్మోత్సవాలు జరుగుతూ వుంచున్నవి.

సముద్రముగుండా వచ్చేపొయ్యే సరుకులకు తీరువసుంకము తీశే నిమిత్తము సముద్రతీరమందు కష్టంహావుసు అని వొక కచ్చేరివున్నది. గట్టున వచ్చేపొయ్యే సరుకులకు తీరువ తియ్యడానకు పడమటిపక్క లాండు కష్టంహావుసు అని వొక కచ్చేరి కట్టివున్నది. మిగిలిన కచ్చేరీలు కొన్ని రేవులోనున్ను, కొన్ని కోటలోనున్ను, కొన్ని బయట తోటలలోనున్ను చేయుచూ వుంటారు. సర్వాధికారియైన గౌనరుయిల్లు ఆరికాటినవాబు యిల్లున్ను కోటకు దక్షిణభాగమందు పావుకోసు దూరములో తిరువళిక్కేణి అనే వుపగ్రామములో వున్నవి. జాతుల వాండ్లందరు బస్తీకి దక్షిణము ఆమడ దూరములో వుండే పరంగికొండ వరకు పడమర మూడుకోసుల దూరములో వుండే పెరుంబూరి వరకున్ను సుందరమయిన తోటలువేసి బంగాళాలు, యిండ్లు కట్టుకుని వున్నారు. బస్తీలోపలవుండే హిందువుల యిండ్లలో అయ్యాపిళ్ల యిల్లు పెద్దది. కోటలోపల వుండే యిండ్లలో వాడలకు తెలిశే నిమిత్తము రాత్రిళ్లు దీపముపెట్టే మెక్కిసుచెంజియిల్లు పెద్దది. బయిటవుండే జాతులవాండ్ల మిద్దెలలో మురాతు (J. Moorat) కట్టిన యిల్లు పెద్దది.

బస్తీకి దక్షిణము తిరువళిక్కేణి, మయిలాపూరు, తిరువటీశ్వరుని పేట మొదలయిన కొన్ని వుపగ్రామాలు వున్నవి. పడమటిపక్క చూళ పొరిశపాక, కోమలేశ్వరునిగుడి యివి మొదలయిన కొన్ని గ్రామాదు లున్నవి. వుత్తరభాగమందు చాకలపేట, రాయపురము, తండయారుపేట మొదలయిన కొన్నిగ్రామాలు వున్నవి. యీ బస్తీలో వుండే హిందువులు అందరు వుత్తరభాగమందు తిరువట్టూరి వరకు ఆరామక్షేత్రాలు ఖేటాగా యేర్పరచుకొని విలాసకాలముల యందు అక్కడికి వెళ్లి విహరిస్తూ వుంటారు. కోమలేశ్వరుని గుడివద్ద వొక చిన్నయేరు ప్రవహింపుచున్నది. దక్షిణపక్క మయిలాపూరు

చెరువు కట్టివున్నది. పడమటిపక్క లుంగంబాక చెరువు కట్టియున్నది. వుత్తరపక్క ప్రతి తోటలలో తటాకాలు, దొరువులు తొవ్వివున్నారు. అందులో జగదీశ్వరుని కటాక్షముచేత మంచినీళ్లు కలిగివున్నవి. సమస్త ద్వీపాంతరాల పదార్థాలు కలవు, పనివాండ్లుసహా అమితముగా కలరు. అయితే జనసమ్మర్దముచేత భూమి ఆరోగ్యమయినది కాదు. వుష్ణవాయువు భూమి. సంకలిత రోగాలు ప్రాప్తిస్తూ వస్తున్నవి. కాల నియమాలు లేకుండా కాయగూరలు, ఫలాదులు, పుష్పాదులు అమితముగా దొరుకుచున్నవి.

యిక్కడివారి ప్రకృతులు ఉపాయవేత్తలుగాని సాహసులు గారు. ద్రావిడాంధ్రకర్ణాటక దేశాలమధ్యే యీ ప్రదేశము వుండుటచేత బాల్యాదారభ్య దేశ్యములయిన ఆ మూడు భాషలున్ను ముందు దొరతనముచేసినవారి తురకభాష, యిప్పుడు దొరతనము చేసే యింగిలీషువారి భాషయున్ను నోట నానడముచేతనున్ను, పదార్థములుగా కొన్ని సంస్కృతవాక్యాలు అభ్యసించుటచేతనున్ను యిక్కడి వారి వుచ్చారణ స్ఫుటముగా వుంటూ వచ్చుచున్నది. యిక్కడి స్త్రీలు గర్విష్ఠులుగానున్ను, పురుషులపట్ల నిండా చొరవ చేసుకోగలవారుగానున్ను అగుపడుతారు. అయితే వస్త్రాభరణప్రియులే గాని నైజగుణమయిన సాహసము నిండా కలవారుగా తోచలేదు.

యిక్కడి భూమి సారవత్తు కాకపోయినా లోకులు చేసే కృషి వల్ల ఫలకారిగా వున్నది. వృక్షాదులు పుష్టికలవి కాకపోయినప్పటికిన్ని యిక్కడ సమస్తదేశపు వృక్షాదులున్ను కలవు. సమస్తజాతుల పుష్పాదులు చూడవచ్చును. యిక్కడివారు చాలా మూర వెడల్పుకలబట్టలు కట్టుతారు. యధోచితము యిక్కడివారు కర్మఠులుగానున్ను, దేవ బ్రాహ్మణ విశ్వాసము కలవారుగానున్ను వుంటారు. యిక్కడి హిందువులకు పూర్వపు పురోవృద్ధి లేకపోయినప్పటికిన్ని ముందర చెందిన వాసనను ప్రయాసమీద కాపాడుకుంటూ వస్తారు. జాతులవారి జనబాహుళ్యము వారి విభవముతో స్త్రీ పురుష సల్లాపాలు చూడ

వలిస్తే ప్రతిదినము సాయంకాలమందు పరంగికొండశాల * లోను సముద్రము వద్ది వాడరేవుశాల*లోనున్ను నిలిస్తే వారందరు వాహన విశేషాలు యెక్కి వస్తారు గనుక చూచి ఆనందించ వచ్చును. యిట్టిదొరతనములో జగదీశ్వరుడు నావంశపరంపరగా జీవనము కలగచేసి నన్ను వుంచియున్నాడు.

కాశియాత్ర చరిత్ర సంపూర్ణమైనది.



* పరంగికొండ అనగా సెంట్ తామస్‌మౌంటు. 'శాల' యనగా బాటకిరు ప్రక్కల నీడకొరకు వేయు చెట్లవరుస. ఆకాలమున మౌంటురోడ్డులో కోటదగ్గర నుండి సెంట్ తామస్‌మౌంటుకు పోవు దారిలో ౫ మైళ్ళ దూరమున కారన్ వాలీసు స్మారక చిహ్నము వరకు బాట విశాలమైనదునైయుండెను. దానికి రెండుప్రక్కల మఱ్ఱిచెట్లు ఇతరవృక్షములు వరుసగానుండెను. ఇంగ్లీషు స్త్రీ పురుషులు సాయంకాలమా స్మారక చిహ్నము వరకు పల్లకీలలోను బండ్లలోను పోయి అక్కడ నేడు బీచిలోవలెనే సరససల్లాపములతో విహరించుచుండిరి. ఇక్కడ వాడరేవు అనగా హార్బరు వద్దను నీడకొరకు చెట్లు వరుసగా పెంచియుండిరి. ఇదియే వాడరేవుశాల.

ఏనుగుల వీరాస్వామయ్యగారి

# కాశీయాత్రచరిత్ర

## అనుబంధము



సంపాదకుడు

దిగవల్లి వేంకటశివరావు

:: :: బెజవాడ :: ::

ఏనుగుల వీరాస్వామయ్యగారి

# కాశీయాత్ర చరిత్ర

# అనుబంధము

## సూచిక:


విషయములు: పుటలు

1 సౌరమానము, చాంద్రమానము, బార్హస్పత్యమానము, అధిక క్షయ మాసాలు 1-2

2 సవరణల పట్టిక 3-16

3 చెన్నపట్టణ ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారములో వున్న కాశీయాత్ర చరిత్ర అసలు గ్రంథం వ్రాతప్రతి - మచ్చుపుటలు 17-33

4 కాశీయాత్ర చరిత్రలోని కొన్ని పదముల అర్థములు 34-40

5 అకారాది విషయసూచిక 41-79


## కృతజ్ఞత


ఈ గ్రంథప్రకటనకు అనేక అంతరాయాలు కలిగినప్పటికీ, పరమేశ్వరుని అనుగ్రహంవల్లను, మిత్రుల తోడ్పాటువల్లను, ఇది నిర్వహింపగలిగాను. ఈకార్యంలో బ్రహ్మశ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రిలుగారు, శ్రీ చెరుకుపల్లి వేంకటప్పయ్యగారు, శ్రీ ఘంటసాల సీతారామశర్మగారు, శ్రీ చల్లా జగన్నాథంగారు, శ్రీ కుందా నరసింహామూర్తిగారు మొదలైన నా మిత్రులు చాలా శ్రద్ధతీసుకుని నా కనేక విధాలుగా తోడ్పడ్డారు. శ్రీ శాస్త్రులవారు తమ ఆరోగ్యం సరిగ్గా లేనప్పటికీ పుస్తకాన్ని జాగ్రత్తగా పరిశోధించి కొన్ని ప్రయోగాలకు అవసరమైన అర్థాలు వ్రాసి యివ్వడమేగాక అకారాది విషయ సూచికనుకూడా సరిచూసి కొన్ని సంగతులు చేర్చారు. వీరందరికీ కృతజ్ఞుడను.

9-10-41. —దిగవల్లి వేంకటశివరావు

ఇది పుస్తకం కాదు!  వెలకు దొరకదు!!




తృతీయ భాగం

***

1941 సం॥ మార్చి 26 వ తేది మొదలు జూలై 9 వ తేది వరకు ఆంధ్ర వార పత్రికలో వారానికి ఆరు ఏడు కలముల చొప్పునను, మార్చి 1వ తేది మొదలు మే 10 తేది వరకు కృష్ణాపత్రికలోనూ, వరసగా ప్రతివారము వ్యాసాలరూపంగా ప్రకటితమైనది. ఇది ఇంకా పుస్తకరూపంగా ప్రకటింపబడలేదు. మీకు కావలిస్తే ఆ సంచికలు తెప్పించుకుని చదివి చూడండి.

చరిత్రపేరున మన కన్నులు గప్పుతూ బ్రిటిష్ ప్రభువుల యాధిక్యతను మన అల్పత్వమును ప్రకటించుటకు భారత దేశమున బ్రిటిష్ రాజ్యతంత్రమును సమర్థించుటకు ఏర్పడిన చరిత్ర వాఙ్మయం లోని అసత్యపు వ్రాతల నన్నింటినీ పూర్వకాలంనాటి ఇంగ్లీషు గ్రంథ కర్తల నోళ్ళద్వారానే ఖండించి రాజకీయార్థిక రహస్యాలను భేదించి యథార్థ చరిత్రను బయల్పరచ గలిగాను. ఇంకా వివరాలు కావలసిన వారు చదువుకో గలందులకు అసలు గ్రంథాల పేర్లుకూడా అందులో వుదాహరించాను. ఇది నాలుగేళ్లనుంచీ చేస్తూవున్న పరిశోధన యొక్క ఫలితము.

ఆంధ్ర వార పత్రికలోని వ్యాసాల శీర్షికలు చూడండి :

- "విస్సన్న చెప్పింది వేదం-విన్సెంటుస్మిత్తు వ్రాసింది చరిత్ర".
  (ప్రచారంలో లేకుండా చేయబడిన పూర్వచరిత్రలు; చరిత్రలో కెక్కకుండా చేయబడిన, ఆంగ్లయుగంనాటి చరిత్రాంశాలు; నూతనంగా సృష్టింపబడిన పక్షపాతపు చరిత్రలు.)
- భారతదేశ పారతంత్ర్యము - భారతీయుల దేశాభిమానము.
  (భారతీయులు బ్రిటిష్ రాజ్యతంత్రానికి సులభంగా లొంగ లేదు - దానికి ఇష్టపడి హర్షించలేదు - నూరేండ్లు పోరాడారు.)
- ధరణాకూర్చొనుట - సాత్విక నిరోధము.
  (1678-82; 1805; 1813-15 సంవత్సరములలో కుంఫిణీ పరిపాలనలో జరిగిన సత్యాగ్రహముల చరిత్ర.)
- ఇంగ్లీషు దొరతనముయొక్క ప్రత్యక్ష ఫలితాలు.
  (భారత దేశ రాజకీయ ఆర్థిక సాంఘిక పరిస్థితులలో మార్పులు.)
- బిషప్ హెబరుగారి భారతదేశయాత్ర.
  (1824-26 మధ్య ఆయన చూచిన భారత దేశ స్థితిగతులు.)
- కృష్ణాపత్రికలో- "ఇంగ్లీషు చదువుల చరిత్ర."

ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రచరిత్రకాలం నాటి భారత దేశ రాజకీయ, ఆర్థిక సాంఘిక పరిస్థితులను గూర్చిన వివరములను తెలిసికొన గోరువారు పైన నుదాహరించిన వ్యాసాలను, నేను రచించిన "భారత దేశమున బ్రిటిష్ రాజ్యతంత్రము" అను బ్రిటిష్ ఇండియా చరిత్రను తప్పకుండా చదవాలి.

## సౌరమాన చాంద్రమానములు - అధిక క్షయమాసాలు.

(వీరాస్వామయ్యగారి జీవితము పుట ౮ కాశీయాత్ర చరిత్ర : పుటలు, ౨౮౨,౨౮౩)

ప్రపంచంలో మనుష్యులందరూ సూర్యచంద్రుల నడకలను బట్టి కాలం లెక్కించుకుంటారు. అమావాస్యనుండి అమావాస్యవరకు గాని పౌర్ణమినుండి పౌర్ణమి వరకూ గాని చంద్రుని వృద్ధి క్షయాలు చూసి నెలలు లెక్కపెట్టుకుంటారు. ఇలాంటి నెలలో రమారమి 29½ రోజులు వుంటాయి. అలాగే సూర్యుడి నడకవల్ల కలిగే ఋతువు పోయి అది మళ్ళీ రాగానే ఒక సంవత్సరమైనదని వ్యవహరించు కుంటారు. సూర్యుడు ఆకాశ చక్రంలో మేషాది పండ్రెండు రాసులూ తిరిగి రావడానికి 365 రోజుల 6 గంటల 12 నిముషాలు 30 సెకనులు పడుతుంది. 12 చాంద్రమాన మాసాలూ కలిసి 354 రోజుల 8 గంటల 48 నిముషాల 34 సెకనులు మాత్రమే అవుతాయి. సూర్యుడొక రాసినుంచి ఇంకొక రాసిలో ప్రవేశించడానికి సంక్రాంతిఅంటారు. దానికి పట్టేకాలాన్నే మాసంగా లెక్కపెట్టుకుంటే ఒక నెలలో 29 లేక 30 రోజులు ఇంకొక నెలలో 31 రోజులు వుంటూవుంటాయి. అలాంటి 12 నెలల సౌరసంవత్సరానికి రోజులు 365¼ అవుతాయి. ఇలాంటి పండ్రెండు సంక్రాంతులను బట్టి ఏర్పడిన 12 మాసాలకూ మేషాది 12 రాసులపేళ్ళు చైత్ర వైశాఖాది 12 పేర్లుకూడా వ్యవహారంలో వున్నాయి. ఈ పద్ధతికే సౌరమానం అని అంటారు. ఇది అరవదేశంలోను మళయాళదేశంలోనూ బంగాళాదేశంలోను వాడుకలోనుంది.

క్రీస్తుశకంలో ఇంగ్లీషువారు వాడేమాసాలుకూడా సౌరమానమాసాలే. తురకలు కేవలమూ నెలబాలుణ్ణి చూసి లెక్కపెట్టే చాంద్రమానమాసాలే వాడుకుంటారు. సౌరమాన సంవత్సరం కన్న చాంద్రమాన సంవత్సరం చిన్నదిఅవడంవల్ల వారి పండుగలు కొన్నాళ్ళవరకూ ఒక ఋతువులోను కొన్నాళ్ల తరువాత యింకొక ఋతువులోనూ వస్తూవుంటాయి. పైన చెప్పినట్లు చంద్రసూర్యుల గమనాన్ని బట్టి గాక బృహస్పతి గమనాన్ని బట్టి కాలం లెక్కించుకునే బార్హస్పత్యమానం అనేది ఒకటి ఉత్తర హిందూస్థానంలో మగధదేశము మొదలైనచోట్లను ఓఢ్రదేశంలోను వాడుకలో వున్నది. ఈ మానంలో సంవత్సరానికి రమారమి 360 రోజులే వుంటాయి.

మన ఆంధ్రదేశంలోను మహారాష్ట్ర కర్ణాటక దేశాలలోను చాంద్రమానమే వాడుకలో వున్నది. చాంద్రమాసం శుద్ధపాడ్యమితోను సౌరమాన మాసం సంక్రాంతితోను ఆరంభం అవడంవల్లను ఒకే పేరుగల మేష లేక చైత్రమాసంయొక్క వ్యాప్తి సౌరచాంద్రమానాలనుబట్టి తేడా వున్నందువల్లను యీరెండు మాసాలని బట్టి ఏర్పరచిన పర్వదినాలకు, సంబంధం లేకుండా పోతుందని మన జ్యోతిష్కులు చాంద్రమానాన్ని సౌరమానానికి లంకెవేసి మన సంవత్సరాదిని సౌరమాన సంవత్సరాదికి సాధ్యమైనంత దగ్గరలో వుంచడానికి ప్రయత్నించారు. చాంద్రమాన మాసాలకు కూడా సంక్రాంతులను బట్టే పేర్లుపెట్టారు. ఉదాహరణానికి సౌరమానం మేష మాసం మన చైత్రమున్నూ వృషభమాసం వైశాఖమున్నూ అవుతాయి. పై వుద్దేశంతో మన పంచాంగాలలో తిథి వార నక్షత్రాదులను కూడా ఇలాగే సరిపుచ్చారు. అమావాస్యనాడు సూర్యచంద్రులు కలిసియుంటారు. చంద్రుడు రోజుకు రమారమి

13 అంశలు (డిగ్రీలు) నడుస్తాడు. సూర్యుడు ఒక అంశ మాత్రమే నడుస్తాడు. అందువల్ల వీరిద్దరికీ 59 గడియల 4 విగడియలలో, (23½ గంటలలో) 12 అంశల అంతరం కలుగుతుంది. ఈ అంతరం వల్లనే ఒక తిథి ఏర్పడుతుంది. ఇలాంటి 30 తిథుల కొక చాంద్రమాసం అవుతుంది. అయితే చాంద్రమాన సంవత్సరంలో తిథులు 360 వున్నా రోజులు 354 మాత్రమే గనక తిథులు వృద్ధిక్షయం చెంది 6 రోజులు తగ్గుతాయి. సూర్యచంద్రుల నడకలలో తేడాలవల్ల ఒకతిథివ్యాప్తి ఒకప్పుడు 65 గడియలు ఇంకొకప్పుడు 53 గడియలూ వుంటుంది. ఇలాగ మొత్తం మీద చాంద్రమాన సంవత్సరంలో 13 క్షయ తిథులూ 7 వృద్ధి తిథులూ వుంటాయి.

ఇంక నక్షత్రాల సంగతికూడా ఇంతే. మొత్తంమీద చంద్రుడు రోజుకో నక్షత్రంలో వుంటాడుగనుక నక్షత్రమాసంలో 27 రోజులు పైచిల్లర వుంటాయి. తిథులలాగనే కొన్ని నక్షత్రాల వ్యాప్తి వృద్ధీ కొన్నింటిది క్షయమూ చెందుతుంది.

వారానికి 7 రోజులే వుంటాయిగాని పక్షంలో మాత్రం ఒక్కొక్కప్పుడు 13 రోజులు ఒక్కొక్కప్పుడు 14 రోజులు, 16 రోజులుకూడా వుంటాయి.

పైన చెప్పినట్లు చాంద్రమానాన్ని సౌరమానంతో సరిపుచ్చడంలో రమారమి మూడు సంవత్సరాల కొకమాటు చాంద్రమాన సంవత్సరంలో 13 నెలలు ఏర్పరచ వలసి వస్తూ వుంటుంది. దానికే అధికమాస మంటారు. ఏ మాసం అధికమాసంగా నిర్ణయించడం అనే విషయంలో కూడా సంక్రాంతినే లక్ష్యంగా తీసుకుంటారు. సూర్యచంద్రుల గమనాలనుబట్టి చాంద్రమాసం చిన్నదిన్నీ సౌరమాసం పెద్దదిన్నీ అయినప్పుడు ఆచాంద్రమాసంలో సంక్రాంతివుండదు. ఆ మాసాన్ని అధికమాసంగా నిర్ణయిస్తారు. చాంద్రమాసము పెద్దదిన్నీ సౌరమాసముచిన్నదిన్నీ అయినప్పుడు ఆ చాంద్రమాసంలో సూర్యుడు ఒకరాసి దాటి యింకొక రాసిలోనికి పోయి మళ్లీ దానిని కూడా దాటి మూడవరాసిలోనికి పోతాడు. ఒకేచాంద్రమాసంలో ఇలాగ రెండు సంక్రాంతులు కలగడంవల్ల అమాసానికి రెండు పేళ్ళు పెట్టవలసి వస్తుంది. అందుచేత ఆ సంవత్సరంలో ఒక నెలను అణిచివేస్తారు. దానికే క్షయమాసమంటారు. అప్పుడు 11 నెలలే వుండవలసిందేగాని క్షయమాసం వచ్చిన సంవత్సరంలో తప్పకుండా అధికమాసంకూడా వస్తూవుంటుంది గనుక ఆ సంవత్సరంలోకూడా సరిగ్గా 12 నెలలు వుంటాయి. క్షయమాసాలు చాలా అరుదుగావస్తాయి. నూరు సంవత్సరాలలో ఒకటి రెండు క్షయ మాసాలు వస్తాయి. శాలివాహన శకము 1744 వ సంవత్సరము (క్రీ.శ. 1822–23) చిత్రభాను నామ సంవత్సరంలో అశ్వయుజం అధికమాసంగాను పుష్య మాసం క్షయమాసంగానూ వచ్చాయి. మళ్ళీ (1963–64) శోభకృతు సంవత్సరంలో పుష్యము క్షయమాసంగాను అశ్వీజము అధికమాసంగాను వస్తాయి. ఎప్పుడువచ్చినా క్షయమాసం మార్గశీర్ష పౌష మాఘ మాసాలలోనే వస్తాయి. ఎందుచేతనంటే ఈ చాంద్రమాసాలకు 29 దినముల వ్యాప్తిగల సౌరమాసములతో సంబంధం వున్నది. *

* చూడు : ఆంధ్రవిజ్ఞాన సర్వస్వంలో కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు వ్రాసిన "అధికమాసం" అనే వ్యాసము; లక్ష్మణరాయ వ్యాసావళిలో 'పంచాంగము' అనేవ్యాసము.

# కాశీయాత్ర చరిత్ర – సవరణల పట్టిక

ఇది మామూలు తప్పొప్పుల పట్టిక కాదు. ఇందులోని సవరణలు చాలావరకు పాతకూర్పులోని వర్ణక్రమానికి భిన్నంగా యీ కూర్పులో వ్రాయబడి అచ్చుపడ్డబాపతువే. కొన్ని మాత్రం పొరబాటున వదలి పెట్టిన మాటలు, వాక్యాలూ వున్నాయి. వీటిని సవరించుకోవలెను.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | | (శ్రీనివాసపిళ్లగారి పీఠికలో) | |
| ౧ | ౧౫ | కాశీ, | ప్రయాగ, కాశి, |
| | ౨౦ | సరస్వతి, ప్రయాగ | సరస్వతి, |
| | | షహరుల వివరణపట్టికలో | |
| ౫ | ౧౩ | పట్నా ౨౩౧ | పట్నా ౧౫౩ |
| | | వీరాస్వామయ్యగారి జీవితము | |
| ౭ | ౧ | హావు(సులు) యేజన్సీలు | హావుసు అపు యేజన్సీలు |
| | ౨ | వ్యా(సంగము) | వ్యాపారము |
| | ౩ | సుప్రీంకోర్టు | సూప్రీంకోర్టు |
| | ౪ | ,, | ,, |
| ౩ | ౧౪ | అడినమాట | అడినమాటను |
| ౪ | ౧౬ | 360 దినములు | 354 దినముల 9 గంటలు |
| | ౧౫ | 361దినముల11గడియలు | 360 దినములు |
| | ౨౧ | అధికక్షయ తిధుల | క్షయతిధులు; వృద్ధితిథుల |
| ౪ | ౨౯ | 11 నెలలే వుంటాయి | అధికమాసంతో 12 నెలలు అవుతాయి. |
| | ౩౧ | 11—1—1823 | 12—1—1823 |
| ౬ | ౧౭ | పూర్తి | పూర్తి |
| ౮ | ౧ | ప్రవర్తించుచు | ప్రవర్తించుచు |
| | ౩ | బదల | బీదల |
| | ౨౧ | మరణాంతరము | మరణానంతరము |
| ౫ | ౧ | క్షుధితః | క్షుధితం |
| | ౧౭ | మాగణము | మాగణము |
| | | కాశీయాత్ర చరిత్ర మూలగ్రంధములో | |
| ౧ | శీర్షికలో | కాశీయాత్ర | కాశియాత్ర |
| | | (తక్కిన చోట్ల యీ ప్రకారమే దిద్దుకొనవలెను.) | |
| | ౨౨ | ఆమడదూరము | ౨ ఆమడదూరము |
| ౨ | ౧ | తలి | తల్లి |
| | ౧౭ | బాట | భాట |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨ | [ఇవి రూపాంతరాలు. చూడు: బ్రౌణ్య నిఘంటువు] | | |
| | ౨౬ | బ్రాంహ్మణులకు | బ్రాహ్మణులకు |
| | (౧౨౬ పుటవరకూ అన్నీ ఈలాగే దిద్దుకోవలెను) | | |
| ౩ | ౩ | వడమాలవేట | వడమాలపేట |
| | ౪ | నడచుట | నడుచుట |
| | ౮ | బాట | భాట |
| | ౧౫ | ,, | ,, |
| | ౨౦ | రామస్వాడిగుడి | రామస్వామిగుడి |
| | ౨౫ | యేర్పరచి | యేపఱరచి |
| | ,, | చెప్పించు | చెప్పింపు |
| ౪ | ౩ | సాహుకార్లు | సాహుకాలుఱ |
| | ౫ | పానార్హము | పానాహఱము |
| | ౭ | దేశ | దేవ |
| | ౧౭ | ధమఱ | ధర్మ |
| ౫ | ౧ | సంపూరణఱ | సంపూర్ణ |
| ౬ | ౭ | కలకటలుఱ | కలకటర్లు |
| | ,, | నిర్భయము | నిభఱయము |
| | ౧౫ | దొరకును | దొరుకును |
| | ౧౬ | బాట | భాట |
| | ౨౩ | గాడు | గారు |
| ౭ | ౧౪ | రమణియ్య | రమణీయ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | [ఈ రెండూ వాడుక భాషలో రూపాంతరాలు] | | |
| ౭ | ౨౩ | బాట | భాట |
| ౯ | ౪ | గారిది | వారిది |
| | ౧౮ | బాట | భాట |
| | ౨౪ | యేపఱరచు | యేర్పరచు |
| | ౨౫ | ఖచుఱ | ఖర్చు |
| ౧౦ | ౬ | బ్రింహోత్సవము | బ్రహ్మోత్సవము |
| | ౨౦ | జిల్లాలో | జిల్లాతో |
| ౧౧ | ౧౭ | కొతములు | కొత్తములు |
| ౧౩ | ౧౯ | యీ యాత్మకూరు | యా యాత్మకూరు |
| | ౨౨ | తిసె | తీసి |
| ౧౪ | ౨౧ | పవఱతము | పర్వతము |
| | [తక్కినచోట్ల ఈ ప్రకారమే దిద్దుకోవలెను.] | | |
| | ౨౯ | అగ్గురి | అగుఱరి |
| ౧౫ | ౫ | ౧౫ వ తేది | ౧౫ తేది |
| | ౧౫ | మార్చ్ | మాచిఱ |
| | ౧౭ | సవారీ | సవారీలు |
| | ,, | నాగులోటిలో | ఆ నాగులోటిలో |
| | ౧౯-౨౦ | వారిం జూడ | వారిని చూడ |
| | ౨౬ | గంటల | ఘంటల |
| ౧౬ | ౧ | దట్టమయిన | దట్టయిన |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౬ | ౧౪ | కూర్చుండి | కూచుండి |
| | ౨౪ | తడిక | తడికె |
| ౧౪ | ౧౦ | గంటలకు | ఘంటలకు |
| | ౧౭ | మెట్లు | మెట్ల |
| | ౨౨ | పవర్తము | పర్వతము |
| | ౨౪ | పయర్ంతము | పర్యంతము |

[తక్కినచోట్ల ఈ లాగే దిద్దుకోవలెను]

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౯ | ౧౯ | దర్శనము | దశర్నము |
| ౨౦ | ౧౩ | మహిషాసుర | మహిషాసురుని |
| | ౨౪ | వర్తమానము | వతర్మానము |
| | ౨౪ | సవర్జన | సర్వజన |
| ౨౧ | ౨౭ | అడుగడుగునకు | అడుగడుగుకు |
| ౨౨ | ౧౯ | కొంటే గాని | కొంటేనే గాని |
| ౨౩ | ౧౪ | అరికె | అరికె |
| | ౧౯ | తీర్గ | తీథర్ |
| ౨౪ | ౧౭ | కి్రంద | కింద |
| ౨౫ | ౧౨ | నేర్పరచిన | నేపర్రచిన |
| | ౧౭ | సరళి | సరాళి |

[ఈ రెండూ రూపాంతరాలు. చూడు: (బ్రౌణ్యనిఘంటువు)]

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | ౨౦ | కొండకిందనున్న | కొండకింద నున్నది. |
| | ౨౫ | చావళ్ళు | చావిళ్ళు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨౬ | ౩ | మార్చడము | మాచర్డము |
| | ౫ | పక్కిలా | పక్కలా |
| | ౧౦ | ఒక | నొక |
| | ౨౩ | చోళపురము | చోళీపురము |
| | ౨౬ | కొంతదూరంలో | కొంత కొంత దూరంలో |
| ౨౪ | ౫ | మనోజిపేట | మనోజీపేట |
| | ౨౬ | ఘంటలకు | ఘంటకు |
| | ౨౭ | పవర్తమయము | పర్వతమయము |
| | ౨౯ | పవర్తములను | పర్వతములను |
| ౨౭ | ౧,౩ | పవర్త | పర్వత |
| | ౧౯ | కలిగిన | కలిసిన |
| | ౨౩ | జాగీరు | ఆ జాగీరు |
| ౨౯ | ౧ | చేర్చి | చేచిర్ |
| ౩౦ | ౨ | జలచలర్ | జడచలర్ |
| | ౪ | యడవి | యడివి |
| | ౬ | దొరకును | దొయకును |
| ౩౧ | ౨౦ | నిర్భయము | నిభర్యము |
| ౩౨ | ౧ | ఆషాపురము | ఆ షాపురము |
| | ౪ | దారిని | దారి |
| ౩౩ | ౫ | సాహుకార్ల | సాహుకాలర్ |
| | ౭ | వర్తకులు | వతర్కులు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౩౩ | ౯ | ఖర్చు | ఖర్చు |
| | ౧౧ | వర్తకులు | వర్తకులు |
| | ౧౬ | ఇండ్లు | ఇల్లు |
| | ౧౯ | వర్తకులు | వర్తకులు |
| ౩౪ | ౧ | సందులకు సంది | సందుల కుసంది |
| | ౩ | సంచరింపుచున్నవి | సంచరింపుచు నుంచున్నవి |
| | ౨౪ | ఢిల్లీ | డిల్లి |
| | ౨౮ | కున్నా | కున్న |
| | ౨౬ | ,, | ,, |
| ౩౫ | ౪ | ఇంగిలీషు | ఇంగ్లీషు |
| | ౭ | ఎక్కినడచి | ఎక్కినడిచి |
| ౩౬ | ౮ | ధర్మము | ధర్మము |
| ౩౭ | ౧౨ | వచ్చుచున్నారు | వచ్చుచున్నాడు |
| | ౧౯ | వస్తువులు | వసువులు (?) |
| | ౨౦ | సమ్మతమైన | సంమతమైన |
| | ౨౬ | బాట | భాట |
| ౪౦ | ౧ | ౯ రూపాయలు | ౬ రూపాయలు |
| | ౯ | అక్కడక్కడికి | అక్కడక్కడి |
| | ౧౯ | వుండే | నుండే |
| | ౨౩ | రమణియ్యముగ | రమణీయముగా |
| | ౨౫ | యడివిభూమి | యడివి; భూమి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౪౧ | ౮ | రమణియ్యా | రమణీయ |
| | ౬ | సద రహి | సద రహీ |
| | ౧౪ | పట్టేలు | పట్టీలు |
| | ౨౧ | నంతట్లో | నంతల్లో |
| ౪౨ | ౮ | పయాంతము | పర్యంతము |
| | ౯ | ,, | ,, |
| | ౧౦ | యెండా | యెండ |
| | ౨౦ | ఉదయమున | ఉదయమయిన |
| | ,, | అయారు | అయారు |
| ౪౩ | ౭ | ఆరాధన | ఆరాధనను |
| | ౧౩ | తెలిసినది | తెలసినది |
| ౪౪ | ౫ | పయాంతము | పర్యంతము |
| | ౯ | ,, | ,, |
| | ౧౦ | ఉదయమున | ఉదయమయిన |
| ౪౫ | ౨ | వేరుగాదని | వేరేకాదని |
| | ౪ | రమణియ్యమైన | రమణీయమైన |
| | ౮ | మొకి | మొకటి |
| | ౧౩ | ఉదయమున | ఉదయమయిన |
| | ౨౦ | ఆర్మారు | ఆమారు |
| | ౨౧ | 2 | ౨ |
| | ౨౫ | మధ్య | మధ్యే |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | | [ఈ రెండూ రూపాంతరాలు] | |
| ౪౬ | ౩ | మధ్య | మధ్యే |
| | ౧౩ | కర్త | కర్తః |
| | ౧౫ | తీర్థ | తీర్థః |
| | ౧౯ | గోదావరి | గోదావరీ |
| | ౨౩ | ,, | ,, |
| ౪౭ | ౫ | ప్రతిదినమున్నూ | ప్రతిదినమున్ను |
| | ౮ | గోదావరి | గోదావరీ |
| | ౧౧ | వజాబంది | రజాబంది |
| | ౨౨ | ఇకనున్నూ | ఇకనున్ను |
| | ౨౬ | తమలపాకులున్న | తమలపాకుల తోటలున్న |
| | ౨౮ | వచ్చినట్లయితే | వచ్చినట్టయితే |
| ౪౮ | ౬ | వొక్కలు | వక్కలు |
| | ౧౯ | పూర్ణ | పూర్ణః |
| | ౨౪ | ఉత్తర ప్రత్యుత్తర | ప్రత్యుత్తర |
| ౪౯ | ౧౫ | కున్నూ | కున్ను |
| ౫౦ | ౩ | గోదావరి | గోదావరీ |
| | ౧౧ | చుట్టునున్నూ | చుట్టునున్ను |
| | ౧౨ | ఊరికి | ఊరూరుకి |
| | ౧౩ | మున్నూ | మున్ను |
| | ౨౪ | వారికి | వారికి అవి |
| ౫౧ | ౧౬ | బయలు | బయిలు |
| ౫౨ | ౪ | ,, | ,, |
| | ౧౫ | పవర్తము | పర్వతము |
| | ౧౮ | బయలు | బయిలు |
| | ౨౫ | యడివి | యడవి |
| ౫౩ | ౭ | పయర్ంతము | పర్యంతము |
| | ౧౨ | బ్రింహ్మచారి | బ్రహ్మచారి |
| | ౧౪ | మహోర్మలు | మహోమర్లు |
| | ౨౫ | మధ్య | మధ్యే |
| ౫౪ | ౩ | ధనోరా | ధనోరా |
| | ౧౩ | ,, | ,, |
| | ౧౮ | నిలిచి | నిలచి |
| | ౧౯ | బయలు | బయిలు |
| ౫౫ | ౩ | ,, | ,, |
| | ౧౭ | ఇంగిలీషు కలకటరులు | యింగిలీషు కాలక్టరులు |
| | ౨౧ | రిసైడెంటు | రిసైడేంటు |
| | ౨౭ | నంతట్లో | నంతల్లో |
| ౫౬ | ౪ | బయలు | బయిలు |
| ౫౭ | ౧౫ | గట్టి | ఘట్టి |
| | ౧౭ | యున్నది | యున్నవి |
| ౫౮ | ౧౮ | ఘంటలకు బయలు వెళ్లి | ఘంటకు బయిలు వెళ్లి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౫౯ | ౩ | ఘంటలకు బయలువెళ్లి | ఘంటకు బయిలువెళ్లి |
| | ౧౩ | బక్కా-బాయి | బక్ర్యా-బాయి |
| | ౧౪ | వారున్నా | వారున్న |
| | ౧౮ | ఘధ్య | మధ్యే |
| | ౨౪ | వారున్నా | వారున్న |
| ౬౦ | ౨౧ | బాట | భాట |
| | ౨౩ | రిసైడెంటు | రిసైడేంటు |
| | ౨౭ | నితో | అతనితో |
| ౬౧ | ౭ | 200 | ౨౦౦ |
| | ౮ | సుతులు | జ్ఞాతులు |
| | ౧౭ | రాజవంశము | రాజువంశము |
| ౬౨ | ౫ | చందా | చాందా |
| | ౧౦ | పిమ్మట | పింమట |
| | ౧౫ | సాహెబు | సాహేబు |
| | ౨౩ | కున్నా | కున్న |
| | ౨౬ | దేశోత్తరము | దేశోత్తరదేశము |
| ౬౩ | ౫ | రాజులకు | రాజుకు |
| | ౨౪ | కంటె | కంటే |
| ౬౪ | ౬ | దోచుచున్నవి | తోచుచున్నవి |
| | ౧౦ | దుర్లభము | దులర్భము |
| | ౨౨ | పండు | పండ్లు |
| ౬౪ | ౨౭ | యుండేటట్లు | యుండేటట్టు |
| ౬౫ | ౩ | మారుజాతి | మారువాడిజాతి |
| | ౭ | చున్నది | చునున్నది |
| | ౧౧ | చేయించడము | చేయించడముల |
| | ౧౬ | దేశానకు | దేశానికి |
| | ౧౮ | లున్నా | లున్న |
| | ౨౫ | అట్లుగా | అట్లుగాక |
| | ౨౮ | వున్నది | యున్నది |
| ౬౬ | ౪ | పృథివ్య పజ్ఞో | పృథివ్య ప్రైజో |
| | ౮ | అప్పుడు | అప్పుకు |
| | ౧౪ | ప్రివర్తించి | ప్రివర్తించి |
| | ౨౩ | ప్రివృత్తి | ప్రివృత్తి |
| ౬౭ | ౨ | ఏర్పరచి | ఏర్పఱచి |
| | ౬ | తెలిసిన | తెలసిన |
| ౬౮ | ౧౨ | ఇంగిలీషు | యింగిలీషు |
| | ౧౩ | బస్తీగా | బస్తీగా |
| | ౧౬ | మంత్రి | మంత్రీ |
| | ౨౫ | ప్రపంచంలో | ప్రపంచములో |
| ౬౯ | ౧ | మిశ్రమ | మిశ్ర |
| | ౨౫ | అనేక భేదములయి | అనేకములయి |
| | ౨౮ | నట్టయితె | నట్టయితే |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౪౦ | ౧ | మొదటి | యెదటి |
| | ౨ | ఘగురూపదేశముగా | గ్గురూపదేశముగా |
| | ౯ | వి(భ్రాతి) | విభ్రాతి |
| | ౧౪ | వేడిగా | కడిగా |
| | ౧౪ | మజ్జిగె | మజ్జిగే |
| | ౧౫ | మజ్జిగ | మజ్జిగె |
| | ౨౪ | వాడికె | వాడికే |
| | ౨౬ | దారా పుత్రాదులను | దారపుత్రాదులను |
| ౪౧ | ౬ | కమ్ర | కర్మ |
| | ౧౫ | అధీనమై | అధీనుడై |
| | ౧౯ | డబ్బల్ | డబ్బిల్ |
| | ౨౧ | పల్లకి | పల్లకీ |
| ౪౨ | ౧౩ | చలామణి | చెలామణి |
| ౪౩ | ౮ | ధమ్రానికి | ధర్మానికి |
| | ౧౯ | అగష్టు ౨౧ | అగష్టునెల ౨౧ |
| | ౨౦ | దండుండే | దండు ఉండే |
| | ౨౩ | గృహస్థలము | మహాస్థలము |
| ౪౪ | ౯ | మార్గము | మాగ్రము |
| | ౧౦ | ,, | ,, |
| | ౧౯ | మజాబూతి | మజుబూతి |
| | ౨౧ | పొందినవి. | బొందినవి |
| ౩౫ | ౩ | యున్నది. | వున్నది. |
| | ౬ | గాను, | గానున్న |
| ౩౬ | ౪ | తీరథ | తీర్థ |
| | ౬ | నివ ర్తింప | నివర్తింప |
| | ౧౧ | పవ్రతము | పర్వతము |
| ౩౭ | ౯ | లున్నా | లున్న |
| | ,, | పెట్టి,కొట్టి | కొట్టిపెట్టి |
| | ౨౪ | లు న్నా | లున్న |
| ౩౮ | ౩ | గవనర్ జనరలు | గౌనరుజనల్ |
| | ,, | జబ్బలపురిలో | జబ్బలపూరిలో |
| | ౧౪ | దొంగలతాళవు | దొంగలతళావు |
| | ౨౩ | రంవి | రంలి |
| | ౨౫ | మధ్య | మధ్యే |
| ౫౦ | ౪ | వాడ్రులో | వారుడులో |
| | ౨౪ | బస్తి | బస్తీ |
| ౫౧ | ౧ | పవ్ర | పర్వ |
| | ౪ | నిమ్రల | నిర్మల |
| | ౪ | బయలు | బయిలు |
| ౫౨ | ౮ | త్రిమూర్త్రు | త్రిమూర్తు |
| | ౧౪ | కంటె | కంటే |
| | ౨౬ | త్రిమూర్తులలో | త్రిమూర్తులలో |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౭౪ | ౧౪ | జీర్ణ | జీణ౯ |
| | ౧౬ | డనిన్నీ | డనిన్ని |
| ౭౬ | ౧౪ | పరంపరంగా | పరంపరగా |
| ౭౮ | ౧౩ | యిటువంటివి | యిటువంటి పడవలు |
| | ౧౬ | కుంపిణి | కుంఫిణీ |
| ౭౭ | ౫ | వర్ణపు | వణ౯పు |
| | ౧౮ | వద్ద | వద్ది |
| ౭౯ | ౧౯,౨౦,౨౧,౨౨ | పవ౯తము | పర్వతము |
| ౯౦ | ౨ | నర్మద | నమ౯ద |
| | ౭ | వచ్చిరి | వచ్చి, |
| | ౧౨ | వదలు | వదులు |
| | ౨౦ | ఘాటులోపల వరకాయ | ఘాటులో పలవరకాయ |
| ౯౧ | ౨౮ | తత్పూవ౯పు | తత్పూర్వపు |
| ౯౨ | ౧ | పూవ౯ము | పూర్వము |
| | ౨౨ | సాహెబు | సాహేబు |
| | ౨౬ | ,, | ,, |
| | ౨౮ | ధమ౯ము | ధర్మము |
| | ౨౯ | సమీపవతి౯ | సమీపవర్తి |
| ౯౩ | ౬ | పూవ౯ము | పూర్వము |
| | ౧౬ | నిమ౯లము | నిర్మలము |
| | ౧౯ | సుందరమయిన | ఒకపక్క సుందరమయిన |
| ౯౩ | ౨౮ | బీరకాయిలు | బీరకాయలు |
| ౯౪ | ౧ | గౌవర్ జనరల్ | గౌవర్ జనల్ |
| | ౧౮ | గురకి | గురికి |
| | ౨౧ | గంటలకు | ఘంటలకు |
| ౯౬ | ౩ | యేపఱరచి | యేర్పరచి |
| | ౮ | మహిరాత్రి | మహారాత్రి |
| | ౭ | మానం | మాసం |
| | ౨౫ | ఈఆచార | ఆచార |
| ౯౮ | ౫ | సంమృతి | సంమతి |
| | ౧౫ | శూద్రులు | శూదులు |
| | ౧౮ | తీచి౯ | తీర్చి |
| ౯౭ | ౧ | ౧౫వ తేది | ౧౫ తేది |
| | ౩ | నయ్యాగా | నయ్యాగాం |
| | ౪ | దేవురి | దెవురి |
| | ౫ | మజిలీపూరు | మజిలీపూరి |
| | ౯ | పవ౯తాలు | పర్వతాలు |
| | ౧౮ | సారవత్తనయినది | సారవత్తయినది |
| | ౨౧ | ముసుగు | ముసుకు |
| | ౨౫ | యెపఱరచి | యేర్పరచి |
| | ౨౭ | యేపఱరచు | యేర్పరచు |
| ౯౯ | ౨ | దొరకును | దొరయును |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౯౯ | ౭ | తగులుచూ | తగులఁచు |
| | ౯ | ఒకణ్ణి | ఒకణ్ని |
| | ౧౨ | ౧౬వ తేది | ౧౬ తేది |
| | ౧౨ | ఉదయాత్పూవర్మే | ఉదయాత్పూర్వమే |
| | ౧౭ | నడివ్రాళ్ళు | నడిమివ్రాళ్ళు |
| ౧౦౦ | ౬ | నిమ్రల | నిర్మల |
| ౧౦౧ | ౩ | పవర్తాగ్ర | పర్వతాగ్ర |
| | ౯ | తాళ్వారము న్నూ | తాళ్వారము న్ను |
| | ౧౮ | యేపర్రచ | యేర్పరచ |
| | ౨౬ | నాతుర్పోల్ | నార్తుపోల్ |
| ౧౦౨ | ౨ | తొంమ్మిదో | తొంమిదో |
| | ౬ | ఉష్ణకరమయిన | ఉష్ణకరమయినందున |
| | ౧౮ | యున్నవి. | యున్నది. |
| | ౧౮ | విడచి | విడిచి |
| | ౧౯ | పోతె | పోతే |
| | ౨౨ | ధయిర్యము | ధైర్యము |
| ౧౦౩ | ౪ | సమీపవతిర్ | సమీపవర్తి |
| | ౮ | కలుగజేసి | కలఁగచేసి |
| | ౧౫ | తత్పూవర్ | తత్పూర్వ |
| | ౨౮ | తీర్థాలున్నూ | తీర్థాలున్న |
| ౧౦౪ | ౨ | పూవీర్కులైన | పూర్వీకులైన |
| | ౭ | నిర్ణయము | నిర్ణయము |
| ౧౦౪ | ౧౨ | సమర్ధులు | సమర్థులు |
| | ౨౨ | పూవీర్కులైన | పూర్వీకులైన |
| ౧౦౬ | ౪ | జాగ్రిత్త | జాగ్రిత |
| | ౧౯ | ధర్మాని | ధర్మాన్ని |
| ౧౦౭ | ౧౦ | తమ్ముణ్ణి | తమ్ముణ్ని |
| | ౧౮ | పూనుకొను | పుచ్చుకొను |
| | ౨౪ | యిపుడు | యిప్పుడు |
| ౧౦౮ | ౬ | బయలు | బయిలు |
| ౧౦౯ | ౧౦ | ఉదయాత్పూవర్ము | ఉదయాత్పూర్వము |
| | ౧౪ | మళ్ళి | మళ్లీ |
| ౧౧౦ | ౧౫ | కమార్ల | కర్మాల |
| | ౧౬,౨౦ | కమర్ | కర్మ |
| | ౨౪ | కీర్తనాత్ | కీర్తనాత్ |
| ౧౧౧ | ౧౧,౧౨,౧౩,౨౫ | కమర్ | కర్మ |
| ౧౧౩ | ౬ | సుప్రీంకోటుర్ | సూప్రీంకోర్టు |
| | ౭ | సుప్రీం | సూప్రీం |
| | ౧౫ | కమర్ | కర్మ |
| | ౨౮ | పయర్ంతము | పర్యంతము |
| | ,, | కమర్ | కర్మ |
| ౧౧౪ | ౧ | కమార్ల | కర్మాల |
| | ౨ | కమర్ | కర్మ |
| | ౪ | పారంపయర్ము | పారంపర్యము |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౧౪ | ౧౦ | రూపాయిల | రూపాయలు |
| | ౧౯ | మిరిజాపూరి | మిరిజాపూరి |
| ౧౧౫ | ౧౬ | పగలున్నూ | పగలున్ను |
| ౧౧౬ | ౪ | చేసికొని | చేసుకొని |
| ౧౧౮ | ౫ | పగలున్నూ | పగలున్ను |
| | ౧౫ | బ్రాంహ్మణులున్నూ | బ్రాహ్మణులున్ను |
| | ౨౦ | బయులు | బయిలు |
| | ౨౫ | పూర్వ | పూర్వ్య |
| ౧౧౯ | ౫ | ౨౯ వ తేది | ౨౯ తేది |
| ౧౨౦ | ౧ | సరకులు | సరుకులు |
| | ౧౦ | జాగ్రిత్త | జాగ్రిత |
| | ౧౪ | దర్బ | దర్భ |
| ౧౨౧ | ౧౧ | చున్నవి. | చున్నది. |
| ౧౨౨ | ౯ | బయలు | బయిలు |
| ౧౨౩ | ౨ | యున్నది. | యున్నవి. |
| ౧౨౪ | ౨౯ | వారు తాకి | వారువారు తాకి |
| ౧౨౫ | ౧ | స్త్రీ సూక్త | శ్రీ సూక్త |
| | ౬ | బ్రాంహ్మణ | బ్రాహ్మణ |
| ౧౨౬ | ౪ | పురుషిణ్ణి | పురుషిణ్ని |
| | ౯ | వచ్చి నన్ను | వచ్చిన నన్ను |
| ౧౨౮ | ౧౯ | వెనకన్నుచూపు | వెనక కనుచూపు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౨౭ | ౫ | పారాకటాయించి | తెల్లవారులు నాపారాతో కూడా నాలుగు పక్కలా పారా కటాయించి |
| | ౧౨ | కాశీలో | కాశిలో |
| ౧౨౯ | ౨౦ | జేసినాడు | చేసినాడు |
| ౧౩౦ | ౧౨ | పురుషుణ్ణి; అతణ్ణి | పురుషుణ్ని; అతణ్ని |
| | ౧౯ | విరాజమ్మాన్యుడు | విరాజమానుడు |
| ౧౩౧ | ౧౬ | చేస్తు | చేస్తూ |
| ౧౩౨ | ౨౩ | నదులున్నూ | నదులున్ను |
| ౧౩౪ | ౧౪ | బ్రాంహ్మణులు | బ్రాహ్మణులు |
| ౧౩౫ | ౪ | యెట్లా? కాశిలో | యెట్లా కాశికిపోతారోతద్వ తుగా యిక్కడికిన్ని రావలసినవారైవున్నా కాశిలో |
| | ౮ | విదియ | విదియ తిథి |
| | ౧౯ | చుట్టు | చుట్టూ |
| | ౧౯-౨౦ | తీసికొని | తీసుకుని |
| ౧౩౬ | ౨౮ | కట్టి వుంచి | కట్టి త్రివేణీ సంగమము అవుచు నుండేటంత దూరానికి వెదుళ్ళతో చుట్టూ గోడవలె కట్టి వుంచి |
| | " | ౧౨ | ౧౨ మంది |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౩౮ | ౧ | యేర్పఱరచి | యేర్పరచి |
| | ౨౦ | ప్రియాగావళీల | ప్రయాగవాళీల |
| | ౨౭ | రూపాయిలు | రూపాయలు |
| ౧౩౯ | ౨౪ | ౨౫ రూపాయిలు మట్టుకు | ౨౫ రూపాయిలు తగిలినవి. నా ప్రయాగవాళీకి అంతాకూడి ౧౫౦ రూపాయలు మట్టుకు |
| ౧౪౦ | ౫ | న్యూబోటు, | న్యూబోటుఁ, |
| ౧౪౧ | ౨౪ | విత్తము కొర్దీ | విత్తము కొద్ది |
| ౧౪౨ | ౧ | తూర్పవఱము | తూర్పర్వము |
| ౧౪౩ | ౧౯ | ఢిల్లీ | ఢిల్లి |
| | ౨౬ | కమఱద్వారా | కమఱద్ద్వారా |
| ౧౪౪ | ౧ | చాపల్యము | చాపల్యము అనే |
| | ౧౫ | బ్రాంహ్మణులున్ను | బ్రాహ్మణులున్ను |
| | ౨౦ | వర్తకము | వర్తఱకము |
| ౧౪౫ | ౧ | భగత్పాదులవారు | భగవత్పాదులవారు |
| | ౨౦ | వర్తక | వర్తఱక |
| | ౨౫ | గోసాయీలు | యీగోసాయీలు |
| ౧౪౬ | ౧౩ | యావత్తున్నూ | యావత్తున్ను |
| | ౧౫ | వారున్నూ | వారున్ను |
| ౧౪౭ | ౧౦ | వీరిద్దరికన్ను | వీరిద్దరికన్నూ |
| | ౧౨ | స్వప్రయోజనకారి | ప్రయోజనకారి |
| ౧౪౮ | ౨౧ | బ్రిహ్మవాద | బ్రంహ్మవాద |
| ౧౫౦ | ౬ | సౌషవము | సౌష్ఠవము |
| ౧౫౫ | ౨౧ | బయాట | బయిట |
| ౧౫౬ | ౩ | వారని | వారిని |
| | ౩ | వారివద్ద గుత్తానికి | వారివద్ద ఒక పయిసా అయినా తీయనీయకుండా బందోబస్తు చేసుకొని యాత్రకు వచ్చే వారివద్ద గుత్తానికి |
| ౧౫౮ | ౧ | ఉందరునున్ను | అందరున్ను |
| | ౧౨ | వదలిన | వదిలిన |
| | ౧౫ | పూనా | పునా |
| | ౨౪ | మలహాల్ | మలహార్ |
| ౧౫౯ | ౨౩ | పాయ్యె | పాయ్యే |
| ౧౬౧ | ౧౩ | గుజరీ | గుజిరీ |
| | ౩౦ | 1857 | 1856 |
| ౧౬౨ | ౧ | అవరణకు | ఆవరణకు |
| | ౨౫ | ఎక్కువ | యెక్కువ |
| ౧౬౩ | ౪,౬,౧౨ | ఛీడీ | ఛడీ |
| ౧౬౫ | ౧౪ | డబ్బిలలో | డబ్బీలలో |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౬౮ | ౧౮ | కంటె | కంటే |
| | ౨౫ | సర్వోత్కృషుల | సర్వోత్కృష్టుల |
| ౧౬౭ | ౧౩ | ప్రమాణ్యము | ప్రామాణ్యము |
| | ౨౭ | అభిప్రాయం | మంచి అభిప్రాయం |
| ౧౬౯ | ౧౦ | పూనా | పునా |
| ౧౮౧ | ౧౯ | అపరాపర | అ పరాపర |
| ౧౮౩ | ౨౭ | చేసుకొని సంకల్ప | చేసుకొని యథోచితముగా నిత్యయాత్ర చేసుకొని సంకల్ప |
| ౧౮౫ | ౧౭ | పాకము | పక్వము |
| ౧౮౭ | ౨౨ | గాజీపూరు | గాంజీపూరు |
| | ,, | కౌతిసుపూరు | కౌటిసుపూరు |
| ౧౭౭ | ౨౦ | గూడా | కూడా |
| ౧౯౦ | ౨౪ | అందరున్నూ | అందరున్ను |
| ౧౯౫ | ౯ | వేసినాడు | చేసినాడు |
| | ౧౨ | పుత్పత్యర్థమున్నూ | వుత్పత్యర్థమున్ను |
| ౧౯౮ | ౧౨ | తగినవి | తగినది |
| ౧౯౭ | ౧౩ | రసికుడును | రసికుడున్ను |
| | ౨౫ | ఒప్పుగొన్నారు | ఒప్పుకొన్నారు |
| ౧౯౯ | ౧ | జననమును | జననమున్ను |
| ౨౦౧ | ౧ | కొద్ది | కొద్ది |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨౦౨ | ౧౪ | హిందూ | హిందు |
| | ౧౯ | చోదితమయిన కర్మములున్ను | చోదితమయిన వర్ణాశ్రమ ధర్మములున్ను తదను సరమైన కర్మములున్ను |
| ౨౦౪ | ౮ | బయలు | బయిలు |
| ౨౦౬ | ౧౪ | నివాసుల | నివాసులకు |
| | ౨౨ | చేరుతున్నవి | చేరుతున్నది. |
| ౨౦౯ | ౨౯ | సామాగ్రిని | సామగ్రిని |
| ౨౧౨ | ౧౫ | శ్లోకాలతో | శ్లోకాలతో |
| | ౨౪ | నౌక | నౌక |
| ౨౨౫ | ౫ | అల్లి | అల్లి |
| ౨౨౭ | ౨౮ | ఖుల్ల సున్నూ | ఖుల్లసున్ను |
| ౨౩౦ | ౫ | చుట్టునూ్న | చుట్టున్ను |
| ౨౩౩ | ౨౦ | ఏకమేవా ద్వితీయ్యం | ఏకమెవ న ద్వితీయ్యం |
| ౨౩౪ | ౨౦ | అభాసముగా | అభాసముగా |
| ౨౩౫ | ౧౭ | నుంచి ముంచిన | నుంచిన్ని ముంచిన |
| ౨౩౮ | ౧౫ | యేం అంత | యేల అంత |
| ౨౪౦ | ౧౨ | మహాలు | మహలు |
| | ౨౦ | యెవరున్నూ | యెవరున్ను |
| ౨౪౧ | ౧౧ | కుంఫిణి | కుంఫిణీ |
| | ౧౬ | నూటిక్కి | నూటికి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨౪౫ | ౧౮ | క్రిందట | కిందట |
| ౨౪౫-౬ | ౨౮ | ఇండియా· | ఇండయా |
| ౨౪౬ | ౧౬ | భాగములుగా | భాగలుగా |
| ౨౪౭ | ౧౮ | ల్యాంజైట్యూడు | లాంజైట్యూడు |
| ౨౪౮ | ౨౪ | (లోకా) రాధ్యుడు | (లోకా) రాధ్యుడు |
| ౨౪౯ | ౨ | రిడ్డుసీ | రిడుసీ |
| | ౫ | తెలిపే | తెలిసే |
| | ౧౧ | కనుక | గనుక |
| ౨౫౦ | ౧ | దగిన | తగిన |
| | ౧౯ | చేసికొంటూ | చేసుకొంటూ |
| ౨౫౩ | ౭ | నాటి | వాటి |
| ౨౫౪ | ౧౧ | (సర్వాంత) ర్యామి | (సర్వాంత)ర్యామి |
| ౨౫౭ | ౯ | గర్భములో | గర్భములలో |
| | ౧౯ | స్త్రీలింగ | స్త్రీలింగ పుల్లింగ |
| ౨౫౮ | ౩ | వున్నదని | వున్నవని |
| | ౧౨ | తాళము నేవాయించితే | తాళమునే వాయించితే |
| | ౧౩ | పాడేటట్టుగా | పాడేటందుకు |
| | ౧౭ | తన్నె | తన్నే |
| ౨౫౯ | ౧౧ | వుండే | నుండే |
| | ౧౫ | యితర | ఆ యితర |
| | ౨౦ | జేయుచు | చేయుచు |
| | ౨౬ | చెట్టుకు | చెట్టును |
| ౨౬౦ | ౨౮ | దేశదేశానకు | ప్రతి దేశమునకు |
| ౨౬౧ | ౬ | కాలమందున్న | కాలమునందున్న |
| ౨౬౨ | ౧౩ | యెంత | యెంత్త |
| ౨౬౪ | ౧౧ | జలచరములు | జలచరదేహములు |
| ౨౬౫ | ౨౩ | లేదనిన్ని | లేదనిన్ని |
| | ౨౫ | లేదను | లేదను |
| ౨౬౬ | ౩ | స్వభావముచేత | స్వభావ మహిమచేత |
| ౨౬౮ | ౮ | అధికారస్థులున్నూ | అధికారస్థులున్న |
| | ౧౨ | ఆ చానక్య | ఆచానక్య |
| | ౨౨ | కసుబా | సుబా |
| | ౨౫ | బస్తిలు | బస్తీలు |
| ౨౬౯ | ౧ | జాత్యంతరుల | జాత్యంతరాల |
| ౨౭౩ | ౨ | వెనుక | వెనక |
| ౨౭౪ | ౧౧ | వనతి | వసతి |
| ౨౭౮ | ౫ | రెండున్నూ | రెండున్న |
| | ౧౯ | గీష్మ | గ్రీష్మ |
| ౨౭౯ | ౩ | చేయడము | చెయ్యడము |
| | ౨౫ | విధులలో | వీధులలో |
| ౨౮౦ | ౮-౯ | బాహుల్లము | బాహుళ్యము |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨౭౧ | ౪ | ఫరవానా | పరవానా |
| | ౧౭ | మిక్కుటముగా | మిక్కుటముగా |
| | ౨౦ | తద్ద్వారా | తద్వారా |
| ౨౭౨ | ౨౫ | వుదయాత్పూర్వము | వుదయాత్పూర్వము |
| ౨౭౩ | ౧ | సమస్తమయిన | సమస్తములయిన |
| | ౪ | సొంతమువలే | సొంతమువలె |
| ౨౭౪ | ౪ | రావ | రా |
| ౨౭౬ | ౬ | యినుప | యినప |
| | ౨౬ | నిందింపుచూ | నిందింపుచు |
| ౨౭౮ | ౪ | కూచుండెటె | కూచుండేటే |
| ౨౮౦ | ౭ | దొరలకేమి? | దొరలకేమి |
| ౨౮౨ | ౭ | బయలు | బయిలు |
| ౨౮౪ | ౧౯ | అడవి | అడ్వి |
| ౨౮౭ | ౮ | చేర్చుకొని | చేర్చుకుని |
| ౨౮౮ | ౨౭ | చెప్పినట్లు | చెప్పినట్టు |
| ౩౦౨ | ౨౧ | కిరాత | కిరాతు |
| ౩౦౭ | ౭ | నివేద | నివేదన |
| ౩౦౮ | ౩ | మెత్తల | మెత్తలు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౩౧౧ | ౯ | వుండేవి. | వుండేవి |
| ౩౧౨ | ౧౪ | కోసుకోగానే | పోసుకోగానే |
| ౩౧౭ | ౯ | బావి. | బావి |
| ౩౨౩ | ౧౧ | యిండ్లునున్నవి | యిండ్లున్నున్నవి |
| ౩౨౯ | ౧౯ | ప్రసిద్ధి | ప్రసిద్ధి. |
| | ౩౦ | ౫౨౯ | ౪౨౯ |
| ౩౩౩ | ౨౧ | వేగ | వెగ |
| ౩౩౫ | ౨౧ | వాగున్నది | వాగు వున్నది |
| ౩౩౬ | ౨ | బహుదూరము. | బహుదూరము |
| ౩౪౪ | ౧౭ | క్రింద | కింద |
| ౩౪౫ | ౧౨ | పడివున్నా | పడివున్నా (రు.) |
| ౩౪౮ | ౧౩ | పొ్రవిఇశయాల్ | పొ్రవిఇశయాల్ |
| ౩౪౮ | ౨౯ | చార్లిగ ఫిరిల్ బ్రౌను | చార్లెస్ ఫిలిప్ బ్రౌను |
| ౩౫౧ | ౧౩-౧౪ | గవర్నమెంటు వుద్యోగాలు చేసినకుటుంబాన్ని | (గవర్నమెంటు వుద్యోగాలు చేసినకుటుంబాన్ని) |
| ౩౫౯ | ౧౮ | ౨ | ౯ |
| (వీరాస్వామయ్యగారు బ్రౌనుగారికి వ్రాసిన లేఖలో) | | | |
| 9 | 24 | వ్యవహారాలు | వ్యవహారాలు, ప్రభుత్వాలు |

ఏనుగుల వీరాస్వామయ్యగారి

# కాశీయాత్ర చరిత్ర

## అసలు గ్రంథం — వ్రాతప్రతి

## మచ్చు పుటలు

చెన్నపట్టణం గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీలో వున్న నెం 1407 రు కాశీయాత్రచరిత్ర వ్రాతప్రతి, 1832 లో బందరు జిల్లాజడ్జిగా వుండిన సీ. పీ. బ్రౌను దొరగారికి, ఈ గ్రంథకర్త-వీరాస్వామయ్యగారు వ్రాయించి పంపిన అసలు పుస్తకమే.

ఇది 12½ అంగుళముల నిలువు 8¼ అం॥ వెడల్పు గల అరతావులకు రెండు పక్కలా పుటకు 21 పంక్తుల చొప్పున మంచి దస్తూరీతో తప్పులు లేకుండా వ్రాయబడిన 490 పుటల గ్రంథం. శైథిల్యము, గ్రంథపాతములు లేవు. సమగ్రమైనది.

సంక్షిప్త పరచ బడిన ఇంకొక ప్రతి తమవద్ద నున్నదనిన్నీ 1838 లో అచ్చుపడిన గ్రంథం ఇంకా సంక్షిప్తమైనదనిన్నీ ఇదే అన్నిటికంటే మేలైన ప్రతి అనిన్నీ బ్రౌను గారు దీనిపైన 1839 లో రిమార్కు వ్రాసి యున్నారు.

ఈ అసలు గ్రంథానికీ అచ్చుపుస్తకానికీ భాషలోకూడా తేడాలు కనబడుతూ వున్నవి. అసలు గ్రంథంయొక్క రచన ఎలావుంటుందో తెలియగలందులకు మచ్చుకు కొన్ని భాగాలను ఇక్కడ వుదాహరిస్తున్నాను.

వీరాస్వామయ్యగారు దినచర్యగాను, తమ మిత్రులైన కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లగారికి జాబులుగాను వ్రాసిన కాశీయాత్ర చరిత్ర గ్రంథరూపంగా ఎలా కూర్చబడిందీ, దానిని అచ్చువేయడంలో ఆ గ్రంథాన్ని ఎలా తగ్గించినదీ, ఎలాగ మార్చినదీ కూడా ఈ వ్రాతప్రతివల్ల తెలుస్తుంది. 'వుప్పుకాలువకు వారధి కట్టి వున్నది, దాటిరావలశ్నిది; దోవలో కొరతలేరుదాటవలశినది,' అనే మొదలైన సూచనలు వీరాస్వామయ్యగారు అసలు జాబులలో మిత్రునికి వ్రాసిన బాపతువే. వ్రాతప్రతిలోని భాషకూడా చాలావరకు మామూలుగా జాబులలో వ్రాసే వాడుకభాషగానే వున్నది. ఇప్పటి వాడుకభాషకూ ఆ కాలంనాటి భాషకూ గల తేడాలు కూడా దీనివల్ల తెలుస్తాయి. ముఖ్యంగా వర్ణక్రమంలోని విశేషాలు గమనించ తగినవి. ఉ॥ బ్రాంహ్మణులు. చంన్నపట్నము, వుంన్నవి, లింగ్గము, తండ్డయారుపేడు, బండ్డి, మొదలైనవి. కొ, కో, గొ, గో, దొ, ధో మొదలైన అక్షరాలకు ఏత్వమిచ్చి కొమ్ము, కొమ్ముకు దీర్ఘము ఇచ్చి ఒకారముగా వ్రాసే పద్ధతి, ఇప్పుడు అచ్చుఅక్షరాలలో దొరకడం లేదు. ఇంకా చాలా విశేషాలున్నవి చూడండి.

ఈ వ్రాతప్రతిలోని భాగములువ్రాసుకొనుటకనుజ్ఞ నిచ్చిన ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాధికారులకు కృతజ్ఞుడను.

బెజవాడ,
20—9—41.

—దిగవల్లి వేంకటశివరావు.

# యిది ఏనుగుల వీరాస్వామి అల్లించిన కాశీయాత్రిచరిత్రి.

18 th May 1830

౧ Page in the Printed Edition.

ప్రతి నెంబరు ౧

౧౮౩౦. సంవ్వత్సరం మె నెల ౧౮ ది కుజవారం రాత్రి ౯ ఘంట్లలకు చెంన్నపట్నం వదిలి ప్రియాణమయి మాధవరం అనె గ్రామములో రాత్రి నిలిచినాను మాధవరం తండ్డయారు పేటలోవుండె నాతోటకు మూడుఘుడియల దూరం కీసీరుభూమి మాధుర్యమయిన వుదక సమృద్ధికలదు ద్రావిడ వైష్ణవులు కాపురం క్రిషిమీద లక్ష్యం లెదు సమిధలు వగయిర్హా పట్నంలో అమ్ముకుని జీవనం చేసేవారు దోవలో పుష్పుకయ్యా వుంన్నది ఆ పుష్పుకాలువకు వారధికట్టి వుంన్నది దాటి రావలశ్నిది.

౧౯ వుదయాన మాధవరం వదిలి పొన్నిపాలవాయ సత్రం మార్గంగ్గా వెంకటేశనాయడి సత్రం చేరినాను అక్కడ తటాకము వుంన్న సత్రం ఖిలమయివుంన్నది అంగళ్లుకద్దు మాధవరానికి ౫ ఘుడియలదూరం దోవ సరాళమయిన బండ్డిభాట ఆ రాత్రి పెద్దపాళెం చేరినాను దోవలో కొరతలేరు దాటవలశినది దగ్గర దగ్గర గ్రామాలు వుంన్నవి భాట సరాళం పెద్దపాళెంలో శక్తిరూపకంగ్గా పరమాత్ముండు తామస ఆరాధనను అంగీకరించ్చి లోకుల యిష్టసిద్ధి చేస్తూ వుంన్నాడు అరణ్య నదీతీరం వాసయోగ్యం బ్రాంహ్మణ అగ్రిహారం పలపట్టాడ యిండ్లు శివాలయం వుంన్నది ఆ శక్తి ఛింన్న లింగ్గం జాడగా భూమిలో వుద్భవించ్చివుంన్నది శక్తి ఆలయం బహు చింన్నది శూద్రపూజ యీ స్థళం పై సత్రానికి రెండుఆమడ దూరం.

౨౦ ది పగులు పెద్దపాళెంలోవుండి రాత్రి తిరువళ్ళూరు చేరినాను దోవలో కొరతలేరు మళ్లీ దాటవలశ్నిది దోవ సరాళం మంచ్చి బండ్డిభాట వెంగలి అనే గ్రామంవద్ద దోవలో సత్రంవుంన్నది తిరువళ్లూరు విష్ణుస్థళం తీర్ధప్రాబల్యం (పుట. ౨) తీర్ధంపేరు హృత్తాపనాశనీ తీర్ధంలో ప్రార్ధనవాండ్లు బెల్లం వేయుడం సాత్వికమూర్తి మహాప్రాయశ్చిత్తాలలో స్మృతిరీతిగా యీ తీర్ధం స్నానం యెత్తివుంన్నది ప్యాటస్థళం సమస్త వస్తువులు దొరుకును యీస్థళం పయిపాళ్యాని. రెండ్డుంన్నర ఆమడ యిక్కడ ౨౧ ది మధ్యాంన్నంవరకు వుంన్నానుకి

౨౧ ది రాత్రి రామంజేరి మార్గంగా కనకంమ్మ సత్రం చేరి నాను ౨ ఆమడదూరం నది దాటవలశ్నిది రామంజేరివద్ద దారి రాతి గొట్టు మిగతా భాట సరాళం సత్రం బ్రాంమ్మకంటి శంకరయ్య కట్టి నాడు ప్యాటస్థళం కోమట్లు వుపపన్నులు అగ్రహారం వున్నది యిది మొదలుగా కావేటినగరంవారి శీమ గుంట్ల వుదకం బాగావున్నది.

౨౨ ది బుగ్గగుడి భోజనానికి పగులు చేరినాను భాట సరాళం దూరం ౧౪ ఆమడ పుణ్యప్రదేశం శాశ్వతంగా మూడుధారలు గంగ్గా యమునా సరస్వతీ అనిపించ్చుకుని గుడికింద్ద స్రవించ్చి నదిలోపడుతుం న్నది కాశీగుడి లాంచ్చనగా మూర్తులకు పేరు వుంచ్చివున్నారు సమీపాన వూరు యిండ్లు లేదు పదార్ధాలు దూరాన్నించి తెచ్చుకుని గుడికి సమీపవర్తిగా వుండ్డె తోపులో వంట్లచేసుకుని భోజనం చేసుకో వలశ్నిది రమణియ్యం ప్రదేశం వుదకవసతి అరణ్య నదీతీరం యీరాత్రి నగిర మార్గ్గంగా పుత్తూరు చేరినాను ౧౪ ఆమడదూరం నగిరవద్ద కనమ దాటవలశ్నిది కనమ రాతిగొట్టు ౮ ఘడియల దూరం భాట ప్రయాస అవతల సరాళమయిన భాట నగిరి ప్యాటస్థళం సకల వస్తువులు ముసాఫరులకు కావలశ్నిది దొరుకును యీ నగిరిలో వెంకటేశనాయ (పుట.౩) డి కొమారుడు గొప్ప సత్రం కట్టను యత్నంచేస్తా వున్నాడు- పుత్తూరిలో మునియప్పిళ్ల సత్రం వున్నది యిప్పుడువచ్చిన బ్రాం హ్మలుక్కు గోసాయీలకు బైరాగులకు సదావర్తి యిచ్చేటట్టు నిశ్చ యమయి వున్నద్ది కుంఫినీవారు దొరలకు ముసాఫరుఖానా కట్టివుం న్నారు చింన్న ప్యాటస్థళం కావలశిన సామానులు దొరుకును బ్రాంహ్మల యిండ్లు వున్నవి మంచ్చినీళ్లగుంట్ల వున్నది రమణియ్య ప్రదేశం చుట్టూ కొండలు.

౨౩ ది అంజాలమ్మ కనమదాటి వడమాలపేటసత్రం ప్రవేశిం చినాను అమడదూరం కనమరాతిగొట్టు అయినా దాటడం నిండ్డా ప్రయాసకాదు ఆ కనమలో అంజాలమ్మ అనే శక్తి ప్రతిమెను వుంచ్చి వున్నది పందిలివేశి వున్నారు పరమాత్ముడి చైతన్యం ఆ ప్రతిమ యందు ప్రతిఫలించ్చి ప్రార్ధించినవారి యిష్టశిద్ధిని చేస్తూవున్నది భాట సరాళం యీ సత్రం కొల్లా పెద్దసామిశెట్టి కట్టించినాడు సత్రం

విశాలంగావున్నది బ్రాంహ్మలుకు మాత్రం సదావర్తి యిస్తూన్నారు తద్వారా సత్రానికి యశస్సు కలిగివున్నది కనకంమ్మసత్రం మొదలు యీవరకు కావేటినగరంవారిరాజ్యం యీ రాత్రి అలమేలుమంగా పురం మార్గణంగా దిగువతిరుపతి చేరినాను ఆమడదూరం దోవలో సువర్ణముఖరి దాటవలశినది చెరువుకట్టమీద కొంత్తదూరం భాట నడవవలశ్నిది సరాళమయిన భాటను దోవలో కొంన్ని బస్తీఅయ్ని వూళ్ళు వున్నవి ౨౩ దిఆదివారం ౨౪ది సోమవారం ౨౫ది మంగళ్వారం ౨౬ ది బుధవారం ౨౭ ది గురువారం (పుట.౪) ౨౮ ది శుక్రవారం ౨౯ ది శనివారం ౩౦ ఆదివారం యీ తేదీ దినములు దిగువతిరుపతిలో వున్నాను.

౨౬ ది బుధవారం కొండయెక్కి దిగినాను ౨౭ ది గురువారం కపిలతీర్థంలో సమారాధన చేసినాను ౩౦ ది ఆదివారం పగులు 3 ఘంటలుకు తిరుపతివదిలి కరకరంబాడికి పోయినాను దిగువ తిరుపతిలో గోవిందరాజులగుడి కోదండరామస్వామిగుడి వున్నది రామస్వామి గుడికి సర్కారు కుంమ్మకు ఏమీలేదు గోవిందరాజుల గుడిఆచార్య పురుషుల స్వాధీనంలో వున్నది సర్కారువిచారణ కద్దు బ్రాంహ్మలు త్రిమతస్తులగా ౨౦౦ యిండ్లు కద్దు గురునాధశెట్టి అన్నసత్రం స్మార్థులకు వుంచి వున్నాడు మునియప్పిళ్లె ౧౬ మంది చింన్నవాండ్లను పోషించ్చి పాటకశాల వుంచ్చి వేదాధ్యయనం చెప్పిస్తూ వున్నాడు చందులాలా మొదలయిన ముగ్గురు పుణ్యాత్ముల్లు గోసాయీల వగైరాలకు సదావర్తి యిప్పిస్తూవున్నారు రెండు మూడు రామానుజ కూటాలని నామకరణంచేసి శ్రీ వైష్ణవులుకు ప్రసాదం దినం కలుగుతూ వున్నది. భారీవూరు సకలపదార్థాలు దొరుకును సకలవిధములయిన పనివాండ్లు కలరు పంగ్గులూరు గురునాధశెట్టి వగయిరా కొంద్దరు సాహుకార్లు వున్నారు మహారుస్థళం అనిపించ్చు కుంట్టూ వున్నది కోతుల వుపద్రవం కలిగివున్నది పానానికి నరశింహ్మతీర్థ వుదకం వుపయోగిస్తుంన్నది గాని వేరేలేదు రెండు ఘడియల దూరంలో కపిలతీర్థం వున్నది యిది బహురమణియ్య ప్రదేశం గంగ్గదార సదాపడుతూ క్రింద తటాకవతుగా గంగ్గ నిలిచివున్నది (పుట. ౫)

చుట్టూ విశాలమయిన మంట్టపం కట్టివుంన్నది బ్రాహ్మణ సంవారాధ
నకు అతియోగ్యంగా వుంన్నది యీ చుట్టుపక్క దేవస్థళాలలో చందు
లాలాధర్మాలు నిండాగా జరుగుతున్నది ఘాలికాలింగన్కు కొండమీద
ఒక పగులు వున్నాను దిగువ తిరుపతినుంచ్చి కొండమీద స్వామివుండె
ప్రదేశం ౧౪ ఆమడ ఘాలిగోపురంవర్కు యెక్కడు దిగుడు బహు
కష్టం ఆవల కొంతప్రదేశం సనుభూమిగా వుంటుంన్నది మళ్లీ యెక్క
డం దిగడం కలిగినా ఘాలిగోపురంవర్కు కలిగినంత ప్రయాసకాదు
దారిలో నిలవడానికి అనేక మంట్టపాలు వుదకవసతి కలిగివుంన్నది ఘాలి
గోపురంవద్ద వక బయిరాగి శ్రీరామవిగ్రహాలను ఆరాధిస్తూ వచ్చిన
వారికి మజ్జిగ మొదలైనది యిచ్చి ఆదరిస్తూవుంన్నాడు యెగువ
తిరుపతిస్వామికి చెల్లుబడిఅయ్యె ప్రాథ్ధనలవల్ల కుంఫిణీవారికి సుమారు
లక్షురూపాయలు వస్తూవుంన్నది యె సత్కార్యం యెగువ జరిపించ్చ
డానికి సర్కార్కు రూక యివ్వవలశివుంన్నది యిక్కడ పరమాత్ముడు
సంపూణ్ణ కటాక్షంతో ప్రతిఫలించ్చి లోకుల పాపాంన్ని వారివిత్తం
కుండాహరించ్చి యిష్టశిద్ధి చేస్తూవుంన్నాడు వుండె శ్రీనివాసమూర్తి
ప్రతిమె దివ్యమంగళవిగ్రహంగ్గావుంన్నది దేవతులో ల్యాక దేవతులకు
సమానమయిన వారో గత కాలంలో ఆమూర్తిని ఆరాధించ్చినట్టు
తోస్తుంన్నది యిక్కడ గోసాయి బయిరాగులకు గురుపీఠంగా వుండ్డె
మహాంత్తుమఠం వకటి అతివిశాలంగ్గా కట్టివుంన్నది ఆ మహాంతుకు
శిష్యార్జన విస్తారం కలదు యిండ్లు సంకుచితం చైత్రమాసం మొదులు
జ్యేష్టమాసంవర్కు వుదయకాలమంద్దు ఛ (పుట.౬) ఛల్లని ఘాలి
కొట్టుతున్నది అది శీతళించ్చి కొండమీద వుండెవారికి నిండ్డారోగ
ప్రద మవుతున్నది కోతుల వుపద్రవం విస్తారం అడివిపందులు నిరోప
ద్రవంగ్గా మనుష్యుల మధ్యె సంచరిస్తూవుంట్టుంన్నది ఘాలికాలంలో
మనుష్యులు నిండా కొండమీద వుండ్డడం లేదు కొండమీద అరతిరు
పావడ ౨౨౦ రూపాయలు యిచ్చి విడిచి దక్షిణసమేతంగ్గా ప్రసాదం
వినియోగం చేయడమయినది.

30 ఆదివారం రాత్రి కరకరంబాడి చేరినాను దిగువతిరుపతికి
ఆమడ దూరానికి కొంచ్చం తక్కువగా వుంన్నది యిది పాళెగాడి

వూరు తిరుపతివద్ద రావూళ్ల కావలికిగాను యీ కరకరంబాడి దీనితో చేరిన కొన్ని గ్రామాలు ఆపాళెగాడికి కుంఫిణీవారు జారీగా నడిపిస్తూ వున్నారు వూరు వసతి అయినదికాదు అయిన అవతల కఠినమయిన అడివిగనుక విధిల్యాక దిగవలశ్ని మజిలీ అయినది పోస్టుఆఫీసు యిక్కడ వున్నది యధోచితంగా సామానులు ముసాఫరులకు దొరుకుతున్నది యిక్కడ ముసాఫరుఖానా కట్టి వున్నది.

३০ టి పగులు ౬ ఘంటలుకు ముందురాత్రి రెండ్డు ఘంటలుకు బయలుదేరి శెట్టిగుంట్ట చేరినాను దోవమిక్కిలి అరణ్యమధ్యంలో వుండ్డి వున్నది దొంగల రొష్టు మిక్కిలికద్దు రాతిగొట్టు మార్గ౯ం మధ్యే పాళెగాండ్ల వూళ్లు మామండూరు క్రిష్ణాపురం దోవలో దాట వలశ్నిది వీరి సహాయం ల్యాక మాతుబరులు నిర్భ౯యంగా యీఅడ్వి దాటలేరు కలక్కటరుల్కు యీ అడ్విబాట నిర్భ౯యం చెయ్యడానిక (పుట. ౭) చాత కాకుండా వున్నది మామండూరికి యీవల ౫ ఘడియల దూరములో బాలపల్లె అనేవూరు వున్నది అది మొదలు కడప జిల్లా సరిహద్దు యీ బాలపల్లె భూమినీళ్లు బహు రోగప్రదమయినది యిక్కడ రెండుమూడు నదుల వంట్టి కాలువలు దాటవలెను ఖనమ వఖటి దాటవలెను బాట బహు రాతిగొట్టు యెక్కడు దిగుడుగా వుంట్టుంన్నది బహు దట్టమయిన వెదురు అడివి యీ శెట్టిగుంట్టలో మంచి నీళ్ళకు చెరువు వఖటివున్నది రెండ్డు బ్రాంహ్మణ యిండ్లు కలవు ప్యాటస్థళం కావలశిన సామానులు దొరుకును బాలపల్లె మొదలు కడప కలక్కటరు అడ్విగొట్టి బాటవెడల్పుచేసి అక్కడక్కడ ఠాణాలు వుంచి వున్నాడు శెట్టిగుంట చేరె వర్కు భాట రాతిగొట్టుగానున్ను అడ్విగానున్ను వుంటుంన్నది కరకరంబాడినుంచ్చి ఆపాళెగాండ్లను నుంచితనం చేసి యిరువై యింట్కి తుపాకీవాండ్లను శెట్టిగుంట దాకా తెచ్చినాను బాలపల్లెలో ముసాఫరుఖానా వున్నది యీ దినం పగులు ३ ఘంటలుకు బయలు దేరి సాయంత్రం ౭ ఘంటలుకు ౧ ఆమడ దూరంలో వుండే కోడూరువద్ద వుండె సత్రం అగ్రహారం చేరినాను కోడూరు బస్తి ప్యాటస్థళం ముసాఫరుల ఖానా వున్నది

బ్రిహ్మణయిండ్లు లేవు పయిఅగ్రిహారంలో యెమీ దొరకదు అంగళ్లు లేవు బ్రాంహ్మలు శాంతు?లు కారు.

౧ ది జూన్ ౫ ఘంటలక్కు బయలు వెళ్లి ఆమడదూరంలో వుండె వోరంబాడు ౯ ఘంటలక్కు చేరినాను యిక్కడ ముసాఫరు ఖానా వున్నది ప్యాటస్థళం అన్ని సామానులు దొరుకును బాట బాగానె వున్నది శెట్టిగుంట నుంచ్చి కోడూరికి రెండుమార్గాలు వకటి అడ్విలో దంసుభాట వకటి పల్లెలమీద కాలిబాట యీ కాలి భాటలోను సవారీలు రావచ్చు (పుట. ౮)ను అడ్విభయం కోడూరితో సరి యివతల భూమి తెరపగా దగ్గర దగ్గర గ్రామాలు పయిరుపొలం వుదకవసతి యిది మొదలుయినది భాటలో కోడూరి మొదలు కలిగి వున్నది యక్కడ చూచినా చింతచెట్లు కలవు బాలపల్లెవద్ద వుండ్డె కొండ వాగునీళ్లు నాబోయీలు వగై రా తాగిసంద్దున వఖ బోయి వక కావడివాడు జ్వరం తగిలి ఖాయిలా పడ్డంద్ను సమీపవతుగావుండె వోరంబాడిలో మధ్యాంన్నం నిలిచినాను యీ బాలపల్లెవద్ద వుండె వాగువద్ద రాతిగొట్టు కనుసు వున్నది వాటివద్ద శ్రీనివాసమూర్తి పాదం వున్నది అక్కడ నుంచ్చి పడమటి దేశస్తులు కొండ్డ యెక్కు తారు యీ దినం 3 ఘంటలక్కు బయలు దేరి ఘడియప్రొద్దువుండగా పుల్లంప్యాట చేరినాను ౭ ఘడియలు దూరం ముసాఫరు ఖానావున్నది ప్యాటస్థళం బ్రాంహ్మణయిండ్లు కలవు. (ఈ ముద్రిణం పుటలు. ౧-౪)

---

వ్రాత ప్రతి పుటలు ౪౪-౫౦. (చూడు. ఈ ముద్రిణం పుటలు. ౩౭-౩౮)

జూన్ ౨౯ ది మంగళవారం రాత్రి మొదలు జూలాయి యనిమిదొ తేదీ మంగళ్వారం సాయింత్రింవరకు హాయిదరా బాదు షహరుతో చేరిన బేగంబాజారులో వున్నాను ఆ రాత్రి మొదలు జూలాయి ౧౯ ది సోమవారం రాత్రివరకు శెకేంద్రాబాదు అనే పేరు గలిగిన యింగిలీషు వారిదండు వుండె బస్తీకి సమీపంగా వుండె కాకాగూడం అనే బొమ్మదేవరు నాగన్న తోట చావడిలో వున్నాను యీ హాయిదరాబాదు షహరుకు చుట్టు బేగంబాజారు అనే బస్తీ ౧ సాహుకార్ల కొఠీలుకలది వున్నది యిద షహరు అపేక్షయా

వాసయోగ్యం యిక్కడికి కోశడు దూరములో కారువాన అనే బస్తీ రత్నాలు వగైరా అంమ్మే వర్తకులు వుండే స్థళం వకటి వున్నది ఆ బేగంబాజారుకు చేరినట్టు యింగిలీషు రిసైడెంటు నిజాంవారి ఖర్చు కింద విస్తారంగానున్ను అలంకారంగానున్ను వక హావేలి కట్టించుకొని (పుట. ౭౫) బాడిగె నిజాంకు యిస్తూ కాపురంవున్నాడు యీ హావేలి చుట్టు లోకులు వర్తకులు యిండ్లు కట్టుకుని వుండుట చేత వక పెద్ద బస్తి అయినది యీ స్థలం పేరు చంద్రఘాటు అంటున్నారు షహరులోపల షాలీబండ అనేపేరు గల్గిన వకపేట వున్నది యీ స్థలమందు యిక్కడ కల బ్రింహ్మమండలి యిండ్లు కట్టుకుని కాపురం వున్నారు దివాను పెష్కారు చందులాలు యిక్కడ యిల్లు కట్టుకుని కాపురం వున్నారు నిజాందేవిడి యీ షహరు మధ్యే వున్నది అన్కా మయిన పెద్ద మనుష్యులు అమీర్లు వుమారాలు అనే పేరుగలవార్లు సాధారణపు వర్తకులు నిజాంవంశస్తులు షహరుమధ్య కాపురంవున్నారు షహరుమధ్యే మక్కామశీదు అనే వక తురకల జపశాల వున్నది వాటిస్తూపీలు రెండు మొలాం చేసినది బహుదూరాన్కి తెలుస్తుంది మశీదుకు యెదురుగా లోగడ దివాను మీరాలం అనేవాడు కట్టించిన కారంజీలు లోతు కలది వున్నది వాటికి సమీపముగా గుజలీ అంగడీచౌకు అనేపేరు గలది ౧ బట్టల అంగళ్లు పాత్రసామాను అంగళ్లు నాలుగుదోవలు చేరడానికి గాను కట్టిన ఒక గొప్పస్తూపె కలిగి నాల్గుద్వారాలుకలిగిన వక చావడీ వున్నది షహరులోపల రాజవీధులకంత్తా గుండ్రురాళ్ళు పరిచినారు అటువంటి వీధులలోవుండే కస్మలము అదుసు నడిచేవారికి పాదాలను పూడుస్తూ వుంటుంన్నది యిండ్ల అలంకారం సందుల కుసంది యితర దక్షిణ దేశం షహరులలో వాసంచేసెవారికి యిష్టతిగావుండదు రాజ వీధులలో ఏనుగులు మొదలైన వాహనాలు సదా వస్తూపోతూ వుండుట చేతనున్ను ప్రతిమనిషి ఆయుధపాణులయి మొత్తని వారిని (పుట. ౭౬) నరకడం కొట్టడం శూరకృత్యంగా యిక్కడ యంచేవాడికె అయి యుండడము చేత షహరులో యితరదేశస్తులు సవారి మీద పోయి రావలిస్తె కొందరు ఆయుధపాణులు వాక్పారుషం కలవారినిగా కూడా పిల్చుకొని పోవలశివున్నది కృష్ణానది దాటినది మొదలు హయిదరా

బాదువరకు పక్కీరులమయం గన్కు సవారిమీద యవరువచ్చినా అడు
గడుకూ పక్కీరులు పోగడి భిక్షం అడగకమానరు వార్కి కొన్ని
గవ్వలయినా యిస్తూరాకపోతే అవమానం వంటిది పైసావారికి
గొప్ప సంభావన చంన్నపట్ణం ర్పూ ౧ కి యిక్కడి పైసాలు ౫౦
పైసా ౧కి ౨౦ పుంజీలు గవ్వలు పుంజీ ౧కి-గవ్వలు ౪ యీ హాయిద
రాబాదులో పిచ్చి రూపాయలని వకదినుసు గోవిందబకుషీలు అని వక
దినుసు చలామణి అవుతుంది యీ రూపాయిలు వకచేతినుండి వకచేతికి
వచ్చినట్టుఅయితే వకటి రెండు పయిసాలు వట్టమియ్యకనే మారకం
కానేరదు యీ చలామణి రూపాయలకు యిక్కడవారుచేసే పరీక్ష
అన్యాదృశ్యము యటువంటి రూపాయికయినా వకదోషం పెట్టకమానరు
చన్నపట్ణం కుంపిణీరూపాయలకు ఆ తొందర లేదూ అయితే దొరకవు
యిక్కడి రూపాయిలకు ర్పూ ౧కి-పైసాలు౪౦ యీ షహరుగోడకు
చేరినట్టుగా ముశీ అని యిక్కడివారు చెప్పే ముచుకుందనది పారుతూ
వుంన్నది యీనది వాడపల్లివద్ద క్రిష్ణలో కలుస్తున్నది గొప్పనది పాయిన
సంవత్స (పుట.౪౭) రం నది ప్రవాహం యెక్కువగా వచ్చి ఢిల్లీ దర్వా
జా వద్ద యింగ్గిలీసువారుకట్టిన వారధిని పగలగొట్టి యీ షహరులో
కొన్ని వీధులు ముంచ్చివేశిపోయినది బేగంబాజారుకు షహరుకు మధ్యే
యీ నది దాటడానికి పూర్వకాలమంద్దు తురకలు రాళ్లతో అతిజ
లనతుగా వక వారధి యేనుగలు మొదలయినది గుంపులుగా ఎక్కి
పోవడానికి యోగ్యంగా కట్టినారు షహరుచుట్టూ చింన్న తిప్పలు
కొండలమయం అనేక తిప్పల అగ్రిమంద్దు మశీదులు కట్టివుంన్నారు
హిందూ దేవాలయాలులేవు వుంన్నా వృద్ధికిరానివ్వరు షహరుకు యిం
గిలీసు దండ్డుకు ౩ కోసులదూరం వుంన్నది మధ్య హుస్సేనుసాగరు
అనే పేరుగల వక గొప్ప చెర్వు వుంన్నది ఆకట్టమీద యింగిలీసువారు
గుర్రపుబండ్లు పొయ్యేటంద్దుకు యోగ్యంగా భాట ముచ్చటగా చక్క
చేసి మొగలాయి వాహనాలు మనుష్యులు యెక్కి నడిచి చరచకుండా
భాటకు యిరుపక్కలా తమ పారా పెట్టియున్నారు జాతులవాండ్లను
వినహాగా యితరులను ఆకట్టమీద హుకుంలేకు యెక్కనివ్వరు యీ
జాతులవారిపేరు పరంగ్గీలని యూల అంట్టారంటే ఫిరంగ్గిలతో సహా

వాసం చేసెవారుగనుక్కు పరంగ్గివారని యీ దేశస్థులనసాగినారు యితర దేశాలలో పరంగ్గీవారని అనబడ్డా(రు) కుంఫిణీలమ్కురు వుండ్డె స్థళం హాయిదరాబాదుకన్నా దిన దినానికి యెక్కువగా (పుట.౪౮)బస్తీ అవుతున్నది ౨౦ సంవత్సరముల కింద్ద నేను చూచినప్పటికంన్నా యిప్పటిక్కి హాశ్వర్యకరమయిన బస్తీఅయినది షహరులో వస్తువులుక్కు నిరుకులేదు యెవస్తువమీంద సుంకాన్కి యవడు వ్రూహించి దరఖాస్తుచేసినా దివాణజీ సుంక్కం గుత్తయిస్తాడు కట్టెలబండ్లకు విస్తరాకులుక్కు షహరులో రావడానికి న్నాల్గు అయిదు తీరువలు అడిగితీసేవాడికి జోరావరి గొద్ది యివ్వవలసివుంన్నది చంప్పినా అడిగే దిక్కులేదు యింగిలీసు దండ్డులో యీ తొందర ల్యాక న్యాయ విచారణకూడా కొత్తవాల్ చావడిలో కంమ్మిసరయాట్టు అసిస్టాంటుగుండా జరుగుతూంది గనుక్కు లోకులు వర్తకులు యీదండ్డులో వశించడానికి దినదినానికీ యెక్కువగా యిచ్చయిస్తూవుంన్నారు యిక్కడి యిండ్లు అంత్తా యెన్నిమిద్దెలు అంతస్థులవారిగా కట్టినా స్తంభాలమీద పయిఫ్వారి లోభంచేసి మట్టి గోడలుపెట్టి ఆగోడలపైన నాజూకు అయిన సంన్నగార కావలశ్న చిత్ర విచిత్రాలత్తో వ్రూస్తూన్నారు యిక్కడ మట్టి గులక కలిస్కి యెర్రర్యేగడ మహాఘట్టిగా వుండతగ్గది యింగ్గిలీసు దండులో నేను దిగిన స్థళం వాసయోగ్యం యీ షహరుచుట్టూవుండే భూమి బహు సారవత్తుఅయినది యె విత్తుం వేశినా అతివీర్యంగా పయిరు అయి వస్తుంన్నది అయితే పయిరు పెట్టె శ్రద్ద యెవరికి రెండ్డు కారణాలవల్ల లేవు మొదటికారణం బీదలయినవారు యెచెట్టు వేసినా (పుట.౪౯) వాటి ఫలాన్ని క్షేమంగా ఆయుధాలే ఆభరణాలుగా వుంచుకొని దప్పణమె యశస్సుగా బావించ్చుకొనివుండె లోకులు అనుభవించ్చనియ్యరు వుపపంన్నులు తోటలు వనాలు వెతామంటె విపత్పరంపరలు రాజకియ్యంచాత అప్పటప్పటికి వారికి కలుగుట చాత ఆసుఖం అనుభవించడానికి ప్రాప్తం ల్యాకవుంన్నది యింతకు వోర్చి-వేశిన చెట్లు మహాభాగా అయివుంన్నది ఛోటా ఆరంజిపండ్లు విస్తారంకద్దు సకల విధములయిన పండ్లు అంటిపండ్లు వినహాగా మంచ్చిది దొరుకును అయితే అతి ప్రియము చంన్నపట్ణానికన్నా మూడింతల ధర యివ్వ

వలశ్నిది కూరగాయలు అదేప్రకారము ప్రియమయినా మహా రుచి కరంగా వున్నది వస్త్రాలు ఆభరణాలు శిపాయిలాయక్కు అయినవి యీ షహరులో దొరుకును భాకీర త్నాలుకొనేపాటి వుత్సాహం ధైర్యం ఎవరికి లేనందున వర్తకులు తేవడంలేదు ఆభరణాలు వగయిరా వుంచుకొని విక్రయించే తమ కాపునిమిత్త్యం కొంత శిబ్బంద్ది వుంచవలశి వుంట్టుంన్నది తద్వారా వక బుజురుగు వార్కి కలగడవమవుతున్నది అందువల్ల కావలశ్ని గొప్పవారు వారి యింట్టికి వెళ్ళడం వారిని పిలిపించ్చుకుని కావలశింద్ది వారుసెప్పినధరకు పుచ్చుకుని తమకు సమ్మతి అయినప్పుడు ఖరీదుచేస్తూ వస్తారు వర్తకసరళిగా అటువంటి గొప్ప వస్తువులుకొని అమ్మడంలేదు సాత్వీకప్రభుత్వంకల రాజ్యంలో మెదిగిన వారికి యీ షహరులో వునికిన్ని యీరాజ్య సంచారమున్ను భయప్రదంగా వుం(పుట. ౨౦)టుంన్నది. (చూడు. ఈ ముద్రిణం పుట ౩౬)

వ్రాతప్రతి పుట ౩౫౫ *

క్రిష్ణనగరు చేరినది మొదలు ప్రతిదినం కొంత మబ్బువేళ నాలుగు ఘడియలు అమితమయిన ఘాలి కొట్టి పడవలను హల్లకల్లోలంచేసి మబ్బును తీసుకొనిపోతూ వున్నది యీ చానక్కు ♦లో ముందు దినములు వెఫ్టాబ్రడ్ డాకటర్ కార్బిన్ అనేవారి తోటలో గంగ్గవద్దున గుడారాలువేశి నివశించినాను యీ యిద్దరు ధొరలు బహు పరోపకారులున్ను సాంప్రదాయకులుగా తోచినది ఆ డాకుటర్ కార్బిన్ అనే దొర శిశుల చికిత్స నిమిత్తంగా వక గ్రంధం చేసినాడు భేదివాంతి (పుట. ౩౧౬) చిగిత్స నిమిత్తమున్ను అదేప్రకారం వక గ్రంథం చేసినాడు నా డేరాలు వెయ్యడానకు పరిశుధ అయిన స్థళం నాబజారా నిలిచిన తావులో దొరకక పోయినంతల్లో సమీప నివాసులయిన పయియిద్దరు దొరలకు వారితోటలో కొంచ్చం స్తళం నిమిత్తం వక చీటి వ్రాసుకుంన్నంతల్లో సర్వాంతర్యామియొక్క ప్రేరేపణ

---

* పాత ముద్రిణం అచ్చుపుస్తకంలో ఈ పేరాగ్రాఫు లేదు. అందువల్ల ఈ ముద్రిణంలోనూ లేదు.

♦ ఈ ముద్రిణంలో అచానక్కు (బారకపూరు) పుట: ౨౬౫

చాత నాకు కావలసినంత స్థళం వారి తోటలో యిచ్చి నేను అక్కడ వుంన్న ఘట్టుకు సహోదర న్యాయంగా నడిపించ్చినారు యీశ్వరుడు వారిని రక్షించ్చు గాక.

వ్రాత ప్రతిపుట ౩౫౬. (ఈ ముద్రిణం పుట ౨౬౯)

(౧౮౩౧) ఏప్రిల్ ౯ తేదీ శనివారం ౧౨ ఘంటల్కు సార్వభౌముడి విభూతి పరంపర యెక్కువగా కలిగిన కలకత్తాపట్నం ప్రవేశించినాను యీ దినముల్లో యిక్కడ నివాసం చేసె జనసమూహంయొక్క దేశ కాల ద్వారా జనించె భక్తి పురస్కరమయిన చరత్కుపూజా భాను పోడా అనే ఆరాధనలు యీశ్వర చైతన్యం యిక్కడ విస్తారం ప్రతి భాతియై * (యెట్లా హైదరాబాదులో నా ప్రవేశకాలంలో తన ఆరాధనకోరకు పీర్లపండగను సంభవింప్ప చేసినాడో యెట్లా నాగ పూరిలో గోకులష్టమి ప్రయుక్తంగా పసలపండగ ఘటించినదో యెట్లా మిరిజాపూరిలో కార్తికమాస ప్రయుక్తంగా యీశ్వర శిష్టి అయిన నక్షత్రాలకు ప్రతిభాతిగా ఆకాశదీపాలు పెట్టె పండగ యెట్లా ఘటించ్చినదో ప్రియాగలో యమ ద్వితియ్యా అనే మహోత్సవం యెట్లా ఘటించినదో కాశీలో కృత్తికా స్నానాలలో పంచరత్నాలు అనే దినాలు యెట్లా ఘటించినదో గయామహాక్షేత్రంలో శివరాత్రి ఉత్సవం ఘాలిపతాల పండగ యెట్లా ఘటించ్చినదో పట్నాషహరులో హోళిపండగ అనే మహోత్సవం యెట్లా ఘటించ్చినదో తద్వతుగా) యీ కలకత్తాలోనున్ను సాంబమూర్తి ప్రీతికరమయిన పయివ్రాసిన మహోత్సవం ఘటించినది యీ వుత్సవంలో యిక్కడి జనులు మన దేశములో శడలు ఆడినట్లు దేహాలను పొడుచుకుని నరుక్కుని తమ రక్తదర్శనాలు చేసి సంన్యాసా (పుట. ౩౫౭) శ్రీమలాంచనలు వహించి వుదకకుంభదానాదులు పిండప్రదానాలు మొదలైన శ్రాద్ధాలు పితృ ప్రీతిగా కూడా జరిగిస్తూవుంన్నారు పైన వ్రాసిన స్థళంలలో పయిన వుత్సవాలకు మించ్చినది సంవత్సర మధ్యే ఆయా స్థళనివాసులకు

* బ్రాకెట్లలోని భాగం పూర్వపు ముద్రిణం అచ్చుపుస్తకంలో లేదు. అందువల్ల యీ ముద్రిణంలోనూ లేదు.

ల్యాక వున్నది కలకత్తా షహరుకు చేరిన ఉత్తరపార్శ్వాం చిత్తుపూరు అనే ప్రదేశంలో గంగాతీరమంద్దు యాభయి రూపాయలు నెల ౧కి బాడిగ నిష్కర్ష చేసి వక యిల్లు తీసుకుని అందులో ప్రవేశించ్చి నాను.

వ్రాతప్రతి పుటలు ४०४-४౯౦; (ఈముద్రణం పుటలు ३८౯-३२४)

(४०४) నా జన్మభూమి అయిన చంన్నపట్నం విర్త్తాంత్తం యటువంటిదంటే యిన్నూ్నరుయేండ్ల కిందట చందరగిరిలో విజానగరం సమస్తానాధిపతి అయిన శ్రీరంగరాయుడు ధొరతనం చేస్తూవుండగా డే అనే ధొర యీ సముద్రతీరమంద్దు వక రేవుబందరు కట్టించవలెనని యత్నంచేసి శ్రీరంగరాయంణ్ణి అడిగి వుత్తరువు తీసుకుని యీ ప్రాంత్యాలకు జమీందారుడైన దామరుల వెంక్కటాద్రినాయడి పేర సన్నదు పుచ్చుకున్నాడు. ఆ వెంక్కటాద్రినాయుడు డే ధొరకు కృతపరిచయుడు గనుక శ్రీరంగరాయుడు తన పేరుపెట్టి శ్రీరంగరాయపట్నం అని(४०౫) రేవు బందరు కట్టమన్నా వెంక్కటాద్రినాయుడు తన తండ్రి అయిన చంన్నప్ప నాయడి పేర చంన్నపట్నమని పేరు పెట్టమని చెప్పటమేగాక తానె సంన్నిధానాధిపతి గనుక అదే నామకరణం ఆరంభంలో చేసినందున చంన్నపట్నం అని పేరు కలిగినది తత్పూర్వాం యీ రేవును యింగ్గిలీసువారు మదరాసు అంటూ వచ్చినారు యిప్పటికి వింధ్యనోత్తర దేశ్శంలో మందరాసు అంటే యీ స్తళం నిర్నయమవుతుంన్నది గాని ఛంన్నపట్నం అంటే యవరికి అక్కడ తెలియదు పింమ్మట ౧౬४४ యింగిలీసు సంవ్వత్సరంలో రేవుబందరుకు చేరినట్టుగా వక కోటకట్టి సముద్రతీరమంద్దు రెండు కోసుల భూమిని యింగిలీసువారు స్వాధీనం చేసుకుంన్నారు అటుపింమ్మట ౧౬౬౧ సంవ్వత్సరం యింగ్గిలీసు వారిలో కొంత అంతఃకలహంజరిగి అరాచికమయి ౧౬౭౧ సంవ్వత్సరంలో మళ్లీ సుతరాయించ్చి యీ రేవుబందరు సుంకం యిజారా కుంఫిణీవారు చేసినారు వెంబడిగానే కుంఫిణీవారి ప్రాపకం కోరి జగధీశ్వరుడు సత్యవాదుల పక్షపాతి గనక యింగ్గిలీసువారు చాలా సత్యసంధులు అయి

నందున యీ బస్తీలో మూడులక్షల ప్రజ వాసం చేసేటట్టు చేసి నాడు పిమ్మట ౧౭౫౭ సంవత్సరంలో నలుభయివేల వరహాలు సాలుకు యెత్తేపాటి భూమి కుంఫిణీవారి అధీనం అయినది అటు పిమ్మట ౧౭౦౨ సంవత్సరంలో ఢిల్లీపాదుషా అవరంగజీబు తరఫున దావూదుఖాన్ డు దండుయెత్తివచ్చి యింగ్గిలీసువారిని చాలా కలతపెట్టి నాడు అప్పట్లో అనేక తెగలు అనేక దేశాలనుంచి యిక్కడ చేరి (౧౭౫౭) నందున యడమచెయ్యి కక్షి అని కుడిచెయ్యి కక్షి అని రెండుపక్కలుగా యిక్కడ వారు ఛీలి యింగ్గిలీసువారికి చాలా శ్రమను కలుగ చేసినారు అందుకు నలుభై సంవత్సరముల పిమ్మట ప్రాంసువారు యీ కోట తీసుకుని యింగ్గిలీసువారిని వెళ్లగొట్టినా హిందుస్తాన్ లో యింగ్గిలీసుజాతికి దిగ్విజయం కలిగివుండెను గనక వొకసాటిగా సమాళించినారు వెంబడిగానె అయిదు సంవత్సరములకు రాజీమీద యీ స్థళాంన్ని యింగ్గిలీసువారు స్వాధీనం చేసుకొంన్నారు ౧౭౫౮ సంవత్సరంలో కలాపన పోశిగి జగధీశ్వరుడి కటాక్షంచాత ప్రాంసుదండు పరారి అయిపోయినది అదిమొదలుగా ఆరికాటి నవాబును విహితపరచుకొని క్షేమంగ్గా కాలంతోస్తూ వుండగా ౧౭౬౭ సం॥ మొదలు ౧౭౮౧ సం॥వరకు హాయిదరుతో నవాబు నిమిత్తం పోరవలసి వచ్చినది అదిమొదలు యథాక్రమంగా ఆరికాటి నవాబు రాజ్యమంతా యింగిలీసువారి స్వాధీనమై వుత్తరం గంజాం మొదలు దక్షిణం తిన్నెవల్లిశీమ వరకుంన్ను తూర్పున సముద్రం మొదలు పశ్చిమం సముద్రం వరకూ ఏకచక్రాధిపత్యంగా యీ చంన్నపట్నాన్ని రాజధాని చేసుకొని కుంఫిణీవారు యెలుతూవున్నారు యీ రాజధాని కింద్ద యిప్పుడు వుండే జిల్లాలు ౨౧ యింత్తభూమి మధ్యే మయిసూరు-మళయాళం కొచ్చి యీ ముగ్గురు రాజులు తప్ప కొదవ అంద్దరు జమీందారిపాయీ కలవారుగాని యుద్ధసన్నద్ధుడుకాగల భూపతి (౧౮౨) వక్కడూ లేడు యీ చంన్నపట్నం కొడికింద్ద యిప్పుడు వసూలు సాలుకు వకటింకాలుకోటి వరహాలు అవుతున్నది ఖర్చు అప్పులకు యిచ్చే వడ్డి సహాగా వసూలుకు యక్కువగాని తక్కువకాదు యీ చంన్నపట్నం కొడికింద్ద కుంఫిణీవారు అప్పు సుమారు రెండు

కోట్ల వరహాలు వుండును స్థావరజంగ్గమ రూపకమయిన స్తితి మూడుకోట్ల వరహాలు వుండునని తోస్తుంన్నది దండు యాభైవేలమంది ఫౌజు వుంన్నది యీ చంన్నపట్నం బస్తీకి మూడుపక్కలా షహరుపానా గోడ పెట్టివుంన్నది తూర్పుపక్క సముద్రిమెగాని గోడలేదు బస్తి కోశెడుదూరం చచ్చవుకానికి వుంన్నది బస్తికిపావుకోశెడుదూరంలో దక్షిణపక్క యుద్ధసన్నద్ధమయిన కోట సముద్రివారగా కట్టివుంన్నారు వుత్తరపక్క సముద్రింగట్టున మెగుమతి దిగుమతులు అయ్యే రేవు సరుకువేసే కొట్లు కట్టివుంన్నది యీ చంన్నపట్నానికంతా పాపం పీథి శాలవీధి యీ రెండు విశాలమయినది నిండ్డా కుసంద్ది అయిన వీధులు కాదు యిండ్లకు రెండువిధాల పంన్నురూకలు తీసుకుని వీధులు వూడిచి మరామత్తు చేసి తాణాలువుంచ్చి కుంఫిణీవారు కావిలి కాస్తూ వుంటారు యిండ్లు తలవాకిలి తిన్నెలు పందిళ్ళు బయటికి అలంక్కారం గానుంన్న లోపల కల కొద్దిలో ఘాలికి అడ్డం లేకుండ్డా కట్టివుంన్నారు పది దేవాలాయాల దాకా వుంన్నది అంద్దులో విభవంగా ప్రితిసంవ్వత్సరం బ్రంహోత్సవాలు జరుగుతూ వుంటుంన్నది సముద్రంకుండావచ్చి పొయ్యే సరుకులకు తీరువ సుంక్కం తీశె నిమిత్త్యం సముద్రతీరమందు కష్టంహావుసు అని వక కచ్చేరి వుంన్నది గట్టున వచ్చెపొయ్యే సరుకులకు బస్తికి పడమట పక్క ల్యాండు కష్టం హావుసని వక కచ్చేరి కట్టివుం న్నది మిగుదలా కచ్చేరీలు కొన్ని రేవులో నుంన్న కొన్ని కోటలోను కొన్ని బైట తోటల్లోను చేస్తూ వుంటారు యిక్కడికి సర్వాధికారి అయిన గవునరు యిల్లు ఆరికాటిననాబు యిల్లు కోటకు పడమర పావు కోశెడు దూరంలో తిరువళిక్కేణి అనే వుపగ్రామంలో వుంన్నవి జాతులవాండ్లు అంద్దరు బస్తికి దక్షిణం ఆమడ దూరంలో వుండే పరంగి కొండవరకు మాడుకోసుల దూరంలో వుండే పరుంబ్బూరి వరకు సుందరమయిన తోటలు వేసి బంగ్గాళాలు యిండ్లు కట్టుకుని వుంన్నారు బస్తీలోపల వుండేవాళ్ళు హిందువుల యిండ్లలో అయ్యా పిళ్ళ యిల్లు పెద్దది కోటలోపల వుండే యిండ్లల్లో వాడలకు తెలిశె నిమిత్తం రాత్రిళ్ళు దీపంపెట్టె మెక్సిచెంజియిల్లు పెద్దది బయట వుండే జాతులవాండ్ల మిద్దెలలో మురాతు కట్టినయిల్లు పెద్దది బస్తికి

దక్షిణం బస్తికి సమమయిన తిరువళిక్కేణి మైలాపూరు తిరువటేశ్వరు
డిపేట మొదలైన కొంన్ని వుపగ్రామాలు వున్నవి పడమట పక్క
చూళా పొరశవాక కోమలేశ్వరుడిగుడి యివి మొదలైన కొన్ని
గ్రామాదులు వున్నది వుత్తరభాగమందు చాకలపేట రాయపురం
తండయారుపేడు మొదలయిన కొంన్ని గ్రామాదులు వున్నవి యీ
బస్తిలో వుండ్డే హిందువులు అందరు వుత్తరభాగమంద్దు తిరు (౮౮౯)
వట్టూరి వరకు ఆరామక్షేత్రాలు ఖేటగా యేర్పరచుకొని విలాస
కాలాల యందు అక్కడికి వెళ్ళి విహరిస్తూ వుంట్టారు కోమలేశ్వరుడి
గుడివద్ద వక చిన్న యేరు ప్రవహిస్తూ వున్నది దక్షిణపక్క మైలా
పూరి చెరువు వకటి వున్నది పడమటిపక్క నుంగంబాక చెరువు
వకటి వున్నది వుత్తరపక్క ప్రతితోటలో తటాకాలు దొరువులు
త్రొవ్వివున్నారు అందులో జగధీశ్వరుడి కటాక్షం చాత మంచి నీళ్ళు
కలిగివున్నది సమస్త ద్వీపాంత్తర పదార్థాలు పనివాండ్లసహా అమితం
గా కలరు అయితే జనసమ్మర్ధణంచేత భూమి ఆరోగ్యమయినది కాదు
వుష్ణవాయువ భూమి సంకలిత రోగాలు ప్రాప్తిస్తూ వస్తుంన్నది
కాలనీమాలు లేకుండా కాయకూరలు ఫలాదులు పుష్పాదులు అమితంగా
దొరుకుతూవున్నది యిక్కడి వారి ప్రకృతులు వుపాయవేత్తలుగాని
సాహసులు గారు ద్రావిడ ఆంధ్ర కర్నాటక దేశాలకు మధ్యే యీ
ప్రదేశం వుండ్డుటచాత బాల్యారభ్యం దెళియ్యమయిన యీ మూడు
భాషలున్న్నూ ముంద్దు ధొరతనం చేశినవారి తురకభాష యిప్పుడు
ధొరతనం చేశేవారి యింగిలీసు భాష మాటలు నోట నానడంచాత
నున్ను పరార్ధణంగా కొంన్ని సంస్కృత వాక్యాలు అభ్యశించ్చుట
చాతనున్ను యిక్కడివారి వుచ్చారణ స్ఫుటంగా వుంట్టూవస్తుంన్నది
యిక్కడి స్త్రీలు గర్విష్టులుగానున్న్నూ పురుషులపట్ల నిండా
చొరవ చేసుకొగలవారుగానున్న అగుపడతారు అయితే వస్త్రాభరణ
కృషిప్రియులెగాని నైజగుణమయిన సాహసం నిండా కలవారుగా
(౮౯౦)తోచలేదు యిక్కడి భూమి సారవంతం కాకపోయినా మోకులు
చేశే కృషివల్ల ఫలకారిగావున్నది వృక్షాదులు పుష్టికారులు కాక
పోయినప్పటికిన్ని యిక్కడ సమస్తదేశపు వృక్షాలు కలవు సమస్త

జాతుల పుష్పాలు చూడవచ్చును యిక్కడివారు చాలా మూర వెడల్పుకల బట్టలు కడతారు గనక యితర దేశాలవారికె బట్టలు వీరికి పనికిరాక వుంటున్నది యథోచితం యిక్కడివారు కర్మఫలంగానున్న దేవబ్రాహ్మణ విశ్వాసం కలవారుగా వుంట్టారు జగదీశ్వర కటాక్షం చాత యిక్కడి హిందువులకు పూర్వ పుణ్యోవృద్ధిలేక పోయినప్పటి కిన్ని ముందర చెందిన వాసనను ప్రయాసమీద కాపాడుకుంటూ వస్తారు జాతులవారి జనబాహుళ్యం విభవం తెంపు స్త్రీపురుష సల్లాపాలు చూడవలిస్తే ప్రతిదినం సాయంత్రకాలమందు. పరంగికొండ్ల శాలలోను సముద్రంవద్ది వాడరేవు శాలలోనున్న నిలిస్తే వారుఅందరు...వాహన విశేషాలు యెక్కివస్తారు గనక చూచి ఆనందించవచ్చును యిటువంటి రాజధానిలో జగదీశ్వరుడు తరాల వెంబడిగా జీవనంకలగచేసి నన్ను నిలిపి వున్నాడు. జగద్గురోపాహి జగద్గురోపాహి జగద్గురోపాహి.

కాశియాత్ర చరిత్ర వ్రాతప్రతి సంపూర్ణ మైనది.

---

## సవరణ

"యిది ఏనుగుల వీరస్వామి అల్లించిన కాశీయాత్రచరిత్ర" అనే శీర్షికతో అసలు గ్రంథం వ్రాత ప్రతి ప్రారంభమవుతుంది. ఈ ముచ్చపుటల శీర్షికను కూడా నేను అలాగే వ్రాశాను. అచ్చు చిత్తులుదిద్దడంపూర్తిఅయి ఫారం కట్టేవరకూ కూడా అది సరిగ్గానే వున్నది గాని తీరా ఫారం మిషనుపై కెక్కిన తరవాత అచ్చువేయడానికి అజ్ఞ యిచ్చేవారు అది పొరబాటుఅనుకుని, వీరస్వామిని వీరాస్వామి అనిన్నీ, కాశి యాత్రను కాశీయాత్ర అనిన్నీ దిద్దినారు!

అసలు గ్రంథానికి మళ్ళీ ఒక ప్రతిని వ్రాయించి అచ్చు వేయవలసివచ్చి నందువల్ల ఇలాంటివి - లేఖరి పొరబాట్లు కొన్నీ, అచ్చు చిత్తులు దిద్దేవారి పొరబాట్లు కొన్నీ, నా పొరబాట్లు కొన్నీ, దీనిలోకి దొర్లడం సంభవించింది. ఇందుకు క్షమాపణ వేడు తున్నాను. —సంపాదకుడు.

# ఏనుగుల వీరాస్వామయ్యగారి

# కాశీయాత్రచరిత్ర

## కొన్ని పదముల అర్థములు *

పుట

౧ సరాళము=సరళము; తిన్నని; సులువైన; చిక్కులులేనిది; సరళము, సరాళము; బాట, భాట; ఆప్పటి వాడుకభాషలో రూపాంతరాలు – చూడు: బ్రౌణ్య నిఘంటువు. ఇది చాలసార్లు ప్రయోగింపబడినది.

,, పలపట్రిల యిండ్లు = చిల్లరజనముయొక్క యిండ్లు. 'పలపట్టాడ యిండ్లు' అని వ్రాతప్రతిలో వున్నది. 'పలపట్టడ' అనే అరవమాటలోనుండి పలపట్రి అనే తెలుగు రూపము వచ్చినది. పలపట్రిజనము అనగా చిల్లరజనము, (rabble) అని బ్రౌణ్య – మిశ్రనిఘంటువు.

ఉత్తర పినాకినికిని దక్షిణ పినాకినికిని మధ్యనున్న దేశంలో అరవంలోనుండీ, కన్నడంనుండీ, తురకంనుండీ, ఇంగ్లీషునుండీ కూడా చాలామాటలు తెలుగులోకి వచ్చి కలిసి వాడుకలోనున్నవని వీరాస్వామయ్యగారు కాశీయాత్ర చరిత్రలోనే వ్రాశారు. ఈ ప్రయోగాలన్నీ బ్రౌణ్యనిఘంటువులో కనబడుతున్నవి.

౨ పేటస్థలము=పేట,అనగా పట్టణ సమీపమందుండి సంతసాగే యూరు; నగరముయొక్క శాఖ;బస్తీలో భాగము; లేక దానినంటిన ఉపగ్రామము.'ప్యాటస్థళము' అని వ్రాతప్రతి లేఖరి వ్రాసియున్నాడు.

వ్రాతప్రతికీ అచ్చుప్రతికీ వర్ణక్రమంలో ఇలాంటి తేడాలు చాలావున్నవి. అచ్చుప్రతిలో కూడా ఒకేపదము కొన్నిసార్లు ఒకలాగున మరికొన్నిసార్లు ఇంకొకలాగున వ్రాయబడినది. ఉదాహరణానికి: బ్రాంహ్మణుడు, బ్రాహ్మణుడు; కర్మ, కమ౯ మొదలైనవి.

3 (కనమ) రాతిగొట్టు; (దోవ) రాతిగొట్టు (౬) – రాతిపొరు, రాతిపొర, రాతిపర అని కూడా బహుళంగా ప్రయోగింపబడింది. (బ. ప్ర)♦

ఇందులోని 'గొట్టు' శబ్దము భూమియొక్క స్వభావమును సూచిస్తుంది. వస్తుస్వభావమువలెనే మనుష్య స్వభావమును సూచించే 'గొట్టు' శబ్ద మున్నది. ఉదా:

---

*ఈ పట్టికలోని కొన్ని పదములకు అర్థములను బ్రహ్మశ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రులుగారు వ్రాసియిచ్చారు. తక్కినవి బ్రౌణ్యనిఘంటువు మొదలైన గ్రంథములలోనివి.

♦ బ. ప్ర=బహుళ ప్రయోగము; చాలాసార్లు ఉపయోగింపబడిన పదము. బ్రౌణ్య = సీ. పీ. బ్రౌనుగారు రచించిన తెలుగు ఇంగ్లీషు నిఘంటువు (1852) బ్రౌణ్య – మిశ్ర = బ్రౌణ్యనిఘంటువు చివర అనుబంధముగా చేర్చబడిన మిశ్ర పదముల నిఘంటువు (1854)

ఈ పట్టికలో చేరని పదముల అర్థములకు పైనిఘంటువులు చూడవలెను. హిందుస్థానీ పదములకు నేను కూర్చిన పారిభాషిక నిఘంటువు చూడవలెను.

దేబిరిగొట్టు, వాపిరిగొట్టు, తంట్రిగొట్టు, అని వాడతారు. విశేషణముగా కఠినమైన దుష్టమైన అని అర్థమున్నది - (బ్రౌణ్య).

౯ అవసరాలుగా = రీతులుగా, (బ. ప్రి)

౧౦ చీకారణ్య = కీకారణ్య, (బ. ప్ర)

౧౦ పాశ్శీలు = పన్ను, సుంకము, రుసుము

౧౧ పుంజధాన్యములు = మెట్టధాన్యములు

౧౨ బేబాదు = సరియైనకట్టు దిట్టములేని; తారుమారుగా వుండే, (బ్రౌణ్య-మిశ్రి)

,, మేటీలు = అంశములు, భాగములు;

,, పామీభరాయించి = బాధ్యత వహించి

౧౪ పరష వాండ్లు, (పషణ-వాండ్లు) = తిరుణాళ్లకు వచ్చే గుంపు (పరస = యాత్రికువచ్చు జనము, అని శబ్దరత్నాకరము.)

౧౫ వయిపు; వెపు=ఉపాయము; వీలు; 'వైపు దెలసి బలుకవలయు వేమ'. బ. ప్ర.

౧౬ అసోదా చేసుకొని = విశ్రాంతి తీసికొని, సేదతేర్చుకొని

౨౧ కసుబా = బజారుగల బస్తీ; పెద్దవూరు, కచ్చేరీలు వుండేవూరు, గడిస్థలము [(బ. ప్రి)

౨౨ మజుబూతిగా = గట్టిగా

౨౪ (ఒక) నడత = ఒకనడక, ఒకసారి యీవలినుండి ఆవలికి పోవుట

,, క్లిప్తము, క్లుప్తము = నిర్ణీతము; నిర్ణయింపబడినది; నియమింపబడినది.

౨౫ లష్కరు = సైన్యము; దండు. ఫౌజు = సిబ్బంది

౨౬ పొలకట్లు=దున్నిన మడులు. సాగుకు దున్నిన పొలము. దీనికి బ్రౌనుగారు కాశియాత్రిచరిత్ర 55 వ పుటనే ప్రమాణంగా పేర్కొన్నారు.

౩౧ పేడించు = పేనించు.

,, చెయికావలి = చెయికావిలి, చెయిజాగ్రత. ముందు జాగ్రత్తకోసం వుంచుకొనే బియ్యం వగైరా భోజనసామాగ్రి (Reserve) (బ. ప్రి)

౩౩ చేరినట్టు = అనుకొనినట్లు. (బ. ప్రి)

౩౩ గుజిరీ అంగడి (౧౬౧) = గుజరి, గుజిరి, గుజిలి = బజారు స్థలము; సంతచోటు; గుజిలీబజారు; (దొంగలబజారు; బజారువేళ- సాయింత్రము Market Place, Thieving Bazar; a Madras word-బ్రౌణ్య- మిశ్రి.)

,, స్తూపీ = మశీదుపైన, బురుజు పైనగల శిఖరము

౩౫ జోరావారి = (జోరావరి) బలాత్కారము; బలోద్ధతి

౩౬ అమానిగా = గుత్తకివ్వక దివాణపు విచారణ కింద నుండే భూమి

,, మామిలియ్యతు = సర్కారు నిర్వహణము. చూడు: మామిలీయతు (౨౨౮)

౩౮ దివానుపేష్కారు = ప్రధాన పరిపాలకోద్యోగి, సివిలు అధికారి

,, నజరు యినాయతులుగా = పైయధికారుల కిచ్చు నజరులుగాను; క్రింది వారికిచ్చు బహుమతులుగాను

౩౯ పారా = కావలి. పారాచౌకీ అనగా కావలిస్థలము

,, అంతు = వెరసి (బ. ప్రి)

౪౦ హరకారా, (హర్కారా) = దూత, పనివాడు, జవాను,
,, పుసలాయించి = బుజ్జగించి
౪౩ కంట్లము = (కంటలము) చిల్లర సరకులుంచి ఎద్దు మొదలైన వానిపైన వేయు సంచుల జత.
౪౬ జీనిగెలవాండ్లు = (జీనిగిరివాడు) చీట్లాటకు పేకముక్కలు, పల్లకీలు, బచ్చిన బొమ్మలు మొదలైనవి తయారు చేసేవారు. ( Upholsterers, makers of Playing cards, Palanquins - బ్రౌన్యా-మిశ్ర). వీరు నూజివీడు ఆ ప్రాంతాలలో వాహనాలకు రంగులు వేస్తారు.
,, గంజిఫాచీట్లు: పేక ఆటలో చీట్లువంటి చీట్లు. గంజిఫా ఆటనుగురించి పండితరాయలు 'గంజిఫాఖేలనమ్' అనే పుస్తకం వ్రాశాడు.
౫౧ అములుదారుడు = శిస్తు దస్తు వసూలుచేసే (రివిన్యూ) అధికారి, గ్రామ పోలీసు అధికారి
౫౪ పొడిచెట్లు = దట్టంగా లేని చెట్లు (బ. ప్ర.)
౫౫ కొత్తవాలు = పోలీసు అధికారి
౫౭ మోడి = రాసుల మోడిగా, వేలమోడిగా (౧౫౭) = రాసులకొద్దీ, వేలకొద్దీ మోడిని = చొప్పున (బ్రౌన్యా. మిశ్ర.) బ. ప్ర.
౫౯ తాళ్వారము = చెన్నపట్టణపు యిండ్లలో ముందువా వసారాను అరవంలో తాళ్వార మంటారు. సాధారణంగా కూటము అనే కచ్చేరిచావడి (హాలు)కి అనుకొని గాలి వెల్తురుల కోసం ముందువాకట్టి వుంచుతారు, దానినంటియున్న వసారాకే తాళ్వార మంటారు.
౬౦ కూటానికి = కూటమనే చావడికి, హాలుకు (చూడు: తాళ్వారము)
౬౦ కొట్టడి (కొట్టిడి ౨౭౭; ౫౯౨) కోష్ఠము = సామగ్రిలుంచు గది.
,, కోవులు = కోవియొక్క బహువచనము. పుట్టకోవులు = చెదలపుట్టలమూతులు; తూము కాల్వల మూతులకుకూడా కోవులంటారు. (బ్రౌన్యా.)
౬౩ విడవలి = ఇంటి పైకప్పుకు నేసే ఒక విధమైన గడ్డి. ఉ: విడవలిపూరి.
,, పొట్లముగా = సంఘముగా, ఐకమత్యముగా.
౬౪ కమ్మిస్సెరైయాటు = ( Commissariat.) దండుకు కావలసిన భోజన సామగ్రి సరఫరా చేసేశాఖ. (చూడు రస్తు. పుట ౧౩౫)
౬౭ కలవం గుండు = ఖల్వము, గుండ్రాయి.
౭౧ పసలపొంగలి = సంక్రాంతిపండుగను చెన్నపట్టణం ప్రాంతములో పొంగలి పండుగ అంటారు. కనుము నాటి పశువుల పండుగే పసల పొంగలి.
౭౩ ఖుల్లసు = వివరము; నిగ్గు; సారాంశము.
౭౪ రవేసాకులు = రవేసు లేక రవీసు, ఆకులు; చెన్నపట్టణములో దొరికే ఒక జినుసు లేత తమలపాకులు.
౭ కొట్టాయిలు = పెద్ద పూరిపాకలు; తాటియాకుల కప్పుగల చావళ్ళు.
నడితిని (నడిచేవారు) = జీవనము చేసేవారు; నడక నడిచేవారు; ప్రవర్తన; నడవడి.

౮౯ జిహాస = విడువనిచ్చు

౯౧ సాహిత్యాలుగా = వ్యంగ్యంగా.

౯౫ శాల = నీడకోసం దారికి రెండుప్రక్కలా వేయబడిన చెట్లవరుస; n. s An avenue or walk of trees, a walk or promenade). దోవకు రెండుతట్ల చాల్పుగా పెట్టినచెట్లు; తోటలో నడవడమునకు చాల్పుగా కట్టినది;అని బ్రౌణ్య నిఘంటువు. అరవములో శాల అనే పదం ఇప్పుడు ఈ అర్థంలోనే వాడ బడుతూవుంది.

౯౬ యెండగొట్టు పడినందున = ఎండ కొట్టినందువల్ల.

౯౮ గాదులు = (బంగాళీమాట) ఇనుపకమ్మలు, కటకటాలు Railing (బ్రౌణ్య మిశ్ర నిఘంటువు)

౯౯ కాలతామసము = కాలాతిక్రమణము, మిక్కిలీ ఆలస్యము.

౧౦౨ బహుశః = (బహుశా) సర్వసాధారణగా; ఎక్కువగా;

౧౦౫ తాయికివందవన్ తగప్పణ = (ఇది అరవసామెత) తల్లికోసం వచ్చినవాడిని తండ్రిగా యెంచి అతని యాజ్ఞకు లోబడుట యని యర్థము,

౧౦౬ పిత్రోపరి = పైత్యాధికము.

౧౦౭ వర్త్ కొట్టియ మణల్ వెళ్ళికట్టి యముల్ = మళయాళసామెత. సేతువు దగ్గరనున్న తెల్లని యిసుక ఎండలో వేడియెక్కి నప్పు డది కరిగి సలసల మరుగుతూవున్న చాకీవెండిలాగున నే భగ్గున మండుతూవుంటు ద నే భావము ఈ సామెతలో నున్నది.

౧౧౩ రూపురూపుగా = సాక్షాత్తుగా

౧౧౫ కలిమెడు = పండ్రెండుతూములు.

౧౧౭ చెంగి చెంగి = చెంగుటయనగా వెంటనంటి తచ్చాడుట loiter. (బ్రౌణ్య)

౧౨౮ కటాయించి = ఖేటాయించుట; పంచియిచ్చుట

౧౨౯ బరక్ణ్దాసు = (బరకందాజు) తుపాకీవాడు. ఉత్తరదేశంలో సామాన్యంగా ఆయుధపాణియైన బంట్రోతు; తాణా బంట్రోతు, కావలి జవాను.

౧౩౩ బొరుగులు = మరమరాలు; లాజలు

౧౩౪ నేలమానికె = నేలమాళిగ; నేలకొట్టు

,, బలంపీటలు = బెంచిబల్లలు, (A Bench) బ్రౌణ్య.

౧౩౫ రస్తు. (౨౬౧)=(రసదు) వస్తుసంభారము (శబ్దరత్నాకరము). సైనికదళములకు మార్గమధ్యమున అనుదినము భోజనమున కివ్వవలసిన సాధనసాగ్రి; దండుకు కావలసిన సామాను; (Food provisions, Commissariat Supplies) బ్రౌణ్య - మిశ్ర - "పరంగెడు రస్తుకొట్టములు భద్రముగా నొగి బీగ ముద్రలణ" హంస. ౧ ఆ.-శబ్దరత్నాకరము. "కస్తురి వీణె పదార్థవన్నె బంగారము రస్తుకుప్ప తెలిగంబుర వెన్నెలలోని తేట". Suca 1-112-బ్రౌణ్య-మిశ్ర

౧౪౦ సాయరు చావిడి = కష్టంహావుసు; ఎగుమతి దిగుమతి సరకులపైన సుంకములు వసూలు చేసే కచ్చేరి.

౧౪౧ చంగావివేసిన మంచిరేక=రేకు,అనగాఅంచుకమ్ములు లేనివస్త్రము;దుప్పటిలో సగము;కుంఫిణీ వారి కాలంలో ప్రసిద్ధికెక్కిన వస్త్రవిశేషము. A sheet of cloth called Dangari, A Salempoor - (బ్రౌణ్య)

౧౪౪ అమింజీ = (అరవము) అమంజి; వెట్టి; చాకిరి

౧౫౩ సల్తన = దర్జా, ఉద్యోగ హోదాకు తగిన గౌరవము

౧౫౪ నకీబులు = దూతలు; బట్టులు, చాటించువాండ్రు.

,, చోపుదార్లు= వేత్రధరులు; వెండి బెత్తములవారు.

౧౫౭ బావమరది వోప్పారితో = బావమరది వరసతో (ఇది అరవములో ఒప్పారి అనేమాట నుండి తెలుగులోకి వచ్చినది. - బ్రౌణ్య - మిశ్ర)

౧౬౫ వినహా = వినా

౧౬౮ పదవాక్య ప్రామాణ్యము = చేసిన వాగ్దానము చెల్లిస్తారనే నమ్మకము; చెప్పే మాటకు విలువ యుండడము

౧౮౩ వితరణగా = ఎక్కువగా

౧౮౫ వేలాంతరాలు = వేలకొద్దీ; ఇల్లాగే లక్షాంతరాలు, కోట్యంతరాలు (౨౮౭)

౧౮౫ మంచివిడి (కుంకుమ పువ్వు)=మంచి స్వచ్ఛమైన లేక నిర్మలమైన కుంకుమ పువ్వు.

౨౦౬ హాజరుగా ఉన్నవి = ఇప్పుడున్నవి

౨౦౮ హాజరుభాషీగా = ప్రత్యక్షముగా నుండుట, హాజరై సిద్ధముగా నుండుట

౨౦౯ జులాయిస్తు = మైకముచేత మసలుట.

౨౧౯ సంకిళ్లవాండ్లు = ఖైదీలు; రూపాంతరము : సంకిలవాళ్ళు

౨౨౮ భూమివాటము=భూమి అమరకపు పద్ధతి.

,, మామిలియతువాటము = మామిలీయతు అనగా సర్కారు వ్యవహార నిర్వహణము, (Management of public business ; affairs of Stale) అందువల్ల సర్కారు నిర్వహణంక్రింద భూములను అమరక పరుచుపద్ధతి, సర్కారు బందోబస్తు, అని దీనికి అర్థము చెప్పవచ్చును)

౨౨౯ వారపత్తుభూమి=(అరవము) సర్కారుకు పన్ను చెల్లించేభూమి-(బ్రౌణ్య-మిశ్ర.

,, బేరీజు = దివాణపు పన్ను మొత్తము; గ్రామమొత్తం మీదగాని జిల్లా మొత్తం మీదగాని సర్కారుకు చెల్లుశిస్తుమొత్తము; భూమికి నిర్ణయమైనశిస్తు.

౨౩౦ శేఖరం చేసేకొరకు; శేఖరం చేసివుంచి (౨౮౩)=సిద్ధము చేసేకొరకు; కూర్చుట కొరకు;

,, ములుకుగిరి (తిరుగుతూ వుంటాడు) = పూర్వం మరాటీదండు అప్పుడప్పుడు వచ్చి పన్నులు వసూలుచేసే దౌర్జన్య పద్ధతికి ములుకుగిరి అనేనారు. దీనినిబట్టి సైనిక బలంతో శిస్తు దస్తులు వసూలు చేయడానికి అధికారులు అప్పుడప్పుడు సిబ్బందితో పర్యటనము చేసే పద్ధతికి ఈ పదం ఉపయోగించేవారు.

Mulkgiri:(Country seizing.) Process, of (Maratha) Land revenue collecting at the point of sword - Baden Powell vol. iii, p. 280.

Taking possession of a country, the periodical incursion of a military force for the collection of tribute or revenue (M. L. J. — Law Lexicon)

ఈ పదాన్ని వీరాస్వామయ్యగారు సందర్భానుసారంగా ఎంత గూఢార్థంతో ప్రయోగించారో చూడండి!

౨౩౦ తోలలుగా చీల పోతున్నది = తోనలవలె విడిపోతుంది; చీలిపోతుంది.

౨౩౧ ఎన్నులు తీయుచున్నవి = ఎన్నులు లేక వెన్నులు వేస్తున్నవి.

౨౪౪ మనిషి కట్టు = మనుష్యస్తోమము.

౨౫౧ రసగుండ్లు = పాదరసగుండ్లు లేక పాదరసము పూసిన గాజు బుడ్లు.

౨౬౬ సూత్రపు పడవలు=మనిష్ని తప్పి యెత్తిపోసే పడవలు; డ్రెడ్జరులనే అలాంటి పడవలకిప్పుడు ఆవిరియంత్రాలను అమర్చారు.

౨౬౭ వోలందావారు = హాలండువారు.

౨౬౯ శడలు ఆడినట్లు=సిడులాడినట్లు. (సిడి, సిడులు) సిళ్ళు ఆడడమనగా గ్రామదేవతల కొలువులలోను జాతరలలోను మొక్కుకున్న వారి వీపులలోనుంచి ఇనుపగాలములు దూర్చి సిడిమ్రానుకు అనగా సిడుల జాతరకు నాటిన స్తంభముమీది యడ్డు మ్రానుకుకట్టి త్రిప్పడము. దీనికి గాలపుసిడి అంటారు. ఇది చేయలేనివారిని గంపలో కూర్చోపెట్టి తిప్పే గంపసిడి ఒకటికూడా వున్నది. సిడి అనగా మొద్దులాంటి యీటె అని బ్రౌణ్య నిఘంటువు. నరసిడి గాక మేకపోతుసిడి కూడా వున్నది. దక్షిణదేశంలో ఇప్పటికీ ఇవి జరుగుతూవున్నవి. దీనికి ఇంగ్లీషులో (hook-swinging) అంటారు. 1824 సం॥ ఏప్రిలు 9 వ తేదీన కలకత్తాలో "చరక్ పూజ" అనేజాతరలో సిడులాడడం చూచి బిషప్ హెబరుగారు తమ జర్నల్‌లో వర్ణించారు. (చూడు : బిషప్ హెబర్సుజర్నల్ 1 వ సం॥ పుట 98-100) "సిడివేలె(?) దెలవయోర్తు" పాండు. 3 ఆశ్వా. - శబ్దరత్నాకరం.

౨౫౪ కయామత్ కా దిన్ = హిందుస్థానీమాట. పుస్తకంలో కయామల్ కౌడిన్ ఆని పొరబాటుగా అచ్చు పడింది దీని అర్థం ౨౫౪ పుటలోనే వున్నది.

౨౪౫ వుండరాములు (చేసినంతలో)=ఉండగూడదని నిషేధముచేయడం (ప్రాబంధిక భాషలోని 'హోరాములు' అనే ప్రయోగం ఇలాంటిదే)

౨౪౪ తట్టువాణి గుర్రములు = గుజ్జుపు తట్టువలు; (Tattoo-a Poney - బ్రౌణ్య-మిశ్ర)

౨౭౦ అరమనజాతి = ఆర్మీనియనులనే క్రైస్తవ జాతివారు

౨౭౫ బొందెగడ్డ = అరటిదుంప; దూట

౨౭౭ బోరుగద్దలు = బోరువగద్దలు; రాబందులు; (Vultures - బ్రౌణ్య)

౨౯౨ ఝూడుమాలీ = ఊడ్చేవాడు

౭౨౪ వుగ్గళించి = (ఉగ్గళించి; ఉగ్గడించి) మ్రోగు; శబ్దించు; వచించు; గట్టి కేకలు [వేయు

,, అకరము = ఆధారము

౨౯౬ మాతా శేశెద్ మక్కుల్ క్కు = తల్లి చేసినది పిల్లలు అనుభవిస్తారు అని ప్ర
వంలో అవ్వయారు అనే కవయిత్రి పలికిన సూక్తి.

౨౯౭ ఇడిసిన = చెడిపోయిన; ఇడియు అనగా పాడుబడు ఉ: ఇడిసినబావి(బ్రౌణ్య

సీ॥ ఇడిసిన యిడువులఁ రొయడలఁ బొల్చే

నుత్తరేను గసింద కోరింద పొదల —ఆము - ౬-౧౩

3౦౪ నిశాని = చిహ్నము.

3౦౪ తురకరాయి = బొంతరాయి (The Stone Called Laterite) బ్రౌణ్య - మిశ్ర.

,, చిత్తుళిపని = శిల్పము; చెక్కుడుపుబని (?)

3౧౧ హస్తాంతరముగా = బదులుగా

3౧౨ బోరిగెలపోసుకోగానే సరేనా? = బోర్లగిల ద్రోసుకోగానే సరేనా?

3౧౫ ఉప్పుకయి వారగా = ఉప్పుకయ్య ప్రక్కగా.

3౧౬ బాందలు = ఓడదారువులు, వాడలు మరమ్మతు చేయడానికి తీరమున గదుల
గదులుగా తవ్విన దారువులు (Docks)

3౨౧ వెదురు దబ్బలు = వెదురుబద్దలు; వెదురుపేళ్ళు; సన్నగా చీల్చిన పేడు, బద్ద
,, సపీ చేసుట = చేవ్రాలు చేయుట, సైనుచేయుట.

3౨౬ టీకాచేసేకొరకు = ఒప్పందము, ఖరారు, కంట్రాక్టు, ఏర్పాటుచేయడానికి

33౦ నిండార్లుగా = నిండుగా; పూర్తిగా,

3౫౦ జూములా = వెరసి

3౫౧ తాజీం = (తాజీము) సమ్మానము, ఆతిథ్యము, గౌరవము, ప్రత్యుత్థానము;

శా॥ రాజా జారుఁడు మంత్రినిర్దయుడు నీ రాష్ట్రంబులోఁ బెద్దలా
కోజాల్ కొండలు జీవహింసకును సంకోచింప రెవ్వారికిం దాజీమీయరు.
—అడిదము సూరన్న చాటువు.

3౫౨ తరాతరప్రకారము = (తరాతరముగా) వారి వారి హెచ్చుతగ్గుల ననుసరించి
వరుసక్రమంగా; తరాతరము తెలసి మాట్లాడుట అనగా హెచ్చుతగ్గు తెలసి
మాట్లాడుట; (To appreciate, recognize, assign his due merit) ఒకరి
అధిక్యతను గమనించి గౌరవించుట

3౫3 వర్తకసంచు = వ్యాపారపు మెళుకువ; రీతి; షైఖరి, మోసము; తికమకలు

3౫౪ తూకడానకు = నీళ్ళుతోడుటకు; ఎత్తు, లేవనెత్తు; (అరవము నుండి
(౧౪౦ తూకున తీయబడిన = ఉరిదీయబడిన) తూకుమాను = ఉరికంబము

3౫౫ ఆయుత్తు కాదు = వీలుకాదు; వల్లకాదు

3౬౧ కలాపన (పొసగి) = కలఁత, క్షోభము కలిగి

3౬3 సంకలితరోగాలు = అంటురోగాలు



## వెనుగుల వీరాస్వామయ్యగారి

## కాశీయాత్ర చరిత్ర.

# అకారాది విషయ సూచిక

(౧) శీర్షికల ప్రక్కనున్న తెలుగు అంకెలు, కాశీయాత్ర చరిత్ర మూలగ్రంథం పుటల సంఖ్యలు. బ్రాకెట్లలో నున్న తెలుగు అంకెలు, శ్రీనివాస పిళ్లగారు వ్రాసిన వీరాస్వామయ్యగారి జీవితము పుటల సంఖ్యలు. ఇంగ్లీషు అంకెలు, ఈ గ్రంథం మొదటనున్న సంపాదకుని పీఠిక, వీరాస్వామయ్యగారు - వారి మిత్రులు, బ్రౌనుగారికి వీరాస్వామయ్యగారు వ్రాసిన లేఖ, మొదలైన విషయాల పుటలు.

(౨) చూడదలచిన విషయం ఎన్ని శీర్షికల కింద కనపడగలదో ఆలోచించి చూచి పరస్పర సంబంధం కల శీర్షికల పుటలన్నీ చూడవలెను.

(౩) ఒక్కొక విషయము ఆశీర్షిక ప్రక్క వేసిన అంకెగల పుటతో ప్రారంభమగును. ఆ విషయమింకను తరువాతి పుటలలో కూడా ఉండవచ్చును గనుక పుట తిప్పి చూడవలెను.


| విషయము. | పుట. |
|---|---|
| అంజాలమ్మ | ౩ |
| అండవాయువులు | ౨౨౫-౬ |
| అండ్యాసరాయి | ౧౨౬ |
| అంతరాత్మ, ఆత్మ, పరమాత్మ | ౨౫౧-౨౫౩-౨౫౫-౨౫౪-౩౧౩-౩౧౮ |
| అంబరీష | ౪౬ |
| అక్బరు పాదుషా | ౧౩౩-౧౬౦ |
| అక్షయవటము | ౧౨౯-౨౧౬-౩౦౮ |
| అగరా (ఆగ్రా) | ౨౪౮ |
| అగ్రహారములు | ౩౨౨-౩౨౫-౩౨౯ |
| అటూరానాళా | ౩౦౧ |
| అణిమాద్యష్టసిద్ధులు | ౨౩౪-౨౮౪ |
| అత్తిరాల | ౪ |
| అద్వైతము | ౧౮౬-౧౮౪-౨౦౦-౨౩౨ |
| అథర్వణవేదము | ౧౬౩-౩౨౦ |
| అధిక క్షయమాసాలు | (౨)-౨౮౩ |
| అనకాపల్లి | ౩౩౨ |

| విషయము. | పుట. |
|---|---|
| అనవేమారెడ్డి | ౧౭ |
| అప్పయ్య దీక్షితులు | ౬౬-౨౫౪ |
| అప్పారావు (నూజవీటి) | ౩౫౦ |
| అభినిమందు | ౨౩౦-౧ |
| అమరా పాటక్ | ౧౦౭ |
| అమ్మనబోలు | ౩౫౬ |
| అమ్మన్న | ౩౮౧ |
| అమృతరాయడు (పీష్వా) | ౧౬౯ |
| అయిస్సు (మంచుగడ్డ) | ౨౮౪ |
| అయోధ్య | ౧౪౬ |
| అయ్యాపిళ్ళ | ౩౪౨ |
| అరణ్యా నది | ౩౬౮ |
| అరమనజాతి | ౨౭౦ |
| అరవభాష | ౮౭-౩౬౧ |
| అరిషడ్వర్గములు | ౨౫౬ |
| అరిటిపళ్ళు | ౧౭౮ |
| అరుణాచలశెట్టి(లింగిశెట్టి కొడుకు) | ౩౬౪ |

పుట.

ఆలమంద ౩౩౧
అలమేలు మంగాపురం ౩
అనివరణలు ౧౫౮-౧౫౯-౧౭౫
అవతారములు ౮౨
త్రిమూర్తులు, మహమ్మదు, క్రీస్తు,
పరబ్రహ్మ ౮౩-౮౪
అవ్వయారు వచనము ౨౯౭
అష్టగయ ౨౦౮
అహఃప్రమాణములు ౨౬౦-౧
అహల్యాబాయి ౧౫౮-౧౫౯౧౮౧
ఈమె విగ్రహము గదాధరస్వామి
గుడివద్దఆపె అన్నసత్రంలో ఉంది ౨౦౯
ఆహింసా పరమోధర్మః ౨౯౫
అహోబలము ౯-౧౦
[ఉత్సవకాలమందు ౪౦౦ వరహాలు
పాశ్శీలు వసూలవుచున్నవి. వాటి
నంతా కందనూరి నవాబు పుచ్చు
కొని వెనక గుళ్ళ సంగతినే
విచారింపడు.] ౧౦
ఆంధ్రదేశము ౩౫౩
అంధ్రులు-నాడుఖేదములు ౧౮౪-౩౨౫
అకాశవాయువహ్ని భూతాలు ౨౫౪
అకులల్లూరు ౩౫౭
అకులపదా ౨౯౦
అగామిసంచిత ప్రారబ్ధకర్మ ౧౧౦-౧
అగరా (ఆగ్రా) ౨౮౪
ఆచంట ౩౪౬
ఆచానకు ౨౭౮
ఆచారనియమాలు ౭౫-౭౮-౯౬
ఆత్మ అంతరాత్మ పరమాత్మ ౨౫౫-౨౫౮
ఆత్మకూరు ౧౨
[దేవియచర్చకులు తెనుగబ్రాంహ్మణులు-
స్వామియచర్చకుడు జంగము]
ఆత్మవత్సర్వభూతాని ౨౯౫
ఆదిశేషుడు ౨౯౫

పుట..

ఆయుధాలు ౧౨౧-౧౮౪-౨౮౦-౨౮౧
ఆరా ౧౮౦
ఆరికాటినవాబు ౫౦, ౨౦౨-౩౮౧
ఆరికాటి మొదలారులు ౬౩
ఆరికాటి 'రాయజీ' ౫౦-౨౦౨
ఆర్యారు ౪౫
ఆర్సనలు - ఆయుధశాల ౬౩
ఆవాలు ౧౮౧
ఇంగ్లీషువారు:—చూ. యింగిలీషు
వారు, కుంఫణీ వారు. వీరుప్రభువులైన
కారణం ౧౬౬-౧౬౮-౨౯౫
కలకటర్లు ౫౫
పాపులు ౭౮
చదువులు ౨౮౯-౩౨౮
నేరముల విచారణ ౯౦-౩౨౬
నాగపూరు ౬౨-౭౩-౭౮
కలకత్తా ౨౮౪-౨౮౭
చెన్నపట్నం ౩౭౮-౩౮౪
రాజ్యాక్రమణ ౧౮౫
(చూడు:జబల్‌పూరు,కలకత్తా,కటకం,
రాజమహేంద్రవరం)
ఇంద్రద్యుమ్నం ౩౦౯
ఈశ్వర కటాక్షము-విధి ౧౧౨-౧౧౩
ఉద్యోగాలు—హిందువులు
చేసే పెద్ద ఉద్యోగాలు ౭౪
ఉపస్మృతులు ౧౯౮-౨౦౦
ఉప్పుడు బియ్యం ౨౩-౮౦
ఉష్ణగుండం ౨౩౫-౬
ఊళ్ల కావలికి-గ్రామాలు ౫
,, తుపాకీలవారు ౭
ఋషికుల్యనది:-చూడు: గంజాం ౩౧౮
(గంజాంపట్టణము, ఈ నదీతీరము -
ఇది మొదలు కళింగ దేశము)
ఏకమేవా ద్వితీయం బ్రహ్మ ౨౩
ఏకవారాశనము ౫౬౩

పుట.

ఏకః పాపాని కురుతే ఫలంభుంక్తే
మహాజనః ౩౨౩

ఏనుగుల వీరాస్వామయ్యగారు.

జీవితము - ప్రజాసేవ:

చూడు; కోమలేశ్వరపురం శ్రీని
వాసపిళ్లగారు వ్రాసిన జీవితము. ౧–౧౦

వీరు చెన్నపట్నం కాపురస్థులు; తండ్రి
సామయమంత్రి; స్వయం కృషివల్ల
ఇంగ్లీషు చదువుకున్నారు. (౧)

కుంఫిణీకొలువు (౧-౨)

సుప్రీంకోర్టులో ఇంటర్ ప్రిటరు (౨)

పండితసభలో క్షయమాస నిర్ణయము (౪)

జడ్జీల సదభిప్రాయం - సర్ రాల్ఫ్
పామర్, సర్ రాబర్టు కమిన్ (౫-౭)

నందన సంవత్సర క్షామంలో ప్రజాసేవ (౬)

హిందూలిటరరీసొసైటీ స్థాపన (౭)

మరణం (1836) (౧౦)

వీరాస్వామయ్యగారు - వారిమిత్రులు:

ఆంధ్ర నియోగిబ్రాహ్మణుడు. 4-8

వెన్నెలకంటి సుబ్బారావుగారికి,
రాజా కొచ్చర్లకోట వెంకట
రాయనింగారికి, బంధువు 4

జన్మసంవత్సరం 1780 కావచ్చును ,,

బహుభాషా పాండిత్యము, చర్చలు ,,

బ్రౌను దొరగారు - శ్రీనివాస పిళ్ళె
గారు, జార్జి నార్టన్ గారు, వెంబా
కం రాఘవాచార్యులుగారు 5

పచ్చయ్యప్ప ధర్మముల కథ 5–6

కుంపినీ పరిపాలనలో ప్రజలస్థితి 6

హిందూ లిటరరీ సొసైటీ చేసినపని 6

ఇంగ్లీషు విద్యా విధానానికి, జాతీయ
చైతన్యానికి, వీరు మూలపురుషులు 7

జాన్ బ్రూస్ నార్టన్ గారి ప్రశంస. 7

చరిత్ర సాధనాలు 7–8

ఏనుగుల వీరాస్వామయ్యగారు: పుట.

బందరు జిల్లాజడ్జి బ్రౌనుగారికి వీరా
స్వామయ్యగారు వ్రాసిన లేఖ 8–10
కాశీయాత్ర చరిత్రలోని సంగతులు 9
గ్రంథ ముద్రణాన్ని గురించి 9
తమ్ముడు సీతాపతిని గురించి 10

(సంపాదకుని ఫుట్ నోట్సు వివరణల
లోని శీర్షికలుకూడా చూడండి) 16·17

కాశీయాత్ర చరిత్రలో వీరాస్వామయ్య
గారిని గూర్చిన సంగతులు:-

వంశ పారంపర్యంగా చెన్నపట్నంలో
కాపురం ౩౭౪

తండయారుపేటులో తోట యిల్లు ౧,౩౬౫

తమ్ముడు సీతాపతి ౩౪౫

సుప్రీముకోర్టు దొరలు ౧

కాశీకిప్రయాణం 1830 సం॥ మే 18. ౧

ఈయనతో యాత్రకు వచ్చినవారు
నూరుమంది ౧౧౬

దారిలో కేమిల్, గ్రీన్, స్మిత్తు, స్లీమన్
మొదలైనవారలు చేసిన సహాయం ౯౪

కుషు చందర్ దత్తుబాబు ౯౯

చెన్నపట్నంలో పరంగివానితో చర్చ:
విధి-ఈశ్వరకటాక్షము ౧౧౨

సర్ జాన్ న్యూబోల్టు, సర్ చార్లీస్
గ్రే గార్ల యోగ్యతాపత్రికలవల్ల
కలిగిన గౌరవం ౧౪౦

ప్రయాగలో సీకస్టమ్సుకలెక్టరు నీపన్
గారికోరికపైన సాయరుచావిళ్లను
గురించి బంగాళా గవర్నమెంటు
ఫినాన్సు కమిటీవారికి వీరాస్వా
మయ్యగారు వ్రాసి యిచ్చిన
సలహా యాదాస్తు ౧౪౦-౧

ఈ నదులు గుళ్ళు దేవుళ్ళేనా అని
నీపన్ గారి ప్రశ్నకు జవాబు ౧౪౧

ఏనుగుల వీరాస్వామయ్యగారు: పుట.

గయలో డాక్టరు జాన్ డేవిడ్ సన్ గారితో వర్ణాశ్రమధర్మాన్ని గురించి వాదము ౧౯౫

దేవతలు చాలామంది వున్నా దేవు డొక్కడే అని నిరూపించడం ౨౩౩

గయలో జడ్జి అయిన జార్జి ఐ. మారీసు దొరగారి సమక్షమున పండితసభ, మూల స్మృతుల నిర్ధారణ - అది పురాణాల నిర్ణయము ౧౯౪-౨౦౨

అక్కడి కోర్టు పండితులతో సహగమనాన్ని గురించిన చర్చ ౧౯౭

మద్రాసు ఆక్టింగు గవర్నరు గ్రీందొర గారికోసం చెప్రాలో మకాం ౨౦౫

దొరల ప్రాపకం వల్ల గయలో లభించిన లౌకిక ప్రతిష్ఠ ౨౧౫

కలకత్తాలో నున్న-తన విహితుడైన మెస్టర్ మించెన్ గారు గయలో జడ్జి అయిన జార్జి ఐ. మారీసు గారికి వుత్తరం వ్రాయడం దాని వల్ల అధికారుల ఆదరణ ౨౧౫

గయావళీకి రెండు వేల రూపాయి లివ్వడం ౨౧౪

అక్షయవటంవద్ద ధర్మశాలలో గయావళీలు తప్ప ఎవ్వరూ భోజనం చేయగూడ దనే కట్టుబాటును పునాశ్రీమంతుడు కూడా మీర లేక పోయినాడు; వీరాస్వామయ్యగారు అందరికీ సహపంక్తిగా సంతర్పణలు ప్రారంభించారు ౨౧౭

దొర లాక్రమించుకున్న రామసాగర మన్నే గొప్పతీర్థంలో మళ్ళీ పిండ ప్రదానాలు చేయడానికి దొరల అనుజ్ఞ సంపాదించారు. ౨౧౯

ఏనుగుల వీరాస్వామయ్యగారు: పుట.

గవర్నరు జనరల్ లార్డు విలియం బెంటింకు గారు కాశీకివచ్చినప్పుడు ఆయన ఏజెంటు బ్రూక్కుదొర వీరాస్వామయ్యగారి మనుష్యులు ఆయుధాలు పట్టడానికి ప్రత్యేక ఫర్మానా యిచ్చారు. ౨౫౧

కలకత్తాలో ప్రధాన న్యాయాధిపతి సర్ చార్లీసుగ్రే గారు అసాధ్యమైన గవర్నమెంటు ఫరవానా యిప్పించుట ౨౫౧

ఛత్రపురం అరణ్యమార్గంలో కపిల రామదాసు పంతుల సహాయం ౩౨౯

శ్రీకాకుళంలో జిల్లాజడ్జికోర్టు గవర్నమెంటు ప్లీడరు బలిజేపల్లి సీతారామ శాస్త్రులుగారు, నాజరు తాడిమేటి తిరుకామయ్య, రైటరు చింతా జగన్నాయకులుగార్లు ఆదరించారు ౩౨౪

దివ్యలలో భాగవతుల కిత్తన్నగారి స్వాగతం ౩౩౪

రాజమహేంద్రవరంలో రాజా కొచ్చర్లకోట వెంకటరాయనింగారి ఆదరణ, మర్యాద ౩౪౫-౩౪౬

మచిలీబందరులో తమ్ముడు సీతాపతి; మణపాక సాళ్వపతి నాయుడు గారు ౩౪౭

గ్రామస్థుల స్వాగతము - జిల్లా జడ్జి సీ. పీ. బ్రౌను గారి దర్శనం ౩౪౯

చెన్నపట్నం తిర్గి చేరడం(1831 సెప్టెంబరు 3 వ తేదీ) ౩౬౭

బ్రౌను గారికి లేఖ ౭-౧౦

ఓంకారము ౧౧-౨౨

(నీళ్ళలో మునిగివుంటే ఓంకారం నాదం వినిపిస్తుంది.) ౨౨

ఓఢ్రదేశము ౨౭౪

ఓఢ్ర దేశము: పుట.
ఓఢ్రభాష ౨౭౮
స్త్రీ పురుషులు ౨౭౮-౨౭౯
పయిరు పంటలు ౨౭౯
పొగచుట్టలు ౨౯౨
చింతపండు, మిరపకాయలు ౨౯౪
ఋషికుల్యనదికి ముందు ప్రయాగ ఆ కేవ్రూరి వరకూ బృహస్పతిమానం. ఋషికుల్య నది తరవాత చాంద్రమానం-నదీతీరపు పట్టణం గంజాం మొదలు కళింగదేశము ౩౧౭

జౌరంగజేబు ౧౬౦-౩౬౯

కంచర్ల ౩౨౨

కందనూరి నవాబు ౯-౧౨-౧౩-౧౬-౨౦-౨౩.

తాలూకా నాలుగు మేటీలుగా పంచి ఒక్కొక్క మేటీకి నొక్కొక్క అమలుదారుని నేర్పరచినాడు. కుంఫిణీకి సుమారు లక్షరూపాయలు సాలెనా కట్టుచున్నాడు. అతని రాజ్యము భళ్ళారిజిల్లా కలకటరాజ్ఞకు లోబడినది. ఆ నవాబు రాజ్యస్థులకు స్వంతముగా నొక ఖాజీకోరటు పెట్టి న్యాయవిచారణ చేయుచున్నాడు. గాని, జిల్లా కుంఫిణీ కోరటుకు నిమిత్తము లేదు. నవుకరులకు జీతము క్రమముగా ముట్టజెప్పడము లేదని వదంతి ౧౨

శ్రీశైలము గుడి హాశ్శీలు మూలకముగా సంవత్సరము ౧ కి ౧౭౦౦౦ నవాబుకు వచ్చినా గుడి యోగతి పొందేదిన్ని విచారింపడు. ఎవరైనా మరమ్మతు చేసినట్టయితే సెలవంత హాశ్శీలు తీసుకొనుచున్నాడు. రాజా చందులాలా ఈ నిర్బంధము చేత కొంత మరమ్మతుచేసి విసికి విడిచి

కందనూరి నవాబు: పుట.
పెట్టినాడు............ స్వామికిన్నీ దేవికిన్నీ ఎవరయినా ఆభరణాలు వస్త్రాలు సమర్పించిరేని వాటిమదింపంత రూకల హాశ్శీలు పుచ్చుకొనడము మాత్రమే కాకుండా కొన్ని దినములు పోనిచ్చి ఆ కందనూరి నవాబు ఆపహరింపుచున్నాడు. ౨౦

కచ్చారసూయి ౧౨౪-౧౮౫
కటకము ౨౯౪-౨౯౫
(ఇంగ్లీషువారి రాజ్యతంత్రము) ,,
కటుకరి ౧౧౬
కటారి ౧౧౮
కడప ౬-౭
కనకమ్మ సత్రం ౨
కనగాల ౩౫౨-౩౫౪
కన్సారి ౨౯౨
కనోజాలు (చూడు: కాశీ) ౧౩౩-౨౩౯
కమిన్, సర్ బక్లే (౭)
కపిలతీర్థం ౩
కపిల మహాముని ౧౮౮
కపిల రామదాసుపంతులు ౩౧౯
కయామల్ ఖాదిన్ ౨౫౪
కరకరంబాడు ౫
కరణాలు ౨౨-౨౨౯-౩౨౪-౩౬౧
కరి పాండ్యరాజు ౩౬౫
కరాడీలు ౧౯౪
కరివేపాకు ౨౩౯
కర్ణాటకము (చెన్నపట్నం తీరం) ౨౦౨
కర్ణాటకులు (కన్నడులు) ౧౯౩-౩౫౩
కర్నల్ స్లీమన్ ౯౪
కర్మనాశిని ౧౭౧
(సుకర్మాలు నశించిపోతవని ఈనది లో ఎవరూ కాలు పెట్టరు.)
కర్మము-ఈశ్వరకటాక్షము ౧౧౦-౧౧౨

ఫుట.

కలకండ ౧౭౪
కలకత్తా ౨౬౯-౨౭౦
 చరతుక్-పూజా భానుపోడా ౨౬౯
 స్థలపురాణము ౨౮౦
 కాళికాదేవి ౨౮౦-౧
 స్త్రీపురుషులు ౨౮౨-౩-౨౮౯-౨౭౦
 కులీనులు ౨౮౨-౩
 ఇళ్ళు ౨౮౩-౪-౨౮౬
 ఇంగ్లీషువారి రాజ్యతంత్రము ౨౮౪-౬
 పట్టణవర్ణన ౨౮౮-౨౮౯
 క్రీస్తు మతప్రచారము ౨౭౦
కలిదిండి ౩౭౭
కలిస్వాధు స్త్రీయస్వాధు ౩౪౨
కసంకోట ౩౩౩
కస్తూరి ౧౭౫
కహాలుగాం ౨౩౯
కళింగదేశము ౩౫౩
కల్లేపల్లి ౩౫౨
కాకినాడ ౩౩౮-౩౪౩
కాక్రియన్ (కాకిరేణి) కాలవ ౧-౩౬౬
కాజీపేట ౭
కాటికెవారు ౩౫౪
కాటినినది ౯౭
కాబూలు ౨౯౮
కామారెడ్డిపేట ౪౨
కామిటి ౬౩-౬౫-౬౭
కాయరా ౫౪
కారన్‌వాలీసు ౨౨౭
కావలి-గ్రామ కావలి ౫-౬-౨౨
కావేరి ౧౯౩
కాశీ మహాక్షేత్రము ౧౫౫-౨౦౨
 క్షేత్రం చేరడం (27-10-1830) ౧౫౫
 గంగాపుత్రులు ౧౫౬
 మణికర్ణికఘట్టము - చక్రతీర్థము ౧౫౮

కాశీ: ఫుట.
 అసివరణలు ౧౫౭
 పునా శ్రీమంతుడు (పీష్వా) ౧౫౭
 అహల్యాబాయి ౧౫౭-౧౫౯
 ఘట్టములు ౧౫౯-౧౬౧
కాశీవాసము, ఆలయాలు, పంచగంగా తీరము, బిందుమాధవుడిగుడి, తురకల మసీదు ఔరంగజేబు మసీదు ౧౫౯
కాశీలింగాలు, ఆలయాలు ౧౬౦
అర్చకులు - పంచగౌడులు - కౌనుపడాలు - ఘూర్జరులు - మహాజనులు - కంగాళీలనే దక్షిణదేశస్థులు ౧౬౧
వ్యాపారము - రత్నాలు ౧౬౧
లక్నో నవాబు ౧౬౧
సిక్కులూరులో జాతులవారు ౧౬౨
పట్టణ పరిపాలన - గల్లీలు, పాటక్కులు, తాణాలు, బరకందాసులు, కొత్వాలు. ౧౬౨
కాయకూరలు, ఘాటియాలు ౧౬౨
రాండ్ సాండ్ సీఢీలు ౧౬౩
గోసాయీలు, మహాజనాలు, సాహుకారుపనులు - బయిరాగులు ౧౬౩
అథర్వణవేదము - ఘూర్జరులు ౧౬౩
యజుర్వేద శాఖలు-సామగులు ౧౬౩
ఉత్కల దేశంలో మత్స్యభక్షణ, ద్రావిడదేశంలో మాతులకన్యా వివాహము, మాగధదేశంలో మద్యపానము, మైథిలిదేశంలో దేవరేణ సుతోత్పత్తి ౧౬౧
గంగాపుత్రుల ఉత్పత్తి ౧౬౪
కాన్యకుబ్జులు- తాణీలు, ,,
రూపాయిలు, భక్ష్యములు, పుష్పాలు ౧౬౪
బిల్వపత్రములు, వృషభములు ౧౬౫
ద్రావిడదేశములో శూద్రుల దృష్టి, చండాలుల సమీపవర్తిత్వమును గూర్చిన పట్టుదల-దాని ఫలితము ,,

కాశీ: పుట.

ఉత్తర దక్షిణదేశములలో ఆరాధన లందు తేడా- మన బ్రాహ్మణులు ఆధిక్యతను ప్రకటించుట-లేనిపోని ఆర్భనలు, ఆచారములు ౧౬౭

కర్మశూన్యులైన ఇంగ్లీషువారు ఈకర్మ భూమికేల ప్రభువులైరి ౧౬౮

బ్రాహ్మణుల స్తోమాలు తెడలు ౧౬౮

అన్నదానము, భిక్షము ౧౬౯

శ్రీరాముల అవతారానికి పూర్వమే రామనామతారక ముండెను ౧౬౯

కాశీలో ఇళ్లు - జనాభా - భాష ౧౬౯

కాశీ స్థలమాహాత్మ్యము ౧౭౦-౧౭౨

విశ్వేశ్వరుడు సమష్టిరూపము; సాంబ మూర్తిగాని విష్ణువుగాని కాడు ౧౭౧

చలి-వేడి ౧౭౩

పంచక్రోశయాత్ర ౧౭౩

మాసోపవాసి ౧౭౪

ఇక్కడ గంగలో పూజ చేసే బిల్వము మునిగి పోవునని ప్రసిద్ధి ౧౭౪

ఆంధ్రులలోను, ద్రావిడులలోను నాడుభేదములు ౧౭౫

బంగాళీ ఉత్కలగాడులైన కులీన బ్రాహ్మణులకు 20, 30 కన్యల నిచ్చి వివాహము చేయు దురాచారము. ,,

దృష్టిదోష విచారము, కచ్చారసూయి, పకార్ రసూయి ౧౭౫

శూద్రులు, మాంసభక్షణము ౧౭౫

కుంపినీవారి పాఠశాల గ్రంథాలు ౧౭౬

గోకుల బృందావనం, హరిద్వారం, గంగోత్తరి బదరీకేదారము, బదరీ నారాయణము ౧౭౬

కాశ్మీర పట్టణము ౧౭౭

రణజిత్తుసింగు ౧౭౮

కాశీ: పుట.

బ్రాహ్మణసంతర్పణ దృష్టిదోషము౧౮౨

జ్వాలాముఖి ౧౮౬-౭

నేపాళమున దేశప్రయాగ - ద్రావిళ్ళ ప్రాబల్యము. ౧౮౭

వల్లభాచార్య మతము బనయా అనే వైశ్యజాతి; కోమటిగుజరాతీలు ౧౮౮

ద్రావిళ్ళు, గౌడులు - దక్షిణదేశమున క్షత్రియులు, శూద్రులు-బ్రాహ్మణులు దక్షిణదేశానికి వచ్చి వైశ్య జాతిని కల్పించుట ౧౯౦

దాక్షిణాత్యులు-బ్రాహ్మణుల భూస్థితులు, వారి అహంకారము ౧౯౧

తురకలు, ఇంగ్లీషువారు ౧౯౨

ఘూర్జరులు మొదలైన బ్రాహ్మణ తెగలు; ద్రావిళ్ళు, ఆంధ్రులు, కర్ణాటకులు, మహారాష్ట్రులు, చిత్పావనులు, నంబూద్రిలు ౧౯౩

వర్ణాశ్రమ ధర్మాలు ౧౯౫-౧౯౭

మూల స్మృతులు, ఉపస్మృతులు ఆది పురాణాలు-స్థలపురాణాలు౧౯౭-౨౦౧

కాశీఖండము ౨౬౫

కాశ్మీరము ౧౭౭-౧౭౮-౧౮౫-౬

కాళికాశక్తి ౨౭౦-౧

కాళింది యమునలు ౬౩౨

కాళీకట్టు ౨౬౯

కాళీ (వింధ్యవాసిని) ౧౨౩

కిద్దరుపూరు ౨౭౭

కుంకుమపువ్వు ౧౭౮-౧౮౫

కుంఫిణీవారు
(౨)౪-౫-౨౦-౨౫-౨౬-౪౦-౫౪
౬౫-౭౮-౮౯-౯౦-౧౦౫-౧౧౮
౧౧౯-౧౨౧-౧౨౮-౧౩౫-౧౩౭
౧౪౫, ౧౭౬, ౧౮౫, ౨౦౭,
౨౧౦, ౨౧౫, ౨౫౧, ౨౬౬,

కుంఫిణీ వారు: పుట.
౨౭౪, ౨౭౯, ౨౮౪, ౨౮౫
౩౦౭, ౩౧౧, ౩౩౨, ౩౩౫,
౩౩౬, ౩౪౬, ౩౪౯, ౩౬౯–౩౭౪
చూడు. ఇంగిలషువారు ; యింగిలీషువారు: సంపాదకుని ఫుట్‌నోట్సు: కుంపిణీ వారి కచ్చేరీలు–వర్తక కార్యాలయాలు – దేవాదాయాలు – సూప్రీముకోర్టు.
కుంఫిణీ వారి రాజ్యాక్రమణ, రాజ్యతంత్రము, పరిపాలన:- చూడు: హైదరాబాదు, నాగపూరు, జబ్బల్‌పూరు, కలకత్తా, కటకం, రాజమహేంద్రవరం, చెనపట్టణము
రివిన్యూ పరిపాలన : చూడు. జమీందారీలు : గ్రామపరిపాలన.
న్యాయవిచారణ : ౯౦, ౩౨౬, ౩౩౧
చూడు. సూప్రీముకోర్టు
పన్నుల పద్ధతి: చూడు : భూమివాటము, గ్రామపరిపాలన, కరణాలు,
అభినిమందు పెరిమిట్టులు, సుంకములు పాళ్కీలు:
యాత్రికులపైన ౧, ౨౦౭, ౨౧౦, ౩౦౧
నావలపైన నిఘుకులు ౨౬౬
పోలీసుశాఖ: చూడు: పోలీసు, కావలి, ఊళ్ళకావలి–చాకీ
విద్య: కలకత్తా కాలీజు ౨౭౯
కాశీ పాఠశాల ౧౭౬
బడిపంతుళ్ళు ౩౨౭
తపాలాశాఖ : చూడు: టపా,
తపాల ౫౦, ౫౬ ౯౯, ౧౧౫
మజిలీపట్టీలు ౨౬
రహదారీలు ౯౪, ౧౦౦, ౩౧౯
కుంఫిణీలయను ౩౩౨, ౩౩౫
శాంతి భద్రతలు : చూడు: బందిపోట్లు దోపిళ్ళు, దొంగల భయము

కుంఫిణీ వారు : పుట.
ఆయుధశాల, ఆర్సనలు ౬౩
ఆయుధాలు పట్టనియ్యరు ౧౨౧, ౧౮౪
ఉద్యోగాలు : హిందువులు చేసే పెద్ద వుద్యోగాలు ౬౪
జీతాలు లంచాలు ౨౪౦, ౨౪౧
అధికారుల ఉపేక్ష ౩౨౭, ౩౪౪
క్రైస్తవమతము : చూడు, క్రీస్తు మతస్థులు–దేవాదాయములు
దేవాదాయముల విచారణ ౪-౫
చూడు: తిరుపతి ౩-౫
స్వదేశసంస్థానాలు చూడు: హైదరాబాదు, నాగపూరిరాజు, బిక్కానెరి, లక్కునో–రెసిడెంటు
కుక్కుటేశ్వరుడు ౩౩౯
కురాయి ౭౮
కులాలీనది ౨౮౭
కులీన బ్రాహ్మణులు ౧౭౫, ౨౭౨, ౨౭౩
కుశదర్పణము ౪౮
కూరగడ్డలు ౧౬౨
కూర్మావతారము ౩౨౭
కృష్ణానది ౨౧, ౨౪, ౨౭, ౪౮, ౪౯, ౧౯౨
కృష్ణానదీ మహాత్మ్యము ౩౫౨
కృష్ణదేవాలయము ౩౬౨
కృష్ణనగరు ౨౬౬
కేదారేశ్వరుడు ౧౭౭
కేరళ దేశస్థులు ౧౯౪
కొండకరమల వాండ్లు ౯
కొండువేడు ౩౫౨
కొడవలూరి సత్రం ౩౫౮
కొచ్చర్లకోట వెంకటరాయనింగారు ౩౪౧–౩౪౫–౩౪౬–౩౫౦
రెండుసార్లు కుటుంబ సహితముగా తులాభారం తూగారు. లక్ష బ్రాహ్మణభోజనం చేయించారు. అనేక యాగాలు చేయించారు ౩౫౦

